శ్రీరస్తు.

శ్రీగణేశ శారదా గురుభ్యో నమః.

శ్రీసీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# పీఠిక.

ఈ శ్రీసీతారామాంజనేయసంవాదము బ్రహ్మాండపురాణమునందుఁ గల అధ్యాత్మరామాయణము నందలి శ్రీరామహృదయం బను నితిహాసంబు. ఇది శ్రీరామపట్టాభిషేకానంతరము ఆంజనేయునికి శ్రీసీతారాములు తత్త్వోపదేశముఁ జేసినవిషయము. దీనిని శ్రీపరమేశ్వరుఁడు తననాయకి యైన పార్వతీదేవికిం జెప్పి వెనుక శ్రీరామచరిత్రమును తత్త్వరూపముగాఁ దెలిపినదానికి అధ్యాత్మరామాయణం బని పేరు కలిగినది ఇట్టి అధ్యాత్మరామాయణంబునం గల శ్రీరామహృదయమునందు శ్రీరామపరబ్రహ్మము నను మతిచేత సీతాదేవి తారకయోగమును, తననిజభక్తుం డని శ్రీరాముఁడు సాంఖ్యయోగఅమనస్కయోగము అను ఆంజనేయునికిఁ దత్త్వోపదేశము జేసి యున్నందున దీనికి శ్రీసీతారామాంజనేయసంవాదము అను పేరు కలిగి ది

ఇట్టిదానిని ఆంధ్రపద్యగద్యకావ్యముగా రచించినది పరశురామపంతుల లింగమూర్తి అను గురుమూర్తి, ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు, ఇతనికి తండ్రి రామమంత్రి, తల్లి తిమ్మాంబ, భార్య లింగాంబ, పుత్త్రుఁడు రామమూర్తి యను కవీశ్వరుఁడు. ఇతనివాసస్థలము హైదరాబాదు రాజ్యములోని వరంగల్ ప్రాంతమం దున్న పట్టివాడ యనియును, వీ రుండిన మునుపటిగృహమునందే యిప్పటికిని వారివంశీయు లున్నా రనియును జెప్పుచున్నారు. ఇతఁడు క్రీస్తుశకము 1750 వ సంవత్సరముల ప్రాంతములలో నుండినట్లు కొన్నినిదర్శనములవలనఁ దెలియుచున్నది. ఈ కవీశ్వరుఁడు చిన్నతనమునందు శృంగారరసికుఁడై యుండి గతిమన్మథవిలాసమును రచించినట్లును, వెనుక నారాయణదేశికునిచే తారకనామమంత్రోపదేశంబు నొంది యనవరతము ధ్యానము చేయుచుండినందువలన మనస్సు పరిశుద్ధత కలిగి శ్రీరామభక్తియును, పరమార్థచింతయును పుట్టి కొన్ని వేదాంతవిషయము లగు శతకములు రచియించినట్లును, వెనుక మహాదేవగురునికృపవలన సర్వసంశయములను పోఁగొట్టునట్టి కేవలాత్మవిజ్ఞానమును పొందినప్పుడు శ్రీరామపరబ్రహ్మమూర్తియే సాక్షాత్కరించి యాజ్ఞ యియ్యఁగా నీ శ్రీసీతారామాంజనేయసంవాదమును ఘంటాఘంటనసామర్థ్యములు కలిగి రచియించినట్లును జెప్పెదరు ఈ వేదాంతవిజ్ఞానకవీశ్వరశిరోమణి తనవంశపరంపరను జెప్పికొనక గురుభక్తిచేతఁ దనగురుపరంపరాభివర్ణనమాత్రము జెప్పికొని యట్టి గురుపరంపరయందును తననిజగురు వగు మహాదేవాచార్యుని శ్రీరామపరబ్రహ్మముగానే తలంచి స్తోత్రమును జేసి యున్నాఁడు. ఈ మహాకవీశ్వరుని కవిత్వము కర్ణములకింపుగను, దుష్టత్వము లేనిదిగను, మృదుమధురము గలదిగను, శబ్దాలంకారశోభితములుగను, ఏకాక్షర ద్వ్యక్షర ముక్తపదగ్రస్తాది శబ్దచిత్రపద్యములు గలదిగను వెలయుచుండుటయే, మఱియు శకునపదములచే నొప్పు వేదాంతశాస్త్రపదములను సులభముగా గ్రహించునట్లు ప్రయోగించి యుండుటవలనను, గర్భతంత్రపద్యములును నిరోష్ఠ్యపద్యములును సర్వతః ప్రాసపద్యములును చతుః ప్రాసపద్యములును [illegible] తనగ్రంథమునం దిమిడ్చి యుండుటవలన [illegible] నుటకు తగియున్నవి. ఇదిగాక [illegible] లన్నియుఁ జక్కఁగాఁ దెలిపి యుండుటవలన [illegible] సందర్భగణ్యుఁ డనియే యేర్పడుచున్నది

ఈ శ్రీసీతారామాంజనేయసంవాద మను రాజయోగశాస్త్రము మూఁడు యాశ్వాసములుగా విభజించి అందు ప్రథమాశ్వాసమున అష్టప్రకృతులవివరణము, అభ్యాసాది జ్ఞానయోగనిర్ణయము, అహింసాదిలక్షణములు, యోగాసనలక్షణములు, యోగాభ్యాసపరుల కాహారాదినియమములు, సూర్యచంద్రమండల కళానిర్ణయము, చిత్కళాసాక్షాత్కారము, ముక్తికాంతాసమాగమము, హంసతత్త్వోపదేశము, నాదబిందుకళావివరణము, షట్చక్రములముల నిర్ణయము మొదలుగాఁ గల విషయములను జేర్చి తారకసాంఖ్యాభ్యాసులకు ననుకూల మగునట్లు తారకయోగమును పూర్తిఁ జేసెను. ద్వితీయాశ్వాసమున పరబ్రహ్మ

స్వరూపనిర్ణయము, భావాభావపదార్థనిర్ణయము, మాయాస్వరూపనిర్ణయము, ఈశ్వరవిభాగసృష్టియు, జీవనిర్ణయము, స్థూలసూక్ష్మఈశ్వరశరీరనిర్ణయము, జీవేశ్వరైక్యవిచారము, ఓంకారస్వరూపనిర్ణయము, చిద్రూప ఆనందఅఖండలక్షణములు మొదలుగాఁగల విషయములను జేర్చి సాంఖ్యయోగాభ్యాసపరులకు ననుకూల మగునట్లు సాంఖ్యయోగమును ముగించెను. తృతీయాశ్వాసమున బ్రహ్మవిద్బ్రహ్మవిద్వరబ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠులలక్షణము, మహావాక్యార్థవివరణము, చిత్తలయపురుషలక్షణము, జీవన్ముక్తునిలక్షణము మొదలుగాఁగల విషయములను జేర్చి అమనస్కయోగ మభ్యసించువారికి ననుకూల మగునట్లు అమనస్కయోగమును దెలిపి గ్రంథపూర్తిని గావించెను.

ఇట్టి మహావిద్వత్కవిశిరోమణి ఆంధ్రులయందుఁ గల పామరులను పండితులుగను, అట్టివారలను మోక్షాసక్తులుగను, అట్టివారిని కైవల్యముక్తులుగను జేయవలయు నని ఆంధ్రమునం దీగురూత్కృష్టగ్రంథమును జేసి ఆంధ్రదేశమునకు మే లొనరించినందుకు ఆమహాకవితాధీరుని, భక్తిజ్ఞానవైరాగ్యశీలుని, కేవలాత్మతత్త్వవిచారుని యనవరతము ధ్యానించవలయు నని మిక్కిలిగా దలంచి వినమించుచున్నాను.

## ఇందలి కథాసారము.

శ్రీకైలాసపర్వతశిఖరమందిరమునం దున్న మహాస్థానమంటపమణిమయసింహాసనంబున శ్రీరామధ్యాననిష్ఠుండై కూర్చుండి యున్న శ్రీపరమేశ్వరుని దనవామభాగంబున నున్న పార్వతీదేవి గారు భక్తితోఁ బ్రణామంబులును శుశ్రూషలును జేసి, స్వామీ! నేను నీభక్తురాలను, నీవు నాకుఁ బ్రియుండవు కావున నాకు పరబ్రహ్మసాక్షాత్కారమును కలిగించునట్టి యొక్కమంత్రంబు నుపదేశింపు మని ప్రార్థింపఁగా, నంబికానాథుండు పరమసంతోషచిత్తుండై, చారుమతీ! నీవు యెఱుఁగరాని పరమరహస్యమును యడిగితివి, దానిని నేను సర్వకాలములయందును ధ్యానించుచుండెదను, అది నాకు నిత్యజపము, అయినను నీమీఁది ప్రేమచేత నీ కుపదేశించెదను, ఆ శ్రీరామనామ మితరమంత్రములకంటెను ముఖ్యమైనది కావున దీనినే గ్రహింపు మని ఆ శ్రీరామమంత్రంబును, తత్ప్రభావంబును నుపదేశించెను. పిమ్మట పార్వతీదేవి కొన్నిదినము లామంత్రమును ధ్యానించి సంతోషచిత్తురాలై మహాదేవునికి దీర్ఘదండనమస్కారంబులు గావించి, నాథా! మీ రుపదేశించిన శ్రీరామమంత్రమును ధ్యానము జేసి దానిఫలంబును దెలిసికొంటిని, ఇప్పుడు నాకు శ్రీరామతత్త్వంబు నెఱింగింపు మని ప్రార్థింపఁగా, నంత శ్రీపరమేశ్వరుండు కొంతసేపు విచారించి శ్రీరామహృదయం బను యితిహాసం బొక్కటి గలదు, అందు శ్రీరామతత్త్వంబు స్పష్టంబుగాఁ దెలియును, అది మిక్కిలి రహస్యంబు, దానిని ముందు శ్రీరాముండును సీతాదేవియు ఆంజనేయునికి నుపదేశించిరి, అట్టి గోప్యంబైనదానిని నీకుఁ దెలియఁ జెప్పుచున్నాను వినుమని పరమేశ్వరుం డిట్లనియె.

ఓపార్వతీ! మున్ను ఆదినారాయణుండు లోకోపకారార్థమై భూమియందు శ్రీరామచంద్రుండై పుట్టి లక్ష్మీదేవి యగు సీతను పెండ్లాడి సంతోషించుచు నుండి జనకునియాజ్ఞచేతఁ గనతమ్ముఁడును, భార్యయును, దానును తాపసులవేషములను దాల్చి దండకారణ్యభూములకు పోయి యచ్చోట నున్న రాక్షసులను సంహరించి రావణుఁడు సీత నెత్తుకొనిపోయినవిషయము నెఱింగి తానును తమ్ముఁడును సుగ్రీవఆంజనేయాది వానరసైన్యములతో లంకాపట్టణమునకు ప్రవేశించి అచ్చట నున్న రావణాసురుని పుత్రమిత్రబంధుపరివారచతురంగసైన్యసహితముగా రూపు మాపి లోకభయమును పోఁగొట్టి తమ్ముఁడగు లక్ష్మణునితోడను, సుగ్రీవుఁడు హనుమంతుఁడు మొదలగు వానరులతోడను, విభీషణాది రాక్షసులతోడను, తనకు ప్రాణసమాన యగు సీతాదేవితోడను పరమానందమున పుష్పకవిమాన మెక్కి యయోధ్యాపట్టణముఁ జేరి మంత్రిపురోహితబంధుగురుమిత్రసేవకాదిజనంబులు తమ్ము సేవించుచుండ సీతాదేవి యెడమతొడపైఁ గూర్చుండి యుండ అగ్రభాగమున పరమభక్తుఁడగు నాంజనేయుఁడు తమ్ము హస్తనిపాదుకల శిరమునఁ దాల్చియుండ శ్వేతచ్ఛత్రంబును ధనుర్బాణంబులును ధరించి కుడిప్రక్క లక్ష్మణుం డుండ నుభయపార్శ్వంబుల భరతశత్రుఘ్నులు సురటీలు విసరుచునుండ శుభముహూర్తంబున నవరత్నఖచితసింహాసనంబునందు పట్టాభిషిక్తుండై హితపురోహితామాత్యసుహృద్విద్వద్బ్రాహ్మణ

దాసదాసీజనంబులకును నానాదేశాధీశ్వరులకును విభీషణ సుగ్రీవ జాంబవ త్సుషేణ నల నీల గజ గవయ గవాక్ష గంధమాదనాదులకును వందిమాగధపౌరలోకంబులకును దక్కిన వారలకుం దఱికిని మనోరథంబులు దీరం దగిన రథ గజ తురగ గో భూ హిరణ్యాగ్రహార రత్న దివ్యవస్త్రాభరణ గంధమాల్యాదు లొసంగి సత్కరించి యనిపి యత్యంతభక్తిని వినమితగాత్రుండై నిలిచి యున్న వాయునందనునిం గాంచి యితఁడు నాభక్తుండు, పరమభాగవతశిఖామణి, నిత్యానిత్యవస్తువివేకయుక్తుండు కావున నితనికి నా యొక్క దివ్యతత్త్వము నుపదేశింపు మని తన యెడమతొడపై నున్న సీతాదేవిం గాంచి చెప్పఁగా, నామె పరమసంతోషంబున నాంజనేయునిం జూచి అజపగాయత్రీసహితం బగు తారకయోగవివరము నుపదేశింప నది నాంజనేయుఁడు పరమనిష్ఠతో నభ్యసించి తురీయావస్థయందలి బ్రహ్మానందమును పొంది యత్యంతభక్తితో సీతాదేవికి నమస్కరించెను. పిమ్మట, శ్రీరామచంద్రుఁడు తారకోపదేశము జేసిన సీతాదేవిని జూచి మెచ్చుకొని ఆంజనేయునిం గాంచి చిఱునగవుతోఁ గూడినవాఁడై సీతాదేవి చెప్పినవిషయము నీకుఁ జక్కఁగాఁ దెలిసెను గదా! ఇఁక నీవు సాంఖ్యయోగమును వివరించుచున్నాను విను మని సాంఖ్యయోగ వివరమంతయుఁ దెలిపి హస్తమస్తకసంయోగ మొనరించి యఖండ స్వరూపము జూపఁగా నాంజనేయుండు పరమానందమయుఁడై శరీరమును మఱచి లిఖించినప్రతిమవలె కొంతసేపూరకుండి మేల్కాంచి తనయెదుట నున్న శ్రీరామగురుమూర్తికి సాష్టాంగనమస్కార మొనరింపఁగా దనకు భక్తియుక్తుఁడై నమస్కరించుచున్న యాంజనేయుని శ్రీరామమూర్తి గాఢాలింగనము జేసికొనెను. అంత నాంజనేయుండు సంపూర్ణజ్ఞానముతో ననేకవిధము లైన స్తోత్రములు జేయఁగా నాపరంధాముం డగు నాత్మారాముండు కరుణతోఁ గూడినవాఁడై నీకిదివఱ కుపదేశించిన తారకసాంఖ్యయోగములు పూర్వులచే నిరూపింపఁబడినవే కాని సిద్ధాంతమైనవి కావు, నే నిపుడు చెప్పఁబోవు అమనస్కయోగము అనాదిసిద్ధ మైనది. సిద్ధాంతసమాధియోగములలో నుత్తమ మయినది యని చెప్పి అమనస్కయోగమును, దాని యనుభవమును, దృష్టాంతదార్ష్టాంతికములను, బ్రహ్మవిద్బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠులలక్షణమును, మహావాక్యార్థవివరణమును, జీవన్ముక్తలక్షణము మొదలుగాఁ గలవి దెలిపి, నాయనా! ఆంజనేయా! నా యందే భక్తి గలవాఁడవును, నాకంటె నితర మెఱుంగలేదని తలంచువాఁడవును, సర్వకాలములయందును నన్నే సేవించువాఁడవును నగుటచే ననుగ్రహబుద్ధిచేత నిది నీ కుపదేశించితిని, ఇంతకంటె నధిక మగు విషయము నావ్యాదయమునను లేదు, కావున నీ యభిప్రాయమును చక్కఁగా గ్రహించి కృతార్థుఁడవై యాత్మానందసుఖం బనుభవింపుము, నిర్వికల్పసమాధినిష్ఠుండవు కమ్ము, అని చెప్పఁగానే హనుమంతుఁడు శ్రీరాముం డాదినారాయణుండు, సీతాదేవి లక్ష్మీదేవి యని తెలిసికొని పరిపూర్ణానందమును పొంది ఆ సీతారామగురువులకు మరల మరల సాష్టాంగనమస్కారంబు లాచరించుచు స్తోత్రంబులు చేయుచు హస్తంబులు ముకుళించి వందనంబులు చేయుచు శ్రీరామరామ శ్రీరామరామ శ్రీరామా యనుచు భక్త్యానందసముద్రంబునం దేలుచు పలుపరివిధంబుల స్తుతించుచు నా శ్రీరామబ్రహ్మమునకు వందనం బాచరించి, స్వామీ! మీయనుగ్రహంబువలన నామనస్సు స్థిర మయినది, ఇఁక నేఁ బోవ ననుగ్రహింపవే యని చెప్పి శ్రీరామునిచే నాజ్ఞను పొంది తనయాశ్రమమునకుఁ బోయి యొక యేకాంత స్థలంబున సుఖముగాఁ గూర్చుండి శ్రీరామచరణకమలభక్తియుక్తుండై శ్రీరామనామము ధ్యానము చేయుచు నిర్వికల్పసమాధియందు నిలిచి మోక్షసుఖము ననుభవించు చుండెను.

ఓ పార్వతీ! ఆ ఆంజనేయుఁడు చిరంజీవి యగుటచే నీముహూర్తకాలమందును నిర్వికల్పసమాధియందు నిలిచి యున్నాఁడు, నీవును యిట్టి యానంద మనుభవింపుము, నీ వడిగినప్రశ్నమునకు సంపూర్ణముగా నుత్తరము చెప్పితిని, దీనికంటె నధిక మైనది లోకమునందును నామనస్సునందును లేదు అని చెప్పఁగా, పరమేశ్వరి యానందసముద్రమున మునింగి తననాథుని యాలింగనము జేసికొనిన శివుండును పార్వతీదేవిపై సంతసించి పునరాలింగనము చేసి బ్రహ్మానందరసమగ్నులై సంతుష్టిని పొంది తమపాదములను భక్తితో సేవించు భక్తుల కిష్టార్థము లొసంగుచు ప్రకాశించుచు నున్నా రని చెప్పఁబడినది.

ఈ శ్రీసీతారామాంజనేయసంవాదము పద్యగద్యకావ్యముగా నుండి అందఱికిని బోధపడక యుండఁగా, బ్రహ్మశ్రీ, పాలపర్తి - నాగేశ్వరశాస్త్రులవారు ప్రతిపదమునకు టీకయును కష్టతరమైన

విషయములయందు తాత్పర్యమును, నావశ్యకమైనచోట్ల విశేషార్థములను విపులముగా వ్రాసి యీ గ్రంథము అందఱికిని విశదమగునట్లు చేసెను. వెనుక బ్రహ్మశ్రీ, నోరి - గురులింగశాస్త్రులవారు అచ్చటచ్చట విడిచి యుండిన తాత్పర్యములను పూర్తిని గావించి గ్రంథమునం దున్న కొఱఁతను నివారించిరి. దీనికి వ్యాఖ్యాన మొనరించిన శ్రీ పాలపర్తి-నాగేశ్వరశాస్త్రులు గారు మహావిద్వాంసు లగుటచేత నీగ్రంథకర్తచే రచియింపఁబడిన పద్యములయం దిమిడియున్న భావార్థములను, గూఢార్థములను, శబ్దార్థములను గమనించి వ్యాఖ్యాన మొనరించి యున్నారు మఱియును పద్యములయందుఁ బ్రయోగించి యుండిన వాక్యముల ననుసరించి వానిసముదాయములను వివరించి యున్నారు. ఇదిగాక, వేదాంతశాస్త్రమునకు యేవి యేవి కావలయునో వాని నన్నిటిని విశదీకరించి యున్నారు ఇట్టి మహావిద్వాంసు లగు శాస్త్రులు గారు వెలనాడుబ్రాహ్మణులు, వీరు క్రీస్తుశకము 1875 ప్రాంతమున చెన్నపురమునందు సుమనోమనోల్లాసినీ యను ముద్రాక్షరశాల నుంచికొని అనేకగ్రంథములను పరిష్కరించి ముద్రించినదిగాక శ్రీమద్రామాయణము ఆంధ్రవచనకావ్యముగను, శ్రీమదాంధ్రమహాభాగవతమునందు అష్టమ నవమ దశమస్కంధములకు టీకాతాత్పర్యములును, ఈ శ్రీసీతారామాంజనేయమునకు విపులవ్యాఖ్యానమును రచించి వారి ముద్రాయంత్రముననే ముద్రించి యున్నారు వీరిభార్య వేంకటలక్ష్మమ్మ, కుమార్తె జానకమ్మ, మిగత విషయములు దీని వెనుక ముద్రించియుండు వ్యాఖ్యానకర్తృవిరచితపద్యావళియందుఁ జూడఁదగును.

ఈ వేదాంతవిజ్ఞానవిద్వచ్ఛిరోమణి మొట్టమొదట నీ శ్రీసీతారామాంజనేయసంవాదమునకు విపులవ్యాఖ్యాన మొనరించుటం బట్టియే మిగతవిద్వాంసులందఱును యీ పద్యకావ్యమాత్రముగా నుండిన శ్రీసీతారామాంజనేయసంవాదమునకు వ్యాఖ్యానము చేసి యితరముద్రాక్షరశాలలయందు ముద్రింపఁగలిగిరి, లేనియెడల చేయఁజాలనివారే యగుదురు. కారణ మేమనిన, వీరు వ్రాసిన శ్లోకములును, వీరు వ్రాసిన విషయములును, వీరు చూపిన చక్రములనే వ్రాసి పదములను మార్చిరి కాని వారింగు క్రొత్తపడి యూహించిన విషయ మేదియును లేదు, కావున నిప్పటికి ముద్రించినగ్రంథము లయినను, ఇఁక ముద్రింపఁబోవుగ్రంథము లయినను శ్రీపాలపర్తి నాగేశ్వరులవారివైఖరియే యగును.

ఈ శ్రీ సీతారామాంజనేయమును మొట్టమొదట శ్రీ శాస్త్రులుగారే వారిసుమనోల్లాసముద్రాక్షరశాలయందు ముద్రించిరి, వెనుక వారిభార్యగారును వారిముద్రాయంత్రముననే ముద్రించుచుండి మ-రా-రా-శ్రీ, వంకాయల - కుప్పయ్యశెట్టి అండుసన్ వారికి గ్రంథస్వాతంత్ర్యమును నిచ్చివేయఁగా వారును అనేకమార్లు ముద్రించుటవలన గ్రంథమునందు ముద్రాక్షరదోషము లేర్పడినది, పిమ్మట నీగ్రంథమును వంకాయల - కుప్పయ్యశెట్టి అండుసన్ వారు గ్రంథమునకుం గల సర్వస్వాతంత్ర్యహక్కును, మ-రా-రా-శ్రీ, వేలూరు - కుప్పుస్వామి మొదలియారుగారికి విక్రయింపఁగా, వారి పోష్యవర్గములో నున్న నన్ను యీపనికై మొదలియారుగారు గ్రంథశోధనము జేయునట్లు యాజ్ఞాపింపఁగా నే నీపనిని పూనుకొని యిందున్నదోషంబులను నాశక్తికొలఁది సవరించి యీగ్రంథమునకు ముందు నీ పీఠికను నాకు గోచరించినంతవఱకు వ్రాసి గ్రంథమును పూర్తిఁ జేయించితిని ఈగ్రంథమునకు ప్రథమవ్యాఖ్యానకర్త యైన, శ్రీపాలపర్తి-నాగేశ్వరశాస్త్రులవారే వ్యాఖ్యాన మొనరించి యున్నందున నిప్పు డున్న గ్రంథములకైనను, ఇఁక రాఁబోవుగ్రంథములకైనను నిదియే యగ్రగణ్యమై చెలంగును. ఈ గ్రంథమును చేసిన శ్రీపరశురామపంతులలింగమూర్తి గురుమూర్తిగారికిని, దీనిని వ్యాఖ్యాన మొనరించిన పాలపర్తి-నాగేశ్వరశాస్త్రులవారికిని, దీనిని ప్రచురపఱచుచున్న మ-రా-రా-శ్రీ, వేలూరు- కుప్పుస్వామి మొదలియారు గారికిని ఆంధ్రదేశమునకు మేలొనరించినందుకు నమస్కరించుచున్నాను ఇట్టి యత్యుత్కృష్టమయి ఆంధ్రదేశమున వన్నెకెక్కియున్న యీ వేదాంతశాస్త్రమగు శ్రీసీతారామాంజనేయమును ఆంధ్రదేశమునందుఁ గల ముముక్షువు లెల్లవారును పఠించి శ్రీకైవల్యపదమును బొందుదు రని యెంచి పరబ్రహ్మమూర్తి యగు శ్రీరామచంద్రుని ననవరతమును ధ్యానించుచున్నాను.

29-9-1927, చెన్నపురి.

ఇట్లు భవదీయుఁడు,

శ్రీరామభక్త చమ్మిఙ్గ - రామకృష్ణయ్య;

శ్రీపట్టాభిరామస్వామి శ్రీవరదరాజస్వామిదేవస్థాన సర్వాధికార సద్ధర్మపరిపాలనాధికర్త.

## ద్వితీయాశ్వాసము.

# వ్యాఖ్యానకర్తృవిరచితపద్యావళి.

శా. శ్రీవాణీగిరిజేశరూపములఁ దాఁ జెల్వొంది యీవిశ్వమున్
బ్రోవన్ గల్గఁగఁ జేయఁగా నడఁపఁగా రూఢిన్ ద్రయీవృత్తిచే
నేవేళన్ బ్రణవాత్మకం బయి జగం బెల్లం గనం దాన యా
భావాతీతునిఁ బ్రత్యగాత్మునిఁ బరబ్రహ్మంబు భావించెదన్. ౧

మ. సుమనస్సేవ్య మనంతసత్త్వము కలాసూక్తిద్విజాధార మా
గమమూలంబు ప్రకామితార్థఫలసంఘాతప్రసం బార్యభా
గమలచ్ఛాయము భూరిశాఖము బెడంగా కాశ్యపాఖ్యాకగో
త్రమహాకల్పక మొప్పు నిద్ధరణి నిత్యానందసంధాయియై ౨

అవతారిక ఈపద్యమునందు కల్పవృక్ష కాశ్యపగోత్రపరములుగా నర్థద్వయము చెప్పబడుచున్నది. —

టీక (కల్పకపరమునందు) సుమనస్సేవ్యము— సుమనః = పుష్పములచేత - దేవతలచేత నను యర్థాంతరము, (గోత్రపరమున) సుమనః = మంచిమనస్సు గలవారిచేత, సేవ్యము = సేవింపఁదగినది; (కల్ప) అనంతసత్త్వము — అనంత = మితి లేని, సత్త్వము = చేవ గలది, (గోత్ర) అనంత = అంత మనఁగా మృత్యువు - అది లేనిది పరబ్రహ్మము - అపరబ్రహ్మమే, సత్త్వము= సత్త్వగుణము గలది, (కల్ప) కలాసూక్తిద్విజాధారము — కలా = అవ్యక్తమధురధ్వనులతోఁ గూడిన, సూక్తి = మంచిపలుకులు గల, ద్విజ = పక్షులకు, ఆధారము = ఆశ్రయ మైనది, (గోత్ర) కలా = చతుష్షష్టికలల యందలి, సూక్తి = మంచిమాటలు గల, ద్విజ = బ్రాహ్మణులకు, ఆధారము = స్థాన మైనది; (కల్ప) ఆగమమూలంబు — ఆగమ = అంతట వ్యాపించిన, మూలంబు = వేళ్ళు గలది; (గోత్ర) ఆగమ = కామికాది వాతూలాంతాష్టావింశన్మహాదాగమములే, మూలంబు = కారణముగాఁ గలది, (ఉభయపక్షసమము) ప్రకామిత = కోరఁబడిన, అర్థఫల = వస్తుసిద్ధులయొక్క, సంఘాత = సముదాయమును, ప్రసవంబు = పుట్టించునట్టిది, (కల్ప) ఆర్యభాగమలచ్ఛాయము — ఆర్య = సత్పురుషులచేత, భాక్ = పొందఁదగిన, అమల = నిర్మల మైన, ఛాయము = నీడ గలది, (గోత్ర) ఛాయము= ప్రకాశము గలది, తక్కినది సమము; (కల్ప) భూరిశాఖము — భూరి = అనేకము లైన, శాఖము = కొమ్మలం గలిగి; (గోత్ర) అనేకము లైన వంశ పరంపరలు గలది, ఇద్ధరణిన్ = ఈ మర్త్యలోకమందు, బెడంగా = మనోహరము గుచున్న, కాశ్యపాఖ్యాకగోత్ర = కాశ్యపసగోత్ర మనెడు, మహాకల్పము = శ్రేష్ఠ మైన కల్పవృక్షము, (కల్ప) నిత్య= ఎప్పుడు, ఆనంద = సంతోషమును, (గోత్ర) నిత్యానంద = బ్రహ్మానందమును, సంధాయియై = ఒనఁ గూర్చునదియై, ఒప్పున్ = ప్రకాశించును.

తే. అట్టి కాశ్యపగోత్రసుధాబ్ధిచంద్రుఁ, డాత్మవిద్యాధికుం డవిద్యావిదూరుఁ
డపురశ్రీపాలవర్తిభాగవతదీక్షి,తుఁగు మహామహుఁ డతులుఁ డు దురితహారుఁ డగుచు.

క. రాగద్వేషవిదూరుం, డై గరిమ వహించినట్టి యాతనిసుతుఁడన్
నాగేశ్వరనామంబున, బాగమరినవాఁడ సాధుకథవర్తనుఁడన్. ౪

క. తతవైకృతప్రాకృతపం, సంస్కృతభాషావైదుషీవిరించనుఁడు మహా
మతిరల్లాచకేరిట్కుల, పతిశేషాచార్యగురునిఁ బ్రణుతించి తగన్. ౫

క. ఘనమతి సీతారామాం, జనేయసంవాద మనెడి సత్కృతి కర్థం
బొనరించినాఁడ నెందును, జను లిది బాగా ననంగ సమ్యక్ఫణితిన్. ౬

నను 'సమాప్తికామో మంగళ మాచరేత, విఘ్నధ్వంసకామో మంగళమాచరేత' అను శిష్టాచారమునుబట్టి ఆస్తికాద్వైతమతావలంబను లగు శిష్యపరంపరలకు 'అస్మద్గురుభి ర్మంగళ మాచరితమ్, అస్మాభి రపి మంగళ మాచరితవ్యమ్' అను ప్రమాణములు దెలియుటకై యీగ్రంధాదిని 'శ్రీమద్దివ్యనిజాంఘ్రి' యను నిగు పద్యములచేత ఇష్టదేవత యగు శ్రీసీతారామబ్రహ్మమును వినుతించుచున్నాఁడు.—

టీక శ్రీమత్ = శోభాయుక్తము లైన, దివ్య = అప్రాకృతము లైన, నిజ = స్వకీయము లైన, అంఘ్రిపద్మములు=పాదకమలములను, భక్తిచేత = అపరోక్షజ్ఞానమునకు కారణ మైన, అనన్యభక్తిచేత— అనగా శ్రవణ, కీర్తన, స్మరణ, పాదసేవన, అర్చన, వందన, దాస్య, సఖ్య, ఆత్మనివేదనము లనెడు తొమ్మిది అంగములు గలదై, బాహ్యము, అనన్యము, ఏకాంతము అని భక్తి యీ (గు) ముఖము గల దగుటం. వీనిలో బాహ్యభక్తి పరోక్షజ్ఞానమునకును, అనన్యభక్తి అపరోక్షజ్ఞానమునకును, ఏకాంతభక్తి స్వగూప మైన పరబ్రహ్మమునకును చిద్రూపిణి యైన పరబ్రహ్మశక్తికిని చంద్రచంద్రికలవలె ఒక్కటే యను నిశ్చయజ్ఞానముఁ గలిగెడు నిత్యానందమును అనుభవించుటకును కారణ మని భావము సంసేవించుచుండి = భజించుచు, ధీమంతుఁడు = నిత్యానిత్యవస్తువివేకము గలవాఁడు, అగు నాంజనేయునిన్ = ఆంజనేయు మంతుని, అసత్ = నశ్వరము లైన- దేహ స్థూల సూక్ష్మ కారణ మహాకారణము లనెడు చతుర్విధ దేహములకంటె, ఇంద్రియ=చతుర్దశేంద్రియములకంటె, అతీత=వ్యతిరిక్త మైన-సత్తును, చిత్=సాక్షిభూత ని పేతు-స్వయంప్రకాశమాన వస్తుతత్త్వజ్ఞానముచేత నెఱుఁగుటకలనఁ బుట్టిన, భూమ = అపరిచ్ఛిన్న మైన, ఆనందుఁడవు = నిత్య నిరుపాధిక నిరతిశయ సుఖస్వరూపుఁడ వైన, ఈశ=నీవే- అనఁగ సచ్చిదానందస్వరూపుఁడ వైన నీవే, నే నని = సత్యజ్ఞానానందస్వరూపుఁడ నైన నే నని, కృపతో = నిర్హేతుకకరుణచేత, బోధించు = 'తత్త్వమసి' 'త్వమేవ తదసి' అను మహావాక్యమందలి అభేదార్థమును నుపదేశించు చున్న, శ్రీ=అణిమాద్యైశ్వర్యములు గల, జానకీరామ=సీతారాముఁ డనెడు, బ్రహ్మమున్=సమాధిక సమాన రహిత పరమాత్మను, అంతరంగమునన్=మనస్సునందు-అనఁగా దహరాకాశమందు, అశ్రాంతమును=ఎల్లప్పుడును, ఆరాధింతున్=ధ్యానించుచున్నాను

తా స్వయంప్రకాశములును, అప్రాకృతములును, సమష్టి వ్యష్టిరూపు లయిన యీశ్వర జీవుల కంటె విలక్షణులును అయిన పరమాత్మ ప్రత్యగాత్మస్వరూపములయొక్క స్వకీయపాదపద్మములను భక్తి చేత నైక్యరూపముగ సేవించు నిత్యానిత్యవస్తువివేకి యైన ఆంజనేయుని, వ్యష్టి సమష్టి దేహేంద్రియములను అనృతజడదుఃఖరహితమును అయిన సచ్చిదానందరూప ప్రత్యగాత్ముఁడ వైన నీవే ... రహిత సత్యజ్ఞానానంద పరమాత్ముఁడ నైన నే నని, సత్యజ్ఞానానందరూప పరబ్రహ్మ మైన నేనే సచ్చిదానందరూప ప్రత్యగాత్ముఁడ వైన నీ వని సకలోపనిషత్సారమాత్ర మైన 'తత్త్వమసి' యను శ్రుత్యర్థమును నిర్హేతుకకరుణచేత నుపదేశించు చున్న సీతారామపరబ్రహ్మమును నామనస్సునందు ధ్యానించుచున్నా నని తాత్పర్యము

ఈ పద్యమందు శ్రీజానకీరామబ్రహ్మము నన చోట బ్రహ్మము స్వరూప తటస్థలక్షణములు గల గనుక తనయుపాసనాదైవ మైన శ్రీరాముని తటస్థలక్షణముగాను, అట్టి లక్షణము గల శ్రీరామునియే పరబ్రహ్మముగాను, అభేదాధ్యవసాయమువలన రామబ్రహ్మ మనియు, ఆనిర్గుణపరబ్రహ్మమందు చంద్ర చంద్రికలవలె నిత్యానపాయిని యై జగన్నిర్మాణాదిసామర్థ్యములు గల చిత్ప్రకృతియట్లు తటస్థలక్ష స్వరూపుఁ డైన శ్రీరామునకు భార్యారూపముగా శ్రీజానకీదేవియున్నది గనుక జానకీరామబ్రహ్మము స దయా తటస్థలక్షణముచేత భక్తజనులకు అణిమాదిసకలైశ్వర్యములను యిచ్చుచున్నది గావున శ్రీజానకీరా.

# శ్రీసీతారామాంజనేయ సంవాదము - ప్రథమాశ్వాసము,

మకారముతో రజస్సత్త్వ తమోగుణములు, ఇవియే జగత్సృష్టి స్థితి లయములఁ జేయుచున్నవి, వీనికి కర మైన అర్ధమాత్రకే శుద్ధసత్త్వము, ప్రణవమే సీతాదేవి యైన మాయాశక్తి, ఈ ప్రణవార్థమే పురుషుఁ ...న పరమాత్మ యని భావము, అట్టి భువనైకమాత—అట్టి = పైన చెప్పఁబడినట్టి, భువన=లోకములకు, ...=ముఖ్య మైన, మాత = తల్లి యైనదియును—అనఁగా జగత్కారణ మైన దనుట దయాసమేత=కని ...బడియును, సద్గుణవ్రాత—సత్ =శ్రేష్ఠము లగు, గుణ=శాంతశమదమాది గుణములయొక్క, వ్రాత= లదియును, నిర్మలస్వాంతపూత — నిర్మల = అణవ కార్మిక మాయిక మాయేయ తిరోధానము పంచమలరహిత మైన, స్వాంత = మనస్సుచేత, పూత=నిత్యపవిత్రురా లైనదియు, భక్తజన= ...క్తి గల జనులయొక్క, మానస = అంతఃకరణము లనెడి, ఉద్యాన=ఉపవనములయం దుండెడి, ... = కల్పవృక్షము నైన, సీత = జానకీదేవి, కరుణించి = దయయుంచి, నన్నుఁ = నన్ను, ...గాత = పోషించుఁగాక

ఆ పరమాత్మయందలి త్రిగుణములు గల అవ్యక్తనామక మూలప్రకృతిస్వరూపిణి యైన యీ సనాతన త్రిగుణములచేత ప్రపంచోత్పత్తి స్థితి లయములను చేయుచు కేవల త్రిగుణ సమతోదస్య గల శుద్ధసత్త్వస్వరూపగుణసామ్య మగు చిచ్ఛక్తిస్వరూపిణి యై శ్రీరామునియెడమతొడయం దెప్పుడు నుండెడి జగన్మాతయై, దయాసమేతయై, శాంత శమ దమా ద్యనంతకల్యాణములు గలిగి, భక్తుల కల్పవృక్షము నైన సీతాదేవి అహంకర్త అహంభోక్త అను కించిదజ్ఞత్వాది గుణములుగల సంసారసంబు చిలికెడు ప్రకృతిగంటఁ జూచి సర్వజ్ఞత్వాదిగుణములు గల పరమాత్మ నుంగ గల అపరోక్షజ్ఞాన మొసఁగి విదేహకైవల్య మిచ్చి రక్షించుఁగాక యని తాత్పర్యము.

పద్యలక్షణము క॥ నలనగసలభరతలలో|పల నాలుగు మీఁద రెండు పద్మాప్తగణం|బుల నిడి సుతులం| దలపడ నొకగీతఁ జెప్ప నది సీసమగున్ ఆ॥ సూర్యునొకని మీఁద సురరాజులిద్దఱుం| ...ఱంబు తేటగీత అర్థము స్పష్టము॥ సీసపద్యమునకు మూఁడవగణము మొదటియక్షరమును, గీతికి నాల్గవగణము మొదటియక్షరమును యతిగా నుండవలయును, యతి లేకయున్నఁ బ్రాస మయిన డియే తీరవలయును.

## పంచమలముల వివరణము.

అణవమల మనఁగా —పరబ్రహ్మవిషయికజ్ఞానము అప్పుడప్పుడు కలుగఁగా గానిని మఱుఁగు పఱచునది.

కార్మికమల మనఁగా —వేదాంతశాస్త్రవిషయములను గురువులు బోధించునప్పుడు దానియందు ...నిని చొరనీయనిది

మాయికమల మనఁగా—పరబ్రహ్మవిషయికజ్ఞానవాసనను యెప్పుడును కలుగనీయనిది.

మాయేయమల మనఁగా—పాపకార్యములయందు మనస్సును చొరపెట్టునది.

తిరోధానమల మనఁగా—నిత్య సత్య పరిపూర్ణ పరబ్రహ్మమందు అనిత్యబుద్ధిని పుట్టించి పరబ్రహ్మకు వేఱుగా దేవతలు, మంత్రములు, క్రియలు, మతములు, సాధనములు కలవు అనియు, అవి ... అనియు చెడుబుద్ధిని కలిగించి జననమరణాది దుఃఖములను అనుభవింపఁజేయునది.

శుద్ధసత్త్వప్రధానవిగ్రహుల నిమ్మల రజస్సత్త్వతమోగుణకుల
సుధర్మశృంగారవైరాగ్యవేషుల, విశ్వోద్భవస్థితివిలయకరులఁ

దప్తకాంచనసీరధరిచంద్రవర్ణుల, శుభకమండలుచక్రశూలధరుల
ఘనసత్యవైకుంఠకైలాసవాసుల, వరహంసఖగవృషవాహనులను
తే. షడ్గుణైశ్వర్యయుతుల భాసావభాసప్రసన్నమంగళదేవతాసర్వమంగ
ళాధిపతుల సాత్త్వికపరమాత్మమయుల, బ్రహ్మవిష్ణుమహేశులఁ బ్రస్తుతింతు. ౨


బ్రహ్మ


విష్ణువు


మహేశుఁడు.

టీక. తతశుద్ధసత్త్వప్రధానవిగ్రహుల౯ — తత = అతిశయమయిన, శుద్ధసత్త్వప్రధాన = శుద్ధసత్త్వమే ప్రధానమైన త్రిగుణములు గల — అనఁగా చిత్ప్రకృతి యనెడు శుద్ధసత్త్వము గలిగిన, విగ్రహముల౯ దేహములుగాఁ గలవారున — అనఁగా నిత్యనిర్గుణ నిర్వికారపరబ్రహ్మమునకు సృష్టీచ్ఛ కలిగినప్పుడే అంతఃకరణము కలుగును, అట్టి పరబ్రహ్మము శుద్ధస్ఫటికము వంటిది; దానియందు మాయ అవిద్య అనఁగా విక్షేపము అనెడు పేళ్లు కలిగి అంతఃకరణముయొక్క ఆభాసమైన మూలప్రకృతి త్రిగుణములను చేరుచు నుండును. అందు సత్త్వగుణము తెల్లనిరంగును ఉత్తమమును శాంతవృత్తియును దైవసంపదయును గలది, రజోగుణము యెఱ్ఱనిరంగును మధ్యమమును ఘోరవృత్తియును మానుషసంపదయును గలిగి, తమోగుణము నల్లనిరంగును అధమమును మూఢవృత్తియును అసురసంపదయును గలిగి, ఇట్లు ఒక్కొక్కటిగా ఆయంతఃకరణముతోఁ జేరినను దానియొక్క గుణధర్మములే కలదగును, ఆ త్రిగుణములలో ఒక్కగుణము ఆయంతఃకరణముతోఁ జేరినప్పుడు తక్కిన రెండుగుణములును అణఁగియుండును. అంతఃకరణముయొక్క స్వభావగుణమైన సత్త్వగుణమును ఆయంతఃకరణమందే స్థిరముగా నిలిచినప్పుడు రజోగుణతమోగుణములు ఆసత్త్వగుణమును అణఁచఁజాలక తమవిజృంభణమును మానక యైనను విడిచిపెట్టిన నిప్పుచొప్పున నశించును, పంచప్రాణములలో నాలుగుప్రాణములు పోయినను ఒక్కప్రాణము నిలువనట్లు ఆ రజస్తమోగుణములు రెండును లయించుచుండగ సత్త్వగుణము తనకు తానే లయించును. ఈ త్రిగుణలయావస్థయే శుద్ధసత్త్వము. ఇదే చిత్ప్రకృతి. ఈ స్వచ్ఛరూపమైన శుద్ధసత్త్వమే శరీరములుగాఁ గలవారనియు, ఆ ప్రకృతియే దివ్యమంగళవిగ్రహములనియు భావము, లేక అతిశయమైన మూలప్రకృతియొక్క శూన్యసత్త్వ మిశ్రసత్త్వ శుద్ధసత్త్వగుణములలో శుద్ధ

# శ్రీసీతారామాంజనేయ సంవాదము - ప్రథమాశ్వాసము.

శుద్ధసగుణసామ్య మైన ప్రకృతియే శరీరములుగాఁ గలవారని అర్థాంతరము ఇచ్ఛ్మలకు=
క మూర్ధవృత్తులకు స్థానము లైన, రజస్సత్త్వతమోగుణములకు = మలినసత్త్వప్రధాన
యొక్క గుణము లైన రజోగుణ సత్త్వగుణ తమోగుణములు గలవారును - అనఁగా
మోవ్యాపారములు గలవారని భావము స్వ = స్వకీయ మైన, సుధర్మ = వేదో[illegible]
మోచిత విధినిషేధప్రాయశ్చిత్త కామ్యకర్మాచరణములును, శృంగార=[illegible]నవర
ంకారములును, వైరాగ్య = ఇహ పరలోక ఫలభోగవిరాగమును, వేషులకు = వేషములుగాఁ
విశ్వోద్భవస్థితివిలయకరులకు—విశ్వ=నానారూపములు గల ప్రపంచము యొక్క, ఉద్భవ =
స్థితి = ఉండుటను - అనఁగా పాలనము, విలయ = నాశనమును, కరులకు = చేయునట్టి
క విశ్వశబ్దమునకును సకలశబ్దములకును మొదటిదియును సర్వ శబ్దస్వరూపమును అయిన
అర్థము గనుక ఓంకారరూప సర్వశబ్దోత్పత్తిని, శబ్దవృద్ధిని, నిశ్శబ్ద మైన పరబ్రహ్మమును
త శబ్దలయమును చేయువారని అర్థాంతరము - అనఁగా ఓంకారరూప సర్వశబ్దములను
ప త్రుంప కారణులనుట 'శ్లో॥ ఓంకారశ్చాథ శబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా।
వినిర్యాతౌ తస్మాన్మాంగళికావుభౌ' తప్తకాంచన = అపరంజియొక్క, నీలఘన =
క, చంద్ర = చందమామయొక్క, వర్ణులకు = ఛాయవంటి దేహచ్ఛాయలు గలవారును-
ని నల్లని తెల్లని శరీరచ్ఛాయలు గలవారనుట శుభ=మంగళకరము లయిన, కమండలు=
య మయిన కలశమును, చక్ర=చిత్ప్రకృతిమయ మయిన సుదర్శనమును, శూల=[illegible]
న త్రిశూలమును, ధరులకు=పూనినవారును, ఘన = శ్రేష్ఠము లైన, సత్య = సత్యలోకమును,
వైకుంఠపురమును, కైలాస = వెండికొండయును, వాసులకు = ఉనికిపట్లుగాఁ గలవారును -
సర్వోత్కృష్టము లైన, సత్య=సత్తును, వైకుంఠ=కుంఠ మనఁగా నశించునది అజ్ఞానము-వైకుంఠ
ంపనిది జ్ఞానము, అనఁగా చిత్తును, కైలాస=కేళీనాం ఆనందానాం సమూహః - కైలం
స్థీయత ఇతి కైలాసః అని వ్యుత్పత్తి, అస ఉపవేశనే యని ధాతువు, కేళి యనఁగా
దానిగుంపు కైలము, దానిచేత నుండునది-అనఁగా ఆనందమును, వాసులకు=ఉనికిపట్టుఁ గల
నఁగా సచ్చిదానందములే స్థానములుగాఁ గలవారని అర్థాంతరము | వర = శ్రేష్ఠము లైన,
రాళమును, ఖగ = గరుత్మంతుఁడును, వృష = నందికేశ్వరుఁడును, వాహనులకు = వాహన
లవారును, లేక [వర=ఘనము లైన, హంస=శివబీజ మైనహకారమును-శక్తిబీజ మైనసకారమును-
మ మైన చిద్బిందువును కలది హంస, అది ప్రకృతిమయ మైన ప్రపంచజ్ఞానమును, శివమయ మైన
నమును అనెడు రెండు రెక్కలు గలిగి చిద్బిందురూపమున సకలప్రాణుల సహస్రారకమ
మ సంచరించుచుండును, అట్టి హంసమును 'ఖగ ఖేచి దాకాశే గచ్ఛతీ ఖగః' అనఁగా ఆకా
తిరుగునది గనుక ఖగము-అనఁగా మనస్సు, దానికి పగలురాత్రులును, తేజోధూమములును,
ములును, ఉత్తరాయణదక్షిణాయనములును, దేవయానపితృయానములును, సూర్యచంద్ర
ం, కర్మభక్తులును, సంకల్పవికల్పములును పొందఁగునవియే రెక్కలు, అట్టి మనస్సును, వృష=
లకుఁ దగిన విధి నిషేధ ప్రాయశ్చిత్తకామ్యము లనెడు చతుర్విధకర్మములతోఁ గూడినది
దియే తపస్సు, పరిశుద్ధము, దయ, సత్యము అనెడు నాలుగుపాదములు గలది, అట్టి ధర్మమును;
=ఎద్దు - తిరుగువారని అర్థాంతరము ; షడ్గుణైశ్వర్యయుతులకు=ఐశ్వర్యము, ధైర్యము, కీర్తి,
నము, వైరాగ్యము అనెడి షడ్విధసంపదలతోఁ గూడినవారు- లేక ఉత్పత్తిని, లయమును,
[illegible] ఎఱుఁగుట యను షడ్గుణైశ్వర్యములతోఁ గూడిన

## సంస్కృతకవిస్తోత్రము.

శా. లోకాలోకపరీతభూచరమహాలోకోపకారంబుగా
శ్రీకల్యాణకరోరుకావ్యచయముల్ సిద్ధంబుఁ గావించి సు
శ్లోకుల్ పుణ్యమతుల్ జగద్గురువులై శోభిల్లుచున్నట్టి వా
ల్మీకి వ్యాస మయూర బాణకవి కాళీదాసులం గొల్చెదన్.

టీక లోక=ఇహపరలోకములైన మర్త్య స్వర్గ సత్య వైకుంఠ కైలాసములయందును, అలోక=మోక్షమందును, పరీత = వ్యాపకులైన, భూ=బీజజాగ్రజ్జాగ్ర మహాజాగ్ర స్వప్న జాగ్రత్స్వప్న స్వప్నజాగ్రత్సుషుప్తు లనెడి అజ్ఞానభూము లేడింటియందును - శుభేచ్ఛ విచారణ తనుమానసి సత్త్వాపత్తి అసంసక్తి పదార్థభావన తుర్యము అనెడు జ్ఞానభూము లేడింటియందును, చర = సంచారము గల, మహాలోకోపకారంబుగాన్—మహత్ = శ్రేష్ఠులైన, లోక = పామరజనులకును పండితజనులకును ॥ని॥ 'లోకస్తు భువనే జనే' అని అమరము. ఉపకారంబుగాన్=మేలు కలుగునట్లుగా లేక, చక్రవాళపర్వత పర్యంతమైన భూమండలమందు సంచరించు మహాజనులకు ఉపకారముగా నని యర్థాంతరము, 'లోకాలోకశ్చక్రవాళః' అని అమరము. శ్రీ=త్రివర్గసంపదలును, కల్యాణ=మోక్షమును, కర = ఇచ్చుచున్న, ఉరు=గొప్పలయిన, కావ్య=గ్రంథములయొక్క, చయములు = సమూహములను, సిద్ధంబు గావించి = సంపాదించి, సుశ్లోకుల్=సత్కీర్తిని పొందుచున్నవారును ॥ని॥ 'పద్యే యశసిచ శ్లోకః' అని అమరము. పుణ్యమతుల్ = నిర్దోషమైన బుద్ధులు గలవారును, జగద్గురువులై=సకలజనులకును గ్రంథరూపముగ జ్ఞానము నుపదేశించుటవలన లోకాచార్యులును యై, శోభిల్లుచున్నట్టి = ప్రకాశించుచుండెడు, వాల్మీకి=ప్రాచేతసుని, వ్యాస=వేదవ్యాసుని, మయూర=మయూరకవిని, బాణకవిన్=బాణుఁడను కవిని, కాళిదాసాదులన్=కాళిదాసుఁడు మొదలైనవారిని, కొల్చెదన్=సేవించుచున్నాను.

తా ఇహలోకమైన మనుష్యలోకమందలి భోగములయందును, పరలోకములైన స్వర్గలోక సత్యలోక వైకుంఠ కైలాసములయందలి భోగములయందును అపేక్ష గలిగి బీజజాగ్రత్త, జాగ్రత్త, మహాజాగ్రత్త, జాగ్రత్తలో స్వప్నము, స్వప్నము, స్వప్నజాగ్రత్త, సుషుప్తి అనెడి అజ్ఞానభూములు యేడింటి యందును సంచరించు పామరులకును, మోక్షమునందు అపేక్ష గలిగి శుభేచ్ఛ విచారణ తనుమానసి సత్త్వాపత్తి సంసక్తి పదార్థభావన తురీయము అనెడు జ్ఞానభూములు యేడింటియందును సంచరించు పండితులకును మేలు కలుగునట్లు ధర్మము అర్థము కామము అనెడు త్రివర్గసంపదను, మోక్షసంపదను కలుగఁజేయు మహాగ్రంథములను రచియించి అధికకీర్తిని పొందుచున్నవారును, రాగద్వేష కామక్రోధాదులు లేని బుద్ధులు గలవారును, ఎల్లజనులకును గ్రంథరూపముగ బ్రహ్మజ్ఞానమును వుపదేశించుటవలన లోకములకు ఆచార్యులును అయిన వాల్మీకులను, వేదవ్యాసులను, మయూరకవిని, బాణకవిని, కవి యైన కాళిదాసుని సేవించుచున్నా నని తాత్పర్యము.

## సుకవివర్ణనము.

తే. మహిత గురులఘువర్ణధర్మములు నియమ
ములుఁ గలితకర్తృకర్మక్రియలును దెలిసి
నామరూపావ్యయవిలక్షణంబు లాత్మ
నెఱిఁగిన కవీశ్వరుండె కవీశ్వరుండు ౧౦

అవతారిక. ఈ పద్యమందు సత్కవిపరముగను, బ్రహ్మవేత్తృపరముగను అర్థద్వయము గలుగునట్లు చెప్పుచున్నాఁడు.—

టీక కవిపర మయిన యర్థము.—మహిత= ఒప్పిదము లైన, గురులఘువర్ణ= గురువు లఘువు రూపములు గల అక్షరములయొక్క, ధర్మములు = పద్ధతులను ॥సూ॥ (దీర్ఘ సంయుక్తాద్యః ఘూర్ణానుస్వార పూర్వవర్ణశ్చ గురవశ్చైవ త్వితరే లఘవః ఇతి స్మృతాః' అనెడు సూత్రప్రకారము గురులఘువులవర్ణ విభాగమును దెలిసికొనినవాఁడై, నియమములు = గణయతిప్రాసనిబంధనములను, కలిత = మనోహరము లయిన, కర్తృ = కర్తృపదములను, కర్మ=కర్మలను, క్రియలను=ధాతువులను, తెలిసి = ఎఱిఁగి, నామ=ప్రాతిపదికములయొక్కయు, రూప = విభక్తివికారములయొక్కయు, అవ్యయ = లింగములును విభక్తులును లేని అవ్యయములయొక్కయు, విలక్షణంబులు = లక్షణములను, ఆత్మన్ = బుద్ధియందు, ఎఱిఁగిన కవీశ్వరుండె = తెలిసిన కవిశ్రేష్ఠుఁడే, కవీశ్వరుండు=గ్రంథములను రచియించువారిలో నుత్తముఁడు.

తా గురువులు లఘువులు నయిన అక్షరముల నిర్ణయములను, గణములు యతులు ప్రాసములు కర్తృపదములు కర్మలు క్రియలు ప్రాతిపదికములు అప్రాతిపదికములకు విభక్తుల చేరికవలన నేర్పడు రూపములు అవ్యయములు అనువాని లక్షణములను బాగుగ తెలిసినవాఁడే కవీశ్వరుఁడు గాని తక్కిన వాఁడు కవీశ్వరుఁడు కాఁడని తాత్పర్యము

టీక బ్రహ్మవేత్తృపర మైన అర్థము.—మహిత=రమణీయము లయిన, గురువర్ణ=బ్రాహ్మణాది శ్రేష్ఠజాతులయొక్కయు, లఘువర్ణ=చండాలాదినీచజాతులయొక్కయు, ధర్మములు=కులాచారములను, నియమములు=నిష్ఠలను, కలిత=సుందరము లయిన, కర్తృ=కర్మానుగుణ్యము లయిన కర్తృత్వములను, కర్మ=కర్తృగుణ్యము లయిన కర్మములను, క్రియలను = కర్మానుగుణ్యము లయిన ఫలభోగసిద్ధులను, తెలిసి= ఎఱిఁగి, నామరూప=మాయాకల్పితము లయిన నామరూపములు గల జగత్తును, అవ్యయ = నాశము లేని, విలక్షణంబు = సాక్షిభావమును-అనఁగా పరబ్రహ్మమును, ఆత్మన్ = తనయందు, ఎఱింగినకవీశ్వరుండె = తెలిసినబ్రహ్మవేత్తయే, కవీశ్వరుండు=బ్రహ్మమే నియామకుఁడు-అనఁగా పరమపురుషుఁ డని భావము.

తా. బ్రాహ్మణులు క్షత్త్రియులు వైశ్యులు శూద్రులు అనెడు శ్రేష్ఠజాతులయు, చండాలురు మొదలయిన నీచజాతులయు, కులాచారములను, నిష్ఠలను, కర్మలకుఁ దగిన కర్తృత్వములను, కర్తృత్వములకుఁ దగిన కర్మములను, కర్మములకుఁ దగిన ఫలభోగసిద్ధులను యెఱిఁగి మాయాకల్పితము లయిన నామరూపములు గల జగత్తును, నాశము లేని పరబ్రహ్మమును తనయందుఁ దెలిసిన బ్రహ్మవేత్తయే బ్రహ్మమే నియామకుఁ డయిన పరమపురుషుఁ డని తాత్పర్యము

వ. అట్లు గావున.

టీక. కవిలక్షణము లిట్టివి గనుక.

## ఆంధ్రకవి నుతి.

ఉ. నన్నయభట్టు నాంధ్రకవినాథుని దిక్కనసోమయాజిసిం
బన్నగ సోమసత్కవిని భాస్కర బమ్మెరపోతరాజులన్
మున్ను ప్రసిద్ధి గాంచు కవిముఖ్యుల నందఱ నెమ్మనంబులో
నెన్ని నమస్కరించెద నభీష్టఫలాప్తి దనర్చునట్లుగాన్. ౧౧

టీక ఆంధ్రకవినాథునిన్ = తెనుఁగుకవులలో మేటి యైన, నన్నయభట్టున్ = వాగనుశాసనుని, తిక్కనసోమయాజినిన్ = తిక్కనసోమయాజిని, పన్నుగన్ = ఒప్పిదమగునట్లు, సోమసత్కవిన్ = నాచన సోముఁడను కవిశ్రేష్ఠుని, భాస్కర బమ్మెరపోతరాజులన్ = భాస్కరకవిని బమ్మెరపోతరాజును, మున్ను = పూర్వము, ప్రసిద్ధిఁగాంచు = ప్రఖ్యాతిం జెందిన, కవిముఖ్యులనందఱన్ = కవిశ్రేష్ఠులనందఱిని, నెమ్మనంబులోన్ = హృదయమందు, అభీష్ట = కోరఁబడిన, ఫలాప్తి = ఫలసిద్ధి, తనర్చునట్లుగాన్ = లభించునట్లుగా, ఎన్ని = పొగడి, నమస్కరించెదన్ = మ్రొక్కెదను

తెనుఁగుకవులలో మేటి యైన నన్నయభట్టును, తిక్కనసోమయాజిని, నాచనసోముని, భాస్కరుని, బమ్మెరపోతరాజును, మఱియును పూర్వము ప్రసిద్ధి జెందిన మహాకవులనందఱను నాకోరిక నెఱవేఱుటకు పొగడి నమస్కరించుచున్నానని తాత్పర్యము.

పద్యలక్షణము ఉ॥ భానుసమానవిశ్వభరవభారలగంబులు గూడి విశ్రమస్థానమునందుఁ బద్మజదంతంబుగ నుత్పలమాలయై చనున్ తా॥ భ ర న భ భ ర ల గణములును, పదింటయతియు నుండవలయును

కుకవినిందనము.

క. శుద్ధపదయుక్తిఁ దొఱఁగి య, బద్ధమువు నిబద్ధిగా నిబద్ధి నొగి మహా
బద్ధముగాఁ గను కుకవుల, నౌద్ధత్యము మానుకొఱకుఁ నభినందింతున్. ౧౧

అవ. ఈ పద్యమందు కుకవిపరముగను, అవివేకిపరముగను అర్థద్వయము గలుగునట్లు చెప్పెను.—

టీక కుకవిపరమైన అర్థము — శుద్ధపదయుక్తిన్ = సుశబ్దప్రయోగములను, తొఱఁగి = విడిచి, అబద్ధమున్ = అపశబ్దమును, నిబద్ధిగాన్ = సుశబ్దముగాను, నిబద్ధిన్ = సుశబ్దమును, ఒగిన్ = వరుసగా, మహాబద్ధముగాన్ = మిక్కిలి అపశబ్దముగాను, కను కుకవులన్ = చూచెడు భాషాజ్ఞానము లేని క్షుద్రకవులను, ఔద్ధత్యమున్ = గర్వమును, మానుకొఱకున్ = విడిచెడు నిమిత్తము, అభినందింతున్ = కొనియాడుచున్నాను.

తా. మంచిశబ్దములను ప్రయోగించుటను మాని అపశబ్దమును సుశబ్దముగాను, సుశబ్దమును మిక్కిలి అపశబ్దముగాను తలఁచెడు కుత్సితకవులను మేము సమస్తము తెలిసినవారము, మేము రచించిన గ్రంథములు శ్రేష్ఠము లయినవి అనెడు అభిమానమును మానుటకై ప్రార్థించుచున్నా నని తాత్పర్యము

టీక అవివేకిపరమైన అర్థము — శుద్ధపదయుక్తి = పరిశుద్ధమయిన పరమమోక్షస్థానప్రాప్తిని, తొఱఁగి = వదలి, అబద్ధమున్ = అసత్యమయిన జగత్తును, నిబద్ధిగాన్ = సత్యమయిన పరబ్రహ్మముగాను, నిబద్ధిన్ = సత్యమైన పరబ్రహ్మమును, ఒగిన్ = క్రమముగా, మహాబద్ధముగాన్ = మిక్కిలి అసత్యమయిన జగత్తుగాను, కను కుకవులన్ = అవలోకించునట్టి బ్రహ్మజ్ఞానము లేని అవివేకులను, ఔద్ధత్యమున్ = కుతర్కవాద విజృంభణమును, మానుకొఱకున్ = వదలుటకు, అభినందింతున్ = పొగడుచున్నాను

తా. ఆణవము కార్మికము మాయికము మాయేయము తిరోధానము అనెడు పంచమలములు లేని మోక్షమును పొందఁదగిన యుక్తిని వదలి, అసత్యము జడము దుఃఖము రూపము గాఁ గల దైన జగత్తును, సత్యము విజ్ఞానము ఆనందము రూపముగాఁ గల పరబ్రహ్మ మని తలంచి, సత్యమైన పరబ్రహ్మమును అసత్యమైన జగత్తని యెఱింగి వేదాంతశాస్త్రరహస్యము లన్నియును చక్కఁగాఁ దెలిసినవార మను క్రొవ్వుచేత విఱ్ఱవీఁగెడి అవివేకులను కుతర్కవాదములు మానుటకు వినుతించుచున్నా నని తాత్పర్యము.

మ. గరిమన్ స్వర్ణ మనేకభూషణములై కన్పట్టుచందంబునన్
బరమాత్ముం డఖిలప్రపంచమయుఁడై భాసిల్లు నల్లాటచే

సురసిద్ధోరగయక్షకిన్నరనరస్తోమాది శశ్వచ్చరా
చరరూపోజ్జ్వలసర్వభూతములకున్ సద్భక్తితోన్ మ్రొక్కెదన్ ॥ ౧౩

టీక. గరిమన్ = గౌరవముచేత, స్వర్ణము = బంగారు, అనేకభూషణము లై = బహువిధాభరణము లై, కనుపట్టుచందంబునన్ = తోఁచునట్లు, పరమాత్ముండు = పరబ్రహ్మము, అఖిలప్రపంచమయుం డై = సకలజగద్రూపుఁ డై, భాసిల్లున్ = ప్రకాశించును. అట్లగుటచేన్ = అటుల ప్రకాశించుటవలన, సుర = దేవతలు, సిద్ధ = సిద్ధులు, ఉరగ = సర్పములు, యక్ష = యక్షులు, కిన్నర = కిన్నరులు, నర = మనుష్యులు, (వీరియొక్క) స్తోమ = సమూహము, ఆది = మొదలైన, శశ్వత్ = ప్రకాశించుచున్న, చరాచర రూప = స్థావరజంగమస్వరూపు లైన, ఉజ్జ్వల = తేజరిల్లుచున్న, సర్వభూతములకున్ = సమస్తప్రాణుల కును, సద్భక్తితోన్ = అతిశ్రద్ధతోడను, మ్రొక్కెదన్ = నమస్కరించుచున్నాను.

తా. బంగారు బహువిధము లైన ఆభరణము లై కనఁబడుచున్నట్లు పరబ్రహ్మము ప్రపంచస్వరూపుఁ డై తోఁచుచుండుటవలన దేవతలు సిద్ధులు పన్నగులు యక్షులు కిన్నరులు నరులు మొదలగు స్థావర జంగమప్రాణులకు మహాభక్తితో నమస్కరించుచున్నా నని తాత్పర్యము.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సద్గురుకీర్తనంబును సంస్కృతాంధ్రసత్కవి స్తోత్రంబును గావించి యేను ముముక్షుజనహితంబును సంసారసాగరోత్తార కంబును దారక సాంఖ్యామనస్కాత్మకంబును జీవబ్రహ్మైక్య సాక్షాత్కార సాధారణకారణంబు నైన రాజయోగంబంతయు నొక్క ప్రబంధంబుగా రచి యింప నిశ్చయించి పరమైకాంతంబున శ్రీగురుమంత్రదేవతా తత్త్వానుసంధానంబు సేయుచున్న సమయంబున. ౧౪

టీక. అని = ఈప్రకారము, ఇష్టదేవతాప్రార్థనంబును = ఇష్టదేవతాస్తోత్రమును, సద్గురుకీర్తనంబును = సదాచార్యస్తుతియును, సంస్కృతాంధ్ర సత్కవి స్తోత్రంబును = సంస్కృతాంధ్ర సుకవి స్తవమును, గావించి = చేసి, ఏను = నేను, ముముక్షుజన = మోక్షాపేక్ష గల జనులకు, హితంబును = మేలైనది యును, సంసార = సంసృతి యనెడు, సాగర = సముద్రమును, ఉత్తారకంబును = దాఁటించునదియును, తారకసాంఖ్యామనస్కాత్మకంబును = తారక సాంఖ్య అమనస్కయోగములే స్వరూపము గాఁ గలది యును, జీవ = క్షేత్రజ్ఞునకు, బ్రహ్మ = పరబ్రహ్మమునకు, ఐక్య = కూడికను, సాక్షాత్కార = అప రోక్షముగాఁ జేయుటయందు, సాధారణ = అసాధారణ మైన, కారణంబును = హేతువును, ఐన రాజయోగంబంతయున్ = అగు జ్ఞానయోగమెల్లను, ఒక్కప్రబంధంబుగాన్ = ఒకగ్రంథముగా, రచియింపన్ = నిర్మించుటకు, నిశ్చయించి = నిర్ణయించి, పరమ = శ్రేష్ఠ మైన, ఏకాంతంబునన్ = విజనప్రదేశమందు, శ్రీ = అణిమాద్యష్టసిద్ధులు గల, గురు = మహాదేవాచార్యస్వరూప మైన, మంత్రదేవత = తారకమంత్రాధి దేవత యైన రామచంద్రునియొక్క, తత్త్వ = యథార్థస్వరూప మైన పరబ్రహ్మమునకును, ఆత్మ = నా కైన కూటస్థచైతన్యమునకును, అనుసంధానంబున్ = ఐక్యమును, చేయుచున్న సమయంబునన్ = ఒన రించుచున్నప్పుడు.

తా. ఈవిధముగ ఇష్టదేవతలను పొగడి గురువులను వినుతించి సంస్కృతకవులను ఆంధ్రకవు లను కొనియాడి మోక్షాపేక్ష గల జనులకు మేలయినదియును, సంసార మనెడు సముద్రమును దాఁటిం చునదియును, తారకము సాంఖ్యము అమనస్కము అనెడు యోగములే స్వరూపము గాఁ గలదియును,

దేహేంద్రియాదులు నేననెడు భ్రమను వీడిన శుద్ధజీవునకును సత్యము విజ్ఞానము ఆనందము నిత్యము నిర్మలము అనెడు పంచలక్షణములు గల పరబ్రహ్మమునకును ఐక్యమును ప్రత్యక్షముగ జేయుటకు ముఖ్యకారణమును అయిన రాజయోగమునంతయును ఒక్క గ్రంథముగా నేఁ జేయఁదలంచి జనులు లేనిచోటం గూర్చుండి శ్రీమహాదేవాచార్యనిరూపమును ధరించిన శ్రీరామునిస్వరూపమైన పరమాత్మకును, తానైన ప్రత్యగాత్మకును ఐక్యరూపమైన ధ్యానమును చేయుచున్న సమయమునను అని తాత్పర్యము

## ప్ర బం ధ హే తు వు.

సీ. కమనీయవరదివ్యకాంచనచేలంబుఁ, గాషాయవస్త్రంబుగా ధరించి
చాపబాణంబులు చంచత్కమండలు, దండములుగాఁగ హస్తములఁ బూని
రమణీయరత్నహారంబు రుద్రాక్షమా,లికగా గళంబున లీలఁ దాల్చి
సీతావధూటిని శ్రీరాజయోగాహ్వ,యాధ్యాత్మవిద్యగా నవధరించి
తే. ప్రేమ మీఱంగ శ్రీరామ రామ రామ
యనుచుఁ దనపేరు నుడువుచు నద్భుతముగ
శ్రీమహాదేవగురుఁడైన రామవిభుఁడు
గరుణతోడుత నెదుర సాక్షాత్కరించె. ౧౫

టీక శ్రీమహాదేవగురుఁడైన రామవిభుఁడు—శ్రీ = నిత్యవిభూతి గల, మహాదేవగురుఁడైన=మహాదేవనామము గల గురురూపమును ధరించినట్టి, రామవిభుఁడు=శ్రీరామమూర్తి - అనఁగా ఈ గ్రంథకర్తకు మహాదేవుఁడను పరివ్రాజకుఁడు ఉపదేశగురువును, శ్రీరామమూర్తి యిష్టదైవమును గనుక ధ్యానకాలమునందు శ్రీరామమూర్తియే గురురూపముగ బ్రత్యక్షమయ్యె నని భావము. కమనీయ=రమ్యమును, వర=శ్రేష్ఠమును, దివ్య = ప్రకాశమానమును, కాంచన = స్వర్ణమయమును అగు, చేలంబు = వస్త్రమును, కాషాయవస్త్రంబుగాన్ = కావిపుట్టముగా, ధరించి = తాల్చి, చాపబాణంబులు = ధనుర్బాణములను, చంచత్ = మెఱయుచున్న, కమండలుదండములు గాఁగన్ = కుండికగను బ్రహ్మదండముగను, హస్తములఁ బూని = చేతులయందు ధరించి, గళంబునన్ = కంఠమున, రమణీయరత్నహారంబున్=సుందరమగు మణిసరమును, రుద్రాక్షమాలికగాన్ = రుద్రాక్షలదండ యగునట్లుగా, లీలఁదాల్చి = విలాసము ధరించి, సీతావధూటిన్ = సీతాదేవిని, శ్రీ = శోభాయుక్తమైన, రాజయోగాహ్వయ = అనుపమ్యయోగ మను పేరు గల, అధ్యాత్మవిద్యగాన్=బ్రహ్మవిద్యగను, అవధరించి=అంగీకరించి, ప్రేమమీఱంగన్= ప్రీతి యతిశయించునట్లు, శ్రీరామ రామ రామయనుచున్ = శ్రీరామ రామ రామ యని, తన పేరు = తన నామమును, నుడువుచున్ = జపించుచు, అద్భుతముగన్ = ఆశ్చర్యముగా, కరుణతోడుతన్ = దయతోడ, ఎదురన్=ఎదుటను, సాక్షాత్కరించెన్ = ప్రత్యక్షమాయెను

తా. శ్రీమహాదేవగురురూపమును ధరించిన శ్రీరామమూర్తి మనోహరమై శ్రేష్ఠమై బంగారుమయమై ప్రకాశించు పీతాంబరమును కావివలువఁగా ధరించి, విల్లును కమండలువుగను, అమ్మును కఱ్ఱగను చేతులయందు పూని, మెడయందలి సొగసైన రత్నాలదండను రుద్రాక్షలదండగను, సీతాదేవిని రాజయోగ మనెడు బ్రహ్మవిద్యగను తాలిచి శ్రీరామ శ్రీరామ శ్రీరామ అని తనపేరును స్మరించుచు మిక్కిలి వింతగా కరుణతోడఁ బ్రత్యక్షమయ్యె నని తాత్పర్యము.

వ. ఇట్లు శిష్యవాత్సల్యంబున సాక్షాత్కరించి మదీయ దీర్ఘదండనమస్కారంబులు చతుర్విధపురుషార్థప్రద చతురక్షరసమన్విత నారాయణస్మరణపూర్వకంబుగా నంగీకరించి కలకలనవ్వుచు శరీరత్రయ విలక్షణావస్థాత్రయ సాక్షి పంచకోశవ్యతిరిక్త సచ్చిదానందస్వరూప ప్రత్యగాత్ముండ వైన నీవ సత్యజ్ఞానానందస్వరూప పరమాత్ముండ నైన నేను, సత్యజ్ఞానానందస్వరూప పరమాత్ముండ నైన నేన సచ్చిదానందస్వరూప ప్రత్యగాత్ముండ వైన నీవని సర్వోపనిషత్సారభూతార్థం బైన పరమతత్త్వరహస్యార్థం బుపదేశించి యీయభేదవిజ్ఞానదృష్టిచేత నిరంతరంబు న న్నవలోకించుచు జీవన్ముక్తిసుఖం బనుభవింపుము, ప్రారబ్ధభోగావసాన సమయంబున ఘటాకాశంబు మహాకాశంబునం గలసినవిధంబున నాయందు విదేహకైవల్యంబు నొందెదు, సందేహంబు లేదు అని యాజ్ఞాపించి యిప్పు డీవు బ్రహ్మాండపురాణంబునం దధ్యాత్మరామాయణం బుమామహేశ్వరసంవాదరూపం బై యొప్పు నందు శ్రీరామహృదయం బను నితిహాసంబు సీతారామాంజనేయసంవాదంబున బ్రవర్తిల్లు నది సంక్షేపరూపంబుగావున నయ్యర్థంబు విస్తరించి యొక్క ప్రబంధంబుగా రచియించి నాపేర నంకితంబు సేయుము, సర్వపాపవినిర్ముక్తుండ వై కృతార్థుండ వయ్యెద వని యానతిచ్చి తిరోహితుం డయ్యె, నంతట మేల్కని పరమానందభరితాంతఃకరణుండ నై. ౧౬

టీక ఇట్లు = ఈప్రకారము, శిష్యవాత్సల్యంబునన్ = శిష్యుం డను ప్రీతిచే, సాక్షాత్కరించి = ప్రత్యక్షమై, మదీయదీర్ఘదండ నమస్కారంబులు = నాసాష్టాంగదండములను, చతుర్విధ = నాలుగువిధము లయిన, పురుషార్థప్రద = ధర్మార్థ కామ మోక్షముల నొసంగెడు, చతురక్షరసమన్విత = నాలుగక్షరములతోం గూడిన, నారాయణనామస్మరణపూర్వకంబుగాన్ = నారాయణస్మరణతోం గూడినట్లుగా, అంగీకరించి = అవధరించి, కలకలనవ్వుచున్ = పకపకనవ్వుచును, శరీరత్రయవిలక్షణ = స్థూలసూక్ష్మకారణదేహములకు వేఱైన, అవస్థాత్రయసాక్షి = జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడి మూండవస్థలకు ద్రష్టయైన, పంచకోశ వ్యతిరిక్త = అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయము లను పంచకోశములకు నతీత మైన, సచ్చిదానందస్వరూప—సత్ = త్రిపరిచ్ఛేదశూన్యము, చిత్ = జడరహితము, ఆనంద = దుఃఖరాహిత్యము, స్వరూప = ఈ త్రివిధలక్షణములే రూపముగాం గల, ప్రత్యగాత్ముండ వైన = కూటస్థుండ వైన, నీవ = నీవే, సత్యజ్ఞానానందస్వరూపపరమాత్ముండ నైన నేను = సచ్చిదానంద స్వరూపము గల పరబ్రహ్మ మైన నేను, సత్యజ్ఞానానందస్వరూపపరమాత్ముండ నైన నేన = సచ్చిదానంద స్వరూప పరబ్రహ్మము నైన నేనే, సచ్చిదానందస్వరూపప్రత్యగాత్ముండ వైన నీ వని=సత్యజ్ఞానానందలక్షణలక్షితప్రత్యగాత్ముండ వైన నీ వని, సర్వోపనిషత్ = సకలవేదాంతములయొక్క, సారభూత = సత్తామాత్ర మైన, అర్థం బైన = ప్రయోజన మగు, పరమతత్త్వ=నిరతిశయ మగు పరమాత్మయొక్క, రహస్యార్థంబు = గోప్య మైన యర్థమును, ఉపదేశించి = బోధించి, ఇయ్యభేదవిజ్ఞాన = భేదము లేని యీ యపరోక్షజ్ఞానముయొక్క, దృష్టిచేతన్ = లక్ష్యముచేత, నిరంతరంబు = ఎల్లప్పుడు, న న్నవలోకించుచున్ = నన్ను గనుంగొనుచు, జీవన్ముక్తిసుఖం బనుభవింపుము = శరీరధర విడిచిన యానందమును పొందుము, ప్రారబ్ధ = స్వేచ్ఛ పరేచ్ఛ అనిచ్ఛ లను త్రివిధప్రారబ్ధములయొక్క, భోగ=

అనుభవములయొక్క, అవసానసమయంబునన్ = తుదను, ఘటాకాశంబు = ఘటనిష్ఠ మైన గగనము, మహాకాశంబునకు = బృహదాకాశమందు, కలసినవిధంబునన్ = మిళిత మైనట్లు, నాయందున్ = నాలోన, విదేహకైవల్యంబునొందెదు = దేహరహితమోక్షము నొందఁగలవు, సందేహంబు లే దని = అనుమానము లే దని, ఆజ్ఞాపించి = సెలవిచ్చి, ఇప్పుడు = ఈసమయమున, ఈవు = నీవు, బ్రహ్మాండ పురాణంబునందున్ = బ్రహ్మాండపురాణమందు, అధ్యాత్మరామాయణంబు, ఉమామహేశ్వరసంవాద రూపం బై = పార్వతీపరమేశ్వరసంవాదరూపముగా, ఒప్పున్ = వెలయును; అందున్ = ఆ యధ్యాత్మ రామాయణమందు, శ్రీరామహృదయంబు = శ్రీరామహృదయము, అనునితిహాసంబు = అనెడు పూర్వ కథ, సీతారామాంజనేయసంవాదంబునన్ = సీతారామాంజనేయులసంవాద మనునటుల, ప్రవర్తిల్లున్ = ఒప్పును, అది = ఆ రామహృదయము, సంక్షేపరూపంబుగావునన్ = సంగ్రహముగ నున్నది కావున, అయ్యర్థంబున్ = ఆ రామహృదయమందలి తాత్పర్యమును, విస్తరించి = పెంచి, ఒకగ్రంథముగా రచియించి = ఒకగ్రంథముగాఁ జేసి, నా పేర సంకితంబు సేయుము = నామీఁద కృతి యిమ్ము, సర్వ పాపవినిర్ముక్తుండ వై = సకలకలుషములవలన విడువఁబడినవాఁడవై, కృతార్థుఁడ వయ్యెద వని = ధన్యుఁడవు కాఁగల వని, ఆనతిచ్చి = చెప్పి, తిరోహితుం డయ్యెన్ = అంతర్ధానము నొందెను, అంత టన్ = పిమ్మట, మేల్కని = జాగ్రత్తనొంది, పరమ = నిరతిశయ మైన, ఆనంద = ప్రమోదముచేత, భరిత = నిండింపఁబడిన, అంతఃకరణుండనై = అంతరంగము గలవాఁడనై.

తా॥ మహాదేవగురురూపమును ధరించిన శ్రీరామమూర్తి శిష్యుఁ డనగు ప్రేమచేత నాకు ప్రత్యక్షమై ధర్మార్థకామమోక్షముల నిచ్చునదియును, నాలుగక్షరములు కలదియును అయిన నారా యణమంత్రమును స్మరించుచు నాసాష్టాంగనమస్కారములను అంగీకరించి మహానందముతో పకపక నవ్వుచు స్థూలసూక్ష్మకారణదేహములకు వేరైనవాఁడవును, జాగ్రత్త స్వప్నము నిద్ర అనెడు మూఁ డవస్థలను చూచువాఁడవును, అన్నమయము ప్రాణమయము మనోమయము విజ్ఞానమయము ఆనందమయము లనెడు పంచకోశములను అంటనివాఁడవును, సత్యమును విజ్ఞానమును ఆనందమును రూపముగాఁ గల ప్రత్య గాత్మవును అయిన నీవే సత్యజ్ఞానానందములు రూపముగాఁ గల పరమాత్మ నైన నేను, సచ్చిదానంద స్వరూపపరబ్రహ్మ మైన నేనే సత్యజ్ఞానానందస్వరూపప్రత్యగాత్ముండ వైన నీవు అని సకలోపనిష త్సార మైన పరమరహస్యార్థమును తెలిపి యీ నిర్వికల్పజ్ఞానదృష్టిని పొందుము, పిమ్మట స్వేచ్ఛ పరేచ్ఛ అనిచ్ఛ అని మూఁడువిధము లైన ప్రారబ్ధముల ననుభవించి ఘటాకాశము మహాకాశమునందు కలిసినవిధమున నాయందు విదేహముక్తిని పొందఁగలవు సందేహము లేదు ఇప్పుడు నీవు బ్రహ్మాండ పురాణమునందు అధ్యాత్మరామాయణము పార్వతీపరమేశ్వరులసంవాదరూపముగా నుండును; ఆ రామా యణమందు శ్రీరామహృదయ మనెడు పూర్వకథ గలదు, అది సీతారామాంజనేయసంవాద మనునటుల ప్రకాశించును ఆ రామహృదయము సంగ్రహముగ నున్నది గనుక దానిని పెంచి ఒక్కగ్రంథమును చేసి నామీఁద కృతి యిమ్ము సమస్తపాపములనుండి విడువఁబడి కృతార్థుఁడవు కాఁగలవు, అని చెప్పి శ్రీరామమూర్తి పోయెను పిమ్మట నేను మేలుకొని మహానందమును పొందిన మనస్సు గలవాఁడనై యని తాత్పర్యము

## కృతికర్తృభాగ్యప్రశంస.

శా॥ శ్రీవిశ్వేశ్వరపార్వతీప్రియదముల్ శ్రీజానకీరామవా
క్యావిఖ్యాతము మారుతాత్మజసుబోధం బై తగన్ శ్రీమహా

దేవాచార్యవరాంకితంబుగను ధాత్రిన్ రాజయోగంబు సం
భావింపన్ రచియింపఁ గల్గె నిఁక నాభాగ్యంబు సామాన్యమే. ౧౮

టీక. శ్రీ = సంపద్యుక్తు లగు, విశ్వేశ్వర = శివునకు, పార్వతి = గౌరీదేవికి, ప్రియకరముగ = ఆనందము నొసంగునదియును, శ్రీ = లక్ష్మీస్వరూపురా లయిన, జానకి = సీతాదేవియొక్క, రాము = శ్రీరామునియొక్క, వాక్య = ఉపదేశవాక్యముచేత, ఆవిర్భూతము = పుట్టినదియును, తగన్ = ఒప్పు నట్లు, మారుతాత్మజ = ఆంజనేయునకు, సుబోధ్యంబై = లెస్సగాఁ దెలుపఁదగినదియు నైన, రాజయోగంబు = జ్ఞానయోగమును, ధాత్రిన్ = భూమియందు, (ఎల్లవారును) సంభావింపన్ = గౌరవించు నట్లు, శ్రీ = మోక్షలక్ష్మిసమేతుఁడైన, మహాదేవాచార్యవర = మహాదేవనామముగల సద్గురునిపేర, అంకితంబుగన్ = కృతిగా, రచియింపఁ గల్గెన్ = గ్రంథనిర్మాణము చేయఁగలిగెను, నాభాగ్యంబు = నాయదృష్టము, సామాన్యమే = స్వల్ప మయినదా

తా. శ్రీసాంబమూర్తికిని పార్వతీదేవికిని ఆనందము కలిగించునదియును, శ్రీసీతారాముల యుపదేశ వాక్యములచేత పుట్టినదియును, ఆంజనేయునకు చక్కఁగా బోధింపఁదగినదియును అయిన రాజ యోగమును యెల్లజనులను గౌరవించునట్లు శ్రీమహాదేవాచార్యుని పేర కృతిగా గ్రంథము చేయఁగలి గెను, కాఁబట్టి నాయదృష్టము స్వల్పమైనది కాదని తాత్పర్యము.

## ఏతద్గ్రంథ ప్రశంస.

క. దివ్యము భవ్యం బగు నా, కావ్యము సంతతము మోక్షకాములచే శ్రో
తవ్యము వక్తవ్యము మం, తవ్యము భావ్యమును కీర్తితవ్యము గాదే. ౧౯

టీక. దివ్యము = శ్రేష్ఠమును, భవ్యంబు = మంగళకరమును, అగు నత్కావ్యము = అయిన నా ప్రబంధము, సంతతమున్ = ఎల్లప్పుడును, మోక్షకాములచేన్ = మోక్షాపేక్ష గలవారిచేత, శ్రోతవ్యము = వినఁదగినదియు, వక్తవ్యము = పఠింపఁదగినదియు, మంతవ్యము = మననము చేయఁదగినదియు, భావ్యమును = సర్వోత్కృష్ట మని తలంపఁదగినదియు, కీర్తితవ్యము = కొనియాడఁదగినదియు, కాదె = కాదా.

తా. శ్రేష్ఠమును మంగళకరమును అయిన నాగ్రంథము మోక్షాపేక్ష గలవారిచేత నెల్లప్పు డును వినఁదగినది, చదువఁదగినది, తలంపఁదగినది, అన్నిగ్రంథములకంటె సర్వోత్కృష్టమైన దని తలఁప దగినది, పొగడఁదగినది యని తాత్పర్యము.

వ. అని విచారించి సంతోషభరితచిత్తుండనై మదీయాచార్యపరంపరావతారంబు
నభివర్ణించెద. ౨౦

టీక. అని విచారించి = అని యాలోచించి, సంతోష = ఆనందముచేతను, భరిత = నిండింపఁబడిన, చిత్తుండనై = మనస్సు గలవాఁడనై, మదీయ = నాయొక్క, ఆచార్యపరంపర = గురుపరంపరయొక్క, అవతారంబున్ = పుట్టుగడను, అభివర్ణించెదన్ = నుతించెదను.

తా. అని యాలోచనచేసి సంతోషించినమనస్సు గలవాఁడనై నాగురుపరంపరను నుతించుచున్నా నని తాత్పర్యము.

## గు రు ప రం ప రా భి వ ర్ణ న ము.

శా. సత్తామాత్రుఁడు నిర్విశేషుఁడు తనూసర్వేంద్రియప్రాణహృ
చ్చిత్తాహంకృతిధీప్రకాశకుఁడు సచ్చిత్సౌఖ్యకాయుండు వి
ద్వత్తాపాంధతమఃప్రదీపమయుఁ డాత్మస్వామి భాసిల్లె శ్రీ
దత్తాత్రేయగురుం డనంగ జగదంతర్యామి యై మున్నిలన్. ౨౦

టీక సత్తామాత్రుఁడు = సత్స్వరూపుఁడును - దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమైనది సత్, అది అసద్రూపము లగు దేశకాలవస్తువులను గ్రసించు ధర్మము గలది గావున సత్త యనఁబడును, ఆసత్తయే స్వరూపము గలవాఁ డనుట నిర్విశేషుఁడు = స్వాతిరిక్తశూన్యుఁడును, తనూ = శరీరత్రయమును, సర్వేంద్రియ = జ్ఞానకర్మేంద్రియములను, ప్రాణ = దశప్రాణములను, హృత్ = సంకల్పాత్మకమనస్సును, చిత్త = చంచలాత్మకమగు చిత్తమును, అహంకృతి = కర్తృత్వాత్మక మైన అహంకారమును, ధీ = నిశ్చయాత్మక మైన బుద్ధిని, ప్రకాశకుఁడు = వెలిఁగించువాఁడును, సచ్చిత్సౌఖ్యకాయుండు—సత్ = సత్యమును, చిత్ = జ్ఞానమును, సౌఖ్య = ఆనందమును, కాయుండు = రూపము గలవాఁడును, విద్వత్ = పండితులయొక్క, తాప = ఆధ్యాత్మికాది తాప మనెడు, అంధతమః = కటికిచీఁకటికి, ప్రదీపమయుఁడు = బృహద్దీపాలి స్వరూపుఁడు నైన, ఆత్మస్వామి = కూటస్థపరబ్రహ్మము, మున్ను = పూర్వము, ఇలన్ = భూమి యందు, శ్రీ = అణిమాద్యష్టసంపదలు గల, దత్తాత్రేయగురుండు = అత్రిమహర్షి పుత్త్రుఁడైన దత్తాత్రేయగురువు, అనంగన్ = అనునటుల, జగదంతర్యామియై = సత్త్వరజస్తమోమయము లగు స్వర్గమర్త్య పాతాళలోకములయందు వ్యాపించినవాఁడై, భాసిల్లెన్ = ప్రకాశించెను

తా. దేశకాలవస్తువుచేత విభాగింపరాని సత్తయే స్వరూపము గాఁ గలవాఁడును, తనకంటె వేఱుగ నైనవస్తువు వే ఱొక్కటి లేనివాఁడును, స్థూలసూక్ష్మకారణదేహము లను చెవి చర్మము కన్ను నాలుక ముక్కు యనెడు జ్ఞానేంద్రియములను, వాక్కు హస్తము పాదము గుదము గుహ్యము అనెడు కర్మేంద్రియములను, మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అనెడు అంతరింద్రియములను, ప్రాణము అపానము వ్యానము ఉదానము సమానము అనెడు పంచప్రాణవాయువులను, నాగము కూర్మము కృకరము దేవదత్తము ధనంజయము అనెడు పంచోపవాయువులను వానివానిపనులయందుఁ బ్రవర్తింపఁ జేయువాఁడును, సత్యమును విజ్ఞానమును ఆనందమును స్వరూపము గాఁ గలవాఁడును, చీఁకటిని దీపము నశింపఁజేయునట్లు పండితులతాపత్రయమును ఆత్మజ్ఞానోపదేశముచేత నశింపఁ జేయువాఁడును అయిన కూటస్థపరబ్రహ్మమే పూర్వము భూమియందు దత్తాత్రేయగురు నామముచేత అత్రిమహర్షి పుత్త్రుఁడై పుట్టి స్వర్గమర్త్యపాతాళలోకములయందుఁ బ్రసిద్ధి కెక్కి వెలిఁగె నని తాత్పర్యము.

క. ఆ దత్తాత్రేయగురు, శ్రీదివ్యపదారవిందసేవాదిశ్రీ
మోదుఁడు ప్రత్యక్షప్రహ్లాదుం డన శ్రీజనార్దనాహ్వయుఁ డొప్పెన్. ౨౧

టీక ఆదత్తాత్రేయగురు = ప్రసిద్ధుఁ డగు దత్తాత్రేయదేశికునియొక్క, శ్రీ = శోభాయమానము లయిన, దివ్య = అనితరసాధారణము లైన, పదారవింద = అడుగుదామరలయొక్క, సేవాది = శుశ్రూష మొదలైన వనెడు, శ్రీ = సంపదచేత, మోదుఁడు = ఆనందించువాఁడును, ప్రత్యక్షప్రహ్లాదుఁడు = కనఁబడుచున్న ప్రహ్లాదుఁడు, అనన్ = అనునట్లు, శ్రీజనార్దనాహ్వయుఁడు = శ్రీజనార్దనయోగి, ఒప్పెన్ = ప్రకాశించెను

తా. శ్రీజనార్దనయోగి త్రిలోకప్రసిద్ధుఁ డైన దత్తాత్రేయమహర్షికి శిష్యుఁడై ఆతనినిత్యము లైన పాదారవిందములను పూజించుట, ధ్యానించుట, స్మరించుట, పొగడుట, నమస్కరించుట మొదలగు వానిచేత ఆహ్లాదించుచు ప్రత్యక్షప్రహ్లాదుఁడో యనునట్లు ప్రకాశించె నని తాత్పర్యము.

మ. తనసౌశీల్యము శాస్త్రచింతనము నాత్మజ్ఞానముం జూచి హె
చ్చినకూర్మి న్నిజదివ్యరూపములతోఁ శ్రీభారతీమోక్షకా
మిను లేతెంచి యహర్నిశంబు దను నెమ్మిం గొల్వఁగా శ్రీజనా
ర్దనయోగీశ్వరుఁ డొప్పె నెల్లెడ నవిద్యాధ్వాంతమార్తాండుఁడై. ౨౧

టీక. తనసౌశీల్యము = తనసత్ప్రవర్తనమును, శాస్త్రచింతనమును = అధ్యాత్మశాస్త్రమననమును, ఆత్మజ్ఞానమును = బ్రహ్మజ్ఞానమును, చూచి = వీక్షించి, హెచ్చినకూర్మిన్ = అతిశయించినప్రేమచేత, నిజ = తమయొక్క, దివ్య = వెలుఁగుచున్న, రూపములతోన్ = ఆకృతులతోడ, శ్రీ = లక్ష్మీదేవి, భారతీ = సరస్వతీదేవి, మోక్షకామినులు = పార్వతీదేవి మొదలగువారును— అనఁగా సౌశీల్యము లక్ష్మియును, శాస్త్రచింతనము సరస్వతియును, ఆత్మజ్ఞానము పార్వతియును యిట్లనుటచేత త్రిమూర్తిస్వరూపుఁ డనఁగ, ఏతెంచి = వచ్చి, అహర్నిశంబు = రేపగల్లు, తన్నున్ = తన్నును, నెమ్మిన్ = ప్రేమతోడ, గొల్వఁగాన్ = సేవింపఁగా, శ్రీజనార్దనయోగీశ్వరుఁడు = శ్రీజనార్దనయోగీంద్రుఁడు, ఎల్లెడన్ = అంతటను, అవిద్యా = జీవోపాధి యైన అవిద్య యను, ధ్వాంత = చీఁకటికి, మార్తాండుఁడై = సూర్యుఁడై, ఒప్పెన్ = ప్రకాశించెను.

తా. ఆ జనార్దనయోగీంద్రుని మంచినడవడిని చూచి విష్ణుదేవుఁ డనెడు తలంపుచేత లక్ష్మీదేవియును, వేదాంతశాస్త్రము మొదలైనశాస్త్రములను పఠించుటను చూచి బ్రహ్మ యనెడు యున్కిచేత సరస్వతీదేవియును, బ్రహ్మజ్ఞానమును చూచి సాంబమూర్తి యనెడు జ్ఞాపకముచేత పార్వతీదేవియును మిక్కుటమైన మక్కువతో వచ్చి రాత్రులును పగళ్లును కొలువఁగా నతఁడు బ్రహ్మజ్ఞానముచేత సూర్యుఁడు కటికిచీఁకటిని నశింపఁజేసినతీరున అజ్ఞానమును నశింపఁజేసి త్రిలోకములయందును ప్రకాశించె నని తాత్పర్యము.

తే. ఆ జనార్దనగురున కత్యద్భుతముగ, శ్రీమదేకోగురుస్వామి శిష్యుఁ డయ్యె
మును వసిష్ఠమహామునీంద్రునకు నర్థి, దాశరథి భక్తుఁ డైనచందంబు దనర.

టీక. మును = పూర్వము, వసిష్ఠమహామునీంద్రునకున్ = వసిష్ఠమహర్షికి, అర్థిన్ = ప్రీతితోడ, దాశరథి = శ్రీరాముఁడు, భక్తుఁ డైనచందంబు = శిష్యుఁ డైనవిధము, తనరన్ = ఒప్పఁగా, ఆ జనార్దనగురునకున్ = ఆ జనార్దనదేశికునకు, అత్యద్భుతముగన్ = మిగుల నాశ్చర్యకరముగా, శ్రీమదేకోగురుస్వామి = బ్రహ్మవిద్యాయుక్తుఁ డైన ఏకోగురుస్వామి యను నాతఁడు, శిష్యుఁ డయ్యెన్ = ఛాత్రుఁ డాయెను.

తా. పూర్వము వసిష్ఠమహామునికి శ్రీరాముఁడు శిష్యుఁ డైనట్లు ఆ జనార్దనయోగికి ఏకోగురుస్వామి శిష్యుఁ డయ్యె నని తాత్పర్యము.

సీ. తనదువైరాగ్యంబుఁ గనుఁగొని సిగ్గుచే, సనకాదిమును లజావినుక నొదుఁగ
దనదుసద్భక్తిచేఁ దగఁ గట్టువడి యుంట, శ్రీకృష్ణుఁ డాస్త్మయుసేవఁ జేయ
దనదువిజ్ఞానతీర్థమునందుఁ గ్రుంకుచు, గంగాదినదు లెల్లఁ గంతు లిడఁగఁ
దనదుపూర్ణాత్మసంతతసమాధినిఁ జూచి, ప్రహ్లాదుఁ డాశ్చర్యపరతఁ నొంద

తే. స్వకృతగీతాదిశాస్త్రభాష్యంబు లెల్ల, వేదతుల్యంబులై ధాత్రి వెలయుచుండ
వామదేవ శుకార్జున వ్యాస భీష్మ, సదృశుఁ డేకోజనార్దనస్వామి వెలసె. ౨౮

టీక. వామదేవ = వామదేవమహర్షి, శుక = శుకయోగి, అర్జున = పార్థుఁడు, వ్యాస = వేదవ్యాసుఁడు, భీష్మ = భీష్మాచార్యుఁడు అను వారితోడ, సదృశుఁడు = సాటియైన, ఏకోజనార్దనస్వామి= ఏకోజనార్దనగురువు, తనదు = తనయొక్క, వైరాగ్యంబున్ = ఇహపరలోకభోగవిరక్తిని, గనుఁగొని = చూచి, సిగ్గుచేన్=లజ్జచేత, సనకాదిమునులు = సనకుఁడు సనందనుఁడు మొదలగు మహర్షులు, అజువెనుక నొదుగన్ = బ్రహ్మవెనుకదిక్కున డాఁగఁగా, శ్రీకృష్ణుఁడు = శ్రీకృష్ణమూర్తి, తనదుసద్భక్తిచేన్ = తనయుత్తమభక్తిచేత, తగన్=లెస్సగా, కట్టువడి=బద్ధుఁడై, ఇంటన్ = గృహమందు, ఆత్మీయసేవన్ = తన శుశ్రూషను, చేయన్ = కావింపఁగా, గంగానదులెల్లన్ = గంగ మొదలగు మహానదు లన్నియును, తనదు విజ్ఞానతీర్థమునందున్ = తన అపరోక్షజ్ఞాన మనెడు పుణ్యతీర్థమునందు, క్రుంకుచున్ = మునుఁగుచు, గంతులిడఁగన్=చిందులు ద్రొక్కఁగా, ప్రహ్లాదుఁడు = హిరణ్యకశిపునిపుత్త్రుఁడు, తనదు = తనయొక్క, పూర్ణ=సమగ్రమైన, ఆత్మ = పరమాత్మసంబంధియైన, సంతత = ఎడతెగని, సమాధిన్ = నిష్ఠను, చూచి= అవలోకించి, ఆశ్చర్యపరతనొందన్ = అచ్చెరువు పడఁగా, స్వకృతగీతాది శాస్త్రభాష్యంబులెల్లన్ = తన చేత కల్పింపఁబడిన స్మృతి సూత్ర శ్రుతి శాస్త్ర భాష్యము లన్నియును, ధాత్రిన్=భూమియందు, వేదతుల్యంబులై = వేదములతో సమానములై, వెలయుచుండన్=ప్రసిద్ధిఁ జెందుచుండఁగా, వెలసెన్= ప్రకాశించెను

తా. వామదేవమహర్షి శుకయోగి అర్జునుఁడు శ్రీ వేదవ్యాసులు భీష్మాచార్యులు మొదలగువారితో సాటియైన యేకోజనార్దనగురుస్వామియొక్క యిహపరలోకభోగవిరక్తినిఁ జూచి సిగ్గుపడి సనకుఁడు సనందనుఁడు సనత్కుమారుఁడు సనత్సుజాతుఁడు నారదుఁడు మొదలగువారు బ్రహ్మవెనుక డాఁగఁగాను, శ్రీకృష్ణమూర్తి భక్తి యనెడు త్రాళ్ళచేత కట్టుపడి తనకు శుశ్రూషలు చేయఁగాను, గంగా కావేరి మొదలైన మహానదులు తనవిజ్ఞాన మనెడు పుణ్యతీర్థమందు స్నానము చేసి పరిశుద్ధిఁ జెంది మహానందముతో గంతులు వేయఁగాను, ప్రహ్లాదుఁడు తననిర్వికల్పనిష్ఠను చూచి ఆశ్చర్యపడఁగాను, తనచేత రచియింపఁబడిన స్మృతులును శ్రుతులును సూత్రములును శాస్త్రములును భాష్యములును వేదములతో సమానములై లోకములోఁ బ్రసిద్ధిఁ జెందుచుండఁగాను ప్రకాశించె నని తాత్పర్యము

క. ధరలో నారాయణునకు, నరుగతి నేకోజనార్దనస్వామికి శ్రీ
నరహరిమహేశగురుఁ డచ్చెరువుగ సద్భక్తి మెఱయ శిష్యుం డయ్యెన్. ౨౯

టీక. ధరలోన్ = భూమియందు, నారాయణునకున్ = శ్రీకృష్ణునకు, నరుగతిన్=అర్జునునివలె, ఏకోజనార్దనస్వామికిన్ = ఏకోజనార్దనగురుమూర్తికి, శ్రీనరహరిమహేశగురుఁడు = శ్రీనరహరిమహేశగురువు, అచ్చెరువుగన్ = వింతగా, సద్భక్తి = ఉత్తమభక్తి, మెఱయన్ = ప్రకాశింపఁగా, శిష్యుఁడయ్యెన్ = ఛాత్రుఁ డాయెను.

తా. శ్రీకృష్ణమూర్తికి అర్జునుఁడు శిష్యుఁడైనరీతిని యేకోజనార్దనయోగికి బ్రహ్మజ్ఞాన మనెడు సంపదగల నరహరిమహేశగురువు శిష్యుఁ డయ్యె నని తాత్పర్యము.

చ. అతఁడు సమస్తభూతబహిరంతరనావృతబోధమూర్తియై
వితతసమాధి నుండు నెడ వేల్పులు సూచి యితం డయారె యీ

ఇహాముత్రార్థఫలభోగవిరాగమును, ఉపరతి = చిత్తవిశ్రాంతియు ననెడు, అళులు = చెలికత్తెలు, ఉత్తేజంబు—ఉత్ = అధికమైన, తేజంబు = తేజస్సు, ఒప్పన్ = ప్రకాశింపఁగా - అనఁగా త్రిలోకప్రసిద్ధముగా, సహాయలై మెలఁగన్ = సహాయము చేయువారు కాఁగా, అద్విత్వ = అద్వయమనునదైన, ప్రబోధ = విజ్ఞాన మనెడు, స్ఫురత్ = భాసిల్లుచున్న, రాజాస్యన్ = స్త్రీని, వరియించి = వరించి, మోక్షసుఖ = బ్రహ్మానంద మనెడు, సామ్రాజ్యంబుతోన్ = మండలాధిపత్యముతో, పండితులు = విద్వాంసులు, కోర్కుల్దీరన్ = ఇష్టార్థములు సిద్ధించునట్లు, సేవింపఁగన్ = భజింపఁగా, ఒప్పెన్ = ప్రకాశించెను.

తా. ఆ నాగోజీరామగురువుయొక్క తలంగని వైరాగ్యమును నెమ్మదియును అను సుగుణములు మనోహరములై మిగుల చెలిఁగాడు స్త్రీరూపములను ధరించి వచ్చి సనికత్తెలై తోడుపడఁగా బ్రహ్మాహమస్మి అనెడి నిర్వికల్పజ్ఞానమను స్త్రీని వరియించి బ్రహ్మానంద మను సామ్రాజ్యమును పాలించుచు తమ తమకోరికలు నెఱవేఱునట్లు విద్వాంసులు సేవింపఁగాఁ బ్రకాశించె నని తాత్పర్యము.

అనఁగా, నాగోజీరామగురువు వైరాగ్యబోధోపరతులు గలిగి బ్రహ్మానంద మనుభవించుచును పండితులకు బ్రహ్మజ్ఞాన ముపదేశించుచు నుండె నని భావము.

క. ఆ నాగోరామునకున్, శ్రీనారాయణున కజునిచెలువున శిష్యుం
డై నెగడె నెల్లదిక్కులఁ, గోనేరుగురుండు తత్త్వకోవిదుఁ డగుచున్. ౨౯

టీక. ఆ నాగోరామునకున్ = ఆ నాగోజీరామగురువునకు, శ్రీనారాయణునకున్ = శ్రీమన్నారాయణమూర్తికి, అజునిచెలువునన్ = బ్రహ్మవలె, కోనేరుగురుండు = కోనేరుగురువు, శిష్యుండై = శిష్యుఁడయి, తత్త్వకోవిదుఁ డగుచున్ = బ్రహ్మవేత్తయై, ఎల్లదిక్కులన్ = దశదిక్కులయందును, నెగడెన్ = ప్రసిద్ధి కెక్కెను.

తా. శ్రీమన్నారాయణునకు బ్రహ్మ శిష్యుఁ డయినట్లు, ఆ నాగోజీరామగురువునకు కోనేరుగురుఁడు శిష్యుండై బ్రహ్మవేత్తయై త్రిలోకములయందును ప్రసిద్ధి కెక్కె నని తాత్పర్యము.

శా. ఆ కాశీతలసేతుమధ్యకలితక్ష్మాధీశ్వరోద్యచ్ఛిర
శ్శ్రీకోటీరమణిప్రభార్చితనిజాంఘ్రిద్వంద్వపంకేరుహుం
డాకాశాదిసమస్తతత్త్వసముదాయాతీతవిశ్వేశుఁ డై
శ్రీకోనేరుగురుండు మోక్షవరలక్ష్మీకాంతుఁడై రంజిలెన్ ౩౦

టీక శ్రీకోనేరుగురుండు = సంపద్యుక్తుఁ డైన కోనేరుగురువు, ఆ కాశీతలసేతు = ఆ కాశీక్షేత్ర సేతువులయొక్క, మధ్య = నడుమ, కలిత = ఉన్న, క్ష్మాధీశ్వర = రాజులయొక్క, ఉద్యత్ = శోభిల్లుచున్న, శిరః = శిరస్సులయం దుండు, శ్రీ = కాంతి గల, కోటీరమణి = కిరీటములయందలి రత్నములయొక్క, ప్రభా = కాంతులచేత, అర్చిత = పూజింపఁబడిన, నిజ = తనయొక్క, అంఘ్రిద్వంద్వపంకేరుహుండు = పద్మములవంటి పాదద్వయము గలవాఁడు-అనఁగా కాశీసేతువులనడుమ నుండు రాజులందఱు నితనికి పాదాక్రాంతు లనుట, ఆకాశాది = గగనము మొదలగు, సమస్తతత్త్వ = అన్నితత్త్వములయొక్క, సముదాయ = గుంపును, అతీత = మీఱిన, విశ్వేశుఁడై = ప్రణవాతీతపరబ్రహ్మమై - అనఁగా తత్త్వాధ్వాతీతపరబ్రహ్మమై, మోక్షవరలక్ష్మీకాంతుఁడై = శ్రేష్ఠురా లగు కైవల్యలక్ష్మికి భర్తయై, రంజిల్లెన్ = ప్రకాశించెను

సంకల్పాధ్యవసాయాభిమానావధారణంబులును, వైచిత్ర్యాదిచతుష్టయమును, దిగ్వాతార్కాదిచతుర్దశేం ద్రియాధిష్ఠానదేవతలును అనునవి యన్నియుఁ గూడి తొంబదియాఱుతత్త్వములు.

భువనాధ్వము — భద్రకాళి వీరభద్ర త్రిలోచనభవ లిప్సువివాహ సంవాహ త్రిగళేశ్వర త్ర్యక్షి గణాధ్యక్ష విభు శంభు దంష్ట్రి వజ్రఫణీంద్ర ఉదుంబర గ్రసన మారుతాశన క్రోధన అనంత వృషధర వృష బలిప్రియ భూతపాల జ్యేష్ఠ శర్వ సురేశ్వర వేదపారగ జ్ఞాన భూ సర్వజ్ఞ ఈశాన విద్యాధిప ప్రకామద ప్రసాద శ్రీధర రత్నధర లక్ష్మీధర జటాధర సౌఖ్యధర ధన్యరూప నిధీశ మేఘవాహన కపర్ది పంచశిఖ పంచాంతక క్షయాంతక తీక్ష్ణ సూక్ష్మ వాయువేగ లఘు శీఘ్ర సునాద మేఘనాద జలాంతక దీర్ఘబాహు జయ భద్ర శ్వేత మహాబల పాశహస్త అతిబల బల దంష్ట్రి లోహిత ధూమ్ర విరూపాక్ష ఊర్ధ్వ కేశ భయాంతక క్రూరదంష్ట్రి దంష్ట్రి మారణ నిర్పతి ధర్మపతి అధర్మపతి విగాఙ్గ సంయోక్త కర్త విధాత ధాత హర మృత్యు ధర్మ అక్షయాంతక భస్మాంతక వజ్రబాహు దహన జ్వలన హరఘాతుక పింగళ హుతాశన అగ్ని రుద్ర త్రిదశాధిప పినాకి శాస్త అవ్యయ విభూతి నివర్ధన వజ్ర దేహ బుధ అజ కపాలీశ రుద్ర విష్ణు బ్రహ్మ హాటకేశ్వర కూశ్మాండ కాలాగ్ని రుద్ర శ్రీకణ్ఠ జోమ కౌమార వైష్ణవ బ్రాహ్మ్య భైరవ కృత అకృత స్థలేశ్వర సుబ్రాహ్మ్య హాశేశ సౌమ్య ఇంద్ర గాంధర్వ యక్ష రాక్షస పైశాచ సుస్థలేశ్వర శంఖకర్ణ కాలాంజన మండలేశ్వర మహాండ ద్విగండ సకలాండ స్థాణు స్వర్ణాక్ష భద్ర కర్ణ గోకర్ణ మహాలయ అవిముక్త రుద్రకోటి వస్త్రాపద భీమేశ్వర మహేంద్ర అట్టహాస విమలేశ్వర నఖిలనాఖిల కురుక్షేత్ర గయాక్ష మహాభైరవ కేదార శ్రీశైల మహాకాళ మధ్యమేశ్వర ఆమ్రాదికేశ్వర జలేశ్వర హరిశ్చంద్ర అరుణేశ్వర డుండి ముండి భారభూతి ఔఘధిపుష్కర నైమిశ అమరేశ్వర అంగుష్ఠమాత్రతారక ఈశాన ఏకేక్షణ ఏకపింగళ ఉద్భవ అభవ వామదేవ మహాద్యుతి శిఖేద ఏకవీర క్రోధ చండ ఘోరపంచాంతక సంవర్తజ్యోతిష మహాక్రోధ మహాచండ ఏకశివ అనంత అజ ఉమాపతి ప్రచండ ఏకపాద ఈశాన భవ ఉగ్ర భీమ అనంత సూక్ష్మ శివోత్తమ ఏకనేత్ర ఏకరుద్ర త్రిమూర్తి శ్రీకంఠ శిఖండి వామ జ్యేష్ఠ రౌద్రి కాళ కలవికర్ణ బలవికర్ణ బలప్రమథన సర్వ భూతదమన మనోన్మని అనాశ్రిత అనాథున అనంత వ్యోమరూపవ్యాపిని ఊర్ధ్వగామిని గోచిద మోచిక దీపిక ఇందిర శాంత్యతీత శాంతివిద్యా ప్రతిష్ఠానివృత్తి అని భువనములు యిన్నూటయిరువది నాలుగు

కళాధ్వము — నివృత్తి ప్రతిష్ఠ విద్య శాంతి శాంత్యతీత మని కళలు అయిదు, ఈ పంచకళలలో మంత్రపద వర్ణ తత్త్వ భువనములును, ఈ తత్త్వముల లోభువనములును చేరి యున్నవి వీనివిశేషవివ రణము కైవల్యనవనీతప్రథమప్రకరణమున ఆఱువదియొకపద్యమునం జూడవలయును.

మఱియు, సర్వసమయమంత్రములు సప్తకోటిభేదములు కలవై వుండగా మంత్రాధ్వమందు పదు నొకండుమంత్రములుమాత్రము చెప్పుటకు హేతు వేమనిన, పరమశివునిపంచముఖములయందే సకలాగమ మంత్రములును పుట్టుటచేత సద్యోజాతాదిపంచమంత్రములును ఆ మంత్రములకు ముఖ్యము లయిన షడంగ దేవతామంత్రములును చేరి పదునొకండుమంత్రము లని చెప్పఁబడెను.

మఱియు, 'శ్లో॥ మకారం మననం చైవ త్రకారం త్రాణ ముచ్యతే । మనన త్రాణ మిత్యాహు ర్మంత్రమి త్యభిధీయతే' అను న్యాయముచేత పరబ్రహ్మము మననమునకును రక్షణమునకును విలక్షణ మగుటవలనను, మంత్రాధ్వాతీతమును సర్వదేశవ్యాపకత్వమును గలుగుటవలనను, పదాధ్వాతీతమును అవర్ణమగుటవలనను, వర్ణాధ్వాతీతమును సర్వతత్త్వవిలక్షణ మగుటవలనను, తత్త్వాధ్వాతీతమును సర్వస్వామి యగుటవలనను, భువనాధ్వాతీతమును నిష్కళ మగుటవలనను కళాధ్వాతీతమును అగును.

శా॥ ఆ కోనేరుగురూత్తముం గొలిచి దివ్యాధ్యాత్మయోగంబు దా
శ్రీకల్యాణగుణప్రసిద్ధుఁ డగుచున్ శ్రీమన్మహాదేవలో
కైకాచార్యుఁడు సంగ్రహించె నతిసౌఖ్యం బొప్ప సాందీపునిన్
శ్రీకృష్ణుండు భజించి విద్య లొనరం జేకొన్న చందంబునన్॥ ౩౧

టీక॥ శ్రీకృష్ణుండు = శ్రీకృష్ణమూర్తి, సాందీపునిన్ = సాందీపమహర్షిని, భజించి = సేవించి, విద్యలు = ఇతిహాసాగమనిగమాదివిద్యలను—లేక అఱువదినాలుగువిద్యలను, ఒనరన్ = లెస్సగా, చేకొన్న చందంబునన్ = గ్రహించినట్లు, శ్రీమత్ = అణిమాద్యష్టసిద్ధులు గల, మహాదేవ = మహాదేవుఁ డనెడు, లోక = చతుర్దశభువనములకు, ఏక = ముఖ్యమైన, ఆచార్యుఁడు = గురువు, శ్రీ = సాత్విక సంపదలు గల, కల్యాణ గుణ = శాంతశమదమాద్యనంతవిధగుణములచేత, ప్రసిద్ధుఁ డగుచున్ = ప్రఖ్యాతిగలవాఁ డయి, ఆ కోనేరు గురూత్తమున్ = ప్రసిద్ధుఁ డగు నా కోనేరుగురువర్యుని, గొలిచి = భజించి, అతిసౌఖ్యంబు = మిక్కిలి బ్రహ్మానందమును, ఒప్పన్ = లభించుటకొఱకు, తాన్ = తాను, దివ్య = అప్రాకృతమైన, అధ్యాత్మ యోగంబు = శివజీవైక్యనిష్ఠను, సంగ్రహించెన్ = చేకొనెను.

తా॥ శ్రీకృష్ణమూర్తి సాందీపమహర్షికి శిష్యుఁడై యితిహాసములు ఆగమములు వేదములు మొదలైన సర్వవిద్యలను గ్రహించినట్లు అణిమాదిసర్వసిద్ధులు గల మహాదేవాచార్యుఁడు శాంతశమదమాది సకల సద్గుణములకు నిధియైన ఆ కోనేరుగురువునకు శిష్యుఁడై బ్రహ్మానందము కలుగుటకొఱకు శివజీవైక్య సమాధిని గ్రహించె నని తాత్పర్యము.

## చతుష్షష్టికళావివరణము.

అఱువదినాలుగువిద్యలు. 'శ్లో॥ ఇతిహాసాగమాః కావ్యాలంకారనాటకాః । గాయకత్వం కవిత్వంచ కామశాస్త్రం దురోదరమ్ । దేశభాషాలిపిజ్ఞానం లిపికర్మచ వాచనమ్ । సర్వాణి గాంధర్వాణి స్వరశాస్త్రం చ శాకునమ్ । సాముద్రికం రత్నశాస్త్రం గజాశ్వరథకౌశలమ్ । మల్లశాస్త్రం సూపకర్మ భూరుహాణాంచ దోహదమ్ । గంధవాదో ధాతువాదః ఖనివాదో రసస్యచ । అగ్నిస్తంభో ఖడ్గస్తంభో జలస్యచ । వాచస్తంభో వయస్తంభో వశ్యాకర్షణ మోహనమ్ । విద్వేషోచ్చాటనం మారణం కాలవంచనమ్ । పరకాయప్రవేశశ్చ పాదుకాసిద్ధిరేవచ । వాక్సిద్ధిర్గుటికాసిద్ధి రైంద్రజాలిక మేవచ । అంజనం పరదృష్టిస్తు వంచనం స్వరవంచనమ్ । మణిమంత్రౌషధాదీనాం సిద్ధిశ్చోరకర్మచ । చిత్రలోహాశ్మమృద్దారువేణుచర్మాంబరక్రియాః । అదృశ్యకరణం దండకరణం మృగయావిధిః । వాణిజ్యం పాశుపాల్యంచ కృషి రాసవకర్మచ । లావకుక్కుటమేషాది యుద్ధకారకకౌశలమ్ । చతుష్షష్టిరేతాః కలా విద్భిః ప్రకీర్తితాః '

## చతుర్దశవిద్యలు.

పదునాలుగువిద్యలు. 'శ్లో॥ అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః । పురాణం ధర్మశాస్త్రంచ విద్యా హ్యేతా శ్చతుర్దశ.'

## అష్టాదశవిద్యలు.

పదునెనిమిదివిద్యలు. 'శ్లో॥ ఆయుర్వేదో ధనుర్వేదో నీతిశాస్త్రార్థశాస్త్రకాః । వేదాంగాని వేదాని మీమాంసా న్యాయవిస్తరః । ధర్మశాస్త్రం పురాణంచ విద్యా హ్యష్టాదశా ఇతి.'

సీ. అఖిలభూతంబుల నాడించుమాయను, సొంపుగా నెవ్వఁ డాడింపు చుండు
గురుజనంబుల కెల్ల గురువులై తగుహరి, హరుల కెవ్వఁడు గురు వగుచు నుండు
వివిధలోకంబుల వెలిఁగించి వెలుఁగుల, మించి యెవ్వఁడు వెలిఁగించు చుండుఁ
బ్రభువుల కెల్ల సత్ప్రభు వైన బ్రహ్మకుఁ, బ్రభుఁ డౌచు నెవ్వఁడు పరఁగు చుండు
తే. సగుణనిర్గుణరూపుఁ డై నెగడు చుండు
నమ్మహాదేవగురువరు నభినుతింప
సకలనిగమాగమాంతశాస్త్రంబు లోప
వనఁగ మముఁబోంట్లకు నుతింప నలవి యగునె. 3౧

టీక ఎవ్వఁడు = ఏమహానుభావుఁడు, అఖిలభూతంబులన్ = బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివ విరాట్పురుషాది సకలజీవులను, ఆడించుమాయన్ = శరీరేంద్రియాదులే ఆత్మ యనెడు భ్రమలోఁ చిక్కించి భ్రమింపఁజేయు మహాప్రకృతిని, సొంపుగాన్ = రమ్యముగా, ఆడింపుచుండున్ = నటింపఁజేయుచుండునో, ఎవ్వఁడు = ఏమహాపురుషుఁడు, గురుజనంబుల కెల్లన్ = ఉత్తమపురుషుల కందఱికిని, గురువులై = కారణపురుషులై, తగున్ = ఒప్పుచున్న, హరిహరులకున్ = విష్ణురుద్రులకు, గురువగుచున్ = జనకుఁడై, ఉండున్ = ఉండునో, ఎవ్వఁడు = ఏమహాపురుషుఁడు, వివిధలోకంబులన్ = నానారూప ప్రపంచములను, వెలిఁగించు వెలుఁగులన్ = ప్రకాశింపఁజేయు సూర్యచంద్రాగ్నులను, మించి = మీఱి, వెలిఁగించుచుండున్ = తేజరిల్లఁజేయుచుండునో, ఎవ్వఁడు = ఏమహానుభావుఁడు, ప్రభువుల కెల్లన్ = ఇంద్రాదిదిక్పతుల కందఱకు, సత్ప్రభు వైన బ్రహ్మకున్ = ఉత్తమనాయకుఁ డయిన పరమేష్ఠికి, ప్రభుఁ డౌచున్ = నియామకుఁడై, పరఁగుచుండున్ = వెలుఁగుచుండునో - ఇట్లనుటచేత బ్రహ్మాదిపంచకర్తలకు నియామకుఁ డనుట, ఎవఁడు = ఏపురుషుఁడు, సగుణ = శాంతశమదమాద్యనంతకల్యాణగుణవిశిష్టమును సగుణోపాసనకార్హమును సకలోపనిషన్మయమును నైనదియు, నిర్గుణ = నిర్వికల్పోపాసనకార్హమును స్వరూపలక్షణలక్షితము నైనదియు నగు, రూపుఁడయి = ఆకృతిగలవాఁ డయి, నెగడు చుండున్ = వర్ధిల్లుచుండునో, అమ్మహాదేవగురువరున్ = ఆ మహాదేవాచార్యవర్యుని, అభినుతింపన్ = కొనియాడుటకు, సకల = సమస్తము లయిన, నిగమ = ఋగ్యజుస్సామాథర్వము లనెడు నాలుగు వేదములయొక్క, ఆగమ = కామికము మొదలు వాతూలము తుదిగాఁ గల యిరువదియెనిమిదిఆగమములయొక్క, అంత = అగ్రము లయిన యుపనిషత్తులను చర్యాక్రియాయోగజ్ఞానపాదము లను నాల్గింటియందుఁ జెప్పఁబడు షడధ్వములతోఁ గూడిన కర్మసాదాఖ్య కర్తృసాదాఖ్య అమూర్తిసాదాఖ్య మూర్తిసాదాఖ్య శివసాదాఖ్య మహాసాదాఖ్యములును, శాస్త్రంబులు = అద్వైత బ్రహ్మ సిద్ధ గౌడ బ్రహ్మనది భామత్యాదిశాస్త్రములును, ఓపవు = శక్తములు కావు, అనఁగన్ = అని వచించుచుండఁగా, మముఁబోంట్లకున్ = మాయట్టివారికి, నుతింపన్ = పొగడుటకు, అలవియగునె = శక్య మగునా ?

తా. బ్రహ్మ విష్ణువు రుద్రుఁడు మహేశ్వరుఁడు సదాశివుఁడు విరాట్పురుషుఁడు మొదలైన సమస్తజీవకోట్లను శరీరేంద్రియాదులే ఆత్మ యనెడు భ్రమలోఁ చిక్కించి భ్రమింపఁజేయు మూలప్రకృతి చిక్కులలో తాను చిక్కక ఆమూలప్రకృతిని వేడుకతో సొగసుగా నాడించుచుండెడువాఁడును, లోకగురువు లైన బ్రహ్మ విష్ణు రుద్రాదులకు జనకుఁడయి యుండువాఁడును, బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివ విరట్పురుషాండములలోఁ గల పదునాలుగులోకములను ప్రకాశింపఁజేయు సూర్యచంద్రాగ్ను

లను ప్రకాశింపఁజేయువాఁడును, దేవేంద్రుఁడు మొదలయిన దిక్పాలకులకు ప్రభువైన బ్రహ్మకు ప్రభువైనవాఁడును, శాంతము శమము దమము మొదలయిన అనంతకల్యాణగుణములు గలవాఁడును, సగుణోపాసకులకు తగినవియును, సకలలోకపావనత్వస్వరూపములైనవియును ఐన బ్రహ్మ విష్ణు రుద్ర సూర్య శ్రీరామ కృష్ణ నృసింహాది రూపములును, సచ్చిదానంద నిత్యనిర్మలాది స్వరూపలక్షణమును గలిగియును, నిర్గుణోపాసకులకుఁ దగినదియును, వేదాంతములచేతఁ దెలియఁదగినదియును ఐన పరబ్రహ్మస్వరూపము గలవాఁడయి ప్రకాశించుచుండెడు ఆ మహాదేవాచార్యుని ఋగ్యజుస్సామాథర్వణము లనెడు వేదములును, వేదాంతము లైన యుపనిషత్తులును, కామికము మొదలైన యిరువది యెనిమిది ఆగమములును, ఆగమాంతము లైన చర్యాక్రియాయోగజ్ఞానపాదము లనెడు నాల్గింటియందుఁ జెప్పఁబడిన షడధ్వములతోఁ గూడిన కర్మసాదాఖ్య కర్తృసాదాఖ్య అమూర్తిసాదాఖ్య మూర్తిసాదాఖ్య శివసాదాఖ్య మహాసాదాఖ్యములును, అద్వైత బ్రహ్మసిద్ధి గౌడబ్రహ్మానందీయము గీతాభాష్యము ఉపనిషద్భాష్యము వేదభాష్యము మొదలైన శాస్త్రములును పొగడుటకు శక్తిలేనివగుచుండఁగా మావంటివారికి పొగడఁదగునా అని తాత్పర్యము.

## ఆగమభేదవివరణము.

ఆగమవిభాగము.— కామికము యోగజము చింత్యము కారణము అజితము దీప్తము సూక్ష్మము సహస్రము అంశుమానము సుప్రభేదము రౌరవము మకుటము విమలము చంద్రజ్ఞానము బింబము ప్రోద్గీతము లలితము సంతానకము సర్వోత్తరము పారమేశ్వరము కిరణము భేదము వాతూలము అనునవి యిరువదియెనిమిదియును ఆగమములు, ఇవి పరమేశ్వరుని పంచముఖములలో సద్యోజాత వామదేవ అఘోర తత్పురుషముఖములు నాల్గింటియందును యిరువదియును, ఈశాన్యముఖమునందు యెనిమిదియును గా బ్రహ్మ నాలుగుముఖముల వలన నాలుగువేదములును పుట్టినట్లు పుట్టెను. ఇందుకు, 'శ్లో॥ లక్షంతు చతురో వేదాః [illegible] పురాణ శాస్త్రకమ్ । షోడశం మాలినీశాస్త్రం ద్వాత్రింశం భరతముచ్యతే । అర్బుదం శిల్పశాస్త్రంతు ఆగమంతు చతుర్దశ । ఆయుర్వేదం త్రిలక్షంచ నాట్యగ్రంథంచ సప్తతిః' అను ప్రమాణముచేత ఆగమసంఖ్య తెలియఁగవలయును. పాంచరాత్ర శాక్తాది సకల సమయమంత్రములకును యీ యాగమములే కారణములు.

## కవివంశానుక్రమణిక.

తే. అమ్మహాదేవగురు చరణారవింద, వర పరాగాంశ భజన తత్పరుఁడఁ బరగు
రామపంతులకులజాతరామ మంత్రి, మౌళి తిమ్మాంబికా ప్రియాత్మజుఁడ నేను.

టీక. అమ్మహాదేవగురు = నా సద్గురువర్యుఁడయిన మహాదేవగురునియొక్క, చరణారవింద = పాదపద్మములయందు, వర = శ్రేష్ఠమయిన, పరాగ = ధూళియొక్క, అంశ = లేశమును, భజన = సేవించుటయందు, తత్పరుఁడన్ = ఆసక్తి గలవాఁడను, పరగు రామపంతులకులజాత = పరగు రామపంతుల కులమందుఁ బుట్టిన, రామమంత్రిమౌళి = అమాత్యశేఖరుఁడయిన రామమంత్రికిని, తిమ్మాంబికా = తిమ్మాంబిక యను నామెకును, ప్రియాత్మజుఁడన్ = ప్రియపుత్త్రుఁడ నైన, నేను = లింగమూర్తి గురుమూర్తి యను పేరు గల నేను.

తా. ఆ మహాదేవగురుని పాదపద్మములయందలి ధూళిలోని పరమాణువును సేవించుటయందు ఆసక్తి గలవాఁడును, పరగు రామపంతులవారికులమునఁ బుట్టిన రామమంత్రికిని, ఆతనిభార్య యగు తిమ్మాంబికకును ప్రియపుత్త్రుఁడును, లింగమూర్తి గురుమూర్తి యనెడు పేరు గలవాఁడను ఐన నేను అని తాత్పర్యము.

## షష్ఠ్యంతములు

క. శ్రీరామనామమంత్రా, కారునకు నసంగనిర్వికారునకు మహా
కారునకు నిర్జితాహం, కారున కజ్ఞానభూమికాదూరునకున్. ౩౮

టీక శ్రీరామనామ = శ్రీరామ యను పేరు గల, మంత్రాకారునకున్ = మంత్రరూపుఁ డయిన వానికిని, అసంగనిర్వికారునకున్ — అసంగ = ఆకాశమువలె దేనిని అంటక యుండువానికిని, నిర్వికారునకున్ = అస్తి జాయతే వర్ధతే పరిణమతే అపక్షీయతే నశ్యతి యనెడు షడ్వికారములు లేనివానికిని, మహాకారునకున్ = విరాడ్విగ్రహుఁ డైన వానికిని, (మహోంకారునకున్ — అనెడు పాఠమందు సర్వోత్కృష్ట మగు ప్రణవస్వరూపుఁ డైనవానికి నని యర్థము) నిర్జితాహంకారునకున్ — నిర్జిత = గెలువఁబడిన అహంకారునకున్ = అభిమానము గలవానికిని, అజ్ఞానభూమికా = ఏడయిన అజ్ఞానభూమికలకు, దూరునకున్ = దవ్వైనవానికిని

తా॥ శ్రీరామమంత్రస్వరూపుఁడును, ఆకాశమువలె దేనిని అంటనివాఁడును, గర్భమున నుండుట పుట్టుట పెరుగుట మదియుట నవయుట చచ్చుట అనెడు వికారములు లేనివాఁడును, విరాట్స్వరూపుఁడును, అహంకారము లేనివాఁడును, బీజజాగ్రము జాగ్రము మహాజాగ్రము జాగ్రత్స్వప్నము స్వప్నము స్వప్నజాగ్రము సుషుప్తి యనెడి అజ్ఞానభూమికలకు దూరమైనవాఁడును అని తాత్పర్యము.

మహాత్యాగిలక్షణము:— క॥ జనియును మృతియును ధర్మం।బున ధర్మము సౌఖ్యదుఃఖములు లే వని నెమ్మనమున దలంచు నెవ్వం। డనఘమతీ యతఁ డహో మహాత్యాగి ధరన్

### అజ్ఞానభూమికావివరణము.

బీజజాగ్రము, జాగ్రము, మహాజాగ్రము, జాగ్రత్స్వప్నము, స్వప్నము, స్వప్నజాగ్రము, సుషుప్తి అని అజ్ఞానభూమిక లేడు అందు నామరూపరహితాఖండపరిపూర్ణసచ్చిదానందపరబ్రహ్మమందు జగత్సృష్టికి కారణముగఁ గలిగిన తెలివియే బీజజాగ్రము, అవిభక్త మగు నా తెలివికి నుండు లేని భేదము నాత్మముగఁ గలిగి ప్రపంచాభిముఖ మగుట జాగ్రము, ఆ లోకవాసన ప్రబలుట మహాజాగ్రము, జాగ్రద్దశయందు చూచినవి చూడనివి సంకల్పించి నిష్ప్రయోజకముగ మనోరాజ్య మేలుట జాగ్రత్స్వప్నము, ఆ జాగ్రమందు కల్పితస్వరూపములఁ జూచుట స్వప్నము, మఱచినదానిఁ దలఁచుట స్వప్నజాగ్రము, ఆత్మప్రతిబింబముగాఁ దోఁచుచున్న జగద్విషయము సుఖ మని దానియందు మునుఁగుట సుషుప్తి

క. ధీరునకు భక్తజనమం, దారునకు నిరంతరాత్యుదారునకు నిరా
ధారునకు నిఖిలజగదా, ధారునకు ననాద్యఖండితశరీరునకున్. ౩౯

టీక ధీరునకున్ = ఆత్మానాత్మవివేకము గలవానికిని, భక్తజనమందారునకున్ = భక్తులకు కల్పవృక్ష మయినవానికిని, నిరంతరాత్యుదారునకున్ — నిరంతర = ఎప్పుడును, అత్యుదారునకున్ = మహాత్యాగము గలవానికిని, నిరాధారునకున్ = తనకుఁ దానే యాధార మయినవానికిని, సకలజగదాధారునకున్ — సకల = సమస్తము లయిన, జగత్ = పదునాలుగులోకములకు, ఆధారునకున్ = ఆశ్రయుఁ డయినవానికిని, అనాద్యఖండితశరీరునకున్ — అనాది = ఉత్పత్తిలేని, అఖండిత = మరణము లేని, శరీరునకున్ = దేహము గలవానికిని

తా. నిత్యానిత్యవస్తువుల నెఱింగినవాఁడును, కల్పవృక్షమువలె భక్తులకోరిక లన్నిటిని యిచ్చు వాఁడును, ఎల్లప్పుడును మహాత్యాగము గలవాఁడును, 'సర్వాధారో నిరాధారః' అను ప్రమాణముచేత తనకు తానే ఆధార మయినవాఁడును, పదునాలుగులోకములకును ఆశ్రయుం డయినవాఁడును, పుట్టుట గిట్టుటలు లేని శరీరము గలవాఁడును అని తాత్పర్యము.

క. వ్యాపకునకుఁ ద్రిశరీరా, లేపకునకు నిర్జితావలేపకునకు ధీ
దీపకునకు సచ్చిత్సుఖ, రూపకున కనంతవిశ్వరూపాత్మునకున్. ౩౮

టీక వ్యాపకునకున్ = అంతట నిండియుండువానికిని, త్రిశరీరాలేపకునకున్ — త్రిశరీర = స్థూల సూక్ష్మ కారణ దేహములను, అలేపకునకున్ = అంటనివానికిని, నిర్జితావలేపకునకున్ — నిర్జిత = జయింపఁ బడిన, అవలేపకునకున్ = గర్వము గలవానికిని, ధీదీపకునకున్ — ధీ = బుద్ధులను, దీపకునకున్ = వెలిఁగించు వానికిని, సచ్చిత్సుఖరూపకునకున్ = సచ్చిదానందస్వరూపుఁ డయినవానికిని, అనంతవిశ్వరూపాత్మునకున్ = అపరిమితజగద్రూపుఁ డయినవానికిని

తా. ప్రపంచమునకు వెలుపల లోపల నిండియుండువాఁడును, స్థూలసూక్ష్మ కారణ దేహములను అంటనివాఁడును, నేను నాది అను అభిమానము లేనివాఁడును, బుద్ధి మొదలగు యింద్రియములను తమతమపనులయందుఁ బ్రవర్తించునట్లు ప్రకాశింపఁజేయువాఁడును, సత్తును చిత్తును ఆనందమును స్వరూపముగాఁ గలవాఁడును, బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివ లోకరూపుఁ డయినవాఁడును అని తాత్ప.

క. శ్రీమ ద్దత్తాత్రేయమ, హామునిసదృశునకు శ్రీమహాదేవగురు
స్వామికిఁ దతసర్వాంత, ర్యామికి విజ్ఞానభూమికారామునకున్. ౩౯

టీక శ్రీమత్ = సంపద్యుక్తుఁ డైన, దత్తాత్రేయమహాముని = దత్తాత్రేయమహర్షితోడ, సదృశు నకున్ = తుల్యుఁ డైనవానికిని, శ్రీమహాదేవ = శోభాయుక్తుఁ డైన మహాదేవుఁ డను, గురుస్వామికిన్ = సద్గురునికి, తత = విస్తార మైన- అనఁగా శ్రేష్ఠ మయిన సర్వప్రపంచమునకును, అంతర్యామికిన్ = లోపల నిండియున్నవానికిని, విజ్ఞానభూమికా = ఏడయిన జ్ఞానభూమికలే, ఆరామునకున్ = ఉద్యానవనము గల వానికిని.

తా. అత్రిమహామునిపుత్త్రుఁ డైన దత్తాత్రేయమహర్షితో సాటియైనవాఁడును, ఓంకారస్వరూపుఁ డైనవాఁడును, శుభేచ్ఛ విచారణ తనుమానసి సత్త్వాపత్తి సంసక్తినామిక పదార్థభావన తురీయము అను జ్ఞాన భూమిక లనెడి వుద్యానవనములయందు విహరించువాఁడును అయిన శ్రీమహాదేవాచార్యునకు అని తా.

## జ్ఞా న భూ మి కా వి వ ర ణ ము.

శుభేచ్ఛ, విచారణ, తనుమానసి, సత్త్వాపత్తి, సంసక్తినామిక, పదార్థభావన, తురీయము అని జ్ఞానభూమిక లేడు, అందు —

శుభేచ్ఛ యనఁగా—బహుజన్మార్జిత సుకృతపరిపాకము వలన గాని తాత్కాలికముగా నైనను ... చేత జ్ఞానము గలవాఁడై ఆహా! నే నేల మూఢుఁడ నయితిని, ఈయపారసంసారసాగర మెట్లు దాఁట గలనని పరితపించి సజ్జనులచేరువఁ జేరి వారి యపారకరుణాపూరసేవనంబున గురూపంబు లగు తాపంబుల దీర్చి పిమ్మట వారల యుపదేశబలంబున సత్కర్మాచరణమును, వేదాంతశాస్త్రపరిజ్ఞానమును, ఇహపర లోకభోగవిరక్తియును గలిగి మోక్షము నపేక్షించుట.

విచారణ యనఁగా — అద్వైతశాస్త్రపరిజ్ఞానంబును, సత్సంగమంబును, వైరాగ్యంబును గలిగి బ్రహ్మ మెయ్యది యని విచారించుట.

తనుమానసి యనఁగా — ఈ రెండుభూమికలసాధన పూర్ణముగాఁ గలిగి కారణము లగు విషయేంద్రియముల త్రిప్పులలోఁ దగులక మనస్సును క్షీణింపఁజేయుట, వీనికి అసంగమ మని మఱియొక పేరు గలదు, ఆ యసంగమము సామాన్య మని విశేష మని ద్వివిధము, మఱియు నది సామాన్యవిశేష భేదములచేత నాల్గువిధములు, అందు సామాన్యాసంగమ మనఁగా — శబ్దాదివిషయములయందు నేను కర్తను భోక్తను గురువును శిష్యుఁడను బాధ్యుఁడను బాధకుఁడను గాను, సుఖదుఃఖము లీశ్వరాధీనములు, సంయోగవియోగ భోగ రాగాదులు కాలవశము లని యెంచి దేనియం దాశ లేక యుండుట. సామాన్యసామాన్యాసంగమ మనఁగా — సంచితకర్మములచేత లభ్యము లైన సుఖదుఃఖములయందు ప్రియాప్రియములు లేక, వాని నంటక ముందు విచారించిన వేదాంతమహావాక్యార్థనిశ్చయమందు జేరుట. విశేషాసంగమ మనఁగా — సత్సహవాసము వలనను, అపరోక్షజ్ఞానమువలనను, పురుషప్రయత్నమువలనను, జ్ఞానశాస్త్రముల సంతతాభ్యాసమువలనను, పరమవస్తువు కరతలామలకమై కనఁబడుచుండఁగా సంసారసాగరోత్తారకమై పరతత్త్వస్థితిఁ జెంది సకలము నీశ్వరాధీన మనుటను, కర్మమే సుఖదుఃఖములకుఁ గారణ మగుటను మాని మౌనియై పరమశాంతి గలిగి యుండుట. విశేషవిశేషాసంగమ మనఁగా — బాహ్యాంతరములను ఊర్ధ్వాధఃప్రదేశములను దిక్కులను ఆకాశమును స్థావరజంగమజంతువులను చీఁకటివెలుతురులను చిజ్జడములను సకలవస్తువులను పదార్థానుభవములను వేఱుగాఁ జూడక అఖండాకారముగఁ జూచుచు చిత్తవిశ్రాంతి గలిగి నిస్సంకల్పుఁడై ముందు దర్శించిన యాత్మయందు మనస్సు కరఁగుట. ఈ మూఁడుభూమికలలో దేనినైన నభ్యాసము చేయుచుండిన మృతు లైన యోగులు దేవవిమానములయందు దేవతాస్త్రీలతోఁ గూడి స్వర్గవైకుంఠకైలాసాదిపుణ్యలోకములయందు సకలదివ్యభోగములు చిరకాల మనుభవించిన వెనుక, 'శ్లో॥ శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టో హి జాయతే । అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్' అను గీతావచనప్రకారముగా, భూలోకంబున శ్రీమంతులయింటఁ బుట్టి పూర్వము తాను విడిచిన నెలవునఁ జేరి క్రమక్రమముగా నావల భూమిక నెక్కును, మూఁడుభూములవఱకు జన్మము గలదు, తక్కిన భూమికలయందు జన్మము లేదు.

సత్త్వాపత్తి యనఁగా — ఈ మూఁడుభూమికల నభ్యసించి యింద్రియార్థములయం దాశ మాని శుద్ధాంతరంగుఁడయి యితరసంకల్పములు లేక బ్రహ్మనిష్ఠ గలిగి యుండుట.

సంసక్తినామిక యనఁగా — ఈ నాల్గుభూమికల యభ్యాసమువలన విషయసంగము గుణత్రయసంగమంబులు లేక బ్రహ్మనిష్ఠయందు పట్టు దప్పక యుండుట.

పదార్థభావన యనఁగా — ఈ యైదుభూమికలయభ్యాసవిశేషముచేత అంతర బహిర్మధ్య దృశ్యములు లేక స్వాత్మారాముఁడయి బ్రహ్మము నేననుట.

తురీయ మనఁగా — ఈ యాఱుభూమికలమార్గముల నెఱిఁగి యేమియు భేదము లేమిఁ దెలిసి బ్రహ్మమాత్రముగా నుండుట, దీనిలో మొదటి మూఁడుభూమికలు జగద్వ్యాపారము గలవి గావున జాగ్రదవస్థ యగును, నాల్గవభూమికయందు నామరూపములు గల జగత్తు స్వప్నమువలె తోఁచును గాన అది స్వప్నావస్థ యగును ఇట్టి యనుభవము గలవాఁడే బ్రహ్మవిదుఁడు. ఐదవభూమియందు నిర్వికల్పమై సుషుప్తివలె సుఖముగా జగము తోఁచుటవలన అది సుషుప్త్యవస్థ యగును, ఈ యనుభవము గల యోగియే బ్రహ్మవిద్వర్యుఁడు. ఆఱవభూమిక సర్వవాసనాశూన్యమైన

సమూహః- కైలంతే నాస్యతే స్థీయత ఇతి కైలాసః' అని వ్యుత్పత్తి. అసఉపవేశనే అనిధాతువు. కేలి యనఁగా ఆనందము, దానిగుంపు కైలము, దానిచేత నుండునది గాన కైలాసము, ఆనంద రూప మని భావము ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ అని శ్రుతి

తా॥ ధర్మార్థకామమోక్షముల నిచ్చునట్టి త్రిగుణలయావస్థారూప మైన శుద్ధసత్త్వమునకు వునికిపట్టయినదియును, పరబ్రహ్మస్వరూపుఁ డైన పురుషునకును పరబ్రహ్మశక్తి యైన మూలప్రకృతికిని వాసమైనదియును, సూర్యచంద్రాగ్నుల కాంతులను మీఱి వెలుఁగునదియును, జీవేశ్వరజగద్వికారములు లేనిదియును, నిర్వికల్పజ్ఞానస్వరూప మయినదియు నగు నిత్యానందరూపపరబ్రహ్మము ప్రకాశించు చుండు నని తాత్పర్యము

టీక పర్వతపర మైన అర్థము - శ్రీసుఖదశుద్ధసత్త్వావాసము = ధర్మమును అర్థమును కామమును మోక్షమును యిచ్చెడు నిర్మల సత్త్వగుణసంపన్ను లయిన బ్రహ్మర్షులకు స్థాన మైనదియును, శివపార్వతీ నివాసము = నిత్యమంగళస్వరూపుఁ డైన సాంబమూర్తికిని పార్వతీదేవికిని వునికిపట్టయినదియును, మహాభాసము = మిక్కిలి యెక్కువ యైన కాంతిచేత వెలుఁగునదియును, అనహంభాసము = అహంకార మమ కారము లేనిదియు నైన, కైలాసము = కైలాసపర్వతము, దిద్విలాసం బగుచుఁ = ప్రకాశమాన మైన వెన్నెలవింతలు గలదై, తనరారుఁ = ఒప్పిద మగును, 'వ్యు॥ కే శిరసి శివయో ర్లాసో నృత్యో౽స్మి న్నితి కైలాసః' - శిఖరభాగమందు పార్వతీపరమేశ్వరుల నాట్యము గలిగి, 'కేలయో ర్జలభూమ్యో రాసనం స్థితి ర్యస్య సః కైలాసః, స్ఫటికం త స్యాయం కైలాసః' జలభూములయందుండునది గనుక కైలాసము, అనఁగా స్ఫటికము, దానిసంబంధ మైనది.

తా॥ ధర్మార్థకామమోక్షముల నిచ్చెడు నిర్మలసత్త్వగుణసంపన్ను లయిన బ్రహ్మఋషులకు నివాస మైనదియును, పార్వతీపరమేశ్వరులకు వునికిపట్టయినదియును, మహాతేజస్సు గలదియును, అహంకార మమకారములు లేనిదియును, మిక్కిలి వింతలు గలదియు నయిన కైలాసపర్వతము ఒప్పిద మగు చుండు నని తాత్పర్యము.

## కథా ప్రా రం భ ము.

వ॥ అది మఱియు నాదిమధ్యాంతరహితంబును, స్వజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యంబును, నిత్యాపరోక్ష స్వప్రకాశావభాసితానంతకోటిసూర్యచంద్రానలాలోకంబును, వేదశాస్త్రపురాణేతిహాసాగమాగమ్యంబును, బహువిధవర్ణ ధర్మకర్మగుణనామరూపవికారశక్తి వివర్జితంబును, బ్రహ్మేంద్రాద్యమరాసురోరగ గరుడ గంధర్వ కిన్నర కింపురుష సిద్ధ సాధ్య విద్యాధర చారణాప్సరో యక్ష గుహ్యకభూతఖేచర దేవర్షిబ్రహ్మఋషీశ్వర యోగీశ్వర మునీశ్వర యతీశ్వర కవీశ్వ రాద్యుపాస్యంబును, నిత్యనిర్గుణనిర్వికల్పనిర్వికారనిరంజననిర్విషయాతీంద్రియా వాఙ్మానసగోచరాప్రమేయశుద్ధబుద్ధముక్తకేవలాఖండసచ్చిదానందమయంబు నైన తురీయాతీతపరతత్త్వకైలాసంబున నవ్యక్తమహదాదిసప్తావరణపరివేష్టితంబును, చతుర్దశలోకకందరమందరంబును, సార్వభౌమాది హిరణ్యగర్భాంతానందగండ శైలభాసురంబును, భాను సోమ నక్షత్ర తారాగ్రహ పావక సౌదామన్యాది

దేవియు నగు శ్రీమహాదేవి యతిప్రీతిపూర్వకంబుగాఁ జతుర్విధశుశ్రూషలు గావిం
చుచు సేవించుచుఁ బూజించుచు భావించుచు నమస్కరించుచు నారాధించిన
బ్రసన్నుండై మెచ్చి నీకు నెయ్యది యిష్టం బిచ్చెద నడుగు మనిన సంతోషభరిత
చిత్తయై యమ్మత్తకాశిని చిఱునవ్వునగుచు నిట్లనియె. ౪౦

టీక అది = ఆ మహాకైలాసపర్వతము, ఆ పరబ్రహ్మ మని యర్థాంతరము, మఱియుఁ = మఱి యును, ఆది = మొదలును, మధ్య = నడుమను, అంత = చివరయును, విహీనంబును=లేనిదియును, అని పర్వతపరము, ఉత్పత్తి స్థితి నాశనములు లేనిదని పరబ్రహ్మపరము, స్వజాతీయ = తనజాతి యగు పర్వతములును, విజాతీయ = అన్యజాతు లగు వృక్షలతాగుల్మాదులును, స్వ = తనయందు, గత = పొందఁబడిన పాషాణాదులు ననెడు, భేదశూన్యంబును=వేఱుపాటు లేనిదియును, అని పర్వతపరము, 'శ్రు॥ ఏక మేవా ద్వితీయం బ్రహ్మ' యను శ్రుతివలన స్వజాతిశూన్యమును, 'బ్రహ్మమాత్ర మసన్నహీతి' అను శ్రుతివలన విజాతిశూన్యమును, 'నచక్షు రశ్శ్రోత్ర మపాణి పాదమ్' అనెడి శ్రుతివలన స్వగత భేదశూన్యము నని పర బ్రహ్మపరము, లేక, ఏక మేవ అనుటవలన స్వజాతిశూన్యమును, అద్వితీయ మనుటవలన విజాతిశూన్య మును, బ్రహ్మ యనుటవలన స్వగత భేదశూన్యమును, ఏక మేవాద్వితీయం బ్రహ్మ యను శ్రుతిచేతనే త్రిపరిచ్ఛేదరహితము చెప్పవచ్చు నని కొందఱు నిత్య = శాశ్వతమును, అపరోక్ష = స్వానుభవైకగమ్య మయిన, స్వప్రకాశ=తన తేజస్సుచేత, అపహసిత = తిరస్కరింపఁబడిన, అనంతకోటి=అనేకకోటులు, సూర్య చంద్రానల = సూర్యచంద్రాగ్నులయొక్క, ఆలోకనంబును = తేజస్సు గలదియును, శుభయాత్రసమము, వేద=ఋగ్వాది చతుర్వేదములచేత, శాస్త్ర=తర్క వ్యాకరణ ధర్మశాస్త్ర మీమాంస వైద్య జ్యోతిషము లనెడు షట్ఛాస్త్రములచేత, పురాణ=బ్రహ్మాండాద్యష్టాదశపురాణములచేత, ఇతిహాస = భారతాది యితి హాసములచేత, ఆగమ = కామికాది వాతూలాంతాష్టావింశన్మహాదాగమములచేత, అగమ్యంబును = చక్కఁగాఁ దెలియఁదగినది, పర్వతపరము, అగమ్యంబును= తెలియ నలవిగానిది, పరబ్రహ్మపరము, బహు విధ=అనేకవిధము లైన, వర్ణ = నీలపీతాదివర్ణములును, పర్వతపరము, బ్రాహ్మణాదివర్ణములు, పరబ్రహ్మ పరము, ధర్మ=హ్రస్వదీర్ఘాదిధర్మములు నని పర్వతపర, చాతుర్వర్ణ్యోచితధర్మానుష్ఠానము లని పరబ్రహ్మపర; కర్మ=చలనధావనపాదికర్మలు నని పర్వతపర, వర్ణాశ్రమోచితకర్మము లని పరబ్రహ్మపర, గుణ = రాగాది గుణము లని పర్వతపర, సత్త్వరజస్తమోగుణము లని పరబ్రహ్మపర, నామ=కైలాసనామేతరనామము లని పర్వతపర, రామకృష్ణాదినామము లని పరబ్రహ్మపర, రూప = శ్వేతరూపేతర రూపము లని పర్వతపర, మత్స్యకూర్మాదిరూపము లని పరబ్రహ్మపర; వికార=స్థిరత్వేతరవికారము లని పర్వతపర; షడ్భావవికా రము లని పరబ్రహ్మపర, శక్తి = కఠినేతరశక్తులు నని పర్వత, సర్వస్వతంత్ర నిత్యములుప్త అనంత అనాది బోధ సర్వజ్ఞత్వ నిత్యతృప్తులను షడ్విధశక్తులు నని పరబ్రహ్మపర, విరహితంబును=లేనిదియును, బ్రహ్మ= చతుర్ముఖుండు, ఇంద్ర = దేవేంద్రుఁడు, ఆది = మొదలుగాఁగల, అమర=దేవతలును, అసుర=దైత్యులును, ఉరగ=అనంతాది సర్పములును, గరుడ=గరుడులును, గంధర్వ=హాహాహూహూ మొదలగు గంధర్వులును, కిన్నర = అశ్వముఖము నరశరీరము గల కిన్నరులును, కింపురుష=నరముఖము అశ్వశరీరము గల విశ్వావసు పరావసు ప్రభృతు లగు కింపురుషులును, సిద్ధ = సిద్ధులును, సాధ్య=సాధ్యులును, విద్యాధర=జీమూతవాహ నుఁడు లోనగు విద్యాధరులును, చారణ = చారణులును, అప్సర = ఊర్వశీప్రభృతు లగు నప్సరసలును, యక్ష = కుబేరాదియక్షులును, గుహ్యక = మాణిభద్రుఁడు మొదలైన గుహ్యకులును, భూత = గ్రహము లును, ఖేచర = సూర్యాదిగ్రహములును, దేవర్షి = నారదాదులును, బ్రహ్మఋషీశ్వర = సనకాదులును,

యోగీశ్వర = కపిలదత్తాత్రేయాదులును, మునీశ్వర = అగస్త్యాదులును, యతీశ్వర = గోవింద భగవత్పాద శ్రీశంకరాచార్యాదులును, కవీశ్వర = వాల్మీకి లోనగు కవులును, ఆది = మొదలగువారిచేత, ఉపాస్యంబును = సేవింపఁదగినదియును, శుద్ధ చిన్మాత్రమును, నిత్య = కాలత్రయాబాధ్యమును, నిర్గుణ = ప్రకృతిగుణశూన్యమును, నిర్వికల్ప = సంకల్పవికల్పరహితమును, నిర్వికార = షడ్భావవికారములు లేనిదియును, నిరాకారా = ఆకారము లేనిదియును, నిరంజన = సాధనాంతరాపేక్ష లేనిదియును, నిర్విషయ = శబ్దాది విషయములు లేనిదియును, అతీంద్రియ = నేత్రశ్రోత్రాదీంద్రియముల నతిక్రమించినదియును, అవాఙ్మనస గోచర=మనోవాక్కుల కందరానిదియును, అప్రమేయ=కొలఁది యిడఁగానిదియును, శుద్ధ = నిర్మలమును, బుద్ధ=జ్ఞానైకవేద్యమును, ముక్త=సర్వసంగసంబంధము లేనిదియును, కేవల= ఏకస్వరూపమును, అఖండ= భాగింపఁగూడనిదియును, సచ్చిదానందమయంబును = సత్యజ్ఞానానందస్వరూపమును, ఐన ॥ ఐనట్టి, తురీయ = చతుర్థావస్థకంటె, అతీత = పంచమావస్థకంటె, పర = మిగిలిన, తత్త్వ = యథార్థస్వరూపమగు పరబ్రహ్మ మనెడు, కైలాసంబునకు = మహాకైలాసమునందు-అనఁగా జాగ్రత్స్వప్నసుషుప్తుల నెడు మూఁడవస్థలను మీఱినది తురీయము, అదియే గుణసామ్యావస్థ, ఈ నాల్గవస్థలను పదిరూపంబుభాగములుగ చేయఁగా పదియేనుభాగములను మీఱినది అతీతము, అదియే అవికల్పావికల్పావస్థ, దానికి విలక్షణమైన పరబ్రహ్మమును మహాకైలాసాచలమం దనుట. అవ్యక్త = మూలప్రకృతి, మహత్ = జగదంకురమైన మహత్తత్త్వమును, ఆది = మొదలైన, సప్తావరణ = యేడు ప్రాకారములచేత, పరివేష్టితంబును = ఆవరింపఁబడినదియును - అనఁగా అవ్యక్త మహత్తత్త్వ పంచతన్మాత్రలను సప్తప్రాకారములు గల దనుట. చతుర్దశలోక కందరసుందరంబును—చతుర్దశలోక = పదునాలుగులోకములు అనెడు, కందర = గిరిగుహలచేత, సుందరంబును = మనోహరమైనదియును, సార్వభౌమాది = చక్రవర్తి మొదలుగా, హిరణ్యగర్భాంత = చతుర్ముఖబ్రహ్మవఱకుఁ గలవారియొక్క, ఆనంద = సుఖము లనెడు, గండశైల = గొప్పరాళ్ళచేత, భాసురంబును = ప్రకాశించుచున్నదియును - అనఁగా చక్రవర్తి, మనుష్యగంధర్వులు, దేవగంధర్వులు,

## ఆనందముల వివరణము.

పితృదేవతలు, ఆజానజాను లను దేవతలు, కర్మదేవతలు, దేవతలు, ఇంద్రుఁడు, బృహస్పతి, నవబ్రహ్మలు, చతుర్ముఖబ్రహ్మ వీరి యానందము లొకరియానందముకంటె మఱియొకరియానందము నూఱింతలు హెచ్చువరమై యుండును. ఎట్లనఁగా, సార్వభౌమానందముకంటె నూఱింత లెక్కువైనది మనుష్యగంధర్వానందమగును. ఇవ్విధముగా ఆనందముల తారతమ్యము తెలియఁదగినది. ఇందుకు "శ్రుతి॥ స ఏకో మానుష ఆనందః, తేయే శతం మానుష ఆనందాః- స ఏకో మనుష్యగంధర్వాణా మానందః శ్రోత్రియస్య చాకామహతస్య, తేయే శతం మనుష్యగంధర్వాణా మానందః- స ఏకో దేవగంధర్వాణా మానందః శ్రోత్రి. తేయే శతం దేవగంధర్వాణా మానందాః- స ఏకః పితౄణాం చిరలోకలోకానా మానందః శ్రోత్రి, తేయే శతం పితౄణాం చిరలోకలోకానా మానందాః- స ఏకః ఆజానజానం దేవానా మానందః శ్రోత్రి, తేయే శతమాజానజానాం దేవానామానందాః - స ఏకః కర్మదేవానాం మానందః శ్రోత్రియస్య చాకామహతస్య, తేయే శతం కర్మదేవానాం మానందాః - స ఏకో దేవానా మానందః శ్రోత్రి, తేయే శతం దేవానా మానందాః - స ఏకః ఇంద్రస్యానందః శ్రోత్రి, తేయే శత మింద్రస్యానందాః - స ఏకో బృహస్పతేరానందః శ్రోత్రి, తేయే శతం బృహస్పతేరానందాః- స ఏకః ప్రజాపతే రానందః శ్రోత్రి, తేయే శతం ప్రజాపతే రానందాః- స ఏకో బ్రహ్మణఆనందః శ్రోత్రి, స యశ్చాయం పురుషే. [illegible] త్మానుషో మనుష్యగంధర్వాణాం దేవగంధర్వాణాం పితౄణాం చిరలోకలోకానా మాజానజానాం

కర్మదేవానాం దేవానా మింద్రస్య బృహస్పతేః ప్రజాపతే బ్రహ్మణ స్స యశ్చ సంక్రామతి' అని తైత్తిరీయము భాను = సూర్యుఁడు, సోమ = చంద్రుఁడు, నక్షత్ర=ధృవాది నక్షత్రములు, తారా= అశ్విన్యాదితారలును, గ్రహ = అంగారకాదిగ్రహములును, పావక = అగ్నియును, సౌదామన్యాది = మెఱుపు మొదలైన, వివిధ = నానావిధము లైన, తేజః = దీప్తు లనెడు, రత్న = మణులయొక్క, శర్కరిలంబును = మెఱపయినుక గలదియును, ప్రవిమల=నిర్మల మయిన, వైరాగ్య = విరక్తియును, ఉపరతి= చిత్తవిశ్రాంతియును, ఏకాంత = నిశ్చలచిత్తమును, అత్యంత ముముక్షుతా = తీవ్రమోక్షేచ్ఛయు ననెడు, అధిత్యక = పర్వతోర్ధ్వభూమియందు మొలచిన, అధ్యాత్మ = ఆత్మవిషయిక మైన, ఆనందజీవన=సంతోష మను రసముచేత, అభిషిక్త = తడుపఁబడిన, నిర్మల = స్వచ్ఛమైన, నిశ్చల = చంచలము లేకుండుట యనెడు, కలికా = మొగ్గలతోడ, కలిత = కూడిన, ఫలిత = పరిపక్వమైన, నిష్కాము = కోరికలేని,

## ఇష్టాపూర్తకర్మములవిభాగము.

కర్మ = ఇష్టాపూర్తకర్మములును, 'శ్లో॥ అగ్నిహోత్రం తపస్సత్యం వేదానాం చానుపాలనమ్ । ఆతిథ్యం వైశ్వదేవంచ ఇష్టమి త్యభిధీయతే । వాపీ కూప తటాకాది దేవతాయతనానిచ । అన్నప్రదాన మారామః పూర్ణమి త్యభిధీయతే ' లేక నిత్యనైమిత్తికకర్మములును, ఉపాసనా = దేవతాంతరమంత్రోపాసన ములును - యాగపాకహవిస్సోమ సంస్థాది యజ్ఞములును, యోగ = యమాద్యష్టాంగసహిత మంత్ర లయ హఠ రాజయోగములును, జప = గాయత్ర్యాది మంత్రజపములును, తపః = కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులును, సత్య = యథార్థము పలుకుటయును, శౌచ = అంతరబహిర్మలవిమోచనమును, దయా = భూతకారుణ్యమును, శీల = సత్ప్రవర్తనమును, వ్రత = బ్రహ్మచర్యాదివ్రతములును, దాన = అన్నాది దానములును, ఆది = మొదలైన వనెడు, నానావిధ = పెక్కుతెఱఁగు లైన, అనోకహ - వృక్షములు గల, ఉద్యాన = ఉపవనములచేత, విరాజితంబును = శోభిల్లుచున్నదియును, శాస్త్ర = తర్కవ్యాకరణాది షట్శాస్త్రము లనెడు, పుష్ప = పూవులతోడ, ఉపేత = కూడిన, నిగమ = వేదములయొక్క, ఆగమ = కామికాద్యాగమములయొక్క, అంత = అగ్రము లైన అష్టోత్తరసహస్రసంఖ్యా కోపనిషత్తులును - చర్యా క్రియా యోగ జ్ఞాన పాదములయందలి కర్మకర్తృ మూర్తి అమూర్తి శివ మహాపాదార్థ ప్రతిపాదకవాక్యము లనెడు, కల్పలతా = కల్పవృక్షములచేత, విలసితంబు = ఒప్పిద మగుచున్నది

## షడ్విధసమాధిలక్షణము

యును, షడ్విధసమాధి=అంతరశబ్దానువిద్ధ సవికల్పక మనియు బాహ్యశబ్దానువిద్ధ సవికల్పక మనియు అంతర దృశ్యానువిద్ధ సవికల్పక మనియు బాహ్యదృశ్యానువిద్ధసవికల్పక మనియు బాహ్యనిర్వికల్పక మనియు అంతరనిర్వికల్పక మనియు ఆఱువిధము లయిన సమాధు లనెడు సౌధ రాజగృహములచేత, విభ్రాజితంబును= ప్రకాశించుచున్నదియును, పరమ=నిరతిశయ మైన, అధ్యాత్మవిద్యా=బ్రహ్మజ్ఞానమువలనఁ బుట్టిన, ఆనంద= బ్రహ్మానంద మనెడు, జల=ఉదకములచేత, అభిషిక్త=తడుపఁబడిన, నిర్మల=పరిశుద్ధ మైన, చిత్త=ఉల్లము నందలి, వృత్తి = వృత్తిజ్ఞాన మనెడు, అంగణ=ముంగిటియందు, శమ=అంతరింద్రియనిగ్రహము, దమ=బహిరింద్రియ నిగ్రహము, ఉపరతి = జీవబ్రహ్మైక్యసమాధివిధిచేత విధ్యుక్తకర్మత్యాగము, తితిక్షా=శీతోష్ణసుఖ దుఃఖాది ద్వంద్వసహనము, శ్రద్ధా = గురు వేదాంతశాస్త్రములయందు విశ్వాసము, సమాధాన = గురూప దిష్టార్థములను శాస్త్రములలోఁ జూచి మనస్సంశయము నివారించుకొనుట, అమానిత్వ=నిరభిమానము, అదంభిత్వ=నిష్కాపట్యము, ఆది=మొదలైన, కల్యాణగుణ= మంగళగుణము లనెడు, మణిగణ = రత్నములతో నమర్చిన, రంగవల్లీ=ముగ్గులచేత, ప్రకాశితంబును=భాసించునదియును, నిరతిశయ=మహత్తరమైన, కైవల్య=

మోక్షమనెడు, భాండాగార=బొక్కసముచేత, శోభితంబును=ప్రకాశించునదియును, ఫలకామనాభావ=ఫలాపేక్షయందు ఆసక్తిలేని, స్వభావ = నైసర్గికములైన, నియత=విధ్యుక్తములైన, కర్మ=కులాచారకర్మములను, ఆచరణ = ఆచరించుటవలనఁ గలిగిన, చిత్తశుద్ధి=మనఃపారిశుద్ధ్యమును, సర్వకర్మ=సకలములైన త్రికరణముల దుష్టవ్యాపారములయొక్క, పరిత్యాగ=విడుచుట, గురు=ఆచార్యునియందలి, భక్తి=విశ్వాస

## శ్రవణమనననిదిధ్యాసనముల వివరణము

మును, వేదాంత = ఉపనిషదర్థములను, శ్రవణ=వినుట, మనన = వినిన శ్రుత్యర్థములను యుక్తులచేత నేకవాక్యము చేసి చింతన చేయుట, నిదిధ్యాసన = ఆ మననముచేత విజాతీయము లగు కామక్రోధాది దుర్గుణములను వీడి సజాతీయ మైన అహం బ్రహ్మాస్మి యను నిరంతరచింతనము- వీనికి ప్రయోజన మేమనఁగా, నిరంతరశ్రవణముచేత సకలసంశయములును, మననమున నసంభావనయును, నిదిధ్యాసనమున విపరీతభావనయును నశించును, ప్రతిబంధబాహుళ్యము గలవాఁడు సర్వదా మూఁడును వాడుక చేయవలయును, ప్రతిబంధనివృత్తి గల సూక్ష్మబుద్ధి గలవారికి శ్రవణకాలమందే మనననిదిధ్యాసనములు సిద్ధించును. జ్ఞాన=స్వస్వరూపజ్ఞానము, ఆది=మొదలయిన వనెడు సోపాన=మెట్లతోడ, సమన్విత = కూడిన, విజ్ఞాన = అనుభవజ్ఞానమనెడు, రాజమార్గ=రాజవీథులచేత, లలితంబును = మనోహర మైనదియును, పంచాక్షరీ=నమశ్శివాయ యను పంచవర్ణాత్మక మైన, మహామంత్ర=గొప్పమంత్ర మనెడు, మాణిక్య=శోణరత్నరచిత మైన, తోరణ=బహిర్ద్వారములచేత, అలంకృతంబును=అలంకరింపఁ బడినదియును, ప్రణవనాద=చిణి మొదలగు దశవిధము లైన ఓంకారధ్వను లనెడు, మంగళవాద్య=శుభవాద్యములయొక్క, రవ=ఘోషములచేత, పూరితంబును=నిండింపఁబడినదియును, అగు=ఇనట్టి, తురీయ = ఉన్మన్యవస్థ యనెడు, మహాస్థానమంటప=గొప్పగొలువుచావిడియొక్క, అంతరంబునన్=నడుమను, సర్వ=అశేషములైన, ఉపనిషత్ = వేదాంతములయొక్క, సారభూత = స్థిరాంశ మైన, బ్రహ్మ=తత్పదలక్ష్యార్థ మైన పరబ్రహ్మమునకును, ఆత్మ= త్వంపదలక్ష్యార్థ మైన ప్రత్యగాత్మకును జహదజహల్లక్షణములచేత, ఏకత్వ=ఒకటిగా నుండుటను, దర్శన=చూపించెడు, గూఢస్వరూప మైన, ఓంకార = ప్రణవమను, సింహాసన = సింహపీఠమందు, ఆసీనుండై = కూర్చున్నవాఁడై, శుద్ధసత్త్వ=గుణసామ్య మైన, ప్రధాన=ప్రకృతి యగు, మాయామయ=మాయోపాధికారణ మయిన, దివ్య=అప్రాకృత మయిన, శోభన=నిత్యమంగళకర మయిన, విగ్రహుండును = శరీరము గలవాఁడును- అనఁగా విరాడ్విగ్రహుఁ డని భావము, సర్వజ్ఞత్వ = సమస్తము నెఱుఁగుట, సర్వేశ్వరత్వ=సమస్తమునకు ప్రభువగుట, సర్వాంతర్యామి=అంతటనిండియుండుట, సర్వస్రష్టృత్వ=సర్వమును సృష్టించుట, సర్వరక్షకత్వ=సమస్తమును పాలించుట, సర్వసంహారకత్వ = సమస్తమును లయింపఁజేయుట, ఆది= మొదలగు, అగణిత=లెక్కపెట్టఁగూడని, సమగ్ర=సంపూర్ణము లయిన, సుగుణపరిగ్రహుండును = సద్గుణములు గలవాఁడును, సత్యజ్ఞానానందస్వరూపుఁడును— సత్య = పరిచ్ఛేదత్రయశూన్యమును, జ్ఞాన = స్వాతిరిక్తవస్తుశూన్యజ్ఞానమును, ఆనంద = నిరతిశయసుఖమును అనునవియె, స్వరూపుఁడును = స్వరూపలక్షణము గలవాఁడును, సర్వవ్యాపకుండును = సర్వప్రాణులయం దంతర్యామిరూపమున నుండువాఁడును, దేవదేవుండును— దేవ = ఇంద్రియాదిదేవతలకు, దేవుండును = అధిష్ఠాతయును, అగు శ్రీమహాదేవుండు—అగు నట్టి, శ్రీ=నిత్యమంగళవిభూతి గల, మహాదేవుండు = సాంబమూర్తి, మూర్తిమంతంబులు = స్వస్వరూపముల ధరించినవి, ఐన చతుర్వింశతితత్త్వంబులును= ఐనట్టి పంచభూత విషయపంచక చతుర్దశేంద్రియము లనెడి యిరువదినాలుగు తత్త్వములును, ఇచ్ఛా=సృష్టీచ్ఛారూప మైన శక్తియును, జ్ఞాన=స్థితిరూప మైన శక్తియును, క్రియా = సంహారరూప మైన శక్తియును, ఆదిశక్తులును = మొదలగుశక్తులును, ఇక్కడ ఆదిశబ్దముచేత

సృష్టిస్థితిసంహారములకు కారణ మైన ఆదిశక్తియును, ఈ చతుర్విధశక్తులకు ముందుగా నిష్కారణమై యుండు పరాశక్తియును గ్రీవాణములు, వ్యాపీకేశ్వర=విష్ణువు, వాణీశ్వర=బ్రహ్మ, సురేశ్వర=ఇంద్రుఁడు, నందికేశ్వర=నంది, భృంగీశ్వర=భృంగి, విఘ్నేశ్వర = వినాయకుఁడు, కుమార = స్కందుఁడు, ఆది=మొద లయిన, ప్రమథగణ = పారిషదసమూహముయొక్క, అధీశ్వరులును = ప్రభువులును, బ్రాహ్మీ మాహేశ్వర్యాది సప్తమాతృకలును = బ్రాహ్మి మాహేశ్వరి కౌమారి వైష్ణవి వారాహి ఇంద్రాణి చాముండి అను సప్తమాతృకలును, స్వసాన్నిధ్యంబునన్ = తనసన్నిధానమందు, నిజ=స్వకీయ మగు, కరుణ= దయతోఁ గూడిన, కటాక్షవీక్షణంబున్ = క్రేగంటిచూపును, అపేక్షించి = కోరి, కొలువన్ = సేవింపఁగా, స్వస్వరూపావలోకనంబు—స్వ=తనదైన, స్వరూప=ప్రత్యగ్వస్తుస్వరూపముయొక్క, అవలోకనంబు=దర్శనమును, చేయుచున్ = కావించుచు, ఆత్మారాముండై = తనయందు తానుతానుగ క్రీడించుచున్నవాఁడై, ఉన్న సమయంబునన్ = ఉన్నప్పుడు, తదీయ = అట్టి తనసంబంధ మైన, వామ = యెడమభాగము, అర్ధశరీరిణి యున్ = సగము దేహముగాఁ గలదియును, పరాపరప్రకృతిస్వరూపిణియున్ = పర అపర పరాపర అను త్రివిధప్రకృతులే స్వరూపముగాఁ గలదియును, నిఖిల = సమస్తము లయిన, జగత్ = త్రిలోకములకు, ఉపాదానకారణభూతయున్ = ఘటపటములకు మృత్తంతువులు వుపాదానకారణము లయినట్లు లోకములకు నుపాదానకారణస్వరూప మైనదియును, నిఖిలలోకైకమాతయున్—నిఖిల = సమస్తము లయిన, లోక = భువనములకు, ఏక = ముఖ్య మైన, మాతయున్ = తల్లియును, త్రిభువనగేహినియున్—త్రిభువన = మూఁడులోకములును, గేహినియున్ = గృహముగా గలదియును - మూఁడులోకములకు గృహముకంటి దని యర్థాంతరము విశ్వమోహినియున్—విశ్వ = ప్రపంచమును, మోహినియున్=భ్రమింపఁ జేయునదియును ధీముఖియున్—ధీ = తత్త్వమును తెలియుబుద్ధియే, ముఖియున్ = మొగముగాఁ గలది యును, జ్ఞానవిజ్ఞానలోచనయున్—జ్ఞాన= పదపదార్థజ్ఞానమును, విజ్ఞాన=బ్రహ్మజ్ఞానమును, లోచనయున్= నేత్రములుగాఁ గలదియును, విచారమందస్మితయున్—విచార = బ్రహ్మవిద్యావిచారణ యనునదియే, మందస్మితయున్ = చిఱునవ్వుగాఁ గలదియును, నిర్మమతానిరహంతాహస్తయున్ = నాది నేనను భేద రహితము లైన వృత్తులే హస్తములుగాఁ గలదియును, యోగబోధస్తనియున్—యోగ=శివజీవైక్యనిష్ఠయు, బోధ = బ్రహ్మజ్ఞానమును, స్తనియున్ = కుచములుగాఁ గలదియు, సందేహమధ్యయున్ = నేను జీవుఁడనో బ్రహ్మమునో అనెడు సందేహమే నడుముగాఁ గలదియును, సంసారచక్రనాభియున్—సంసార = అహంకారముయొక్క, చక్ర=భ్రమణమే, నాభియున్ = బొక్కిలిగాఁ గలదియును, రాగద్వేషజఘనయున్—రాగ = సకలేంద్రియములకు ప్రియవస్తుసంఘటనమే రాగము, ద్వేష = ప్రియవస్తుసంఘటనము లేకపోవుట యే ద్వేషము, (ఇవియే) జఘనయున్ = పిఱుఁదులుగా గలదియును, కామ = పరస్త్రీపరధనాపేక్షయు, లోభ= స్వధన మన్యుల కియ్యమి యనెడు, ఊరుయుగళయున్ =తొడలుగాఁ గలదియును, సంకల్పవికల్ప చరణయున్ = సంకల్పవికల్పము లనునవియె పాదములుగాఁ గలదియును, కాల= కాలముచేత, అనుగత= ప్రాప్తము లయిన, కర్మ=పుణ్యపాపమిశ్రకర్మములే, యానయున్ =గమనములుగాఁ గలదియును, వేదాంత విద్యావసన = బ్రహ్మవిద్యయందలి యాలోచనయనెడు, వసన = చీరెయును, ఉపరతి = చిత్తవిశ్రాంతి యనెడు, కంచుక = రవికను, ధారిణియున్ = ధరించినదియును, రజః = రక్తవర్ణము గల రజోగుణము యొక్క, సత్త్వ = శ్వేతవర్ణముగల సత్త్వగుణముయొక్క, తమోగుణ = నీలవర్ణము గల తమోగుణము యొక్క, గ్రంథీ=ముడులయిన జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడు, నీవీబంధ = కోఁకముడిచేత, కంచుకబంధ= రవికముడిచేత, వేణీబంధ = జడముడిచేత, సురుచిరయున్ = ప్రకాశించుచున్నదియును ఫలత్యాగ పూర్వక = ఫలమును గోరకుండుటయే ప్రధానముగాఁ గల, వర్ణ=బ్రాహ్మణాది వర్ణములకును, ఆశ్రమ=

బ్రహ్మచర్యాద్యాశ్రమములయందు, ఉచిత=అర్హము లయిన, ధర్మ = స్నానసంధ్యావందనాద్యధ్యయన వైశ్వదేవ దేవపూజా అతిథ్యాది నిత్య నైమిత్తిక కామ్యనిషిద్ధ నిరసనాదికర్మములతోఁ గూడిన ధర్మములు, అనుష్ఠాన = తదాచరణములు, ఈశ్వరప్రణిధాన = భగవద్ధ్యానము, ఆచార్యోపాసన = గురుసేవ, ఇంద్రియ = జ్ఞానేంద్రియ కర్మేంద్రియములయొక్క, ఆత్మ = మనస్సుయొక్క, వినిగ్రహ = నిగ్రహించుట, స్థితప్రజ్ఞత్వ = స్థిరీభూతమైన వస్తుతత్త్వజ్ఞానము, ఆది = మొదలయిన, సాత్త్వికగుణ = దైవసంపద గల సాత్త్వికగుణము లనెడు, భూషణ = ఆభరణములచేత, అలంకారితయాఁ = అలంకరింపఁబడినదియును, శుద్ధవాసనావాసితయాఁ — శుద్ధ = త్రిగుణరహిత శుద్ధసత్త్వమనెడు, వాసనా = ఎఱుగనాగి సంస్కారముచేత, వాసితయాఁ = పరిమళించుచున్నదియును, 'శ్లో॥ వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధా చ మలినా తథా । మలినా జన్మకృత్ప్రోక్తా శుద్ధా జన్మవినాశినీ' ఇట్లని జ్ఞానవాసిష్ఠమందుఁగలదు, నిత్యహాయినియాఁ = ఎల్లప్పుడు పరమశివుని యెడఁబాయనిదియు, దేవదేవియాఁ — దేవ = సర్వాధిష్ఠానభూతచిన్మాత్ర స్వరూపుఁ డగు పరమశివునకు, దేవియాఁ = పట్టపురాణియైనదియును, అఖ = అయిన, శ్రీ = బ్రహ్మవిద్యాస్వరూపిణి యైన, మహాదేవి = త్రిపురసుందరి, అతిప్రియభక్తియోగంబు గాఁగ = అతిప్రీతితోడ, చతుర్విధశుశ్రూషలు = స్థాన అంగ భావ ఆత్మలని నాలుగువిధము లయిన శుశ్రూషలను, కావించుచున్ = చేయుచు, సేవించుచున్ = భజించుచు, పూజించుచున్ = అర్చించుచు, ధ్యానించుచున్ = ధ్యానించుచు, నమస్కరించుచున్ = మ్రొక్కుచు, ఆరాధించఁగన్ = ఆరాధింపఁగా, ప్రసన్నురాలై = సుముఖురాలై, మెచ్చి = మెచ్చుకొని, నీకు నెయ్యదియిష్టంబు = నీ కేదిసమ్మతము, ఇచ్చెద నడుగు మనినన్ = ఒసఁగెద నడుగు మనఁగా, సంతోష = ప్రమోదముచేత, భరిత = నింపఁబడిన, చిత్తము = ఉల్లము గలదై, అమృతశాలిని = ఆ పార్వతీదేవి, చిఱునవ్వు నగుచున్ = సందహాసము చేయుచు, ఇట్లనియెన్ = వక్ష్యమాణప్రకారముగా వచియించెను.

తా. ఆ పరబ్రహ్మము ఉత్పత్తి స్థితి లయములు లేనిదియును, 'ఏక మేవాద్వితీయం బ్రహ్మ' అను శ్రుతివలన స్వజాతి లేనిదియును 'బ్రహ్మమాత్ర మసన్న హీతి' అను శ్రుతివలన విజాతి లేనిదియును; 'నచక్షు ర్నశ్రోత్ర మపాణిపాదమ్' అనెడు శ్రుతివలన స్వగత భేదము లేనిదియును, తన తేజస్సుచేత అనేక సూర్యచంద్రాగ్నుల కాంతులను తిరస్కరించునదియును, ఋగ్యజు స్సామము అథర్వము అనెడు నాలుగు వేదములచేతను, తర్కము వ్యాకరణము ధర్మశాస్త్రము వేదాంతశాస్త్రము వైద్యము జ్యోతిషము అనెడు మహాశాస్త్రములచేతను, బ్రహ్మాండము మార్కండేయము మొదలయిన పదునెనిమిది పురాణములచేతను, భారతము మొదలయిన యితిహాసములచేతను, కామికము మొదలయిన యిరువదియెనిమిది ఆగమములచేతను తెలియ నలవిగానిదియును, బహువిధము లయిన బ్రహ్మ క్షత్త్రియ వైశ్య శూద్రాదివర్ణములును, అవర్ణములకుఁ దగిన ధర్మానుష్ఠానమును, కర్మములును, సత్త్వరజస్తమోగుణములును, రామకృష్ణాదినామములును, మత్స్యకూర్మవరాహాది రూపములును, పుట్టుట పెరుగుట బలియుట చిక్కుట ముదియుట చచ్చుట అనెడు వికారములును, సర్వస్వాతంత్ర్యము నిత్యము అలుప్తము అనంతము అనాదిబోధము సర్వజ్ఞత్వము నిత్యతృప్తి అను షడ్విధశక్తులును లేనిదియును, బ్రహ్మ దేవేంద్రుఁడు మొదలయిన దేవతలు అసురులు అనంతనాగసర్పములు గరుడులు గంధర్వులు కిన్నరులు కింపురుషులు సిద్ధులు సాధ్యులు విద్యాధరులు చారణులు అప్సరసలు యక్షులు గుహ్యకులు భూతములు సూర్యచంద్రాదిగ్రహములు నారదాదిదేవఋషులు సనక సనందనాది బ్రహ్మఋషీశ్వరులు కపిలదత్తాత్రేయాదియోగీశ్వరులు అగస్త్యాదిమునీశ్వరులు గోవిందభగవత్పాద శ్రీశంకరాచార్యాది యతీశ్వరులు వాల్మీకి మొదలైన కవీశ్వరులు మొదలగువారిచేత సేవింపఁదగినదియును, భూతభవిష్యద్వ

మానకాలములయందు నశింపక యుండునదియును, ప్రకృతిగుణములును సంకల్పవికల్పములును జననాది వికారములును దేవనరపశుపక్షిజలచరాదిరూపములును లేనిదియును, సాధనాంతరము లేక వెలుఁగునదియును, వినుట చూచుట స్పృశించుట మొదలైన పదునాలుగువిషయములు లేనిదియును, వినుటకును చూచుటకును ధ్యానించుటకును పొగడుటకును శక్యము గానిదియును, ఇంత అంత అని ప్రమాణింపరానిదియును, పంచమలములు లేనిదియును, విజ్ఞానస్వరూప మైనదియును, దేనిని అంటనిదియును, ఏకస్వరూప మగునదియును, విభాగింపరానిదియును, సత్యమును జ్ఞానమును ఆనందమును రూపము గాఁ గలదియును, పంచమావస్థను మీఱినదియును అయిన పరబ్రహ్మ మనెడు కైలాసపర్వతమునందు అవ్యక్తము మహత్తత్త్వము పంచతన్మాత్రములు అనెడు సప్తప్రాకారములును, పదునాలుగులోకము లనెడు గుహలును, చక్రవర్తి మనుష్యగంధర్వులు దేవగంధర్వులు పితృదేవతలు అజానజాను లను దేవతలు కర్మదేవతలు దేవతలు ఇంద్రుఁడు బృహస్పతి నవబ్రహ్మలు చతుర్ముఖబ్రహ్మలు ఆనందము లనెడు జారుడుబండలును, సూర్యుఁడు చంద్రుఁడు ధ్రువాదినక్షత్రములు అశ్విని మొదలైనచుక్కలు అంగారకాదిగ్రహములు అగ్ని మెఱుపులు మొదలైనవానికాంతు లనెడు రత్నములయిసుక గలదియును, ఇహపరలోకభోగవిరక్తి చిత్తవిశ్రాంతి నిశ్చలచిత్తము తీవ్రమోక్షేచ్ఛ అనెడు పర్వతము మీఁదిచోట్లయందు మొలిచి బ్రహ్మానందరసముచేత వృద్ధిఁబొంది నిర్మలము నిశ్చలము లనెడు మొగ్గలతోఁగూడి ఫలాపేక్ష లేని యిష్టకర్మములు, పూర్తకర్మములు, నిత్యనైమిత్తికకర్మములు, దేవతాంతరమంత్రోపాసనలు, పాకహవిస్సోమసంస్థాది యజ్ఞములు, యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణము లనెడి అష్టాంగములతోఁ గూడిన మంత్ర లయ హఠ రాజయోగములు, గాయత్రి పంచదశాక్షరి షోడశి మొదలైన మంత్రజపములు, కృచ్ఛ్రము చాంద్రాయణము మొదలైనతపస్సులు, సత్యము పలుకుట, అంతర్బహిఃపరిశుద్ధము, జీవకారుణ్యము, మంచినడవడి, బ్రహ్మచర్యాదివ్రతములు, అన్నదానము, గోభూధాన్యధనాదిదానములు మొదలైన వనెడు బహువిధవృక్షములు గల యుద్యానవనములు గలదియును, తర్క వ్యాకరణ వేదాంతాది షట్ఛాస్త్రము లనెడు పుష్పములు గల వేదముల ఆగమముల చివర లైన వేయిన్నియెనుబది యుపనిషత్తులును, చర్యక్రియా యోగజ్ఞానపాదము మొదలగువాని యందలి కర్మకర్తృమూర్తిఅమూర్తిశివమహాసాదాఖ్యార్థములను దెలియఁజేయు వాక్యము లనెడు కల్పవృక్షములు కలదియును, ఆంతరశబ్దానువిద్ధ సవికల్పకము, బాహ్యశబ్దానువిద్ధ సవికల్పకము, ఆంతరదృశ్యానువిద్ధ సవికల్పకము, బాహ్యదృశ్యానువిద్ధ సవికల్పకము, బాహ్యనిర్వికల్పకము, ఆంతరనిర్వికల్పకము అని ఆఱువిధము లైన సమాధు లనెడు నగళ్లు కలదియును, అన్నిటికంటె ముఖ్య మైన బ్రహ్మవిద్యవలన కలిగిన ఆనంద మనెడు నీళ్ళచేతఁ దడుపఁబడిన పరిశుద్ధహృదయమందలి వృత్తిజ్ఞాన మనెడు ముంగిటియందుఁ గల అంతరింద్రియనిగ్రహము జీవబ్రహ్మైక్యసమాధివిధిచేత విధ్యుక్తముగ కర్మపరిత్యాగము చేయుట, శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వముల సహించుట, గురువునందును వేదాంతశాస్త్రమునందును నమ్మికయును, గురువుపదేశించిన విషయములను శాస్త్రములలోఁ జూచి మనస్సంశయమును నివారించుకొనుట, దేనియందును ఆశ లేక యుండుట, కపటము లేక యుండుట మొదలయిన మంచిగుణము లనెడు రత్నముల ముగ్గులు గలదియును, మోక్ష మనెడు బొక్కసము గలదియును, ఫలమం దాసక్తి లేక స్వభావముగా విధ్యుక్తము లైన కులాచారకర్మములను ఆదరించుటవలనఁ గలిగిన చిత్తశుద్ధియును, మనోవాక్కాయము లనెడు త్రికరణముల దుష్టవ్యాపారముల నన్నిటిని విడుచుట, ఆచార్యభక్తి, ఉపనిషదర్థములను వినుట, విన్న యర్థములను యుక్తులచేత నేకవాక్యముచేసి చింతనచేయుట, చింతనచేయుటచేత విజాతీయము లైన కామక్రోధాది దుర్గుణములను వీడి సజాతీయము లైన సచ్చిదానంద నిత్యనిర్మలత్వములు గల 'బ్రహ్మాహమస్మి' అను నిరంతరచింతనమును, స్వరూపజ్ఞానమును మొదలైన వనెడు మెట్లు గల విజ్ఞాన మనెడు రాజ

శుశ్రూషలు చేయుచు సేవించుచు పూజించుచు ధ్యానించుచు నమస్కరించుచు నారాధింపఁగా నతఁడు మిక్కిలి కృప గలవాఁడై మెచ్చుకొని ఓపార్వతీ! నీ కేమి కావలయును అడుగు మనఁగా నా మహాదేవి మిక్కిలి సంతోషించి చిఱునవ్వు నవ్వుచు నిట్లు పలుకఁదొడఁగె నని తాత్పర్యము.

ఇఁక పర్వతపర మయిన తాత్పర్యమును వారువారే యూహించుకొనవలయును.

## చతుర్విధశుశ్రూషావివరణము.

గురుని గృహారామ క్షేత్ర పశు ధన ధాన్యాదులు రక్షించుట స్థానశుశ్రూష.

దేశికునకు అభ్యంగన స్నాన పాద సంవాహనాదులఁ జేయుట అంగశుశ్రూష.

గురుఁడే తల్లి తండ్రి చుట్టము స్నేహితుఁడు విద్య ధనము దాత దైవము గతియుఁ దని తలఁచుట భావశుశ్రూష.

గురువున కిష్టము లగు పదార్థము లడుగక మును పే తెచ్చి యిచ్చుట యాత్మశుశ్రూష.

## షట్ఛాస్త్రములు.

శ్లో॥ తర్క వ్యాకరణౌ ధర్మశాస్త్ర మీమాంస మిత్యపి। వైద్యశాస్త్రం జ్యోతిషంచ షట్శాస్త్రాణీతి కథ్యతే

## అష్టాదశపురాణములు.

శ్లో॥ బ్రాహ్మం పాద్మం వైష్ణవంచ శైవం భాగవతం తథా। తథాన్యం నారదీయంచ మార్కండేయంచ సప్తమమ్। ఆగ్నేయ మష్టమం చైవ భవిష్య న్నవమం స్మృతమ్। దశమం బ్రహ్మవైవర్తం లైంగ మేకాదశం స్మృతమ్। వారాహం ద్వాదశం చైవ స్కాందం చాత్ర త్రయోదశమ్। చతుర్దశం వామనంచ కౌర్మం పంచదశం తథా। మాత్స్యంచ గారుడం చైవ బ్రహ్మాండంచ తతఃపరమ్.

## షడ్విధసమాధులవివరణము.

శ్లో॥ సవికల్పో నిర్వికల్ప స్సమాధి ర్ద్వివిధా భవేత్। దృశ్యశబ్దానువిద్ధోయం సవికల్పః పునర్ద్విధా.

తా॥ సమాధి—సవికల్ప మని నిర్వికల్ప మని ద్వివిధము, అందు సవికల్పకము—దృశ్యానువిద్ధ సవికల్పక మనియు, శబ్దానువిద్ధ సవికల్పక మనియు యిరుతెఱఁగులుగలది యగును, ఈ రెంటను నిర్వికల్ప మొకటియును గూడి మూఁడువిధము లయ్యెను. ఈ మూఁడును బాహ్యాంతర భేదములచేత బాహ్యదృశ్యానువిద్ధ సవికల్పకసమాధి యనియు, బాహ్యశబ్దానువిద్ధ సవికల్పకసమాధి యనియు, బాహ్యనిర్వికల్పకసమాధి యనియు, అంతరదృశ్యానువిద్ధ సవికల్పకసమాధి యనియు, అంతరశబ్దానువిద్ధ సవికల్పకసమాధి యనియు, అంతరనిర్వికల్పకసమాధి యనియు, ఆఱువిధములు, అందు—తనకంటె అన్యములుగ తోఁచెడు బ్రహ్మ విష్ణు రుద్ర యీశ్వర సదాశివాది పిపీలికాంత మగు సమస్తచేతనములును, తృణాది మేరుపర్యంత మైన అచేతనములును తన తెలివియందే పుట్టి గిట్టినవి కాఁబట్టి అవి తన ప్రజ్ఞానకల్పితము లనియు, ఆ ప్రజ్ఞానమే పరబ్రహ్మ మనియు, ఆ పరబ్రహ్మమే తానని చూచుట బాహ్యదృశ్యానువిద్ధ సవికల్పకసమాధి; శివ రామ గోవింద నారాయణ వాసుదేవాది సకలనామములలో తనచెవికి వినఁబడిన నామము తాను గా నని విడిచి సర్వనామవిలక్షణ మయిన పరబ్రహ్మవస్తువు తా నని తలంచుటే బాహ్యశబ్దానువిద్ధ సవికల్పకసమాధి; కామాదిస్వజ్ఞప్తివఱకుఁ గల వృత్తులు తనయందుఁ గలుగుచుండినను వానినన్నింటిని అప్పు డప్పుడే నేను గా నని ఒక్కటొక్కటిగా గ్రహించి వీనికన్నిటికిని విలక్షణ మైన పరబ్రహ్మము తానని భావించుటే అంతర్దృశ్యానువిద్ధ సవికల్పకసమాధి రాగ ద్వేష [illegible] క్రోధ లోభ

మోహ మద మత్సర యీర్ష్య అసూయ దర్ప అహంకారాది స్వష్టిపర్యంత మైన సకలాంతరదృశ్య నామములను నేను గా నని విడిచి సర్వవిలక్షణ మైన పరమాత్మ తా నని భావించుచునే అంతరదృశ్యానువిద్ధ సవికల్పకసమాధి, ఈ రెండువిధ సవికల్పక సమాధులయందు మనస్సుగతి గలిగి అంతర బాహ్యములయందు తనకు నన్య మేమియును తోఁచక, తోఁచినను సముద్రమునందు ముంచినకుండ లోపల వెలుపల పరిపూర్ణమైనట్లును, ఆకాశమందు ఉంచినకుండ లోపల వెలుపల శూన్యమైనట్లును వుండుటే బాహ్యనిర్వికల్పకసమాధి, పైనఁ జెప్పిన వృత్తి లేనియు లేక అఖండపరిపూర్ణసచ్చిదానందపరబ్రహ్మస్వరూప మయి యుండుటే అంతరనిర్వికల్పకసమాధి

ఆ. ప్రాణనాథ తనదు పతిఁ గొల్చుటగాక, వేఱుపనులు గలవె చారుమతికి
గాన నీదుసేవఁ గావించుటయె కాని, యొండుకోర్కె లేదె యఖండమూర్తి. ౨౧

టీక. అఖండమూర్తి = సర్వపరిపూర్ణశరీరు డైన, ప్రాణనాథ—ప్రాణ = పంచప్రాణములకు, నాథ = ప్రభు వైన యో పరమశివుఁడా, చారుమతికిన్—చారు = మనోజ్ఞ మైన, మతికిన్ = తెలివి గల స్త్రీకి, తనదుపతిని గొల్చుటకంటెన్ = తనభర్తను సేవించుటకంటెను, వేఱుపనులుగలవె = అన్యకార్యములు గలవా—అనఁగా లేవనుట, కానన్ = కాఁబట్టి, నీదుసేవఁ గావించుటయె కాని = నీకు శుశ్రూష చేయ వలయు ననెడు కోరికయే గాని, ఒండుకోర్కెలేదు = మఱి యొక యభిలాష లేదు.

తా. సర్వపరిపూర్ణపరబ్రహ్మస్వరూపుఁ డైన ఓప్రాణనాథా! జ్ఞానము గల స్త్రీకి పెనిమిటికి శుశ్రూషలు చేయుచు వుండుటకంటె వేఱైన పనులు లేవు గనుక నీకు శుశ్రూషలు చేయవలయు ననెడు కోరికతప్ప మఱియొకకోరిక లేదు అని పార్వతీదేవి పలికె నని తాత్పర్యము.

పద్యలక్షణము॥ ఇనగణత్రయంబు నింద్రద్వయంబును । హంసపంచకంబు నాటవెలఁది. ఆ॥ ఆటవెలఁదికి ౧ పాదమున ౩ సూర్యగణములును ౨ ఇంద్రగణములును, ౨ వ పాదమున ౫ సూర్యగణములును వుండవలెను

ఆ. అయిన నీకభీష్ట మడుగు మిచ్చెద నని, యానతిచ్చితిరి మహాత్మ యిపుడు
గాన నాకు నెల్లమానవులకు మేలు, గలుగ నొకటి యడుగవలసె ననఘ.

టీక. మహాత్మ = మహానుభావుఁడ వైన, అనఘ = పాపము లేని యోస్వామీ, అయినన్ = ఇట్టి కోరిక లేకున్నను, ఇపుడు = ఇప్పుడు, నీకున్ = నీకు, అభీష్టము = ఇష్ట మయినదానిని, అడుగుము = కోరుము ఇచ్చెద నని = ఒసఁగెద నని, ఆనతిచ్చితిరి = చెప్పితిరి. కానన్ = కనుక, నాకున్ = నాకును, ఎల్లమానవులకున్ = సకలజనులకును, మేలుగలుగన్ = శ్రేయము గలుగునట్లు, ఒకటియడుగవలసెన్ = ఒకయర్థ మడుగవలసి వచ్చెను.

తా. మహానుభావుఁడవును, పాపము లేనివాఁడవును అయిన ఓస్వామీ! నీకు శుశ్రూషలు చేయవలెనన్న కోరికతప్ప మఱి యొక కోరిక లేక యున్నను యిప్పుడు నీకిష్ట మయినదానిని యడుగుము యిచ్చెద నని యానతిచ్చితిరి. కనుక నాకును సకలజనులకును మేలు గలుగునట్లు ఒక్కవిషయము అడుగవలసి యున్నది అని పలికె నని తాత్పర్యము

క. నిఖిలకలుషసంక్షయకర, మఖిలాభీష్టప్రదంబు [illegible]యది
త్సుఖదము జగదధిపత్యాది,సుఖకరమగు మంత్రరాజమును గృపఁ జెపుమా. ౨౩

టీక నిఖిల = సమస్తము లయిన, కలుష = సురాపానాది మహాపాపములయొక్క, 'శ్లో॥ కల్లు

## అంహాది త్రివిధపాపముల వివేచనము.

త్రావుట గురుపత్నిఁగవయుటయును । విప్రుఁ జంపుట బ్రహ్మస్వవిషయ మయిన । ముచ్చిలియును నివి గలిగినక్రూరజనులఁ। బ్రీతిఁ బొందుటయును మహాపాతకములు' అని భారతమంగ, లేక, 'శ్లో॥ బ్రహ్మహా మద్యపస్తేన స్తథైవ గురుతల్పగః । యేతే మహాపాతకినో యశ్చ తైస్సహసంవసేత్' అని; లేక, అంహ, అగ-, ఏనస్సు లనెడు పాపములయొక్క, 'శ్లో॥ విహితస్యా ననుష్ఠానా న్నిషేధస్యచ సేవనా । దనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతన ముచ్ఛతే' ఇట్లని పారాశర్యవచనము. తా॥ శాస్త్రవిహిత మైన కర్మపరిత్యాగము అంహము, శాస్త్రగర్హిత కర్మాచరణము అగము, ఇంద్రియనిగ్రహము లేక స్వేచ్ఛగా భోగించుట భుజించుటలు ఏనస్సు, ఈ త్రివిధపాపములవలన నరుఁడు పతితుఁ డగు నని తాత్పర్యము, (వీనియొక్క) సంక్షయ = నాశనమును, కరము = చేయునట్టిదియును, అఖిల = సమస్తము లైన, అభీష్ట = కోరికలను, ప్రదంబు = యిచ్చునదియును, అనంతావ్యయచిత్సుఖదము—అనంత = మితిలేని, అవ్యయ = తఱఁగని, చిత్ = జ్ఞానమువలనఁ గలిగిన, సుఖదము = మోక్షసుఖము నిచ్చునదియును, జగదధిపత్యభిముఖకము— జగత్ = ఉత్పత్తి నాశనములు గల యీలోకములకు, అధిపతి = ఆధారభూతుఁ డైన పరబ్రహ్మమును, అభిముఖకరము = ఎదుట నుండునట్లు చేయునదియును, అగు = అయిన, మంత్రరాజమున్ = మహామంత్రమును, కృపన్ = కరుణతో, చెపుమా = అనుగ్రహింపుమా

తా॥ బ్రహ్మహత్య కల్లుత్రావుట బ్రాహ్మణులసొమ్మును దొంగిలించుట మొదలగు మహాపాపములను నశింపఁజేయునదియును, అన్ని కోరికల నిచ్చునదియును, మితిలేనిదియును, క్షీణింపనిదియును అయిన విజ్ఞానమును గలుగఁజేసి దానివలన మోక్షసుఖము నిచ్చునదియును, లోకములను సృష్టించుటకు పెంచుటకు లయింపఁజేయుటకు కారణ మైన పరబ్రహ్మమును తన్నుఁగాఁ దెలియఁజేయునదియును అయిన మహామంత్రమును కరుణతో ననుగ్రహింపుమా అని పలికె నని తాత్పర్యము.

తే. అనిన విని నవ్వి గిరిజ కి ట్లనియె శంభుఁ, డడుగరానిరహస్యార్థ మడిగి తీవు
దగ నది మదీయనిక్షేప మగుపదార్థ, మైన నెఱిఁగింతు నీకు నెయ్యంబువలన.

టీక అనినన్ = అని యిట్లు పలుకఁగా, శంభుండు = నిత్యసుఖస్వరూపుఁ డైన యీశ్వరుఁడు, విని = ఆకర్ణించి, నవ్వి = చిఱునవ్వునవ్వి, గిరిజకున్ = పార్వతికి, ఇట్లనియెన్ = ఇట్లు పలికెను. ఈవు = నీవు, అడుగరాని = వేఁడని, రహస్యార్థమున్ = గుప్తార్థమును, తగన్ = బాగుగా, అడిగితివి = వేఁడితివి, అది = ఆ వస్తువు, మదీయ నిక్షేప మగు — మదీయ = నాయొక్క, నిక్షేప మగు = నిధి యైన, పదార్థము = ధనము, ఐనన్ = అట్టిపదార్థ మైనను, నెయ్యంబువలనన్ = ప్రీతిచేత, నీకున్ = నీకును, ఎఱిఁగింతున్ = విశదపఱతును

తా. అని పార్వతీదేవి పలుకఁగా, నిత్యానందస్వరూపుఁ డైన పరమశివుఁడు విని చిఱునవ్వు నవ్వి ఓపార్వతీ యెవ్వరును అడుగని రహస్యమును అడిగితివి, నీ వడిగినది నాకు నిక్షేపమువంటిది, అయినను నీయందుఁ గల అతిప్రీతిచేతఁ దెలిపెదను వినుము అని తాత్పర్యము.

తే. శ్రీమనోరామ శ్రీరామ రామ రామ
యనుచు రమియింతు రాముని యందు రామ

నామము వరానన సహస్రనామతుల్యం
మట్లు గావున దీనిని నవధరింపు. ౪౫

టీక. వరానన — వర = సుందర మగు, ఆనన = ముఖము గలిగి, శ్రీమనోరామ—శ్రీ = బ్రహ్మవిద్యతోఁ గూడిన, మనః = నాయంతఃకరణమును, రామ = రమింపఁజేయు ఓపార్వతీ, శ్రీరామ రామ రామయనుచుణ్ = శ్రీరామ రామ రామ యని పలుకుచు, రామునియందుణ్ = క్రీడాపరాయణుఁ డైన పరబ్రహ్మమందు, రమియింతుణ్ = క్రీడింతును, రామనామము = రామా యను పేరు, సహస్రనామతుల్యము = కృష్ణ విష్ణ్వాది పరమాత్మనామములు వేయింటితో సమానము, అట్లు గావునణ్ = సహస్రనామతుల్యము కాఁబట్టి, దీనిణ్ = ఈ శ్రీరామనామమును, ఈవు = నీవు, అవధరింపుము = అంగీకరింపుము ఈపద్యముయొక్క ప్రథమపాదమునందలి రామనామత్రిరావృత్తి దేహత్రయమును, అవస్థాత్రయము, జీవత్రయము, పారిశుద్ధ్యార్థ మని గ్రహింపవలయును

తా. ఓపార్వతీ! నేను శ్రీరామ శ్రీరామ శ్రీరామ అని జపించుచు ఆ శ్రీరామునియందే ఆసక్తి గలిగియుండుదును. ఆ రామనామమును ఒక్కసారి స్మరించిన విష్ణు కృష్ణాది సహస్రనామము లన్నియును పఠించినఫలము తప్పక గలుగును గనుక ఆ శ్రీరామమంత్రమును నీ మనస్సునం దెప్పుడు నిలుపు మని తా.

శ్రీ రా మ నా మా ర్థ ము శి వుం డు పా ర్వ తి కిఁ దె లు పు ట.

క. ఆదిపరబ్రహ్మప్రతి,పాదక మత్యంతపరమపావనము సుమీ
యీదివ్యమంత్రరాజము, మోదితధర్మార్థకామమోక్షప్రదము న్. ౪౬

టీక. ఈదివ్యమంత్రరాజము = ఈ యుత్తమమంత్రము, ఆదిపరబ్రహ్మప్రతిపాదకమును—ఆది = ప్రధాన మైన, పర = నిరతిశయ మైన, బ్రహ్మ = తారకబ్రహ్మమును, ప్రతిపాదకమును = తెలుపునదియును, అత్యంతపరమపావనమును = మిగుల పవిత్ర మైన వస్తువులలో నతిపవిత్ర మైనదియును, మోదిత = శ్రవణ మనన నిదిధ్యాసనములచేత సంతసించువారికి, ధర్మార్థకామమోక్షప్రదమున్ — ధర్మ అర్థ కామ మోక్షము లనెడు పురుషార్థచతుష్టయమును యిచ్చునట్టిదియును, సుమీ = అగును సుమా

తా. పార్వతీ! అన్ని మంత్రములకంటె శ్రేష్ఠ మైన యీశ్రీరామమంత్రము బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివు లనెడు పంచకర్తల సృష్టి స్థితి లయ తిరోధానఅనుగ్రహములకు ముఖ్యకారణ మై యొప్పు సర్వాతిశయ మయిన తారకబ్రహ్మమును తెలియఁజేయునదియును, పవిత్ర మయిన వస్తువులలో మిగుల పవిత్ర మయినదియును, తనయొక్క మహిమను సంతోషించినవారికి ధర్మ అర్థ కామ మోక్షముల నిచ్చునదియును అని తాత్పర్యము

క. సత్యజ్ఞానానంద,ప్రత్యగభిన్నాత్మునందు బ్రహ్మాదిబుధుల్
నిత్యము రమించు చుండఁగ, గాత్యాయని రామపదము గలిగెఁ బరువడిన్. ౪౭

టీక కాత్యాయని = ఓపార్వతీ! కతి అయనాని మోక్షమార్గాః సంతీతి విచారయతీతి కత్యః, తస్య గోత్రాపత్యం స్త్రీ కాత్యాయనీ - మోక్షమార్గము లెన్ని గలవని విచారించువాఁడు కత్యుఁడనఁగు, ఆఋషిగోత్రమందుఁ బుట్టినది గావున కాత్యాయని యనఁబడును; సత్య = అవస్థాత్రయమునందును నశింపనిదియును, జ్ఞాన = సాధనాంతరనిరపేక్షస్వయంప్రకాశమాన మయిన వస్తుతత్త్వజ్ఞానమును, ఆనంద = సంసారదుఃఖనివృత్తిపూర్వకసుఖమును నగు, ప్రత్యక్ = కూటస్థునకు, అభిన్న = వేఱు గానట్టి, ఆత్మనందుణ్ = పరమాత్మయందు - అనఁగా సత్యజ్ఞానానందస్వరూపి యైన అద్వయపరబ్రహ్మమందు,

బ్రహ్మాదిబుధులు — బ్రహ్మాది = పరమేష్ఠి మొదలగు, బుధులు = బ్రహ్మవేత్తలు, నిత్యమున్ = ఎల్లప్పుడును, రమించుచుండఁగన్ = క్రీడించుచుండఁగా, పరమనకున్ = ప్రకృత్యతీత మయిన పరబ్రహ్మమునకు, రామపదము = రామనామము, కలిగెన్ = లభించెను

తా. ఓపార్వతీ! సచ్చిదానందస్వరూపమై కూటస్థునికంటె వేఱుగాని పరమాత్మయందు బ్రహ్మ విష్ణు రుద్ర వ్యాస వసిష్ఠాది బ్రహ్మవేత్తలమనస్సులు యెల్లప్పుడును లీన మయి యుండుటచేత ప్రకృత్యతీత మయిన ఆ పరబ్రహ్మమునకు రామనామము గలిగె నని తాత్పర్యము

తే. రామపదవాచ్యుఁ డాదినారాయణుండె, యతనికిని నాకు భేదమింతైనఁ గలుగ
దద్వయబ్రహ్మమయుల మట్లగుటవలన, నింతి నాయంద నేను రమింతు నెపుడు.

టీక ఇంతి = ఓపార్వతీ, రామపదవాచ్యుఁడు—రామపద = రామనామముచేత, వాచ్యుఁడు= పలుకఁబడువాఁడు, ఆదినారాయణుండె = ఆదిపురుషుఁ డయిన శ్రీమన్నారాయణమూర్తియె — అనఁగా రామశబ్దవాచ్యార్థము నారాయణుఁ డనుట, అతనికిన్ = నారాయణునకును, నాకున్ = నాకును, భేదము = వేఱుపాటు, ఇంతైనఁగలుగదు = కొంచెమైనను లేదు, అద్వయబ్రహ్మమయులము—అద్వయ= రెండవదిలేని, బ్రహ్మమయులము = పరమాత్మస్వరూపులము - అనఁగా లక్ష్యార్థ మయిన పరబ్రహ్మ స్వరూపుల మనుట, అట్లగుటవలనన్ = అద్వయబ్రహ్మమయుల మగుటవలన, నాయంద నేను=అద్వయ బ్రహ్మమయుఁడ నైన నాయందే నేను, ఎపుడున్=సర్వకాలమును, రమింతున్=క్రీడింతును–అనఁగా నేనును రామపదవాచ్యుఁడ ననుట.

తా ఓపార్వతీ! శ్రీరాముఁ డను పేరు గలవాఁడు అహంశబ్దలక్ష్యార్థ పరబ్రహ్మ మయిన శ్రీనారాయణమూర్తియేసుమీ, ఆ శ్రీనారాయణమూర్తికిని నాకును భేదము లేనేలేదు; మేము 'ఏక మే వాద్వితీయం బ్రహ్మ' అను శ్రుత్యర్థమువలన రెండవది లేని పరమాత్మస్వరూపులము గనుక అద్వయబ్రహ్మ మయుఁడ నయిన నాయందే నేను క్రీడించు చుందు నని తాత్పర్యము.

## శ్రీ రా మ నా మ ప్ర భా వ ము.

తే. రామతారకపావనరామనామ, మెంతపాపంబు నడఁగించు నంతయఘము
శ్వపచుఁ డైనను జేయఁగాఁజాలఁ డనఁగఁ, దత్ప్రభావంబు నెన్నంగఁదరమె నాకు.

టీక రామ = ఓపార్వతీ, తారక=ప్రణవార్థ మయిన, పావన=పవిత్ర మయిన, రామనామము= రామమంత్రము, ఎంతపాపంబున్=ఎంతదోషమును, అడఁగించున్=పోఁగొట్టునో, అంతయఘమున్= అంతపాపమును, శ్వపచుఁడైనన్ = కుక్కమాంసమును దిను చండాలుఁ డైనను, చేయఁగాఁ జాలఁడు= చేయ శక్తుఁడు గాఁడు, అనఁగన్ = అని చెప్పుచుండఁగా, తత్ప్రభావంబున్=ఆ రామనామమాహాత్మ్యము, నాకున్, ఎన్నంగఁదరమె = ఎంచశక్యమా - అనఁగా శక్యము గా దనుట.

తా. ఓపార్వతీ! ఓంకారమునకు లక్ష్యార్థము అయిన శ్రీరామమంత్రము యెంతటిపాపమునైనను నశింపఁ జేయును, ఆ శ్రీరామమంత్రము నశింపఁజేయునంతటిపాపమును కుక్కమాంసమును తిను చండాలుఁడుసహితము చేయఁజాలఁడు, కనుక ఆ శ్రీరామనామమహిమను పొగడ నాకు శక్యము గా దని శ్రీసాంబమూర్తి పలికె నని తాత్పర్యము

క. ఈరేడుజగములందును, నారీమణి విమలరామనామముచేతం
జీరఁబడని ఘనదుర్భర, ఘోరమహాఘంబు లేదు కోరి వెదకినన్. ౫౦

టీక. నారీమణి = స్త్రీరత్నమయిన ఓపార్వతీ, కోరి = అపేక్షించి, వెదకినన్ = అన్వేషించి నను, ఈరేడుజగములందున్ = చతుర్దశభువనములయందు, విమల = పావన మయిన, రామనామముచేతన్ = రామమంత్రముచేత, చీరంబడని = ఛేదింపఁబడని, ఘన = ప్రసిద్ధమై, దుర్భర = ఓర్వఁగూడని, ఘోర = భయానకమైన, మహాఘంబు = మహాపాతకము, లేదు = కలుగదు.

తా. ఓపార్వతీ! పదునాలుగులోకములలో శ్రీరామమంత్రముచేత నశింపఁజేయఁబడని మహాపాపమును వెదకిచూచినను లేదని తాత్పర్యము

తే. బ్రహ్మహత్యాయుతము మద్యపానగళశతమును గుర్వంగనాకోటిసంగమున దురిత
మపరిమితహేమచౌర్యంబులనవరతము, రామనామాభిహతము గోరాజవదన.

టీక రాజవదన = చంద్రముఖి యగుయిన ఓపార్వతీ, బ్రహ్మహత్య = బ్రహ్మహత్య యను మహాపాతకముయొక్క, అయుతము = పదివేలును, మద్యపాన = కల్లుత్రాగుట యను మహాపాతకముయొక్క, దశశతమును = సహస్రమును, గుర్వంగనాకోటి = గురుపత్నులకోటితోడ, సంగమ = సంగమించుట వలనఁ గలిగినట్టి, దురితము = పాపమును, అపరిమిత = మితిలేని, హేమచౌర్యంబులు = స్వర్ణస్తేయము లును, అనవరతము = ఎల్లప్పుడును, రామనామ = రామనామమంత్రముచేత, అభిహతములు = లెస్సగాఁ గొట్టఁబడినవి

తా. ఓపార్వతీ! పదివేలసారులు బ్రహ్మహత్య చేయుటవలనఁ గలిగిన పాపమును, వేయిమారులు కల్లుత్రాగుటవలనఁ గలిగిన పాపమును, నూరులక్షలసారులు గురుభార్యలతోడ కలిసినందున కలిగినపాపమును, లెక్కలేనన్ని బంగారు దొంగిలించినందున వచ్చినపాపమును, శ్రీరామనామము నశింపఁజేయు నని తాత్పర్యము.

సీ. బ్రహ్మహత్యాఖ్యపాతకతమోర్కబింబంబు, మధుపానదోషాభ్రమారుతంబు
తపనీయచౌర్యపాతకశైలభిదురంబు, గురువధూగమనాఘకుంజరహరి
జననీపితృభ్రాతృవనితార్భకాచార్య,గోవధారణ్యదారుణదావవహ్ని
పరసతీసంగమపరధనహరణాది, ఘోరవంకోరగగరుడ రబ్ధి

తే. అనృతభాషణవల్లీమహాలవిత్ర, మార్యదూషణవంకమహాద్విపేంద్ర,
మఖిలకలుషాంబునిధిబడబానలంబు, రామనామంబు హిమశైలరాజతనయ.

టీక. హిమశైలరాజతనయ = హిమవంతునికూఁతురైన ఓపార్వతీ, రామనామంబు = రామమంత్రము, బ్రహ్మహత్య = బ్రహ్మహత్య యనెడు, ఆఖ్య = పేరుగల, పాతకము = పాప మనెడు చీఁకటికి, అర్కబింబంబు = సూర్యునివంటిదియును, మధుపాన = మద్యపానమువలని, దోష = పాప మనెడు, అభ్ర = మేఘమునకు, మారుతంబు = గాలివంటిదియును, తపనీయచౌర్య = బంగారు దొంగిలించుటవలని, పాతక = పాప మనెడు, శైల = కొండకు, భిదురంబు = వజ్రాయుధమువంటిదియును, గురు = ఆచార్యునియొక్క, వధూ = భార్యయొక్క, గమన = చేరికవలని, అఘ = పాప మనెడు, కుంజర = ఏనుఁగునకు, హరి = సింహమువంటిదియును, జననీపితృ = తల్లిదండ్రులు, భ్రాతృ = సోదరులు, వనితా = స్త్రీలు, అర్భక = శిశువులు, ఆచార్య = గురువులు, గో = ఆవులు, (వీనియొక్క) వధ = చంపుట యనెడు, అరణ్య = అడవికి-అనఁగా దల్లిదండ్రు లాదిగాఁ గలవారిని వధించుటవలనఁ గలిగిన పాప మనెడి అడవికి, దారుణ = గొప్ప దయిన, దావవహ్ని = కార్చిచ్చువంటిదియును, పరసతిసంగము = పరస్త్రీగమనము, పరధనహరణ =

అన్యుల ధన మపహరించుట, ఆది = మొదలగు, ఘోర = భయంకరము లగు, పంక = పాపము లనెడు, ఉరగ = సర్పములకు, క్రూర = కఠిన మయిన, బర్హి = నెమిలివంటిదియగును, అనృతభాషణ = కల్లలాడుట యనెడు, వల్లీ = తీఁగెలకు, మహాలవిత్రము = గొప్పకొడవలివంటిదియగును, ఆర్య = పెద్దలగు, దూషణ = నిందించుట యనెడు, పంకేరుహ = పద్మములకు, ద్విపేంద్రము = గజరాజమువంటిదియగును, అఖిల = సమస్తము లయిన, కలుష = పాపము లనెడు, అంబునిధి = సముద్రమునకు, బడబానలంబు = బడబాగ్ని వంటిదియగును

తా ఓ పార్వతీ! సూర్యుఁడు చీఁకటిని నశింపఁజేసినట్లుగా శ్రీరామనామము బ్రహ్మహత్యవలనిపాపమును నశింపఁజేయును, గాలి మబ్బును చెదరఁగొట్టినట్లుగా శ్రీరామనామము కల్లుత్రాగుటవలని పాతకమును చెదరఁగొట్టును, వజ్రాయుధము కొండను పిండిచేసినట్లుగా శ్రీరామనామము బంగారు దొంగిలించుటవలని పాతకమును పాడుచేయును, సింగము యేనుఁగును కూల్చినట్లుగా శ్రీరామనామము గురువు భార్యతో చేరుటవలనిపాపమును రూపుమాపును, కార్చిచ్చు కాఱడవిని కాల్చినట్లుగా శ్రీరామనామము తల్లిదండ్రులు అన్నదమ్ములు స్త్రీలు శిశువులు ఆచార్యులు ఆవులు మొదలగువాని చంపుటవలనిపాపమును కాల్చిపుచ్చును, నెమలి పాములను పాడుచేసినట్లుగా శ్రీరామనామము పరస్త్రీలఁ గలయుట పరధనముల నపహరించుట మొదలగు పాపములను పాడు గావించును, కొడవలి తీఁగెలను త్రెంచినట్లుగా శ్రీరామనామము కల్లలాడుటవలని దోషమును తుత్తుమురు చేయును, ఏనుఁగు తామరపూవులను త్రొక్కి పాడు చేయునట్లుగా శ్రీరామనామము పెద్దలను దూషించుటవలని దోషమును పాడు గావించును, బడబానలము సముద్రమును అడుగుపట్టినట్లుగా శ్రీరామనామము సమస్తపాతకములను అడుగుపట్టించు నని తాత్పర్యము.

తే. రమణి యవశముచే నైన రామనామ, మమర కీర్తింపఁబడుచుండ నఖిలపాత
కములచే విడ్వఁబడుసుమ్ము సుమతి యపుడె, సింహ మతిభీతమృగములచేతఁబోలె.

టీక రమణి = నాయకుఁడ వగు నన్ను రమింపఁజేసెడు, సుమతి = మంచిబుద్ధి గల యో పార్వతీ, అవశముచేనైనన్ = ఆకస్మికముగా నయినను, రామనామము = రామమంత్రము, అమరన్ = ఒప్పిదముగా, కీర్తింపఁబడుచుండన్ = స్మరింపఁబడుచుండఁగా, అపుడె = తత్క్షణమే, సింహము = సింగము, అతి = మిక్కిలి, భీత = జడిసిన, మృగములచేతఁబోలెన్ = మెకములచేతవలెనే, అఖిలపాతకములచేన్ = సమస్తపాపములచేత, విడ్వఁబడుసుమ్ము = విడువఁబడును సుమా.

తా ఓ పార్వతీ! సింహమును మృగములు బాధపెట్టఁదలఁచి చుట్టుడివేసికొని అట్టహాసములు చేయుచుండి వెనుక ఆ సింహముకూత విని జడిసి ఆమృగములు దానిని విడిచి వడిగా కాలుగుత్తులకును పాఱినట్లుగానే శ్రీరామమంత్రము పూర్వజన్మసుకృతవిశేషముచేత ఆకస్మికముగా నోట వెడలినతోడనే నరుఁడు సకలపాపములచేత విడువఁబడు నని తాత్పర్యము.

తే. అనవరత రామనామకీర్తనపరుండు, వెనుకటి యఘంబులఁ దలంచి వెఱవవలదు
ఘనత నేనుఁగునెక్కి కుక్కలను గాంచి, భయపడఁగ నేల మనుజుండు పంకజాక్షి.

టీక. పంకజాక్షి = తామరరేకులవంటి కన్నులు గల ఓ పార్వతీ, అనవరత = ఎల్లప్పుడు, రామనామ = రామనామముయొక్క, కీర్తన = స్మరణయందు, పరుండు = ఆసక్తిగలవాఁడు, వెనుకటి = మునుపటి, అఘంబులన్ = పాపములను, తలంచి = స్మరించి, వెఱవవలదు = భయపడవలదు, మనుజుఁడు = పురుషుఁడు, ఘనతన్ = గొప్పదనముచేత, ఏనుఁగునెక్కి = గజముపై గూర్చుండి, కుక్కలను గాంచి = శునకములను చూచి, భయపడఁగ నేల = వెఱచుట యెందుకు.

తా॥ ఓపార్వతీ! ఎట్టిమహాపాపమునయినను నశింపఁజేయు శ్రీరామమంత్రమును మిక్కిలి అక్కఱతో జపము చేయువారికి పాపము కలదని పలుకుచున్న మహాపాపియొక్క పాపమును ఆ శ్రీరామనామముగూడ పోఁగొట్టఁజాలదు సుమీ అని తాత్పర్యము

## శ్రీ రా మ నా మ మం త్రా ధి కా రు ల వి వ ర ణ ము.

సీ. ద్విజవరేణ్యులకును విప్రోత్తములకు యోగీశ్వరులకును యతీశ్వరులకు
భక్తివైరాగ్య సంపద్విశిష్టులకు నేకాంతవాసులకు వేదాంతులకును
జండాల పుల్కస శ్వపచ కంక కిరాత, శబర హూణాంగనాసంగతులకు
బ్రహ్మహత్యా సురాపాన హేమస్తేయ, గురువధూసంగమకరవరులకు
తే. సుందరీక్షత్త్రియోరవ్యశూద్రులకును, మఱియు నానావిధానేకమానవులకుఁ
బరమపావనమై శుభప్రదము నైన, రామనామంబు శరణంబు రాజవదన.

టీక. రాజవదన=చంద్రముఖి యైన ఓపార్వతీ, ద్విజవరేణ్యులకును—ద్విజ=‘ శ్లో॥ బ్రాహ్మణా ద్వివిధా ప్రోక్తాః పండితాః పామరా స్మృతాః। పామరా ద్వివిధా నామ బ్రాహ్మణ బ్రువధారకాః। పండితా ద్వివిధా ప్రోక్తాః నియోగా వైదికా స్మృతాః’ అనఁగా పామరు లయిన నామధారకులు బ్రాహ్మణ బ్రువులు అనువారికంటె భట్టాచార్యకృత పూర్వమీమాంసా ద్వాదశాధ్యాయతాత్పర్య మగు కామనాకర్మల విధ్యుక్తముగ నాచరించుటవలన ద్వితీయజన్మప్రాప్తి గలవా రగు ద్విజులు వారిలో, వరేణ్యులకును = శ్రేష్ఠులకును, విప్రోత్తములకు — విప్ర = ఆ ద్విజులలోపల ప్రాధాన్యశాస్త్రమై భక్తికర మైన అధ్యాయచతుష్టయతాత్పర్య మంగీకరించి ఉత్తరమీమాంసాశాస్త్రమందలి నిష్కామనా కర్మము చేయుచు వేదశాస్త్రాధ్యయనము గలిగి తమ్మును పరులను పాపములవలన విముక్తులఁ జేయువారు విప్రులు అట్టి విప్రులలో, ఉత్తములకు = ఉత్కృష్టులకును, ‘శ్లో॥ జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః। వేదపాఠేన విప్రస్స్యాత్ బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః। జాతిమాత్రోపజీవిన్యః బ్రాహ్మణ బ్రువయీరితః’ కర్మ యనఁగా, ‘శ్లో॥ స్నానసంధ్యా జపో హోమం స్వాధ్యాయం దేవపూజనమ్। ఆతిథ్య వైశ్వదేవంచ సత్కర్మాణి దినేదినే’ యోగీశ్వరులకును=శివజీవైక్యనిష్ఠ గల యోగీంద్రులకును, యతీశ్వరులకును = సన్న్యాసులకును, భక్తి=గురువేదాంతశాస్త్రములయందు ప్రీతి యనెడు, వైరాగ్య = ఇహపరలోకభోగము లైన గృహ శయ్యా వస్త్రాభరణ స్త్రీ గంధ పుష్ప తాంబూలములయం దుదాసీనభావ మనెడు, సంపత్ = కలిమిచేత, విశిష్టులకు = శ్రేష్ఠు లగువారలకును, ఏకాంతవాసులకు = విజనస్థలవాసు లగు మునీశ్వరులకును, వేదాంతులకును = బ్రహ్మవేత్తలకును, చండాల = మాలవాండ్రు, పుల్కస = పుతియలయందలి మాంసమును దినువారు, శ్వపచ=కుక్కలను వండి తినువారు, కంక = పులుఁగులఁ దినువారు, కిరాత = ఎఱుకువాండ్రు, శబర=ఆకులు గట్టుకొనెడి యెఱుకులు, హూణ = హూణులు, (వీరియొక్క) అంగనా = స్త్రీలతోడ, సంగతులకు = చేరిక గలవారికిని, బ్రహ్మహత్య = బ్రాహ్మణులఁ జంపుట, లేక ‘శ్లో॥ బ్రహ్మచర్య విహీనస్తు పతితః పరికీర్తితః। బ్రహ్మయజ్ఞవిహీనస్తు బ్రహ్మహా కీర్తితో బుధైః’ అని మాధవీయమందు, సురాపాన = కల్లు ద్రావుటను, లేక ‘శ్లో॥ అతిథి ర్ద్వారతిష్ఠ స్సన్ ఆపో గృహ్ణంతి యే నరః। ఆపోశనం సురాపాన మన్నం గోమాంసభక్షణమ్’ అని, హేమస్తేయ = బంగారు దొంగిలుటను, గురువధూసంగమ = గురుపత్నీ పరిగ్రహణమును, కరవరులకు = చేయువారిలో నధికులకును, సుందరీ క్షత్త్రియోరవ్య శూద్రులకును—

సుందరీ = స్త్రీలకును, క్షత్రియు = రాజులకును, ఊరవ్య = వైశ్యులకును, శూద్రులకును = నాలవజాతి వారికిని, మఱియుఁగా = వెండియు, నానావిధానేకమానవులకుఁగా — నానావిధ = అనేకజాతులయందుఁ బుట్టిన, మానవులకుఁగా = మనుష్యులకును, పరమపావనమై = మిక్కిలిపవిత్రమై, శుభప్రదమునైన = శుభ మొసఁగునట్టి దైన, రామనామంబు = రామనామము, శరణంబు = రక్షకమైనది - శ్రీరామనామము అందఱిచేత జపింపఁదగిన దనుట.

తా. ఓపార్వతీ! ఉపనయనము స్నానము సంధ్యావందనము గాయత్ర్యాది మంత్రజపము హోమము వేదపారము దేవతాపూజ అతిథిపూజ వైశ్వదేవము మొదలగు సత్కర్మములచే పవిత్రులైన ద్విజులలో శ్రేష్ఠులకును, కర్మఫలాపేక్ష లేక వేదశాస్త్రవిషయములను శిష్యులకు బోధించుచు యోగాభ్యాసాదులచేత దమ్మును అన్యులను పాపములనుండి విశుద్ధులఁ జేయుచు విప్రోత్తములకును, పరబ్రహ్మనిష్ఠ గల యోగీంద్రులకును, శివజీవైక్యసమాధియందు పూర్ణులై ప్రపంచదృష్టి లేక యున్న యతీశ్వరులకును, గురువునందును గురువులచేత నుపదేశింపఁబడిన వేదాంతశాస్త్రవిషయములయందును నమ్మకము గలిగి యిహపరలోకభోగములయందు విరక్తి గలవారలకును, నిర్జనస్థలమందు నివాసము చేయు మునీశ్వరులకును, బ్రహ్మవేత్తలకును, మాలలు మాదిగలు బోయలు గొల్లలు అగసాలెలు సిద్ధులు తురకలు మొదలయిన జాతులస్త్రీలతోఁ గలసినవారికిని, బ్రహ్మహత్య సురాపానము బంగారు దొంగిలించుట మొదలయిన మహాపాపములను చేయువారికిని, స్త్రీలు రాజులు వైశ్యులు శూద్రులు మొదలగ లైన సమస్తజాతులలో పుట్టినవారికిని మహాపవిత్రమై సకలశుభములను యిచ్చెడు శ్రీరామనామమే దిక్కని తాత్పర్యము

చ. కన దురు రామనామమునకంటెను ఘనం బగు పాపనాశసా
ధనము నిరంతరేష్టఫలదాయక మైన విశేష కారణం
బును మఱి లేదు లోకమున మూఢులు తెలియంగరు దాని నాశ్రయిం
చిన సకలార్థసంపదలు చేకుఱుసిద్ధము శైలనందనా. ౫౯

టీక. శైలనందనా = పార్వతీ, కనల్ = వెలుఁగుచున్న, ఉరుతరమయిన, రామనామమున కంటెన్ = రామనామముకంటెను, ఘనం బగు = ఉత్కృష్టమైన, పాపనాశసాధనము = బ్రహ్మహత్యాది పాపముల నశింపఁజేయ దగిన కారణమును, నిరంతరేష్టఫలదాయకమైన — నిరంతర = ఎల్లప్పుడు, ఇష్టఫల = అభీష్టఫలములను, దాయకమైన = ఇచ్చునట్టి దైన, విశేషకారణంబును = విశేషమైన హేతువు, లోకమునన్ = జగమునందు, మఱి లేదు = వేఱొకటి గలుగదు, మూఢులు = అవివేకులు, ఎఱుంగరు = తెలియఁజాలరు, దానిన్ = ఆ రామనామమును, ఆశ్రయించినన్ = శ్రవణ మనన నిదిధ్యాసనములచేత ననుసరించెనేని, సకలార్థసంపదలు = సమస్తధనసమృద్ధులు - అష్టభోగము లనుట, చేకుఱుంగా = లభించును, సిద్ధము = నిశ్చయము

తా. ఓపార్వతీ! బ్రహ్మహత్య గోహత్య స్త్రీహత్య శిశుహత్య మొదలయిన మహాపాపములను నశింపఁజేసి కోరినకోరికలను కొనసాగించునది శ్రీరామనామమే కాని మఱియొకటి లోకమందు లేదు, ఈసంగతిని మూఢులు తెలియక భంగపడి అంగలార్చుచున్నారు, ఆ శ్రీరామనామమును జపించుచు ఆ శ్రీరామరూపమును పూజించుచు ధ్యానించుచు ఆ శ్రీరాముని పవిత్రచరిత్రములను వినుచు నుండెడు బుద్ధిశాలురు అష్టభోగములు మొదలగువానిని పొంది సుఖించుచుందు రని తాత్పర్యము.

అష్టభోగముల వివరణము.

శ్లో॥ దాసో భృత్య స్సుతో బంధు ర్వస్త్ర వాహన మేవ చ । ధన ధాన్య సమృద్ధి శ్చా ప్యష్ట భోగాః ప్రకీర్తితాః

తే. అబల శ్రీరామరామనామాఖ్యమంత్ర
మీప్సితంబుల నర్థుల కిచ్చు చుండఁ
గాంచి నెఱి సిగ్గు వడు చుండుఁ గల్పతరువు
కామధేనువు నలఘుచింతామణియును. ౬౦

టీక అబల = పార్వతీ, శ్రీ = బ్రహ్మవిద్యాస్వరూపిణి యైన చిచ్ఛక్తికి, రామ = మనోహర మైన, రామనామ = రామనామ మనెడు, ఆఖ్య = పేరు గల, మంత్రము = 'వ్యు॥ మంతారం త్రాయత ఇతి మంత్రః'-తలఁచువానిని సంసారమునుండి రక్షించునది మంత్రము అట్టి మంత్రము, అర్థులకున్ = యాచకులకు, ఈప్సితంబులన్ = కోర్కెలను, ఇచ్చుచుండఁగన్ = ఒసఁగుచుండఁగా, కల్పతరువు = కల్పవృక్షము, కామధేనువును = దేవసురభియును, అలఘుచింతామణియున్ = శ్రేష్ఠమైన దేవతారత్నమును, కాంచి = చూచి, నెఱిన్ = మిక్కిలి, సిగ్గుపడుచుండున్ = లజ్జఁ జెందు చుండును.

తా ఓపార్వతీ! శ్రీరామమంత్రము కోరినకోర్కెల నన్నిటిని భక్తులకు హెచ్చుగా నిచ్చుచుండఁగా కల్పవృక్షమును, కామధేనువును, చింతామణియును చూచి చిన్నపోయి సిగ్గుపడు చుండు నని తాత్పర్యము

శ్రీ రామ నామ మంత్రోపాసనా ఫలము.

సీ. ధర్మార్థులకు సర్వధర్మంబు లొనఁగూర్చు, నర్థార్థులకుఁ జేయు నర్థములను
గామార్థులకు నెల్లకామంబుల నొసంగు, నాత్మజార్థుల కిచ్చు నాత్మజులను
శ్రీధృతిస్మృతియశశ్శ్రేయస్సుఖక్షమా,విద్యార్థులకు వాని వెలయ నిచ్చు
ఛత్రచామరగజాశ్వప్రభుత్వార్థుల, కవియు సంపాదించు ననవరతము

తే. జంద్రసూర్యాలయంబుల స్వర్గలోక, సత్య వైకుంఠ కైలాససదనములను
గోరువారల కవియుఁ జేకూర్చుఁ జేయు, రామనామంబు విలసిల్లి రాజవదన. ౬౧

టీక. రాజవదన = పార్వతీ, అనవరతమున్ = ఎల్లప్పుడును, రామనామంబు = రామమంత్రము, విలసిల్లి = ప్రకాశించి, ధర్మార్థులకున్ — ధర్మ = విహితకర్మానుష్ఠానమును, అర్థులకున్ = కోరెడివారికి, సర్వధర్మంబులు = వర్ణాశ్రమోచిత శ్రౌతస్మార్తకర్మానుష్ఠానముల నన్నిటిని, ఒనఁగూర్చున్ = చేకూర్చును, అర్థార్థులకున్ = కులోచితద్రవ్యాభిలాష గలవారలకు, 'శ్లో॥ యాజ నాధ్యాపనై రేవ విశిష్టాచ్చ ప్రతిగ్రహాత్ । ఋతా మృతాభ్యాం జీవేత నశ్వవృత్త్యా కదాచన' అని ధర్మశాస్త్రము, అర్థములను = ధనములను, చేయున్ = కలుగఁజేయును, కామార్థులకున్ = ఇష్టోపభోగాసక్తులకు, ఎల్లకామంబులన్ = సమస్తకోరికలను, ఒసఁగున్ = ఇచ్చును, ఆత్మజార్థులకున్ — ఆత్మజ = పుత్త్రులను, అర్థులకున్ = కోరెడువారలకు, ఆత్మజులను = పుత్త్రులను, ఇచ్చున్ = ఒసఁగును; శ్రీ = సంపదలను, ధృతి = ధైర్యమును, స్మృతి = జ్ఞానమును, యశః = కీర్తిని, శ్రేయః = ముక్తిని, సుఖ = భోగమును, క్షమా = ఓర్పును, విద్య = వేదాది చతుర్దశవిద్యలను - లేక రాజవిద్యలను, అర్థులకున్ = ఇచ్ఛయించు

వారికి, వానిఁ = సంపద పొందఁగలుగువానిని, తెలియన్ = చెప్పినట్లు, ఇచ్చున్ = ఒసఁగును; ఛత్ర = గొడుగులను, చామర = వింజామరములను, గజ = ఏనుఁగులను, అశ్వ = గుఱ్ఱములను, ప్రభుత్వ = మండలాధిపత్యమును, అర్థులకున్ = కోరెడువారికి, అవి కొనన్ = వానిని, సంపాదించున్ = కలుగఁజేయును; చంద్రసూర్యాలయంబులన్ = "శ్లో॥ ధూమో రాత్రి స్తథా కృష్ణ షణ్మాసా దక్షిణాయనమ్ । తత్ర చాంద్రమసంజ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే॥" అను గీతావచనప్రకారము యిష్టాపూర్త కర్మములు చేసినవారు రాత్రి కృష్ణపక్షము దక్షిణాయనము పితృయానము పింగళనాడి యీమార్గమున చంద్రలోకమును, "శ్లో॥ అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణమ్ । తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః" అను గీతావచనప్రకారము, తేజస్సు పగలు శుక్లపక్షము ఉత్తరాయణము దేవయానము ఇడానాడి తేజోమార్గము ఈమార్గమున సూర్యలోకమును, స్వర్గలోక = నాకలోకమును, సత్య = బ్రహ్మలోకమును, వైకుంఠ = విష్ణులోకమును, కైలాససదనములను = శివలోకమును, కోరువారలకున్ = అభిలషించువారలకు, అవియున్ = వానిని, చేకూరఁజేయున్ = లభింపఁజేయును. ధూమాదిమార్గమున చంద్రలోకప్రాప్తి గలవారికి జన్మములు గలవనియు, అర్చిరాదిమార్గమున సూర్యలోకప్రాప్తి గలవారికి ముక్తి గలదనియు భావము.

తా॥ ఓ పార్వతీ! శ్రీరామమంత్రము ధర్మమును అర్థమును కామమును కోరెడువారికి కోరినట్లు యిచ్చును, పుత్త్రులను కోరెడువారికి పుత్త్రులను యిచ్చును, సంపదలను శాస్త్రజ్ఞానమును బ్రహ్మజ్ఞానమును కీర్తిని మోక్షమును భోగములను విద్యలను సుఖదుఃఖాదుల సహించుటను కోరువారికి కోరినట్లు యిచ్చును, గొడుగులను వింజామరములను ఏనుఁగులను గుఱ్ఱములను దొరతనమును కోరెడువారికి కోరినవి యిచ్చును, చంద్రలోకమును సూర్యలోకమును స్వర్గలోకమును బ్రహ్మలోకమును విష్ణులోకమును శివలోకమును కోరెడువారికి ఆ లోకములను యిచ్చును అని తాత్పర్యము.

## రాజవిద్యావివరణము.

"శ్లో॥ ఆన్వీక్షికీ త్రయీ వార్తా దండనీతిశ్చ శాశ్వతీ । ఆన్వీక్షిక్యాంతు విజ్ఞానం దండనీత్యాం నయానయౌ॥ అర్థానర్థౌ చ వార్తాయాం ధర్మాధర్మౌ త్రయీ స్థితౌ । విద్యా హ్యేతాశ్చ తస్రస్స్యు ర్లోకసంస్థితి హేతవః".

వ. అదియునుం గాక. ౼ ౧

టీక. అట్లు లభింపఁజేయుటయే గాక.

సీ. నిఖిలరోగంబుల నిర్మూలముగఁ జేయు, భవభయంబుల నెల్ల బాపఁదోలు
బంధనంబులఁ బటాపంచలు గావించు, నోలియు నాపదలను నులిమివైచు
శాత్రవవిజయంబు సతతంబు సమకూర్చుఁ, దూలించు బహువిధదుఃఖములను
దలఁ జూపకుండ దుర్దశలను దొలఁగించు, సకలసుఖంబుల సంగ్రహించు
తే. బరమపావనమంగళప్రదము గానఁ, గలితధర్మార్థకామమోక్షము లొసఁగ
నెసఁగుభక్తుల కొసఁగని దెద్ది లేదు, ఏమి చెప్పుదు శ్రీరామునామమహిమ. ౼ ౩

టీక. శ్రీరామనామమహిమ = శ్రీరామ నామమాహాత్మ్యమును, ఏమి చెప్పఁగలన్ = ఏమని పలుకుదును, నిఖిలరోగంబులన్ = సమస్తవ్యాధులను, నిర్మూలముగఁజేయున్ = మూలోత్పాటనము చేయును,

భవ = జన్మములవలని, భయంబులనెల్లన్ = భీతులనన్నిటిని, పాఱదోలున్ = లేదును, బంధనంబులన్ = అష్టపాశబంధములను, పటాపంచలు = తుత్తునుకలు, కావించున్ = చేయును, ఒలయుశాపదలన్ — ఒలయు = చుట్టుకొను చున్న, ఆపదలన్ = అష్టకష్టములను, నులిమివైచున్ = నశింపఁజేయును, సతతంబు = ఎల్లప్పుడును, శాత్రవవిజయంబున్ = అంతరబాహ్యశత్రుజయమును, సమకూర్చున్ = అనుకూలపఱచును, బహువిధదుఃఖములన్ = నానావిధము లగు క్లేశములను - అనఁగా పంచక్లేశములను, తూలించున్ = పోఁజేయును, తలఁజూపకుండన్ = తలయెత్తనీక, దుర్గతులన్ = దరిద్రములను, తొలఁగించున్ = పోఁగొట్టును, సకలశుభంబులన్ = సమస్తమంగళములను, సంగ్రహించున్ = సంపాదించును, పరమ = శ్రేష్ఠమైన, పావన = పవిత్రమైన, మంగళ = శుభములను, ప్రదము = ఇచ్చునది, కానన్ = కాబట్టి, కలిత = కూడిన, ధర్మార్థకామమోక్షములలోనన్ = ధర్మము అర్థము కామము మోక్షము నను నాలుగింటిలోపల, ఎసఁగుభక్తులకున్—ఎసఁగు = అతిశయించుచున్న, భక్తులకున్ = సేవకులకు, ఒసఁగనిది = ఇవ్వనిది, ఎద్దిలేదు = ఏదియును లేదు.

తా॥ ఓ పార్వతీ! శ్రీరామనామమహిమను యేమని చెప్పుదును, శరీరసంబంధములైన జ్వరము తలనొప్పి కుష్ఠము మొదలైనవ్యాధులను మనోవ్యాధులను పోఁగొట్టును, జన్మభయములను నశింపఁజేయును, అష్టపాశబంధములను త్రెంచివేయును, అష్టకష్టములను నష్టము చేయును, లోపలిశత్రువులను వెలుపలిశత్రువులను గెలుచుశక్తిని యుక్తిని కలుగఁజేయును, సకలదుఃఖములను తొలఁగించును, దరిద్రములను తలయెత్తకుండఁ జేయును, సకలశుభములను వృద్ధిఁ బొందించును, ధర్మార్థకామమోక్షముల నిచ్చును, వేయిమాటలేల శ్రీరామనామము భక్తులు కోరిన కోరికలనెల్ల కొల్లగాఁ జేకూర్చును అని తా.

## పంచక్లేశవివరణము.

అవిద్యాక్లేశము అభినవక్లేశము అస్మితక్లేశము రాగక్లేశము ద్వేషక్లేశము అని క్లేశము లైదువిధములు, అందు నేను జీవుఁడ నని నిర్ణయించుట అవిద్యాక్లేశము, సంసారమును దానికి కారణ మయిన మనస్సును పరిత్యజింపకుండుట అభినవక్లేశము, విషయాభిలాష కలిగి విజృంభించు చుండుట అస్మిక్లేశము, అర్థముల యందు అధికానురక్తి కలిగి యుండుట రాగక్లేశము, ఉదరపోషణార్థము పరుల నాశ్రయించి వారివలన తనయభిమతము కొనసాగనందున వారలను దూషించుట ద్వేషక్లేశము.

## అష్టపాశవివరణము.

క॥ దయయు జుగుప్సయు మోహము । భయమును సంశయముఁ గులము బలశీలత నన్నియుఁ గూడ నష్టపాశము । లయి వెలయును వానినాత్మఁ దంటక యుండున్.— ఇట్లని శుకచరిత్రము.

## అష్టకష్టములవివరణము.

శ్లో॥ ఋణంయాచ్నాచవృద్ధత్వం జారచోరదరిద్రతా । రోగశ్చభుక్తశేషశ్చా ప్యష్టకష్టప్రకీర్తితాః.

క. ఎచ్చటనె సరస్వతియును, నచ్చట భాగీరథియును ఁ యమునానదియున్
నచ్చట సమస్తతీర్థము, లెచ్చట శ్రీరామనామ ఁ మెప్పుడు గలుగున్. ౭౮

టీక ఎచ్చట = ఏశృంగాటక మను భ్రూమధ్యమందు, ఎప్పుడు=ఎల్లప్పుడు, శ్రీరామనామము— శ్రీ = చిచ్ఛక్తిస్వరూప మగు లక్ష్మితో, రామ = అంతర్యామియై క్రీడించెడు పరబ్రహ్మస్వరూపుఁ డయిన రామునియొక్క, నామము = నామధేయము, కలుగున్ = కలిగియుండునో, అచ్చటనె = ఆ స్థలమందే,

సరస్వతియును = సుషుమ్నానాడీరూప మయిన సరస్వతీనదియును, అచ్చటఁ = ఆ ప్రదేశమందే, భాగీరథియును = ఇడానాడీరూప మయిన గంగానదియును, యమునానదియుఁ = పింగళనాడీరూప మయిన కాళిందీనదియును, అచ్చటఁ = అచ్చోటనే, సమస్తతీర్థములు = సర్వనాడీసముదాయరూప మయిన పుణ్యతీర్థములును, కలుగుఁ = కలిగియుండును.

తా. ఓ పార్వతీ! శ్రీరామమంత్రజపములస్థలమందు గంగ యమున సరస్వతి తుంగభద్ర కావేరి కృష్ణ గోదావరి మొదలయిన పుణ్యనదులు కలిగియుండును గనుక ఆ స్థలము మహాపవిత్ర మయిన దని తా॥

తే. తెలివి శ్రీరామనామసుధారసంబు, నమృతులై గ్రోలు భక్తులు - నమృత మేల
సమరసమృతాంధసులచేత - నదియె మిగులఁ, గోరఁబడుచుండు గావున - వారిజాక్షి.

టీక వారిజాక్షి = తామరలవంటి కన్నులు గల ఓ పార్వతీ, అమరుల=దేవతలవలె, అమృతాంధసులచేతఁ = (సముద్రమథనజని)తామృత మే అశనముగాఁ గల దేవతలచేత, అదియే = ఆ రామనామామృతమే, మిగులఁ = అత్యంతముగా, గోరఁబడుచుండుఁ = మోక్షాపేక్ష గల కాలమం దిచ్ఛయింపఁబడు చుండును, కావునఁ = అట్లపేక్షింపఁబడుటవలన, తెలివి=ప్రయత్నపూర్వకముగా, శ్రీరామనామసుధారసంబుఁ—శ్రీ = మోక్షసంపద గల, రామనామ = రామనామ మనెడు, సుధారసంబుఁ=అమృతసారము, అమృతులై = జీవన్ముక్తులై, గ్రోలుభక్తులకుఁ—గ్రోలు = త్రాగుచున్న, భక్తులకుఁ = సేవకులకు, అమృత మేల = సముద్రమథనజనితామృత మెందుకు—అనఁగా నిష్ప్రయోజన మని భావము.

తా ఓ పార్వతీ! పాలసముద్రమందుఁ బుట్టిన అమృతమును త్రాగిన దేవతలు సహితము మోక్షమును అపేక్షించునప్పుడు ఆ శ్రీరామనామామృతపానమునే కోరుచుందురు గనుక శ్రీరామనామజప మనెడు అమృతమును విడువక త్రాగు చుండు మహాభక్తులకు పాలసముద్రమున పుట్టిన అమృతముతోఁ బ్రయోజన మేమాత్రము లే దని తాత్పర్యము.

తే. కోరి మును గానిమనుష్యుఁ - బేరునాడి, చీరిన నతం డతనిచెంతఁ - జేరినట్లు
తన్నెఱుంగక దనపేరుఁ - దలఁచినంతఁ, గరుణచే రాముఁ డపుడె సాక్షాత్కరించు.

టీక. కోరి = అభిలషించి, మునుగానిమనుష్యుఁ = మొదలు తా నెఱుఁగని నరుని, పేరువాడి = పెరుపెట్టి, చీరినఁ = పిలిచినేని, అతఁడు = ఆ పిలువఁబడిన పురుషుఁడు, అతనిచెంతఁ = పిలిచినవాని వద్ద, చేరినట్లు = వచ్చియున్నట్లు, తన్నెఱుంగక = ప్రత్యగాత్మస్వరూపుఁ డయిన తన్ను నెఱుఁగక, తన పేరుఁ దలఁచినంతఁ = తననామమును స్మరింపఁగానే, కరుణఁ = నిర్హేతుకకృపచేత, అపుడె = తత్క్షణమే, రాముఁడు = పరబ్రహ్మస్వరూపుఁ డైన శ్రీరాముఁడు, సాక్షాత్కరించుఁ = ప్రత్యక్ష మగును.

తా ఓ పార్వతీ! ఒకానొకఁడు అప్రీతితో ముందు తా నెఱుఁగని నరుని పేరుపెట్టి పిలుచుచుండ ఆ పిలువఁబడినవాఁడు పిలుచువానివద్దకు వచ్చినట్లుగానే తన్నెఱుఁగక తనపేరుపెట్టి పిలిచినయెడల ఆ పేరు తన దయినందున శ్రీరాముఁడు అతిప్రీతితో తన్నుఁ బిలుచు భక్తునివద్దకు వచ్చి కనఁబడి వానికోరిక లిచ్చు నని తాత్పర్యము, శ్రీరామా యని తలంచినదే తనకోర్కెలు సిద్ధించు నని భావము.

సుగంధివృత్తము. రామ రామ రామ రామ - రామ రామ యంచు శ్రీ,
రామ రామ రామ రామ - రామ రామ యంచు శ్రీ,
రామ రామ రామ రామ - రామ రామ యంచుఁ ద
న్నామకీర్తనంబుఁ జేసినం గలుంగు మోక్షమున్.

టీక. అర్థము సులభము

తా. శ్లో॥ త్రివట్యా నిచ నామాని పఠే ద్రామస్య యో నరః । స త్రయోపాధిరహితః మోక్షం స మధిగచ్ఛతి' అని రామమంత్రప్రభావదర్పణమం దుండుటవలన శ్రీరామ శ్రీరామ శ్రీరామ అని పదునెనిమిదిమాఱులు శ్రీరామనామస్మరణ చేసెనేని క్రమముగా స్థూల సూక్ష్మ కారణోపాధులు నశించి వుపాధిత్రయాతీతపరబ్రహ్మమాత్రుఁడై యుండు నని తాత్పర్యము.

పద్యలక్షణము. ఏడువామ్ములుఁ గమున్న డెన్మదిఁ సుగంధికిన్॥ తా. ఏడుహాగణములును ౧ గురువును ౯ దింట యతియును వుండవలయు ననుట

క. నిరతంబు రామనామస్మరణంబునకంటె మోక్షసాధన మితరం
బరయంగ లేదు ధరలో, బరమసులభ మైన లసదుపాయం బబలా. ౬౫

టీక అబలా = పార్వతీ, నిరతంబు=ఎల్లప్పుడును, రామనామస్మరణంబునకంటెన్ = రామనామ మంత్రజపముకంటె, అరయంగన్ = విచారింపఁగా, మోక్షసాధనము = దుఃఖమునుండి విడివడు నుపాయము, ఇతరంబు = వేఱైనది, ధరలోన్ = భూమియందు, లేదు = కలుగదు, పరమసులభ మైన = మిక్కిలి అనాయాస మైన, లసదుపాయంబు = మంచి యుపాయము.

తా. ఓ పార్వతీ! యెన్నివిధములను విచారించినను మోక్షమును పొందుటకు శ్రీరామమంత్రజపము కంటె మేలైనయుక్తి వేఱొక్కటి భూమిలో లేదు ఇదే నిరపాయమైనయుపాయము అని తాత్పర్యము.

వ. అని యిట్లు శ్రీరామమంత్రంబును దత్ప్రభావంబు నుపదేశించిన నాకర్ణించి పరమానందభరితస్వాంత యై యక్కాంతామణి యత్యంతభక్తిపూర్వకంబుగా ననేకప్రణామంబు లాచరించి వినుతించి స్వామీ తన్మంత్రాధిష్ఠానదేవతా శ్రీరామ తత్త్వస్వరూపం బెట్టిది యెఱింగింపు మనిన నొక్కింత విచారించి శ్రీరామహృదయం బను పరమేతిహాసంబు గల దందు శ్రీరామతత్త్వం బతి విస్పష్టంబుగా విలసిల్లు నది యతిరహస్యంబు గావున నెవ్వరికి గోచరంబు గాకుండు, దాని నేఁ దెలియం జెప్పెద విను మని శ్రీమహాదేవుం డప్పార్వతీదేవి కిట్లనియె. ౬౬

టీక అని యిట్లు = అని యీప్రకారము, శ్రీరామమంత్రంబును = శ్రీరామషడక్షరమంత్రమును, తత్ప్రభావంబును = ఆరామమంత్రమాహాత్మ్యమును, ఉపదేశించినన్ = బోధింపఁగా, ఆకర్ణించి = విని, పరమ = అధిక మైన, ఆనంద = సంతోషముచేత, భరిత = నిండింపఁబడిన, స్వాంతయై=మనస్సు గలదై, ఆకాంతామణి = ఆ పార్వతీదేవి, అత్యంతభక్తిపూర్వకంబుగాన్ = అధికభక్తిపురస్సరముగా, అనేక ప్రణామంబు లాచరించి = పెక్కుమ్రొక్కులిడి వినుతించి = పొగడి, స్వామీ = ఓ ప్రాణనాయకా, తత్ = ఆ, మంత్ర = రామమంత్రమునకు, అధిష్ఠానదేవతా = ముఖ్యదేవత యైన, శ్రీరామ = శ్రీరాముని యొక్క, తత్త్వ = యథార్థ మైన, స్వరూపంబు = ఆకృతి, ఎట్టిది = ఎటువంటిది, ఎఱింగింపుమనినన్ = తెలుపు మనఁగా, ఒక్కింతవిచారించి = కొంతసే పాలోచనచేసి, శ్రీరామహృదయంబు=శ్రీరామహృదయము, అను పరమేతిహాసంబు—అను = అనెడు, పరమ=శ్రేష్ఠ మైన, ఇతిహాసంబు = పూర్వకథ, కలదు= ఉన్నది, అందున్=ఆ కథయందు, శ్రీరామతత్త్వంబు = శ్రీరామునినిజరూపము, అతివిస్పష్టంబుగాన్= మిక్కిలి విశదముగా, విలసిల్లున్ = తెలియఁబడును, అది యతిరహస్యంబు = అది మిగుల గోప్య మైనది, కావునన్=కాఁబట్టి, ఎవ్వరికిన్ = అవివేకుల కెవ్వారికిని, గోచరంబు గాకుండున్=తెలియఁబడకుండును,

దుష్టరాక్షసులను నష్టము చేయగా రావణుఁడు విని మాయాసీతను చెఱఁబట్టుకొని పోవ నంత రామలక్ష్మణులు పుట్టలు చెట్లు గుట్టలు పొదలు మొదలైనవానిలో సీతను వెదకుచు పోయి పోయి అని తాత్పర్యము.

మ. రణభూమిం దగ రావణాసురునిఁ బుత్త్రభ్రాతృబంధూరువా
రణగంధర్వశతాంగయుక్తముగ నస్త్రశ్రేణిచేఁ ద్రుంచి ల
క్ష్మణ సుగ్రీవ హనూమదాదియుతుఁడై క్రాంతిల్లి సీతావధూ
మణితో వచ్చె నయోధ్య కార్యులు నుతింపం బుష్పకారూఢుఁడై. ౨౧

టీక. రణభూమిన్ = యుద్ధభూమియందు, తగన్ = ఒప్పునట్లు, పుత్త్ర = కొమరులు, భ్రాతృ = సోదరులు, బంధు = చుట్టములు, ఊరు = గొప్పలగు, వారణ = ఏనుఁగులు, గంధర్వ = గుఱ్ఱములు, శతాంగ = రథములు, యుక్తముగన్ = వీనితోఁ గూడినట్లు, రావణాసురునిన్ = రావణుని, అస్త్రశ్రేణిచేన్ = అస్త్రములవరుసచేత, త్రుంచి = చంపి, లక్ష్మణ = లక్ష్మణుఁడు, సుగ్రీవ = సుగ్రీవుఁడు, హనుమత్ = ఆంజనేయుఁడు, ఆది = మొదలగువారితో, యుతుఁడై = కూడి, క్రాంతిల్లి = కోరి, పుష్పకరూఢుఁడై = పుష్పకవిమానము నెక్కినవాఁడై, సీతావధూమణితోన్ = సీతాభామామణితో, ఆర్యులు = పెద్దలు, నుతింపన్ = కొనియాడఁగా, అయోధ్యకున్ = అయోధ్యాపురమునకు, వచ్చెన్ = అరుగుదెంచెను

తా. ఓ పార్వతీ! కొడుకులు తమ్ములు చుట్టములు యేనుఁగులు గుఱ్ఱములు తేరులు మొదలయిన వానితోడ రావణుని యుద్ధములో చంపి లక్ష్మణుండు సుగ్రీవుఁడు హనుమంతుఁడు మొదలగు సమస్త వానరులు తనవెంట వచ్చుచుండ సీతాదేవితోడ పుష్పకవిమానము నెక్కి దేవతలును భూదేవతలును దేవఋషులును బ్రహ్మఋషులును పొగడ శ్రీరాముఁడు అయోధ్యాపురమునకు వచ్చె నని తాత్పర్యము.

తే. ఇట్లరుగుదెంచి రాముఁడు హితపురోహి, తార్యబాంధవసచివభృత్యప్రభృతులు
ననుజులును గొల్వ సక్తుఁడై జనకజాభి, యుక్తుఁడై యంత బట్టాభిషిక్తుఁ డయ్యె.

టీక. అంతన్ = పిమ్మట, రాముఁడు = శ్రీరామచంద్రుఁడు, ఇట్లు = ఈరీతిని, అరుగుదెంచి = అయోధ్యకువచ్చి, హిత = మిత్రులు, పురోహిత = పురోధసులు, ఆర్య = పండితులు, బాంధవ = చుట్టములు, సచివ = మంత్రులు, భృత్య = సేవకులు, ప్రభృతులును = మొదలయినవారును, అనుజులును = తమ్ములును, కొల్వన్ = సేవింపఁగా, సక్తుఁడై = ప్రీతి గలవాఁడై, జనకజాభియుక్తుఁడై = సీతాసమేతుఁడై, పట్టాభిషిక్తుఁ డయ్యెన్ = పట్టాభిషేకము చేసికొనెను.

తా. ఓ పార్వతీ! పిమ్మట శ్రీరామచంద్రుఁడు అయోధ్యకు వచ్చి భద్ర మధు మత్త శాల్యాదిస్నేహితులును, వసిష్ఠ వామదేవాది పురోహితులును, పండితులును, జనక కేకయాది బంధువులును, సుమంత్రాది మంత్రులును, డెబ్బదిరెండువిధము లైన పూడిగములవారును, లక్ష్మణ భరత శత్రుఘ్నులును సేవింప సీతాదేవితోఁ గూడి పట్టమును కట్టుకొనె నని తాత్పర్యము.

## శ్రీ రా మ ప ట్టా భి షే క ము.

సీ. శృంగార మేపార సీతాంగనామణి, మును నిజవామాంకమున వసింపఁ
దనపాదుకలు శిరంబున మోచి ముందర, హనుమంతుఁ డతిభక్తి ననుసరింప

ధవళాతఛత్ర, మహాతతధనుర్బాణముల్, దాల్చి లక్ష్మణుఁడు ప్రక్కఁడ నలర
సరి నిరుగడల వింజామరంబులు పూని, భరతశత్రుఘ్నులు పరిఢవింప
తే. ననుపమోజ్జ్వలరత్నసింహాసనమున, నమరఁ గూర్చుండి కోటిసూర్యప్రకాశుఁ
డై వసిష్ఠాది మునిసమూహములచేతఁ, జెలఁగి రాముండు పట్టాభిషిక్తుఁ డయ్యె.

టీక. సీతాంగనామణి = శ్రీశ్రేష్ఠ నగుసీత, శృంగారమేపారఁగ — శృంగారము = అలంకారము, ఏపారఁగ = మించఁగా, మును = ముందు, నిజవామాంకమునన్ — నిజ = తనయొక్క, వామాంకమునన్ = ఎడమతొడమీఁద, వసింపఁగ = కూర్చుండియుండగాను ॥ని॥ 'ఉత్సంగ చిహ్నయోరంకః' అని అమరము, హనుమంతుఁడు = ఆంజనేయుఁడు, అతిభక్తిఁగ = మిక్కిలి భక్తితో, తనపాదుకలు = తన పావకోళ్లు, శిరంబున మోచి = నెత్తిని బెట్టుకొని, ముందఱన్ = పురోభాగమందు, అనుసరింపఁగ = సేవించుచుండఁగాను, లక్ష్మణుఁడు = సౌమిత్రి, ధవళాతపత్రము = తెల్లనిగొడుగును, ఆతతధనుర్బాణములు — ఆతత = గొప్పలయిన, ధనుః = విల్లును, బాణములు = అమ్ములును, దాల్చి = ధరించి, ప్రక్కఁడ = పార్శ్వమునందు, అలరఁగ = ప్రకాశించుచుండఁగాను, భరతశత్రుఘ్నులు = భరతుఁడును శత్రుఘ్నుఁడును, సరిగ = సమముగా, ఇరుగడలన్ = రెండువైపులను, వింజామరములు = సురఁటులను, పూని = ధరించి, పరిఢవింపఁగ = వెలయఁగా, అనుపమ = సరిలేని, ఉజ్జ్వల = మిక్కిలి ప్రకాశము గల, రత్న = మణులు చెక్కిన, సింహాసనమునన్ = సింగపుఁబీటమీఁద, అమరన్ = బాగుగా, కూర్చుండి = వసించి, కోటిసూర్యప్రకాశుఁడై = నూఱులక్షలసూర్యుల కాంతి గలవాఁడై, వసిష్ఠాదిమునిసమూహములచేతన్ = వసిష్ఠుఁడు మొదలగు ఋషిబృందములతో, చెలఁగి = భాసిల్లి, రాముండు = రామమూర్తి, పట్టాభిషిక్తుఁ డయ్యెన్ = రాజ్యాభిషిక్తుఁ డాయెను.

తా. ఓ పార్వతీ! వస్త్రభూషణ చందనపుష్పములచేత నలంకరింపఁబడిన సీతాదేవి తన యెడమతొడ మీఁద కూర్చుండియుండఁగా, ఆంజనేయుఁడు తన పావకోళ్లను శిరస్సుమీఁద బెట్టుకొని యెదుట సాకరించి కూర్చుండియుండఁగా, లక్ష్మణుఁడు తెల్లనిగొడుగును విల్లును అమ్ములను పట్టుకొని యెడమచేతి ప్రక్కనుండఁగా, భరతుఁడును శత్రుఘ్నుఁడును తనకు రెండువైపులను నిలిచి వింజామరముల వీచుచుండఁగా, నవరత్నములు చెక్కిన సింహాసనముమీఁద మిక్కిలి ఠీవితోఁ గూర్చుండి కోటిసూర్యప్రకాశము గా వెలుఁగుచు వసిష్ఠవామదేవాది మహామునీంద్రులు దీవింపఁగా శ్రీరాముఁడు పట్టము కట్టుకొనెనని తా.

వ. ఇట్లు పట్టాభిషిక్తుండై శ్రీరామచంద్రుండు హితపురోహితామాత్యసుహృద్వర్గ ద్వాఃస్థాన దాస దాసీజనంబులకును, నానాదేశాధీశ్వరులకును, విభీషణ సుగ్రీవ జాంబవత్సుషేణ నల నీల గజ గవయ గవాక్ష గంధమాదనాదులకును, వందిమాగధపాఠకలోకంబునకును, దక్షిణవారల కందఱకును, మనోరథంబులు దీరందగిన రథతురగవారణగోభూహిరణ్యాగ్రహార రత్న దివ్యవస్త్రాభరణ గంధ మాల్యాదు లొసంగి సత్కరించి యంతటఁ దనపురోభాగవర్తియుఁ బుణ్యకీర్తియును నిటలతటఘటితాంజలియును గృతకార్యుండును నిరాకాంక్షుండును నిత్యానిత్యవస్తువివేకయుక్తుండును సకలవిషయైహికాముష్మికభోగవిరక్తుండును శమాదిషట్కసంపత్తియుక్తుండును ముముక్షుతాసమన్వితుఁడును మహాబుద్ధిమంతుఁడు నైన హను

మంతుం గనుంగొని కరుణారసంబు పొంగార జనకజాంగనామణి నెమ్మొగంబుం
జూచి మనకు నిత్యభక్తుండును మదీయజ్ఞానాసక్తుండును బరమభాగవతశిఖా
మణియు నైన యితనికి మద్దివ్యతత్త్వస్వరూపం బుపదేశింపు మనిన బంగారం
బునకుం బరిమళంబు గలిగిన తెఱంగున నుప్పొంగి మందస్మితముఖారవిందయై
విశ్వమోహిని యైన సీతామహాదేవి యాంజనేయుని కభిముఖ యై యిట్లనియె.

టీక ఇట్లు = ఇవ్విధముగా, శ్రీరామచంద్రుఁడు = శ్రీరామమూర్తి, పట్టాభిషిక్తుండై = పట్టము గట్టుకొన్నవాఁడై, హిత=ఇష్టులైన, పురోహిత = పురోహితులకును, అమాత్య=మంత్రులకును, సుహృత్ = స్నేహితులకును, విద్వత్ = పండితులకును, బ్రాహ్మణ = విప్రులకును, దాస = సేవకులకును, దాసీజనంబులకున్ = ఊడిగకత్తెలకును, నానాదేశాధీశ్వరులకున్ = సమస్తదేశముల రాజులకును, విభీషణ సుగ్రీవ జాంబవత్సుషేణ నల నీల గజ గవయ గవాక్ష గంధమాదనాదులకున్ = విభీషణుఁడు సుగ్రీవుఁడు జాంబవంతుఁడు సుషేణుఁడు నలుఁడు నీలుఁడు గజుఁడు గవయుఁడు గవాక్షుఁడు గంధమాదనుఁడు మొదలగువారలకు, వంది=బట్టువాండ్రయొక్కయు, మాగధ=రాజవంశావళిని గొనియాడువారియొక్కయు పాఠక = గాయకులయొక్కయు, లోకంబునకున్ = సమూహమునకును, తక్కినవారల కందఱకున్ = మిగిలినవారలకందఱికిని, మనోరథంబులు దీరన్ = కోరికలీడేరునటుల, తగిన=అర్హములయిన, రథ=తేరులు, తురగ = గుఱ్ఱములు, వారణ = ఏనుఁగులు, గో=ఆవులు, భూ=భూములు, హిరణ్య= స్వర్ణము, అగ్రహార= విప్రగృహశ్రేణులు, రత్న=మణులు, దివ్య=శ్రేష్ఠములయిన, వస్త్ర = చేలములు, ఆభరణ = సొమ్ములు, గంధ= చందనము, మాల్య = పూలదండలు, ఆదులు = మొదలగువానిని, ఒసఁగి = ఇచ్చి, సత్కరించి = సన్మానించి, అంతటన్ = పిమ్మట, తనపురోభాగవర్తియున్ = తనయెదుట నున్నవాఁడును, పుణ్యకీర్తియున్= నిర్మలకీర్తి గలవాఁడును, నిటలతట = నుదుటియందు, ఘటిత = చేర్పఁబడిన, అంజలియున్ = దోసిలి గలవాఁడును, కృతకార్యుండును = జ్ఞానోదయమునకు హేతువు లగు సకలసత్కార్యములను సలిపినవాఁడును, నిరాకాంక్షుండును = కోరిక లేనివాఁడును, నిత్యానిత్యవస్తువివేకయుక్తుండును = బ్రహ్మమే సత్యము దేహాదిప్రపంచ మసత్య మనెడు జ్ఞానము గలవాఁడును, సకలవిధ=నానావిధము లయిన, ఐహిక= ఇహలోకమునందు కర్మజన్యము లయి అనిత్యము లయిన స్రక్చందనవనితాదివిషయభోగాదులయందును ఆముష్మికభోగ = పరలోకమునందు కర్మజన్యములై అనిత్యము లయిన రంభాద్యప్సరస్త్రీసంభోగాదుల యందును, (వమనాన్న మూత్రపురీషాదులవలె) విరక్తుండును = ఆశ లేనివాఁడును, శమాది = శమము మొదలగు, షట్క = ఆఱింటియొక్క, సంపత్తి = కలిమితోడ, యుక్తుండును=కూడుకొన్నవాఁడును- అనఁగా శమము దమము ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధానము అనెడి ఆఱుగుణములు గలవాఁ డనుట, ముముక్షుతా = మోక్షము నపేక్షించునట్టి స్వభావముతోడ, సమన్వితుండును = కూడినవాఁడును, మహాబుద్ధిమంతుండును = బ్రహ్మము నెఱుఁగుటకుఁ దగినప్రజ్ఞ గలవాఁడును, ఐనహనుమంతున్ = ఐన ఆంజనేయుని, కనుంగొని = చూచి, కరుణారసంబు = దయారసము, పొంగారన్ = ఉప్పొంగఁగా, జనకజాంగనామణిమొగంబున్ = సీతాదేవిముఖమును, చూచి= వీక్షించి, మనకున్ = మనయొద్దకును, నిత్యభక్తుండును = నిరంతరసేవకుఁడును, మదీయజ్ఞానాసక్తుండును—మదీయ = నా సంబంధమైన, జ్ఞాన=బ్రహ్మజ్ఞానమందు, ఆసక్తుండును=శ్రద్ధ గలవాఁడును, పరమ=ఉత్తము లయిన, భాగవత=ప్రహ్లాద నారదాది భగవద్భక్తులకు, శిఖామణియున్ = శిరోరత్న మైనవాఁడును, ఐనయితనికిన్=ఐనట్టి యీ హనుమంతునికి, మద్దివ్యతత్త్వస్వరూపంబు—మత్ =నాయొక్క, దివ్య=అనన్యసాధారణ మైన, తత్త్వస్వరూపంబు= స్వరూపము

దస్మచ్ఛబ్దార్థైకాఖండబ్రహ్మస్వరూపమును, 'శ్లో॥ శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం' అని సౌందర్యలహరియందలి ఆచార్యోక్తిప్రకారము శివశక్తిస్వరూపము లయిన చిచ్ఛక్తిస్వరూపమగు సద్బ్రహ్మమే తత్త్వము-అట్టి తత్త్వమును, ఉపదేశింపుమనిన్ = బోధింపు మని యాజ్ఞాపింపఁగా, బంగారంబునకున్ = స్వర్ణమునకు, పరిమళంబు = సువాసన, కలిగినతెఱంగునన్ = అన్నరీతిని, ఉప్పొంగి = మిగుల సంతసించి, మందస్మిత = చిఱునగవుతోఁ గూడిన, ముఖారవిందయై = ముఖపద్మము గలదై, విశ్వ = సమస్త జగత్తును, మోహిని యైన = భ్రమింపఁజేయు చున్నట్టి, సీతామహాదేవి = ప్రసన్నముఖియగు దర్శనీయముగాఁ బ్రకాశించు సీతాదేవి, ఆంజనేయునికిన్ = హనుమంతునికి, అభిముఖయై = ఎదురై, ఇట్లని యిట్లన్ = ఇవ్విధముగఁ బలుకఁదొడఁగెను

తా. ఓ పార్వతీ! శ్రీరామమూర్తి యీవిధముగాఁ బట్టము గట్టుకొని పురగోపాలురను మంత్రులను స్నేహితులను పండితులను బ్రాహ్మణులను సమస్తదేశముల రాజులను విభీషణుఁడు అంగదుఁడు నీలుఁడు హనుఁడు సంపాతి మొదలయిన రాక్షసులను సుగ్రీవుఁడు జాంబవంతుఁడు సుషేణుఁడు నలుఁడు నీలుఁడు గజుఁడు గవయుఁడు గవాక్షుఁడు గంధమాదనుఁడు మొదలయిన వానరులను స్త్రీజనుల వంశావళిని పొగడు మాగధులు ఆడెడువారు పాడెడువారు వనితాంగ్రమ వనితలు మొదలయినవారికిని తగిన తేరులు గుఱ్ఱములు ఏనుఁగులు ఆవులు భూములు బంగారు నాణెములు అగ్రహారములు గద్దెలును వెలగలవస్త్రములు నగలు గంధము పుష్పహారములు మొదలయినవానిని అపారిగా నిచ్చి గౌరవించి పిమ్మట తనయెదుటను నుదుటను చేతులను చేర్చుకొని యున్నవాఁడును మంచికీర్తి గలవాఁడును బ్రహ్మజ్ఞానము కలుగుటకు కారణము లైన వేదశాస్త్రాధ్యయనాదులను కులోచితము లయిన శ్రౌతస్మార్తనిత్యనైమిత్తికవిధి నిషేధకామ్యప్రాయశ్చిత్తాది పుణ్యకార్యములను భగవత్ప్రీతిగాఁ జేసినవాఁడును కోరికలు లేనివాఁడును పరబ్రహ్మముతప్ప తక్కిన వన్నియును అనిత్యము లను జ్ఞానము గలవాఁడును ఇహపరలోకభోగములయందు అపేక్ష లేనివాఁడును శమము దమము ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధానము అను నాఱు సుగుణములు గలవాఁడును తీవ్రమోక్షేచ్ఛ గలవాఁడును బ్రహ్మము నెఱుఁగఁదగిన బుద్ధి గలవాఁడును నగు హనుమంతుని శ్రీరామమూర్తి జూచి అతిప్రీతితో సీతాదేవిని కనుంగొని ఓజానకీ మనయొద్దనున్న నిత్యభక్తుఁడును సాద్వైన బ్రహ్మజ్ఞానమును తెలిసికొనుటకుఁదగు శక్తి గలవాఁడును ప్రజ్ఞాఢ్యుఁడు నగువాఁడు మొదలయిన భగవద్భక్తులకు శిఖామణి యైనవాఁడును అయిన యీ హనుమంతునకు సచ్చిదానందనిత్యనిర్మలత్వము లనెడు పంచలక్షణములు గల నా స్వరూపమును దెలుపు మనఁగానే సీతాదేవి మహానందమును బొంది ఆంజనేయుని తట్టుగఁ దిరిగి పట్టుదలతో బ్రహ్మతత్త్వమును బోధింపఁదొడఁగె నని తాత్పర్యము.

## సాధనచతుష్టయసంపత్తివివరణము.

నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రార్థఫలభోగవిరాగము, శమాదిషట్కసంపత్తి, మోక్షేచ్ఛ అని సాధనములు నాలుగువిధములు, అందు.—

నిత్యానిత్యవస్తువివేక మనఁగా.—నామరూపక్రియలు లేక సత్తు చిత్తు ఆనందము అఖండము నిర్మలము అనునవే స్వరూపలక్షణముగా గలిగి వెలుఁగు పరబ్రహ్మమే సత్యము, నామ రూప క్రియలు గలదై అనృతము జడము దుఃఖము ఖండము మలినము అనునవే స్వరూపలక్షణము గాఁ గలిగి వెలుఁగు ప్రకృతిచేత కల్పింపఁబడిన తనశరీరమును ఆ తనశరీరసంబంధు లయిన భార్యలు కొడుకులు కూఁతుండ్రు అన్నదమ్ములు తల్లిదండ్రులు ధనము ధాన్యములు గృహములు గోవులు మొదలయినవియును బ్రహ్మ విష్ణు

రుద్ర మహేశ్వర సదాశివులు మొదలు పరమాణు పర్యంతమగు తుదిగాఁ గల ప్రాణిసమూహముతోఁ గూడిన లోకములను అసత్యము లని తెలిసికొనుటే నిత్యానిత్యవస్తువివేకము.

ఇహాముత్రార్థఫలభోగవిరాగ మనఁగా — ఈ లోకమందలి పుష్ప చందన వస్త్ర భూషణములును స్త్రీలు యిండ్లు తోఁటలు భూములు ధనధాన్యవస్తువాహనములును మొదలయిన వానిభోగములయందును, పరలోక మందలి స్వర్గలోక సత్యలోక వైకుంఠ కైలాసాదులయందుఁ గల సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యము లనెడు పదవులలో నుండు పుష్పచందనాదిభోగములయందును వమనాన్నమల మూత్రాదులయందువలె ఆశ లేక యుండుటే యిహాముత్రార్థఫలభోగవిరాగము.

శమాదిషట్క సంపత్తి యనఁగా — శమము దమము ఉపరతి తితీక్ష శ్రద్ధ సమాధానము అను నుగుణము లాఱును గలిగియుండుటే శమాదిషట్కసంపత్తి యనఁబడును, అందు, శమ మనఁగా - అంతరింద్రియ నిగ్రహము, దమ మనఁగా - బాహ్యేంద్రియనిగ్రహము, ఉపరతి యనఁగా - విహితము లయిన సకలకర్మములను జ్ఞాననిష్ఠావిధిచేత క్రమక్రమముగా విడుచుట, ఇదియే సన్న్యాస మని చెప్పఁబడును, తితీక్ష యనఁగా - శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వములను సహించుట, శ్రద్ధ యనఁగా - గురువులయందును వేదాంత శాస్త్రములయందును యీశ్వరునియందును విశ్వాసము గలిగియుండుట, సమాధాన మనఁగా - సద్గురూపదిష్ట మహావాక్యార్థములను శాస్త్రములయందుఁ జూచికొని మనస్సున దృఢపఱచుకొనుట - లేక మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అనెడి అంతరేంద్రియములును వానివృత్తు లయిన సంకల్పవికల్పనిశ్చయ చంచలకర్తృత్వములును వానికి నధిదేవత లయిన చంద్రబృహస్పతి క్షేత్రజ్ఞరుద్రులయందు ధ్యానారాధనాదులచేత చేర్చి ఆ యధిదేవతలను అధిదేవత యైన పరమాత్మునందు ఆ యింద్రియాదిదేవతలను ఐక్యపఱచి తదేకనిష్ఠగా నుండుట శమము

వర్ణ ధ్వని స్వర మిశ్ర రూపము లగు చతుర్విధశబ్దములను గ్రహించునట్టి శ్రోత్రేంద్రియమును, చల్లన వేఁడిమి మృదువు కఠినము మిశ్రము అని అయిదువిధము లయిన స్పర్శములను గ్రహించు త్వగింద్రియమును, పొట్టి పొడుగు లావు సన్నము రొంటుపు నలుపు తెలుపు పసుపు ఆకుపచ్చ మిశ్రమ మని పదివిధము లయిన రూపములను గ్రహించునట్టి నేత్రేంద్రియమును, ఉప్పు పులుసు కారము వగరు తీపు చేదు మిశ్రము అని యేడువిధము లయిన రుచులను గ్రహించెడి జిహ్వేంద్రియమును, సుగంధము దుర్గంధము మిశ్రగంధము అని మూఁడువిధము లయిన గంధములను గ్రహించెడి నాసికేంద్రియమును, సువచనము దుర్వచనము మిశ్రవచనము అనెడి త్రివిధవచనములు గల వాగింద్రియమును, దానము ప్రతిగ్రహము అనునవి గల పాణీంద్రియమును, గమనము ఆగమనము అనునవి గల పాదేంద్రియమును, రత్యానందము గల గుహ్యేంద్రియమును, విసర్జనము గల పాయురింద్రియమును, దిక్కులు గాలి సూర్యుఁడు వరుణుఁడు అశ్వినీదేవతలు అగ్ని దేవేంద్రుఁడు విష్ణువు మృత్యువు బ్రహ్మ అను అధిదేవతలయందు ధ్యానారాధనప్రతోపాసనాదులచేత చేర్చి ఆ యధిదేవతలను అధిదేవత యగు పరబ్రహ్మమందు ఆ యధిదేవతలను ఐక్యము చేసి తదేకనిష్ఠగా నుండుట దమము

వేదోక్తకులాచారకర్మములు విడువఁగూడని వైనను బ్రహ్మనిష్ఠకు విఘ్నము గలుగుటవలన వానిని క్రమముగా విడుచుచు ఆత్మనిష్ఠను ప్రబలించుచు చిత్తవృత్తిని యిటుపోనీయక బ్రహ్మసమాధియందు మరలించుట ఉపరతి

ప్రారబ్ధవశమునఁ గలిగెడి శీతోష్ణ సుఖదుఃఖ మానావమాన నిందాస్తుతి లాభాలాభ జయాపజయ జరామరణ శోకమోహ క్షుత్పిపాసాదులు మొదలయిన సకలద్వంద్వములలో నేది ప్రాప్తించినను తన నిష్ఠను వదలక వానివలన కలిగెడి ఖేదమోదములను సహించియుండుట తితీక్ష.

ప్రభు మిత్త్ర స్త్రీ వీరలతో సమానములగు శ్రుతిస్మృతులను, పురాణేతిహాసములను, భూతచోర యుద్ధ శృంగారాదికథలను, తనకు ప్రయోజనము గలుగఁజేయని సామాన్యశాస్త్రములను, స్వప్రయోజనముల నపేక్షించెడి అనాచార్యులను విడిచి ప్రతిప్రయోజనముల నొల్లని సదాచార్యులయందును, ఆఁకలి పోఁగొట్టుకొనుటకై తనవద్దకు వచ్చెడి బ్రహ్మవిదుఁడు మొదలగువారియందును విశ్వాసము కలిగి యుండుటే శ్రద్ధ.

వేదాంతశాస్త్రములయందుగల విషయములను ఆలోచించి మనస్సునందు సమాధానపఱచుకొనుటే సమాధానము.

మోక్షేచ్ఛ యనఁగా.—లోకమునందు యెల్లజనులు సుఖమును అపేక్షించుచున్నారు గాని అది మోక్షేచ్ఛ కాదు, ఇల్లు గాలుచుండఁగా పుత్త్రమిత్త్రకళత్రాదు లేమయిరో యని విచారపడి ఆ గృహమునందుఁ బ్రవేశించి అగ్నిచేతఁ గాలి ఆ పుత్త్రమిత్త్రాదులను విడిచి శీతలజలములో ప్రవేశించినరీతిని సంసారమునందలి తాపత్రయాగ్నిచేతఁ గాలినపురుషుఁడు ఈ సంసారతాపంబును దొలఁగించు సద్గురువు లెవరు? దీనికి సాధనము లేవి కావలయును? అని తపించుచుండు చిత్తవృత్తికి మోక్షేచ్ఛ యని పేరు; మఱియు మన స్సనెడి వ్యాఘ్రమును, ఆశ యనెడి కృష్ణసర్పమును, కామాదుల నెడి దొంగలను నిరాకరించుటకై పై నాలుగుసాధనములు కావలయును, అవి గలవాఁడే అధికారి; శ్రవణమునకు ముందే సాధనచతుష్టయసంపన్నుఁడై శ్రవణమును అపేక్షింపవలయును, లేనియెడల ఆ జన్మమున జ్ఞానము గలుగనేరదు, గురువు లయినవారు అనధికారులకు నుపదేశింపరు, ఎట్లనఁగా, శూద్రుఁడు యాగము చేసినను, ఉపనయనాది సంస్కారములు గలవాఁడైనను స్వర్గఫలబ్రాహ్మణత్వములెట్లు సిద్ధింపవో యట్టులనే సాధనచతుష్టయము లేనివానికి శ్రవణాదులచేత జ్ఞానఫలములు సిద్ధింపవు, కాఁబట్టి సాధనచతుష్టయసంపన్నుఁడై యుండవలయును.

## సప్తవిధబుద్ధినిరూపణము.

బుద్ధి పండ యని మేధ యని చార్వి యని చర్వ్య యని గృహీతి యని క్రాంతి యని ప్రతిభ యని యేడు విధములు, అందు తత్త్వమును తెలుసుకోఁదగిన బుద్ధి పండ యనఁబడును, విన్నవానినన్నిటిని మఱువక యుండుబుద్ధి మేధ యనఁబడును, ఊహాపోహాలయందు నేర్పుగల బుద్ధి చార్వి యనఁబడును, విషయములను చక్కఁగా నడిగి విసుగులేక వినుటయందు నోర్పుగల బుద్ధి చర్వ్య యనఁబడును, చెప్పినవానిని తప్పక గ్రహించు శక్తిగల బుద్ధి గృహీతి యనఁబడును, గురుగ్రంథములయందు సమానము గల బుద్ధి క్రాంతి యనఁబడును, ఏదేని యొకవిషయమును పలుకఁదలఁచినప్పుడు వాగ్ధోరణి గలిగి సమయోచితముగా శ్రుతిస్మృతీతిహాసానుభవములను పెక్కులు చూపి వినువారు ప్రశ్నలు సేయలేకుండ విషయములను తెలుపుటయందు శక్తిగల బుద్ధి ప్రతిభ యనఁబడును.

## సీత హనుమంతునకుఁ దారకయోగంబు బోధించుట.

మ. సుమతీ రాముఁడు నిర్వికారము సదా శుద్ధంబు బుద్ధం బచిం
త్య మవాచ్యం బతులం బతీంద్రియము సత్తామాత్రముల్ స్వప్రకా
శము నిర్ద్వంద్వము నిర్వికల్ప మజమున్ సత్సంవిదానందరూ
ప మమూర్తం బజరంబు కేవలపరబ్రహ్మంబు చింతింపఁగన్. ౨౫




టీక. సుమతీ = బ్రహ్మబోధార్హమైన విజ్ఞానము గల ఆంజనేయా, చింతింపఁగన్ = విచారింపఁగా, రాముఁడు = పరబ్రహ్మస్వరూపియైన శ్రీరామమూర్తి, నిర్వికారము = అస్తి జాయతే వర్ధతే పరిణమతే అపక్షీయతే వినశ్యతి అను షడ్వికారములు లేనిదియును, సదాశుద్ధంబు—సదా = ఎల్లప్పుడును, శుద్ధంబు = శుద్ధసత్త్వస్వరూపమును, బుద్ధంబు = జ్ఞానముచేత నెఱుఁగఁదగినదియును, అచింత్యము=తలఁపున కందనిదియును, అవాచ్యంబు = వాక్కున కందనిదియును, అతులంబు = సరిలేనిదియును, అతీంద్రియము = నేత్రశ్రోత్రాదీంద్రియములను మీఱినదియును, సత్తామాత్రమున్ = దేశకాలవస్తుకృత పరిచ్ఛేదశూన్యమును, స్వప్రకాశము = తనంతట వెలుఁగునదియును, నిర్ద్వంద్వము = సుఖదుఃఖాది ద్వంద్వములు లేనిదియును, నిర్వికల్పము = సంకల్పవికల్పములు లేనిదియును, అజమున్ = పుట్టుక లేనిదియును, సచ్చిదానందరూపము—సత్ = అనృతరహితమును, సంవిత్ = జడరహితమును, ఆనంద = దుఃఖరహితమును, రూపము = ఆకృతిగాఁ గలదియును, అమూర్తంబు = స్థూలసూక్ష్మకారణరూపము లేనిదియును, అజరంబు= ముదిమి లేనిదియు నగు, కేవలపరబ్రహ్మంబు—కేవల = ఏకమైన, పరబ్రహ్మంబు = పరమాత్మ.

తా. ఓ ఆంజనేయా! యీ గర్భములో నుండుట పుట్టుట పెరుగుట ముదియుట చిక్కుట చచ్చుట అనెడు షడ్వికారములు లేనిదై శుద్ధసత్త్వస్వరూపమై జ్ఞానముచేతనే యెఱుఁగఁదగినదై మనస్సుచేత యిట్టిదట్టి దని యూహించుటకును వాక్కుచేత యిట్టిదట్టి దని పలుకుటకును బుద్ధిచేత యిట్టి దని నిశ్చయించుటకును చిత్తముచేత యీవస్తువుగా నుండునా అని సందేహించుటకును నేత్రముచేత దశవిధరూపములలో యీ రూపము గల దని చూచుటకును శక్యము గానిదై సాటిలేనిదై యీచోట కలదు ఆచోట లేదు, ఈకాలమందు కలదు ఆకాలమందు లేదు, ఈ వస్తువునం దున్నది ఆ వస్తువునందు లేదు అనునవి లేనిదై తనంతటనే వెలుఁగుచున్నదై సుఖదుఃఖములు మానావమానములు జయాపజయములు మొదలయిన ద్వంద్వములు లేనిదై సంకల్పవికల్పములు లేనిదై స్థూలసూక్ష్మకారణదేహములు లేనిదై సత్తును చిత్తును ఆనందమును రూపముగాఁ గలదై ప్రకాశించు పరబ్రహ్మమే శ్రీరాముఁడని తాత్పర్యము.

క. అవికారుఁ డయ్యుఁ గనకము, వివిధాభరణంబు లైనవిధమున నితఁడే
దివియై భువియై రవియై, కవియై సర్వాత్ముఁడై ప్రకాశించుఁ దగన్. ౭౫

టీక. అవికారుఁడయ్యున్ = జననాదివికారములు లేనివాఁడైనను, కనకము = బంగారు, వివిధాభరణము లైనవిధమునన్ = పెక్కుతొడవు లైనట్లు, ఇతఁడే = ఈరాముఁడే, దివియై = ఆకాశమై, భువియై = భూమియై, ఇచ్చట ఆద్యంతము లైన భూమ్యాకాశములఁ జెప్పుటచేత తదంతర్భూతము లైన వాయ్వగ్నిజలములతోఁ జేరిన పంచభూతములను గ్రహింపవలయును, రవియై = సూర్యుఁడై, కవియై =

టీక అమలుఁడు = నిర్మలుఁడు, అకు నితనిసాన్నిధ్యమువలనన్ = ఐన యీరాముని సమీపమం దుండుటచేత, అతంద్రితనై = ఏమఱుపాటు లేనిదాననై, జగము = లోకమును, సృజింతున్ = త్రిగుణములచేత సగుణబ్రహ్మాదిదేవతా జంగమస్థావరాంత మయిన యిరువదియేడు భేదములు గల ప్రాణులతోడ పుట్టింతును, ఇట్లమరన్ = ఈరీతిని నావలన సృష్టి గలిగి యొప్పఁగా, జడులచేన్ = మూఢులచేత, తత్స్రష్టము = ఆ జగన్నిర్మాణము చేయుట, ఈ యసంగునియందున్ = ఏసంబంధము లేని యీరాముని యందు, కల్పింపఁబడున్ = ఆరోపింపఁబడును.

తా ఓ అంజనేయా! శాంత ఘోర మూఢవృత్తులు లేనివాఁడును, సచ్చిదానందరూపుఁడును నైన యీ శ్రీరామునిసన్నిధానమున నున్నందున కలిగిన బలిమిచేత మహాశక్తితో త్రిగుణములచేత సగుణ బ్రహ్మాదిదేవతా జంగమస్థావరాంత మయిన యిరువదియేడు భేదములు గల ప్రాణులతోఁ గూడిన పదునాలుగులోకములను నేనే పుట్టించు చుందును, మూఢు లీసంగతిని యెఱుఁగక అసంగుఁడైన యీ శ్రీరాముఁడే లోకములను పుట్టించుచు గిట్టించుచు వున్నాఁ డని పలుకుదు రని తాత్పర్యము

## త్రిగుణములచేనైన సృష్టి వివరణము

సత్త్వగుణమువలన చతుర్ముఖబ్రహ్మ మొదలగు ముప్పదిమూఁడుకోట్లదేవతలును పుట్టిరి

రజోగుణమువలన మనుష్యులు మృగములు పక్షులు పురుగులు జలచరములు లోనగు సకలజంగమ ప్రాణులును పుట్టెను.

తమోగుణమువలన భూమి పర్వత వృక్షపాషాణములు మొదలగు స్థావరము లన్నియు పుట్టెను; ఈ త్రిగుణములు ఒక్కటొక్కటితోఁ గలిసి సత్త్వసత్త్వము, సత్త్వరాజసము, సత్త్వతమస్సు, రజస్సత్త్వము, రజోరజస్సు, రజస్తమస్సు, తమస్సత్త్వము, తమోరజస్సు, తమోతమస్సు అని తొమ్మిది విధము లయ్యెను అందు —

సత్త్వగుణమందలి సత్త్వగుణమువలన విరాట్టు, సూత్రేశ్వరుఁడు మొదలగువారు పుట్టిరి

సత్త్వగుణమందలి రజోగుణమువలన దేవఋషులు, అఱువదినాలుగుకోట్లవాలఖిల్యులు, వైఖానసులు మొదలగువారు జనించిరి

సత్త్వగుణమందలి తమోగుణమువలన యక్షులు, రక్షస్సులు, విద్యాధరులు లోనగువారు జన్మించిరి.

రజోగుణమందలి సత్త్వగుణమువలన జనసంఘము పుదయించెను

రజోగుణమందలి రజోగుణమువలన నాలుగుకాళ్లు గల పశువులు, మృగములు మొదలగునవి కలిగెను

రజోగుణమందలి తమోగుణమువలన స్వేదజములు, అండజములు, జలచరములు లోనగునవి పుట్టెను

తమోగుణమందలి సత్త్వగుణమువలన పైరులు, కసవులు, గడ్డిపంటలు మొదలగునవి పుదయించెను.

తమోగుణమందలి రజోగుణమువలన చెట్లు, పొదలు, తీఁగలు లోనగునవి జనించెను.

తమోగుణమందలి తమోగుణమువలన భూములు, కొండలు, ఱాళ్లు మొదలగు స్థావరములు పుట్టెను.

మఱియు, సత్త్వమందలి సత్త్వము మొదలైన యీ తొమ్మిదియును ఒక్కటొక్కటితోఁ గలిసి సత్త్వతమస్తమస్సు, సత్త్వతమోరజస్సు, సత్త్వతమస్సత్త్వము, సత్త్వరజస్తమస్సు, సత్త్వరజోరజస్సు,

సత్త్వరజస్సత్త్వము, సత్త్వసత్త్వతమస్సు, సత్త్వసత్త్వరజస్సు, సత్త్వసత్త్వసత్త్వము, రజస్తమస్తమస్సు, రజస్తమోరజస్సు, రజస్తమస్సత్త్వము, రజోరజస్తమస్సు, రజోరజోరజస్సు, రజోరజస్సత్త్వము, రజస్సత్త్వతమస్సు, రజస్సత్త్వరజస్సు, రజస్సత్త్వసత్త్వము; తమస్తమస్తమస్సు, తమస్తమోరజస్సు, తమస్తమస్సత్త్వము, తమోరజస్తమస్సు, తమోరజోరజస్సు, తమోరజస్సత్త్వము, తమస్సత్త్వతమస్సు, తమస్సత్త్వరజస్సు, తమస్సత్త్వసత్త్వము అని యిరువదియేడు భేదము లయ్యెను, అందు.—

౧ సత్త్వగుణముతోఁ గలిసిన తమోగుణమందలి తమోగుణమువలన శేషుఁడు, వాసుకి, తక్షకుఁడు, కర్కోటకుఁడు, శంఖుఁడు మొదలగు సర్పములును, హాహా హూహూ మొదలగు గంధర్వులును, అశ్వముఖంబును నరశరీరంబును గల కిన్నరులును, మాణిభద్రుఁడు మొదలగు కింపురుషులును; కామరూపధరులును, ముప్పదియాఱ్వురు తుషితులును, నైరృతి మొదలగు రాక్షసులును, అసురేంద్రుఁడు లోనగు అఱువదియాఱుకోట్ల దైత్యులును, కుబేరుఁడు లోనగు యక్షులును మొదలగువారు పుట్టిరి.

౨. సత్త్వ..మందలి రజోగుణమువలన ముప్పదిమూఁడుకోటి దేవగణులును, యముఁడు, అంగిరసుఁడు, అగ్నిష్వాత్తుఁడు, కవ్యవాహనుఁడు, అజానుజానులు మొదలగు పితృదేవతలును పుట్టిరి

౩. సత్త్వ...మందలి సత్త్వగుణమువలన భూలోకమందలి జనులకు యజ్ఞిష్టోమాగి వైదికకర్మములను చేయు బుద్ధిపుట్టించుటకును, వారికి గమసాయుజ్యాదిపదవుల నిచ్చుటకును శక్తిగలిగి దేవలోకమం దుండు కర్మదేవతలును, సూర్యుఁడు మొదలగు నవగ్రహములును, వానిపరివారసమూహమును వసించు లోకములును పుట్టెను.

౧. సత్త్వగుణముతోఁ గలిసిన రజోగుణమందలి తమోగుణమువలన అణిమాదిసిద్ధులు గల విశ్వావసు పరావసు ప్రభృతిసిద్ధులును, మనుఁడు హనుమంతుఁడు విష్ణువు ధర్ముఁడు నారాయణుఁడు మొదలగు సాధ్యులును, బ్రహ్మర్షు లగు సనకాదిమునులును మొదలయినవారు పుట్టిరి.

౨. సత్త్వ...మందలి రజోగుణమువలన నిత్యపవిత్రు లగు వసిష్ఠాగస్త్య దధీచి గౌతమ భరద్వాజాది ఋషులును, శుక వామదేవ జాబాల్యాది మౌనులును, భగవన్నామపరాయణు లగు ప్రహ్లాద పుండరీక నారదాంబరీషాది పరమభాగవతులును పుట్టిరి,

౩ సత్త్వ...మందలి సత్త్వగుణమువలన ఇంద్రుఁడు మొదలగు దిక్పాలకులును, ముప్పదిమూఁడు కోట్ల వేలుపులును, బ్రహ్మ విష్ణు రుద్రేశ్వర సదాశివులును, బృహస్పతి విశ్వకర్మ నంది కుమార గణనాథాదులును, దూర్వాస దత్తాత్రేయాది మహర్షులును, కాలాగ్ని రుద్ర హాటకేశ్వరాగులును పుట్టిరి.

౧. సత్త్వగుణముతోఁ గలిసిన సత్త్వగుణమందలి తమోగుణమువలన విరాట్పురుషుఁడు, హిరణ్యగర్భుఁడు, అవ్యాకృతుఁడు, స్థూలసర్వేశ్వరుఁడు, సవికల్పకజ్ఞాననిష్ఠులు లోనగువారు పుట్టిరి.

౨. సత్త్వ...మందలి రజోగుణమువలన సూత్రాత్ముఁడు, సూక్ష్మసాక్షిఁడు, నిర్వికల్పకసమాధినిష్ఠులు, బ్రహ్మవిదుఁడు, బ్రహ్మవిద్వరుఁడు, బ్రహ్మవిద్వరీయుఁడు, బ్రహ్మవిద్వరిష్ఠుఁడు లోనగు జీవన్ముక్తులును పుట్టిరి.

౩ సత్త్వ...మందలి సత్త్వగుణమువలన సర్వజ్ఞత్వము సర్వేశ్వరత్వము సర్వాంతర్యామిత్వము సర్వకర్తృత్వము సర్వనియామకత్వము లోనగు మహాగుణములును, సృష్టి స్థితి సంహారము తిరోధానము అనుగ్రహము అనెడి పంచకృత్యములును గల పరమేశ్వరుఁడు పుట్టెను

౧. రజోగుణముతోఁ గూడిన తమోగుణమందలి తమోగుణమువలన అడవియీఁగలు తేళ్లు కందిరీఁగలు ఉసిళ్లు చీమలు యీఁగలు పాములు మిడుతలు మింటను వంటను పుట్టు జంగువు లగు మిడుఁగురుపురుగులు పట్టుపురుగులు ముఖముల్పురుగులు చెవటవల్ల పుట్టెడి పేలు ఈళ్లు గిరపేలు ఎల్లిలు నల్లులు దోమలు లోనగునవి పుట్టెన

౨ రజో... మందలి రజోగుణమువలన మొసళ్ళు యెండ్రకాయలు నత్తలు గవ్వలు తాబేటిచిప్పలు ముత్తెపుజిప్పలు సంకులు చేఁపలు నీటిపాములు కప్పలు జలగలు లోనగు జలజంతువులును పుట్టెను.

3 రజో మందలి సత్త్వగుణము వలన కాకులు పిచ్చుకలు చిలుకలు గోరువంకలు నెమళ్ళు హంసలు కొంగలు చక్రవాకములు చకోరకములు గండభేరుండములు శరభములు డేగలు సారసములు కోకిలములు గరుడపక్షులు గ్రద్దలు కాజులు వానకోయిలలు గువ్వలు కోళ్ళు పావురాళ్లు లోనగునవి పుట్టెను

౧. రజోగుణముతోఁ గూడిన రజోగుణమందలి తమోగుణమువలన సింహములు పులులు అడవిపందులు ఎలుఁగులు ఊరపందులు ఎలుకలు పందికొక్కులు కుక్కలు నక్కలు పిల్లులు బల్లులు చివఁగలు తోఁడేళ్ళు కొండేళ్లు గాడిదెలు చిరుతలు ఉడుములు లోనగునవి పుట్టెను.

౨ రజో. మందలి రజోగుణమువలన కోఁతులు ఏనుఁగులు గుఱ్ఱములు మేఁకలు గొఱ్ఱెలు ఎనుములు పునుఁగుజవ్వాజిపిల్లులు కస్తూరిమృగములు ఒంటెలు ఖడ్గమృగములు లోనగునవి పుట్టెను.

3. రజో మందలి సత్త్వగుణమువలన కామధేనుకులమునఁ బుట్టిన కతిగోవులు మొదలగు గోవులును చమరీమృగములు నల్లయిఱ్ఱులు జింకలు దుప్పులు లోనగునవి పుట్టెను.

౧. రజోగుణముతోఁ గూడిన సత్త్వగుణమందలి తమోగుణమువలన శూద్రులును, మంగల చాకల మాల మాదిగలును, శబర హూణ మ్లేచ్ఛ కంక కిరాతకులును, బోయ ఎఱుక ఏనాది చెంచు దొమ్మరి కమ్మరి సాలె జాండ్ర అగసాలె లోనగు జాతులవారును, మద్యమాంసభక్షకులును, జనభయంకరులును, చోరులును, కటికివాండ్రును, మఱియు ఘాతుకపుపనులు చేయువారును లోనగువారు పుట్టిరి.

౨ రజో మందలి రజోగుణమువలన చదువుట ఇచ్చుట పుణ్యకర్మములు చేయుట దుష్టనిగ్రహ శిష్టపాలన భూరక్షణములు లోనగు పనులు గల రాజులును, దున్నుట ఆవులఁ గాచుట బేరమాడుట లోనగుపనులు గల కోమట్లును శేరులును లోనగు వారు పుట్టిరి.

3. రజో మందలి సత్త్వగుణమువలన బ్రహ్మవాదులును, వేదశాస్త్రాది విద్యాధ్యయనసంపన్నులును, బ్రహ్మచర్యాద్యాశ్రమాచారవంతులును అయిన ఆంధ్ర కర్ణాట ద్రావిడ ఘూర్జర మహారాష్ట్రు లనెడు పంచవిధద్రావిడులును, ఉత్కల మైథుల గౌడ కనోజ సారస్వత సాత్వర్యు లనెడి పంచగౌడులును పుట్టిరి, వీరే దశవిధబ్రాహ్మణులు.

౧. తమోగుణముతోఁగూడిన తమోగుణమందలి తమోగుణమువలన నీళ్లులేనిస్థానములును, కొండలు ముండ్లచెట్లు గుండ్లు రాళ్ళు లోనగునవి గలిగి జనులచేత పోఁగూడని మార్గములును, జనులు సంచరింపఁదగని కొండలును, మొఱపనేలలును, చవిటినేలలును, తృణకాష్ఠజలసమృద్ధులు లేక క్షేత్రబ్రాహ్మణవర్జితములును నై పరోపకారరహితులును కేవలతమోగుణజనులకు నివాసము లై కంపు చేదు ఉప్పు గల జలములు గలిగి భూతదయాపశ్చాత్తాపములు లేక భూత బేతాళ బ్రహ్మరాక్షసాది దుష్టగ్రహనివాసము లై తామసాహారములును తామసదానములును తామసతపస్సులును తామసశ్రద్ధలును తామసయజ్ఞములును గల జనులు వసించు గ్రామములు గల దేశములును పుట్టెను.

౨. తమో...మందలి రజోగుణమువలన సారవంతములైన పంటలకుఁ దగిన తియ్యని నీటియేళ్లని ళ్లు కలిగి రాజసాహారములు దానములు తపస్సులు శ్రద్ధలు యజ్ఞములు గల జననివాససంచారసౌభాగ్యము లయిన భూములును, మృదువులయి జారచోరకంటకరహితములయిన మార్గములును, మేలయిన గొందులును, రేగటిమన్ను ఎఱ్ఱనిమన్ను గల నేలలును, మృగువులై మనుష్యకార్యములకు సౌభాగ్యములయిన .. ళ్ళును, సామాన్యజనులచే పూజింపఁబడెడి దేవబ్రాహ్మణనివాససౌభాగ్యము లయిన యూళ్లును గల దేశములును జనించెను.

౩. తమో. మందలి సత్త్వగుణమువలన పుణ్యక్షేత్రములును, గంగాదిపుణ్యనదులును, పాత్రోబలములు గలిగి దేవతలచేతను బ్రాహ్మణులచేత నెల్లప్పుడు సేవింపఁబడెడు కాశీ కాంచి మధుర అయోధ్య ద్వారవతి అవంతి లోనగు పుణ్యపట్టణములు గల భూములును, వేంకటాద్రి పక్షిభద్రగోపగిరి భద్రాద్రి సింహాద్రి అరుణాచలము శ్రీశైలము అగస్త్యగిరి కైలాసము హిమాలయము మేరుగిరి మందరపర్వతము లోనగు పుణ్యపర్వతములును, గోపీచందన శ్వేతమృత్తికలును, ఫలపుష్పపత్త్రసౌభాగ్యములగు చెట్లు గల నేలలును, సజ్జనసంసారమార్గములును, సాలగ్రామ బాణలింగ శోణభద్ర గణపతి స్వర్ణముఖరి గోమేధకములును, యమునారాళ్లు లోనగుశిలలును, బంగారు వెండి లోనగు లోహములు పుట్టెడు చోట్లును, వజ్రములును వైడూర్యము లోనగు రత్నములగనులు గల నేలలును, బ్రాహ్మవిద్య బ్రహ్మనిష్ఠ బ్రహ్మనిష్ఠులు బ్రహ్మవిద్వరిష్ఠు లగు మహర్షులసంచారములకును నివాసములకుఁ దగిన స్థలములును, సాత్త్వికాహారగానము యజ్ఞశ్రద్ధలు గల జనులకు నివాసపాత్రము లగు క్షేత్రములును పుట్టెను.

౧ తమోగుణముతోఁ గూడిన రజోగుణమందలి తమోగుణమువలన వేఁగ ముండ్లు గలిగి గిడసలు పువ్వులు పండ్లు లేక నిద్రాలస్యములు సోమరితనము లోనగు తామసగుణములు గల గుగ్గిలములు గల ముష్టి వేప తుమ్మ బలురక్కసి నాగజెముడు జాతి తాడి ఈఁత లోనగు నిష్ప్రయోజనపు చెట్లును, దుర్గంధ సహితము లయి అల్పజలము గల యేళ్లును, పిశాచగుహ్యకజనసంచారమునకుఁ దగిన యూళ్లును పుట్టెను.

౨. తమో. గుణమందలి రజోగుణమువలన రాజసజనులకు సౌభాగ్యము లయిన సఫలపుష్పపత్త్రములు గలిగి ఔషధములకును భక్షణములకును దగిన నిమ్మ దానిమ్మ జమ్మి నుష్టి జానుగ వేము చింత లోనగు తరువులును, మనుష్యులచేత సేవింపఁదగిన పుష్పములు శృంగారపు పొదలు పొదరిండ్లును పుట్టెను

౩. తమో. .మందలి సత్త్వగుణమువలన సాత్త్వికజనులకుఁ దగిన అరఁటి పనస మామిడి వెలగ రాగి తులసి బిల్వము మల్లె లోనగు చెట్లును, యజ్ఞములకుఁ దగిన చంద్ర మోదుగ గుగ్గరణి దర్భ లోనగు నవియును, దేవర్షులు బ్రాహ్మణులు లోనగు సత్త్వములచేత పూజింపఁదగిన పద్మములు కలువలు కల్హారము పారిజాతము మందారము హరిచందనము సంతానము లోనగు కల్పవృక్షములును, పొన్నలు సురపొన్నలు లోనగునవియును పుట్టెను

౧. తమోగుణముతోఁ గూడిన సత్త్వగుణమందలి తమోగుణమువలన తమిద గోలక జొన్న కొఱ్ఱ సజ్జ ఆరిక వరిగ మొదలగు క్షుద్రధాన్యములును, ఆవాలు మిరియాలు మిరపకాయలు మొదలగునవి పండెడి నేలలును పుదయించెను.

౨ తమో.. మందలి రజోగుణమువలన వల్లవరి కంది నువ్వు మినుము అనుము ఆముదములు లోనగు పైరులును, జాజికాయలు లవంగములు ఏలకాయలు పసుపు లోనగునవి పండెడు నేలలును పుట్టెను.

3 తమో.. మందలి సత్త్వగుణమువలన తెల్లవరి సన్నవరి నివ్వరివరి పెసలు గోధుమలు యవలు చామలు చెఱకు మే లగుకాయలు పండ్లు ఆకులు పూవులు మొదలయినవి పండెడు నేలలును పుట్టెను.

ఇవ్విధముగ సమష్టిరూప మైన మూలవిద్య వ్యష్టిరూప మయిన తూలావిద్య యనెడు రెండురూపములు గల మలినసత్త్వప్రధానయగు మూలప్రకృతి తనత్రిగుణములచేత తొలుత త్రిశక్తులుగ గోచరించి వెనుక ఆత్రిగుణపరస్పరసమ్మేళనమువలన నవవిధములయి పిదప ఆనవవిధాన్యోన్యసమ్మిళితముచేత సప్తవింశతి విధము లయి తెల్లనివస్త్రమున చిత్రములు కల్పిత మయినట్లు శుద్ధపరబ్రహ్మమందు పైఁ జెప్పఁబడిన యిరువదియేడు భేదములు గల సృష్టి గలయట్లు గనపఱచెను. మఱియు వేదపురుషుఁడు నీయిరువదియేడు భేదములు గల సృష్టికి కారణ మయిన ప్రకృతిమయ మగు గాయత్రి మూడుపాదములను 'భూర్భువస్సువ' యను వ్యాహృతిత్రయముతోడ నిరువదియేడక్షరములును గల దని చెప్పి దానిని ద్విజాతు లగు బ్రహ్మక్షత్త్రియ వైశ్యులకు తారతమ్యతచేత నుపాస్యముగ నిర్ణయించెను మఱియు, గాయత్రికి మాఱురూప మగు యజ్ఞోపవీతమును మూఁడుసూత్రములు గలది, అం దొక్కొకసూత్రమునకు మూఁడేసి అంతరసూత్రములు గలవు; ఆ యాంతరసూత్రములయం దొక్కొక్కటికి మూఁడుమూఁడుపోగులు గలవు గాన మూడుపెద్దపోగులు గల ఆయజ్ఞోపవీతము యిరువదియేడుపోగులు గల దయ్యెను, ఆ తంతువులే యిరువదియేడు భేదములు గల జగత్తు, ఆ జగద్రూప మగు యజ్ఞోపవీతమునే గాయత్రి యని ద్విజాతులు ధరించి పరబ్రహ్మము నుద్దేశించి సర్వకర్మములను చేయవలయు ననియు, దాని ధరించుదాఁక కర్మకాండ మనుష్ఠింపవలయు ననియు, వెనుక సద్గురుకరుణచేత విజ్ఞానము కలిగి గాయత్రిని యజ్ఞోపవీతప్రపంచవిచారణ చేసి యజ్ఞోపవీతమందలి మూఁడు తంతువులకు కూటస్థాన మైనముడియే బ్రహ్మముడి యనియు, అదియే అమలసత్త్వప్రధాన యగు గుణసామ్యావస్థ యనియు తెలిసి ఆయజ్ఞోపవీతమును పరిత్యజించుటే సన్న్యాస మనియు, అతఁడే బ్రహ్మకాండ మనుష్ఠించువాఁ డనియు తెలిపెను, ఈ కిటుకు తటుకునఁ దెలిసినవాఁడే సర్వకర్మవిముక్తుఁ డైన జీవన్ముక్తుఁడు, పైఁ జెప్పిన యీ యిరువదియేడుభాగములును సారెసారెకు ఒకటితో నొకటి కలయఁగా అనేకవిధసృష్టులు గలుగును గుణత్రయవివేకశాస్త్రమునుబట్టి నాకు గోచరించినవఱకు వ్రాసితిని కాన బుద్ధిమంతు లగువారు మీఁదుమీఁదుగా నూహించునది ఇందులకు స్మృతిశ్రుతులు ( శ్లో॥ దైవీహ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా । మామేవ యే ప్రపద్యంతే మాయా మే తాంతరంతి తే'. తా॥ ఈ మాయ త్రిగుణస్వరూపి, నా సన్నిధానబలమున సకలప్రాణులను నాయందు తన త్రిగుణములవలన కల్పించి వానియందు క్రీడించుచుండును, అస్మచ్ఛబ్దనాద్యుఁడ నైన నన్నెఱిఁగి పొందువారు యీ మాయ నతిక్రమింతు రని తాత్పర్యము, ఇట్లని గీతావచనము

'శ్రుతి॥ అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీగ్ం సరూపాం అజో హ్యేకో జుషమాణోనుశేతే జహాత్యేనాం భుక్తభోగామజోన్యః' తా॥ మూలప్రకృతిసూర్యకాంతి సూర్యునకు వేఱుగానియట్లు పరబ్రహ్మము నెడబాయక అస్వరూపమాత్రముగ నుండెడు శుద్ధసత్త్వప్రధానము అసూర్యకాంతి సూర్యునివీడకనే వెలుపలవ్యాపించి చీఁకటిని తనయందు నణఁచుకొని తనయందా సూర్యుఁడు గలదిగాఁ బ్రకాశించుతీరున అపరబ్రహ్మమును విడువకనే బహిర్వ్యాపకము గలదై సృష్టిస్థితిలయాగులు లేని పరబ్రహ్మమును తా నావరించి అది తనయందు గలయట్లుగను దానికి సృష్టిస్థితిలయాదులు కలయట్లుగను కనఁబడజేయు మలినసత్త్వప్రధానము అనెడు రెండురూపములు గలది, అం దొక్కటి యగు మలినసత్త్వప్రధానము పుట్టుకలేనిది, ఎఱుపు తెలుపు నలుపు వన్నెలు కలది, నానావిధరూపములతోఁ గూడిన బహువిధము లైన ప్రాణులను పుట్టించునది, సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యమై యుత్పత్తి లేని

డగు పరబ్రహ్మకు ఆ ప్రకృతియందే ప్రవేశించి మగ్నమై యుండుటను. అట్లుగాని అనుభవింప వీలుపడు భోగములు గల యీప్రకృతిసంబంధము లేనివాఁడు యగుటవల్ల ఈ జ్ఞాని ప్రకృతి కతీతుఁడైన పరబ్రహ్మస్వరూపుఁడై యుండు ననుట.

శ్రుతి॥ సశిఖాం వపనం కృత్వా బహిస్సూత్రం త్యజేద్బుధః । బ్రహ్మసూత్ర మిదం ప్రోక్తం సూత్రం నామ పరంపదమ్ । తత్సూత్రం ధారయే ద్యోగీ స విప్రో వేదపారగః॥ అని బ్రహ్మోపనిషత్తు.

తా॥ పండితుఁ డగువాఁడు శిఖాధారణము ముండనము లోనగు కర్మములను ముఖ్యము లని యెన్నక వెలుపలి యజ్ఞోపవీతధారణము వ్యర్థ మనియు బ్రహ్మసూత్రధారణమే ముఖ్య మనియు నా సూత్రమును ధరించినవాఁడే బ్రాహ్మణుఁడు, యోగి, వేదములను తుదముట్ట నెఱిఁగినవాఁడు అని యెఱుఁగవలయు నని తాత్పర్యము. బ్రహ్మసూత్ర మనఁగా - త్రిగుణవిభాగములవలన నైన యిరువదినాలుగు భేదములు గల త్రివిధ ప్రకృతికంటె పర మగు పరమపద మని భావము.

వ. అది యెట్లనిన నాకర్ణింపుము. అయోధ్యానగరంబున నతినిర్మలంబైన రఘు వంశంబునం దీతనిజన్మంబును, విశ్వామిత్రసహాయత్వంబును, తన్మఖరక్షణంబును, అహల్యాశాపశమనంబును, హరధనుర్భంగంబును, మత్పాణిగ్రహణంబును, పరశు రామపరాక్రమభంజనంబును, పురప్రవేశంబును, దండకారణ్యగమనంబును, విరాధవధంబును, శూర్పణఖా కర్ణ నాసికాచ్ఛేదనంబును, ఖర దూషణ త్రిశిరః ప్రముఖ రాక్షస ఖండనంబును, మాయామారీచహరణంబును, మాయాసీతాప హరణంబును, జటాయు కబంధ మోక్షలాభంబును, శబరిపూజనంబును, సుగ్రీవ సమాగమంబును, వాలివధంబును, సీతాన్వేషణంబును, సముద్రసేతుబంధనం బును, లంకానిరోధంబును, భీమసంగ్రామంబున భ్రాతృపుత్రపౌత్రబాంధవసహిత జనాదిసహితంబుగా రావణహరణంబును, విభీషణరాజ్యప్రదానంబును, పుష్ప కారోహణంబును, మత్సమేతంబుగా సాకేతపురగమనంబును, రాజ్యాభిషేకం బును మొదలుగాఁ గల కార్యంబు లన్నియు నాచేత నాచరితంబు లయ్యె; అట్లగు చుండ నిర్వికారుం డఖిలాత్మకుం డైన యీ రామునియందు దజ్ఞానులచే నారోపింపఁ బడుఁ గావున. ౭౯

టీ॥ అదియెట్లనినన్ = ఆ యారోపింపఁబడుట యెట్లనఁగా, ఆకర్ణింపుము = వినుము. అయోధ్యా నగరంబునన్ = అయోధ్యాపురమందు, అతినిర్మలంబైన = మిగులపవిత్రమైన, రఘువంశంబునందున్ = రఘుకులమందు, ఇతనిజన్మంబును = ఈ శ్రీరామునిపుట్టుకయును, విశ్వామిత్రసహాయత్వంబును = విశ్వా మిత్రమహర్షికి తోడ్పడుటయును, తన్మఖరక్షణంబును—తత్ = ఆ విశ్వామిత్రుని యొక్క, మఖ = యజ్ఞము యొక్క, రక్షణంబును = రక్షించుటయును, అహల్యాశాపశమనంబును—అహల్యా = అహల్యాదేవి యొక్క, శాపశమనంబును = శాపమును పోఁగొట్టుటయును, హరధనుర్భంగంబును = శివునివిల్లు విఱుచుట యును, మత్పాణిగ్రహణంబును—మత్ = నాయొక్క, పాణిగ్రహణంబును = వివాహమును, పరశురామ పరాక్రమభంజనంబును—పరశురామ = జామదగ్ని యొక్క, పరాక్రమ = మగఁటిమిని, భంజనంబును = అడఁచుటయును, పురప్రవేశంబును = అయోధ్యాపట్టణము ప్రవేశించుటయును, దండకగమనంబు ...

బును = దండక యను నడవికి పోవుటయును, విరాధవధంబును = విరాధుఁ డనెడు రాక్షసుని చంపుటయును, శూర్పణఖా = చుప్పనాతియొక్క, కర్ణ = చెవులను, నాసికా = ముక్కును, ఛేదనంబును = కోయుటయును, ఖర = ఖరుఁడు, దూషణ = దూషణుఁడు, త్రిశిరః = త్రిశిరుఁడు, ప్రముఖ = మొదలయిన, రాక్షస = రక్కసులయొక్క, ఖండనంబును = చంపుటయును, మాయామారీచహరణంబును = మాయలేడియై వచ్చిన మారీచుని చంపుటయును, మాయాసీతాపహరణంబును = మాయాసీతను రావణుఁడు కొనిపోవుటయును, జటాయుకబంధమోక్షలాభంబును—జటాయు = జటాయు వనెడి పక్షికిని, కబంధ = కబంధుఁ డనెడు రాక్షసునకును, మోక్షలాభంబును = కైవల్య మిచ్చుటయును, శబరీపూజనంబును—శబరీ = శబరి యను కిరాతస్త్రీయొక్క, పూజనంబును = అర్చనయును, సుగ్రీవసమాగమంబును—సుగ్రీవ = సుగ్రీవునితోడ, సమాగమంబును = చెలిమిచేయుటయును, వాలివధంబును = వాలిచావును, సీతాన్వేషణంబును—సీతా = మాయాసీతయొక్క, అన్వేషణంబును = వెదకుటయును, సముద్రసేతుబంధనమును = సముద్రమునకు కట్ట కట్టుటయును, లంకానిరోధంబును = లంకాపురమును ముట్టడి వేయుటయును, భీమసంగ్రామంబునన్—భీమ = భయంకర మైన, సంగ్రామంబునన్ = యుద్ధమందు, భ్రాతృ = తోడఁబుట్టువులు, పుత్ర = కొడుకులు, పౌత్ర = మనుమలు, బాంధవ = చుట్టములు, హితజన = చెలికాండ్రు, ఆది = మొదలగువారితోడ, సహితంబుగాన్ = గూడినట్లుగా, రావణహరణంబును = రావణుని చంపుటయును, విభీషణరాజ్యప్రదానంబును = విభీషణునకు లంకారాజ్య మిచ్చుటయును, పుష్పకారోహణంబును = పుష్పక మనెడు విమానము నెక్కుటయును, పత్నీసమేతంబుగాన్ = నాతోడ, సాకేతపురగమనంబును = అయోధ్యాపట్టణమునకు వచ్చుటయును, రాజ్యాభిషేకంబును = శ్రీరామపట్టాభిషేకమును, మొదలుగాఁగల కార్యంబులన్నియున్ = మొదలగు పనులన్నియును, నాచేత నాచరితంబులయ్యెన్ = నాచేతనే చేయంబడెను అట్లగుచుండన్ = అట్లు నాచేతనే చేయఁబడిన వగుచుండఁగా, నిర్వికారుండు = షడ్భావవికారములు లేనివాఁడును, అఖిలాత్మకుండు = సర్వజగద్రూపియు, ఐన = ఐనట్టి, ఈ రామునియందున్ = ఎదుట నుండెడు శ్రీరామచంద్రునియందు, అజ్ఞానులచేతన్ = పామరులచేత, ఆరోపింపఁబడుగావునన్ = మీఁదు జెప్పఁబడిన రావణసంహారాదికార్యము లన్నియు సత్యముగా శ్రీరామునిచేతనే చేయఁబడె నని కల్పింపఁబడును గనుక.

తా॥ ఓ ఆంజనేయా! అయోధ్యాపురమందు మిక్కిలి పవిత్ర మైన రఘువంశమున నీ శ్రీరాముఁడు పుట్టుటయును, విశ్వామిత్రునకు తోడుపడి అతని యాగమును కొనసాగించుటయును, అహల్యాదేవిశాపమును తీర్చి శివునివిల్లు విఱిచి నన్ను పెండ్లాడుటయును, పరశురాముని భంగపెట్టి అయోధ్యానగరమున ప్రవేశించుటయును, దండకారణ్యమునకు పోయి విరాధుని వధించి చుప్పనాతిముక్కును చెవులను కోయుటయును, ఖరుఁడు దూషణుఁడు త్రిశిరుఁడు మొదలైన రక్కసులను చక్కఁజేయుటయును, మాయామృగ మైన మారీచుని త్రుంచుటయును, రావణుఁడు మాయాసీత నెత్తుకొని పోవుటయును, జటాయువునకును కబంధునకును మోక్ష మిచ్చి శబరిచేత పూజింపఁబడుటయును, సుగ్రీవునితో స్నేహము చేసి వాలిని చంపుటయును, వానరులు మాయాసీతను వెదకుటయును, సముద్రమునకు వారధి గట్టి లంకాపట్టణమును ముట్టడించి ఘోరయుద్ధమందు తోడఁబుట్టువులు కొడుకులు మనుమలు చుట్టములు స్నేహితులు మొదలయినవారితోడ రావణుని చంపుటయును, విభీషణుని లంకారాజ్యమునకు పట్టముగట్టి పుష్పకవిమాన మెక్కి నాతోడ అయోధ్యాపురమునకు వచ్చి శ్రీరాముఁడు పట్టము కట్టుకొనుటయును మొదలయిన పను లన్నిటిని నేనే చేసితిని అట్లుండఁగా జననమరణాదివికారములు లేని

వాఁడును, సర్వలోకస్వరూపుఁడును అయిన యీ శ్రీరామమూర్తియే రావణసంహారాదికార్యముల నన్నిటిని చేసె నని మూఢులు పలుకుదు రని తాత్పర్యము

ఉ॥ రాముఁడు నిర్వికారుఁడు నిరామయుఁ డవ్యయు డక్షయుండు ని
ష్కాముఁ డతీంద్రియుం డజుఁ డకర్త యభోక్త యసంగుఁ డంతరా
రాముఁడు నిర్వికల్పుఁడు నిరంజనుఁ డద్వయుఁ డైన యాపరం
ధాముఁడు గాని చారుగుణధాముఁడు గాఁడు సమీరనందనా. ౮౧

టీక సమీరనందనా = ఆంజనేయా, రాముఁడు = సచ్చిదానందస్వరూపి యైన శ్రీరాముఁడు, నిర్వికారుఁడు = రాగాదివికారములు లేనివాఁడును, నిరామయుఁడు = అశరీరి యగుటవలన రోగములు లేనివాఁడును, అవ్యయుఁడు = లింగవిభక్తిరూపనామక్రియలు లేనివాఁడును, అక్షయుండు = నశింపనివాఁడును, నిష్కాముఁడు = కోరిక లేనివాఁడును, అతీంద్రియుండు = ఇంద్రియముల కగపడనివాఁడును, అజుఁడు = జననము లేనివాఁడును, అకర్త = ఒక కార్యమును చేయనివాఁడును, అభోక్త = పుణ్యపాపమిశ్రకర్మానుభవము లేనివాఁడును, అసంగుఁడు = దేనియందుఁ దగులనివాఁడును, అంతరారాముఁడు = సర్వజీవుల యంతరంగములయందు నంతర్యామిరూపముగాఁ గ్రీడించువాఁడును, నిర్వికల్పుఁడు = సృష్టిస్థితిలయములఁ జేయనివాఁడును, నిరంజనుఁడు = సాధనాంతరాపేక్షుఁ డైనవాఁడును, అద్వయుఁడు = స్వేతరవస్తుశూన్యుఁడును, అయిన = అయినట్టి, ఆ పరంధాముఁడు గాని = సూర్యచంద్రాదుల కాంతులను మీఱిన కాంతి గల పరమాత్మ గాని, చారుగుణధాముఁడు గాఁడు—చారు = సుందరము లయిన, గుణ = శాంతి శమదమాద్యనంతకల్యాణగుణములకు, ధాముఁడు గాఁడు = స్థానభూతుఁడు గాఁడు.

తా॥ ఓ ఆంజనేయా ! రాగము ద్వేషము కామము క్రోధము మొదలయిన దుర్గుణములవికారములు లేనిదియును, శరీరము లేనందున రోగములు లేనిదియును, లింగమును విభక్తియును రూపమును నామమును క్రియలును లేనిదియును, నశింపనిదియును, కోరికలు లేనిదియును, వాక్కు మనస్సు మొదలగు నింద్రియములకు అందనిదియును, జననము లేనిదియును, ఒక కార్యమును చేయనిదియును, పుణ్యపాపమిశ్రకర్మఫలానుభవము లేనిదియును, దేనియందును తగులుకొననిదియును, స్థావరము లని జంగము లని రెండు విధము లయిన ప్రాణులఅంతరంగములయందు జీవరూపముచేత క్రీడించునదియును, సృష్టి స్థితి లయ తిరోధాన అనుగ్రహములను చేయనిదియును, వేఱొకసాధనము కోరనదియును, తనకంటె వేఱైనవస్తువు లేనిదియునుఅయిన నిర్గుణపరబ్రహ్మమే శ్రీరామచంద్రుఁ డని తాత్పర్యము.

## రా గ ద్వే షా దు ల వి వ ర ణ ము.

రాగము ద్వేషము కామము క్రోధము లోభము మోహము మదము మాత్సర్యము ఈర్ష్య అసూయ డంభము దర్పము అహంకారము అని పదుమూఁడు విధములు, అందు.—

రాగ మనఁగా.— పరస్త్రీవిషయికముగ కలిగెడు చిత్తవృత్తి, ఇందువలన మహాబలశాలి యైన రావణుఁడు సీతాదేవిని చెఱఁబెట్టి పుత్త్రమిత్త్రభ్రాతృబంధుపరివారముతోడ నశించెను

ద్వేష మనఁగా.—ఒకఁడు అపకారము చేయుఁగా వానికి మరల అపకారము చేయవలయు ననెడి చిత్తవృత్తి, ఇందువలన హిరణ్యకశిపుండు దురాచారుఁ డయిన తనతమ్ముని వరాహరూపుఁ డైన హరి హరిగొనె నని ద్వేషించి ఆ మాధవుని వధింప శపథము చేసి నరసింహరూపమును ధరించిన ఆ నారాయణుని చేత తానును నశించెను.

కామ మనఁగా.—ఇండ్లు తోఁటలు మాన్యములు ధనము ధాన్యములు పశువులు స్త్రీలు మొదలగు వానిని మిక్కిలిగ సంపాదింపవలయు ననెడి చిత్తవృత్తి, దీనివలన నరకాసురుఁడు అనేకస్త్రీలను పట్టి తెచ్చి చెఱఁబెట్టి శ్రీకృష్ణమూర్తిచేత చచ్చెను.

క్రోధ మనఁగా.—తాను చేయునట్టి పనులకు విఘ్నము చేయువానిని శిక్షింపవలయు నని యుగ్రముగాఁ గలిగెడు చిత్తవృత్తి, ఇందువలన బకాసురుఁడు యేకచక్రపురనివాసు లగు బ్రాహ్మణులను బాధించుచుండి వారిప్రేరణమున వచ్చిన భీమునితో పోరి ఆరిపోయెను.

లోభ మనఁగా —తనకు లభించినపదార్థమును యితరుల కివ్వరా దను చిత్తవృత్తి, ఇందువలన రాజరాజైన దుర్యోధనుఁడు తనజ్ఞాతు లయిన పాండవులకు రాజ్యమున సగముభాగ మియ్యక పుత్త్రమిత్త్రసహోదరబంధువులతోడ వారిచేత మడిసెను.

మోహ మనఁగా —పుత్త్రకళత్రధనాదులయందు మిక్కుటపుప్రేమ గలిగి యుక్తాయుక్తముల నెఱుఁగని చిత్తవృత్తి, ఇందువలన దశరథమహారాజు తనభార్య యగు కైకయందలి ప్రీతిచేత సత్యశీలాది సద్గుణనిధి యైన శ్రీరాముని అడవులకుఁ బంపి అందువలన తానును మృతిఁ బొందెను.

మద మనఁగా —సకలసంపదలు గలిగి గర్వాంధుఁడై నే నేమిజేసినను చెల్లు నని తోఁచెడు చిత్తవృత్తి, ఇందువల్ల జమదగ్నిమహర్షి యొక్క హోమధేనువును కార్తవీర్యార్జుని పుత్త్రులు క్రొవ్వుచేత నపహరించి పరశురాముని నెదిరించి యుద్ధమందు తామును తమతండ్రి యగు కార్తవీర్యుఁడును నీల్గిరి

మాత్సర్య మనఁగా.—ఇతరులు తనకంటె నెక్కువైన విద్యయును ఐశ్వర్యమును చక్కఁదనమును భోగమును వర్చస్సును శరీరబలమును పరాక్రమమును గలవారై యుండఁగా జూచి రోగాగ్నిజ్వాలలకు కుండి పడు చిత్తవృత్తి, ఇందువలన శిశుపాలుఁడు ధర్మరాజు చేయు రాజసూయయాగమందు కృష్ణుని వైభవమును చూచి యోర్వక తిట్టి చక్రముచేత గిట్టెను

ఈర్ష్య యనఁగా.—నాకు వచ్చినకష్టములు యితరులకు రావలయు నను చిత్తవృత్తి, ఇందువల్ల అరుణాక్షుఁ డనువాఁడు తనతో సమానుఁ డగు బాణునకు దుఃఖములు రాఁగోరి అతనిచేతఁ బ్రాణములు కోలుపోయెను

అసూయ యనఁగా —తనకు గలిగిన సుఖములు యితరులకుఁ గలుగరా దను చిత్తవృత్తి; ఇందువలన పుండ్రకదేశపురాజగు వాసుదేవుఁడు వాసుదేవుఁ డను పేరు నాకుఁ దగును గాని యితరునికిఁ దగునా యనెడు విరోధముచేత వాసుదేవుఁ డైన శ్రీకృష్ణమూర్తితో మచ్చరించి చచ్చెను.

డంభ మనఁగా —తాను చేసిన పనులు పరులెఱిఁగి హెచ్చుగా మెచ్చుకోవలయు నను చిత్తవృత్తి, ఇందువల్ల అశ్వత్థామ్యుఁడు తనయోగమును చూడు మని దుర్వాసునితోఁ బలికిన నాతఁడు యిది డంభ మనఁగా వాఁడు రోషించి దూర్వాసుని దూషించి తనను భూషించికొని విఫలము నొందెను.

దర్ప మనఁగా.—నేను సర్వవిషయములయందు సమర్థుఁడను, నాకు సాటి యైన మేటి యొకఁడు లేఁ డను చిత్తవృత్తి, ఇందువల్ల త్రిలోకకంటకుఁ డైన దశకంఠుఁడు క్రొవ్వి యెవ్వరిని లక్ష్యచేసి నాకెవ్వరీడని తిరుగుచుండ విష్ణుదేవుఁడు శ్రీరాముఁడై యుదయించి కదనమున వానిని వధించెను

అహంకార మనఁగా.—ఓరీ నిన్ను శిక్షించువాఁడ నని యెఱుఁగవా, నేను పట్టినపట్టుకు కుడమూట్టింపక నట్టనడుమను విడిచిపెట్టునట్టివాఁడను గాను అని యితరులను అదలించు చిత్తవృత్తి; దీనివలన మధుఁడు కైటభుఁడు అనెడు టక్కరిరక్కసులు అహంకరించి విష్ణుదేవునితోఁ గలహించి కాలము చేసిరి.

కనుక బుద్ధిమంతులును, శ్రీభగవత్సేవాపరులును, ముముక్షువులును నైనవారు ఈ గుణగణములను తనయొద్ద చేరనీయక పెద్దలను సేవించుచు వేదాంతశాస్త్రశ్రవణము చేయుచు నుండవలయును

క. మాయాగుణానుగతుఁడై, పాయక నానావిధప్రపంచం బితఁడే
సేయు నని తోఁచు నేమియుఁ, జేయఁ డసంగుం డకర్త సిద్ధము వత్సా   ౮౧

టీక. వత్సా = ఆంజనేయా, మాయాగుణానుగతుఁడై—మాయా = బ్రహ్మచైతన్యము గలిగిన దానిగా ప్రతిఫలింపఁ జేసికొను కారణరూపప్రకృతి యగు మాయయొక్క, గుణ = సత్త్వరజస్తమోగుణము లను, అనుగతుఁడై = పొందినవాఁడై, పాయక = విరామము లేక, నానావిధప్రపంచంబు—నానావిధ = బహువిధము లైన, ప్రపంచంబు = జగమును, ఇతఁడే = ఈ రాముఁడే, సేయు నని = సృజించును నని, తోఁచుక = కాన్పించును, ఏమియుఁ జేయఁడు = మాయాగుణాతీతుఁ డగుటవలన నేకార్యమును చేయునట్టివాఁడు, అసంగుండు = నిమిత్తకారణుఁ డగుటవలన దేని నంటనివాఁడు, అకర్త = నిగర్భమూని యగుటవలన దేనియందును కర్తృత్వాభిమానము లేనివాఁడు; సిద్ధము = సత్యము

తా. ఓ ఆంజనేయా! యీ శ్రీరామమూర్తి సర్వజ్ఞత్వము సర్వేశ్వరత్వము సర్వస్రష్టృత్వము సర్వపాలకత్వము సర్వసంహారకత్వము సర్వభోక్తృత్వము సర్వనియంతృత్వము సర్వవ్యాపకత్వము నిండ లయిన మహామాయాగుణములం గలిగి లోకములను పుట్టించు నని తోఁచును గాని మాయాగుణములగు సర్వజ్ఞత్వాదులు లేనందున నేకార్యమును చేయఁడు, నిమిత్తకారణుఁ డగుటచేత దేనిని అంటఁడు, నిగర్భమూని యగుటచేత నేపనులయందును కర్తృత్వాద్యభిమానము లేనివాఁడు అని తాత్పర్యము.

వ. అనిన విని హనుమంతుండు సీతాదేవి కిట్లనియె.   ౮౨

టీక అనినవిని = అనఁగా నాకర్ణించి, హనుమంతుండు = ఆంజనేయుండు, సీతాదేవికిట్లనియెను = సీతాదేవితో నిటులఁ బలికెను.

తా అని పలుకఁగా విని హనుమంతుఁడు సీతాదేవితో నిట్లు పలికె నని తాత్పర్యము.

తే. రామచంద్రుఁడు తారకబ్రహ్మ మగుట, సత్య మగుఁ గాని యిమ్మహాసర్వమయుని
సులభముగఁ గాంచు పరమసుసూత్ర మెద్ది, నాకెఱింగింపవమ్మ లోకైకజనని.

టీక లోకైకజనని—లోక = అధిదైవిక ఆధ్యాత్మిక ఆధిభౌతికము లను ముల్లోకములకు, జనని = తల్లీ, రామచంద్రుండు = శ్రీరాముఁడు, తారకబ్రహ్మమగుట=సంసారసాగరోత్తారక మగు బ్రహ్మ ప్రణ వార్థ మగుట, సత్యమగు గాని = నిజమగును గాని, ఇమ్మహాసర్వమయునిక = ప్రణవస్వరూపుఁ డైన యీ శ్రీరాముని, సులభముగక = సాధనాంతరనిరపేక్షముగా, కాంచుపరమసుసూత్రము — కాంచు = చేసని చూడఁదగిన, పరమ = మేలైన, సుసూత్రము = సదుపాయము, ఎద్ది = ఏది, నాకెఱింగింపవమ్మ = నాకు తెలుపవమ్మా.

తా. ఓ సీతాదేవీ! శ్రీరామభద్రుఁడు శరీరేంద్రియప్రాణాదులకు ఆత్మ యగుచు సంసారసాగర మును దాఁటించు పరబ్రహ్మమే యగును, సందేహము లేదు. ఈ శ్రీరామచంద్రుని సన్నగా దెలియ నొనఁదగిన యుక్తిని ఆసక్తితో నాకు తెలుపుము అని హనుమంతుఁ డడిగె నని తాత్పర్యము.

వ. అనిన విని నవ్వుచు సీతాదేవి హనుమంతున కిట్లనియె.   ౮౪

టీక అనిన విని = అనఁగా నాలించి, నవ్వుచుక = స్మేరాననయగుచు, సీతాదేవి=జానకి, హనుమంతునకుక = ఆంజనేయునకు, ఇట్లనియెక = వక్ష్యమాణప్రకారముగా వచించెను.

తా. అని హనుమంతుఁ డడుగఁగా సీతాదేవి విని చిఱునవ్వు నవ్వి ఆంజనేయునితో నిట్లు పలికె నని తాత్పర్యము.

తే. ప్రత్యగాత్మస్వరూపుఁ డై పరఁగు తనకు
రమణపరమాత్ముఁ డైన శ్రీరామునకును
సమరసైక్యానుసంధానసరణి యెద్ది
యదియ యోగంబు సదుపాయ మాంజనేయ. ౮౧

టీక. ఆంజనేయా = హనుమంతుఁడా, ప్రత్యగాత్మస్వరూపుఁడై=కార్యోపాధి యగు నవిద్యను వీడిన కూటస్థస్వరూపుఁడై, పరఁగుతనకుక్ — పరఁగు = వెలయునట్టి, తనకుక్ = అహంప్రతీత్యర్థ మైన తనకును, రమణపరమాత్ముఁడు—రమణ = అధీశుం డైన, పరమాత్ముఁడు=కారణోపాధి యగు మాయను గడచిన పరబ్రహ్మము, ఐనశ్రీరామునకుక్ = ఐనట్టి శ్రీరామమూర్తికిని, సమరస = అభేదమయిన, ఐక్య=చేరికను, అనుసంధాన = కూర్పఁదగిన, సరణి = మార్గము, ఎద్ది = ఏదో, అదియ = అదే, యోగంబు = బ్రహ్మనిష్ఠ, సదుపాయము = మంచిసాధనము

తా ఓ ఆంజనేయా! నేను జీవుఁడను, సుఖిని, దుఃఖిని, మూఢుఁడను, పాపిని, పాప కార్యములు చేయువాఁడను, దరిద్రుఁడను, ధనికుఁడను, బ్రాహ్మణాదిజాతులును బ్రహ్మచర్యాద్యాశ్రమములును శివ రామ గోవింద నారాయణ మహాదేవాది నామములును గలవాఁడును, జననమరణాద్యవస్థలు గలవాఁడును, కించిద్జ్ఞత్వాది స్వల్పగుణములు గలవాఁడును అను భ్రమను పుట్టించునది కార్యోపాధి యైన అవిద్య, ఆభ్రమను వీడినవాఁడే జీవసాక్షి యైన ప్రత్యగాత్మ, మఱియు నే నీశ్వరుఁడను, సర్వజ్ఞత్వాది మహాగుణములు గలవాఁడను, సృష్టిస్థితిలయకారణుఁడను, సకలలోకస్వరూపుఁడను అను భ్రమను పుట్టించునది కారణోపాధి యైన మాయ, ఆభ్రమను వదలినవాఁడే యీశ్వరసాక్షి యైన పరమాత్మ, కనుక శరీరత్రయ విలక్షణమై అవస్థాత్రయసాక్షియై పంచకోశవ్యతిరిక్తమై సచ్చిదానందనిత్యనిర్మలస్వరూపమై వెలుఁగు ప్రత్యగాత్మ యైన నేనే సత్యజ్ఞానానందనిత్యనిర్మలస్వరూప మైన ఆ శ్రీరామపరబ్రహ్మమును, శ్రీరామ పరబ్రహ్మమే నేను అని యెల్లప్పుడును ఫుల్లమునందు తలఁచుచుండుటే రాజయోగము అని తాత్పర్యము; అంతటను పరబ్రహ్మముతప్ప యితరము లే దని భావము.

## అభ్యాసాదియోగ నిర్ణయము.

వ. ఆ యోగం బభ్యాసయోగంబు జ్ఞానయోగం బన ద్వివిధంబై యొప్పు, నం దభ్యాస యోగంబు ప్రాణాయామం బన విలసిల్లు, నదియుఁ బ్రాకృతంబు వైకృతంబు కేవల కుంభకంబు ననం ద్రివిధం బయ్యె, నందుఁ బ్రాకృతంబు మంత్రయోగంబు వైకృతంబు లయయోగంబు కేవలకుంభకంబు హఠయోగం, బీ త్రివిధప్రాణాయామ యోగులకు యమనియమాసనప్రాణాయామంబులు పూర్వాంగంబులు, ప్రత్యాహార ధ్యాన ధారణా సమాధు లుత్తరాంగంబు లగు, నం దహింసాసత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహంబులు యమంబులు, శౌచ తప స్సంతోష స్వాధ్యాయేశ్వర ప్రణిధానంబులు నియమంబులు, వీరాసన స్వస్తికాసన పద్మాసన యోగాసన కూర్మాసన భద్రాసన సిద్ధాసన సింహాసనాదికంబు లగు చతురుత్తరాశీత్యాసనం

బుల నీ మూఁడింటి నభ్యసించి యంతటఁ బ్రాణనిరోధంబు సేయం దగు, నందు స్వభావనియత రేచక పూరక కుంభకక్రమంబులచేత నేకవింశతిసహస్రషట్ఛతాధికసంఖ్యాజపా మంత్రానుష్ఠానంబు మంత్రయోగంబు, ప్రతిదివసాభ్యస్త రేచకాది త్రివిధానిలసంయమనపూర్వకంబుగాఁ బ్రాణవృత్తియం దపానంబు నపానవృత్తియందుఁ బ్రాణంబును లయంబు గావించుట లయయోగంబు, మూలబంధోడ్యాణబంధ జాలంధరబంధపూర్వకంబుగా రేచకపూరకంబుల నుడిగించి ప్రాణాపానంబులరెంటిని రేయింబగళ్లొక్కచందంబునఁ గుంభించుట హఠయోగం, బివి త్రివిధప్రాణాయామంబులు; విషయంబులవలన నింద్రియంబుల మరలించుట ప్రత్యాహారంబు, సగుణ నిర్గుణాత్మక వస్తుచింతనంబు ధ్యానంబు, మూలాధారాదిదేశంబులఁ జిత్తంబు నరికట్టుట ధారణాయోగంబు, నిర్మల నిశ్చల చిత్తవృత్తి నిర్గుణబ్రహ్మత్వంబు సంపాదించుట సవికల్పనిర్వికల్పాత్మకసమాధియోగం; బి ట్లష్టాంగంబు గలిగి యభ్యాసయోగంబు ప్రకాశించు నదియు నపరిపక్వచిత్తులకు యోగ్యం బతిదుర్లభం, బది యణిమాద్యష్టైశ్వర్యంబుల నొసంగుచు నాత్మజ్ఞానంబుఁ బ్రకటంబుగాఁ జేయు, మఱియుఁ బ్రవిమలచిత్తులకు జీవబ్రహ్మైక్యజ్ఞానమాత్రంబు నిచ్చు, నతి సులభం బైన విజ్ఞానయోగంబు రాజయోగం బనంబడు, నీరెంటికి శ్రీరామచరణకమలభక్తికారణంబు, దానికి వైరాగ్యంబు మూలంబు వినుము. ౧౮

టీక. ఆయోగంబు = ఆ ప్రత్యగాత్మ పరమాత్మల సమరసైక్యానుసంధానోపాయము, అభ్యాసయోగంబు = అపరిపక్వచిత్తులకు అభ్యాసయోగము, జ్ఞానయోగంబు = పరిపక్వచిత్తులకు జ్ఞానయోగము, అనఁ = అనునట్లు, ద్వివిధం బై = రెండువిధము లై, ఒప్పుఁ = రాజిల్లును, అందుఁ = ఆ రెండుయోగములయందు, అభ్యాసయోగంబు = అభ్యాసయోగము, ప్రాణాయామం బనఁ = ప్రాణాయామ మనునట్లు, విలసిల్లుఁ = రంజిల్లును, అదియుఁ = ఆ ప్రాణాయామము, ప్రాకృతంబు = ప్రాకృత ప్రాణాయామము, వైకృతంబు = వైకృతప్రాణాయామము, కేవలకుంభకంబు = కేవలకుంభక ప్రాణాయామము, అనఁ = అనునట్లు, త్రివిధం బయ్యెఁ = మూఁడువిధంబు లాయెను, అందుఁ = ఆ ప్రాణాయామత్రయమందు, ప్రాకృతంబు = ప్రాకృత మనునది, మంత్రయోగంబు = అజపాగాయత్ర్యాది మంత్రానుష్ఠానరూప మైనది. 'శ్లో॥ ఉత్తమా తత్త్వచింతా చ మధ్యమం శాస్త్రచింతనమ్ । అధమా మంత్రచింతా చ తీర్థభ్రాంత్యధమాధమః' అని మంత్రయోగము సప్తకోటిభేదములుగా ప్రతిపాదింపఁ బడుచున్నది, 'శ్లో॥ సప్తకోటి మహామంత్రాః చిత్తవిభ్రమకారకాః' అని, వైకృతంబు = వైకృత మనునది, లయయోగంబు = లయయోగము, లయ మనఁగా – మనోలయము, కేవలకుంభకంబు = కేవలకుంభక మనునది, హఠయోగంబు = హఠయోగ మనఁబడును, 'శ్లో॥ ఉడ్యాణ జాలంధర మూలబంధా నున్నిద్రితాయా పురగాంగనాయాః । బంధత్రయాభ్యాస విచిత్రమార్గే బంధః కుతో దారుణ కాలపాశాత్' ఇత్యాది హఠయోగప్రదీపికోక్తవిధముగా కేవలకుంభక సీత్కారకుంభ కాద్యష్టవిధకుంభకముల చేత మూలాధారాది బ్రహ్మరంధ్రాంతస్థానములయందు అచ్చటచ్చట వాయువు నరికట్టి కుండలీశక్తి

నిద్ర మేల్కొలిపి బంధత్రయము నతిక్రమింపఁ జేయుట హఠయోగము, దీని నభ్యసించువారికి యెట్టి బాధలేదు, ఈ త్రివిధప్రాణాయామయోగులకుఁ = ఈ మూఁడువిధము లైన ప్రాణాయామాభ్యాసము గల యోగులకు, యమనియమాసనప్రాణాయామంబులు = యమ నియమ ఆసన ప్రాణాయామము లను నవి, పూర్వాంగంబులు = ప్రథమమం దభ్యసింపఁదగినవి, ప్రత్యాహార ధ్యాన ధారణా సమాధులు = ప్రత్యాహారము ధ్యానము ధారణ సమాధి అనునవి, ఉత్తరాంగంబు లగుఁ = త్రివిధయోగసిద్ధ్యనంతర మందు అభ్యసింపఁదగినవి యగును, అందుఁ = ఆ పూర్వాంగ వుత్తరాంగములయందు, అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహంబులు — అహింసా = హింస చేయకుండుటయును, సత్య = యథార్థము పలుకుటయును, ఆస్తేయ = దొంగతనము లేకుండుటయును, బ్రహ్మచర్య = బ్రహ్మచర్య వ్రతమును, అపరిగ్రహంబులు = దానములను గైకొనకుండుటయును, యమంబులు = పంచవిధము లైన యమలక్షణములు, శౌచ = అంతరబాహ్యపరిశుద్ధమును, తపః = కాయిక వాచిక మానసికము లనెడి త్రివిధ తపస్సులను, సంతోష = ఆనందమును, స్వాధ్యాయ = వేదమూలమంత్రపఠనమును, ఈశ్వర ప్రణిధానంబులు = దేశికేశ్వర పాదపద్మపూజయును, నియమంబులు = ఇవి యైదును నియమలక్షణములు, వీరాసన స్వస్తికాసన పద్మాసన యోగాసన కూర్మాసన భద్రాసన సిద్ధాసన సింహాసనాదికంబులు = వీరాసనము స్వస్తికాసనము పద్మాసనము యోగాసనము కూర్మాసనము భద్రాసనము సిద్ధాసనము సింహాసనము మొదలయిన, చతురుత్తరాశీత్యాసనంబులఁ = ఎనుబదినాలుగు నాసనములను, యమాడింటిఁ = యమనియమాసనములను, అభ్యసించి = వాడుకచేసి, అంతటఁ = వెనుక, ప్రాణనిరోధంబు = ప్రాణాయామమును, చేయందగుఁ = ఒనర్పఁదగును, అందుఁ = ఆప్రాణాయామమంగు, స్వభావనియత = సహజసిద్ధము లైన, రేచక = ప్రాణవాయువును మూలాధారమునుండి బ్రహ్మరంధ్ర పర్యంతము సుషుమ్నానాళద్వారముగ సుస్థాపనము చేయుట, పూరక = బ్రహ్మరంధ్రపర్యంతము రేచించిన వాయువును మరలసుషుమ్నానాళద్వారముగ మూలాధారమునఁ జేర్చుట, కుంభక = రేచించిన వాయువును బ్రహ్మరంధ్రమందు మాత్రాసంఖ్యగ నిలుపుట యూర్ధ్వకుంభకము, పూరించినవాయువును మాత్రాసంఖ్యగల మూలాధారమున నిలుపుట యధఃకుంభకము, ఈ రేచకపూరకకుంభకములవివరణము శివయోగసారాది యోగశాస్త్రంబులందు బహువిధములుగాఁ జెప్పఁబడియున్నది. క్రమంబులచేతఁ = ఈ మూఁడుప్రకారములచేత, ఏకవింశతిసహస్రషట్ఛతాధికసంఖ్య = ఇరువదియొక వేలఆఱునూఱుల మాలు లైన, అజపామంత్రానుష్ఠానంబు = హంసమంత్రాత్మక మైన యజపాగాయత్ర్యాచరణము, మంత్ర యోగంబు = మంత్రయోగ మనఁబడును, ఇదియె ప్రాకృత ప్రాణాయామము, ప్రతిదివస = ప్రత్యహము, అభ్యస్త = అలవాటుచేయఁబడిన, రేచకాది = రేచకము లోనగు, త్రివిధ = మూఁడువిధము లైన, అనిలసంయమనపూర్వకంబుగాఁ = ప్రాణాయామము ముందు గలుగునట్లుగా, ప్రాణవృత్తి యందుఁ = అధస్సంచారము గల ప్రాణప్రవర్తనమందు, అపానంబును = ఊర్ధ్వసంచారము గల యపానమును, అపానవృత్తి యందుఁ = ఉపరిసంచారి యైన యపానమందు, ప్రాణంబును = అధస్సంచారి యైన ప్రాణవాయువును, లయంబుగావించుట = లీనపఱచుట, లయయోగంబు = లయయోగ మనఁబడును, ఇదియే వైకృతప్రాణాయామము, మూలబంధోడ్యాణబంధ జాలంధరబంధపూర్వకంబుగాఁ = మూలబంధము ఉడ్యాణ బంధము జాలంధరబంధము మున్నుగలుగునట్లుగా, రేచకపూరకంబులఁ = రేచకపూరకములను, ఉడిగించి = నిలిపి, ప్రాణాపానంబులఁ — ప్రాణ = అధస్సంచారము గల ప్రాణవాయువును, అపానంబులఁ = ఊర్ధ్వసంచారము గల యపానమును, రెంటిఁ = ఈరెంటిని, రేయుంబవలొక్కచందంబునఁ = రాత్రిందినము లొక్కరీతిగా, కుంభించుట = నిలుపుట, హఠయోగంబు = హఠయోగ మనఁబడును, ఇదియె కుంభక

ప్రాణాయామము, ఇవి త్రివిధప్రాణాయామంబులు = ఇవి మూఁడువిధము లైన ప్రాణాయామములు, విషయంబులవలనన్ = శబ్దాదివిషయములనుండి, ఇంద్రియంబులన్ = జ్ఞానకర్మేంద్రియములను, మరలించుట = త్రిప్పుట, ప్రత్యాహారంబు = ప్రత్యాహార మనఁబడును, సగుణ = సగుణరూప మైన, నిర్గుణాత్మక = నిర్గుణరూప మైన, వస్తు = పరబ్రహ్మవస్తువుయొక్క, చింతనంబు = మననము, ధ్యానంబు = ధ్యాన మనఁబడును. మూలాధార = మూలాధారము, ఆది = మొదలగు, దేశంబులన్ = స్థానములయందు, చిత్తంబున్ = మనస్సును, అరికట్టు = అడ్డగించుట, ధారణాయోగంబు = ధారణాయోగ మనఁబడును, నిర్మల = పరిశుద్ధ మైన, నిశ్చల = అచంచల మయిన, చిత్తవృత్తిన్ = మనోవర్తనముచేత, నిర్గుణబ్రహ్మత్వంబున్ = త్రిగుణశూన్య మైన బ్రహ్మభావమును, సంపాదించుట = లభింపఁజేసికొనుట, సవికల్ప = అంతర్బాహ్యస్పర్శశబ్దానువిద్ధ జ్ఞానమయమైన, నిర్వికల్పాత్మక = అంతర్బాహ్య నిర్వికల్పజ్ఞానము లైన, సమాధియోగంబు = బ్రహ్మనిష్ఠ, ఇట్లు = ఈ పూర్వోక్తప్రకారము, అష్టాంగంబులు = ఎనిమిదవయవములు గలిగిన, అభ్యాసయోగంబు = అభ్యాసయోగము, ప్రకాశించున్ = శోభిల్లును, అది = ఆయభ్యాసయోగము, అపరిపక్వచిత్తులకున్ = చిత్తపరిపాకము లేనివారికి, యోగంబు = అర్హ మైనది. అతిదుర్లభంబు = పొంద శక్యము గానిది, ఇది = ఈయభ్యాసయోగము, అణిమాద్యష్టయిశ్వర్యంబులన్ = అణిమ మహిమ గరిమ లఘిమ ప్రాప్తి ప్రాకామ్యము ఈశత్వము వశిత్వము అను నష్టవిభూతులను, ఒసంగున్ = ఇచ్చును, ఆత్మజ్ఞానంబున్ = బ్రహ్మజ్ఞానమును, ప్రకటంబుగాఁజేయున్ = ప్రసిద్ధపఱచును, మఱియున్ = మఱియు, ప్రగుణచిత్తులకున్ = హృదయపరిపాకము గలవారలకు, జీవ = కించిద్జ్ఞునకు, బ్రహ్మ = సర్వజ్ఞునకు, ఐక్యజ్ఞానరూపంబున్ = కించిద్జ్ఞత్వ సర్వజ్ఞత్వాది విలక్షణ మయిన వస్తుతత్త్వైక్యజ్ఞానమును, ఇచ్చున్ = ఒసఁగును, అతిసులభంబైన = మిగుల సుకర మైన, విజ్ఞానయోగంబు = అనుభవజన్యజ్ఞానోపాయము, రాజయోగంబనంగన్ = అమనస్కయోగ మని చెప్పఁబడును, ఈ రెంటికిన్ = ఈయభ్యాసజ్ఞానయోగద్వయమునకు, శ్రీరామచరణకమలభక్తి కారణంబు = శ్రీరామునిపాదారవిందములను భజించుటయే హేతువు, దానికిన్ = ఆభక్తికి, వైరాగ్యంబు = ఇహపరలోకభోగములయందు విరక్తి, మూలంబు = హేతువు, వినుము = ఆకర్ణింపుము

తా. ఓ అంజనేయా! ఆయోగము చిత్తపరిపక్వము లేనివారికి అభ్యాసయోగ మగునదియు, చిత్తపరిపక్వము గలవారికి జ్ఞానయోగ మనియు రెండువిధము లగును, ఆరెంటిలో అభ్యాసయోగము ప్రాణాయామ మనఁబడును, ఆప్రాణాయామము ప్రాకృత మనియు, వైకృత మనియు, కేవలకుంభక మనియు మూఁడువిధము లగును. ఆమూఁటియందు ప్రాకృతము మంత్రయోగము, వైకృతము లయయోగము, కేవలకుంభకము హఠయోగము, వీనిలో —

మంత్రయోగ మనఁగా — అజపము జపము క్రియ స్మరణ అని నాలుగువిధము లగును, అందు నేఁటి ప్రొద్దుపొడుపు మొదలుకొని రేపటిప్రొద్దుపొడుపువఱకును మూలాధారాదికమలములకు అధిదేవత లైన గణపతి మొదలగువారికి '(శ్లో॥) షట్ఛతాని గణేశాయ షట్సహస్రం స్వయంభువే। విష్ణవే షట్సహస్రంతు షట్సహస్రం పినాకినే। సహస్ర మాత్మనే చైవ సహస్రం పరమాత్మనే। సహస్రం చిద్గురవే అర్పయామి కృతం జపమ్' అను శ్లోకప్రకారంబుగా నిరువదియొకవేలయాఱునూఱులహంసగాయత్రీమంత్రజపమును సమర్పించుటే అజపారూపమంత్రయోగము, ఋషిఛందదేవతాబీజశక్తికీలకఅంగన్యాసకరన్యాసధ్యానకవచహృదయమాలాపంజర అర్గళస్తోత్ర దిగ్బంధన దిగ్విమోకప్రాణప్రతిష్ఠలును, మంత్రవిగ్రహాద్యారాధనములును గలిగి మొదట ప్రణవమును, నడుమ దేవతానామము చతుర్థ్యంతముగను, కడపట వశ్యమారణస్తంభనమోహనవిద్వేషణఉచ్చాటనఆకర్షణాది వేళము లనెడి। అష్టకర్మములకుఁ దగిన నమః

స్వాహా హుంఫట్ వౌషట్ వషట్ ఖేర స్వధ మొదలగు పల్లవములను ప్రణవాదిగాఁ జేర్చి యిష్టసిద్ధి కొఱకు జపింపఁబడునది జపరూపమంత్రయోగము ఇది గాయత్రి మొదలుగ శైవ శాక్త వైష్ణవ కాపాలిక గాణాపత్య సౌరాది సమయమంత్రభేదములచేత నేడుకోట్లవిధములై యుండును, శ్రౌతస్మార్తాను కర్మములయందును, గర్భాదానాది షోడశసంస్కారములయందును, యజ్ఞాగులయందును, వేదోక్త పురాణోక్త మంత్రములను నోటఁ జెప్పుచు చేతులలో చర్వాజ్యసమిదక్షతపుష్పచందనదర్భజలాది పదార్థములచేత అచ్చటచ్చట క్రమముగా క్రియల నడిపించునదియే క్రియారూపమంత్రయోగము, శ్రీరామ శివ గోవింద నారాయణ మహాదేవాదినామములను రాగతాళనృత్యవాద్యములతోడ వ్యాగ్రముగ భజన సేయుట, ఆ శ్రీరామాది నామములను కోటిసంఖ్యగ వ్రాయుట, ఆ దేవతానామములతోడనే ఆ దేవతా రూపములను వ్రాయుట లోనగునవి స్మరణరూపమంత్రయోగము

లయయోగమనఁగా — శ్లో॥ మనోగ్రే వసతే బిందుః ప్రాణాగ్రే వసతే కళా । తథయో ర్లీయతే నాదం లయ యిత్యుచ్యతే బుధైః । అనాహతస్య శబ్దస్య తస్య శబ్దస్య యో ధ్వనిః । ధ్వని రంతర్గతం జ్యోతిః జ్యోతి రంతర్గతం మనః । తన్మనో విలయం యాతి తద్విష్ణోః పరమంపదమ్ ॥ ఇత్యాది ప్రమాణములచేత కొట్టఁబడకనే మ్రోగుచుండెడి అనాహతచక్రమందలి దశవిధప్రణవనాదముల నెఱిఁగి దశమనాద మెచ్చట లీన మగుచున్నదో అచ్చట ప్రాణాగ్రస్థిత మైన చిత్కళాదర్శనముతోఁ గూడి తద్గగనమందు మనోలీన మగుటయే లయయోగ మనఁబడును, ఈ లయయోగము మృడానికి మృడుఁడు లక్ష విధములఁ దెలిపెను కావున గ్రంథవిస్తరభీతిచేత నిచ్చట వ్రాయఁబడ లేదు.

హఠయోగ మనఁగా, — ధర్మప్రభువు పాలించు రాజ్యమందలి పుణ్యనదీతీరమందు శాస్త్రోక్తక్రమముగ హఠయోగమఠము కట్టించుకొని యోగమందు నిపుణుఁడైన గురుని దగ్గఱ నుంచుకొని వానిచేత నిర్ణయింపఁబడిన ప్రకారముగా పథ్యములను చేయుచు భోజనాభ్యంగనాదులచేత శరీరతత్వమును దేర్చుచు గుదాకుంచనముచేత నీళ్లుపీల్చి అధోమలములను కడిగి విడుచుచు కల్పఘృతములచేతను గండూషాదులచేతను వక్షస్స్థలకంఠగతకఫపిత్తాదులను గ్రక్కుచు అంజనవస్యాదులచేత కపాలనాసికలయందలి దుష్టజలమలాదులను విసర్జించుచు శీతకాలమం దుష్ణమును ఉష్ణకాలమందు శీతమును గలుగఁజేయు పవిత్రమైన భస్మమును శరీరమం దంతటను పూయుచు సాత్త్వికాహారములను భుజించుచు కాయశుద్ధి గల గురుదేవతాభక్తియుఁ గలిగి పరిశుద్ధాంతఃకరణుఁడై మితాహార విహార నిద్రా జాగ్రత్తలు గలవాఁడై స్థిరాసనుఁడై మూలబంధ ఉడ్యాణబంధ జాలంధరబంధములతోడ పూత్కార సీత్కార శీతల కేవలాద్యష్టవిధ కుంభకములచేత ప్రాణవాయునిరోధనము చేసి కాయసిద్ధిని సంపాదించి ఆకాశగమన దూరదృష్టి దూరశ్రవణ ఘుటికా పాదుకా సిద్ధులును అణిమాద్యష్టసిద్ధులును స్వేచ్ఛామరణాదులును గలిగి యుండుట హఠయోగము

జ్ఞానయోగ మనఁగా — గురువులవలన వేదాంతశాస్త్రవిషయములను పలుమాఱుఁ శ్రవణము చేసి మననిదిధ్యాసములను గావించి వైరాగ్యోపశాంతి వివేకవృత్తులు గలిగి సదా పరబ్రహ్మాపరోక్షవృత్తిచేత జీవన్ముక్తిని పొంది విదేహముక్తిపర్యంతమును ప్రారబ్ధ మనుభవించుచు నుండుటే జ్ఞానయోగము, ఇదే రాజయోగము

ఈ మంత్ర లయ హఠ రాజయోగములలో నేయోగము నభ్యసింపఁ దలఁచినను వారిచేత యమ నియమ ఆసన ప్రాణాయామము నాలుగును ముందుగ నభ్యసింపఁదగినవి, ఇవియే పూర్వాంగములు. ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధులు నాలుగును యోగపూర్తియందు నభ్యసింపదగినవి,

ఇవియే ఉత్తరాంగములు. మఱియు, పూర్వాంగము లయిన యమ నియమ ఆసన ప్రాణాయామములు నాల్గింటియందును, యమము.—అహింస, సత్యము, ఆస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అనియైదు విధములు, అందు ——

## అహింసాలక్షణము

ఉత్సాహము. ఈగు పేను నల్లి చీమ లుఱ్ఱంగి నుసుపేలు జలగలన్
క్రూరసర్ప వృశ్చికాది గుఱువిషప్రదావళిన్
ఘోరమృగముల స్వాధింపఁ గోరి కునికి నాగమో
క్తోర్తు హింస సేయ రెందు నొప్పు నాయహింసనుఁ.

తా. ఈగ పేను నల్లి ఈఁగ చీమ లోనగు స్వల్పజంతువులును, క్రూరంగము లయిన పాములు తేళ్ళు మండ్రగబ్బలు మొదలగు విషజంతువులును, భయంకరము లయిన శరభములు సింహములు ఏనుఁగులు పులులు చిఱుతపులులు అడవిపందులు మొదలగు మృగములను సంహరింపకుండుట గాను, వేదోక్తము లగు యజ్ఞములయందు పశువులఁ జంపుట గాను ఈ రెండును అహింస యని తాత్పర్యము.

## సత్యలక్షణము.

క. ఉన్నది కన్నది విన్నది, యున్నట్లుగఁ బలుకుటయును నొరునకు సత్యో
పన్నత గలుగఁగఁ గల్యా,ణోన్నతి గల కల్లమాటయును సత్య మగున్.

తా. ఉన్న సంగతి యున్నట్టుగను చూచిన సంగతి చూచినట్టుగను విన్న సంగతి విన్నట్టుగను తప్పక చెప్పుటయును, ఒకనికి సంభవించిన అపద దప్పి మేలు గలుగుటకై చెప్పిన కల్లమాట యైనను సత్యమే యగు నని తాత్పర్యము

## అస్తేయలక్షణము.

క. ప్రస్తుతిగ నెట్టిదశ పరవస్తువులం ద్రికరణముల వర్జించుట తా
నస్తేయ మనుమఁ జెప్పుదు, రస్తమితాజ్ఞానతంత్రు లయిన మునీంద్రుల్.

తా. ఎట్టి కష్టకాలమం దయినను పరుల సొమ్ము నపహరింప మనస్సునఁ దలఁపక అపహరింపు మని నోటఁ జెప్పక చేత ముట్టక యుండుటే ఆస్తేయ మని తాత్పర్యము.

## బ్రహ్మచర్యలక్షణము.

క. కాంతలసందఱ నామర,కాంతగముగఁ బరిహరించు టది మీ లోఁ డే
నెంతయు నిజభార్యావ్రత,సంతుష్టినిఁ జెంద బ్రహ్మచర్యంబ యగున్.

తా. స్త్రీసంపర్కంబు మరణించువఱకు యైనను, లేక మునను, ఋతుకాలముల యందు స్వభార్యం గలిసి తనివినొందుచున్న నయినను బ్రహ్మచర్యం బని తాత్పర్యము

## అపరిగ్రహలక్షణము.

ఆ. దానపూర్వకంబుగా నెవ్వ రేమైన, నొసఁగ నంగ్రహింపకునికి సత్కృ
తముగ శిష్యు లొసఁగు ద్రవ్యంబుఁ గొనుట యును, ననఘ తదపరిగ్రహంబు వత్స.

తా॥ ధనధాన్యాదులను దానపూర్వకంబుగా నెవ్వరిచ్చినను పుచ్చుకొనక శిష్యు లిచ్చిన పుచ్చుకొనుట అపరిగ్రహ మని తాత్పర్యము

శౌ చ ల క్ష ణ ము.

తే॥ శౌచములు రెండు తెఱంగులై చను బ్రసిద్ధి
మృత్తికాజలములచేత మెఱయు బాహ్య
మమలినాభ్యంతరపుశౌచ మనఁగ భావ
శుద్ధి యని కద వచియింతు రిద్ధమతులు.

తా॥ బాహ్యపరిశుద్ధ మని, అంతరపరిశుద్ధ మని పరిశుద్ధము రెండువిధములు. వానిలో మృత్తికచేతను జలముచేతను చేయఁబడునది బాహ్యపరిశుద్ధము, కామ క్రోధ లోభ మోహ మద మత్సర దంభములు మొదలయిన దుర్గుణసంఘములతోడను, ఆణవ కార్మిక మాయిక మాయేయ తిరోధానములనెడు పంచమలములతోడను కూడక మనస్సు నిర్మల మయి యుండుటే అంతరపరిశుద్ధ మని విజ్ఞానసంపన్నులగు పండితులు బలుకుదు రని తాత్పర్యము.

త్రి వి ధ త పో ల క్ష ణ ము.

శ్లో॥ దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసాచ శారీరం తప ఉచ్యతే
అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియ హితంచ యత్
స్వాధ్యాయాభ్యాసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే
మనః ప్రసాదసౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః
భావసంశుద్ధి రిత్యేత త్తపోమానస ఉచ్యతే

తా॥ దేవతలను బ్రాహ్మణులను గురువులను పండితులను పూజించుటయును, బాహ్యపరిశుద్ధమును ఆఁచుటయును, బ్రహ్మచర్యవ్రతమును అహింసయును గలిగియుండుటయు శరీరసంబంధమైన తపస్సు, మనోవేదన గలుగఁజేయునది గాక సత్యమై విన సొంపై మేలు గలుగఁ జేయునదిగాను యుండు మాటలాడుటయును, వేదమూలమంత్రములను పఠించుటయును వాక్సంబంధమైన తపస్సు, మనస్సునకు సమాధాన మయిన మంచినడవడియును, వాఙ్నియమమును, మనోనిగ్రహమును, మనశ్శుద్ధి గలిగి యుండుటయును మనస్సంబంధమైన తపస్సు అని తాత్పర్యము.

తే॥ మనమున వాక్కున గాయంబున దలఁపులఁ బలుకులను బ్రబుద్ధత నుపవా
సనిరూఢి యిద్ధపూర్వోక్తనియతి బ్రచరించు టిదియ తప మగుఁ బేర్మిన్.

సం తో ష ల క్ష ణ ము.

క॥ ఆపదలల శోభనముల, నాపక చనఁ జూచుచును స్వయంస్వాగతవి
త్తాపత్తిని ముద మందుట, దీపిత సంతోష మని కథింతురు ప్రాజ్ఞుల్.

తా॥ శుభాశుభకార్యములను నిలుపక తగినకాలములయందే జరిపించుచు పేరాశపడక తనకు లభించినద్రవ్యముతోడనే తృప్తి పొందుట సంతోష మని తాత్పర్యము.

## స్వాధ్యాయ లక్షణము.

తే. మఱియు స్వాధ్యాయ మన మూలమంత్రపఠన
మది విచారింప వాచిక మనియు పాంశు
వనియు మానసికం బని యనఘ మూఁడు
దెఱఁగులై యుండుఁ దెలిపెద దెలియ వినుము.

క. ఒరులు విన నొనుట వాచిక, మొరులు వినక యుండఁ గొనుటయును పాంశువు నం
తరవిరళముఁ గాని మది సంస్మరియించుట మానసికము స్వాధ్యాయ మగున్.

తే. అందు వాచికజపమున నధికతరము, పాంశుజప మయ్యు పాంశుజపమున నధిక
తరము మానసజప మగు దాని కధిక, తరము లే దని తెలియు మో ధర్మనిరత.

తా. స్వాధ్యాయము వాచిక మని, ఉపాంశు వని, మానసిక మని మూఁడువిధములు. అందు అన్యునికి వినఁబడునట్లు పఠించుట వాచికము, అన్యునికి వినఁబడ కుండునట్లు పఠించుట యుపాంశువు, ప్రత్యక్షరమును విరళించి మనస్సునందే జపించుట మానసిక మని తాత్పర్యము.

## ఈశ్వర ప్రణిధాన లక్షణము.

సీ. కరణంబు లఖిలోపకరణంబులును గాఁగ, ప్రాణంబు లుపచార భోగములు గాఁగ
గంగాప్రముఖనాడికలుజలంబులు గాఁగ, షట్కమలములు పుష్పములు గాఁగ
జఠరాగ్ని హోత్ర ముజ్జ్వలధూపము గాఁగ, బహుజీవకళలు దీపంబు గాఁగ
వందితానందంబు నైవేద్యముం గాఁగ, రవిశశిజ్యోతు లారతులు గాఁగ

తే. నంగదేవాలయమున సహస్రకమల, పీఠమున శాంతి జనకజోపేతుఁ డగుచుఁ
జెలఁగు పరమాత్మ రాము నర్చించు చుండఁ, దత్త్వవిదు లీశ్వరప్రణిధానమండ్రు.

తా. జ్ఞానేంద్రియములును కర్మేంద్రియములును అంతరింద్రియములును పూజాపాత్రములు గాను, దశవిధప్రాణములు పనివాండ్రుగాను, గంగా యమునా సరస్వత్యాది నామములు గల ఇడ పింగళ సుషుమ్న మొదలగు నాడులు అభిషేకాది జలములుగాను, ఆధారాదిషట్కమలములు పుష్పములు గాను, జఠరాగ్ని ధూపముగాను, చిత్కళలు దీపములుగాను, బ్రహ్మానందము నైవేద్యము గాను, సూర్యచంద్ర మండలజ్యోతులు ఆరతులుగాను, శరీర మనెడు దేవాలయమందలి సహస్రారకమల మనెడి సింహాసనమున శాంతి యను సీతతోఁ గూడిన పరబ్రహ్మ మగు శ్రీరాముని నెల్లప్పుడు పూజించు చుండుటయు యీశ్వరప్రణిధాన మని బ్రహ్మవాగు లయిన పెద్దలు పలుకుదు రని తాత్పర్యము

# యోగాసనముల లక్షణములు.



### వీరాసనము.

క. ఒకతొడపై నొకపాదము, నొకపాదముమీఁదఁ దొడయు నునిచి శరీరం
బకుటిలగతి నిల్పినఁ దక్కక యది వీరాసనంబునై వడి యయ్యెన్.

తా ఒకతొడమీఁద నొకపాదమును మఱియొకపాదముమీఁదఁ దక్కినతొడయును చేర్చి శరీరము వంకరలేకుండ నిల్పినేని వీరాసన మనుట.

### స్వస్తికాసనము.

క పిక్కల తొడల నడుములం, దొక్కటఁ బదతలము నిడి సమున్నతి నొడలిఁ
నిక్కించిన నీయాసన, మక్కజముగ స్వస్తికాహ్వయం బగు జగతిన్.

తా జంఘోరువులనడుమ పాదములఁజొనిపి శరీరము చక్కఁగ నిక్కించెనేని స్వస్తికాసన మనుట.

### పద్మాసనము.

శా. వామాంకంబున దక్షిణాంఘ్రియును దద్వామేతరాంకంబునన్
వామాంఘ్రిన్ ఘటియించి పశ్చిమదిశావ్యాప్తంబులౌ చేతులన్
సేమం బారఁగఁ గాళ్లయంగుళములం జేకొన్న పద్మాసనం
బౌ ముక్కుం గొనఁ జూపునుం జుబుకహృద్వ్యాసంగముం గల్గినన్.

తా ఎడమతొడమీఁద కుడిపాదమును కుడితొడపై నెడపాదమును వునిచి వెనుకప్రక్కగా కుడిచేత నెడమతొడమీఁద నున్న కుడికాలిపెద్దవేలును యెడమచేత కుడతొడమీఁదనున్న యెడమకాలి పెద్దవేలును పట్టుకొని ఱొమ్మున గడ్డముంచి భ్రూమధ్యమందు దృష్టి నిలిపెనేని పద్మాసన మనుట.

## మతాంతర పద్మాసనము.

సీ. అది పద్మబంధంబె యగు నైన నుత్తాన,చరణంబు లూరు సంస్థములు గాఁగ
నూరుమధ్యంబున నుత్తానకరతల,ద్వయమును రాజదంతములు మొదల
హత్తియుండెడి రసనాగ్రంబుఁ దొంటిభా,తిని యున్న చుబుకంబు దృష్టి గలిగి
మారుతం బల్లనఁ బూరించు చుండిన, నది పద్మ మగు మతాంతరమునందు
తే. మఱియు నిది మత్స్యమతము పద్మమునఁ బూర్వ
మట్ల యుండుచు సంస్ఫుటహస్తయుగ్మ
మున గుదాకుంచనముఁ జలదనిలపూరి
తము విసర్జనవిధియు ధ్యానమును వలయు

తా. ఎడమతొడపైని కుడిపాదమును కుడితొడపై నెడమపాదమును వెలికిలనుంచి హస్తములు రెండుతొడలపయి వెలికిలనుంచి నాసాగ్రమందు లక్ష్యముంచి దంతమూలమున నాలుకహత్తించి వక్షమందు గడ్డం బుంచి మెల్లమెల్లగ వాయువును పూరించుచుండెనేని మతాంతరపద్మాసన మగును, మఱియు మునుపటివలె పద్మాసనమం దుండి చుబుకంబు వక్షంబున హత్తించి చిత్తంబున నగు ధ్యానంబు చేయుచు అపానమును ఊర్ధ్వముగా లేచించి కుండలీశక్తి యూర్ధ్వముగ నిలిపి ప్రాణవాయువుగు నిరువంగా నప్పుడు నధికజ్ఞానబోధ కలుగును, దీనిచేత నాడీద్వారమందు గాలి నిల్చును, వృద్ధు లగువారు ముక్తు లగుదురు, ఇదే బద్ధపద్మాసనము, ఇదే ముక్తపద్మాసనము.

## యోగాసనము.

క. యోగపటజానుయుగ సం,యోగంబునఁ బదతలంబు లుర్వి నిలిపి తాఁ
నీగిన కరముల నుండిన, యోగాసన మండ్రు దీని యోగివిధిజ్ఞుల్.

తా. హంసదండము మోకాళ్ళక్రింద నుంచుకొని పాదములను నేలపయి నిలిపి తొడలనడుమ చేతులఁ జొనిపి పిక్కలఁబట్టుకొని ఆత్మావలోకనముఁ జేయుచుండెనేని యోగశాస్త్రవేదులు దీనిని యోగాసన మందు రని తాత్పర్యము.

## కూర్మాసనము

క. వీడఁబడిన గుల్ఫంబులు, గూడఁగ సంధించి పట్టి గుద మలవడఁగా
బీడించినఁ గూర్మాసన, మాడితమతి నెఱుఁగుదురు యమిమాన్యులు దీనిని.

తా. ఆధారమునకు నుభయపార్శ్వములయందు రెండు కాళ్ళ మడిమలు హత్తించి నిక్కబొక్కఁగా కూర్చుండెనేని కూర్మాసన మని తాత్పర్యము.

## ఉత్థానకూర్మాసనము.

తే. కుక్కుటాసనబంధంబుఁ గూర్చినట్టి, కరయుగంబుల మెల్లనఁ గంధరంబు
బంధనముఁ జేసి వెలికిలఁ బడిన కూర్మ, మట్ల వడఁగ నుత్థానకూర్మాసనంబు.

తా. కుక్కుటాసనస్థుఁడై యుండి రెండుచేతులతో కంఠమును పట్టుకొని కూర్మమువలె వెలికిలఁ బడి యుండెనేని యుత్థానకూర్మాసన మని తాత్పర్యము

తే. జఠరవహ్ని వర్ధిలఁ జేయు జగతి నట్టి, సాధకునకు నాహారంబు సంగ్రహింప
జను బహుళముగ నల్పభోజనముచేత, ననిలవేగంబు విడిపించు నతనితనువు.

తా. ఈ యాసనము ప్రతిదినము యామమాత్ర మభ్యాసము చేయుచుండిన మూడు నెలలకు పిదప వలిపలితవిరహితాంగుండును మృత్యుంజయుండు నగును, ( శ్లో॥ నాభిస్థానే వసేదగ్నిః హృదిస్థానే దివాకర। భ్రూమధ్యేవ సతి శ్చంద్రః చంద్రాగ్రేచ వసే న్మనః ' తా॥ తలక్రిందుగ నిలిచి భ్రూమధ్యమందలి చిద్బిందువును చూచుచుండెనేని కపాలాసన మనుట

ముక్తాసనము.

క. పదగుల్ఫంబున గుదముం, గదియంగా నిల్పి యంకగతమై యుండం
బద మొకటి సంఘటించిన, నది ముక్తాసన మవక్ర మగు మేనమరన్.

తా. ఎడమకాలిమడిమచే మూలాధారమును గప్పి కుడియడుగు నెడమతొడమీఁద నుంచిన అది ముక్తాసన మగును

టిట్టిభాసనము.

క. వెలకిల జరణతలంబులు, దలమీఁదం జేర్చి ధరణితలమున నిలుపం
గలిగెడు నట్లుగఁ గరములు, నలపశ్చిమ మెత్త టిట్టిభాసన మన్యెన్.

తా. పాదములు వెలికిల నుండ శిరస్సుపైఁ గదియించి చేతులతోఁ బూనికగా నిలిచి వెనుకటి భాగము పైకెత్తఁగా టిట్టిభాసన మగును

పశ్చిమతానాసనము.

చ. పదముల భూమి దండ మురభాతిగఁ జాచి కరాంగుళంబులన్
బదయుగళాగ్రము ల్బిగియఁబట్టి లలాటము జానుయుగ్మముం
బదిలముగా ఘటింప నిది పశ్చిమతానము దీన రోగము
ల్గదియవు పశ్చిమంబునను గారి యగున్ జఠరాగ్నికార్శ్యముల్.

తా. నేలమీఁద రెండుకాళ్లు చక్కగాఁ జాచి రెండుకాళ్ళబొటనవ్రేళ్లు రెండుచేతులఁ బట్టికొని మోఁకాళ్ళమీద లలాటము నుంచెనేని పశ్చిమతానువాసనము ఇందున వాయువు పశ్చిమమార్గముగా నడుచుటవలన జఠరాగ్ని ప్రజ్వరిల్లి కడుపుపల్చనై రోగములు నశించు ననుట

పూర్వతానువాసనము.

తే. వరుస మీఁగాళ్లు నేలమోవంగమడిచి,మడిమలును బిఱుదులునుగూర్చి మస్తకంబు
నడుమఁగరకూర్పరంబుల నదిమిమోపి, నడుమెగయనున్నఁ బూర్వతానంబటండ్రు.

తా. కాలివ్రేళ్లు మడిచి భూమిమీఁద నిల్పి మడమలును పిఱుఁదులును జేర్చి శిరస్సును చేతులతోడను నడుమును మోఁచేతుల తోడను అదిమిపట్టుకొని నడుమును నిక్కించిన పూర్వతానువాసనమనుట.

అర్ధకాసనము.

మ. పదతలము ల్ధరాతలముపైఁ గడుడగ్గఱ నిల్పి లోఁదొడల్
గదిసినజంఘలు న్నటలలాటము మోపిన జానుయుగ్మమున్

వాయువును మూలాధారమునుండి బ్రహ్మరంధ్రపర్యంతము సుషుమ్నానాళద్వారముగ స్థాపనము చేయుట, పూరక మనఁగా బ్రహ్మరంధ్రపర్యంతము రేచించినవాయువును మరల సుషుమ్నానాళద్వారముగ మూలాధారమునఁ జేర్చుట, కుంభక మనఁగా రేచించిన వాయువును బ్రహ్మరంధ్రమునందు మాత్రాసంఖ్యగ నిలుపుట, ఇదే యూర్ధ్వకుంభకము, పూరించినవాయువును మాత్రాసంఖ్యగ మూలాధారమున నిలుపుట అధోకుంభకము

## బంధత్రయవివరణము.

తే. గుహ్యమున వామపాదంబుఁ గూర్చి యితర, పాదమూలంబు నాభినిఁ బరిగఁ జుబుక
మంగమునను జేర్ప నివిబంధవర్గములండ్రు, ఆర్యనుత వీనిఁ దెలియుమీ వాత్మ్య సుగుఁగు.

గీ. మడమను యోనిస్థానము, విడువక బంధించి యూర్ధ్వవీథి కపానుఁ
వడి నాకుంచనముసఁ గొని, వడి నాకర్షింప మూలబంధం బయ్యెన్.

తే. కృత్రిమము లేక నాభికి గ్రిందు మీఁదు, బలిమిమై బంధనము సేయు వలయు దీనిఁ
బరమయోగీంద్రు లుడ్యాణబంధ మండ్రు, బంధములలోన నుత్తమంబం గ్రుదీని.

తే. కంఠ మాకుంచనము సేసి కడుదృఢముగ
హృదయమునఁ జుబుకము నిల్ప సిదియ కాదె
భవ్యజాలంధరాభిఖ్య బంధ మూర్ధ్వ
భాగమున నున్న యమృతనిబంధకంబు.

వ. అంఘ్రిమూలమున మూలాధారచక్రంబుఁ బీడించి ప్రాణంబు బిగఁబట్టి—అని భగవద్గీతా సాంగ భాగవతాది గ్రంథములలోఁ జెప్పఁబడియున్నది గనుక గుదగుహ్యములయందు దపానునిసంకోచముగాఁ గలుగ నెడమ మడిమచేత గుదస్థానమును బంధించుటయే మూలబంధము, కుడిమడమచేత నాభిని బంధించుట ఉడ్యాణబంధము, గడ్డము ఱొమ్మున నుంచుటే జాలంధరబంధము, ఈ బంధత్రయమునందు సుస్థిరులై వాయు యోగసిద్ధి గల యోగీంద్రులు వార్ధక్యాది వ్యాధి మృత్యుభయములు లేక మోక్షసామ్రాజ్యపట్టభద్రులయి యుందురు, ఇది సత్యము.

## సమాధిలక్షణము.

చు॥ సమాధి—సవికల్పక మని నిర్వికల్పక మని ద్వివిధము, అందు సవికల్పకము దృశ్యానువిద్ధసవికల్పక మని శబ్దానువిద్ధసవికల్పకమని యిరుతెఱఁగులు కలది యగును, ఈరెండును నిర్వికల్ప మొక్కటియును గూడి
తే. వరుసను లయ్యెను, ఈమూఁడును బాహ్యాంతరభేదములచేత బాహ్యదృశ్యానువిద్ధసవికల్పకసమాధి
నదుమహ్యానిర్వికల్పకసమాధి యనియు అంతరదృశ్యానువిద్ధసవికల్పకసమాధి యనియు అంతరశబ్దానువి
ద్ధసమాధి యనియు అంతరనిర్వికల్పకసమాధి యనియు ఆఱువిధములు

తోడను వడగానుపించు నెల్లచిదాభాస, కళలు తనకు వేఱుగా వటంచుఁ
ను తెలివి నెపుడుఁ దెలియుట బాహ్యదృశ్యానువిద్ధ మనఁగ నలరు వత్స.

మ. ఇతర మగు ద్విదళంబున, వింతగఁ జూపట్టుకళల వీక్షించుచుఁ దా
నంతన మందుచు నుండుట, యంతర్దృశ్యానుపిద్ధ మనఁబడు సుమతీ.

తే. బాహ్యమునఁ బెక్కుగా వినఁబడెడి శబ్దతతులఁ దెలిసియు నలివినము లోన నటించునఁ
దెలిసి యానందరసమునఁ దేలుచుంట, బాహ్యశబ్దానువిద్ధ సమాధి యగు వసిష్ఠ.

క. అంతర్హృదయగుహాభాగంబున, నంటిం పొంగి ప్రాయు ప్రణవశబ్దంబుల నా
ద్యంతము విను తినఁ దెలియుట, యంతర్దృశ్యానువిద్ధ మనఁబరుఁ బుత్త్రా.

ఆ. బాహ్యదృశ్యశబ్దపటలంబుగను నాత్మఁ, గనుట బాహ్యసవికల్పమౌను
రస్థదృశ్యశబ్దరాశిఁ గన్గొను నాత్మఁ, గనుట లోని సవికల్పమగును.

మఱియొకవిధ మగు ప్రాణాయామము, కుడిముక్కు ఇడ యిడే సూర్యనాడి, యెడమముక్కు పింగళ యిడే చంద్రనాడి, వీనియందు సంచరించు ప్రాణవాయువును బ్రహ్మబీజమైన ప్రణవమందలి అకారఉకారమకారములను మూఁటిని మూఁడుమాత్రలనుగాఁ జేసికొని వానిలో అకారముచేత సూర్యనాడిని పంద్రెండుమాత్రల కాలమును, మకారముచేత చంద్రనాడిని పదియాఱుమాత్రల కాలమును పూరించి ఉకారముచేత రెండు నాడులను చేర్చి పదిమాత్రల కాలము సుషుమ్నయందు కుంభించి పిదప నడినాళంబుచేత క్రమంబుగా పూరించుట ప్రాణాయామము, ఇట్లు బాల కౌమార యౌవన వృద్ధ నిమ్నాలనగు వేళ్లు గల ప్రాతఃకాలము మధ్యాహ్నకాలము సాయంకాలము అర్ధరాత్రకాలము వీని యందు ప్రతిదినమును ప్రతివేళను ఇరువదిమార్లు తప్పక ప్రాణాయామము చేయుచుండినచో వాయువు స్థిరపడి పిమ్మట కేవలకుంభకమునకు మార్గమగును. ఈ ప్రాణాయామలక్షణము అనేకవిధములుగా నుండును గావున గురూపదేశమునఁ దెలిసికొనవలయును.

## ప్రత్యాహారలక్షణము.

వర్ణరూప ధ్వనిరూపము లయిన సకలశబ్దములను వినుట, మృదువు కఠినము ఉష్ణము శీతలము మొదలగు స్పర్శములను తెలిసికొనుట, పొట్టి పొడుగు లావు సన్నము నలుపు తెలుపు ఎఱుపు ఆకుపచ్చ మిశ్రము లని పదివిధము లయిన రూపములను జూచుట, ఉప్పు పులుసు కారము తీపు చేదు వగరు అను షడ్రసములను రుచించుట, సుగంధ దుర్గంధ మిశ్రగంధములను మూర్కొనుట, సుశబ్దములను అపశబ్దములను పలుకుట, ఇచ్చుట పుచ్చుకొనుట లోనగు పనులను జేయుట, నడచుట ఎరుగుట పరుగెత్తుట మొదలగు పనులను గావించుట, మలవిసర్జనము చేయుట, సురతాదులచేత నానందించుట, సంశయించుట, నిశ్చయించుట, చంచలించుట, అభిమానించుట అను గుణములనుండి శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వ ఘ్రాణము వాక్కు హస్తము పాదము పాయువు గుహ్యము అను పదునాలుగింద్రియములను త్రిప్పుట ప్రత్యాహారము.

## ధ్యానలక్షణము.

క. మానసకమలమునందున, శ్రీనారాయణుని మూర్తిఁ జింతించుచు లో
ధ్యానము సేయుట సగుణధ్యానం బని యందురు సుజను లమలవివేకా.

సీ. కమలాసనస్థుఁడై కాయంబు నిక్కించి, కరముల బాహులఁ జేర్చి కనులు మూసి
దేహేంద్రియప్రాణధీమనాదికములు, దృశ్యమేఁ గాను తద్ద్రష్ట నేను
దృశ్యమేఁ గాను తద్ద్రష్టనే ననువృత్తి, దృశ్యంబు గానఁ దద్ద్రష్ట నేన
యుని విజాతిప్రత్యయనివృత్తిగా సజాతిప్రత్యయప్రవృత్తిక్రమమున

తే. నాత్మదానైనయందాఁక నయ్యశేష,దృశ్యదృగ్వృత్తులను నిషేధించుకొనుచు
నవిశ మాత్మావలోకన మందు చుంట, నిర్గుణధ్యాన మనఁ జెల్లు నిర్మలాత్మ.

తా. ధ్యానము సగుణధ్యానము నిర్గుణధ్యానము అని రెండువిధములు, అందు హృదయపద్మమందు తటస్థలక్షణస్వరూపుఁ డయిన విరాట్పురుషుని నిలిపి మనస్సుచేత సమస్తవస్తువులను గల్పించి షోడశోపచారములను చేసి ధ్యానించుటయే సగుణధ్యానము, పద్మాసనంబున నుండి శరీరంబు నిక్కించి హస్తంబులను తొడలపై నుంచి నేత్రములు మూసి స్థూలసూక్ష్మకారణశరీరములును పదునాలుగింద్రియంబులును దశవిధప్రాణంబులును దృశ్యములు, ఆ దేహేంద్రియప్రాణంబులు నేఁ గాను, వీనిని వీక్షించు సాక్షిని, సాక్షిని నేననెడు వృత్తియును దృశ్యమే గనుక ఆ వృత్తిని జూచు సాక్షిని అని మాయాకల్పితము లై విజాతీయము లగు యుష్మత్ప్రతీతిప్రత్యయగోచరాదు లనెడు బహిర్దృశ్యములను సజాతీయము లగు అస్మత్ప్రతీతిప్రత్యయగోచరాదు లనెడి యాంతర్దృశ్యములను ఆ దృశ్యములకు సాక్షి నానెడువృత్తిని నిషేధించుచు సత్యజ్ఞానానందనిర్మలాఖండస్వరూపమై సర్వదృక్కగు పరబ్రహ్మము తా ననెడు దృఢము గలుగుదాఁక యెల్లప్పుడు నిర్వికల్పబ్రహ్మనిష్ఠ గలిగి యుండుటే నిర్గుణధ్యానము

## ధా ర ణా ల క్ష ణ ము.

మూలాధారము స్వాధిష్ఠానము మణిపూరకము అనాహతము విశుద్ధము ఆజ్ఞేయము సహస్రారము అనెడు కమలములయందు వానికి నధిదేవత లైన గణపతి బ్రహ్మ విష్ణు రుద్ర యీశ్వర సదాశివ గురుచరణములను అక్కడక్కడ ధ్యానించునపుడు మనస్సును నిలుపుటే ధారణాయోగము, ప్రత్యగాత్మ యైన నేనే పరమాత్మను ఆ పరమాత్మయే ప్రత్యగాత్మ అని నిష్ఠ చేయుచుండుటే సమాధి, అని ఈవిధముగ అభ్యాసయోగము యొనిమిదంగములు కలిగియుండును, అది చిత్తపరిపాకము లేనివారికి తగినది, మిక్కిలి కష్టతర మైనది, మఱియు యీ యభ్యాసయోగమును వాడుక చేసినవారికి అణిమాద్యష్టవిధైశ్వర్యముల నిచ్చును, బ్రహ్మజ్ఞానమును వృద్ధిఁబొందించును, చిత్తపరిపాకము గలవారికి జీవేశ్వరైక్యజ్ఞానము నిచ్చును, అతిసులభ మైన జ్ఞానయోగమే రాజయోగ మని చెప్పఁబడును, ఈ యభ్యాసయోగ జ్ఞానయోగసిద్ధికి శ్రీరామునిపాదారవిందములయందు భక్తి గలిగియుండుటే కారణము అని తాత్పర్యము. ఈ తాత్పర్యమం దుదాహరింపఁబడిన పద్యములు శుకచరిత్రము, శివయోగసారము గ్రంథములయందలివని యెఱుఁగవలయును.

## అ ష్టై శ్వ ర్య ము ల వి వ ర ణ ము.

సీ. అణుజంతువులయందు నణువై చరించుట, లణిమాహ్వయైశ్వర్య మలఘుచరిత
యబ్జజాండాదిమహత్వము లై యుంట, మహిమాఖ్యభూతి నిర్మలవిచార
బ్రహ్మాండమునకంటె భారమై యుండుట, గరిమాఖ్యసంపత్తి కలుమదూర
యమరాద్రిసదృశుఁడై యతిసూక్ష్మగతినుంట, లఘిమావిభూతిసల్లలితహృదయ

తే. వాంఛితార్థావలంబనావాప్తి ప్రాప్తి, గగనగమనాదిసిద్ధి ప్రాకామ్య మర్క
శశిముఖనియామకత్వ మీశత్వ మఖిల,జీవవశ్యప్రవృత్తి వశిత్వ మనఘ.

తా. అణుప్రమాణము లైన ప్రాణులయందు పరమాణుప్రమాణుఁ డై యుండుట అణిమ, బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివ విరాట్పురుషాండములకంటె పెద్దవాఁడై యుండుట మహిమ, బ్రహ్మాద్యండములకంటె భారమై యుండుట గరిమ, మేరువంతటిబరువు గలిగి యుండి దూదికంటెను తేలి

కరమై యుండుట లఘిమ, ఇష్టపదార్థములను లభింపఁజేసికొనుట ప్రాప్తి, గగనగమనాదిసిద్ధి ప్రాకామ్యము, సూర్య చంద్ర మహేంద్ర ఉపేంద్ర అగ్నిప్రముఖదేవతలను పనులలో నియమించుట యీశత్వము, సకలజంతువులను వశము చేసికొనుట వశిత్వము.

శా॥ ప్రత్యక్షావగమంబుఁ బావనము నభ్యాసంబు గావింపఁగా
నత్యంతోరుసుఖంబు ధర్మ్యమతిగుహ్యాం బుత్తమం బాద్యముఁ
సత్యం బాగమసిద్ధ మాదిమునిరాట్సంస్తుత్యము న్వేద్యముఁ
నిత్యానందము రాజయోగము మహానిర్వాణమార్గం బగున్. ౨౭

టీక. ప్రత్యక్షావగమంబు—ప్రత్యక్ష = కనఁబడునట్టి జగత్తును, అవగమంబు = కనఁబడక యుండఁ జేయునదియు, పావనమును = మహాపవిత్రమైనదియు, అభ్యాసంబుఁ గావింపఁగన్ = శ్రవణ మనన నిదిధ్యాసములచేత నలవాటుచేయఁగా, అత్యంతోరుసుఖంబు—అత్యంత = మిక్కిలి, ఉరు=మిక్కిలి యైన, సుఖంబు = నిర్మలసుఖము కలిగించునదియు, ధర్మ్యము = పుణ్యరూపమైనదియు, అతిగుహ్యంబు = మిగుల రహస్యమైనదియు, ఉత్తమంబు = ఉత్కృష్టమైనదియు, ఆద్యమును = అనాదిసిద్ధమైనదియు, సత్యంబు = త్రికాలములయందుఁ గలదియు, ఆగమసిద్ధము—ఆగమ = కామికాది వాతూలాంతాష్టావింశత్యాగమములయందు, సిద్ధము = ప్రతిపాదింపఁబడినదియు, ఆదిమునిరాట్సంస్తుత్యముఁ—ఆదిముని = పురాతనులగు సనకాదిమునులకు-లేక అగస్త్యాదిమునులకు, రాట్ = ప్రభువు లైన - అనఁగా గురువు లైన దక్షిణామూర్తి హయగ్రీవులచేత, సంస్తుత్యముఁ = కొనియాడఁదగినదియును, వేద్యముఁ = మోక్షేచ్ఛ కలవారిచేత తెలియఁగఁదగినదియును, నిత్యానందము—నిత్య=సార్వకాలిక మయిన, ఆనందము = సుఖమును గలుగఁజేయునట్టిదియును నయిన, రాజయోగము = జ్ఞానయోగము, మహానిర్వాణమార్గంబు = గొప్ప మగు మోక్షమార్గము, అగున్ = అవును.

తా. ఓ అంజనేయా! కంటికి కనఁబడు జగత్తును పరబ్రహ్మ మని తోఁపఁ జేయునదియును, మహాపవిత్రమైనదియును, శ్రవణ మనన నిదిధ్యాసములచేత అలవాటు చేయువారికి నిర్మలసుఖము గలుగఁ జేయునదియును, పుణ్యరూపమైనదియును, మిగుల రహస్య మయినదియును, అన్నియోగములలో శ్రేష్ఠ మయినదియును, బ్రహ్మసృష్టికి పూర్వము పొందఁబడి యున్నదియును, కామికము మొద లయిన యిరువది యెనిమిది ఆగమములచేత ప్రతిపాదింపఁబడినదియును, పురాతను లయిన సనకసనందన సనత్కుమార సనత్సుజాత నారదాదిదేవర్షులకు గురు వైన హయగ్రీవునిచేతను అగస్త్యాదిబ్రహ్మర్షులకు గురు వైన దక్షిణామూర్తిచేతను పొందఁదగినదియును, మోక్షేచ్ఛ గలవారిచేత తెలుసుకొనఁదగినదియును, ఎల్లప్పుడును బ్రహ్మానందము గలుగఁజేయునదియును అయిన రాజయోగము మోక్షమును పొందింప ముఖ్యమార్గ మని తాత్పర్యము.

ఆ. రాజగుహ్య మైన రాజయోగంబును, శ్రద్ధధాను లగుచు జనము లెల్ల
సంశ్రయింప లేక సంసారవనధిలో, మునుఁగు చుందురు విమూఢు లగుచు.

టీక. జనములెల్లన్ = జనులందఱును, శ్రద్ధధానులగుచున్ = భక్తి గలవారై, రాజగుహ్యమైన = అతిగోప్యమైన, రాజయోగంబున్ = జ్ఞానయోగమును, సంశ్రయింపలేక = అనుసరింపఁజాలక, విమూఢు లగుచున్ = మిగుల తెలివి లేనివారై, సంసారవనధిలోన్ = సంసారసాగరమందు, మునుంగు చుందురు = మగ్ను లగుచుందురు.

తా ఓ ఆంజనేయా! సకలజనులును ఆశక్తి గలిగి మిక్కిలి రహస్యమైన రాజయోగమును వేడుకతో వాడుక చేయఁజాలక తెలివిమాలి జననమరణాదులుగల సంసారసాగరమందు మునిఁగి యీఁదు చుండు రని తాత్పర్యము

క. ఈ రాజయోగమార్గం, బీరేడుజగంబులందు నెవ్వ రెఱుంగ రా
త్మారామలసదపాంగా, పారకృపాయుక్తులైన భక్తులు దక్కన్. ౮౯

టీక ఈ రాజయోగమార్గంబు = ఈ విజ్ఞానయోగసరణిని, ఈరేడుజగంబులందున్ = పదునాలుగు లోకములయందు, ఆత్మారామ = సర్వజంతువులయం దంతర్యామియై క్రీడించు చున్న పరమాత్మని యొక్క, లసత్ = ప్రకాశించెడి, అపాంగ = కడగంటిచూపుయొక్క, అపార = మితి లేని, కృపా యుక్తులు = దయాసమేతులు, ఐనట్టి భక్తులు = ఐనట్టి భక్తజనులు, తక్కన్ = వినా గా, ఎవ్వ రెఱుంగరు = ఒకరును దెలియఁజాలరు.

తా ఓ ఆంజనేయా! ఈ రాజయోగమార్గమును పదునాలుగులోకములలో బ్రహ్మానిష్ఠ గల విజ్ఞాను లెఱుఁగుదురు గాని యితరు లెఱుఁగ రని తాత్పర్యము

తే. రాజయోగంబు ముక్తికి రాజపథము, రాజగుహ్యంబు పరమంబు రాజవిద్య
యాదియును మూఁడువిధంబుల నలరుచుండు, సాంఖ్యతారక సదమనస్కము లనఁగ.

టీక. రాజయోగంబు = విజ్ఞానయోగము, ముక్తికిన్ = మోక్షమునకు, రాజపథము = రాజమార్గము వంటిది, రాజగుహ్యంబు = మిగుల రహస్య మయినది, పరమంబు = శ్రేష్ఠ మయినది, రాజవిద్య = వేదాది చతుర్దశవిద్యలకంటె-లేక మణివిద్య మహావిద్య చంద్రవిద్య అనంగవిద్య శ్రీవిద్య ఆత్మవిద్య ఇంద్ర విద్య షోడశీవిద్య కాదివిద్య సాదివిద్య మొదలగు పదునాలుగువిద్యలకంటె సు శ్రేష్ఠమైనది; అది యును = ఆ రాజయోగము, సాంఖ్యతారకసదమనస్కములు—సాంఖ్య = సాంఖ్యయోగము, తారక = తారకయోగము, సత్ = శ్రేష్ఠ మయిన, అమనస్కములు = అమనస్కయోగములు, అనఁగన్ = అను నట్లు, మూఁడువిధంబులన్ = ముత్తెఱంగులుగా, అలరుచుండున్ = శోభిల్లు చుండును.

తా. ఓ ఆంజనేయా! రాజయోగము మోక్షమును పొంద నపేక్ష గలవారికి రాజవీథివంటిదియును, మిగులగోప్య మయినదియును, అన్నియోగములలోను అన్నివిద్యలలోను శ్రేష్ఠ మయినదియును అగును; మఱియు, నా రాజయోగము సాంఖ్య మనియు తారక మనియు అమనస్క మనియును మూఁడువిధము లుగా నుండు నని తాత్పర్యము.

తే. తారకంబు మనశ్శుద్ధికారకంబు, సాంఖ్య మాత్మస్వరూపవిచారకంబు
అనుభవజ్ఞాన మమనస్క మట్లు గాన, నాద్య మెఱిఁగింతు మొదల నీ వవధరింపు.

టీక. తారకంబు = అక్షిపురుషయోగము, మనశ్శుద్ధికారకంబు—మనః = ఉల్లముయొక్క, శుద్ధి = పరిశుద్ధతను, కారకంబు = చేయునట్టిది, సాంఖ్యము = సాంఖ్యయోగము, ఆత్మస్వరూపవిచారకంబు — ఆత్మస్వరూప = పరబ్రహ్మస్వరూపముయొక్క, విచారకంబు = పరిశీలన చేయునట్టిది, అమనస్కము = అమనస్కయోగము, అనుభవజ్ఞానము = సాక్షాత్కారజ్ఞానము, అట్లుగావునన్ = అటుగనుక, మొదలన్ = ప్రథమమందు, ఆద్యము = మొదటి దయిన తారకయోగమును, ఎఱిఁగింతున్ = బోధించెదను, నీవు = నీవు, అవధరింపుము = వినుము.

తా. ఓ ఆంజనేయా! తారకయోగము మనస్సును పరిశుద్ధము చేయునట్టిగియుండును, సాంఖ్యయోగము పరబ్రహ్మస్వరూపము ఇట్టిదని తెలియజేయుచున్నదియును, అమనస్కయోగము నీవే పరబ్రహ్మమని నిర్ణయించునదియును అగును, గనుక తొలుత తారకయోగమును తెలిపెదను వినుమని తాత్పర్యము.

ఉ. తారక ముద్భవాంబునిధితారక మంబుజసంభవాదిబృం
దారకసన్నుతం బఘవిదారక మంచితరాగరోషసం
హారకముం బ్రధానపరిహారక మాత్మసుఖానుభూతి వి
స్తారక మాగమాంతసువిచారకమై తనరారు మారుతీ. ౨

టీక. మారుతీ = ఆంజనేయా, తారకము = తారకయోగము, ఉద్భవాంబునిధితారకము - ఉద్భవ = జన్మపరంపర యనెడు, అంబునిధి = సముద్రము, తారకమును = దాటించునదియును, అంబుజసంభవాది = బ్రహ్మ మొదలగు, బృందారక = దేవతలచేత, సన్నుతంబు = పొగడఁ దగినదియు, అఘవిదారకము — అఘ = పాపములను, విదారకము = నశింపఁ జేయునదియును, అంచిత = ఒప్పిదమగు, రాగ = కామమును, రోష = క్రోధమును, సంహారకమున్ = అడఁచునదియును, ప్రధానపరిహారకమును — ప్రధాన = మూలప్రకృతిని - అనఁగా అజ్ఞానమును, పరిహారకము = తొలఁగించునదియు, ఆత్మసుఖ = బ్రహ్మానందముయొక్క, అనుభూతి = అనుభవమును, విస్తారకము = వృద్ధిఁ బొందించునదియును, ఆగమాంతసువిచారకమై — ఆగమ = వేదములయొక్క, అంత = కడపటిభాగ మైన జ్ఞానకాండముచేత, సువిచారకమై = చక్కఁగను విచారింపఁ దగినదియై, తనరారున్ = ఒప్పును

తా. ఓ హనుమంతుఁడా! తారకయోగము పుట్టుట గిట్టుట లనెడి అలలు గల సంసార సముద్రమును దాటించునదియును, బ్రహ్మ విష్ణు రుద్రాదులచేత పొగడఁదగినదియును, బ్రహ్మహత్యాది మహాపాపములను నశింపఁజేయునదియును, కామ క్రోధ లోభ మోహ మద మత్సర దంభాదిదుర్గుణములను సంహరించునదియును, నేను జీవుఁడ ననెడి అజ్ఞానమును తొలఁగించునదియును, పరబ్రహ్మము నేననెడు దివ్యజ్ఞానమువలనఁ గలిగిన నిరతిశయానందమును వర్ధిల్లఁ జేయునదియును, వేదములకడపటి భాగ మైన జ్ఞానకాండముచేత విచారింపఁ దగినదియును అగు నని తాత్పర్యము.

తే. తారకయోగము దెలియఁగ, నేరక వేదాంతవాక్యనికురుంబముచే
నూరక వాదించుచుఁ జెడు, వారికి మోక్షంబు గలదె వాయుకుమారా. ౩

టీక. వాయుకుమారా = ఆంజనేయా, తారకయోగమున్ = ప్రణవార్థానుసంధానమును, తెలియఁగ నేరక = ఎఱుఁగఁజాలక, వేదాంతవాక్య = ఉపనిషద్వాక్యములయొక్క, నికురుంబముచేన్ = గుంపుచేత, ఊరక = వ్యర్థముగా, వాదించుచున్ = తర్కించుచు, చెడువారికిన్ = భ్రష్టులగువారికి, మోక్షంబు గలదె = ముక్తి గలదా.

తా. ఓ హనుమంతుఁడా! తారకయోగనిష్ఠ లేక వేదాంతవాక్యార్థములను ప్రతిపాదించి వాగించుచు స్వేచ్ఛగా ప్రవర్తించువారికి సంసారదుఃఖరహితరూప మయిన మోక్షము కలుగ దని తాత్పర్యము.

తే. రాజయోగంబుఁ బూని నిరంతరంబు, పట్టుగా నభ్యసింపంగఁ బ్రాలుమాలి
కొన్ని వేదాంతయుక్తులు గూడఁబెట్టి, పలుక నేర్చిన బ్రహ్మానుభవము గలదె.

టీక. రాజయోగంబు = అమనస్కయోగమును, పూని = ధరించి, నిరంతరంబు = సర్వకాలము, పట్టుగాన్ = పూనికగా, అభ్యసింపంగన్ = శ్రవణ మనన నిదిధ్యాసనములచే నలవాటుచేయుటకు, ప్రాలు

మాలి = బద్ధగించి, కొన్ని వేదాంతయుక్తులు = కతిపయ వేదాంతవాక్యచమత్కారములను, కూడఁబెట్టి = సంగ్రహించి, పలుక నేర్చినన్ = ప్రసంగింప నేర్చుకొనఁగానే, బ్రహ్మానుభవము = అహంబ్రహ్మాస్మి యనెడి ఆత్మానుభవము, కలదె = ఉన్నదా - అనఁగా లే దని భావము

తా॥ ఓహనుమంతుఁడా! రాజయోగమును శ్రవణమనననిదిధ్యాసములచేత వాడుకచేయుటకు బద్ధగించి వేదాంతశాస్త్రమందలి యుక్తులను కొన్నిటిని కూర్చుకొని సభలలో ప్రసంగింప నేర్చుకొనఁగా నే అహంబ్రహ్మాస్మి యను విజ్ఞానము గలిగి దుఃఖరహితము కానేర దని తాత్పర్యము.

సీ. దారుణగాఢాంధకారంబ డఁగునే, వసుధపైఁ గృతదీపవార్తవలన
నాఁకొన్నమనుజునియాఁకలి దీఱునే, ఘనసరసాన్నవర్ణనమువలన
నెఱిపేదవానిపేదఱికంబు వోవునే, ద్రవ్యప్రభావకీర్తనమువలన
రోగపీడితుని బల్రోగంబు దీఱునే, కలితౌషధప్రసంగంబువలన

తే. జుండిపడి బుద్ధిలో వెలి నిండి మిగుల, దట్టమైనట్టి యజ్ఞానతమము దెగునె
తర్కితవిచిత్రశబ్దబోధంబువలన, ఫలితయోగానుభవదృష్టివలనఁ గాక. ౯౪

టీ॥ వసుధపైన్ = భూమియందు, కృతదీపవార్తవలనన్ — కృత = చేయఁబడిన, దీప = దివియయొక్క, వార్తవలనన్ = వృత్తాంతమువలన - అనఁగా దీపపువృత్తాంతమును జెప్పినమాత్రమున నే, దారుణ = భయంకర మయిన, గాఢ = దట్ట మయిన, అంధకారంబు = చీఁకటి, అడఁగునే = నశించునా, ఘన = అతిశయ మైన, సరస = షడ్రసోపేత మైన, అన్న = వంటకముయొక్క, వర్ణనమువలనన్ = ప్రశంసవలన, ఆఁకొన్న = క్షుధార్తుఁ డైన, మనుజుని = మనుష్యునియొక్క, ఆఁకలి = క్షుధ, తీఱునే = అడఁగునా? ద్రవ్య = ధనముయొక్క, ప్రభావ = మహాత్మ్యముయొక్క, కీర్తనమువలనన్ = స్తోత్రమువలన, నెఱిపేదవాని = కడులేమిడి గలవానియొక్క, పేదఱికంబు = దారిద్ర్యము, పోవునే = తొలఁగునా? కలిత = కమనీయము లయిన, ఔషధ = మందులయొక్క, ప్రసంగంబువలనన్ = మాహాత్మ్యప్రకటనమువలన, రోగపీడితుని = వ్యాధిగ్రస్తునియొక్క, బల్రోగంబు = గొప్పవ్యాధి, తీఱునే = నివారణ మగునా? జుండిపడి = మొండిపడి, బుద్ధి = అంతఃకరణముయొక్క, లోన్ = లోపలను, వెలిన్ = వెలుపలను, నిండి = భరితమై, మిగుల దట్టము = అతిసాంద్రము, ఐనట్టి యజ్ఞానతమము = ఐన యవివేక మనెడు కాఱుచీఁకటి, ఫలిత = లభ్య మైన, యోగ = ప్రత్యగ్బ్రహ్మైక్యముయొక్క, అనుభవ = సాక్షాత్కార మగు, దృష్టివలనఁ గాక = లక్ష్యమువలనఁ గాని, తర్కిత = ప్రతిపాదింపఁబడిన, విచిత్ర = ఆశ్చర్యతరములై, శబ్ద = వాగ్విస్పంధనములయొక్క, బోధంబువలనన్ = జ్ఞానమువలన, తెగునె = నశించునా.

తా॥ ఓ ఆంజనేయుఁడా! దీపమును పెట్టక దీపముసంగతిని ప్రసంగించినమాత్రమున నే కటిక చీఁకటి నశింపనివిధమునను, షడ్రసోపేత మయిన అన్నమును పెట్టక ఆయన్నమును పొగడినమాత్రమున నే ఆఁకలిగొన్నవానియాఁకలి తీరనితీరునను, ధనము నియ్యక నే ధనమును స్తోత్రము చేసినమాత్రమున నే నాటికి నాటికి లేనివానిలేమిడి చెడిపోనట్టుగను, ఔషధము నియ్యక ఔషధములమహిమను చెప్పుటచేత నే గొప్పవ్యాధిబాధ నివారణము కాని చొప్పునను, బ్రహ్మైవాహ మస్మి యను సాక్షాత్కారజ్ఞాననిష్ఠ కలుగక వేదాంతశాస్త్రప్రకరణప్రసంగమువలన దేహేంద్రియాదులు నే ననెడు అజ్ఞానము నశింప దని తా.

యోగాభ్యాసఫలనిరూపణము.

క. యోగాభ్యాసమువలన స,దాగతి చిత్తేంద్రియములదర్పము లడఁగున్
రాగద్వేషాదులు చను, బాగుగ నాత్మకు సుఖానుభవమును గలుగున్. ౯౫

టీక. యోగాభ్యాసమువలనన్ = రాజయోగముయొక్క వాడుకవలన, సగాలి = ప్రాణ వాయువుయొక్కయు, చిత్త = మనస్సుయొక్కయు, ఇంద్రియముల = జ్ఞానకర్మేంద్రియములయొక్కయు, దర్పములు = గర్వములు, అడంగున్ = క్షీణించును, రాగద్వేషాదులు = రాగము ద్వేషము మొదలగునవి, చనున్ = తొలఁగును, బాగుగన్ = లెస్సగా, ఆత్మకున్ = తనకు, సుఖానుభవమున్ = బ్రహ్మానందానుభూతి, కలుగున్ = లభించును.

తా. ఓ ఆంజనేయా! రాజయోగమును వాడుకచేయుటవలన ప్రాణాదిపంచవాయువులయొక్కయు, జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు అంతరింద్రియములు అనెడు పదునాలుగింద్రియములయొక్కయు, స్వేచ్ఛాప్రవర్తనములు నిలుచును, రాగము ద్వేషము కామము క్రోధము లోభము మోహము మదము మత్సరము ఈర్ష్య అసూయ దంభము దర్పము మొదలయిన దుర్గుణములు తొలఁగును, బ్రహ్మానందము తనకుఁ గలుగును అని తాత్పర్యము.

వ. అట్లు గావున యోగాభ్యాసంబు ముముక్షువున కవశ్యకర్తవ్యం బట్లగుటఁ దత్ప్ర
    కారం బెఱింగించెద సావధానచిత్తుండవై వినుము. ౯౮

టీక. అట్లు గావునన్ = అటుల బ్రహ్మానందానుభవము లభించును గనుక, యోగాభ్యాసంబు = రాజయోగాభ్యాసము, ముముక్షువునకున్ = మోక్షేచ్ఛ గలవానికిని, అవశ్యకర్తవ్యంబు = ముఖ్యముగాఁ జేయఁదగినది, అట్లగుటన్ = అటు లావశ్యకముగఁ జేయఁదగినదగుటచేత, తత్ప్రకారంబు = ఆ రాజయోగాభ్యాస క్రమమును, ఎఱింగించెదన్ = తెలియఁజేసెదను, సావధానచిత్తుండవై = నిశ్చలచిత్తుఁడవై, వినుము = ఆకర్ణింపుము.

తా. ఓ హనుమంతుఁడా! రాజయోగమును అలవాటు చేయుటవలన బ్రహ్మానందము కలుగును, మోక్షాపేక్ష గలవాఁడు రాజయోగాభ్యాసమును అక్కఱతో చేయవలెను గనుక ఆ యోగాభ్యాస క్రమమును తెలిపెదను స్థిరబుద్ధితో విను మని సీతాదేవి పలికె నని తాత్పర్యము

యో గా భ్యా సు ల కు ము ఖ్య ము ల గు నా హా రా ది ని య మ ము.

చ. వనరుచు నేమియుం దినని వానికి మిక్కిలి వెక్కసంబుగాఁ
    దిని యెగఁబోయువానికిని దీఱనినిద్దుర యెల్లప్రొద్దుఁ బై
    కొనఁబడి యుండువానికిని గొంకక రేపగ లొక్కరీతి మే
    ల్కొని వసియించువానికి నగోచరము ల్వర యోగలక్ష్యముల్. ౯౯

టీక. వరయోగలక్ష్యములు = వర = మేలయిన, యోగ = రాజయోగముయొక్క, లక్ష్యములు = అనుసంధానములు, వనరుచున్ = కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతోపవాసములచేతఁ బరితపించుచు, ఏమియుం దిననివానికిన్ = ఎద్దియును భుజింపనివానికిని, మిక్కిలి వెక్కసంబుగాన్ = అత్యధికముగా, తిని = భుజియించి, ఎగఁబోయువానికిన్ = నిట్టూర్పులు విడుచువానికిని, తీఱనినిద్దుర = తీఱంగని నిద్ర, ఎల్లప్రొద్దున్ = సార్వకాలమును, పైకొనన్ = ఆవరింపఁగా, పడియుండువానికిన్ = శయనించి యుండువానికిని, గొంకక = భయపడక, రేపగలొక్కరీతిన్ = రాత్రిందివము లేకాకారముగ, మేల్కొని వసియించువానికిన్ = జాగరూకత నొంది యుండువానికిని, అగోచరములు = కనఁబడవు = అనఁగా లభింప వనుట.

తా. ఓ హనుమంతుఁడా! కృచ్ఛ్రచాంద్రాయణ శివరాత్రి ఏకాదశి గోకులాష్టమి శ్రీరామనవమి మొదలైన వ్రతోపవాసములచేత పరితపించుచు యేమియును భక్షింపనివానికిని, మిక్కిలి యెక్కువగా దిని

పుబ్బుసబ్బులకు రాక యుండువానికిని, ప్రొద్దుపొడుచుటను ప్రొద్దుగ్రుంకుటను యెఱుంగక నిద్దురమబ్బు తో యేప్రొద్దును పరుండి యుండువానికిని, పగటియందును రాత్రియందును నిద్రయే లేక యుండువాని కిని రాజయోగానుసంధానము లభింపదని తాత్పర్యము.

క. యుక్తాహారవిహారుఁడు, యుక్తస్వప్నావబోధుఁ డురుకర్మములన్
యుక్తవిచేష్టుం డగు ఘన,యుక్తున కగుఁ బరమరాజయోగము సుఖమై. ౯౯

టీక, యుక్తాహారవిహారుఁడు—యుక్త=తగిన, ఆహార=భుక్తియును, విహారుఁడు = సంచారమును గలవాఁడును, యుక్తస్వప్నావబోధుఁడు—యుక్త = ఉచితమైన, స్వప్న=నిద్రయును, అవబోధుఁడు= మెలఁకువ గలవాఁడును, ఉరుకర్మములన్—ఉరు = గొప్పలగు, కర్మములన్=వైదికలౌకికకర్మములయందు, యుక్తవిచేష్టుండు = మితముగాఁ బ్రవర్తించువాఁడును, అగు ఘనయుక్తునకున్ = ఐన యోగికి, పరమ రాజయోగము—పరమ = ఉత్తమ మయిన, రాజయోగము = జ్ఞానయోగము, సుఖమైన = ఆనందరూప మయినదై, అగున్ = అవును

తా ఓ హనుమంతుఁడా! అతిసర్వత్ర వర్జయేత్తను న్యాయముచేత మితమైన భోజనమును సంచార మును నిద్రయును మెలఁకువయును వైదికలౌకికకర్మములయందు మితప్రవర్తనమును కల మహాపురుషునకు రాజయోగానుసంధానము లభ్యమై ఆనందమును పొందించు నని తాత్పర్యము.

## యో గ మ ర ల క్ష ణ ము.

సీ. వితతమై విజనమై విమలమై సుఖమై పొసంగు వివిక్తదేశమ్మునందు
సమభూమియందు నిశ్చలముగా మిట్టుపల్లములు గాకుండఁ బేలవము గాఁగ
వరుసఁ గుశాజినవస్త్రంబు లనువుగాఁ, బఱచి యొప్పుగ వానిపైఁ దిరముగ
బూని పద్మాసనాసీనుఁడై యామీఁదఁ, గాయమధ్యమమును గళము శిరము
తే. జక్కగా నిక్కి దృక్కులు ముక్కుచెక్కఁ
జిక్కఁ దక్కించి తక్కినదిక్కుఁ గనక
మిక్కిలి దశేంద్రియంబుల ద్రుక్కఁ జేసి
ఫలితముగ యోగ మభ్యసింపంగవలయు ౧౦౦

టీక వితతమై = విశాలమై, విజనమై = జనశూన్యమై, విమలమై = నిర్మలమై, సుఖమై = నిరుప ద్రవమై, పొసంగు = అనుకూలించునట్టి, వివిక్త = యోగశాస్త్రోక్తముగా నిర్ణయింపఁబడిన, దేశమ్ము నందున్ = స్థలమందు, సమభూమియందు = సమానమగు నేలమీఁద, నిశ్చలముగాన్ = చలనము లేనట్లు, మిట్టుపల్లములు గాకుండన్ = నిమ్నోన్నతములు గానియట్లు, పేలవము గాఁగన్=మృదువుగాను, వరుసన్= క్రమముగా, కుశాజినవస్త్రంబులు—కుశ = దర్భాసనము, అజిన=హరిణచర్మాసనము, వస్త్రంబులు = చేల ములును, అనువుగాన్ = ఒప్పిదముగా, పఱచి = విస్తీర్ణముచేసి, ఒప్పుగన్ = బాగుగా, వానిపైన్ = ఆదర్భకుశాజినవస్త్రములమీఁద, తిరముగన్ = స్థిరముగా, పూని = యత్నముతో, పద్మాసనాసీనుఁడై— పద్మాసన = పద్మాసనమందు, ఆసీనుఁడై = కూర్చుండి, ఆమీఁదన్ = అనంతరము, కాయమధ్యమమును= శరీరమధ్యభాగమును - అనఁగా నడుమును, గళమున్ = కంఠమును, శిరమున్=తలను, చక్కగానిక్కి = వక్రతలేకుండ నెత్తి, దృక్కులు = చూపులను, ముక్కుచెక్కన్=నాసికాగ్రమందు, చిక్కన్=తగులు నట్లు, తక్కించి = కూర్చి, తక్కినదిక్కుఁగనక = మఱియొక్క దిక్కును జూడక, దశేంద్రియంబు

లక్ = జ్ఞానకర్మేంద్రియములఁ బదింటిని, మిక్కిలి = అధికముగా, స్రుక్కఁజేసి = కృశింపఁజేసి, నలితముగన్ = సిద్ధి యగునటుల, యోగము=ప్రత్యగ్బ్రహ్మైక్యమును, అభ్యసింపంగవలయున్ - అలవాటు చేయవలయును.

తా. ఓ ఆంజనేయా! విశాలమై జనసంచారము లేనిదై దుర్గంధము లేనిదై నల్లులు దోమలు చీమలు మొదలగువాని ఉపద్రవము లేనిదై యోగశాస్త్రోక్తముగ నిర్ణయింపఁబడిన పర్ణశాల మొదలయినవాని యందు సమానమైన నేలమీఁద కదలక యుండునట్లును మిట్టపల్లములు లేక యుండునట్లును ఒత్తుగొనక యుండునట్లును దర్భాసనము కృష్ణాజినము వస్త్రమును అనువుగా పఱచి వానిమీఁద స్థిరచిత్తము గలిగి పద్మాసనముతోఁ గూర్చుండి నడుమును మెడను తలను చక్కగా నిక్కించి యేతలంపులును లేక చూపులను కనుబొమలనడుమ నిలిపి బ్రహ్మనిష్ఠను సలుపవలయు నని తాత్పర్యము.

మ. యతధీచిత్తమరుద్దశేంద్రియతనుర్వ్యాపారుఁడై మౌనియై
హతకామాదివికారుఁడై గతభయుండై బ్రహ్మచారివ్రత
స్థితుఁడై శాంతమనస్కుఁడై స్వగురుమూర్తిప్రోక్తలక్ష్యార్థసం
గతి యామద్వయ మభ్యసింపఁ దగు యోగం బంచితోద్యోగుఁడై. ౧౦౧

టీక. యత = నియమింపఁబడిన, ధీ=బుద్ధియొక్కయు, చిత్త = మనస్సుయొక్కయు, మరుత్ = ప్రాణాదివాయువులయొక్కయు, దశేంద్రియ = జ్ఞానకర్మేంద్రియములయొక్కయు, తను = శరీరములయొక్కయు, వ్యాపారుఁడై = వృత్తులు గలవాఁడై, మౌనియై = తూష్ణీంభావవ్రతము గలవాఁడై, హతకామాదివికారుఁడై—హత = కొట్టఁబడిన, కామ=కోరికయు, ఆది= మొదలగు, వికారుఁడై = వికృతచేష్టలు గలవాఁడై, గతభయుండై=పోఁగొట్టఁబడిన తాపత్రయమువలన భీతి గలవాఁడై, బ్రహ్మచారివ్రతస్థితుఁడై= గురుశుశ్రూషా భిక్షా భోజనాది బ్రహ్మచర్యాశ్రమలక్షణములు గలవాఁడై, శాంతమనస్కుఁడై=రజస్తమో గుణవిహీనమైన యుల్లము గలవాఁడై, స్వగురుమూర్తి = తనదేశికునిచేత, ప్రోక్త = ఉపదేశింపఁబడిన, లక్ష్య = అంతర్లక్ష్యముయొక్క, అర్థ = వస్తువుయొక్క, సంగతిన్ = కూటమిచేత, యోగంబు = నిష్ఠను, అంచితోద్యోగుఁడై—అంచిత = శ్రేష్ఠమైన, ఉద్యోగుఁడై = యత్నము గలవాఁడై, యామద్వయము = రెండుజాములు, అభ్యసింపఁదగున్ = వాడుక చేయఁదగును.

తా. ఓఆంజనేయా! మనోబుద్ధిచిత్తాహంకారము లను జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను జయించి ప్రాణాదిపంచవాయువులను వశము చేసికొని శరీరవికారముల నణఁచి మౌనవ్రతము గలిగి కామ క్రోధ లోభ మోహ మద మత్సరములగుదుర్గుణములను నశింపఁజేసి ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవిక తాపముల వలని భీతి లేక గురుశుశ్రూషా భిక్షా భోజనాది బ్రహ్మచర్యాశ్రమలక్షణములు గలిగి మనస్సును నెమ్మది పఱచికొని తనదేశికునిచేత నుపదేశింపఁబడిన అంతర్లక్ష్యమందు నిలిచి అందుఁ దోఁచిన పరమాత్మయందు శుద్ధసత్త్వవృత్తి గల తనమనస్సును చేర్చి రెండుజాములు నిష్ఠ సలుపవలయు నని తాత్పర్యము.

క. మారుతి యీనియమంబులు, తారక సాంఖ్యామనస్కతత్పరులకు సా
ధారణము లగుచు వెలయుం, దారకయోగుల కతిప్రధానము లందున్. ౧౦౨

టీక. మారుతి = హనుమంతుఁడా! ఈనియమంబులు = ఈ పూర్వోక్తనిర్ణయములు, తారకసాంఖ్యామనస్కతత్పరులకున్ = తారకము సాంఖ్యము అమనస్కము అనెడి యోగములయందు ఆసక్తి గల వారికి, సాధారణము లగుచున్ = సామాన్యములై, వెలయున్ = ప్రసిద్ధికెక్కును, అందున్=ఈ త్రివిధ

యోగాభ్యాసులయందు, తారకయోగులకున్ = తారకయోగాభ్యాసులకు, అతిప్రధానములు = మిగుల అవశ్యము లైనవి.

తా॥ ఓహనుమంతుఁడా! జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతరింద్రియము లను ప్రాణాదిపంచవాయువులను, స్థూలసూక్ష్మకారణశరీరములను, కామక్రోధాదిషడ్గుణములను గెలుచుట మొదలైన నియమములు తారకయోగ సాంఖ్యయోగ అమనస్కయోగులకు ముగ్గురికిని ముఖ్యముగాఁ గలిగి యుండవలయును, అందు తారకయోగులు అభ్యాసులు గనుక వారికి యింద్రియజయాదినియమములు మిక్కిలి అవశ్యకము లని తాత్పర్యము

## పంచముద్రాలక్షణములు.

క. వరుసన్ ఖేచరి యన భూ,చరి యన మధ్యమ యనంగ షణ్ముఖి యనఁగా
వరశాంభవి యనఁ గల వీ,ధరలోపల ముద్ర లైదు తారగమునకున్. ౧౦౩

టీక. ఈధరలోపలన్ = ఈపుడమియందు, తారకమునకున్ = తారకయోగమునకు, వరుసన్ = క్రమముగా, ఖేచరి యనన్ = ఖేచరి యనియును, భూచరి యనన్ = భూచరి యనియును, మధ్యమ యనంగన్ = మధ్యమ యనియును, షణ్ముఖి యనఁగాన్ = షణ్ముఖి యనియును, వరశాంభవి యనన్ — వర = ఉత్తమ మైన, శాంభవి యనన్ = శాంభవి యనియును, ముద్ర లైదుగలవు = పంచముద్రలు గలవు.

తా॥ ఓఆంజనేయుఁడా! తారకయోగమునకు ఖేచరి భూచరి మధ్యమ షణ్ముఖి శాంభవి అనెడు పంచముద్రలు గల వని తాత్పర్యము

ఆ. సద్గురూపదేశసరణిచే నీయైదు, ముద్రలను విశేషముగ నెఱింగి
యభ్యసింపవలయు నటమీఁద దారకం, బొందుఁ బ్రణవనాదబిందుకళల

టీక సద్గురూపదేశసరణిచేన్ — సత్ = ఉత్తముఁడైన, గురు = విహితగురువుయొక్క, ఉపదేశసరణిచేన్ = ఉపదేశమార్గముచేత, ఈయైదుముద్రలన్ = మీఁదఁజెప్పఁబడినపంచముద్రలను, విశేషముగన్ = స్పష్టముగా, ఎఱింగి = తెలిసి, అభ్యసింపవలయున్ = అభ్యాసము చేయవలయును, అటమీఁదన్ = అనంతరము, ప్రణవనాదబిందుకళలన్ — ప్రణవ = ఓంకారమందలి, నాద=చిణి చిణి చిణి మొదలగు దశవిధనాదములయొక్క, బిందు = జ్ఞాతృమనోబుద్ధిచిత్తాహంకారములయొక్క, కళలన్ = సమష్టి క్షేత్రజ్ఞ వ్యష్టి జీవచైతన్యములయొక్క శోధనముచే, తారకంబు = ప్రణవార్థము, పొందున్ = లభించును

తా. ఓ ఆంజనేయా! సద్గురువులవుపదేశములచేత నీపంచముద్రలవిషయములను చక్కఁగాఁ దెలిసికొని అభ్యాసముచేసి వెనుక ఓంకారమందలి చిణి చిణి చిణి ఘంటా శంఖ వీణా తాళ వేణు భేరీ మృదంగ మేఘనాదములను విని జ్ఞాతృమనోబుద్ధిచిత్తాహంకారములను సమష్టి వ్యష్టి భేదములు గల యీశ్వర జీవ చైతన్యములను విచారించెనేని ప్రణవలక్ష్యార్థ మైన పరబ్రహ్మము తా ననెడు నిర్వికల్పస్థితి లభించు నని తాత్పర్యము.

అష్టవిధగురులక్షణము —బోధక, వేదక, నిషిద్ధ, కామ్యక, సూచక, వాచక, కారణ, విహిత గురువు లని యెనిమిదివిధములు, అందు శాస్త్రములయందలి శబ్దార్థములను బోధించువాఁడు బోధకగురువు, తత్త్వమును దర్శింపఁజేయువాఁడు వేదకగురువు, వశ్యాకర్షణాద్యష్టకర్మలచేత నిహపరలోకములయందు మీఁద భేదముల నిచ్చువాఁడు నిషిద్ధగురువు, పుణ్యకర్మోపదేశములచేత నిహపరలోక సుఖముల నిచ్చువాఁడు

తే. కర్ణలోచననాసాయుగంబు మూసి
మలఁచి భ్రూమధ్యమమునఁ జూపులను మనము
నిలిపి వరనాదబిందుచిత్కళలఁ గనుట
షణ్ముఖీముద్ర యండ్రు సజ్జనులు వత్స ౧౦౯

టీక వత్స = బాలుఁడా! ఇది ప్రేమసంబోధనము సజ్జనులు = బ్రహ్మవేత్తలు, కర్ణ = శ్రోత్రము, లోచన = నేత్రము, నాసా = ఘ్రాణము, (వీనియొక్క) యుగంబుల్ = జంటలును, మూసి = కప్పి, మలఁచి = త్రిప్పి, భ్రూమధ్యమమునన్ = ఆజ్ఞాచక్రస్థానమందు, చూపులను = దృక్కులను, మనము = మనస్సును, నిలిపి = కుదురుపఱచి, వరనాదబిందుచిత్కళలన్ = శ్రేష్ఠము లగు నాదబిందుచిత్కళలను, కనుట = దర్శించుట, షణ్ముఖీముద్రయండ్రు = షణ్ముఖిముద్ర యని వక్కాణింతురు.

తా ఆంజనేయుఁడా! చెవులను కన్నులను ముక్కులను మూసి బహిర్ముఖమైన దృష్టిని మనస్సును అంతర్ముఖము చేసి కనుబొమలనడుమ నిలిపి నాదబిందుకళలను జూచుచుండెనేని షణ్ముఖీముద్ర యని తాత్పర్యము

క. అంతర్లక్ష్యము బహిరత్యంతవినిశ్చలసుదృష్టి యపగతపవన
స్వాంతవికారము గలయది, వింత యగుచు నొప్పు శాంభవీ ముద్ర యనన్.

టీక అంతర్లక్ష్యము—అంతః = లోపలను, లక్ష్యము = దృష్టియును—అనఁగా లోఁజూపును, బహిః... దృష్టి — బహిః = వెలుపల, అత్యంత = మిక్కిలి, వినిశ్చల = చలనము లేని, సుదృష్టి = బాహ్యలక్ష్యమును, అపగత = పోఁగొట్టఁబడిన, పవన = ప్రాణవాయువుయొక్కయు, స్వాంత = అంతఃకరణముయొక్కయు, వికారము = చేష్టలు, కలయది = కలిగినది, వింతయగుచున్ = విచిత్రమైనదై, శాంభవీముద్రయనన్ = శాంభవీముద్ర యనఁగా, ఒప్పున్ = తేజరిల్లును, 'శ్లో॥ అంతర్లక్ష్యం బహిర్దృష్టి ర్నిమేషోన్మేషవర్జితా। ఏషాసాం శాంభవీముద్రా సర్వతంత్రేషు గోపితా' అని.

తా ఓ ఆంజనేయా! ప్రాణాది దశవాయువులను, మనస్సు మొదలగు పదునాలుగింద్రియములను జయించి కన్నులను తెరచికొని చూపులను చిదాకాశమున నిలిపి అక్కడివింతలను చక్కఁగాఁ జూచి చొక్కుచుండెనేని శాంభవీముద్ర యని తాత్పర్యము.

సూర్యచంద్రమండలకళానిర్ణయము.

మ. అమరేంద్రార్చితపూర్వవర్ణితనితాంతాంతర్బహిర్మధ్యల
క్ష్యములుద్యద్వరమండలత్రయకళాసందర్శనాభ్యాసయో
గము లీరెండును నాదబిందురుచిసాక్షాత్కారసద్ధేతుభూ
తము లై యొప్పు నిరంతరం బలఘుశక్తి ధ్యానంబు గావించినన్. ౧౧౧

టీక. అమరేంద్రార్చిత = ఇంద్రునిచేతఁ బూజింపఁబడిన యాంజనేయా! పూర్వ = మును పు, వర్ణిత = చెప్పఁబడిన, నితాంత = శ్రేష్ఠము లైన, అంతః = అంతర్లక్ష్యమును, బహిః = బహిర్లక్ష్యమును, మధ్యలక్ష్యములు = మధ్యలక్ష్యమును—అనఁగా అంతర్బహిర్మధ్యలక్ష్యములు గల ఖేచరీ భూచరీ మధ్య ముద్రలు, ఉద్యత్ = వెలుఁగుచున్న, వర = శ్రేష్ఠము లైన, మండలత్రయ = అగ్నిసూర్యచంద్రమండలములయొక్క, కళా = అష్టత్రింశత్కళలయొక్క, 'శ్లో॥ ధూమ్రార్చి రుష్మా జ్వలినీ జ్వాలినీ విస్ఫులింగినీ।

ముక్తిస్వరూపా కపిలా హవ్యకవ్యవహా దశ" ఇవి పదియును నగ్నికళలు "శ్లో॥ తపినీ తాపినీ ధూమ్రా మరీచి జ్వాలినీ రుచిః । సుషుమ్నా భోగదా విశ్వా బోధినీ ధారిణీ క్షమా" ఇవి ౧౨ ను సూర్యకళలు. "శ్లో॥ అమృతా మానదా పూషా తుష్టిః పుష్టి రతి ర్ధృతిః। శశినీ చంద్రికా కాంతి ర్జ్యోత్స్నా శ్రీ ప్రీతి రంగదా । పూర్ణా పూర్ణామృతా కామదాయిన్య స్స్వరజాః కలాః" ఈ ౧౬ ను చంద్రకళలు, వీని లక్షణములు త్రిపురార్ణవ శారదాతిలక తంత్రసార తంత్రరాజ సౌభాగ్యరత్నాకర జ్ఞానార్ణవ కులార్ణవాది చతుష్షష్టితంత్రములయందుఁ జెప్పఁబడి యున్న, సందర్శన = ఆలోకమునకు హేతువు లైన, అభ్యాసయోగములు = యమనియమాద్యష్టాంగయోగములును, ఈ రెండును = ఈ ద్వయమును – అనఁగా అంతర్బహిర్మధ్యలక్ష్యములను యమనియమాద్యష్టాంగయోగములను, నిరంతరంబు = ఎల్లప్పుడును, అలఘుతన్ = అత్యంతముగా, ధ్యానంబు గావించినన్ = మననము చేసెనేని, నాద = ప్రణవనాదము, బిందు = చిద్బిందువు, రుచి = ఆ బిందువునకు భిన్నమైన చిత్కళ, (ఈ మూఁటియొక్క) సాక్షాత్కార = ప్రత్యక్ష మగుటకు, సత్ = ప్రశస్త మగునట్టి, హేతుభూతములై = ముఖ్యకారణస్వరూపము లై, ఒప్పున్ = తనరును.

తా. ఓ ఆంజనేయా! అగ్నిమండల సూర్యమండల చంద్రమండలముల యందలి ముప్పదియెనిమిది కళలను చూచుటకు సాధనము లైన అంతర్లక్ష్యముగల ఖేచరీ షణ్ముఖీ శాంభవీముద్రలను, బహిర్లక్ష్యము గల భూచరీముద్రను, మధ్యలక్ష్యము గల మధ్యముద్రను, యమనియమాద్యష్టాంగయోగములను వాడుకకు తెచ్చుకొనెనేని ఓంకారమందలి దశవిధనాదములను, చిద్బిందువును, ఆ బిందువందలి చిత్కళను అలిరించి దర్శింపవచ్చు నని తాత్పర్యము

ఆ. నాదబిందుకళల నయ మొప్పఁ జూచుచు, నింద్రియముల మనము నిపుణఁ జేసి
సత్క వీశ్వరుండు స్వప్రకాశాత్మచిత్సుఖము గాంచు బరమసులభముగను.

టీ. సత్కవీశ్వరుండు–సత్ = ఉత్తముఁ డైన, కవీశ్వరుండు = బ్రహ్మవిదుఁడు. ఇంద్రియములన్ = జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను, మనమున్ = అంతఃకరణమును, ఇవుడుఁ జేసి = వశింపఁజేసి, నాదబిందుకళలన్ = నాదబిందుకళలను, నయ మొప్పన్ = నేర్పుతోడ, చూచుచున్ = వీక్షించుచు, స్వప్రకాశ = తనంతటనె వెలుఁగుచున్న, ఆత్మ = ప్రత్యగాత్మయొక్క, చిత్సుఖమున్ = నే నని యెఱుఁగుటచేతఁ గలిగిన హర్షమును, పరమసులభమునన్ = మిగుల ననాయాసముగ, కాంచున్ = పొందును

తా. ఆంజనేయా! బ్రహ్మజ్ఞాని జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకు రా జైన మనస్సును వశపఱచుకొని యితరచింత లేక ఓర్పు గలిగి నేర్పుతో నాదబిందుకళలను దర్శించుచుండె నేని నే నే పరబ్రహ్మ మనెడు విజ్ఞానము ప్రబలి నిరతిశయానందమందు మునుఁగు చుండు నని తాత్పర్యము

చ. లలితనినాదబిందుకళలన్ గుఱిఁ జేసిన మానసేంద్రియం
బులు వెలిలోపలం దిరుగఁ బోవక వానిని జూచుచుండ ని
శ్చల మగు దేహ మయ్యెడ విచారముచేఁ బరమాత్మతత్త్వమున్
సులభముగా నెఱుంగఁబడునీ మది చక్కని ద్రోవ యారయన్. ౧౧౩

టీక. లలితనినాదబిందుకళలన్–లలిత = మనోహరము లగు, నినాద = ప్రణవనాదమును, బిందు = చిద్బిందువును, కళలన్ = చిత్కళలను, గుఱిఁ జేసినన్ = లక్ష్యము చేసెనేని, మానసేంద్రియంబులు – మానస = చంచలాత్మక మైన మనస్సును, ఇంద్రియంబులు = జ్ఞానకర్మేంద్రియములును, వెలిలోపలన్ = అంతర్బాహ్యములయందు, తిరుగఁబోవక = సంచరింపక, వానిని = ఆ నాదబిందుకళలనే, చూచుచుండన్ =

వీక్షించు చుండఁగా, అయ్యెడన్ = ఆ సమయమందు, దేహము = శరీరము, నిశ్చలముగున్ = చలింపక యుండున, విచారముచేన్ = మఱియును ఆ నాదబిందుకళలను విడువక నాలుబడిచేత నే, పరమాత్మ తత్త్వమున్ = బ్రహ్మతత్త్వము, సులభముగాన్ = సుకరముగా, ఎఱుంగఁ గాంచుచున్న = కనుఁగొనుచుండును సుమీ. ఆరయన్ = యోచింపఁగా, ఇది = ఇద్ది, చక్కనిత్రోవ = మంచిదారి

తా ఓ ఆంజనేయా! బ్రహ్మనిష్ఠఁ గోరువాఁడు ప్రణవనాదములు విన్నంగావుసు చిత్తకళను తప్పక యెప్పుడును చూచుచుండెనేని దశేంద్రియములతో మనస్సు విషయములందు చెలరేగి లోపలఁ దిరుగక నాదబిందుకళాసందర్శనమందే నిలిచి యుండును, అప్పుడు శరీరము కదలక అలసిపోయి బడలిక మొదలైనవి లేక యుండును, మఱియు ఆ నాదబిందుకళలను విడువక వీక్షించు చున్న పరమును మనస్సు లయించి సచ్చిదానందనిత్యనిర్మలపరబ్రహ్మముగానే యుండును, ఇది యోగమార్గములలో మే లయినమార్గము అని తాత్పర్యము

ఆ. నాదబిందుకళల నాదరింపనియోగి, యింద్రియములు మనసము నిట్లు నట్లు
బరువు లిడఁగ వానిఁ బట్టఁ జాలక కుందు, నిట్టివాఁడు పరము నెట్లు గాంచు.

టీక నాదబిందుకళలన్ = నాదబిందుకళలను, ఆదరింపనియోగి = పాటింపని బ్రహ్మజ్ఞాని, ఇంద్రియములు = దశేంద్రియములును, మనమున్ = ఉల్లమును, ఇట్లునట్లుఁ బరువులిడఁగన్ = అంతరబాహ్యములయందు విచ్చలవిడిగా సంచరింపఁగాను, వానిన్ = ఆ మానసేంద్రియములను, పట్టఁజాలక = నిలుప శక్తిలేక, కుందున్ = దుఃఖించును ఇట్టివాఁడు = మానసేంద్రియములను వశపఱచుకొనఁజాలనివాఁడు, పరమున్ = బ్రహ్మమును, ఎట్లుగాంచున్ = ఎవ్విధముగాఁ జూడఁ గలుగును.

తా. ఓ ఆంజనేయా! నాదబిందుకళాదర్శనము చేయని బ్రహ్మజ్ఞాని జ్ఞానేంద్రియ కర్మేంద్రియ సహిత మయిన మనస్సు శబ్ద స్పర్శ రూప రస గంధాదివిషయ చాంచల్యములతో విచ్చలవిడిగా వెలుపల లోపలఁ జరుగు చుండఁగా దానిని నిలుపఁజాలక బేలుపోయి తానును విషయభోగములందు దిగజాఱిపడును అహం బ్రహ్మాస్మి యను అపరోక్షసాక్షాత్కారజ్ఞానము లేక యుండును అని తాత్పర్యము.

సీ. గాలంబు లేనిచో జాలకాగ్రణిచేత, బాగినజాలముల్ పట్టు వడునె
సరియురి లేనిచో శకునాంతకునిచేతఁ, జొక్కంపుపక్షులు చిక్కువడునె
మోదంబు లేనిచో నాగిమావటీనిచే, గజరాజములు పరికట్టుబడునె
తగుకోల లేనిచో మృగయావినోదిచే, ఘోరమృగంబులు కూలిపడునె
తే రాజితానందతారకరాజయోగ, పావనసమాధి లేనిచో బగనుసుమ్ము
తర్కవేదాంతవాదతత్పరులచేత, నింద్రియమనంబులు వినిగ్రహింపఁబడునె.

టీక జాలకాగ్రణిచేతన్–జాలక = జాలరివాండ్రలోపల, అగ్రణిచేతన్ = మేటియైనవానిచేత, గాలంబు లేనిచోన్ = బడిశము లేనితఱిని, సారీనజాలములు = మత్స్యసమూహములు, ॥ని॥ 'జాలం సమూహ ఆనాయ క్షారకేకపటే గణః' అని విశ్వనిఘంటువు, పట్టువడునె = చిక్కుపడునా? శకునాంతకునిచేతన్ = పులుఁగులవేటకానిచేత, ॥ని॥ 'శకుంతపక్షి శకుని శకుంత శకునద్విజాః' అని అమరము; సరియురి లేనిచోన్ = తగినయుచ్చు లేనియెడను, చొక్కంపుపక్షులు = సాధువైన పులుఁగులు, చిక్కువడునె = తగులుపడునా? మావటీనిచేన్ = మావటివానిచేత, ఓదంబు = గజములఁబట్టుటకు సాధనభూతమైన పల్లము లేనిచోన్ = లేనప్పుడు, ఒగిన్ = లెస్సగా, గజరాజములు = కుంజరోత్తమములు, అరికట్టుబడునె =

అడ్డగింపఁబడునా? మృగయావినోదిచేతన్ = వేఁటతమకము గలవానిచేత, తగుకోలలేనిచోన్ = అర్హమైన బాణము లేనప్పుడు, ఘోరమృగంబులు = క్రూరములైన సింహ శరభ వ్యాఘ్రాదిమృగములు, కొట్టఁబడును = ప్రహరింపఁబడునా? రాజిత = ప్రకాశించుచున్న, ఆనంద=సుఖస్వరూపమైన, తారక = బ్రహ్మ ప్రణవములయొక్క, రాజ = శ్రేష్ఠమైన, యోగ = ఏకీభావముచేత - లేక తారక మనెడి రాజయోగముచేత, పావన = నిర్మలమగు, సమాధి = అనుసంధానము, లేనిచోన్ = లేనిపక్షమందును, పరమ= మిక్కుటములైన, శుష్క = వ్యర్థములైన, తర్క = ఊహలచేత, వేదాంత = ఉపనిషదర్థములను, వాద=వివాదించుటయందు, తత్పరులచేతన్=ఆసక్తి గలవారిచేత - అనఁగా భక్తిపూర్వకమైన బ్రహ్మనిష్ఠ లేక వేదాంతశాస్త్రప్రసంగమందాసక్తి గలవారిచేత, ఇంద్రియమనంబులు = మానసేంద్రియములు, వినిగ్రహింపఁబడును = వశము చేసికొనఁబడునా

తా. ఓ ఆంజనేయా! చేఁపలుపట్టువానికిఁ గాలంబు లేనియెడలఁ జేఁపలగుంపులు పట్టుపడనట్లును, బోయవాని కరిత్రాళ్లు లేనియెడలఁ బక్షులు చిక్కుపడనట్లును, అవసానము లేనియెడల మావటివానికి నేనుఁగులు దొరకనట్లును, వేటాడి జీవించెడివానికి బాణము లేనియెడల ఘోరము లగు మృగంబులు లభ్యంబులు కానట్లును, వ్యర్థము లగు నూహలచే నుపనిషదర్థములను వివాదించుటయం దాసక్త గలవారికి సుఖస్వరూపమై ప్రకాశించు బ్రహ్మప్రణవములయుత్తమయోగ మనియెడి తారకరాజయోగము యొక్క పావన మగు ననుసంధానము లేనియెడల నింద్రియములును మనంబును వశపడ వని తాత్పర్యము. “కరతలయుది యోగము గాలము । తిరిగి కగా మృగముఁ బక్షి గజము ఝషము దశ్రుల పట్టుగు రత్నయి తగ్గజ్ఞులు విజ్ఞానంబుకలిమిఁ గాంతురు పురుషున్” అని చెప్పఁబడియున్నది ఇచ్చట పురుషశబ్దమునకుఁ బరమాత్మ యని యర్థము.

క. జనమంజనంబుఁ గైకొని, ఘనమగు ధనమును నెఱుంగుకైవడిని నిరం
జన తారకయోగముఁ జేకొని పరతత్త్వమును దెలియనె గుఱిపడు నంతన్.

టీక. జనము = ప్రజ, అంజనంబున్ = కాటుకను, కైకొని = గ్రహించి, ఘనమగు=మిక్కుటమైన, ధనమున్ = విత్తమును, ఎఱుంగుకైవడిన్ = తెలిసినట్లు, నిరంజనతారకయోగమున్ — నిరంజన= సాధనాంతరాపేక్ష లేని, తారకయోగమున్ = ప్రణవార్థమైన విజ్ఞాన మనెడు అంజనమును, చేకొని= సాధనముగాఁ జేసికొని ‘శ్లో॥ బోధోన్యసాధనేభ్యోహి సాక్షాన్మోక్షైకసాధనమ్ । పాకస్యవహ్నివజ్జ్ఞానం వినా మోక్షో నసిధ్యతి’ అని యాత్మబోధప్రకాశికయందు నున్నది గాన జ్ఞాన మనెడు కాటుకను ధరించి, అంతన్ = పిమ్మట, పరతత్త్వమున్ = బ్రహ్మస్వరూపమును, తెలియన్ = ఎఱుఁగఁగా, గుఱిపడున్=మనస్సును యింద్రియములును నిశ్చలము లగును.

తా. ఓ హనుమంతుఁడా! లోకులు కాటుకను వేసికొని విశేషద్రవ్య ముండుచో నెఱింగి దానిని గ్రహించికొనునట్లు సాధనాంతరముల నెడఁబాసినను తారకయోగమును చేకొని బ్రహ్మస్వరూపమును దెలిసికొనిలేని మనంబును యింద్రియంబులును గుఱిపడు నని తాత్పర్యము. ‘శ్రుతి॥ భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః । క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే’ అను శ్రుత్యర్థ మనుసంధేయము.

తే. పలలమును జూపి డేగను బట్టురీతి
నమృతమను నాదబిందుకళానుభూతి

సుఖము నొందించి మఱిగించి ‡ చొక్కఁ జేసి
యింద్రియమనంబుల వినిగ్రహింపవచ్చు. ౧౧౭

టీక పలలముఁ = మాంసమును, చూపి = అగపఱచి, దేగఁ = శ్యేనమును, పట్టుగీలన్ = పట్టుకొనుచందాన, అమృతసమ = సుధాతుల్యమైన (లేక, అమృత = మోక్షస్వరూపమైన, సమ = బ్రహ్మప్రణవమండలి) నాదబిందుకళ = అకార ఉకార మకారాత్మకము లైన నాదబిందుకళలయొక్క, అనుభూతిఁ = అనుభవముచేత, సుఖము = ఆనందమును, ఒందించి = పొందించి, మఱిగించి = మచ్చికపఱచి, చొక్కఁజేసి = విస్మృతినొందించి, ఇంద్రియమనంబులన్ = గోలంగ్రియములను మనస్సును, వినిగ్రహింపవచ్చు = లోఁబఱచుకొనవచ్చును.

తా. ఓ ఆంజనేయా! మాంసము నగపఱచి డేగనుఁ బట్టుకొని స్వాధీనము చేసికొనువిధంబుగ మోక్షస్వరూప మయి వెలయు నాదబిందుకళానుభవంబువలన సుఖంబు నొందించి మచ్చికపఱచి చొక్కంజేసి ఇంద్రియమనంబుల లోఁబఱచుకొనవచ్చు నని తాత్పర్యము.

ఆ వేద మట్లు గాన ‡ నాదబిందుకళానుభవముఁ దెలిపె మొదలఁ ‡ బండితులకుఁ
దత్ప్రకార మెల్లఁ ‡ దగ నెఱిఁగించెద, విస్తరించి తెలియ ‡ వినుము వత్స. ౧౧౮

టీక. వత్స = పుత్త్రా, వేదము = ప్రాఁజదువు, మొదలన్ = పూర్వమందే, పండితులకున్ = ఆత్మానాత్మవివేకజ్ఞులకు, నాదబిందుకళానుభవముఁ = నాదబిందుకళానుభూతిని, తెలిపెన్ = తెలియఁబఱచెను, కానన్ = కాఁబట్టి, అట్లు = ఆ వేదోక్తక్రమముగా, తత్ప్రకారము ఎల్లన్ = ఆ నాదబిందుకళావిశేషమంతయు, తగన్ = బాగుగా, విస్తరించి = పెంచి, ఎఱిఁగించెదన్ = తెలియఁజేసెదను, తెలియవినుము = అవగత మగునటుల నాకర్ణింపుము.

తా. ఓపుత్త్రప్రాయుఁ డైన యాంజనేయుఁడా! వేదము పూర్వమందుఁ బండితులకు నాదబిందుకళానుభవంబుం దెలిపెను అట్లగుటంజేసి యానాదబిందుకళానుభవవిధ మంతయు బాగుగ విస్తరించి చెప్పెదను, హృదయమున నవగత మగునట్లు వినుమని తాత్పర్యము

దశవిధనాదముల వివరణము.

తే. సద్గురుప్రోక్తముద్రచే ‡ శ్రవణయుగము
మూసి యాలింపఁ బ్రణవంబు ‡ మ్రోయు మొదలఁ
జిణి యనుచు నంతటను జిణి ‡ చిణి యటంచు
మించి రెండవమాఱు ఘోషించు ననఘ. ౧౧౯

టీక అనఘ = పాపరహితుఁడవగు ఓ యాంజనేయా! సద్గురుప్రోక్తముద్రచేన్ = విహితగురువుచే నుపదేశింపఁబడిన షణ్ముఖీముద్రచేత, శ్రవణయుగమున్ = రెండు చెవులను, మూసి = ఆచ్ఛాదించి, ఆలింపన్ = వినఁగా, మొదలన్ = మొదట, ప్రణవంబు = ఓంకారము, చిణియనుచున్ = చిణియని మ్రోయున్ = శబ్దించును, అంతటన్ = వెనుక, మించి = హెచ్చి, రెండవమాఱు = రెండవతూరి, చిణిచిణియటంచున్ = చిణిచిణియని, ఘోషించున్ = మ్రోయును.

తా పాపరహితుఁ డగు నో యాంజనేయుఁడా! సదాచార్యునిచే నుపదేశింపఁబడిన షణ్ముఖీముద్రచేత చెవులు రెండును మూసికొని యాలకింపఁగాఁ బ్రణవము మొదట చిణి యనుచు మ్రోగును. అంతట నాయోంకారము హెచ్చి రెండవమాఱు చిణిచిణి యని ఘోషించు నని తాత్పర్యము.

శా. కంటి న్నమ్మదిఁ గంటి సద్గురుని నింకన్ మేనిలో పువ్వులా
తింటన్ బూజ లొనర్తు నంచుఁ గరమర్థిన్ దేహి దా మున్నుగా
ఘంటానాదముఁ జేసెనో యనఁగ నోంకారంబు హృద్వీథి యన్
మింటన్ మ్రోయుఁ దదారవంబుగతి యామీఁదన్ విజృంభించుచున్ ౧౨౦

టీక దేహి = కూటస్థుఁడు, సద్గురునిన్ = పరమశివమూర్తిని, కంటిన్ = వీక్షించితిని, నెమ్మదిఁ గంటిన్ = హాయినిబొందితిని, ఇంకన్ = ఇఁక మీఁద, మేనిలో పువ్వులాతింటన్ = శరీరమునందలి మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయము లనెడు షట్పద్మములచేత, పూజ లొనర్తున్ = అర్చింతును, అంచున్ = అని, కరము = మిక్కిలి, అర్థిన్ = ప్రీతితో, తాన్ = తాను, మున్నుగాన్ = ముందుగా, ఘంటానాదముఁ జేసెనో యనఁగన్ = 'శ్లో॥ ఆగమార్థంతు దేవానాం గమ నార్థంతు రాక్షసామ్ । కురు ఘంటారవం తత్ర దేవతాహ్వానలాంఛనమ్' అనెడు న్యాయముచేత అసురీ సంపద యగు కామాదిదుర్గుణము లనెడు రాక్షసులు పోవుటకు దైవీసంపద యగు శాంతాదిసుగుణబృంద మనెడు బృందారకబృందము స్వాగత మగుటకు ప్రత్యగాత్మ ఘంటాధ్వని సల్పెనో యనునట్టు, హృద్వీథి యన్మింటన్ = మనోమార్గ మను గగనమందు – అనఁగా హృదయాకాశమందు, ఓంకారంబు = ప్రణవము, మ్రోయున్ = ఘోషించును, తదారవంబుగతిన్ = ఆ ప్రణవధ్వని యైన ఘంటారావమువలె, ఆమీఁదన్ = పిమ్మట, విజృంభించుచున్ = అతిశయించుచు, ముందరిపద్యముతో నన్వయము.

తా. ఓ ఆంజనేయుఁడా ! ప్రత్యగాత్మ 'పరమశివస్వరూపముం గంటిని, అందువలనంజేసి యపరిమితసౌఖ్యం బుంచితిని, ఇఁక నాదేవుని నాదేహమున నుండెడి మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయము లనియెడి యాఱుపువ్వములచే బూజించెద అని మిక్కిలి ప్రీతితో ముందు తాను ఘంటానాదము చేసెనో' యనునట్లు హృదయమార్గం బనియెడి యాకాశమందు నోంకారము ఘోషించును, ఆ ప్రణవధ్వని యైన ఘంటానాదపువిధము ఇఁక సంతకంతకు విజృంభణ నొంగుచు శంఖవీణానాదంబులగతి భాసిల్లు నని తాత్పర్యము.

స్రగ్ధర. కామక్రోధాద్యసద్రాక్షసగణవిజయాకాంక్షులై ప్రత్యగాత్మ
శ్రీమన్నారాయణుం డంచితవిమలమహాచిత్రశంఖంబు నిండన్
సేమం బారంగఁ బూరించినగతి మొరయుం జిత్కళాదర్శకం బై
భూమానందప్రదం బై స్ఫుటనిగమశిరోభూషణోంకార మంతన్. ౧౨౧

టీక. అంతన్ = అనంతరము, ప్రత్యగాత్మ = కూటస్థబ్రహ్మ మనెడు, శ్రీమన్నారాయణుండు = శ్రీమహావిష్ణువు, కామక్రోధాది = కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యము లనెడి యైన, అసత్ = దుష్టగుణము లనెడు, రాక్షసగణ = నిశాచరసంఘమును, విజయ = గెలువవలయు ననెడు, ఆకాంక్షులై = కోరిక గలవాఁడై, అంచిత = సొంపైన, విమల = నిర్మల మైన, మహాత్ = ఘన మైన, చిత్ర = ఉల్లమనెడు, శంఖంబున్ = పాంచజన్యమును, నిండన్ = స్వరూపజ్ఞానము సంపూర్ణ మగునట్లుగా, సేమం బారంగన్ = శాంతశమదమాదిగుణములను దేవతల కభివృద్ధి గలుగునటుల, పూరించినగతిన్ = ఊఁదినట్లు, చిత్కళాదర్శకంబై – చిత్కళా = జ్ఞానకళలను, దర్శకంబై = చూపునదియై, భూమానందప్రదంబై = అక్షయానందసంధాయక మై, స్ఫుట = విశదము లైన యుపనిషద్వాక్యములకు, భూషణ = ఆభరణ మైన, ఓంకారము = ప్రణవము, మొరయున్ = ఘోషించును.

తా. ఓయి హనుమంతుఁడా! అంత సుపనిషత్తులకారణభూత మైన యోంకారము, కూటస్థ బ్రహ్మ మనియెడి శ్రీమన్నారాయణుఁడు కామక్రోధలోభమోహమదమాత్సర్యము లనియెడి గుప్తరాక్షసులగుంపులం జయింపఁగోరి తక్కుంగల యెల్లవారికి క్షేమము గలుగునట్లు నిర్మలంబును సుందరమును ఘనమునై వెలయు చిత్తం బనియెడి పాంచజన్యనామ కశంఖమును స్వరూపజ్ఞానధగిత మగునట్లుగఁ బూరింప నాశంఖధ్వనివిధంబునం జెలువొందుచు జ్ఞానకళం గఁబలుకుచుము నత్యంయం బగు సానందంబు నొదవుచు మ్రోయు నని తాత్పర్యము

స్రగ్ధరావృత్తలక్షణము. శ్రీమన్మూర్తీ మహారాజ్ఞీశరభనయయా సేవ్యమై సానుమగ్ని(?)క్రాయంబు న్నానుమద్విశ్రమము నమరఁగా స్రగ్ధరావృత్త మయ్యెన్. తా॥ స్రగ్ధరకు మ గ భ న య య గణము లును, ప్రతిపాదమునకు ౮-౧౫ నింట యతియు నుండవలయు ననుట.

మ. నలువొప్పం దగు బ్రహ్మదండి నొకవీణాదండమును జేసి ష
డ్జలజాతంబుల మెట్లుగా నిలిపి పంచప్రాణముల్ తంత్రు లై
యలరంగాఁ గొని ముక్తికామిని సహస్రారంబునం దుండి ని
చ్చలు వాయించె ననంగ నొప్పుఁ బ్రణవస్వానంబు దా నంతటన్. ౧౨౨

టీక. అంతటన్ = పిదప, ముక్తికామిని = ముక్తికాంత, నలువొప్పన్ = సొంపుమీరఁగా, తగు బ్రహ్మదండిన్—తగు = యోగ్య మైన, బ్రహ్మదండిన్ = వెన్నెముకను, ఒకవీణాదండమున్ = ఒకవీణకోయ్యఁగాను, చేసి = ఒనర్చి షడ్జలజాతంబులన్ = మూలాధారాది షట్కమలములను, మెట్లుగా నిలిపి = సరకట్లుగా నుంచి, పంచప్రాణములు = ప్రాణాపానవ్యానోదానసమానములు, తంత్రులై = వీణతంతులై, అలరంగాన్ = ప్రకాశింపఁగా, కొని = అవీణను ధరించి, సహస్రారంబునం దుండి—దహర పుండరీకమందు నివసించి, నిచ్చలు = సార్వకాలము, వాయించె ననఁగన్—వీణను మీటెనో యనునట్లు తాన్ = తానైన, ప్రణవస్వానంబు = ఓంకారధ్వని, ఒప్పున్ = ప్రకాశించును.

తా. ఓ ఆంజనేయుఁడా! అంతట నాప్రణవనాదము ముక్తి యను కాంత సొంపు మీరి బ్రహ్మదండిని నొకవిపంచిగాఁ జేసికొని మూలాధారాదు లగు నాఱుపువ్వుముల నావీణకు సరికట్లుగా నుంచి ప్రాణాపానవ్యానోదానసమానముల నైదుతంత్రులం గావించికొని యావీణను నందుకొని దహరాకాశ మనియెడి కమలంబున వసియించి సర్వకాల మావీణియను మీటు చున్నదో యనునట్లు మ్రోగు నని తా.

తోటకవృత్తము. అమృతాంగనబోధమయాత్మవిశుద్ధమనఃపవనంబులు తాళముగా
నమరం గొని పాడుచు నాడినయ, ట్లమలప్రణవారవ మొంతెఁ దగున్. ౧౨౩

టీక. అంతన్ = పిమ్మట, అమృతాంగన = మోక్షకామిని, బోధమయ = జ్ఞానస్వరూపుఁ డైన, ఆత్మని = క్షేత్రజ్ఞునియొక్క, శుద్ధ = నిర్మలము లైన, మనఃపవనంబులు = మనోమారుతములను, తాళముగాన్ = వాద్యవిశేషముగాను, అమరంగొని = ఒప్పిద మగునట్లుగా ధరించి, పాడుచున్ = గానము చేయుచు, ఆడినయట్లు = నర్తనము చేసినలాగున, అమలప్రణవారవము—అమల = పరిశుద్ధ మైన, ప్రణవ = ఓంకారముయొక్క, ఆరవము = మ్రోత, తగున్ = ఒప్పును.

తా. అంత నానిర్మలప్రణవనాదము, ముక్తికాంత జ్ఞానస్వరూపుఁ డగు క్షేత్రజ్ఞునియొక్క నిర్మల మైన మనస్సనెడి వాయువులను తాళంబుగాఁ జేకొని పాడుచు నర్తనము చేయుచున్నట్లొప్పు నని తా.

తోటకవృత్తలక్షణము. తుదదాఁక సకార చతుష్కముగా । విదితంబుగఁ దోటకవృత్త మగున్
తా॥ తోటకవృత్తమునకు ప్రతిపాదమునందు నాలుగుసగణములును, ౯-దింట యతియు నుండవలయును.

సీ. సలలితేంద్రియగోపికలు పరప్రీతిచేఁ, జనుదెంచి తను బొంది సంతసింప
బ్రహ్మదండిలతావిభాస్వదాధారాది, కపికావళి మహావికాస మొంద
ప్రస్ఫుటీకృతపటుస్ఫటకుండలీంద్రుఁ, డత్యానందకరముగా నాడుచుండఁ
బొందుగా భూరిమధ్యబృందావనమ్మునఁ, బ్రత్యక్షబోధగోపాలమూర్తి
తే. విమలమానసపవనహస్తములచేతఁ, దనసుషుమ్నామురళి లీలఁ దాల్చి మధుర
గాన మొనరించె ననఁగ నోంకార మలఘు, వేణునాదస్వరూపమై వెలయు నంత.

టీక. అంతన్ = అనంతరము, ప్రత్యక్ష = అపరోక్షసాక్షాత్కారమైన, బోధ=విజ్ఞాన మనెడు, గోపాలమూర్తి = శ్రీకృష్ణమూర్తి, భూరిమధ్య = కనుబొమలనడుమ అనెడు, బృందావనమ్మునన్ = బృందారణ్యమందు, సలలితేంద్రియగోపికలు — సలలిత = మనోహరములైన, ఇంద్రియ = చతుర్దశేంద్రియములనెడు, గోపికలు = గొల్లచేడియలు, పరప్రీతిచేతన్ = పురుషకాంక్షచేత - ఇచ్చట ఇంద్రియములకు నాయకుఁడు పరబ్రహ్మమనియు, గోపికలకు నాయకుఁడు శ్రీకృష్ణమూర్తి యనియు గ్రహింపవలెను, చనుదెంచి = వచ్చి, తనున్ = తనను, పొంది = కూడి, సంతసింపన్ = ఆనందింపఁగాను, బ్రహ్మదండి = వెన్నెముక యనెడు, లతా=తీగయందు, విభాస్వత్ = ప్రకాశించుచున్న, ఆధారాదిక= మూలాధారము మొదలయిన చక్రములనెడు, పికావళి = కోకిలపంక్తి, మహావికాసమొందన్ = అధికానందముఁ బొందఁగాను, కుండలీంద్రుఁడు = కుండలినామకశక్తికి నధిష్ఠానమైన జీవసంజ్ఞ గల సర్పరాజు, ప్రస్ఫుటీకృత = తెల్లగా విచ్చఁబడిన, పటు = గట్టిదైన, స్ఫటన్ = పడగచేత, అత్యానందకరముగాన్ = మిక్కిలి హర్షము గునట్లుల, ఆడుచుండన్ = ఊర్ధ్వముఖముగా తాండవ మాడుచుండఁగా, విమల = నిర్మలములైన, మానస = మనస్సనెడు, పవన = ప్రాణవాయువనెడు, హస్తములచేతన్ = చేతులచేత, పొందుగాన్ = పొంకముగా, తన = తనయొక్క, సుషుమ్నా = బ్రహ్మనాడి యనెడు, మురళిన్ = పిల్లనగ్రోవిని, లీలన్ = విలాసముగా, తాల్చి = ధరించి, మధురగానమున్ — మధుర = చెవులకింపైన, గానమున్ = సంగీతమును, ఒనరించె ననఁగన్ = చేసెనా యేమి యనునట్లుల, ఓంకారము = ప్రణవము, అలఘు = ఘనమైన, వేణునాదస్వరూపమై = మురళీనాదాకృతియై, వెలయున్ = సర్వోత్కృష్టమై వర్తిల్లును.

తా. అనంతర మాయోంకారము అపరోక్షసాక్షాత్కారమైన విజ్ఞాన మనెడి శ్రీకృష్ణమూర్తి కనుబొమలనడిమిప్రదేశ మనెడి బృందవనంబున మనోహరము లగు చతుర్దశేంద్రియము లనెడి గొల్లభామలు పురుషకాంక్షచేతం జనుదెంచి తన్నుఁ గలిసి యానందింప, బ్రహ్మదండి యనెడి తీఁగయందు విలసిల్లుచున్న మూలాధారాదికము లగు చక్రము లనియెడి కోకిలలగుంపు పరమానందముం బొంద, కుండలి యను పేరు గల శక్తి కధిష్ఠానమైన జీవసంజ్ఞ గల సర్పరాజు తనపడగను విప్పికొని యత్యానందకరముగ పొంగ మిత్తి తాండవమాడఁగా, నిర్మలము లగు మనోవాయువు లనియెడి కరములచేత బ్రహ్మనాడి యనెడి పిల్లనగ్రోవిని విలాసముమీఱ ధరించి చెవులు సోఁగియ గానము చేసె ననునట్లు గొప్పవేణునాదాకృతి నైయు వెలయు నని తాత్పర్యము.

సుగంధివృత్తము. కూరిరాగరోషవైరికోటి నెల్లఁ ద్రుంపఁగా
గోరి యాత్మరాముఁ డుండ ఘోరసంగరార్థమై

భూరిభేరికారవంబు ఘోరఁ దోల్పినట్లు లోం
కారనాద మొప్పె వింతగాఁ గుమార యంతటన్. ౧౨౪

టీక కుమార = పుత్త్రికా, అంతటన్ = తదనంతరము, ఆత్మారాముఁడు = ప్రత్యగాత్మ యనెడు శ్రీరాముఁడు, క్రూర = చెడుగు లైన, రాగ = కామ మనెడు, రోష = క్రోధ మనెడు, వైరి = శత్రువు లగు రాక్షసులయొక్క, కోటినెల్లన్ = మూఁకనంతయును, త్రుంపఁగాఁగోరి = చంపఁ దలఁచి, ఘోరసంగరార్థమై — ఘోర = భయానక మైన, సంగరార్థమై = యుద్ధముకొఱకు, ఉండఁగన్ = కృతకృత్యుఁడై యుండఁగా, భూరి = గొప్ప దైన, భేరిక = దుందుభియొక్క, ఆరవంబున్ = ధ్వనిని, ఘోరఁదోల్పినట్టులు = మ్రోయించినట్లు, వింతగాన్ = ఆశ్చర్యముగా, ఓంకారనాదము = ప్రణవధ్వని, ఒప్పెన్ = రంజిల్లును.

తా ఓకుమారప్రాయుఁ డైన యాంజనేయుఁడా! అంతట నాయోంకారనాదము ప్రత్యగాత్మ యనెడు శ్రీరాముఁడు చెడుగు లగు కామక్రోధము లనియెడి శత్రువులసమూహంబుల నెల్ల సంహరింపఁ దలంచి ఘోరం బగు యుద్ధంబు సేయుటకొఱకు గడంగి యుండఁగా గొప్పభేరిధ్వానంబును మ్రోయించి నట్లు యాశ్చర్యంబుగా వెలయును.

మ అమరేంద్రాదులఁ గెల్చు సొం పలరు మాయాకాంత నాడింపఁగా
నమలాత్ముం డగు నల్లమాప్రభువరుం డాత్మీయవిద్యామృదం
గము వాయించె ననంగ నొప్పు లలితోంకారస్వనం బంత హృ
ద్య మచింత్యం బతులం బవాచ్య మయి నిత్యానందమై మారుతీ. ౧౨౫

టీక మారుతీ = ఆంజనేయా, అంతట్ = పిమ్మట, అమలాత్ముఁడగు = నిర్మలపరబ్రహ్మమైనట్టి, అల్లమాప్రభువరుండు = ప్రభులింగలీలయందలి యిరువదియైదవగతిలోఁ జెప్పినట్లు నవీను లైన బస వాది లక్షలోమ్మండ్రుగు రయ్యలకు దర్శన మిచ్చిన ఆ వికల్పావికల్పవస్తుస్వరూపుఁ డైన అల్లమాప్రభు రాయఁడు, అమరేంద్రాదులన్ = బ్రహ్మాదిసమస్తదేవతలను, గెల్చు = జయించునట్టి, సొంపు = సంతోషముచేత, అలరు = తేజరిల్లు చున్న, మాయాకాంతన్ = కారణరూప మైన బ్రహ్మచ్ఛాయను ప్రతి ఫలింపఁజేసికొనిన సత్త్వగుణరూపి యగు మాయ యను నటనాంగనను, ఆడింపఁగాన్ = నర్తన మాడిం చుటకు, ఆత్మీయవిద్యామృదంగమున్ — ఆత్మీయ = తనదైన, విద్యా = బ్రహ్మజ్ఞాన మనెడు, మృదంగమున్ = మద్దెలను, వాయించె ననంగన్ = మ్రోయించెనో యనునట్లు, హృద్యము = మనోహర మైనదియు, అచిం త్యంబు = మనస్సున కందనిదియు, అతులంబు = సాటి లేనిదియు నైన, లలితోంకారస్వనంబు — లలిత = రమణీయ మైన, ఓంకారస్వనంబు = ప్రణవనాదము, అవాచ్యమై = పలుకుల కందనిదై, నిత్యానందమై — నిత్య = శాశ్వత మైన ఆనందమై = సుఖస్వరూపమై, ఒప్పెన్ = దీపించును

తా ఓ ఆంజనేయుఁడా! నిర్మలపరబ్రహ్మ మైనట్టి అల్లమాప్రభురాయఁడు దేవేంద్రాదులను జయించెడి యుల్లాసముతోఁ దేజరిల్లు చున్న మాయాకాంత యనియెడి నర్తకిని నర్తన మాడించుటకుఁ దన బ్రహ్మజ్ఞాన మనియెడి మృదంగమును మ్రోయించెనో యనునట్లు మనోహరమును మనస్సున కందనిది యును పలుకుల కందనిదియు సాటి లేనిదియును రమణీయము నైన యోంకారస్వరంబు శాశ్వతసుఖ రూపము నై దీపించును

సీ నిఖిలేంద్రియము లను సీలకంఠంబు ల,త్యంతసంతోషనృత్యములు సలుప
ధర్మామృతార్ద్రీకృతమనోవనిస్థలి,శమముఖసుగుణసస్యము లిగుర్ప

సమరసానందనిర్ఘరముచేఁ దాపదావానలం బెల్లఁ జల్లార్పఁబడఁగ
భ్రూమధ్యదేశనభోవీథిఁ జిత్కళావిద్యుల్లతాతతుల్ వెలయు చుండఁ
తే. దతచిదాకాశమధ్యసంగతసమగ్ర, రాజయోగసమాధిధారాధరంబు
మోదవర్షంబు గురియుచు మ్రోసె ననఁగఁ, బ్రణవదశమనినాద మొప్పారు నంత.

టీక. అంతన్ = పిమ్మట, తత = విశాలమైన, చిదాకాశ = చిదంబరముయొక్క, మధ్య = నడుమ, సంగత = కూడిన, సమగ్ర = అంతట వ్యాపించిన, రాజయోగ = జ్ఞానయోగముయొక్క, సమాధి = నిర్వికల్ప సమాధి యనెడు, ధారాధరంబు = మేఘము, నిఖిలేంద్రియములు — నిఖిల = సమస్తములైన, ఇంద్రియములు = చతుర్దశేంద్రియములు, అను నీలకంఠంబులు = అనెడు నెమళ్లు, అత్యంతసంతోషనృత్యములు = నిర్భరానంద తాండవములను, సలుపన్ = చేయఁగాను, ధర్మ = వర్ణాశ్రమధర్మము లనెడు, అమృత = జలములచేత, ఆర్ద్రీకృత = తడుపఁబడిన, మనః = ఉల్ల మనెడు, అవనీస్థలిన్ = భూప్రదేశమందు, శమముఖసుగుణసస్యములు — శమ = శమము, ముఖ = మొదలైన, సుగుణ = సద్గుణము లనెడు — అనఁగా శమ దమ ఉపరతి తితిక్షా శ్రద్ధా సమాధాన అమానిత్వ అదంభిత్వ గురుశుశ్రూష వేదాంతశ్రవణ మనన నిదిధ్యాసనాది సద్గుణము లనెడు, సస్యములు = పైరులు, ఇగుర్పన్ = అంకురింపఁగా, సమరసానంద = ప్రత్యగ్బ్రహ్మైక్యరూపాఖండానంద మనెడు, నిర్ఘరముచేన్ = ప్రవాహముచేత, తాపదావానలం బెల్లన్ = ఆధ్యాత్మికాది తాపత్రయ మనెడు కార్చిచ్చంతయును, చల్లార్పఁబడఁగన్ = శమింపఁజేయఁబడు చుండఁగాను, భ్రూమధ్యదేశనభోవీథిన్ — భ్రూమధ్యదేశ = శృంగాటక మనెడు, నభోవీథిన్ = గగనమార్గమందు, చిత్కళా = జ్ఞానకళ లనెడు, విద్యుల్లతా = మెఱపుతీఁగలయొక్క, తతులు = గుంపులు, వెలయుచుండన్ = శోభిల్లు చుండఁగాను, మోదవర్షంబు = ఆనందవర్షమును, కురియుచున్ = వర్షించుచు, మ్రోసె ననఁగన్ = ఘోషించెనో యనునట్లు, ప్రణవదశమనినాదము — ప్రణవ = ఓంకారమందలి, దశమ = పదియవదియైన, నినాదము = మేఘ ధ్వని, ఒప్పారన్ = తేజరిల్లును.

తా. అంత నా యోంకారముయొక్క ప్రణవనాదము విశాల మగు చిదంబరమునడుమం గూడినదై యంతట వ్యాపించిన జ్ఞానయోగముయొక్క నిర్వికల్పసమాధి యనెడి మేఘమును సమస్తేంద్రియంబు లనియెడి నెమిళ్ళును నిర్భరానందపరిపూర్ణంబులై తాండవములు సేయ, వర్ణాశ్రమధర్మము లనియెడిజలముచేతఁ దడుపఁబడిన మనం బనియెడి భూప్రదేశమునందు శమము మొదలగు సుగుణము లనియెడి పైరులు అంకురింపఁగా, ప్రత్యగ్బ్రహ్మైక్యరూపాఖండానంద మనెడు ప్రవాహముచేత నాధ్యాత్మికాది తాపత్రయ మనెడి కార్చిచ్చంతయును చల్లార్పఁబడఁగా, భ్రూమధ్యప్రదేశం బనియెడి గగనమార్గమునందు జ్ఞానకళ లనియెడి మెఱపుఁదీఁగలగుంపులు వెలయుచుండ నానందవర్షము గురియుంచుచు ఘోషించెనో యనునట్లు మేఘధ్వని విధంబునం బ్రకాశించును.

వ. ఇట్లు చిణీనాదంబు చిణిచిణీనాదంబు ఘంటానాదంబు శంఖనాదంబు వీణా నాదంబు తాళనాదంబు వేణునాదంబు భేరినాదంబు మృదంగనాదంబు మేఘ నాదం బనంబరఁగు దశవిధప్రణవనాదంబుల శ్రీగురూపదేశపూర్వకంబుగా శ్రుతి యుక్త్యనుభవంబులచేత నెఱుంగవలయు మఱియును. ౧౩౮

టీక. ఇట్లు = ఇవ్విధముగా, చిణినాదంబు = చిణి యనెడు ధ్వని, చిణిచిణీనాదంబు = చిణిచిణి యను రవము, ఘంటానాదంబు = ఘంటారవము, శంఖనాదంబు = శంఖధ్వని, వీణానాదంబు = వీణా

ధ్వని, తాళనాదంబు = తాళశబ్దము, వేణునాదంబు = మురళీరవము, భేరినాదంబు = భేరీధ్వని, మృదంగ నాదంబు = మద్దెలమ్రోత, మేఘనాదంబు = మేఘధ్వని, అనంబరఁగు = అని చెప్పఁబడు చున్న, దశవిధప్రణవనాదంబులన్ = పదితెఱఁగు లైన ఓంకారధ్వనులను, శ్రీగురూపదేశపూర్వకంబుగాన్ = శ్రీసద్గురూపదేశపురస్సరముగా, శ్రుతి = వేదములచేత, యుక్తి = దృష్టాంత దార్ష్టాంతికోపాయముల చేత, అనుభవంబులచేతన్ = స్వానుభవసిద్ధులచేత, ఎఱుంగవలయున్ = తెలియవలయును, మఱియున్ = రెండియు

తా ఇట్లు చిణీనాదము చిణిచిణీనాదము ఘంటానాదము శంఖనాదము వీణానాదము తాళనాదము వేణునాదము భేరీనాదము మృదంగనాదము మేఘనాదము లని చెప్పంబడు పదివిధము లగు ప్రణవనాదంబులను సద్గురూపదేశపురస్సరముగా శ్రుతులచేతను యుక్తులచేతను అనుభవంబులచేతను దెలిసికొనవలయును అదియునుం గాక.

తే. భూరినాదం బకారంబు పుణ్యపురుష
విమలబిందువు లసదుకారము కపీంద్ర
కళ మకార మీమూఁడును గలియఁ గూర్ప
ఘనత రోంకార మగు సదాగతికుమార. ౧౨౯

టీక పుణ్యపురుష = స్వధర్మానుష్ఠానపరుఁడ వగు ఆంజనేయా! భూరినాదంబు—భూరి = ఘన మైన, నాదంబు = ధ్వని, అకారంబు = బ్రహ్మప్రణవమందలి అవిద్యాపాదాత్మక మైన అకారమును, కపీంద్ర = వానరశ్రేష్ఠా, విమలబిందువు—విమల = స్వచ్ఛమైన, బిందువు = మనోగ్రస్థిత వృత్తిరూపక బిందువు, అసత్ = హృదయంగమ మయిన, ఉకారము = బ్రహ్మప్రణవమందలి విద్యాపాదాత్మక మయిన ద్వితీయవర్ణకమును, సదాగతికుమార = వాయుపుత్త్రా, కళ = చిత్కళ, మకారము = బ్రహ్మప్రణవమందలి ఆనందపాదాత్మక మైన తృతీయవర్ణ మగు మకారమును, ఈమూఁడును = నాదబిందుకళాత్మక మయిన యోగవర్ణత్రయమును, కలియఁగూర్పన్ = మిళితము చేయఁగా, ఘనతరోంకార మగున్—ఘనతర = సర్వోత్కృష్ట మైన, ఓంకార మగున్ = చతుర్థపాదాత్మక మైన చతుర్థవర్ణ మగు బ్రహ్మప్రణవ మగును.

తా ఓ పుణ్యపురుషుఁడ వగు యాంజనేయుఁడా! ఘననాదస్వరూప మగు అకారంబును, బిందురూప మగు నుకారంబును, కళారూప మగు మకారమును యీ మూఁడును గలియఁజేర్పం గా బ్రహ్మప్రణవాత్మక మగు నోంకార మగును, అకారము బ్రహ్మప్రణవమందలి యవిద్యాపాదాత్మకము, ఉకారము బ్రహ్మప్రణవమందలి విద్యాపాదాత్మక మయిన ద్వితీయవర్ణము, మకారము బ్రహ్మప్రణవమందలి యానందపాదాత్మక తృతీయవర్ణము.

వనమయూరవృత్తము. గౌరవయకారము నుకారము మకారం
బారయఁగఁ గూడి యొకరీతి యుర మనార్ద్రోం
కార మనఁగా నిఖిలకారణము నై ఘం
టారవమురీతి హృదయాబ్జమున మ్రోయున్. ౧౩౦

టీక. గౌరవయకారమున్—గౌరవ = ఘన మైన, అకారమున్ = పంచభూతములును ప్రపంచమును జేరి బ్రహ్మప్రణవమంధలి అవిద్యాపాదాత్మక మయిన అకార మగును అట్టి అకారమును, ఉకారమును = బ్రహ్మ

ప్రణవార్థమందలి విద్యాపాదాత్మక మైన ఉకారమును, మకారంబు = ఆనందపాదాత్మక మైన మకారమును, ఈ ద్వివిధపాదవర్ణములు స్వర్గాదిదేవతాలోకాంతరము లగుటను, అరయఁగన్ = విచారింపఁగా, కూడి = ఈ త్రివర్ణములు చేరి, ఒకయక్షరము = ఏకవర్ణ మైన, అనాద్యోంకారము—అనాది= ఉత్పత్తి లేని, ఓంకారము = అమృతమయ మైన తుర్యపాదాత్మక మైన ప్రణవము 'శ్రుతి॥ పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాద స్యామృతం దివి । చతుష్పాత్పరమం బ్రహ్మ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' అనఁగాన్ = అనునట్లు, నిఖిలకారణము నై—నిఖిల=ముందుఁ జెప్పఁబడిన పంచభూతాదికములకు, కారణము నై = హేతువై, ఘంటారవమురీతిన్ = ఘంటానాదమువలె, హృదయాబ్జమునన్ = అనాహతచక్రమందు, మ్రోయున్ = శబ్దించును.

తా. ఓ ఆంజనేయా! అకార ఉకార మకారములు చేరి ప్రణవ మాయెను, అది సకలజగదుత్పత్తిస్థితిలయకారణ మై అనాహతచక్రమందు ఘోషించుచుండును, మఱియు ఆ ఓంకారము బ్రహ్మస్వరూపము, రక్షణార్థక మగు అవధాతువువలన నిష్పన్న మైన ఓం శబ్దము తారకాది సంసారార్ణవమునుండి తరింపఁజేయునది యని భావము, భగవత్పాదులమతరీతిని 'దాసోయం సోహ' మ్మను పరమహంసమంత్రమందు తచ్ఛబ్దవాచ్యపరబ్రహ్మము నేనని బోధించు సోహంపదమునందు హల్లులు లోపింపఁగా సంధివశమున ఓం అగును, యత్యాశ్రమము స్వీకరించునెడ నిహాముత్ర సమస్తవేదములను త్యజించుట న్యాయమై యుండ ప్రణవము అపరిత్యాజ్య మను నియమముచే ఓంకార మఖిలవేదసార మని యెఱుంగునది.

విశేషార్థము ప్రణవము త్రయీసారభూతము, ఋగ్యజుస్సామవేదములవలన యథాక్రమముగా మూడువ్యాహృతులు పుట్టెను, పరిశుద్ధము లైనట్టి అవి తప మొనర్పఁగా వానివలన అకార ఉకార మకారములును మూడువర్ణములును నుత్పన్నము లై యొక్కటిగా గూడి ఓంకార మైన దని 'భూరితి ఋగ్వేదాదజాయత భువ ఇతి యజుర్వేదాత్సువ ఇతి సామవేదాత్తాని శుక్రాణ్యభ్యతప్తాని భ్యోభితప్తేభ్యస్త్రయో వర్ణా అజాయన్త అకార ఉకార మకార ఇతి తానేకధా సమభవత్తదేతదోమ్' అని శ్రుతి బోధించుచున్నది, అకారమున ఉకారము పర మైనపుడు ఓంకార మేకాదేశముగా వచ్చెనని తెలియవలయును; త్ర్యక్షరాత్మక మగు ప్రణవమందలి మొదటివర్ణ మగు అకారము విష్ణువాచకము, అంతిమవర్ణ మైన మకారము జీవవాచకము, మధ్యమవర్ణ మగు ఉకారము పరమాత్మకును జీవాత్మకును గల నిత్యసంబంధమును జెప్పును, రక్షణగతి హింసార్థబోధక మగు అవధాతువువలనఁ బుట్టిన అకారమునకు జగత్సృష్టి స్థితి లయకర్త యగు విష్ణువు వాచ్యము, ఈ యర్థమునకు 'అ ఇతి బ్రహ్మ అ ఇతి భగవతో నారాయణస్య ప్రథమాభిధానం - యతో వా ఇమాని భూతాని జాయన్తే - యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశన్తి' ఇట్టి శ్రుతులు ప్రమాణము; మకారవాచ్యుఁడు జీవుఁడు, 'పంచవింశోఽయం పురుషః - పంచవింశ ఆత్మా భవతి' ఇత్యాదిక మిచట ప్రమాణము, హల్లులలో నిరువదైదవయక్షర మగు మకారము జీవుని బోధించుచున్న దని యర్థము; మకారవాచ్య మైన చేతనజాతము సర్వమును జీవున కుపకరణం బయిన యచేతనవ్రాత మంతయుఁ బరమాత్మునికి శేషభూతమే కదా! ఉకారమే వకారార్థకము, 'తదేవాగ్నిస్తద్వాయుస్తత్సూర్యస్తదు చంద్రమాః' అను శ్రుతియందు తదు చంద్రమాః అనుచో ఉకార మవధారణార్థ మైనట్లు ప్రణవమందలి మధ్యమవర్ణ మగు ఉకారము నాయర్థమందు గ్రహింపవచ్చును, ఇంతవర కవయవార్థము వివరింపఁబడియె, ఇఁక విశిష్టార్థము చెప్పఁబడును; అ యనఁగ లుప్తచతుర్థి, అ ఉమ్–అకారవాచ్యుఁ డైన పరమాత్మకొఱకే మకారవాచ్యుఁ డైన జీవుఁడు శేషభూతుఁ డని తాత్పర్యము; అద్వైతులు లుప్తచతుర్థిగా నెంచక అకారమును ప్రథమాంతరముగా దలంచి సామానాధికరణ్యముచే జీవాత్మపరమాత్మలకు నైక్యము సమర్థింతురు, ఉకారము

లక్ష్మీవాచక మనవచ్చును, దీనికి బ్రహ్మసంహితావచనము ప్రమాణము, 'శ్లో॥ అకారే ణోచ్యతే విష్ణు స్సర్వలోకైకనాయకః । ఉకారే ణోచ్యతే లక్ష్మీ ర్మకారో దాసవాచకః' జీవాత్మపరమాత్మలకు లక్ష్మియందుఁ బురుషకారత్వము ప్రసిద్ధమే కదా, ప్రణవార్థమును పరాశరభట్టరులు శ్లోకరూపముగా సంగ్రహించి యున్నారు, ఆ శ్లోకము నిచట వ్రాయ నగు, 'అకారార్థో విష్ణు ర్జగ దుదయరక్షా ప్రలయ కృత్ - మకారార్థో జీవ స్తదుపకరణం వైష్ణవ మిదమ్ । ఉకారో మన్యార్హం నియమయతి సమ్బన్ధమన యోః - త్రయీ సారస్త్ర్యాత్మా ప్రణవ ఇమ మర్థం సమదిశత్'

వనమయూరలక్షణము. శ్రీశరథరారిహారజిష్ణునుతపుణ్యా।శ్లోకభజనన్న గగలుణ్ గ్రహిణసఖ్యన్ । సోకువిరమంబు గనుచు న్వనమయూరా।ఖ్యాక మను వృత్త మిల నంద మగుచుండున్ తా॥ వన మయూరవృత్తమునకు భ న జ స గగ ములును, ౯ దింట యతియును నుండవలయు ననుట.

క. హృదయసదనమునఁ బొదలెడి, సదమలనాదామృతంబు ◌ చవిగొన కున్నన్
మది గదలుచుఁ గుదురదు గలు,గదు మొదలిటిపదము ముదము ◌ గదుర దుదయమై.

టీక హృదయసదనమునన్ = అనాహతచక్రమందు, పొదలెడి = ప్రబలునట్టి, సత్ = శ్రేష్ఠమైన, అమల = నిర్మలమైన, నాద = ఓంకారనాద మనెడు, అమృతంబు = సుధయొక్క, చవిగొనకున్నన్ = రుచిఁజూడక పోయెనేని, మది = మనస్సు, కదలుచున్ = కంపించుచు, కుదురదు = నిలుకడ నొందదు, మొదలిటిపదము = మోక్షము, కలుగదు = లభింపదు, ముదము = బ్రహ్మానందము, ఉదయమై = ఆవి ర్భవమై, కుదురదు = ఘటింపదు

తా హృదయసదనమునఁ బ్రబలునట్టియు శ్రేష్ఠమును నిర్మలము నయినదియు నగు నోంకారనాద మనియెడి యమృతమూయొక్క రుచిఁ జూడకపోయె నని మనస్సు కంపమునదలక కుదురుపడదు, మోక్షం బును లభింపదు, బ్రహ్మానందమును వుదయింప దని తాత్పర్యము

క. నాదం బంచితపరమా,హ్లాదము చిత్తప్రసాద ◌ మపగతగురుసం
వాదము గతభేదం బని, వేదంబులు పలుకు వేద ◌ వేదాంతజ్ఞా ౧౩౨

టీక వేదవేదాంతజ్ఞా—వేద = త్రివర్గసంపదల నిచ్చు శ్రుతులను, వేదాంత = బ్రహ్మజ్ఞానానంద ముల నొసఁగు నుపనిషత్తులను, జ్ఞా = తెలిసిన అంజనేయా, వేదంబులు = బ్రాహ్మణులు, నాదంబు = బ్రహ్మప్రణవనాదము, అంచితపరమాహ్లాదము—అంచిత = పూజ్య మయిన, పరమ = నిరతిశయ మయిన, ఆహ్లాదము = ఆనందము నొసఁగునదియు, చిత్తప్రసాదము—చిత్త = అంతఃకరణమును, ప్రసాదము = నిర్మ లము చేయునట్టిదియు, అపగతగురుసంవాదము—అపగత = ఉడిగింపఁబడిన, గురు = విస్తార మయిన, సంవాదము = వివాదము గలదియు, గతభేదంబు = తొలఁగింపఁబడిన ద్వైతభ్రమ గలదియు, అని = ఇట్లని, పలుకున్ = వక్కాణించును.

తా వేదములను వేదాంతములను నెఱింగిన యాంజనేయా! బ్రహ్మప్రణవనాదము పూజ్య మయి నిరతిశయ మగు నాహ్లాదము నొసంగునది యనియు, అంతఃకరణమును నిర్మలము సేయునట్టిది యనియు, విస్తారము లగు వివాదంబుల నుడిగించునది యనియు, ద్వైతభ్రమను తొలంగించునది యనియు వేదంబులు జెప్పుచున్న వని తాత్పర్యము

తే. ప్రణవనాదరసామృత ◌ పానరతుని, విమలనయనము లనిమిష ◌ త్వము వహించు
మనసు దేవాలయంబున ◌ మనికి మరిగి, సలలితకళావిభూతిచే ◌ వెలయు చుండు.

టీక. ప్రణవనాద = ప్రణవధ్వనియొక్క, రస = ఆనందరసమనెడు, అమృతపాన = సుధాపానమందు, రతుని = ఆసక్తి గలవానియొక్క, విమలనయనములు = నిర్మలనేత్రములు, అనిమిషత్వముల్ = రెప్పపాటు లేకపోవుటను - అనఁగా దేవత్వమును, వహింపన్ = పూనఁగా, మనసు = మనస్సు, దేవాలయంబునన్ = దేవతాపురమునందు, వనికివటిగి = వసింప పనుపడి - అనఁగా 'అష్టచక్రా నవద్వారా దేవానాం పూరయోధ్యా వసేత్' అను శ్రుతిప్రమాణముచేత చిదాకాశమంగు నివసించి, సలలితకళావిభూతి చేన్ - సలలిత = మంజుల మయిన, కళావిభూతిచేన్ = చిత్కళాసంపదచేత, వెలయుచుండున్ = ప్రకాశించు చుండును

తా. అమృతము పానము చేసినవారికి నిమేషము లగు నేత్రములును, దేవతలు వసియించుచోటు నివాసంబును, లలిత మగు కళానుభవంబును గలిగి యుండును, అట్లు బ్రహ్మప్రణవనాదమువలనం గలిగిన యానందరస మనియెడి యమృతము పానము చేయుచుండె యాసక్తి కలిగి యున్న వానికి నిర్మలము లగు నేత్రములు రెప్పపాటు లేక యుండ మనస్సు దేవతాపురం బగు శరీరమంగు నివసింపం బనుపడి మనోహర మైన చిత్కళాసంపదచేతం బ్రకాశించు చుండును

సీ. అనిమిషుం డజరుండు నమృతుండు పటుశక్తి,ధరుఁడు సిద్ధుండు విద్యాధరుండు
యోగీశ్వరుండు సాధ్యుండింద్రుఁడును శుచి,సమవర్తియును బుణ్యజనుఁడుభువన
పతియునువరసదాగతియును సుకృతార్థుఁ, డభవుఁ డనంతుండు నఖలమిత్రుఁ
డతికళాశాలి మహాబుధుండు కవీశ్వ,రుండును సుమనోగురుండు ఘనుఁడు
ఆ. హంసవాహనుండు నచ్యుతుండు శివుండు, పరమపురుషుఁడగుచుఁ బరఁగుచుండుఁ
బవనతనయ వినుము ప్రణవనాదామృత,పానతృప్తుఁ డైన పావనుండ. ౧౩౪

టీక. పవనతనయ = వాయుపుత్రా! వినుము = ఆకర్ణింపుము, ప్రణవనాద = ఓంకారరవ మనెడు, అమృతపాన = సుధాపానముచేత, తృప్తుఁ డైన = తనివి నొందినట్టి, పావనుండు = నిర్మలుఁడు - అనఁగా బ్రహ్మనిష్ఠుఁడు, అనిమిషుండు = రెప్పపాటు లేనివాఁడు, 'శ్లో॥ అంతర్లక్ష్యం బహిర్దృష్టిః నిమేషోన్మేషవర్జితా। ఏషా సా శాంభవీముద్రా సర్వతంత్రేషు గోపితా' అనెడు న్యాయముచేత అనిమిషుఁ డని భావము - దేవత యని యర్థాంతరము అజరుండు = కాలత్రయమందు అఖండాకారమై యుండుటచేత వృద్ధత్వము లేనివాఁడు - నిర్జరుఁ డని యర్థాం, అమృతుండు = మరణము లేనివాఁడు - అమరుఁ డని యర్థాం, పటుశక్తిధరుఁడు - పటు = ప్రసిద్ధము లైన, శక్తి = సర్వజ్ఞత్వాదిశక్తులను, ధరుఁడు = దాల్చినవాఁడు - కుమారస్వామి యని యర్థాం, సిద్ధుండు = ఆత్మజ్ఞానసిద్ధి గలవాఁడు - సిద్ధుఁ డను దేవయోనివిశేషుఁ డని యర్థాం, విద్యాధరుండు = బ్రహ్మవిద్యను ధరించినవాఁడు - విద్యాధరుఁ డను దేవయోనివిశేషుఁ డని యర్థాం, యోగీశ్వరుండు = జీవబ్రహ్మైక్యజ్ఞానము గలవారిలో నుత్తముఁడు - బదరికారణ్యవాసి యగు నరస్వరూపుఁ డైన నారాయణుఁ డని యర్థాం, సాధ్యుండు = శ్రవణాదిసాధనములచేత బ్రహ్మజ్ఞానమును సాధించినవాఁడు - సాధ్యుఁ డను దేవయోనివిశేషుఁ డని యర్థాం, ఇంద్రుఁడును = మోక్షరూప మగు పరమైశ్వర్యయుక్తుఁడు - దేవేంద్రుఁ డని యర్థాం, శుచి = ఆణవాదిత్రిమలరహితుఁడు - అగ్నిహోత్రుఁ డని యర్థాం, సమవర్తియును = శత్రు మిత్ర భేద మోద శీతోష్ణాది ద్వంద్వములయందు సమానప్రవర్తన గలవాఁడు - యముఁ డని యర్థాం, పుణ్యజనుఁడు = స్వధర్మానుష్ఠానపరుఁడు - నైరృతి యని యర్థాం, భువనపతియును - భువన = చతుర్దశలోకములకు, పతియును = నియామకుఁడును - వరుణుఁ డని యర్థాం, వరసదాగతియును - వర =

ఉత్తము లయిన సత్పురుషులకు, సదా=ఎల్లప్పుడును, గతియును= ఆధారుఁ డైనవాఁడును - వాయుదేవుఁ డని యర్థాం, సుకృతార్థుఁడు—సుకృత=పుణ్యకర్మముచేత, అర్థుఁడు=ప్రయోజనముగాఁగలవాఁడు- లెస్సగాఁ బదిలపఱచఁబడిన నవనిధులు గల కుబేరుఁ డని యర్థాం, అభవుఁడు=జన్మరహితుఁడు- రుద్రుఁ డని యర్థాం, అనంతుఁడు=దేశ కాల వస్తు పరిచ్ఛేదశూన్యుఁడు-అనంతుఁ డను సర్పరాజని యర్థాం, అఖిలమిత్రుఁడు = సకలలోకబాంధవుఁడు - సూర్యుఁ డని యర్థాం, అతికలాశాలి = బ్రహ్మప్రణవమండలి బగిదియాంశభాగ మయిన అవికల్పవికల్పనామకకళాతీతుఁడై ప్రకాశించువాఁడు - చంద్రుఁ డని యర్థాం, మహాబుధుండు = సర్వము నెఱిఁగిన యుత్తముఁడు - బుధుఁ డని యర్థాం, కవీశ్వరుండు=పండితుఁడు-శుక్రుఁ డని యర్థాం, సుమనోగురుండు—సుమనః = విద్వాంసులకు, గురుండు = జ్ఞానోపదేష్ట - దేవగురు వైన బృహస్పతి యని యర్థాం, ఘనుఁడు = సర్వోత్కృష్టుఁడు - మేఘుఁ డని యర్థాం, హంసవాహనుండు= హృదయకమలసంచారి యై శివశక్తిబీజము లగు హకార సకారమధ్యగల బిందుకోశములతోఁ గూడి జీవేశ్వర జగద్భ్రాంతు లనెడు నిస్సారజలమును పరిత్యజించి సారతర మైన బ్రహ్మజ్ఞాన మనెడు క్షీరమును వేఱుపాటు చేయఁదగినట్టి హంస నధిష్ఠించువాఁడు - బ్రహ్మ యని యర్థాం, అచ్యుతుండు = సంసారకూపమునందుఁ గూలనివాఁడు - విష్ణు వని యర్థాం, శివుండు = 'శివ కాంతౌ' అను ధాతువువలన సూర్య చంద్రాగ్నులకాంతుల మీఱి వెలుఁగువాఁడు, అట్టివాఁ డగుటవలన శివుఁడు - ఈశ్వరుఁ డని యర్థాం, పరమపురుషుఁడు = క్షరాక్షరాతీతుఁడు-విరాట్పురుషుఁ డని యర్థాం, అగుచున్ = ఐనవాఁడై, పరఁగుచుండున్ = ప్రకాశించు చుండును

ఓ వాయుపుత్త్రుఁ డగు యాంజనేయుఁడా ! వినుము. ఓంకారనాద మనియెడి యమృతమును పానము చేసి తృప్తిఁ జెందిన పావనుఁడు, (దేవతాపక్షమున) ఆప్పపాటు లేక జర లేనివాఁడును, మరణము నొందనివాఁడును, కుమారస్వామియును, సిద్ధుఁడును, విద్యాధరుండును, యోగీంద్రుఁడును, సాధ్యుండును, ఇంద్రుఁడును, అగ్నియును, యముఁడును, నైఋతియును, వరుణుఁడును, వాయువును, కుబేరుఁడును, రుద్రుఁడును, ఆదిశేషుఁడును, సూర్యుఁడును, చంద్రుఁడును, బుధుఁడును, శుక్రుఁడును, గురువును, మేఘుఁడును, బ్రహ్మయును, విష్ణువును, శివుండును, విరాట్పురుషుండును తానె యై ప్రకాశించు చుండును (బ్రహ్మజ్ఞానిపక్షమున) శాంభవీముద్ర ధరియించుటచే ఆప్పపాటు లేనివాఁడును, అఖండాకారమై యుండుటచేత వృద్ధత్వము లేనివాఁడును, మరణము లేనివాఁడును, సమర్థము లగు సర్వజ్ఞత్వాదిశక్తులు గలవాఁడును, ఆత్మజ్ఞానసిద్ధి గలవాఁడును, బ్రహ్మవిద్యను ధరించినవాఁడును, జీవబ్రహ్మైక్యజ్ఞానము గలవాఁడును, శ్రవణాదిసాధనములచేత బ్రహ్మజ్ఞానము సాధించినవాఁడును, మోక్షరూపమందు పరమైశ్వర్యము గలవాఁడును, అణవాది త్రిమలరహితుఁడును, శత్రుమిత్రభేదనోద శీతోష్ణాదిద్వంద్వములయందు సమానప్రవర్తన గలవాఁడును, స్వధర్మానుష్ఠానపరుఁడును, చతుర్దశలోకములకు నియామకుండును, సత్పురుషుల కాధారభూతుఁడును, పుణ్యకర్మముచే ప్రయోజనముగాఁ జేయువాఁడును, జన్మరహితుఁడును, దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యుఁడును, సకలజనబాంధవుండును, బ్రహ్మప్రణవమండలి పదియాంశభాగ మయిన అవికల్ప వికల్పనామక కళాతీతుఁడై ప్రకాశించువాఁడును, సర్వము నెఱింగిన యుత్తముఁడును, కవీశ్వరుఁడును, విద్వాంసులకు జ్ఞానోపదేష్టయును, సర్వోత్కృష్టుఁడును, హృదయకమలసంచారి యై శివశక్తిబీజము లగు హకార సకారములకు మధ్యగతబిందుకోశములతోఁ గూడి జీవేశ్వరజగద్భ్రాంతు లనియెడి నిస్సారజలమును బరిత్యజించి సారతర మయిన బ్రహ్మజ్ఞాన మని యెడి క్షీరమును వేఱుపాటు జేయఁదగినట్టి హంస నధిష్ఠించిన బ్రహ్మస్వరూపుఁడును, సంసారకూపమునఁ

గాలనివాఁడును, చంద్రసూర్యాగ్నుల కాంతి నతిక్రమించి వెలుఁగువాఁడును, తురాతురాతీతుఁడును అయినవాఁడై ప్రకాశించు చుండు నని తాత్పర్యము.

చి త్క ళా సా క్షా త్కా ర ము.

ఆ. ఆంజనేయ యింక నంతర్బహిర్మధ్య,దృగ్విలోకితప్రదీప్తచిత్క-
ళావిభూతి యెల్ల భావించి చెప్పెద, నాదరించి చూడు మాత్మయందు. ౧౩౫

టీక ఆంజనేయ = అంజనాపుత్త్రుఁడా, ఇంకన్ = ఇఁకను, అంతః = లోపలికిని, బహిః = వెలుపలికిని, మధ్య = నడుమనుండెడు, దృక్ = జ్ఞానదృష్టిచేత, విలోకిత = చూడఁబడిన, ప్రదీప్త = ప్రకాశించు చున్న, చిత్కళావిభూతియెల్లన్ = చిన్మయకళాసంపత్తి నంతయును, భావించి=యోచించి, చెప్పెదన్ = వాక్రుచ్చెదను, ఆత్మయందున్ = ప్రజ్ఞయందు, ఆదరించి = బహూకరించి, చూడుము= కనుఁగొనుము.

తా. ఓ అంజనాపుత్త్రుఁ డగు హనుమంతుఁడా! ఇఁక లోపలికిని వెలుపలికిని నడుమ నుండు జ్ఞాన దృష్టిచేఁ జూడఁబడినదై వెలుఁగు చున్న చిన్మయకళాసంపత్తి నంతయును చక్కఁగా యోచించి చెప్పెద, నీమనంబున దాని బహూకరించి యుంచి చూడు మని తాత్పర్యము.

ఆ. కనులురెండు గురునియనుమతి గొని మూసి, బొమలనడిమి ద్విదళకమలమునను
విమలదృష్టి నిలిపి శమలలితాత్ముఁడై, చూడవలయు లక్ష్యశోభనముల. ౧౩౬

టీక కనులురెండున్ = నేత్రద్వయమును, గురునియనుమతిన్ = దేశికునియాజ్ఞను, గొని=పొంది, మూసి = ముకుళించి, బొమలనడిమి = భ్రూమధ్యమం దుండెడి, ద్విదళకమలమునన్ = ఆజ్ఞాచక్రమందు, విమలదృష్టినిలిపి = నిర్మల మైన చూపు నిలిపి, శమలలితాత్ముఁడై—శమ = అంతరింద్రియనిగ్రహముచేత, లలిత = మంజుల మైన, ఆత్ముఁడై = ఉల్లము గలవాఁడై, లక్ష్యశోభనములన్ — లక్ష్య = దృశ్యములు యొక్క — అనఁగా చిత్కళలయొక్క, శోభనములన్ = ప్రకాశములను, చూడవలయున్ = వీక్షింప వలయును.

తా. గురునియాజ్ఞవలన కనులు రెండును మూసికొని భ్రూమధ్యమం దుండెడి రెండుదళములు గలిగిన యాజ్ఞాచక్రమందు విమల మయిన చూపు నిలిపి అంతరింద్రియనిగ్రహంబు నంజేసి లలిత మగు నుల్లము గలవాఁడై దృశ్యము లయిన చిత్కళలయొక్క ప్రకాశంబులను వీక్షింపవలయు నని తాత్పర్యము.

క. మునుపుగ హృదయాకాశము, గనుపట్టుం జూపు లగుచు గన్నుల వెంటం
జనునది మన మగుఁ గావునఁ, గనఁ దగు నాకాశపంచకంబు బాగుఁ దగన్. ౧౩౭

టీక. మునుపుగన్ ముందుగా, హృదయాకాశము = చిత్తాకాశము, కనుపట్టున్=గోచరించును; చూపు లగుచున్ = దృష్టులై, కన్నుల వెంటన్ = చక్షుర్ద్వారముల వెంబడిని, చనునది = పోవునట్టిది, మన మగున్ = మనస్సే యగును, కావునన్ = కాఁబట్టి, అందున్=ఆ మనస్సునందు, తగన్=బాగుగా, ఆకాశపంచకంబు = ఇఁకఁ జెప్పఁబోయెడు పంచాకాశములను, కనఁదగున్ = అవలోకింపనగును, ‘శ్లో॥ ఏ నేతత్ క్రూణోతీదం జిఘ్రతివ్యాకరోతిచ। స్వాద్వస్వాదు విజానాతి తత్ప్రజ్ఞాన మితీరితమ్’ అని మహావాక్యరత్నావళియందును, ‘క. కనుఁ గన్నై వినుఁ జెవియై। చవి గొను జిహ్వా యయి వాసనగొను నాసికయై। తనువై స్పర్శము చేయును। మనమన్యా బుద్ధి యాత్మయందున నిలుచున్’ అని భారతమునందును జెప్పియుండుటవలన మనస్సే యింద్రియగోళములయందు నిలిచి చూచుట, వినుట,

ఆక్రమించుట లోనగుకార్యములు చేయుచున్నది, కావున ఆ మనస్సునందే పంచాకాశములను కన గలయుం జనుట

తా (అట్లు వీక్షించునప్పుడు) ముందుగా చిత్తాకాశము గోచరించును, వెనుక చూపులై కన్నుల వెంటఁ బోవునది మనస్సే యగును గాన నా మనస్సునం దాకాశపంచకంబు నవలోకింపఁ జనును

వ. ఇట్లు తనలోచనంబులకుఁ గనుచూపుమేర గోచరం బైన హృదయాకాశంబు నందుఁ గేవలనిరాకారం బైన గుణరహితాకాశంబు నిబిడనిష్ఠురనీరంధ్ర గాఢాంధకారం బైన పరాకాశంబు ప్రళయకాలప్రజ్వలజ్జ్వాలాభీలదావానలాకారం బైన మహాకాశంబు వివిధవిచిత్రవితతాపరిమితద్యుతిభరితం బైన తత్త్వాకాశంబు ప్రచండమార్తాండమండలశతకోటిప్రభాభాసురం బైన సూర్యాకాశంబును పంచాకాశంబుల నవలోకింపవలయు మఱియును. ౧౩౮

టీక ఇట్లు=ఇవ్విధముగా, కనుచూపుమేరన్ = కంటి కగపడునంతదూరములో, తనలోచనంబులకున్ = తనకన్నులకు, గోచరంబైన = కానఁబడుచున్న, హృదయాకాశంబునందున్=చిత్తాకాశమందు, కేవలనిరాకారంబైన = రూపము లేకుండుటయే ప్రధానముగాఁగల, గుణరహితాకాశంబు = శబ్దగుణరహితమయినయాకాశము, నిబిడ = దట్టమైన, నిష్ఠుర= కఠినమైన, నీరంధ్ర = ఎడములేని, గాఢాంధకారంబైన= కటికచీఁకటియే యాకృతిగాఁ గల, పరాకాశంబును = పరాకాశమును, ప్రళయకాల = కల్పాంతమందు, ప్రజ్వలత్ = మిక్కిలి మండు చున్న, జ్వాలా = మంటలచేత, ఆభీల = భయంకర మైన, దావానలాకారంబు = కార్చిచ్చువలె నుండెడిది, ఐన మహాకాశంబు = ఐనట్టి మహాకాశమును, వివిధ = నానావిధము లయిన, విచిత్ర = ఆశ్చర్యకరము లయిన, వితత = వ్యాప్తము లయిన, అపరిమిత = అసంఖ్యేయము లయిన, ద్యుతి = కాంతులచేత, భరిత = నిండింపఁబడినది, ఐనతత్త్వాకాశంబు = ఐనట్టి తత్త్వాకాశము, ప్రచండ = మిక్కిలి వేడిమి గల, శతకోటిమార్తాండమండల = నూరుకోట్ల సూర్యబింబములయొక్క, ప్రభా = కాంతులచేత, భాసురంబు = తేజరిల్లు చున్నట్టిది, ఐన సూర్యాకాశంబు= ఐనట్టి సూర్యాకాశము, అను పంచాకాశంబులన్ = అనెడు ఆకాశపంచకమును, అవలోకింపవలయున్ = చూడవలయును, మఱియున్ = పిమ్మట

తా ఇవ్విధముగాఁ దనకంటి కగపడునంతదూరములోఁ దనలోచనంబులకుఁ గోచరం బగుచున్న చిత్తాకాశమందు కేవలాకారశూన్య మైన గుణరహితాకాశమును, దట్ట మైనదియుఁ గఠినమును యెడము లేనిదియు నైన కటికచీఁకటియే యాకారముగాఁ గల పరాకాశంబును, కల్పాంతకాలంబున జ్వలించు చున్న మంటలచే నతిభయంకరం బగు కార్చిచ్చువలె నుండెడి మహాకాశమును, నానావిధము లగు నాశ్చర్యములఁ గలిగించుచు నపరిమితకాంతులచే నిండియుండు తత్త్వాకాశంబును, మిగుల వేడిమి గల నూఱుకోట్ల సూర్యబింబముల కాంతులచేఁ దేజరిల్లు చున్న సూర్యాకాశంబును అను నీ యైదాకాశములను నవలోకింప వలయును అదియునుం గాక

ఆ. ఆంజనేయ విను తదాకాశపంచక,మధ్యమమున వెలుఁగు ౯ మహితకళల
చందమెల్ల నీకు ౯ ముందుగా వినిపింతు, సందియములు మాని ౯ పొందువాని.

టీక ఆంజనేయ = అంజనపుత్రా, వినుము = ఆలకింపుము, తదాకాశపంచకమధ్యమమునన్ = తదాకాశపంచక = గుణరహితాకాశ పరాకాశ మహాకాశ తత్త్వాకాశ సూర్యాకాశము అను పంచాకాశ

ములయొక్క, మధ్యమమునన్ = అంతరాళమందు, వెలుఁగు మహితకళలచంద మెల్లన్ — వెలుఁగు = తేజరిల్లెడు, మహిత = ఒప్పిదమ్మైన, కళలచంద మెల్లన్ = చిత్కళలవిధ మంతయు, నీవున్ = నీవు, ముందుగాన్ = ప్రథమమందు, వినిపింతున్ = తెలియఁబఱతును, వానిన్ = ఆ చిత్కళలను, సందియములు మాని = సంశయములను విడనాడి, పొందుము = చెందుము.

తా. ఓ ఆంజనేయుఁడా! వినుము, ఆ యాకాశపంచకమునడుమ దేజరిల్లు మిక్కిలి యొప్పిదము లగు చిత్కళలవిధ మంతయు నీవు ముందుగాఁ దెలియఁబఱతును, సందియములను మాని యాచిత్కళలను బొందుము

సీ. మందాకినీసుధాసందోహదుగ్ధాబ్ధి, సౌందర్యలహరులచందమునను
మందారమల్లికాకుందారవిందోరు, చందనపుష్పరుచ్చయముపగిది
నిందిరాసుందరీమందిరాంతర్మ, రందనిర్ఝరరుచిప్రతతిరీతి
నిందుభృన్నందిసంక్రందనకరిమృగేం, ద్రఫణీంద్రదీప్తిబృందములభాతి
తే. హారనీహారడిండీరశారదాభ్ర, హీరకర్పూరతారకాకారకాంతి
కరణి నాకాశపంచకాంతరమునందు, మండితము లగుఁ జిత్కళామండలములు.

టీక. చిత్కళామండలములు = చిన్మయకళాసమూహములు, మందాకినీ = ఆకాశగంగయొక్క, సుధాసందోహ = అమృతరాశియొక్క, దుగ్ధాబ్ధి = పాలకడలియొక్క, సౌందర్య = అందమైన, లహరులచందమునన్ = ప్రవాహములపోలికను, మందార = కల్పవృక్షము, మల్లికా = మల్లెచెట్టు, కుంద = మొల్లచెట్టు, అరవింద = తెల్లదామర, ఉరుచందన = శ్రీచందనవృక్షము, (వీనియొక్క) పుష్ప = పూవులయొక్క, రుచ్చయము పగిదిన్ = కాంతిపుంజమువలెను, ఇందిరాసుందరీమందిర = లక్ష్మీదేవికి నివాసస్థానమైన కమలముయొక్క, అంతః = లోపలనున్న, మకరంద = పుష్పరసముయొక్క, నిర్ఝర = ప్రవాహముయొక్క, రుచిప్రతతిరీతిన్ = కాంతిసమూహమువలెను, ఇందుభృత్ = శివుండు, నంది = వృషభము, సంక్రందనకరి = ఐరావతము, మృగేంద్ర = సింహము, ఫణీంద్ర = ఆదిశేషుఁడు, (వీనియొక్క) దీప్తిబృందములభాతిన్ = తేజోజాలములవలెను, హార = ముత్యాలహారము, నీహార = మంచు, డిండీర = నురుగు, శారదాభ్ర = శరత్కాలమేఘము, హీర = వజ్రము, కర్పూర = కప్పురము, తారకా = నక్షత్రము, (వీనియొక్క) ఆకార = రూపములయొక్క, కాంతికరణిన్ = దీప్తులవలెను, ఆకాశపంచకాంతరమునందున్ = గుణరహితాది పంచాకాశమధ్యమందు, మండితములగున్ = ప్రకాశించుచుండును.

తా. చిత్కళాసమూహములు, ఆకాశగంగ అమృతరాశి పాలసముద్రములయొక్క సుందరములయిన ప్రవాహములపోలికను, మందారవృక్షము మల్లెతీఁగె మొల్లతీఁగె తెల్లదామర శ్రీచందనవృక్షము వీనియొక్క కుసుమకాంతులవలెను, లక్ష్మీదేవికి నివాసస్థానమగు కమలములోపల నున్న మకరందరసప్రవాహముయొక్క కాంతిపుంజముభాతిని, చంద్రమౌళి యగు శివుఁడు నంది యైరావతము సింగము ఆదిశేషుఁడు అను నీ వస్తువులయొక్క కాంతిసమూహముల రీతిని, ముత్యాలహారము మంచు నురుగు శరత్కాలమేఘము వజ్రము కప్పురము నక్షత్రము వీనియొక్క రూపముల కాంతులవలె నాకాశపంచకముయొక్క మధ్యమందుఁ బ్రకాశించుచుండును.

సీ. సద్యస్తమోనాశఖద్యోతమానస, ద్విద్యుల్లతాప్రభావీథిపగిది
హృద్యక్షపావేద్యఖద్యోతసందోహ, విద్యమానద్యుతివితతికరణి

ఘోరాంధకారకృద్భూరినీలసవారి, వారివాహచ్ఛవివ్రజమురీతి
నీలవైడూర్యప్రవాళాబ్జరాగము, క్తాఫలగోమేధికములభాతి
తే. శుద్ధమాణిక్యమరకతశోణరత్న, తప్తతపనీయరుచులచందమున హృదయ
మండితాకాశపంచకమధ్యమమునఁ, గానఁబడుచుండుఁ జిన్మయకళలు వత్స.

టీక వత్స = ఆంజనేయా, చిన్మయకళలు = చిత్కళలు, హృదయ = మనస్సునందు, మండిత = తేజరిల్లుచున్న, ఆకాశపంచక = పంచాకాశములయొక్క, మధ్యమునన్ = నడుమను, సద్యః = తత్క్షణమే, తమోనాశ = చీఁకటి నడఁగించుటయందు, ఖద్యోతమాన = సూర్యునిగలె ప్రకాశించుచున్న, సత్ = ప్రశస్తము లయిన, విద్యుల్లతా = మెఱుపుతీఁగలయొక్క, ప్రభావిసరగిదిన్ = కాంతిపరంపరలవలెను, హృద్య = మనోహరము లయిన, క్షపా = రాత్రులయందు, వేద్య = ఎఱుఁగఁదగిన, ఖద్యోత = మిణుఁగుఱుఁబురుగులయొక్క, సందోహ = సమూహమంగు, విద్యమాన = ఉన్నట్టి, ద్యుతివితతికరణిన్ = తేజస్సమూహమువలెను, ఘోర = భయంకర మగు, అంధకారకృత్ = కటిక చీఁకటిని గలుగఁ జేయుచున్న, భూరి = విస్తారము లయిన, నీల = నల్లనయిన, సవారి = జలముతోఁ గూడిన, వారివాహ = మేఘములయొక్క, ఛవి = కాంతులయొక్క, వ్రజమురీతిన్ = సంఘమువలెను, నీల = ఇంద్రనీలమణులు, వైడూర్య = వైడూర్యములు, ప్రవాళ = పవడములు, అబ్జరాగ = పద్మరాగమణులు, ముక్తాఫల = ముత్యములు, గోమేధికముల = గోమేధికములయొక్క, భాతిన్ = వలెను, శుద్ధమాణిక్య = వజ్రమణులు, మరకత = గరుడపచ్చలు, శోణరత్న = కెంపులు, తప్తతపనీయ = అపరంజియొక్క, రుచులచందమునన్ = కాంతులవలెను, కానఁబడుచుండున్ = అగపడును.

తా॥ ఓ ఆంజనేయా! చిత్కళ లనునవి మనంబునం దేజరిల్లుచున్న యాకాశపంచకము యొక్క మధ్యమందు, తత్క్షణంబే గటికిచీఁకటిని నశింపఁ జేయుటయందు సూర్యునిం బోలి ప్రకాశించెడి మెఱుపుతీఁగల తేజఃపుంజమువలెను, మనోహరము లయిన రాత్రులయందుఁ గంటికి గనపడు మిణుగుఱుఁబురుగులసమూహమునం గల తేజస్సమూహముపగిదిని, భయంకరము లయిన గటికిచీఁకటులం గలుగంజేయుచు విస్తార మగు నల్లనికాంతులు గలిగి జలభరితము లై వెలయు మేఘముల కాంతిపుంజంబులభాతిని, ఇంద్రనీలమణులు వైడూర్యములు ప్రవాళములు పద్మరాగములు ముత్యములు గోమేధికములు అనువానికరణిని, వజ్రమణులు గరుడపచ్చలు కెంపులు అపరంజి అను వీనియొక్క కాంతుల చందంబునను గానంబడుచుండును

శా. చండాంశుప్రభ లుట్టిపడ్డగతి భాస్వచ్చిత్కళాకోటు లు
ద్దండస్ఫూర్తుల ఖండఖండములు నై తండోపతండంబు లై
నిండారం గనుపట్టు వెండియును హృన్నీరేజమధ్యాంచితా
ఖండాకాశపరంపరాంతరమునన్ గమ్యంబు లై యుంటటన్. ౧౪౨

టీక వెండియున్ = మఱియు, హృన్నీరేజ = హృదయకమలముయొక్క, మధ్య = అంతరాళమందు, అంచిత = ఒప్పుచున్న, అఖండ = సంపూర్ణ మయిన, ఆకాశపరంపర = ఆకాశపంక్తియొక్క - అనఁగా ఆకాశపంచకముయొక్క, అంతరమునన్ = మధ్యప్రదేశమందు, గమ్యంబులై = పొందఁదగినవై, చండాంశుప్రభలు = సూర్యకాంతులు, ఉట్టిపడ్డగతిన్ = హఠాత్తుగాఁ గనఁబడినట్లు, భాస్వచ్చిత్కళాకోటులు - భాస్వత్ = మెఱయుచున్న, చిత్కళాకోటులు = చిన్మయకళాసముదాయములు, ఉద్దండస్ఫూర్తులన్ =

అధికకాంతులచేత, ఖండఖండములునై = తుత్తునకలై, తండోపతండంబులై = గుంపులుగుంపులై, నిండారన్ = సంపూర్ణ మగునట్లు, కనుపట్టున్ = గోచరించును. అంతటన్ = పిమ్మట.

తా. పతియు హృదయకమలమధ్యప్రదేశమున నొప్పుచున్న యఖండాకార మగు నాకాశపంచకములయొక్క యంతరంబునం గమ్యంబులై సూర్యకిరణము లట్టిపట్టగతి చిక్కులకోటులు మిక్కిలి మెఱయుచు తళతళ లాడుచుఁ దుత్తునకలై గుంపులుగుంపులై సంపూర్ణంబుగా గోచరించును, అంతట

## జ్ఞాన సూర్యోదయ వర్ణనము.

సీ. తరుణబోధారుణోదయదీప్తిని జ్ఞాన, గురుతమ మజ్ఞహృద్గుహాల నడఁగ
ఫుల్లపద్మలజాతములమీఁద నిక్కి హం,సము త్రివేణీసంగమమున మెలఁగ
విమలేంద్రియేందీవరము లెల్ల ముకుళింప, మన మను శశి సుఖవనధిఁ జాఱ
సలలితజ్ఞానవిజ్ఞానకోకంబు ల,న్యోన్యసంగతము లై యనఁగి పెనఁగ
తే. నాతతాజాండపిండాండజాతములను, బూని వెలిఁగించుఁ బటుతరస్ఫూర్తితోడ
ఘనతరాంతర్హృదాకాశమున వెలుంగు, మండితాఖండచిద్భానుమండలంబు.

టీక. ఘనతరాంతర్హృదాకాశమునన్ — ఘనతర = శ్రేష్ఠమైన, అంతర్హృదాకాశమునన్ = దహరాకాశమందు - అనఁగా నంతర్హృదయము మనోబుద్ధిరూపములచేత ద్వివిధము, వానిలో మనస్సు బహిర్వ్యాపారరూపమై యుండును, అది బలరూప మని వృత్తిరూప మని ద్వివిధము, బుద్ధి వృత్తిజ్ఞాన మని స్వరూపజ్ఞాన మని ద్వివిధము, ఈ మనోబుద్ధు లను రెంటికి మూలకంద మైనది అంతర్హృదయము దానియందు, వెలుంగు = ప్రకాశించుచున్న, మండిత = శాంతత్వాది సుగుణములచే నలంకరింపఁబడిన, అఖండ = భాగింపరాని, చిద్భానుమండలంబు = జ్ఞాన మనెడు సూర్యబింబము, తరుణ=కోమల మైన, బోధ=విజ్ఞాన మనెడు- అనఁగా మెలఁకువ యనెడు, అరుణోదయ = సూర్యోదయముయొక్క దీప్తిన్ = వెలుఁగుచేత, అజ్ఞానగురుతమము=అవివేక మనెడు అంధకారము, అజ్ఞహృద్గుహాలన్ = మూఢజనులమానసములనెడు గుహాలయందు, అడఁగన్ = డాఁగఁగాను, ఫుల్లపద్మలజాతములమీఁదన్ - ఫుల్ల = వికసించిన, పద్మలజాతములమీఁదన్ = మూలాధారాదిషట్కమలములపైన, నిక్కి=తలయెత్తి - అనఁగా సహస్రారమునుఁజేరి, హంసము=ప్రణవాంగ మైన హంసనామక హంసపక్షి, త్రివేణీసంగమమునన్ — త్రివేణీ = ఇడాపింగళాసుషుమ్నలనెడి గంగాయమునాసరస్వతులయొక్క, సంగమమునన్ = త్రికూట మనెడు ప్రయాగయందు, మెలఁగుచున్ = సంచరింపఁగాను, విమలేంద్రియేందీవరములు — విమల = ద్వైతవాదధర్మముతోఁ గూడిన, ఇంద్రియ = చతుర్దశేంద్రియము లనెడు, ఇందీవరము లెల్లన్ = నల్లగలువ లన్నియు, ముకుళింపన్ = నిమీలింపగాను, మన మను శశి=మానస మనెడు చంద్రుఁడు, సుఖవనధిన్=బ్రహ్మానంద మనెడు సముద్రమందు, జాఱన్= అస్తమింపఁగాను, సలలితజ్ఞానవిజ్ఞానకోకంబులు - సలలిత = మిగుల మనోహరము లైన, జ్ఞాన = వృత్తిజ్ఞాన మనెడు, విజ్ఞాన = స్వరూపజ్ఞాన మనెడు, కోకంబులు = చక్రవాకదంపతులు, అన్యోన్యసంగతములై = ఒకటితో నొకటి గూడినవై, అనఁగి = లోఁబడి, పెనఁగన్ = క్రీడింపఁగాను, ఆతత=విశాలము లైన, అజాండ = బ్రహ్మాండములయొక్కయు, పిండాండ = శరీరములయొక్కయు, జాతములన్=సముదాయములను, పటుతర = మిక్కిలి సమర్థ మైన, స్ఫూర్తితోడన్ = వికాసముతో, బూని వెలిఁగించున్ = మిగుల ప్రకాశింపఁ జేయును

తా॥ ఓ యాంజనేయుఁడా! ఘనతర మగు దహరాకాశమందు వెలుంగుచు శాంతశమాదిసుగుణములచే నలంకరింపఁబడి భాగింప నసువుపడక యుండు జ్ఞాన మనియెడి సూర్యబింబము కోమల మగు విజ్ఞాన మనియెడు నరుణోదయపుఁగాంతిచే నవివేక మనియెడి యంధకారమును మూఢజనులహృదయము లనియెడి గుహాలయందు డాఁగఁగా, వికసించిన మూలాధారాది షట్కమలములమీఁద నిక్కి ప్రణవాంగ మగు హంసనామకహంసపక్షి యిడాపింగళాసుషుమ్న లనియెడి గంగాయమునాసరస్వతులు ముక్కి త్రికూట మనెడి ప్రయాగయందు నలంకరింపఁగా, ద్వైతవాదభ్రమచే శత్రువు లగు చతుర్దశేంద్రియము లనియెడి నల్లకలువ లన్నియు మీలనము నొందఁగా, మానసం బనియెడి చంద్రుండు బ్రహ్మానంద మనియెడి సముద్ర మున మునుగఁగా, మిగుల మనోహరము లైన వృత్తిజ్ఞానస్వరూపజ్ఞానము లనియెడి చక్రవాకంబు లొకటితో నొకటి గూడినవై యణఁగి పెనంగ నతివిశాలము లగు బ్రహ్మాండపిండాండములు సముదాయంబులను వెలింగించు చుండు నని తాత్పర్యము

ఆ. సకలకర్మములకు సాక్షియై స్వప్రకాశతఁ దమోఘ్నుఁ డగుచుఁ జక్షురాది
కప్రవర్తకత్వగరిమభాసిలు సత్స్వభావుఁ డగుచుఁ జిద్విభావనుండు. ౧౪౪

టీక. చిద్విభావనుండు = జ్ఞాన మను సూర్యుఁడు, సత్స్వభావుఁడగుచున్ — సత్ = త్రికాలాబాధ్య మైన, స్వభావుఁడగుచున్ = స్వప్రకాశ పరప్రకాశస్వభావము గలవాఁడై, సకలకర్మములకున్ = నిత్యనైమిత్తిక కామ్యనిషిద్ధ ప్రాయశ్చిత్తాది వైదికకర్మములకు - జ్ఞానేంద్రియ కర్మేంద్రియాంతఃకరణ వృత్తులకు, సాక్షియై = ద్రష్టయై, స్వప్రకాశతన్ = తన వెలుఁగుచేత, తమోఘ్నుఁడగుచున్ = ఆవరణ విక్షేపాత్మక మైన అజ్ఞానాంధకారమును నశింపఁ జేయు చున్నవాఁడై, చక్షురాదికప్రవర్తకత్వగరిమన్ — చక్షురాదిక = నేత్రాదీంద్రియములయొక్క, ప్రవర్తకత్వగరిమన్ = అహం శ్రోతా మంతా ఘ్రాతా అను నవి మొదలగు వ్యాపారములయందుఁ బ్రవర్తించునట్లు ప్రేరించువాఁ డనెడు గౌరవముచేత, భాసిలున్ = వెలుఁగును

తా॥ ఓ యాంజనేయుఁడా! సూర్యుఁడు తన్నును యితరములను ప్రకాశింపఁజేయు స్వభావము గలవాఁ డగుచు నిత్యనైమిత్తికాదికర్మములకు సాక్షిభూతుండై తన వెలుంగున దమంబు నడంచుచు చక్షురాదింద్రియములఁ బ్రవర్తింపఁజేయుచుఁ బ్రవర్తించు, అట్లు జ్ఞాన మనియెడు సూర్యుఁడును త్రికాలాబాధ్య మయిన స్వభావము గలిగి జ్ఞానేంద్రియ కర్మేంద్రియాంతఃకరణవృత్తులకు సాక్షియు తనప్రకాశముచేత సావరణ విక్షేపాత్మక మయిన యజ్ఞానాంధకారమును నశింపఁ జేయు చున్నవాఁడై యహం శ్రోతా మంతా ఘ్రాతా యనునవి మొదలగు వ్యాపారములం బ్రవర్తింపఁజేయుచు గౌరవముచే భాసిల్లు చుండు నని తాత్పర్యము

క. భ్రూమధ్యోదయశైలముపై మొదలం దోఁచి యంత బ్రవిమలహృదయ
వ్యోమారూఢుం డింద్రియతామరసానందకరుఁడు దానై వెలుఁగున్. ౧౪౫

టీక. మొదలన్ = ముందుగా, భ్రూమధ్యోదయశైలముపై — భ్రూమధ్య = శృంగార మనెడు, ఉదయశైలముపైన్ = ఉదయాచలముమీఁద, తోఁచి = జ్ఞానసూర్యుం డుదయించి, అంతన్ = పిమ్మట, ప్రవిమల = అతినిర్మల మైన, హృదయవ్యోమ = అంతర్హృదయాకాశమందు, ఆరూఢుండు = అధిరోహించినవాఁడును - అనఁగా ఎక్కినవాఁడును, ఇంద్రియతామరసానందకరుఁడు — ఇంద్రియ = చతుర్దశేంద్రియము లనెడు, తామరస = పద్మములకు, ఆనందకరుఁడు = వికసనము గలుగఁజేయువాఁడును, తానై = తానేయై, వెలుఁగున్ = ప్రకాశించును.

తా. ఓ ఆంజనేయుఁడా! సూర్యుఁ డుదయపర్వతముపై నుదయించి యంతట నాకసంబున కెక్కి పద్మముల కానందం బొనరించుచు వెలుఁగు చుండునట్లు జ్ఞాన మనియెడి సూర్యుండు భ్రూమధ్యం బనియెడి యుదయపర్వతముపై నుదయం దోఁచి యంతటం బ్రవిమల మగు హృదయాకాశంబున కధిరోహించి చతుర్దశేంద్రియము లనియెడి తామరసపుష్పములకు నానందముం జేయుచుఁ దానె యై వెలుఁగు చుండు నని తాత్పర్యము.

## మానసికస్నానవిధి.

సీ. అంతకు మున్నె నీ వపరోక్షవిజ్ఞాన,చక్షువుల్ దెఱచి యజ్ఞానమోహ
నాంగితాదాత్మ్యరూపాలింగనము మాని, చయ్యనఁ దను వన శయ్య డిగ్గి
చారువైరాగ్యవిజ్ఞానోపరతులచే, మానసస్నానకర్మములఁ దీర్చి
యనిశంబు బుద్ధీంద్రియప్రేరకుం డెవ్వఁ, డాదేవ సవితృమహాప్రకాశ
తే. మెలమి నే నంచు లోచనాంజలులచేత, ఘనతరానందబాష్పకార్ఘ్యంబు లిచ్చి
మొదల సందేహమందేహముఖపరప్రణాశ మొనరించి యుంటి నానంద మలర.

టీక. అంతకుమున్నె = జ్ఞానసూర్యోదయమునకు ముందుగానె, నీవు = ఈవు, అపరోక్షవిజ్ఞాన = బ్రహ్మసాక్షాత్కారజ్ఞాన మనెడు, చక్షువులు = నేత్రములు, దెఱచి = విప్పి - అనఁగా పరజాగ్రత్తఁ నొంది, అజ్ఞాన = స్వస్వరూపవిస్మృతికి కారణ మయిన అవ్యక్త మనెడు, మోహనాంగి = చిత్తవిభ్రమకారిణి యైన స్త్రీయొక్క, తాదాత్మ్యరూప = ఏకీభావరూప మైన, ఆలింగనమున్ = కౌఁగిలిని - అనఁగా భ్రాంతిజన్య మైన యజ్ఞాన మను స్త్రీయొక్క తాదాత్మ్యమును, మాని = త్యజించి, చయ్యనన్ = శీఘ్రముగా, తను వన శయ్య డిగ్గి = పంచకోశాత్మక మైన శరీరమును హంసతూలికాతల్పమును దిగి - అనఁగా అజ్ఞానజన్యమై అహంకారాద్యష్టావరణపరిచ్ఛేదితమై పిండబ్రహ్మాండసంజ్ఞ గల శరీరము నే ననెడు భ్రాంతిని విడిచి, చారు = మనోహరము లైన, వైరాగ్య = అవ్యక్తమహంకారాదిసర్వము నేఁ గా దను విరక్తిచేత, విజ్ఞాన = బ్రహ్మము నే నను తెలివిచేత, ఉపరతులచేన్ = సచ్చిదానందరూపపరబ్రహ్మము నే నను జ్ఞానము తప్పక యుండుట యను చిత్తలయముచేత, మానస = అంతరంగమందలి, స్నానకర్మములన్ = మజ్జనాది దైనందినక్రియలను, తీర్చి = నెఱవేర్చి - అనఁగా అంతరంగమందలి ఆణవకార్మికమాయామలము లను వైరాగ్యవిజ్ఞానోపరతులచేఁ గ్రమముగా పోఁగొట్టి పరిశుద్ధము చేసి, "శ్లో॥ ఇడా భాగీరథీ గంగా పింగళా యమునానదీ । తయోర్మధ్యగతా నాడీ సుషుమ్నాచ సరస్వతీ॥ ఏవం జ్ఞానప్రవాహే తీర్థే రాగద్వేషమలాపహే । యః స్నాతి మానసే తీర్థే సయాతి పరమాంగతిమ్॥ అచ్యుతోహ మనంతోహ మవ్యక్తోహ మహంహరిః। ఆనందోహ మచింత్యోహ మజోహ మమృతోస్మ్యహమ్॥ నిత్యోహం నిర్వికల్పోహం నిరాకారోహ మవ్యయః । సచ్చిదానందరూపోహం పరిపూర్ణో స్మ్యహం సదా॥ బ్రహ్మైవాహం న సంసారీ ముక్తోహ మితి భావయేత్ । అశక్నువం ధారయితుం వాక్య మేత దుదీరయేత్" ఇట్లని శ్రీమచ్ఛంకరభగవత్పాదై రుక్త మానసికస్నానమంత్రవిధిచేత మానసతీర్థమందు స్నానాదినిత్యకర్మముల దీర్చి యని అర్థాంతరము, అనిశంబు = ఎల్లప్పుడును, బుద్ధీంద్రియప్రేరకుండు - బుద్ధీంద్రియ = అంతఃకరణము మొదలగు చతుర్దశేంద్రియములను, ప్రేరకుండు = స్వస్వవ్యాపారముల యందు ప్రవర్తించునట్లు ప్రకాశింపఁ జేయువాఁడు, ఎవ్వఁడు = ఏప్రత్యగాత్ముఁడో, ఆదేవసవితృమహాప్రకాశము - ఆ = అట్టి పరమాత్మయొక్క, దేవ = స్వప్రకాశాత్మకాఖండానందైకరసమైనట్టి,

సవితృ = కార్యకారణాత్మకప్రపంచోత్పత్తిస్థితినాశతిరోధానానుగ్రహములఁ జేయునట్టి, మహత్ = శ్రేష్ఠ మైన, ప్రకాశము = అవిద్యానివారక మగు తేజస్సు, ఎలమిన్ = అనురక్తిచేత, నే నంచున్ = నేనే యని - అనఁగా అఖండానందైకరసమును, జగదుపాదానకారణమును = సంపూర్ణ జ్యోతిరూపము నగు బ్రహ్మమును అంతఃకరణములయందు తద్ధర్మాభాసకమై సాక్షియై యున్నది, అట్టి పరబ్రహ్మ మును సోహ మ్మను ప్రత్యగ్లక్షణానుసారముగా నే నని తలఁచి, అని పరబ్రహ్మపరము, ఎవ్వఁడు = ఏ జ్ఞానసూర్యుఁడో, అ = అట్టి, దేవ = ప్రకాశించు చున్న, సవితృ = జ్ఞానసూర్యునియొక్క, మహత్ = శ్రేష్ఠ మైన, ప్రకాశము = తేజస్సు, అని సూర్యపరము, తక్కినది స్పష్టము ఇది గాయత్రీమంత్రార్థము గనుక గాయత్రీమంత్రమునకుఁ గల యర్థము లన్నియు దీని యందు సమన్వయములు. గోపనాంజలులచేతన్ = కన్ను లనెడు దోసిళులచేత, ఘనతర=మహత్తరము లైన, ఆనంద=సంతోషసంజనితము లయిన, బాష్ప= అశ్రువులచేత, అర్ఘ్యంబులు=అర్ఘ్యములను, ఇచ్చి=అర్పించి, ' శ్లో॥ ఏకం వాహనశాలాయ ఏకం శస్త్రాస్త్ర మేవచ । అసురాణాం వధార్థైకం ప్రాయశ్చిత్తం చతుష్టయమ్। ప్రాతః కాలేను సాయాహ్నే అర్ఘ్యం ప్రోక్త స్త్రిభి స్త్రిభిః । హంసమంత్రం సముచ్చార్య వ్యాహృతి ప్రణవాన్వితమ్॥ అర్ఘ్య మేకం ప్రదాతవ్యం మధ్యాహ్నే భాస్కరం ప్రతి । మందేహాదేహా నాశార్థ ముదయాస్తమయే రవిః॥ సమీహాలే ద్విజో త్సృష్ట మంత్రతో యాంజలిత్రయమ్' అనెడు వాసిష్ఠగాయత్రీకల్పోక్తవచనములచేత బ్రాహ్మణులు అర్ఘ్య మిచ్చుట స్వభావము కాఁబట్టి ఇచ్చట జ్ఞానసూర్యోదయకాలమునందు నేత్రాంజలులచేత ఆనంద బాష్పములవలన అర్ఘ్యప్రదానములు చేసి, మొదలన్ = ముందుగా, సందేహ=సర్వాంతస్థులు గల నే నెట్లు పరబ్రహ్మ మగుదు ననునవి మొదలగు సందేహము లనెడు, మందేహముఖర= అసురేంద్రుఁడు మొదలగు నలువదియాఱుకోట్లమందేహు లనెడు రాక్షసవీరులయొక్క, ప్రణాశము = సంహారమును, సరించి= చేసి, ఇందుకు 'శ్రుతి॥ పూర్వాభిముఖా స్సంధ్యాయాం గాయత్ర్యాభి మంత్రిత - అపఉర్ధ్వం విక్షిపంతీతా ఏతా ఆపో వజ్రీ భూత్వా తానిరక్షాగంసి మందేహారుణే ద్వీపే ప్రక్షిపంతి యత్ప్రదక్షిణం ప్రక్రమంతి తేన పాప్మాన మవధూన్వం త్యుద్యంతమస్తం యంత మాదిత్య మభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్ సకలం భద్ర మశ్నుతే సా వాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవసం బ్రహ్మ ప్యేతి య ఏవం వేద అనెడు శ్రుత్యర్థప్రకారము మందేహాది అసురసంహారము చేసి, అంతన్ = పిమ్మట, ఆనందము = బ్రహ్మానందము, అలరన్=ఒప్పుచుండఁగా.

## తాదాత్మ్యనిరూపణప్రకరణము.

సహజన్యతాదాత్మ్య మని, కర్మజన్యతాదాత్మ్య మని, భ్రాంతిజన్యతాదాత్మ్య మని తాదాత్మ్యము త్రివిధము. చిత్తు అహంకారమందు ప్రతిబింబించి ఆ ప్రతిబింబము ఆ యహంకారమును గూడి తప్తాయః పిండమువలె నొక్కటై చిత్తువలె దోఁచును, ఆ చిత్ప్రతిబింబమునఁ గూడిన యహంకారమునకు ఆ ప్రతిబింబముతోడి తాదాత్మ్యము సహజన్యతాదాత్మ్య మనంబడును, అది యెట్లనఁగా, రెండును కూడఁబుట్టినవి గనుక సహజన్యతాదాత్మ్య మనంబడును, చిత్ప్రతిబింబమునుగూడి చిత్తువలెఁ దోఁచునట్టి యహంకారము స్థూలదేహముతోఁ జేరినప్పుడు ఆ యహంకారమునకు స్థూలశరీరముతోడి తాదాత్మ్యము కర్మజన్యతాదాత్మ్య మనంబడును, జాగ్రద్భోగ మైన కర్మము జనించినప్పుడు జనించి ఆ కర్మము నశించనేని తానును నశించును గనుక దీనికి కర్మజన్యతాదాత్మ్య మని పేరు గలిగెను. కర్మను గలిగిన తాదాత్మ్యము గలుగును; కర్మములే కున్నను తాదాత్మ్యమును లే దనుటకు జాగ్రత్స్వప్నములే దృష్టాంతములు. ఈ తాదాత్మ్యము వలన స్థూలదేహము చేతనము వలె నయ్యెను. నేను బ్రాహ్మణుఁడను, క్షత్రియుండను, వైశ్యుఁడను, శూద్రుఁ

డను, బ్రహ్మచారిని, గృహస్థుఁడను, వానప్రస్థుఁడను, సన్న్యాసిని అను చిత్తవృత్తులతోఁ గూడి యుండెడి అహంకారాధ్యస్తమైన సాక్షితోడి తాదాత్మ్యము భ్రాంతిజన్యతాదాత్మ్య మనఁబడును; సత్తాద్యధిష్ఠానమైన ఆత్మస్వరూపము తా నని యెఱుఁగనందున కల్పించెది గనుక దీనికి భ్రాంతిజన్యతాదాత్మ్య మని పేరు గలిగెను. ఈ తాదాత్మ్యత్రయమునకు నివృత్తి యెప్పు డనిన, సంబంధమైన చిదాభాస యహంకారమై యుండునంతకు నుండునో అంతవఱకు సహజతాదాత్మ్యమునకు నివృత్తి లేదు, ఆ యహంకారము నశింపఁగానే సహజతాదాత్మ్యమునకు నివృత్తి యని తెలియవలయును. ప్రతిదినము కర్మప్రదమైన కర్మమువలనఁ బుట్టిన కర్మమునకు సుషుప్తికాలమందు నాశము వచ్చుచుండఁగా ఆకర్మజన్యతాదాత్మ్యమునకు నాశ మని కనుఁగొనవలయును. ఇది సర్వానుభవసిద్ధము. ఈ తాదాత్మ్యమునకు విదేహకైవల్యమం దాత్యంతిక నాశము. భ్రాంతిజన్యతాదాత్మ్యము, నేను బ్రహ్మ మను జ్ఞానము గలిగినప్పుడు నశించును. విద్యారణ్యస్వాములు ఉద్ధత్యవివేకమం దీతీరుననే నిరూపించిరి. ఈయర్థమునందు సందియము లేదు. ఎవ్వఁడీతాదాత్మ్యత్రయమును విచారించి యిది యహంకారమునకే గాని యహంకారసాక్షియగు నిర్వికారుఁడును అసంగుఁడు నైన నాకు లే దని యెఱుంగువాఁడే ముక్తుఁ డని శాస్త్రసిద్ధాంతము.

తా. ఓ ఆంజనేయుఁడా! విజ్ఞానసూర్యోదయమునకు పూర్వమే ఆత్మసాక్షాత్కార మనునట్టి జాగ్రదవస్థను పొంది స్వస్వరూపానుసంధానవిరోధియును ద్వితీయత్వ పరిచ్ఛిన్నత్వ సంగత్వ కర్తృత్వ భోక్తృత్వము లనెడు అంగములచే మోహమును గలుగఁజేసెడి యజ్ఞానమును త్రియొక్క తాదాత్మ్యరూపమున ఆలింగనము వదలి (భ్రాంతివల్లనైన యజ్ఞానమును వదలి) అన్నమయ ప్రాణమయ మనోమయ ఆనందమయము లనెడు పంచకోశాత్మకమును అష్టాంతరణవేష్టితమును అగు పిండబ్రహ్మాండసంజ్ఞ గల శరీరమే యాత్మ యను భ్రాంతిని వదలి వైరాగ్యవిజ్ఞానోపరతులచే మానసికజ్ఞానగోచరంబు లగు యిడాదులయందు స్నానం బాచరించి ఆణవక కార్మిక మాయామలము లను మలత్రయమును గోఁగొట్టుకొని దశుర్దశేంద్రియము లగు బుద్ధ్యాదులను తమతమవ్యాపారములయందుఁ బ్రవర్తించునట్లు చేయువాఁడును, బ్రహ్మవిష్ణ్వాద్యుపాధి యగు యవిద్యను వీడిన కూటస్థుఁడును (శరీరత్రయవిలక్షణుఁడును, అవస్థాత్రయసాక్షియును పంచకోశవ్యతిరిక్తము నై వెలుఁగు సచ్చిదానందనిత్యనిర్మలస్వరూపి) అగువాఁ డెవ్వఁడో అట్టి పరమాత్మయందుఁ బ్రకాశించెడు అఖండానందమే ముఖ్యగుణముగాఁ గలిగినట్టియును, కార్యకారణాత్మక ప్రపంచోత్పత్తి స్థితి నాశ తిరోధానానుగ్రహములఁ జేయునట్టిదియు, శ్రేష్ఠమైనట్టిదియు, అజ్ఞానాంధకారమును పోఁగొట్టునదియు నగు తేజస్సు నేనని తలంచి నేత్రము లనెడు అంజలులచేత ఆనందపుఁగలన జనించిన బాష్పములచే నర్ఘ్యంబుల నిచ్చి సందేహాదు లగు (సర్వావస్థలు గల నే నెట్లు పరబ్రహ్మ మగుదు ననియెడు సందేహము మొదలుగాఁ గలవి) మందేహాదిరాక్షసులను సంహరించి ఆనందబ్రహ్మము నొప్పుచుండఁగా నని తాత్పర్యము. (ఈ పద్యమునకు మీఁదిపద్యముతో నన్వయము) ఇక్కడ తాదాత్మ్య మనఁగా రెండవది యగు కర్మజన్యతాదాత్మ్యము

క. మౌనజపము నిర్వృత్తి, ధ్యానముఁ గావించి యక్రియాత్మార్చనముం
బూని యొనరించి చిదఖండానందం బనుభవింపు మయ్య మహాత్మా. ౧౪౭

టీక. మహాత్మా = మహానుభావా, మౌ. జపమున్—మౌన = వాగింద్రియవ్యాపారరహిత మనెడు, జపమున్ = మంత్రావృత్తిని, నిర్వృత్తిధ్యానమున్—నిర్వృత్తి = అంతఃకరణవృత్తిరహిత మనెడు, ధ్యానమున్ = స్వరూపచింతనమును, కావించి = ఒనర్చి, అక్రియాత్మార్చనమున్—అక్రియా = హస్తాది కర్మేంద్రియవృత్తి రహిత మనెడు, ఆత్మార్చనమున్ = ఆత్మసపర్యను, పూని = లెస్సగా, ఒనరించి = చేసి,

చిదఖండానందంబు—చిత్ = బ్రహ్మజ్ఞానమువలనఁ బుట్టిన, అఖండ = సంపూర్ణ మైన, ఆనందంబు = సుఖమును, అనుభవింపుమయ్య = పొందుమా.

తా॥ ఓయి మహానుభావా! వాచిక మానసికవ్యాపారములు లేనిది యగు స్వరూపచింతనమును, కర్మేంద్రియవ్యాపారరహిత మైన యాత్మార్చనను బాగుగా నొనర్చి బ్రహ్మజ్ఞానమువల్ల బుట్టిన సంపూర్ణ మైన సుఖమును అనుభవింపు మని తాత్పర్యము

తే॥ అట్లఖండసుఖామృతాశనాప్తిఁ జెంది, చిత్తవిశ్రాంతితాంబూలసిద్ధిఁ గాంచి
మురిసి యసమానమూర్తివై ముక్తికాంతతో వినోదింపుమయ్య వాతూలతనయ.

టీక॥ వాతూలతనయ = ఆంజనేయా, అట్లు = కాయిక వాచిక మానసిక వ్యాపారరహితముగా, అఖండసుఖామృతాశనాప్తిన్—అఖండ = పరిపూర్ణ మైన, సుఖ = బ్రహ్మానంద మనెడు, అమృతాశనాప్తిన్ = అమృతపారణను, చెంది = పొంది, చిత్తవిశ్రాంతితాంబూలసిద్ధిన్—చిత్తవిశ్రాంతి = చిత్తము బ్రహ్మాకారముగఁ బరిణమించుట యనెడు, తాంబూలసిద్ధిన్ = విడెము వేసికొనుటను, కాంచి = పొంగి-అనఁగా సున్నము వక్క ఆకు యనెడు ద్రష్టృదర్శనదృశ్యములను మ్రింగి, మురిసి = అధికసంతోషమును పొంగి, అసమానమూర్తివై—అసమాన = స్వసదృశరహిత మైన, మూర్తివై = ఆకృతి గలవాఁడవై—అనఁగా అఖండస్వరూపుఁడవై, ముక్తికాంతతోన్ = మోక్ష మనెడు కామినితోడ, వినోదింపుమయ్య = క్రీడింపుమా.

తా॥ ఓయి యాంజనేయా! కాయిక వాచిక మానసిక వ్యాపారరహితముగా పరిపూర్ణ మైన బ్రహ్మానంద మనెడు యమృతమును పారణ జేసి చిత్తము బ్రహ్మాకారముగ పరిణమించుట యనెడు తాంబూలము వేసికొని (సున్నము వక్క ఆకు యనెడు ద్రష్టృదర్శనదృశ్యములను మ్రింగి) అధికసంతోషమును పొంది తనకు సమానము లే నటువంటి ఆకారము గలవాఁడవై (అఖండస్వరూపుఁడవై) ముక్తికామినితో క్రీడింపు మని తాత్పర్యము.

## జ్ఞానచంద్రోదయవర్ణనము.

సీ॥ కామాదిఖగముల గజిబిజు లడఁగ దేహాభిమానాదిత్యుఁ డస్తమించె
సలయవిక్షేపకషాయరసాస్వాద, ధీంద్రియాబ్జములు నిద్రించుచుండ
విలసదాత్మాకారవృత్తి కైరవజాల, మింపొంది వికసింప నెఱుఁగ మెఱపు
లను చక్రయుగమునకు కలివియోగము గల్గ, ఖండవిజ్ఞాననక్షత్రతతుల
తే॥ తెలివి వెల్లువలఁ బోవ నిర్మలమవశ్చ, కోరతృష్ణానలంబు చల్లాఱు నంత
ననితరముగ హృదాకాశమున వెలుంగు, మండితాఖండచిచ్చంద్రమండలంబు.

టీక॥ అంతన్ = పిమ్మట, కామాది = కామ క్రోధ లోభ మోహాదు లనెడు, ఖగములన్ = పక్షుల యొక్క, గజిబిజులు = కలకలరవములు, అడఁగన్ = విరామము నొందఁగాను, దేహాభిమానాదిత్యుఁడు ॥

## సలయవిక్షేపకషాయరసాస్వాదములనిర్ణయించుట.

శరీరత్రయాభిమాని యగు జీవుఁ డను సూర్యుఁడు, అస్తమింపన్ = గ్రుంకఁగాను, సలయ = ఆవరణము-అనఁగా నిద్ర, విక్షేప = స్వస్వరూపవిస్మృతి గలిగి ప్రపంచవృత్తులతోఁ గూడి యుండుట, కషాయ = చిత్తము ప్రపంచవ్యవహారమందును స్వస్వరూపావలోకనమందును నిలువక స్తంభనమై యుండుట, రసా= స్వాద = శబ్దాది తన్మాత్రరూపముగఁ బరిణమించి యుల్లసిల్లుట - అనఁగా జాగ్రదవస్థ; వీనికి వృత్తి

కరంబుల గాఢాలింగనంబు చేసి నానావిధప్రణవనాదంబునను కంకణమేఖలా మంజీరశింజితగళరవమణితాద్యారవంబులు చెలంగ విచారజనితజ్ఞానానందరస మధురాధరామృతం బనుభవించుచుఁ బరమశివం బను చిఱుతనటవాఁడను నిర్నిద్రాత్మప్రముద్రాలత్వ్యదృగ్వచనమనోభావనాజ్ఞానంబుల నేకరూపంబు గావించి వితతాపరిమితానుసమతఃపరమోపరతిసుఖగపిగుండవు సమాధిగతుండవు సంస్పృష్టాత్యంతమర్మస్థానుండవు సంగర్భితానంగకలామండలాఖండుఁడవు ప్రగళిత బిందుండవు నై యానందింపుము ౧౫౦

టీక అయ్యవసరంబునఁ = అజ్ఞానచంద్రోదయకాలమందు, కుచమధ్యాంతఃపురగంబునఁ = బ్రహ్మశాల యను నందిపురమందు - అనఁగా అంతరహృదయాకాశమునందు, అప్రమేయ = ప్రత్యక్షాదిప్రమాణము గలిగి గోచర మైన, తురీయ = ఉన్మన్యవస్థ యనెడు, శయ్యాతలంబునఁ = పాన్పుమీఁద, హంసయానయుఁ = ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములే గమనముగాఁ గలదియు, గుర్విరీడు = మేడ వలెఁ గాని, కళా = స్వప్రకాశకళలచేత, భాసమానయుఁ = ప్రకాశించు చున్నదియును - అనఁగా నిరుపాధికదృష్టిచేతఁ గూడఁదగిన పూర్ణకళలచేతఁ బ్రకాశించు చున్న దని భావము, మూలాధార = మూలాధారచక్ర మనెడు, మంజీరయుఁ = అందెలు గలదియును - మూలాధార మన గుదస్థానము, మంజీరము పాదమందుండునది, 'పాదాది పాయుపర్యంతం పృథ్వీస్థానం ప్రకల్ప్యతే' అని యున్నది గావున పాదము మొదలు పాయుస్థానపర్యంతము పాదస్థానమే కనుక మూలాధారమంజీర యని కవి రూపకముగఁ జెప్పినాఁడు, స్వాధిష్ఠాన = స్వాధిష్ఠానచక్ర మనెడు, కింకిణీసమన్విత = చిఱుగంటలతోఁ గూడిన, మేఖలయుఁ = పిఱుఁదుల యందు ధరింపఁబడు చున్న బిల్లల యొడ్డాణము గలదియును, మణిపూరక = మణిపూరకచక్ర మనెడు, కాంచీకలాపయుఁ = ఒడ్డాణము కలదియు, హృదయ = వక్షఃస్థలమందు, సేవిత = కూర్పఁబడిన, అనాహత = అనాహతచక్ర మనెడి, రత్నభూషితయుఁ = మణిపతకముచేత నలంకరింపఁబడినదియు, కంఠ = గళమందు, విభ్రాజిత = మిగుల వెలుఁగుచున్న, విశుద్ధి = విశుద్ధచక్ర మనెడు, మంగళసూత్ర = తాళిబొట్టుచేత, అలంకృతయుఁ = శృంగారింపఁబడినదియు, భ్రూమధ్య = కనుబొమలనడుమ, ప్రకాశమాన = శోభిల్లు చున్న, సదమల = అతినిర్మల మైన, ద్విదళ = రెండుదళములు కల ఆజ్ఞాచక్ర మనెడు, లాలాటికా = చేరుచుక్కచేత, శోభితయుఁ = రాణించుచున్నదియు, సూర్యచంద్రమండల = సూర్యచంద్రమండలము లనెడు, తాటంకయుగళ = కమ్మలజతచేత, విరాజితయుఁ = మెఱయుచున్నదియు, ధగద్ధగాయమాన = తళతళ యని మెఱయుచున్న, సౌదామనీలతా = మెఱుపుతీఁగ యనెడు, శరీరిణియుఁ = మేను గలదియును, 'శ్రుతి॥ నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా' అని యుండుటవలన, శుద్ధసత్త్వ = కేవల శుద్ధసాత్త్వికగుణ మనెడు, దుకూల = వెలిపట్టుపుట్టముచేత, ఆవృతయుఁ = కట్టఁబడినదియు - అనఁగా వస్త్రాయమాన శుద్ధసత్త్వగుణ మని భావము, సచ్చిదానందస్వరూపిణియుఁ—సత్ = త్రికాలాబాధ్యత్వమును చిత్ = అపరోక్షజ్ఞానమును, ఆనంద = సంసారదుఃఖనివృత్తిపూర్వకానందమును, స్వరూపిణియుఁ = రూపముగాఁ గలదియును, ఐన ముక్తికాంతను = ఐనట్టి కాంతను మనెడు స్త్రీని, యోగ = నిష్కామకర్మయోగ మనెడు, జ్ఞాన = జ్ఞానయోగ మనెడు, కరంబులచే = హస్తములచేత, గాఢాలింగనంబుచేసి = బిగియఁగౌఁగిటఁ జేర్చి, నానావిధ = బహువిధంబు లైన, ప్రణవనాదంబుల = ఓంకారధ్వనులు - అనఁగా చిణిచిణి మొదలగు పదివిధము లైన ప్రణవశబ్దములు, అను = అనెడు, కంకణ = హస్తకడియములయొక్క, మేఖలా = ఒడ్డాణముయొక్క, మంజీర = అందెలయొక్క, శింజిత=

ధ్వనులకు, గౌరవ = సురతకాలమున కంఠమునఁ బుట్టెడు ధ్వనిగమైన, మణిత = మణితమే, ఆది = మొదలైన, ఆరవంబులు = మ్రోతయు, చెలంగగ = అతిశయింపఁగా, విచార = నిత్యానిత్యవస్తువిమర్శనముచేత, జనిత = పుట్టిన, జ్ఞాన = బ్రహ్మజ్ఞానమువలన నుదయించిన, ఆనందరస = ప్రమోదరస మనెడు, మధుర = తీయనైన, అధరామృతంబుగ = మోవితేనియను, అనుభవించుచుఁగ = గ్రోలుచు, పరమశమంబు—పరమ = అతిశయమైన, శమంబు = ఉపశాంతి — అనఁగా మనోలయము అను చిలుంగమును అనెడు సూక్ష్మస్వేదము, పొడమఁగ = ఉద్భవిల్లఁగా, నిర్నిద్రా = ఎల్లప్పుడు — మేలుకొనుచున్న అనఁగా అజ్ఞానావరణరహితమైన, అక్షుద్ర = తక్కువగాని, ముద్రా = సచ్చిదానందనిత్యనిర్మలత్వము లనెడు చిహ్నములచేత, లక్ష్య = ఎఱుఁగఁదగిన పరబ్రహ్మమునందు, దృక్ = నేత్రేంద్రియముయొక్క, వచన = వాగింద్రియముయొక్క, మనః = కామరాగాదియుక్తమైన మనస్సుయొక్క, భావనా = వ్యాపారములను, జ్ఞానంబులఁగ = చతుర్దశేంద్రియవిషయకారణమైన ప్రజ్ఞను — అనఁగా నిచ్చలు దృగ్వచన మనశ్శబ్దములు మూఁడును జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతరింద్రియోపలక్షణములు గావున చతుర్దశేంద్రియవ్యాపారములను వీని కారణమైన ప్రజ్ఞను, ఏకరూపము గావించి = ఒక్కటిగాఁ జేసి, వితత = వ్యాప్తమైన, అపరిమిత = మిక్కుటమైన, అనుపమిత = సాటిలేని, పరమ = ఎక్కువైన, ఉపరతి = చిత్తలయమువలనఁ గలిగిన, సుఖరసికుండవు = సుఖమును గ్రహించినవాఁడవు, సమాత్మకగుండవు = నీచోత్తమమధ్యమము లనెడి భేదములు లేనివాఁడవు, సంస్పృష్ట = స్పృశింపఁబడిన, అత్యంత = మిగుల, మర్మ = గోప్యమైన, స్థానుండవు = పరమాకాశము గలవాఁడవు, సందర్శిత = చూడఁబడిన, అనేక = అనేకములయిన, కలా = చిత్కళలయొక్క, మండలుండవు = గుంపులు గలవాఁడవు, ప్రగళిత = జారిన, లింగుండవై = బుద్ధి గలవాఁడవై - అనఁగా జీవధర్మము గలవాఁడవై, ఆనందింపుము = సంతోషింపుము. ఈ వచనమున ముక్తికాంత నని చెప్పుటచేత ఆదిరూపకమైనందున యీ వచనమంతయును కాంతాపరముగా నన్వయించుచున్నను, ఆ యన్వయము మీ ప్రకరణోపయోగము గానందునను, కాంతాపరముగా నన్వయము సులభమైనందునను రెండవయన్వయము వ్రాయఁబడ లేదు.

తా॥ ఆ జ్ఞానచంద్రోదయకాలమందు అంతరహృదాకాశమునందు ప్రత్యక్షాదిప్రమాణముల కగోచరమైన (అనఁగా ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము అను తర్కప్రమాణములు నాలుగు, ఇందులో చక్షురింద్రియజన్యజ్ఞానము ప్రత్యక్షము, చక్షురింద్రియ మనఁగా నింద్రియోపలక్షణము, విషయాదు లయిన ఘటాదులకు యింద్రియములతో సంయోగ మున్నందున ఘటాదిప్రత్యక్షములు కలుగుచున్నవి; ఆ ప్రకారముగా నిది చక్షురింద్రియగ్రాహ్యము కాదు గనుక ప్రత్యక్షమునకు అగోచరము. అనుమానమునకు వ్యాప్తిజ్ఞానము కారణము, మనము ధూమమును అగ్నిని రెంటిని ఒక్కస్థలమునందే అనేకపర్యాయములు చూడడముచేత నెక్కడనైన ఒక్కటియగు ధూమమునుమాత్రము చూచినయెడల అదే స్థలమునందే అగ్నికూడ యున్నదని అనుమానించుచున్నాము, ఆ ప్రకారముగా నిక్కడ వ్యాప్తిజ్ఞానము లేదు గనుక అనుమానప్రమాణమునకు గోచరము కాలేదు. ఉపమానమునందు సాదృశ్యజ్ఞానము కారణము, మనము ఒక్కస్థలమునందు చంచువులు పాదములు లోహితవర్ణమును, మిగత దేహము చంద్రకాంతితో సమానధావళ్యమును పొంది యుండెడి యొకపక్షివిశేషమును పటమునందు జూచి యిది హంసము అని తెలుసుకొన్నయెడల మఱొకదేశమునందు యిట్టి సాదృశ్యము గల పక్షివిశేషమును జూచితిమేని యిది హంసపదవాచ్యము, హంస అని తెలుసుకొనుచున్నాము. అట్టి సాదృశ్యజ్ఞానము యిక్కడ లేకపోవడముచేత ఉపమానప్రమాణమునకు గోచరము కాలేదు. శబ్దమువలన శక్తిజ్ఞానము కలుగుచున్నది గాన (శక్తిజ్ఞానము కలుగుట లేదు, అందుచేతనే ప్రత్యక్షాదులకు అగోచర మయినదని చెప్పెను.) కడపటిది

మహాభోగిలక్షణము.— శ్లో॥ సర్వభావన నెంగు విశోధయు వడముక్త కోర్కెల్లఁ దా పీడ్యాని ప్రాప్తము ననుభవించు సర్వం । దకులపత్ నఁ తండష మహాభోక్త భగదా అని జ్ఞానవాసిష్ఠమునందు

తా. జ్ఞానాగ్ని గల యోగిజనేశ్వరా! నిత్యనిర్గుణ పరిపూర్ణ సచ్చిదానందస్వరూప మైన పరబ్రహ్మ మందు ప్రీతిని అభ్యాసముచే పొంది అనఁగా (పరబ్రహ్మము గూర్చి దనరు అఖండ బ్రహ్మానుసంధానముచే జనించినసుఖము ననుభవించువాఁడవై) క్రమక్రమంబుగా నీ వయిన ప్రత్యగాత్మ యగు పరమాత్మ అభేదముగ గూడియున్న దను పూర్ణబోధవలన గలిగిన యానందముచేతఁ దేజరిల్లి పరమాత్మయును ప్రత్యగాత్మయును భేదము లేదను జ్ఞానముచే యానందయుక్తుఁడై మిక్కిలి తృప్తి నొందిన నిరభిలాషచే మహాభోగము గలవాఁడ వగుదు వని తాత్పర్యము.

ఆ. ఫాలమునను దృష్టి పైఁ గుండలీంద్రుఁడు, మస్తకమునఁ జంద్రమండలంబు
సమర నమృతమయత హతధర్మకామార్థ,పరుఁడవగుము త్రిపురహరుఁడవగుచు.

టీక. ఫాలమునను=మండలత్రయమధ్యమందును, దృష్టి=శుద్ధసత్త్వమందలి తైజసాంశ మైన దివ్యచక్షువును, పైఁన్=ఆ దివ్యచక్షురగ్రమందును, కుండలీంద్రుండు = శుద్ధసత్త్వమందలి తామసాంశ మైన కాలసంజ్ఞ గల ప్రణవకుండలి యను సర్పరాజు, మస్తకమునన్ = సహస్రారమందు, చంద్రమండలంబును= శుద్ధసత్త్వమందలి సత్త్వాంశ మైన అమృతకిరణమండలమును, అమరన్ = ఒప్పఁగా, త్రిపురహరుఁడ వగుచున్ — త్రిపుర = జాగ్రత్స్వప్నసుషుప్తు లను త్రిపురములను, హరుఁడ వగుచున్ = వహించినవాఁడవై, అమృతమయతన్ = మోక్షస్వరూపుఁ డగుటవలన, హత = కొట్టఁబడిన, ధర్మకామార్థపరుఁడవు = ధర్మకామములయం దాసక్తి గలవాఁడవు, అగు = కమ్ము.

తా. సూర్యాదిమండలత్రయమునందు శుద్ధసత్త్వమందలి తేజస్సంబంధ మైన దివ్యచక్షువును, ఆ దివ్యచక్షువుయొక్క అగ్రభాగమునందు శుద్ధసత్త్వమందలి తామసాంశ మైన కాలసంజ్ఞ గల ప్రణవకుండలి యను సర్పరాజును, సహస్రారమందు చంద్రమండలంబును గలిగి త్రయావస్థ లగు త్రిపురములను వహించినవాఁడవై మోక్షస్వరూపుఁడ వగుటవలన ధర్మకామములయందు యిష్టము లేనివాఁడవు కమ్ము అని తాత్పర్యము

చ. తొలుత ననాదికాలకృతదుష్కృతపుణ్యవిమిశ్రకర్మకో
టులను సముచ్చయంబులఁ గోడు స్వసితంబుగఁ జేయుచున్ సము
జ్జ్వలసదఖండచిద్వరసువర్ణమయామలదివ్యవహ్నిమం
డలము వెలుంగు నంతట విడంబితహృద్గగనాంతరంబునన్. ౧౫౩

టీక. అంతటన్ = అనంతరము, విడంబితహృద్గగనాంతరంబునన్ — విడంబిత = విశాల మైన, హృద్గగనాంతరంబునన్ = హృదయాకాశమధ్యమందు, తొలుతన్ = ముందుగా, సముజ్జ్వల = మిక్కిలి తేజరిల్లుచున్న, సత్ = ప్రసిద్ధమై, అఖండ = అపరిచ్ఛిన్న మైన, చిత్ = జ్ఞానస్వరూప మైన, వర = శ్రేష్ఠ మైన, సువర్ణమయ=కనకమయ మైన, అమల = నిర్మల మైన, దివ్య=అప్రాకృత మైన, వహ్నిమండలము = అగ్నిమండలము, అనాదికాల = ప్రపంచనిర్మాణసంకల్పకాలమునకుఁ బూర్వమందు, కృత = చేయఁబడిన, దుష్కృత = పాపముల నొసఁగెడు, పుణ్య = పుణ్యముల నొసఁగెడు, విమిశ్ర = పుణ్యపాపముల నొసఁగెడు, కర్మకోటులు = కర్మసముదాయములు, అనుసముచ్చయంబులన్ — అను = అనునట్టి, సమిత్ = బంధనములయొక్క, చయంబులన్ = గుంపులను - అనఁగా పుణ్యపాపమిశ్రకర్మము

లనెడు చిలుకబొట్టెలను, కడుక్ = మిక్కిలి, ఘనితంబుగఁ జేయుఁగుక్ = నీరు చేయుంగు, వెలుఁగుక్ = ప్రకాశించును

## పుణ్యపాపమిశ్రకర్మముల వివరణము.

పుణ్యకర్మ మని పాపకర్మ మని మిశ్రకర్మ మని కర్మము త్రివిధము, అందు పుణ్యకర్మమునకు దేవతాశరీరప్రాప్తి, పాపకర్మంబునకు పశు పక్షి మృగాది శరీరప్రాప్తి, మిశ్రకర్మంబునకు మనుష్యశరీరప్రాప్తి, పుణ్యోత్కర్షంబునకు హిరణ్యగర్భశరీరప్రాప్తి, పుణ్యమధ్యమంబునకు యింద్రాదిశరీరప్రాప్తి, పుణ్యసామాన్యంబునకు యక్షరక్షపిశాచాది శరీరప్రాప్తి, పాపోత్కర్షంబునకు పరులకు సంతాపకర మగు సర్ప వృశ్చిక యూక మత్కుణ మశక విష వృక్షాది శరీరప్రాప్తి, పాపమధ్యమునకు ఆమ్ల పనస నారికేళ మహిష అశ్వ మేష గర్దభాది శరీరప్రాప్తి, పాపసామాన్యంబునకు గోగజాశ్వత్థ వృక్షాది శరీరప్రాప్తి, మిశ్రోత్కర్షంబునకు నిష్కామకర్మానుష్ఠానముచేత చిత్తశుద్ధి, దానివలన సాధనచతుష్టయసంపత్తి, దానివలన సద్గురులాభము, దానివలన చేయంబడిన శ్రవణమనననిదిధ్యాసములచేతఁ గలిగిన జ్ఞానమువలన జీవన్ముక్తిసుఖము లభించునట్టి శరీరప్రాప్తి, మిశ్రమధ్యమంబునకు స్వాశ్రమోచితకామ్యకర్మంబులకుఁ దగిన శరీరప్రాప్తి, మిశ్రసామాన్యంబునకు నంధుల వ్యాధాది శరీరప్రాప్తి అగును గావున వివేకి యైనవాఁడు కర్మఫలతారతమ్యము విచారించి మిశ్రోత్కర్షము లభింప యత్నింపవలయును, ఇవి మనోవాక్కాయములచేతఁ జేయఁబడు త్రివిధకర్మానుగుణ్యజనకాగతిస్యములు. ఈత్రివిధకరణములచేతఁ జేయఁబడిన పుణ్యపాపమిశ్రకృత్యంబు లెవ్వియనిన, విశిష్టారోగ్యచింతయు, నిర్విశేషచింతయు, పరలోకచింతయు, పరహితప్రాప్తిచింతయు, భక్తిజ్ఞాన వైరాగ్యచింతయు యివి మనస్సుచేతఁ జేయఁబడిన పుణ్యకర్మంబులు, సర్వదా విషయచింతయు, పరాహితచింతయు, వేదశాస్త్రప్రమాణచింతయు, ధర్మాధర్మాభావచింతయు, పరలోకాభావచింతయు యివి మొదలగునవి మనస్సుచేతఁ జేయఁబడిన పాపకర్మంబులు, సవిశేష నిర్విశేషసాధనకాలాదులయందుఁ జేయఁబడిన విషయాదిచింత మనస్సుచేతఁ జేయఁబడిన మిశ్రకర్మములు, వేదాధ్యయనంబును, శాస్త్రపఠనంబును, గీతాసహస్రనామాది పారాయణంబును, గాయత్రీపంచాక్షర్యాది మంత్రజపంబులును, భగవన్నామసంకీర్తనంబును, పరోపకారవార్తాదులును యివి మొదలైనవి వాక్కుచేతఁ జేయఁబడిన పుణ్యకర్మంబులు, పెద్దలను దూషించుటయు, పరుల నాడరానిమాట లాడుటయు, అసత్యములు పలుకుటయు, చాడీలు చెప్పుటయు యివి మొదలైనవి వాక్కుచేతఁ జేయఁబడిన పాపకర్మంబులు, వేదాధ్యయనజపాదికాలంబులయందు లౌకికవార్తయు, ప్రమాణములు చేయుటయు యివి వాక్కుచేఁ జేయఁబడిన మిశ్రకర్మంబులు, పుణ్యతీర్థంబులయందు స్నానం బొనర్చుటయు, గురుదేవతానమస్కారంబు లాచరించుటయు, పరులను పీడింపకుండుటయు, దేవపూజాదులయందు ప్రదక్షిణంబు చేయుటయు యివి మొదలైనవి కాయముచేతఁ జేయఁబడిన పుణ్యకర్మములు, సర్వదా పరులను పీడించుటయు, పరస్త్రీసంగమంబును, బలవంతంబున పరధనాపహరణంబు చేయుటయు, దొంగిలుటయు, విటకాండ్రం గూడి తిరుగుటయు యివి మొదలైనవి కాయముచేతఁ జేయఁబడిన పాపకర్మములు; బ్రాహ్మణభోజననిమిత్తముగ బ్రాహ్మణులను పీడించుటయు, పరులద్రవ్యము నపహరించి చలిపందిళ్లు గుడి గోపుర మంటపాదులు గట్టించుటయు, పెద్దవయస్సు గలవారిచేత గుంటలు మొదలైనవానిని త్రవ్వించుటయు, బ్రాహ్మణుల వృత్తుల నపహరించి దేవాలయంబులకు విడుచుటయు యివి మొదలైనవి కాయముచేతఁ జేయఁబడిన మిశ్రకర్మంబులు, ఇట్లు త్రివిధకరణములచేత త్రివిధకర్మములు చేయఁబడుచున్నవి, వీనికి సాక్షి యైన నాకు యీవికారములు లేవని తెలిసినవాఁడే ముక్తుఁ డని శాస్త్రసిద్ధాంతము.

తా. అనంతరము విశాల మయిన హృదయాకాశమధ్యమందు ముందుగా మిక్కిలి ప్రకాశించు చున్నట్టిదియు, ప్రసిద్ధ మయినదియు, అపరిచ్ఛిన్న మయినదియు, జ్ఞానస్వరూప మయినదియు, శ్రేష్ఠ మయినదియు, బంగారుమయ మయినదియు, నిర్మల మయినదియు, అప్రాకృత మయినదియు నైన యగ్ని మండలము ప్రపంచ నిర్మాణ సంకల్ప కాలమునకు పూర్వము చేయఁబడిన పాపముల నిచ్చునట్టియు, పుణ్యముల నిచ్చునట్టియు, పుణ్యపాపముల నిచ్చునట్టియు కర్మసమూహము లనునట్టి కట్టెలను భస్మముగాఁ జేయుచు ప్రకాశించు నని తాత్పర్యము

మ. ఉరు రాగాదిగుణాజసంఘము ననాగ్యోంకారమంత్రంబుచే
తరయం బారఁ వధించి ఆత్మవిషయేధ్మ శ్రేణితోఁ గూడఁ జె
చ్చెర నానావిధవాసనాజ్యములతోఁ జిద్వహ్నిమధ్యంబునన్
వరుస న్వ్రేలిచి సౌఖ్యసోమరసపానం బంతఁ గావింపవే. ౧౫౮

టీక. అంతన్ = పిమ్మట, ఉరురాగాదిగుణాజసంఘమున్—ఉరు = గొప్ప లైన, రాగాదిగుణ = కామక్రోధలోభాదిదుర్గుణసంఘ మనెడు, అజసంఘమున్ = మేఁకలగుంపును, అనాగి = ఉత్పత్తి లేని, ఓంకారమంత్రంబుచేన్ = ప్రణవ మనెడు మంత్రముచేత, రయంబారన్ = అతిశీఘ్రముగా, వధించి = చంపి, ఆత్మవిషయేధ్మశ్రేణితోన్—ఆత్మ = మనస్సంబంధము లైన, విషయ = శబ్దాదివిషయము లనెడు, ఇధ్మ = కట్టెలయొక్క, శ్రేణితోన్ = గుంపుతో, గూడన్ = మేళన మగునట్లు, చెచ్చెరన్ = గ్రక్కున, నానావిధ = పలువిధము లైన, వాసనా = లోకవాసన శాస్త్రవాసన దేహవాసన లనెడు, ఆజ్యముల తోన్ = ఘృతములతోడ, చిద్వహ్నిమధ్యంబునన్— చిత్ = విజ్ఞాన మనెడు, వహ్ని = అగ్నియొక్క, మధ్యంబునన్ = నడుమను, వరుసన్ = శాస్త్రక్రమముగా, వ్రేలిచి = హోమము చేసి, సౌఖ్యసోమరసపానంబున్—సౌఖ్య = బ్రహ్మానంద మనెడు, సోమరస = సోమరస మనెడు హవిశ్శేషముయొక్క, అనఁగా శేషమగు రసమును, పానంబు = త్రావుటను, కావింపవే = చేయుము.

## వాసనాత్రయవిచారము.

లోకవాసన యనియు దేహవాసన యనియు శాస్త్రవాసన యనియు మూఁడువిధములు, అందు.—

లోకవాసన—లోకులందఱు దన్ను దూషింపక యెప్పుడును భూషింపవలయు ననెడి అభినివేశము లోకవాసన యనఁబడును, ఈ లోకవాసనాప్రతిబంధమునకు నివృత్తి యెప్పు డనఁగా, నన్నందఱును నిందింపక పొగడుచుండవలయు ననియెడి అభినివేశము ఈశ్వరునిచేత నైన సంపాదింపఁగూడదు గావున అజ్ఞానజీవులు నిందించిన నిందింతురు, పొగడిన పొగడుదురు అని వారిదూషణములచేత ఖేదమోదంబులను చెంద కుండుటయే యీప్రతిబంధమునకు నివృత్తి, ఈశ్వరుని నిందించువారు గలరా యనినఁ గలరు, సర్వలోకస్రష్ట యగు బ్రహ్మ శివ కుమారస్వాములచేత శిక్షింపఁబడె నని అతని మాహాత్మ్య మెఱుఁగనివారు నిందించు చున్నారు, మఱియు, సర్వాంతర్యామి యగు విష్ణువు జీవులలో నొకఁడనియు, శివుని చేత శిక్షింపఁబడె ననియు, అతనిమహిమ నెఱుఁగని శివపాషండులు నిందింపు చున్నారు, వెండియు, సర్వలోకగురు లైన సాంబమూర్తి దిక్షుండు మొదలైన వారిచేత దూషింపఁబడె నని యాతని మహత్త్వ మెఱుఁగని విష్ణుపాషండులు నిందింపుచున్నారు, మఱియు, నిరీశ్వరసాంఖ్యు లనెడి కొందఱు మీమాంసకులు అంతర్యామి లేఁడని నిందింపు చున్నారు, మఱియు, సాక్షాద్భగవత్స్వరూపు లైన రామకృష్ణాదులు రావణశిశుపాలాదులచేత నిందింపఁబడి రని పురాణములయందుఁ గానఁబడు చున్నది, కాఁబట్టి పామరు

లును, బహిర్ముఖులును అయిన జనులు మనలను నిందించుచున్నారు, ఆ నిందను గురించి చింతసేయ పని లేదు, అయితే యీనింద యెవరికని విచారింతము, ఆత్మకని చెప్పితిమేని, ఆగ్నివలె నిర్మలుఁడును సర్వపరిపూర్ణుఁడు నైన యాత్మ యెవరిచేత నింద చేయఁబడుట లేదు, ఎట్లనఁగా, ఆ యాత్మ సర్వప్రాణులకు స్వరూపము గనుక తన్ను తానే నిందించుకొన్నట్లగును, అట్లయినను, లోకమందొకఁడు మరియొకని నిందింపఁగాఁ జూచితిమి గాని తన్ను తానే నిందించుకొనట కానము, తన్ను తానే నిందించుకొన్నయెడల ఆ నిందచేఁ దనకు నేమియు హాని లేదు, అయినను, దేహమును పరులు నిందించుచున్నారని చెప్పుగ మనిన, దేహము ముముక్షువుచేత పూర్వమే నిందింపఁబడెను కాఁబట్టి యీదేహమును పరులు నిందించిరేని ఆ నింద ముముక్షువునకు లాభమాయెను, ఎట్లనఁగా, ఒకని శత్రువును మరియొకఁడు నిందించెనేని వాఁడు వానికెట్లు ప్రియుఁడో అట్లే వివేకి తన దేహమును నిందించినవాఁడు తనకు ప్రియుఁడని యెంచఁ దగి యది, ఈ త్రిశరీరములలో స్థూలశరీరమే నిందింపఁబడుచున్నది, తక్కిన శరీరములు దృశ్యములు కావు గనుక నిందకు విషయములు గావు, ఈశరీరములే నిందకు విషయములు గాక యుండఁగా, సర్వాతీతుఁడై అసంగుఁడై సర్వద్రష్టయై స్వప్రకాశుఁడైన తన్ను నింద యంటనేరదని విచారించు పురుషునికి లోకవాసనాస్వరూపమైన ప్రతిబంధము నశించును అను నిశ్చయమందు సంశయము లేదు

దేహవాసన యనఁగా — శరీరము నశింపక చిరకాలము నిలువఁగలుగుననుట, అది కర్మాధీనము, పురుషప్రయత్నముచేత లభించునది కాదు, కొందఱు యోగాభ్యాసముచేత దీర్ఘాయువును సంపాదించిరని పురాణములయందు వినఁబడుచున్నది యనిన ఆ యోగాభ్యాసము కర్మము, ఆ జ్ఞానము లభింపకుండునట్లు చేయును గనుక దేహస్థితి కర్మవశము, కర్మయున్నంతవఱకు దేహముండును, దేహము చిరకాలము నిలువవలయు ననువపేక్షయు ముముక్షువుచేత నుపేక్షింపఁదగినది, మఱియు ఆరోగ్యము కర్మాయత్తమే గనుక అదియు పురుషయత్నముచే లభింపదు, ఒకవేళ లభించినను గాని ముముక్షువునకు హానియే గాని మేలు గలుఁగఁబోదు, ఆయురారోగ్యసిద్ధివలన హర్షస్వరూపుఁడౌనగుటవలన వికారమును సిద్ధింపమివలన దుఃఖస్వరూపుఁడౌనైతి నను విచారమును అంతఃకరణధర్మములే గాని నాకు లేదని తెలిసి ఆయురారోగ్యములు లభింపవలెనని ముముక్షువు కోరఁదగదు, దీనికి దృష్టాంతము — లావణ్యము గల పురుషుఁడు కాలాంతరమునందు కురూపియగుటయు, కురూపి లావణ్యము గలుగవలయునని ప్రయత్నించి యా యత్నము వ్యర్థమగుటయుఁ జూచుచున్నాము, లావణ్యము సంపాదింపవలెనను ప్రవృత్తి మోక్షప్రవృత్తికి విఘాతకమై అనర్థపరంపరలకు కారణమగుచున్నది గనుక లావణ్యము గలుగవలయునను కోరిక ముముక్షువుచే విడువఁదగినది

శాస్త్రవాసన యనఁగా — శాస్త్రపఠనము, శాస్త్రార్థవిచారణ చేయవలయునను నభిలాష; ఇదియే శాస్త్రవాసనారూపప్రతిబంధము మోక్షసాధకమగు శాస్త్రవిచారణ ప్రతిబంధమెట్లగునని యనిన భారద్వాజ నారదాదులు వేదశాస్త్రములను సమగ్రముగాఁ జదువవలయునని తలంచి యుపక్రమించి బహుశ్రమలఁబడి తుదకు సాధ్యము కాదని విడిచిరి, కావున వేదాంతశాస్త్రేతరశాస్త్రాభ్యాసము మోక్షవిచారణకు విరోధమైనందున అది ప్రతిబంధమనవచ్చును, కాఁబట్టి అన్యశాస్త్రపఠనమాని, ఆ శాస్త్రాభ్యాసమందును సాకల్యముగ ప్రజ్ఞను సంపాదించుట దుర్లభము, ముముక్షువులచే విడువఁదగినది మఱియు లోకమందు శాస్త్రాభ్యాసము చేసినవారు దానిని మఱచుటచేతను, పరులతో ప్రసంగించి వాదించుటచేతను గెలుచుటచేతను, వేదనాకరమై యున్నది గావున వేదాంతశాస్త్రేతరశాస్త్రపఠనము,

సర్వదా అనర్థహేతు వని తలంచి ముముక్షువుచే వీడంబడెనేని శాస్త్రవాసనావిషయిక మగు ప్రతిబంధము వీడును, ఇట్లు విచారించి బ్రహ్మజ్ఞానము సార్జించువాఁడే ముక్తుం డని శాస్త్రసిద్ధాంతము

తా. అనంతరము కామక్రోధాదిగుణసమూహ మనునట్టి మేఁకలగుంపును అనాది యగు ప్రణవ మంత్రంబుచే శీఘ్రముగా వధించి మనస్సుతో సంబంధించిన శబ్దాదివిషయము లనెడు కట్టెలసమూహముతోను, లోకవాసనాది అనేకవాసన లనునట్టి ఆజ్యములతోను, విజ్ఞాన మనునట్టి యగ్నిమధ్యంబున శాస్త్రమునందుఁ జెప్పఁబడినట్లు హోమము చేసి హావిర్భాగ మయినట్టి బ్రహ్మానంద మనెడు సోమరసమును పానము చేయు మని తాత్పర్యము

తే. అమ్మహోజ్జ్వలసూర్యసోమాగ్నిమధ్యసీమయం దంతఁ గనుపట్టుఁ జీతధామ
చండధామానలాత్మకాఖండధామ, మండలాదిహిరణ్మయమండలంబు. ౧౫౫

టీక. అంతన్=పిదప, అమ్మహోజ్జ్వల=ప్రసిద్ధమైన కాంతిచే ప్రకాశించుచున్న, సూర్య=ద్వాదశకళాత్మక సూర్యమండలముయొక్క, సోమ = షోడశకళాత్మక చంద్రమండలముయొక్క, అగ్ని= దశకళాత్మక వహ్నిమండలముయొక్క, మధ్యసీమయందున్ = మధ్యభాగమందు - ఇచ్చట మంత్రశాస్త్రమం దగ్నిమండల మాధార మనియు, దానిమీఁద సూర్యమండల మమృతకలశ మనియు, దాని నడుమనుండు నమృతము చంద్రమండల మనియు చెప్పఁబడియున్నది, ఇచ్చట కవి పద్యలక్షణమునకై వ్యత్యస్తముగాఁ జెప్పియున్నాఁడు శీతధాముం బు—శీతధామ=చంద్రుఁడు, చండధామ=సూర్యుఁడు, అనల=అగ్ని, ఆత్మక=ఈ త్రివిధమండలములే స్వరూపములుగాఁ గల, అఖండధామ — అఖండ=సంపూర్ణమైన, ధామ=తేజస్సు గల, మండలాది = త్రివిధమండలములకు నుత్పత్తిస్థానమై, హిరణ్మయమండలంబు = హిరణ్మయమండలము, కనుపట్టున్ = దృశ్య మగును

తా. పదికళలతోఁ బ్రకాశించెడు యగ్నిమండలమే యాధారముగాఁ గల యమృతకలశము సూర్యమండలము, దానిమధ్యయం దుండెడి యమృతము చంద్రమండలము, అట్టిమండలత్రయాత్మక మగు సంపూర్ణతేజస్సు గల హిరణ్మయమండలము మండలములకు నుత్పత్తిస్థానమై మండలమధ్యమందు నగుపడు నని తాత్పర్యము

వ. అది మఱియు. ౧౫౬

టీక. అది = ఆ హిరణ్మయమండలము, మఱియున్ = వెండియును

సీ. మహనీయవైశాఖమధ్యాహ్నకాండసంకలితమార్తాండమండలముపగిదిఁ
జారునిర్మలశరత్సమయరాకానిశాజ్జ్వలపూర్ణచంద్రమండలముపగిదిఁ
దప్తహేమాభిదీప్తజ్వాలికాజాలవిలసకాలాగ్నిమండలమురీతి
నీలతోయదమధ్యనిర్గతకమనీయవితతసౌదామనీలతికభాతి

తే. బరఁగి నిరాకారమౌ నంబుకరశి సూక్ష్మమై విమలమై యవర్ణమై యప్రమేయమై యచింత్యప్రకాశమై యలరు చుండుఁ, జండరుచులహిరణ్మయమండలంబు.

టీక. మహనీయ = మనోజ్ఞమైన, వైశాఖ = వైశాఖమాససంబంధి, మధ్యాహ్నకాండ=మధ్యాహ్నకాలముతోడ, ॥ని॥ 'కాండోస్త్రీదండ బాణార్వ వర్గా వసరవారిషు' అని అమరము, సంకలిత = కూడిన, మార్తాండమండలముపగిదిన్=సూర్యమండలమువలెను, చారు=సుందరమైన, నిర్మల=స్వచ్ఛమైన,

శరత్సమయ = శరత్కాలమందలి, రాకా=పదియాఱుకళలతోఁ గూడిన, సముజ్జ్వల = మిగుల వెలుఁగుచున్న-అనఁగా నిండువెన్నెల గాయుచున్న, పూర్ణచంద్రమండలముగతిన్ = సంపూర్ణచంద్రమండలమువలెను, ఇచ్చట రాకాపూర్ణచంద్రమండల మనచో 'గజఘటలం గనుఁగొని, కరికలభకర్ణావతంసము' ఇత్యాది ప్రాచీనకవిప్రయోగములఁ బట్టి, ॥సూ॥ 'విశిష్టవాచకానాం పదానాం పృథగ్విశేషణవాచకపదవధానే విశేష్యమాత్రపరత్వమ్' అను సూత్రమునుబట్టి సాధువుగా గ్రహింపవలయును, తప్తహేమ=కుందనమువలె, అభిదీప్త = మిగుల వెలుఁగుచున్న, జ్వాలికా=మంటలయొక్క, జాల=సమూహము గల, విలయకాల=ప్రళయకాలమందలి, అగ్నిమండలమురీతిన్=వహ్నిమండలమువలెను, నీల=నల్లనైన, తోయద=మేఘముయొక్క, మధ్య=నడుమనుండి, నిర్గత=బయలువెడలిన, కమనీయ=సుందరమైన, వితత = వ్యాప్తమైన, సౌదామనీలతికభాతిన్ = మెఱపుదీఁగవలెను, పరఁగి=ఒప్పినదై, నీవారశూకంబుగతిన్ = వరిముంటివలె, సూక్ష్మమై = అత్యల్పమై, విమలమై = నిర్మలమై, అవర్ణమై = నీలపీతాదివర్ణములు లేనిదై, అప్రమేయమై = ప్రత్యక్ష అనుమాన ఉపమాన ఆగమ అనుపలబ్ధి అర్థాపత్తి ఐతిహ్య సంభవములనెడు అష్టప్రమాణములచేఁ దెలియ నశక్యమైనదై, అచింత్యప్రకాశమై = మనస్సుచేఁ దలఁపరాని తేజస్సు గలదై, చండరుచులన్ = దుర్నిరీక్ష్యము లగు కాంతులచేత, హిరణ్మయమండలంబు = హిరణ్మయమండలము, అలరుచుండున్ = ప్రకాశించుచుండును.

తా॥ వైశాఖమాసపు మధ్యాహ్నకాలమందలి సూర్యమండలమువలెను, శరత్పూర్ణిమనందు పదియాఱుకళలతో వెలుఁగుచున్న పూర్ణచంద్రమండలమువలెను, కుందనమువలె వెలుఁగుచున్న మంటలయొక్క సమూహము గల మహాప్రళయమునందలి అగ్నిమండలమువలెను, నల్లనయిన మేఘములనుండి బయలువెడలిన మెఱపుదీఁగవలెను, వరిముంటివలె చిన్నదిగాను, నిర్మలముగాను, వర్ణము లేనిదిగాను, ప్రత్యక్షాదులైన యెనిమిదిప్రమాణములకు అగోచరమైనదిగాను, మనస్సుచేఁ దలఁపరాని తేజస్సు గలదిగాను యుండెడు హిరణ్మయమండలము చూచుటకు శక్యము గాని కాంతులచేఁ బ్రకాశించుచుండునని తాత్పర్యము

అనుపలబ్ధి యనఁగా.—అభావప్రమితిని కలుగఁజేయునది, (ప్రమితి-యథార్థప్రత్యక్షము) (1) ఘటాభావము ఘటము తెలియనప్పుడు గోచరించునట్లు హిరణ్మయమండలాభావము హిరణ్మయమండలము వుండునపుడు యెట్లు గోచరించును? కనుక హిరణ్మయమండలము భావరూపమైనందున అనుపలబ్ధికి అగోచరము. (2) ఊహింపఁబోయెడు పదార్థము లేకపోయినట్లైతే ప్రమాణాంతరసిద్ధమైన అర్థము సరిపడకపోవుట అర్థాపత్తి యనఁబడును, దేవదత్తుఁ డనువాఁడు పగలు భోజనము చేయకనే బలిసియున్నాఁ డనడముచేత రాత్రి భోజనము చేయుచున్నాఁ డని యూహించుచున్నాము, రాత్రి భోజనము లేకపోయినట్లైతే ప్రమాణాంతరప్రత్యక్షసిద్ధమైన బలిసియుండుట యను అర్థము సిద్ధింపదు; ఇట్టి నిర్ణీతకార్యకారణభావము యిచ్చట లేదు గనుక అర్థాపత్తికి గోచరము కాదు. (3) మొట్టమొదటఁ జెప్పినవాఁడు తెలియకనే వచ్చెడు శబ్దము ఐతిహ్యము, మొదట చెప్పినవాఁడు తెలియకనే యొక మఱ్ఱివృక్షమునందు బ్రహ్మరాక్షసి యున్న దని చెప్పుట అట్టిశబ్దముయొక్క యుచ్చరించుట, వీనినిగూర్చి లేదు గనుక ఐతిహ్యమునకు అగోచరము (4) ఒకదానియొక్క నిర్ణయముచేతనే తాను సంభవించుట సంభవము, ఒకనియొద్ద వందరూపాయలున్నవని నిర్ణయించుటచే పదిరూపాయలు స్వయముగా సిద్ధించుట, పదిరూపాయలు లేని నూరురూపాయలు యెట్లు లేదో ఆప్రకారము హిరణ్మయమండలము చేరని పదార్థము లేదనుట లేదు. ప్రత్యక్షాది నాలుగుప్రమాణములు పూర్వపద్యమునందు చూపఁబడెను.

క. అది యాపోజ్యోతి యనం, గదలక ద్విదళమునం దనరుకళ యామీందఁ
మొదలిటివెలుంగు వెలుఁగు న్నల్లదె యాత్మారామతత్త్వ మగు ననిలసుతా ॥౧౫౮॥

టీక అనిలసుతా = ఆంజనేయా, అది = ఆ హిరణ్మయమండలము, ఆపోజ్యోతియనఁ = అపృతజ్యోతి యను పేరుచేత-అనఁగా నారాయణశబ్దవాచ్యముచేత, కదలక = చలింపక, ద్విదళమునఁ = ఆజ్ఞాచక్రమందు, తనరుకళ = ప్రకాశించునట్టి చిత్కళ, ఆమీఁదఁ = ఆ కళాగ్రమధ్యమందు, మొదలిటి వెలుఁగు = సర్వకారణమైన నిష్కారణమైన మహాతేజస్సు, వెలుఁగుఁ = ప్రకాశించును, అల్లదె = ఆ వెలుఁగే, ఆత్మారామతత్త్వము—ఆత్మ = సర్వజీవులయందు, ఆరామ=అంతర్యామిరూపముగా క్రీడించుచున్న, తత్త్వము=పరబ్రహ్మము, అగుఁ=అవును ॥శ్రు॥ "నీలతోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా । నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా । తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః । స బ్రహ్మ సశివ స్సహరి స్సేంద్ర స్సోక్షరః పరమస్స్వరాట్" అని యుపనిషత్తు

తా ఓయి యాంజనేయా! పరబ్రహ్మ మనఁగా సర్వజీవులయందును అంతర్యామిరూపంబున క్రీడించుచు నారాయణనామముచే చలింపక ఆజ్ఞాచక్రమందు ప్రకాశించెడు జ్ఞానకళలయొక్క అగ్రభాగమునందు సర్వకారణనిష్కారణమైనదై ప్రకాశించెడు మహాతేజస్సగు హిరణ్మయమండల మని తాత్పర్యము (సర్వకారణ మనఁగా సర్వమునకు తాను కారణముగా నుండుటయు, నిష్కారణ మనఁగా తనకు కారణము లే దనియు భావము)

మత్తకోకిల. కోటిసూర్యులు కోటిచంద్రులు కోటికోటితటిల్లతల్
ల్నాటిగాఁ బరిపాటిగా నొకచోట నిల్చిన రీతి న
మ్మేటివెల్గుఁ దగం ద్రికూటముమీఁదఁ జూడుము దృశ్యముం
దాఁటి మాయను మాటిమాటికిఁ దాల్మిచే నటు మీఁటుచున్. ॥౧౫౯॥

టీక. అమ్మేటివెల్గుఁ = ఆ యుత్కృష్టతేజస్సును, కోటిసూర్యులు = నూఱులక్షలసూర్యులును, కోటిచంద్రులు = నూఱులక్షలచంద్రులును, కోటికోటితటిల్లతలు = అనేకకోట్ల మెఱుపుతీఁగలును, నాటిగాఁ = గుతిగా, పరిపాటిగాఁ = క్రమముగా, ఒకచోటునిల్చినరీతిఁ = ఏకస్థానంబున నిలిపినట్లు, దృశ్యముఁ = నామరూపాత్మకప్రపంచమును — అనఁగా విక్షేపమును, దాఁటి = మీఱి, తాల్మిచేతఁ = నిబ్బరముచేత, మాటిమాటికిఁ = పలుమాఱును, మాయఁ = కారణోపాధి యగు మాయను — అనఁగా ఆవరణమును, అటుమీటుచుఁ = దూరముగాఁ దొలఁగఁదోసి యుంచు, త్రికూటముమీఁదఁ=భ్రూమధ్యముపైని, తగఁ = ఒప్పిద మగునట్లు, చూడుము = వీక్షింపుము

తా. నామరూపాత్మక మగు దృశ్యప్రపంచము నతిక్రమించి అప్పుడప్పుడు కారణోపాధి యగు మాయను దూరముగాఁ జేయుచు భ్రూమధ్యమును పొందినదై యొకప్రదేశమునందే అనేకసూర్యచంద్ర మెఱపుతీఁగలయొక్క కాంతితోఁ బ్రకాశించెడు తేజస్సును చూడు మని తాత్పర్యము (ఇట్టి మహాతేజస్సు భ్రూమధ్యముమీఁదఁ గనఁబడు నని భావము)

వ. ఇట్లు భ్రూమధ్యపీఠమందలి హృదయాకాశంబునం గనుపించు వియన్మండల తమోమండల మేఘమండల విద్యున్మండల తారామండల జ్యోతిర్మండల సూర్యమండల చంద్రమండల వహ్నిమండల హిరణ్మయమండలంబు లను దశవిధమండ

లంబులును బూర్వోక్త దశవిధనాదంబులును వక్ష్యమాణ బిందుకోశాత్మక హంస
తత్త్వంబును మహాకాశమధ్యంబునం గనుపించు జీమూతంబులచందంబున నెవ్వని
యందుఁ దోఁచు ననిలాదిభూతచతుష్టయంబునఁ దత్కార్యంబున నంటనిమింటి
పగిది నిన్నింటి నెవ్వం డంటకుండు నాదిత్యుం డఖిలరూపంబులఁ బ్రకాశింపఁ
జేయుకైవడి నెవ్వండు చిన్మాత్రుండై యిన్నింటి వేర్వేఱ విభజించి యెఱుంగు
నతండ యీ బిందు నాద కళాతీత స్వప్రకాశ నిత్య శుద్ధ బుద్ధ ముక్త పరిపూర్ణ
సచ్చిదానందస్వరూప ప్రత్యగభిన్న పరమాత్మారాముం డగు విశుద్ధసత్త్వప్రధా
నయుఁ బరమవైరాగ్యబోధోపరతిస్వరూపిణియు బిందు నాద కళాత్మకయుఁ
గేవల బ్రహ్మాత్మైక్యవిద్యామయయు నైన నన్నాశ్రయించి యద్వితీయాపరోక్ష
బ్రహ్మచైతన్యస్వరూపకుం డైన యీ యాత్మారామునియం దాత్మాకారాకారిత
వృత్తిగతచిదాభాసకుండ వైన నీవు ప్రచండాతపమధ్యనిక్షిప్తదీపకలికవిధం
బున జ్ఞానకర్మేంద్రియపవనమనోవృత్తివిలయపూర్వకంబుగా నేకీభూతుండ వై
నివాతదీపంబుభంగి నిస్తరంగసముద్రంబుపోలిక విగతాశేషపత్త్రపాదపంబు
చాడ్పున నీలపీతాదివర్ణశూన్యగగనంబుకరణి స్వప్నజాగ్రత్సుషుప్త్యవస్థారహిత
సుషుప్తరీతి నిశ్చలుండవు నిశ్శేషుండవు నిశ్శబ్దుండవు నిర్వికల్ప నిరాకార సుఖ
స్వరూపుండవు నై బాహ్యాభ్యంతరములు మఱచి నిరుపమరాజయోగతురీయ
సమాధిం బొందు మని యుపదేశించి వెండియు నిట్లనియె. ౧౩౦

టీక. ఇట్లు = ఈప్రకారము, భ్రూమధ్యవీథియందలి హృదయాకాశంబునఁ = బొమలనడిమి త్రోవయం దుండు చిత్తాకాశమందు, కనుపించు = గోచరించు చున్న, వియన్మండల = ఆకాశమండలము, తమోమండల = తిమిరమండలము, మేఘమండల = ధారాధరమండలము, విద్యున్మండల = తటిన్మండలము, తారామండల = నక్షత్రమండలము, జ్యోతిర్మండల = తేజోమండలము, సూర్యమండల = భాస్కర మండలము, చంద్రమండల=సోమమండలము, వహ్నిమండల = అగ్నిమండలము, హిరణ్మయమండలంబుల = హిరణ్మయమండలము, అను దశవిధమండలంబులును = అనెడు పదితెఱఁగు లయిన మండలములును, పూర్వోక్త దశవిధనాదంబులును = ముందుఁ జెప్పఁబడిన చిణిచిణి మొదలగు పదివిధము లయిన ప్రణవ ధ్వనులును, వక్ష్యమాణ = ఇఁకఁ జెప్పఁబోయెడు, బిందుకోశాత్మక = శివశక్త్యాత్మక మగు అంతఃకరణ మనెడు ఆవరణరూప మైన, హంసతత్త్వంబును = జీవతత్త్వమును, మహాకాశమధ్యంబునఁ = మహా గగనమధ్యమందు, కనుపించు జీమూతంబులచందంబునఁ = కనఁబడు మేఘములవలె, ఎవ్వనియందుఁ = ఏ యాత్మారామునియందు, తోఁచుఁ = దృశ్య మగునో, అనిలాది భూతచతుష్టయంబునఁ — అనిల = వాయువే, ఆది = మొదలగు, భూతచతుష్టయంబునఁ = నాలుగుభూతములను — అనఁగా భూజలాది వాయువులను, తత్కార్యంబులఁ = ఆ భూతజన్యము లైన ఘటపటాదులను, అంటనిమింటిపగిదిఁ = స్పృశింపని గగనమువలె, ఇన్నింటిఁ = ముందుఁ జెప్పఁబడిన హిరణ్మయమండలాదుల నన్నింటిని, ఎవ్వండు = ఏపురుషుఁడు, అంటకుండుఁ = స్పృశింప కుండునో, ఆదిత్యుండు = అర్కుఁడు, అఖిల రూపంబులఁ = సకలరూపములను, ప్రకాశింపఁజేయుకైవడిఁ = వెలిఁగించునట్లు, ఎవ్వండు = ఏమహా

మహాలుఁడు, చిన్మాత్రుఁడై = ప్రజ్ఞానస్వరూపుఁడై, ఇన్నింటిన్ = ఈ పైఁ జెప్పఁబడినవాని నన్నిటిని, వేర్వేఱన్ = ప్రత్యేకముగా, విభజించి = వివరించి, ఎఱుంగుమ్ = తెలిసికొనుమో, అతఁడ = ఆ పురుషుఁడే, ఈ బిందునాదకళాతీత = పూర్వోక్తమైన నాదబిందుకళలకంటె విలక్షణుఁడైన, స్వప్రకాశ = స్వయంప్రకాశుఁడైన, నిత్య = శాశ్వతుఁడైన, శుద్ధ=నిర్మలుఁడైన, బుద్ధ=సర్వజ్ఞుఁడైన, ముక్త = ప్రకృత్యతీతుఁడైన, పరిపూర్ణ = అఖండస్వరూపుఁడైన, సత్=అనృతరహితమైన, చిత్ = జడరహితమైన, ఆనంద = దుఃఖరహితమైన, స్వరూప = ఆకృతి గల, ప్రత్యగభిన్న — ప్రత్యక్ = కూటస్థచైతన్యమునకంటె, అభిన్న = అన్యము గాని, పరమ = నిరతిశయమైన, ఆత్మారాముండు = పరమాత్ముఁడు, అగున్ = అవును, విశుద్ధసత్త్వప్రధానయున్ — విశుద్ధసత్త్వ = తమోరజస్సత్త్వములనెడు త్రిగుణములకంటె నతీతమగు కేవలసామాన్యవస్థాస్వరూపమైన చిత్ప్రకృతిరూపమే, ప్రధానయున్ = ముఖ్యముగాఁ గలదియు, (ఈ శుద్ధసత్త్వమునకే తురీయము, అర్ధమాత్రిక, ఉన్మని, విరజ అను పేళ్లు గలవు) పరమ = ఉత్కృష్టమైన, వైరాగ్య = ఐహికాముష్మికఫలభోగవిరాగమును, బోధ = విజ్ఞానమును ఉపరతి = తన్మయత్వమును, స్వరూపిణియున్ = ఆకృతిగాఁ గలదియు, బిందునాదకళాత్మికయున్ = అకార ఉకార మకారాత్మకములైన నాదబిందుకళలే స్వరూపముగాఁ గలదియు - అనఁగా ప్రణవస్వరూపిణి యని భావము, కేవల = ముఖ్యమైన, బ్రహ్మ = పరమాత్మయును, ఆత్మ = ప్రత్యగాత్మయును, ఐక్య = ఏకీభావము గలుగఁజేయునట్టి, విద్యామయయున్ = జ్ఞానస్వరూపిణియును, ఐన = పూర్వోక్తలక్షణములు గల, నన్నాశ్రయించి = నన్ననుసరించి, అద్వితీయ=స్వాతిరిక్తశూన్యుఁడైన, అపరోక్ష = ప్రత్యక్షమగు, బ్రహ్మచైతన్య = బ్రహ్మతత్త్వముయొక్క, సస్వరూపకుండు = స్వరూపమాత్రుఁడు, ఐన యీ యాత్మారామునియందున్=ఐనట్టి యీ పరబ్రహ్మమందు, ఆత్మాకారాకారిత = బ్రహ్మాకారముగాఁ జేయఁబడిన, వృత్తి=ధీవృత్తిని, గత=పొందిన, చిత్=జ్ఞానముయొక్క, ఆభాసకుండవు=ప్రతిభాసకుండవు - అనఁగా శుద్ధజీవుఁడవు, ఐన నీవు=ఐనట్టి నీవు, ప్రచండ=మిగుల వేడిమిగల, ఆతప=ఎండయొక్క, మధ్య=నడుమ, నిక్షిప్త=ఉంచఁబడిన, దీపకళికవిధంబునన్ = దీపపుమొగ్గవలె, జ్ఞాన=నేత్ర శ్రోత్రాది జ్ఞానేంద్రియములయొక్క, కర్మేంద్రియ=వాక్పాదాది కర్మేంద్రియములయొక్క, పవన=ప్రాణాది పంచవాయువులయొక్క, మనః=మానసము, వృత్తి = శబ్దస్పర్శాది వృత్తులయొక్క - అనఁగా వృత్తిజ్ఞానముయొక్క, విలయపూర్వకంబుగాన్ = లయమునందుఁ గలుగునట్లుగా, ఏకీభూతుండవై = ఏకస్వరూపుఁడవై, నివాతదీపంబుభంగిన్ — నివాత = గాలిలేని, దీపంబుభంగిన్ = దీపమువలె, నిస్తరంగ = అలలు లేని, సముద్రంబుపోలికన్ = కడలివలె, విగత = పోయిన, అశేష = సమస్తములైన, పర్ణ = ఆకులు గల, పాదపంబుచాడ్పునన్ = చెట్టువలె-అనఁగా స్థాణువువలె, నీల = నలుపు, పీత = పసుపు, ఆది = మొదలైన, వర్ణశూన్య = రంగులు లేని, గగనంబుకరణిన్= ఆకాశమువలెను, స్వప్న = కల, అజ్ఞాన = నిద్ర, పునరుత్థాన = మేలుకువ, విరహిత = లేని, సుషుప్తిరీతిన్ = దీర్ఘనిద్రవలెనే, నిశ్చలుఁడవు = చలనము లేనివాఁడవు, నిశ్శేషుండవు = ఇతరము లేనివాఁడవు, నిశ్శబ్దుండవు = పరమాకాశస్వరూపుఁడవు, నిర్వికల్ప = కల్పన లేని, నిరాకార = ఆకారము లేని, సుఖస్వరూపకుండవునై = బ్రహ్మానందస్వరూపుఁడవై, బాహ్యాభ్యంతరములు—బాహ్య = బహిర్దృశ్యములగు స్వేతరవస్తురూపనామములను, అభ్యంతరంబు = స్వగతభేదవస్తునామరూపములను, మఱచి = విస్మరించి - అనఁగా అంతర్దృశ్యము లగు కామాదిరూపములను బహిర్దృశ్యము లగు ఘటపటాది వస్తువులను మఱచినవాఁడవై, నిరుపమ = సాటిలేని, రాజయోగ = మనోన్మనీయోగమునందలి, తురీయ

సమాధిన్ = నిర్వికల్పనిష్ఠను, పొందుము = చెందుము; అని = ఇట్లని, ఉపదేశించి = బోధించి, పెండియున్ = మరల, ఇట్లనియెన్ = వక్ష్యమాణప్రకారముగా వచియించెను

తా. ఈప్రకారము కనుబొమలనడిమిత్రోవయందు హృదయాకాశ మొకటి యున్నది. అందు ఆకాశాదిపదిమండలంబులును ప్రకాశించుచుండుట కనఁబడును మఱియు చిణిచిణి మొదలగు పూర్వోక్త దశవిధప్రణవధ్వనులును చెప్పఁబోయెడు శివశక్తియుక్త మగు మన స్సనెడు జీవతత్త్వమును గోచరించునదై మహదాకాశమధ్యమందు అగుపడు మేఘములవలె యేపరమాత్మయందు కనుపించునో, అట్టి నాలుగుభూతము లగు భూజలాదులను వాటికార్యము లగు ఘటపటాదులను స్పృశింపని యాకాశము వలె హిరణ్మయమండలాదు లయిన అన్నిటిని యేపరమాత్మ అంట కుండునో, సూర్యాదులను ప్రకాశింపఁ జేయునట్లు విజ్ఞానస్వరూపుఁడై పైఁ జెప్పినవాని నన్నిటిని ప్రత్యేకముగా వివరించి తెలుసుకొనునో అట్టి పురుషుఁడే నాదబిందుకళలకంటె విశేషలక్షణములు గలవాఁడును, స్వయముగా ప్రకాశించువాఁడును, నిత్యుఁడును, నిర్మలుఁడును, సర్వమును తెలిసినవాఁడును, ప్రకృతిని అతిక్రమించినవాఁడును, అవిచ్ఛిన్నస్వరూపుఁడును, జ్ఞానానందస్వరూపియు నైన ప్రత్యగాత్మకంటెను వేఱుగాని యాత్మారాముఁడే పరమాత్మ యనఁబరగును, సత్త్వరజస్తమోగుణాతీత మగు అర్ధమాత్రాదిశబ్దంబులచే బరఁగెడు విజ్ఞానప్రకృతి స్వరూపమే ప్రధానముగాఁ గలదియును, (తురీయము, అర్ధమాత్రకము, ఉన్మని, విరజ యని శుద్ధసత్త్వమునకు నామాంతరములు) శ్రేష్ఠ మయిన ఇహపరలోకఫలానుభోగములయందు అభిలాష లేకుండుటయు, విజ్ఞానతన్మయత్వములే యాకారము గలదియు, అకార ఉకార మకారాత్మక మగు బిందుకళలే స్వరూపముగాఁ గలదియు (అకారము ఉకారముతో సంధి చేసిన గుణ మగు ఓకారము వచ్చుచున్నది, అట్టి ఓకారముతో మకారమును చేర్చిన ఓమ్ అను ప్రణవ మగుచున్నది) అనఁగా ప్రణవస్వరూపియును, పరమాత్మ ప్రత్యగాత్మలకు ఐక్యానుసంధానము గలుగఁజేసెడు జ్ఞానస్వరూపియును నయిన వస్త్వాశ్రయించి తనకంటె ఇతరము లేనట్టి ప్రత్యక్షబ్రహ్మైకత్వస్వరూప మయిన ఈ పరబ్రహ్మమునందు శుద్ధజీవుఁడ వయిన నీవు తీక్ష్ణ మయిన యెండయందు వుంచబడిన దీపపువెలుఁగువలె కర్మేంద్రియ జ్ఞానేంద్రియములకును, పంచవాయువులకును, మానసవృత్తి మొదలగు వృత్తులకును లయము కలుగునట్లుగా నేకస్వరూపుఁడవై గాలిలేనిదీపమువలె చలనము లేనివాఁడవును, అలలు లేని సముద్రమువలె చలనము లేనివాఁడును, ఆకులు లేని చెట్టువలె నిశ్చేష్టుఁడవును, వర్ణములులేనట్టి యాకాశమువలె ఆకారము లేని బ్రహ్మానందస్వరూపుఁడవును నై బహిరింద్రియదృశ్యము లగు తనకంటె నితరము లయిన వస్తువుల యొక్క రూపనామములను అంతరింద్రియములకు గోచర మగు కామక్రోధాదిరూపములను మఱి పొటిలేని రాజయోగమందలి నిర్వికల్పసమాధిని పొందు మని యుపదేశించి మఱియును నీక్రిందఁ జెప్పఁబోవురీతిని చెప్పుచున్నాఁ డని తాత్పర్యము.

ఆ. అట్టి పూర్ణసమాధి మనోనిలముల, చలన ముడుగక కాని గోచరము గాదు
అవియు బిందువు చాంచల్య మడఁగ కున్న, నిశ్చలంబులు గావు వినిశ్చితాత్మ.

టీక. వినిశ్చితాత్మ = నిశ్చయబుద్ధి గల యాంజనేయా, అట్టి పూర్ణసమాధి—అట్టి = పైనఁ జెప్పఁబడిన, పూర్ణ = అఖండ మైన, సమాధి = నిర్వికల్పనిష్ఠ, మనోనిలముల చలనము — మనః = మనస్సుయొక్క, అనిలముల = ప్రాణాదివాయువులయొక్క, చలనము = కదలిక, ఉడుగక కాని = అణఁగక కాని, గోచరము గాదు = కలుగదు అవియున్ = ఆ మనఃప్రాణముల చపలభావములు, బిందువు

చాంచల్యము—బిందువు = బుద్ధియొక్క, చాంచల్యము = చలనము, అడఁగకున్నన్ = ఉడుగకపోయిననేని, నిశ్చలంబులుగావు = కదలక యుండవు

తా. ఓయి యాంజనేయా! అట్టి నిర్వికల్పనిష్ఠ పొందవలె నన్న మనస్సును ప్రాణాపానాది వాయువులను చలించకుండునట్లు బంధించవలయును, అట్లు బంధించుట వలన మనఃప్రాణముల చలనమును బుద్ధిచాంచల్యమును యుడుగకపోయెనేని కానేరదని తాత్పర్యము.

హంసతత్త్వోపదేశము.

తే. అట్టి బిందువు చాంచల్య మడఁగ దెందు, హంసతత్త్వంబు నెఱుఁగక యట్లు గాన
దానివివరింతు విను మది గానఁబడిన, గాలి బిందువు మనమును గదల కుండు.

టీక. అట్టి = ముందు చెప్పినట్టి, బిందువుచాంచల్యము=బుద్ధిచలనము, హంసతత్త్వంబున్—హంస=ప్రకృతిపురుషాత్మక మగు హంసయొక్క, తత్త్వంబున్ = యథార్థస్వరూపమును, ఎఱుఁగక = తెలియక, ఎందున్ = ఏరోగమందయినను, అడఁగదు = నశింపదు అట్లుగానన్=అటుల నశింపదుగనుక, దానిన్ = ఆ హంసతత్త్వమును, వివరింతున్ = తెలిపెదను, వినుము = ఆలింపుము, అది గానఁబడినన్= ఆ హంసతత్త్వము తెలియఁబడెనేని, గాలి = ప్రాణవాయువును, బిందువు = బుద్ధియును, మనమును = మనస్సును, కదలకుండున్ = బహిర్ముఖము గాక యుండును.

తా. ఏలాటిరోగముచేత నైనను ప్రకృతిపురుషాత్మక మగు హంసయొక్క వాస్తవస్వరూపము తెలియనిదే బుద్ధిచలనము నశింపదు గనుక అట్టి హంసతత్త్వము దెలిసెనేని ప్రాణవాయువు, బుద్ధి, మనస్సు అనునవి కదలకుండును గనుక అట్టి హంసతత్త్వమును దెలిపెద విను మని తాత్పర్యము.

తే. కంజపుంజానుగత సౌఖ్యగతుల మెఱసి, యాతత బ్రహ్మసంస్థాన మగుచు లలిత
మానసానందకర మై సమత్వ మమర, సత్యరతి నొప్పు నీహంసచక్ర మనఘ.

టీక. అనఘ = ఆంజనేయా, ఈహంసచక్రము=ముందుఁజెప్పఁబోవు తొమ్మిది రేకులు గల హంస చక్రము, కంజపుంజ = పద్మసముదాయమును-అనఁగా షట్కమలములను, అనుగత=పొందుటచేఁ గలిగిన, సౌఖ్యగతులన్ = సుఖదశలచేత, మెఱసి = ప్రకాశించి, అతత = సర్వవ్యాప్త మైన, బ్రహ్మ = పరబ్రహ్మమే, సంస్థానము = నివాసముగాఁ గలది, అగుచున్ = ఐనదై, లలిత = ఒప్పిద మైన, మానస=మనస్సునకు, ఆనందకరమై = సంతోషము గలిగించునదియై, సమత్వము= అభేదము, అమరన్= ఒప్పఁగా, సత్యరతిన్ — సత్య = పరబ్రహ్మమునందు, రతిన్ = కూటమిచేత, ఒప్పున్ = శోభిల్లును

తా. పాపరహితుఁడ వగు ఓ ఆంజనేయా! ఆత్మ హకారసంజ్ఞ గలవాఁడు, పరమాత్మ శక్తికి సకారం బని పేరు, ఇట్టి హకార సకార విశిష్ట మగు (తాదాత్మ్యసంబంధముచే అనఁగా అపృథక్కృతే తానను అభేదస్ఫురణచే గూడియుండు) దానికే హంసస్వరూపుఁడని పేరు. ఈ హంసచక్రంబున సద్బుద్ధి, ఆఁకలి, నిద్ర యనువాటికి ఆధారము లయిన తొమ్మిదిరేకులును యెనిమిదిదిక్కులయం దున్నవి, అట్టి యీ హంసచక్రము షట్కమలములను పొందుటచేఁ గలిగిన సుఖదశలచే ప్రకాశించి అంతటను వ్యాపించియుండు పరబ్రహ్మమునందు నివసించి మనస్సునకు సానందమును గలుగఁజేయునదై పరబ్రహ్మముతో నైక్యమును పొంది ప్రకాశించు నని తాత్పర్యము.

ఆ. వినుము పాలు నీళ్లు విభజింప నేర్చిన, పరమహంస పగిదిఁ బ్రవిదితాద్య
పరమహంసుఁ డైన పరమహంసుఁ డసార,సారములను బంధఁజాలు ననఘ.

టీక అనఘ = ఆంజనేయా, వినుము = ఆలింపుము, పాలునీళ్లు = క్షీరనీరములను, విభజింపన్ = వేఱుచేయుటకు, నేర్చిన = తెలిసిన, వరరాజహంసపగిదిన్ = మరాళశ్రేష్ఠమువలె, ప్రగిగిన = లెస్సగాఁ దెలియఁబడిన, ఆద్య = ప్రపంచోత్పత్తిలయకారణ మైన, పరమ = సర్వోత్కృష్ట మైన, హంసుండు = పరబ్రహ్మస్వరూపము గలవాఁడు, ఐన పరమహంసుండు = ఐనట్టి బ్రహ్మవేత్త, అసారసారములన్ — అసార = నిస్సార మగు ప్రపంచమును, సారములన్ = ప్రపంచవిలక్షణ మయిన పరమాత్మను, పంపజాలున్ = విభజింప నేర్చును

తా॥ ఓయియాంజనేయా! పాలతోఁ గలిసిననీటిని పాలనుండి విభజింప నేర్చిన హంసశ్రేష్ఠము వలె ప్రపంచముయొక్క పుట్టుక నాశము మొదలగువాటికి కారణభూతుఁ డయిన పరబ్రహ్మస్వరూపము గలవాఁడు నిస్సార మయిన ప్రపంచమును ప్రపంచవిలక్షణుఁ డైన పరమాత్మనుండి విభజింపఁజాలునని తా.

తే॥ చటులసంసారదుఃఖనాశనకరంబు, హంసతత్త్వార్థవిజ్ఞాన మతిరహస్య
మట్లు గావునఁ జెప్పెద నవధరింపు, పరమభాగవతోత్తమభక్తవరద. ౧౬౫

టీక పరమభాగవతోత్తమ — పరమ = నిరతిశయు లయిన, భాగవత = భగవద్భక్తు లగు ప్రహ్లాదాదులలో, ఉత్తమ = శ్రేష్ఠుఁడ వైన, భక్తవరద — భక్త = బ్రహ్మనిష్ఠ నపేక్షించుశిష్యులకు, వరద = వస్తుతత్త్వజ్ఞానము నొసఁగు నాంజనేయా, అతిరహస్యము = మిగులగోప్య మయిన, హంసతత్త్వార్థవిజ్ఞానము — హంస = పరమాత్మస్వరూప మగు హంసయొక్క, తత్త్వ = యథార్థ మైన, అర్థ = శబ్దార్థముయొక్క, విజ్ఞానము = ఎఱుఁగుట, చటుల = భయంకర మయిన, సంసార = సంసృతివలని, దుఃఖ = వ్యథను, నాశనకరంబు = పోఁగొట్టునది, అట్లు గావునన్ = అటులఁ బోఁగొట్టునది గనుక, చెప్పెదన్ = బోధించెదను, అవధరింపుము = మనస్సున నిలుపుము.

తా॥ భగవద్భక్తులలో శ్రేష్ఠుఁడ వగు ఓయాంజనేయా! పరమాత్మస్వరూప మగు హంసయొక్క వాస్తవ మయిన శబ్దార్థమును యెవఁడు తెలిసికొనుచున్నాఁడో అట్టివాఁడు సంసారదుఃఖమునుండి తొలఁగింపఁబడుచున్నాఁడు గనుక అట్టి దుఃఖములను పోఁగొట్టెడు హంసతత్త్వార్థవిజ్ఞానమును నీకు యుపదేశించుచున్నాను విను మని తాత్పర్యము.

శరీరగతములగు నిడాపింగళాదులవివేచనము.

వ॥ మాతృపితృభుక్తాన్నసంభూతరక్తశుక్లబిందుజనితం బై త్వఙ్మాంసరుధిరమజ్జాస్థిస్నాయువు లను షట్కౌశికంబులు గలిగి యొప్పు నీస్థూలశరీరంబునందు డెబ్బదిరెండు వేలనాడులు గల వందు గుదంబునకంటె రెండంగుళంబులమీఁదట లింగంబునకంటె రెండంగుళంబులక్రిందట నధోముఖాగ్రం బై మూఁడుకోణంబులు దనర దేహమధ్యమస్థానంబున మూలాధారచక్రం బలరు నది మొదలు సహస్రారంబుతుదగాఁ బృష్ఠభాగంబున వీణాదండంబుభంగి సమస్తనాడికామూలకందం బై మూర్ధ్వచ్ఛిన్నవంశాభం బై షడాధారసమన్వితం బై యుండు దీర్ఘాస్థి బ్రహ్మదండి యనం బరఁగు నా బ్రహ్మదండిమూలాధారాగ్రకోణస్థ మై కుండలీనామపరాశక్తియుక్త మై ప్రాణాగ్నిబిందునాదనిలయ మై సావిత్రీసరస్వతీనామిక మై బ్రహ్మరంధ్రగత మై సుషుమ్నానాడిప్రవర్తిల్లు దద్వామదక్షిణపార్శ్వంబులయం దాధారంబు

మొదలుకొని నాసికాగ్రపర్యంతంబు వ్యాపించి నాడీచక్రసంభూతలై పితృయాన దేవయాన లనెడు సంజ్ఞకలై చంద్రసూర్యమండలంబులం బొంది యిడా పింగళ లను నాడులొప్పుచుండు నది నాభిమండలంబు నాశ్రయించి కుక్కు-టాండంబువిధంబున నాడీచక్రం బమరు నానాడిక లన్నాడీచక్రసముదితలట్లు గావున గాంధారి హస్తి జిహ్వ యను నాడులు నేత్రాంతవ్యాపినులు పూషాలం పూషానాడులు కర్ణద్వయానుగతులు శుక్లాఖ్యనాడి భ్రూమధ్యంబు నొందు ఘ్రాణరంధ్రయుగ్మంబు శ్రోత్రరంధ్రయుగ్మంబు భ్రూమధ్యంబు దిగువం గలసి యుండు నచ్చోటు శృంగాటకంబు చతుష్పథం బని విలసిల్లు గంగా యమునా సరస్వతులను పేళ్లు గల యిడా పింగళా సుషుమ్నలు గూడిన భ్రూమధ్యస్థానంబు త్రికూటం బనఁ ద్రివేణీసంగమం బనం దగు వాక్ప్రసారిణి యైన సరస్వతీనాడి జిహ్వాంతగామిని యగు విశ్వోదరీనాడి చతుర్విధాన్నంబుల భక్షించుఁ గంఠస్థ యైన పయస్వినీనాడి క్షుత్తృష్ణల నొదవించుచు జలపానం బాచరించి మఱియు నాడీచక్రసముద్భూత లైన మూఁడునాడు లధోముఖులై యుండు నందు రక్తాహ్వయనాడి శుక్లంబును సినీవాలీనాడి మూత్రంబును గుహూనాడి మలంబును బహిర్గతంబుగఁ జేయు శంఖినీ దామినీనాడులు భక్షితాన్నరసంబుల గ్రహించి కపాలకుహరంబు నొంది శిరంబున నమృతంబు గావించు నదియునుం గాక హృదయంబున నేకోత్తరశతనాడులు దనర్చు నం దొక్క-నాడి యూర్ధ్వగామిని యగు నన్నాడి మార్గంబు మోక్షమార్గం బని వేదాంతంబులు పలుకు నిట్లు వివరించి చెప్పిన వెల్ల ముఖ్యనాడులు వీనిలో నిడా పింగళా సుషుమ్నలు శ్రేష్ఠనాడు లందు బ్రహ్మనాడి సకలనాడికాశిరోమణి యగు నిత్తెఱంగునం దిర్యగూర్ధ్వాధఃప్రసృతలై పరమసుషిరప్రధాన లైన ద్విసప్తతిసహస్రనాడులయందుఁ జలన ధావన కంప నాకుంచన శోషణ ధర్మకంబు లైన దశవిధప్రాణంబులు మెలంగు నందు హృదయస్థానంబున వసియించి ప్రాణుం డిడాపింగళాఖ్యనాడికారంధ్రద్వయంబువలన నుచ్ఛ్వాసరూపంబుచేత బాహ్యంబునకు నిర్గమించి ద్వాదశాంగుళపర్యంతం బరుదెంచి యచ్చట నడంగు గుదస్థానంబునందుండి యపానుండు నిశ్శ్వాసరూపంబుచేతఁ బ్రాణునకు నధోముఖంబుగా నెదురునడుచుచు నధోముఖనాడీత్రితయంబువలన మలమూత్రశుక్లంబుల వెడలించుచుండుఁ గంఠదేశంబున వసంచి యుదానుండు మనంబునందలి సంకల్పవికల్పంబుల జిహ్వాద్యష్టస్థానంబులవలన శబ్దరూపంబుగాఁ బలికించును సుషుప్త్యవసరంబున సకలేంద్రియంబుల సంగ్రహించి యుపశమింపఁ జేయుచుఁ బ్రబోధసమయంబున వానినెల్ల నెప్పటిచోట్ల నుంచుచు మఱియు లోకాంతరగమనాగమనంబుల సమర్థుండై యొప్పుచు నగ్నిష్టోమమయుం

యై సుషుమ్నారంధ్రంబు నాశ్రయించి బ్రహ్మరంధ్రంబున కుద్గమించుచుండు సర్వశరీరంబున వ్యాపించి వ్యానుండు బాహ్యశీతోష్ణంబుల నభ్యంతరంబునకు నాంతరశీతోష్ణంబుల బాహ్యంబున కిచ్చుచు భక్షితాన్నరసంబు నంగాటఁ బ్రసరింపఁజేయుచుండు నాభిస్థానస్థితుఁ డగు సమానుండు జఠరానలంబుఁ బ్రజ్వలింపఁజేసి ప్రాణ్యుపభుక్తచతుర్విధాన్నంబులం బచనంబు చేసి యెల్లనాడులకుం బంచిపెట్టు నాగుఁ డుద్గారంబుఁ గూర్ముం డున్మీలనంబుఁ గృకరుండు క్షుతంబు దేవదత్తుఁ డు విజృంభణంబు సర్వవ్యాపి యైన ధనంజయుండు మృతంబైన పిదప దేహస్థౌల్యంబుఁ బుట్టించుచుండు నిటుల దశవాయువులతోఁగూడి యాదశేంద్రియాన్వితంబై కామరాగద్వేషాది వికారసహితంబై విషయసుఖగ్రహణంబుకొఱకు నధోముఖంబై శ్రవణేంద్రియంబువలన ద్వివిధశబ్దంబులఁ ద్వగింద్రియంబువలనఁ బంచవిధస్పర్శంబుల నేత్రేంద్రియంబువలన షడ్వర్ణంబుల జిహ్వేంద్రియంబువలన షడ్విధరసంబుల ఘ్రాణేంద్రియంబువలనఁ ద్రివిధగంధంబుల ననుభవించుచు మఱియు వాక్పాణిపాదపాయూపస్థలతోడం గూడి వచనాదానగమనవిసర్గానందకర్మంబుల నొనర్చుచు మనంబు ప్రవర్తించుచుండు నమ్మనంబుఁ గరణంబుగాఁ గైకొని తత్పవనమనోగ్రస్థితయుఁ గర్తృత్వభోక్తృత్వాదిధర్మసమేతయు నైనబుద్ధి [illegible] బిందువనం బరఁగు నది సర్వకార్యకారణాశ్రయయు నిఖిలవాసనావాసితయు నగుంగావున నమ్మానసమారుతేంద్రియశరీరంబులతోఁ గూడి విషయాభిముఖ యై తచ్చాంచల్యంబువలనఁ దానుం జలించుచు బహిరంతర్విషయానుభవంబు చేయుచు సుషుప్తియం దజ్ఞానాకారం బగుచు జాగ్రత్స్వప్నంబులయందు బుద్ధ్యాద్యాకారంబై తోఁచుచు ననాదికాలంబుననుండి ముక్తిపర్యంతం బనంతకర్మంబు లాచరించుచు దత్ఫలంబు లగు సుఖదుఃఖంబుల భుజించుచు నవిచారరూపిణి యై నిరంతరపర్యటనశీలయై యుండు మఱియును.

టీక. మాతృపితృ = తల్లిదండ్రులచేత, భుక్త = భుజింపఁబడిన, అన్నసంభూత = అన్నమువలన నుద్భవించిన, రక్త = రుధిరముయొక్క, శుక్ల = రేతస్సుయొక్క, బిందు = బిందువులచేత, జనితంబైన = పుట్టినదై, త్వక్ = చర్మము, మాంస = పలలము, రుధిర = రక్తము, మజ్జ = క్రొవ్వు, అస్థి = ఎముకలు, స్నాయువులు = నరములు, అనుషట్కోశకంబులు గలిగి = అనేకములగు షట్కోశములు గలదై, ఒప్పు నీస్థూలశరీరంబునందుఁ = తేజరిల్లెడు నీస్థూలదేహమందు, డెబ్బదిరెండువేల నాడులు గలవు = ద్విసప్తతిసహస్రసంఖ్య గల నరములు గలవు, అందుఁ = ఆ డెబ్బదిరెండువేలనాడులయందు, గుదంబునకంటెఁ = పాయువుకంటె, రెండంగుళంబులు మీఁదటఁ = అంగుళద్వయమునకు పైప్రదేశమందు, లింగంబునకంటెఁ = మేహనముకంటె, రెండంగుళములక్రిందటఁ = అంగుళద్వయమునకు క్రిందిప్రదేశమందు, అధోముఖాగ్రంబై = క్రిందివైపుగ నుండెడి అగ్రకోణము గలదై, మూఁడుకోణంబులు తనరఁ = మూఁడుమూలలొప్పఁగా, దేహమధ్యమస్థానంబునఁ = శరీరమధ్యప్రదేశమందు.

అనఁగా గుదస్థానమందు, మూలాధారచక్రంబు = మూలాధారచక్రము, అలరుచోన్ = శోభిల్లుచు, అది మొదలుకొని = ఆ మూలాధారచక్రము మొదలుకొని, సహస్రారంబుతుదగాన్ = సహస్రారచక్రపర్యంతము, పృష్ఠభాగంబునన్ = వీఁపుప్రక్కను, వీణాదండంబుభంగిన్ = ప్రకాశించుచుండి, సమస్తనాడికామూలకందంబై = సకలనాడులకు మూలగుంపయ్యి, మూల = క్రిందను, ఊర్ధ్వ = మీఁదను, నిస్సృత = వెడలఁబడిన, వంశాభంబై = వెదురువలెనున్నదై, షడాధార = షట్చక్రములతోడ, సమన్వితంబై = కూడినదై, అంగుళిగాసై = ఆఱుగంగుళముల పెద్దదియుచున్న, బ్రహ్మదండి యనంబరఁగున్ = బ్రహ్మదండి యని చెప్పంబడును, ఆ బ్రహ్మదండి = ఆ వెన్నెముకయొక్క, మూల = మొదటనున్న, ఆధార = మూలాధారచక్రముయొక్క, అగ్రకోణ = ప్రధానకోణమందు - అనఁగా గుహ్యకోణమందు, స్థమై = ఉన్నదై, కుండలీనామ = కుండలి యను పేరు గల - అనఁగా కుండలీశక్తి వుర గాంగనాకృతిగా, అధోకుండలి యైన మూలాధారమందు శిరస్సును, ఊర్ధ్వకుండలి యైన బ్రహ్మరంధ్రమందు పుచ్ఛమును వుండులునైనను, ఇది స్వాధిష్ఠానాదుల నూర్ధ్వకుండలియందు శిరస్సును, అధోకుండలియందు పుచ్ఛమును గలదై యుండును, ఇది సుషుమ్నానాళమధ్యభాగమందు తామరతూఁడులోని నూలువలె అతిసూక్ష్మమై యుండును లలితాసహస్రనామములయందు పరాశక్తి ‘కుండలినీ బిసతంతునిభాకృతిః’ అని యున్నది పరాశక్తియుక్తయై = పరాశక్తితోఁ గూడినదై - అనఁగా ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి ఆదిశక్తి పరాశక్తి అను పంచశక్తులు పరమాత్మస్వరూపులైన బ్రహ్మ విష్ణు రుద్రేశ్వర సదాశివు లను పంచకర్తలయందు పంచాగ్నిశక్తిస్వరూపముగా చిచ్ఛక్తియే యున్నది, ప్రాణ = ప్రాణవాయువునకు, అగ్ని = జఠరాగ్నికి, బింగు = బుద్ధికి, నాద = ప్రణవనాదమునకు, నిలయమై = స్థానమై, సావిత్రీసరస్వతీనామికయై = సావిత్రీ సరస్వతి యను పేర్లు గలదై, బ్రహ్మరంధ్రగతయై = దహరము పొందినదై, సుషుమ్నానాడి = బ్రహ్మనాడి, ప్రవర్తిలున్ = శోభిల్లును, తద్వామదక్షిణపార్శ్వంబులయందున్ = ఆ సుషుమ్నయొక్క యెడమకుడిప్రక్కలయందు, ఆధారంబు మొదలుకొని = ఆధారచక్రము మొదలుకొని, నాసికాగ్రపర్యంతంబు = ముక్కుచివరవఱకు, వ్యాపించి = ప్రసరించి, నాడీచక్రసంయుక్తలై = నాడీచక్రముతోఁ జేరినవై, పితృయాన దేవయాన లనెడు సంజ్ఞకలై = పితృయానము దేవయానము అనెడు సంజ్ఞలు గలవై, పితృయాన దేవయానములనఁగా, ‘శ్లో॥ ఇడా చ వామ నిశ్వాసా సోమమండలగోచరా। పితృయానమితి జ్ఞేయా వామమాశ్రిత్య తిష్ఠతి’ తా॥ ఇడానాడి యను యెడమముక్కులోని యూపిరి నిశ్వాసరూపముగా చంద్రమండలము నాశ్రయించి మూలాధారాదిగా బ్రహ్మరంధ్రపర్యంతమై యుండును; ఆనాడి పితృయానమనియు, పునరావృత్తికి అనుకూలమనియు, ధూమమార్గమనియు యెఱుంగఁదగినది, ‘శ్లో॥ దక్షిణే పింగళానాడీ వహ్నిమండలగోచరా। దేవయానమితి జ్ఞేయం పుణ్యకర్మానుసారిణీ’ తా॥ దేహదక్షిణభాగమందు అగ్నిమండలగోచరమై పుణ్యకర్మానుసారిణియై యుండునది పింగళానాడి యనఁబడును, అది దేవయానమనియు, పునరావృత్తిరహితమనియు తెలియఁదగినది చంద్రసూర్యమండలంబులం బొంగి = చంద్రమండల సూర్యమండలములను పొత్తి, ఇడాపింగళ లను నాడులొప్పుచుండున్ = ఇడ పింగళ లనెడు నాళములు ప్రకాశించుచుండును, నాభిమండలంబు నాశ్రయించి = పొక్కిలి ననుసరించి, కుక్కుటాండంబువిధంబునన్ = కోడిగ్రుడ్డువలె, నాడీచక్రంబమరున్ = నాడీచక్ర మొప్పుచుండును, ఆనాడికలన్ = పూర్వమందుఁ జెప్పఁబడిన ఇడాపింగళాసుషుమ్నా నాడులు, అన్నాడీచక్రసముదితలు = పైనఁ జెప్పఁబడిన నాడీచక్రమం దుద్భవించినవి, అట్లుగావునన్ = అప్రకార ముద్భవించినవి కావున, గాంధారి = గాంధారి, హస్తిజిహ్వ = హస్తిజిహ్వ, అనునాడులు = అనెడినాడికలు, నేత్రాంతవ్యాపినులు = కన్నులచివరవఱకు వ్యాపించునవి, పూషాలంబుసా నాడులు =

పూష అలంబూష అను నాడికలు, కర్ణద్వయానుగతులు = రెండుచెవులను పొంది యుండునవి, శుక్లాఖ్య నాడి = శుక్ల యను పేరు గలనాడి, భ్రూమధ్యంబునొందుచు = కనుబొమలనడిమి నొందగ నుండును, ఘ్రాణరంధ్రయుగ్మంబు = ముక్కుద్వారములు రెండును, శ్రోత్రరంధ్రయుగ్మంబు = చెవిరంధ్రములు రెండును, భ్రూమధ్యంబుదిగువకు = బొమలక్రిందను, కలిసియుండుచు = చేరియుండును, అచ్చోటు= ఆ చేరియుండుస్థలము, శృంగాటకంబు = శృంగాటకము, చతుష్పదంబు = చతుష్పథము, అనఁగ = అనునట్లు, విలసిల్లుచు = శోభిల్లును, గంగాయమునాసరస్వతులు = గంగానది యమునానది సరస్వతీ నది, అనుపేళ్లు = అనెడునామములు, కల యిడాపింగళాసుషుమ్నలు=కలిగిన యిడాపింగళాసుషుమ్నలను నాడులు, కూడిన భ్రూమధ్యస్థానంబులు = చేరిన బొమలనడిమిచోటు, త్రికూటం బనఁగ = త్రికూటమని, త్రివేణీసంగమం బనఁగ = త్రివేణీసంగమ మని, తగుచు=చెప్పందగును, వాక్ప్రసారిణి = నోటియందు వ్యాపించి యున్నది, ఐన సరస్వతీనాడి=ఇట్టి సరస్వతి యనునాడి, జిహ్వాంతగామిని యగుచు= నాలుకతుదదాక వ్యాపించిన దగును, విశ్వోదరీనాడి=విశ్వోదరి యను పేరు గల నాడి, చతుర్విధాన్నంబులకు = చతుర్విధ భోజ్య లేహ్య చోష్య పానీయము లని నాలుగువిధములైన, అన్నంబులకు = ఓగిరములను, భక్షించుచు=భుజించును, కంఠస్థ = మెడయందుండునది, పయస్వినీ నాడి = ఐనట్టి పయస్విని యను పేరు గల నాడి, క్షుత్తృష్ణలకు = ఆకలిదప్పులను, ఒదవించుచు=కలుగఁజేయుచు, జలపానం బాచరించుచు = నీరుద్రావును, మఱియును = వెండియు, నాడీచక్రసముద్భూతలు = నాడీచక్రమం దుదయించినవి, ఐన మూఁడునాడులు=ఐన త్రినాడికలు, అధోముఖులై యుండుచు = క్రిందిప్రక్కకు ప్రసరించినవై యుండును, అందుచు = వానియందు, రాకాహ్వయనాడి = రాకాఖ్యయను నాడి, శుక్లంబుకు = రేతస్సును, సినీవాలీనాడి= సినీవాలి యను నాడి, మూత్రంబుకు = ప్రస్రావమును, కుహూనాడి = కుహూ యనెడినాడి, మలంబుకు = శకృత్తును, బహిర్గతంబుగఁజేయుచు = వెలిపలికి త్రోయును, శంఖినీదామినీనాడులు = శంఖినీ దామిని యను నరములు, భక్షితాన్నరసంబులకు= భక్షిత = భుజింపఁబడిన, అన్న = చతుర్విధాన్నములయొక్క, రసంబుకు = సారములను, గ్రహించి= సంగ్రహించి, కపాలకుహరంబుకు — కపాల = తలపుర్రెయొక్క, కుహరంబుకు = రంధ్రమును, ఒంది = చేరి - అనఁగా బ్రహ్మరంధ్రమునఁ జేరి, శిరంబునకు = తలయందు, అమృతంబుకు = సుధను, స్రావించుచు = కలిగించును, అదియునుం గాక = అదే కాక, హృదయంబునకు=అనాహతచక్రమందు, ఏకోత్తరశత నాడులు = నూటొక్కనాడులు, తనర్చుచు = ప్రకాశించును, అందుచు = ఆ నూటొక్క నాడులయందు, ఒక్కనాడి=ఒక్కటియైన యమృతనాడి, ఊర్ధ్వ = ఊర్ధ్వమగు చిదాకాశమును, గామినియగుచు = పొందునట్టి దగును, అన్నాడీమార్గంబు=ఆ యమృతనాడీపథము, మోక్షమార్గం బని= కైవల్యమార్గ మని, వేదాంతంబులు పలుకుచు = (శ్రు॥ శతం చైకా చ హృదయస్య నాడ్యః తాసాం మూర్ధాన మభినిస్సృతైకా తయోర్ధ్వ మాయ న్నమృతత్వ మేతి, తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః' అని యుపనిషద్వాక్యములు వక్కాణించును-అనఁగా ప్రాణసంయమనము చేయువారికి ఇడాపింగళ సుషుమ్నలెట్లు ప్రధానములో అట్లు మనస్సంయమనము చేయువారికి అమృతనాడి ప్రధాన మయినది ప్రాణసంయమనము చేయుటకే మనస్సంయమము చేయుట సుకరముగాగు సుషుమ్నానాడీమార్గము తపోమార్గ మనియు అమృతనాడిపథము మోక్షమార్గమనియు బ్రహ్మవిదులు పలుకుదురు ఇట్లు వివరించి చెప్పినవెల్లను = ఇవ్విధముగా విశదపఱచి వాక్రుచ్చిన వన్నియు, ముఖ్యనాడులు = ప్రధానములైన నాడికలు, వీనిలోను = ఈ చెప్పిన నాడికలలోపల, ఇడాపింగళాసుషుమ్నలు = ఇడా పింగళా సుషుమ్న లను నాడులు, శ్రేష్ఠనాడులు = ఉత్తమనాడులు, అందుచు = ఆ మూఁడునాడులయందును, బ్రహ్మనాడి =

అధిష్ఠానదేవతచేఁ బ్రేరేపింపఁబడి అధోముఖముగఁ దిరుగుచు, అధోముఖసంచారము గల కుహూనాడివలన మలమును, సినీవాలినాడివలన మూత్రమును, రక్తాహ్వయనాడివలన శుక్లమును, విసర్జనము చేయుచుండు నని భావము, ఉదానుండు = ఉదానవాయువు - అనఁగా 'భాషణాది సామర్థ్యజనకా గూర్ధ్వ మనంత చేసే త్యుదానః' అని వ్యుత్పత్తి, మాటలాడుట మొదలయిన సామర్థ్యము గలుగఁజేయుటవలన యూర్ధ్వప్రదేశంబున దీనిచే బ్రతుకుదురు, లేక 'ఉత్ - ఊర్ధ్వమానయతి శబ్దాదీనితి ఉదానః' శబ్దాదులు నూర్ధ్వమునకు దెచ్చునట్టి దని యర్థము, అట్టి యుదానవాయువు, కంఠదేశంబునన్ = కంఠస్థానమందు, వసియించి = ఉండి, ॥ని॥ 'ఉదానః కంఠదేశస్థో' అని అమరము, మనంబునందలి సంకల్పవికల్పంబులన్ = యుల్లమందుఁ బుట్టు సంకల్పవికల్పములను, జిహ్వాద్యష్టస్థానంబులవలనన్ = నాలుక మొదలగు యెనిమిది తావులనుండి - అష్టస్థానము లనఁగా కొండనాలుక, దవడలు, కంఠము, శిరస్సు, దంతములు, పెదవులు, నాసిక, మిశ్రము లనునవి అష్టస్థానములు, (వినియందు) శబ్దరూపంబుగాన్ = పంచాశద్వర్ణాత్మకరూపముగా, పలికించుచు = వ్యక్తముజేయుచు, సుషుప్త్యవసరంబునన్ = గాఢనిద్రాసమయమందు, సకలేంద్రియంబులన్ = చతుర్దశేంద్రియములను, సంగ్రహించి=స్వాధీనపఱచుకొని, ఉపశమింపఁజేయుచున్ = ఉపసంహరించుచు, ప్రబోధసమయంబునన్ = జాగ్రదవస్థయందు, వానినెల్లన్=పూర్వ ముపసంహరింపఁబడిన యింద్రియముల నన్నిటిని, ఎప్పటిచోట్లనుంచుచున్ = ఆయా యింద్రియగోళములయందు నిల్పుచు, మృతికాలంబునన్ = చెందినయు, లోకాంతరగమనాగమనంబులన్ = స్వర్గాదిలోకములకుఁ బోవుటకు వచ్చుటకు, సమగ్రుండై = నేర్పరియై, ఒప్పుచున్=తగి, అగ్నిష్టోమసముండై = అగ్నిమండల చంద్రమండల స్వరూపుండై, సుషుమ్నారంధ్రంబునన్ = సుషుమ్నానాళద్వారమును, ఆశ్రయించి = పొంది, బ్రహ్మరంధ్రంబునన్ = సహస్రారమునకు, ఉద్గమించుచుండున్ = పోవుచుండును - అనఁగా ఉదానవాయువు కంఠమందు వసించి అజుఁడనెడి అధిష్ఠానదేవతచేఁ బ్రేరేపింపఁబడి మనస్సునందలి సంకల్పవికల్పములను జిహ్వాద్యష్టస్థానములయందు ధ్వనిరూపముగ పలికించుచు, సుషుప్త్యవస్థయందు సకలేంద్రియంబుల నుపహరించి లయకారణ మయిన అజ్ఞానమునందు లయించుచు, జాగ్రదవస్థయందు ఆయా గోళములయందు యింద్రియముల నెప్పటియట్ల నిల్పుచు, మృత్యుకాలమందు సర్వేంద్రియముల గ్రహించి లోకాంతరంబునకుఁ బోవ మరల సమగ్రత కలిగి తేజోరూపమై సుషుమ్నానాళద్వారము నాశ్రయించి సహస్రారమునకు నుద్గమించుచుండు నని భావము. వ్యానుండు = 'వినయతీతి వ్యానః' శరీరమం దంతట నుండునది యని యర్థము, అట్టి వ్యానవాయువు, సర్వశరీరంబునన్ = శరీర మాద్యంతమును, వ్యాపించి=ప్రసరించి, ॥ని॥ 'వ్యాన స్సర్వ శరీరగః' అని అమరము, బాహ్యశీతోష్ణంబులన్ - బాహ్య = వెలుపలి, శీత = చల్లఁదనమును, ఉష్ణంబులన్ = వేడిమిని, అభ్యంతరంబునకున్ = లోపలికిని, అంతరశీతోష్ణంబులన్ = లోపలి వేఁడిమిని చల్లఁదనమును, బాహ్యంబునకున్ = వెలుపలికి, ఇచ్చుచున్ = ఒసఁగుచు, భక్షితాన్నరసంబున్ = భుజింపఁబడిన యన్నసారమును, అంతటన్ = దేహమం దంతట, ప్రసరింపఁజేయుచుండున్ = వ్యాపింపఁజేయుచుండును - అనఁగా వ్యానవాయువు శరీర మంతట ప్రసరించి విశ్వయోని యను నధిష్ఠానదేవతచే ప్రేరింపఁబడి బాహ్యశీతోష్ణముల నాంతరములకు అంతరశీతోష్ణములను బాహ్యమునకు తోపించుచు భక్షితాన్నసారంబు శరీర మాద్యంతము వ్యాపింపఁజేయుచుండు నని భావము, నాభిస్థానస్థితుండగు సమానుండు = బొడ్డు నెలవుగాఁ గల సమానవాయువు, ॥ని॥ 'సమానో నాభి సంస్థితః' అని అమరము. జఠరానలంబున్ = జఠరాగ్నిని, ప్రజ్వలింపఁజేసి = మండఁగఁజేసి, ప్రాణి = జీవునిచేత, ఉపభుక్త = భుజింపఁబడిన, చతుర్విధాన్నంబులన్ = భోజ్య లేహ్య చోష్య పానీయము లను చతుర్విధాహారములను, పచనంబు చేసి= పాకము చేసి, ఎల్ల నాడులకున్ = సమస్తనాడికలకు, అనఁగా డెబ్బది రెండువేల నాడులకు, పంచి పెట్టుచు = విభాగించియిచ్చుచు-

అనఁగా సమానవాయువు నాభిప్రదేశమందు వసించి జయుఁడను అధిష్ఠానదేవతచేఁ బ్రేరేపింపఁబడి జఠరాగ్నిని ప్రజ్వలింపఁజేసి సర్వప్రాణులచే భుజింపఁబడు చతుర్విధాన్నములను ఆ జఠరాగ్నితోఁ గూడి పచనముచేసి సకలనాడులకు భాగించి పెట్టును అని భావము. నాఁగు ఉద్గారంబున — నాగుఁడు = నాగవాయువు, ఉద్గారంబున = వాంతియును, కూర్ముఁడు = కూర్మవాయువు, ఉన్మీలనంబున = కంటిఱెప్పలఁ దెఱపించుటను మూయించుటను, కృకరుఁడు = కృకరవాయువు, క్షుతంబు = తుమ్మును, దేవదత్తుఁడు = దేవదత్తవాయువు, విజృంభణము = ఆవలింతను, సర్వవ్యాపి యైన ధనంజయుండు = శరీరమాద్యంతము వ్యాపించి యున్న ధనంజయవాయువు, మృతం బైనన్ = చచ్చినను, విడవక = శరీరమును వదలక, దేహస్థౌల్యంబున్ = శరీరమునకు బలువును, ఘటించుచుండున్ = కలుగఁజేయుచుండును, ॥ని॥ 'వాద్గారే నాగ ఆఖ్యాతః కూర్మ ఉన్మీలనే స్మృతః । కృకరాచ్చ క్షుతం జ్ఞేయం దేవదత్తో విజృంభణమ్॥ నజహాతి మృతంవాపి సర్వవ్యాపీ ధనంజయః' అని అమరశేషము, 'శ్లో॥ ఇంద్రనీలః ప్రాణవాయురపానో హరితస్తథా। ఉదానశ్చ తటిద్వర్ణః వ్యానో గోక్షీరవర్ణకః। నీలవర్ణః సమానశ్చ పీతవర్ణశ్చ నాగకః। కూర్మవాయుః శ్వేతవర్ణో వ్యాంగనః కృకరస్తథా। దేవదత్తః స్ఫాటికశ్చ ఇంద్రనీలో ధనంజయః' ఇవి దశవాయువుల వర్ణములు, ఉపవాయువు లైదు పంచవాయువులకు నంతర్భూతములు గాన వానిస్థానములును అధిష్ఠానదేవతలును వీనికి స్థానాధిష్ఠానదేవతలని యెఱుఁగఁదగినది, ఇట్లున్ = ఇట్లు, దశవాయువులతోన్ = ప్రాణాది దశవాయువులతో, కూడి = చేరి, దశేంద్రియాన్వితంబై = జ్ఞానేంద్రియ కర్మేంద్రియములతోఁ జేరినదై, కామరాగద్వేషాదివికార = కామము రాగము ద్వేషము మొదలైన షోడశవికారములతో, సహితంబై = కూడినదై, సమగ్ర = శబ్దస్పర్శాదులను గలిగినదై, సుఖ = ఆనందము యుక్తంబై, గ్రహణంబుగొనరున్ = అనుభవము నిమిత్తము — అనఁగా విషయానందము ననుభవించుటకు, ప్రపంచముఖంబై = ప్రపంచవృత్తి గలదై, శ్రవణేంద్రియంబువలనన్ = శ్రోత్రేంద్రియమువలన — అనఁగా యెల్లశబ్దములు దేనిచే వినఁబడు చున్నవో అది శ్రోత్రేంద్రియము, అది కర్ణరంధ్రావచ్ఛిన్న నభఃప్రదేశము ననుసరించి యున్నది; అదియే శ్రోత్రేంద్రియ మనిన, సుప్త మృత మూర్ఛిత శరీరములయందుండు నభోదేశముచేత శబ్దములన్నియు వినఁబడవలయును, అట్లు వినఁబడవు గాన ఆ నభోదేశవ్యతిరిక్తమై శబ్దగ్రహణశక్తి గలిగి అతిసూక్ష్మమై ఒకవస్తువు ఆ నభోదేశము నాశ్రయించి యున్నది; అదియే శ్రోత్రేంద్రియము, దాని కధిష్ఠానదేవత దిక్కు, దానిచే బ్రేరేపింపఁబడిన శ్రోత్రేంద్రియమువలన, ద్వివిధశబ్దంబులన్ = రెండు విధములయిన శబ్దములను — అనఁగా ధ్వనిగుణకమని, అక్షరగుణకమని శబ్దములు రెండువిధములు, వానిలో వాద్యము లాదిగాఁ గలవానివలనఁ బుట్టిన శబ్దములు ధ్వనిగుణకములు, వేదశాస్త్రపురాణేతిహాసములు వర్ణగుణకములు, ఈ ద్వివిధశబ్దములను, త్వగింద్రియంబువలనన్ = స్పర్శములన్నియు దేనిచే గ్రహింపఁబడుచున్నవో అది త్వగింద్రియము, అది చర్మము నాశ్రయించియున్నది, అదియే త్వగింద్రియ మనిన సుప్త మృత మూర్ఛితశరీరములయందుండు చర్మముచే స్పర్శము లన్నియు గ్రహింపవలయును, అట్లు గ్రహింపఁబడవు గనుక ఆ చర్మముకంటె వేఱై స్పర్శగ్రహణశక్తి గలిగి అతిసూక్ష్మమై ఒకవస్తువు ఆ చర్మమును నాశ్రయించి యున్నది, దాని కధిష్ఠానదేవత వాయువు, దానిచేఁ బ్రేరేపింపఁబడిన త్వగింద్రియమువలన, పంచవిధస్పర్శంబులన్ = మృదు కఠిన శీత ఉష్ణ మిశ్రమము లని యైదువిధము లైన స్పర్శములను, నేత్రేంద్రియముగలనన్ = రూపగ్రహణము గలది నేత్రేంద్రియము, అది నల్లగ్రుడ్డు నాశ్రయించియున్నది, అదే నేత్రేంద్రియ మనిన సుప్త మృత మూర్ఛిత శరీరములయందుండు నల్లగ్రుడ్డుచే రూపములు గ్రహింపఁబడవలయును, అట్లు లేదు గాన నల్లగ్రుడ్డునకు వేఱై రూపగ్రహణశక్తి గలిగి అతిసూక్ష్మమై ఒకటి ఆ నల్లగ్రుడ్డు నంటియున్నది, అది నేత్రేంద్రియము, దానికి సూర్యుఁ డధిష్ఠాన

దేవత, దానిచేత ప్రేరేపింపఁబడిన చక్షురింద్రియమువలన, షడ్వర్ణంబుల = రక్త శ్వేత నీల పీత హరిత మిశ్రము లని ఆఱువిధము లగు వర్ణములను-అనఁగా షడ్విధవర్ణ సహితరూపములను, జిహ్వేంద్రియంబువలనన్ = రసనేంద్రియమువలన-అనఁగా రసముల నెల్ల గ్రహించునది రసనేంద్రియము, అది నాలుకకొనను ఆశ్రయించి యున్నది, అదియే రసనేంద్రియ మనిన సుప్తమృతమూర్ఛితశరీరముల యందలి జిహ్వచే రసము లెల్ల గ్రహింపఁబడవలయును, అట్లు లేదు గాన ఆకొన నాలుకకు వేఱై రసగ్రహణశక్తి గలిగి సూక్ష్మమై యొక్కటి నాలుక నాశ్రయించి యున్నది, దానికి రసనేంద్రియ మని పేరు, వరుణుఁడధిష్ఠానదేవత, దానిచే ప్రేరింపఁబడిన రసనేంద్రియమువలన, షడ్విధరసంబులన్ = ఉప్పు పులుసు తీపు కారము చేదు వగరు అని ఆఱువిధము లైన రసములను, ఘ్రాణేంద్రియమువలనన్ = గంధముల నన్నిటిని గ్రహించునది ఘ్రాణేంద్రియము, అది నాసికాగ్రము నాశ్రయించి యున్నది, అదే ఘ్రాణేంద్రియ మనిన సుప్తమృతమూర్ఛితశరీరములయం దుండు నాసికాగ్రముచే గంధము లన్ని గ్రహింపఁబడవలయును, అట్లు లేదు గనుక నాసికాగ్రవ్యతిరిక్తమై గంధగ్రహణశక్తి గలిగి అతిసూక్ష్మమై యొక్కటి నాసికాగ్రము నాశ్రయించి యున్నది, అది ఘ్రాణేంద్రియ మనఁబడును, దాని కధిష్ఠానదేవత లశ్వినులు, వారిచేఁ బ్రేరింపఁబడిన ఘ్రాణేంద్రియమువలన, త్రివిధగంధంబులన్ = సుగంధ దుర్గంధ మిశ్రగంధములను, ఆఘ్రాణింపుచున్ = ఆఘ్రాణించుచును, వెండియున్ = మఱియును, వాక్ = వాగింద్రియమును, పాణి = హస్తేంద్రియము, పాద = పాదేంద్రియము, పాయు = పాయురింద్రియము, ఉపస్థ = ఉపస్థేంద్రియము, (వీనితోడ) గూడి = చేరి, వచన = సుశబ్దాపశబ్దరూపభాషణములను - అనఁగా సుశబ్దాపశబ్దరూపభాషణముల నుచ్చరించునది వాగింద్రియము, అదే వాగింద్రియ మనిన సుప్తమృతమూర్ఛితశరీరములయందలి వాగింద్రియముచే సుశబ్దాపశబ్దరూపభాషణముల నుచ్చరింపఁబడవలయును అట్లు లేదు గనుక ఆ వాగింద్రియమునకంటె వ్యతిరిక్తమై వచనగ్రహణశక్తి గలిగి సూక్ష్మమై యొకటి దాని నాశ్రయించి యున్నది, దానికి వాగింద్రియ మని పేరు, దాని కధిష్ఠానదేవత అగ్ని, దానిచేత ప్రేరింపఁబడిన వాగింద్రియము శబ్దముల నన్నిటి నుచ్చరించుచుండు నని భావము. ఆదాన = ఇచ్చుట- అనఁగా దానప్రతిగ్రహాదులు చేయునది హస్తేంద్రియము, అది యరచేతి నంటి యున్నది, అదే హస్తేంద్రియ మనిన సుప్తమృతమూర్ఛితశరీరంబులయం దుండు అఱచేతిచే దానప్రతిగ్రహాదులు చేయఁబడవలయును అట్లు లేదు, కాఁబట్టి అఱచేతికంటె వేఱై దానప్రతిగ్రహాదిక్రియాశక్తి గలిగి సూక్ష్మమై యొకటి అఱచేతిని హత్తియున్నది. అది హస్తేంద్రియ మనఁబడును, దాని కధిదేవత యింద్రుఁడు, అతనిచేఁ బ్రేరింపఁబడిన హస్తేంద్రియము దానాదిక్రియలఁ జేయుచుండు నని భావము. గమన = నడచుట- అనఁగా గమనాదిక్రియలు గలది పాదేంద్రియము, అది యరికాలి నాశ్రయించి యున్నది, అదే పాదేంద్రియ మనిన సుప్తమృతమూర్ఛిత శరీరంబులయం దుండు అరికాలిచే గమనాగమనాదిక్రియలు చేయఁబడవలయును అట్లు లేదు గాన ఆ యరికాలి కంటె వేఱై గమనాగమనాది క్రియాశక్తి గలిగి సూక్ష్మమై యొకటి అరికాలి నాశ్రయించి యున్నది, దానికి పాదేంద్రియ మని పేరు, దాని కధిష్ఠానదేవత విష్ణువు, అతనిచేఁ బ్రేరింపఁబడి పాదేంద్రియము గమనాగమనాదిక్రియలఁ జేయుచుండు నని భావము, విసర్గ = మలమూత్రవిసర్జనము చేయుట, మలమూత్ర విసర్జనాదిక్రియలు చేయునది పాయురింద్రియము, అది గుదము నంటియున్నది, అదే పాయురింద్రియ మనిన సుప్తమృతమూర్ఛితశరీరములయందలి గుదమువలన మలవిసర్జనాదిక్రియలు చేయఁబడవలయును అట్లు లేదు గనుక ఆ గుదవ్యతిరిక్తమై మలవిసర్జనాదిక్రియాశక్తి గలిగి అతిసూక్ష్మమై యొకవస్తువు ఆ గుదము నాశ్రయించి యున్నది, దానికి పాయురింద్రియ మని పేరు, దీనికి మృత్యు వధిష్ఠానదేవత, ఆ యధిష్ఠానదేవతచేత ప్రేరింపఁబడిన పాయురింద్రియము పురీష విసర్జనాదిక్రియలు చేయుచుండు నని భావము. ఆనంద = సంభోగజనితానందము - అనఁగా శుక్లమూత్రవిసర్జనాదిక్రియలు గలది ఉపస్థేంద్రియము, అది యోనిలింగముల

నాశ్రయించి యున్నవి. అవియే ఉపస్థేంద్రియ మనిన సుస్త్రీపుంసమూర్తికశరీరములయందలి యోనిలింగ ములచే శుక్లమూత్రవిసర్జనాదిక్రియలు చేయఁబడువలయును, అట్లులేదు గావున శుక్లమూత్రవిసర్జనాది క్రియా శక్తి గలిగి సూక్ష్మమై యొకవస్తువు వాని నాశ్రయించియున్నది, దానికి నుపస్థేంద్రియ మని పేరు, ప్రజాపతి అధిష్ఠానదేవత, ఆ యధిష్ఠానదేవతచేత ప్రేరింపఁబడిన యుపస్థేంద్రియము శుక్లమూత్రవిసర్జనాదిక్రియలను చేయుచుండు నని భావము కర్మంబులన్ = పైనఁ జెప్పఁబడిన సమస్తక్రియలను, ఒనర్చుచున్ = చేయుచు, మనంబు = మనస్సు, ప్రవర్తించుచుండున్ = తిరుగుచుండును, అమ్మనంబున్ = ఆమనస్సును, కరణం బుగాన్ = సాధనముగా, కైకొని = చేకొని, తత్ = ఆ పూర్వోక్తము లయిన, పవన = ప్రాణవాయువు యొక్క, మనః = మనస్సుయొక్క, అగ్రస్థితయున్ = తుద నున్నదియు, కర్తృత్వభోక్తృత్వాది ధర్మస మేతయున్ = అహం కర్త భోక్త సుఖి దుఃఖి అనునవి మొదలగు స్వభావములు గలదియు, ఐనబుద్ధి = ఐనట్టి ప్రజ్ఞ, విలసిల్లున్ = ప్రకాశించును, అదియె = ఆబుద్ధియే, బిందువనం బరఁగున్ = బిందు వని చెప్పఁ బడును, అది = ఆబిందువు, సర్వ = సమస్తము లైన, కార్య = విషయములకు, కారణ = ఇంద్రియములకు, ఆశ్ర యతయున్ = ఆధార మైనదియు, నిఖిలవాస = సర్వాభిలాషలయందు, వాసితయున్ = వసించు చున్నదియు, అగున్ = అగును, కావునన్ = అట్లు వసించుచున్నది గనుక, అమ్మనస = ఆ మనస్సుతోడ, మారుత = పంచవాయువులతోడ, ఇంద్రియ = దశేంద్రియములతోడ, శరీరంబులతోన్ = త్రిశరీరముల తోడ, కూడి = అన్వితమై, విషయాభిముఖియై - విషయ = ఇంద్రియవ్యాపారములకు, అభిముఖియై = ఎదురుగు కొన్నదై - అనఁగా విషయానందాభిలాష గలదై, తచ్చాంచల్యంబునన్ = ఆ విషయలోలతవలన, తాను = బిందురూప మయిన బుద్ధియుక్త, గలించుచున్ = సంచరించుచు, బహిః = బాహ్యమందలి జ్ఞానేం ద్రియ కర్మేంద్రియములయొక్క, అంతః = లోపలి మనోబుద్ధిచిత్తాహంకారములయొక్క, విషయ = శబ్ద స్పర్శరూపరసగంధవచనదానగమనవిసర్గానందసంకల్పవికల్పనిశ్చయచంచలకర్తృత్వములయొక్క, అను భవంబు = భోగమును, చేయుచున్ = ఒనర్చుచు, సుషుప్తియందున్ = నిద్రయందు, అజ్ఞానాకారం బగు చున్ = జడస్వభావము గలదై, జాగ్రత్స్వప్నంబులయందున్ = జాగరమునందును స్వప్నమందును, బుద్ధ్యవి ద్యాకారంబై తోఁచుచును = మనోబుద్ధిచిత్తాహంకారస్వరూపముగాఁ గనఁబడుచు, అనాదికాలంబున నుండి = ప్రపంచనిర్మాణేచ్ఛజనింపనిపూర్వమునుండి, ముక్తిపర్యంతంబున్ = విదేహకైవల్యప్రాప్తి పర్యంతము, అనంతకర్మంబు లాచరించుచున్ = అపరిమితము లైన పుణ్యపాపమిశ్రకర్మములఁ జేయుచును, తత్ఫలంబు లగు సుఖదుఃఖంబుల భుజించుచున్ = ఆ కర్మానుగుణ్యము లగు ఐహికాముష్మికసుఖదుఃఖ ములఁ బొందుచు, అవిచారరూపిణి యై = బ్రహ్మజ్ఞానమునకుఁ గారణ మయిన జీవేశ్వరజగద్విచారణ లేనిదై, నిరంతరపర్యటనశీలయై — నిరంతర = ఎల్లప్పుడును, పర్యటన = సంచరించుటయు, శీలయై = స్వభావముగాఁ గలదై, ఉండున్ = నివసించును, మతియును — చెండియు.

(తా) ఆంజనేయా! తల్లిదండ్రులచే భుజింపఁబడు అన్నాదులవలనఁ బుట్టినరక్తము, రేతస్సు వీట్లచే నుత్పత్తియయిన చర్మము మాంసము మొదలగు షట్కోశములు గల యీ స్థూలశరీరమునందు డెబ్బది రెండువేలనాడులు గలవు. ఆ డెబ్బదిరెండువేలనాడులయందు గుదస్థానమునకంటె రెండంగుళముల పైభాగమును లింగమునకంటె రెండంగుళముల క్రిందిభాగము నైన శరీరమధ్యస్థానమగు గుదస్థాన మందు క్రిందివైపుగ నుండునట్టియు మూఁడుకోణములు గలిగినట్టియు మూలాధారచక్రము ప్రకాశించు చున్నది ఆ మూలాధారచక్రము మొదలుకొని సహస్రారచక్రపర్యంతము వీఁపునట్టు వీణయొక్క దండము తంతుల కట్లు మాలవలె అటువలె సమస్తనాడులకును మూలమై క్రిందను పైనను నరకఁబడిన వెదురువలె

నున్నదియును షడాధారచక్రములతోఁ గూడినదియునై బ్రహ్మదండి యను నొక పెద్దయెముక గలదు, ఆ యెముకయొక్క మొదట నున్న మూలాధారచక్రముయొక్క మధ్యకోణమునందు కుండలి యను పేరు గల పరాశక్తియుక్తమైనదియును, (ఈ కుండలి నాగకన్యకాకృతిని పొంది మూలాధారచక్రమందు శిరస్సును పూర్ధ్వకుండలియందు పుచ్ఛమును గలదై యుండును, ఇది సుషుమ్నానాళమధ్యమునందు తామర తూడులోని నూలువలె యుండును) ప్రాణవాయువు జఠరాగ్ని బుద్ధి ప్రణవము అను వీనికి స్థానమయినదియును బ్రహ్మరంధ్రమును పొందినదియును నై సావిత్రి సరస్వతి యను పేళ్లచే బ్రహ్మనాడి పరఁగుచుండును, ఆ బ్రహ్మనాడియొక్క యెడమ కుడిప్రక్కలయందు అధోభాగక్రమము మొదలుకొని నాసికాగ్రపర్యంతము నాడీచక్రముతోఁ జేరినవియును, పితృయాన దేవయానము లను మార్గములు గలవియును, చంద్రసూర్యమండలములను పొందినవై ఇడా పింగళ యను నాడులు ప్రవర్తించుచుండును నాడీచక్రము పొక్కిలి నాశ్రయించి కోడిగ్రుడ్డువిధమున నుండును. ఇడాపింగళ యను నాడులు యీ నాడీచక్రమునం దుద్భవించినవి నేత్రములచివరలవరకు వ్యాపించి యుండు నాడులు గాంధారి హస్తిజిహ్వ యనఁబడును. చెవులను రెంటిని పొంది యుండు నాడులు పూష అలంబుష యనునవి. శుక్ల యను నాడి కనుబొమలమధ్యయం దుండును ముక్కుయొక్క రెండుద్వారములును చెవులయొక్క రంధ్రములును కనుబొమలయొక్క క్రిందిభాగమునందు కలిసియుండును అట్టి ప్రదేశమునకే శృంగాటకము, సుమ్మద మని పేరు గంగా యమునా సరస్వతీ యను పేళ్లచేఁ బరగిన ఇడా పింగళా సుషుమ్నా యను నాడులు చేరు కనుబొమలమధ్యస్థానమునకు త్రికూట మనియు, త్రివేణీ సంగమ మనియుం పేరు, సరస్వతీ యను నాడి నోటియందు నాలుకతుదవరకు వ్యాపించి యుండును, విశ్వోదరి యను నాడి నాలుగువిధము లగు భక్ష్యభోజ్యాదియన్నములను భక్షించును, కంఠమునం దుండునది యగు పయస్వినీ నాడి ఆఁకలి దప్పులను గలుగఁ జేయును, నీరుద్రావును, మఱియు నాడీచక్రమునందుఁ బుట్టిన మూఁడు నాడు లగు రాకా సినీవాలీ కుహూ యను నాడులు క్రిందిప్రక్క ప్రసవించినవై యుండును, అందు రక్తా యను నాడి రేతస్సును, సినీవాలీ యను నాడి మూత్రమును, కుహూ యను నాడి మలమును వెలుపలికి త్రోయును, శంఖినీ గామినీ యను నాడులు భుజింపఁబడిన యన్నసారమును సంగ్రహించి బ్రహ్మరంధ్రమందుఁ జేరి అమృతమును కలిగించును, ఇవి గాక, హృదయమునందు (అనఁగా అనాహతచక్రమందు) నూటొక్క నాడులు ప్రకాశించుచుండును, అందొక నాడి యగు యమృతనాడి చిదాకాశమును పొందునట్టిది, ఆ నాడీమార్గమునకే మోక్షమార్గ మనియు, కైవల్యమార్గ మనియు వేదాంతములు పలుకుచుండును, ఇట్లు చెప్పఁబడిన నాడు లన్నిటిలో ముఖ్యములయిన నాడులు, వీటిలో శ్రేష్ఠ మయినవి ఇడా పింగళా సుషుమ్నలు, ఈ మూఁడు నాడులలోపల సుషుమ్నా యను నాడి నాడీకాశిరోమణి యనఁబడును, ఈప్రకారము ఊర్ధ్వముగాను క్రిందుగాను అడ్డముగాను వ్యాపించినట్టివియు శ్రేష్ఠ మయిన రంధ్రములు గలిగినట్టివియు నైన డెబ్బదిరెండు వేల నాడులయందు కదలుట పరుగెత్తుట కంపమునొందుట ముడుచుట బడలికఁజెందుట ఇవియే స్వభావములుగా గలిగినట్టి ప్రాణాపానవ్యానోదానసమాననాగకూర్మకృకరదేవదత్తధనంజయము లనెడు దశవిధప్రాణములు సంచరించుచుండును; అందు ప్రకర్షముగా శ్వాసాదులను బయలు వెడలించునట్టిది ప్రాణవాయువు, ఈ ప్రాణవాయువు వక్షఃస్థలమునం దుండి ఇడా పింగళా యను నాడులయొక్క రంధ్రములనుండి ఉచ్ఛ్వాసరూపంబుచే బయలువెడలి పండ్రెండుఅంగుళములవరకువచ్చి అచ్చట లయించును అపానము. దీనివలన నిశ్వాసము చేయఁబడుచున్నది గనుక దీనికి అపానమని పేరు, ఇది గుదస్థానమం దుండి అధస్స్థానగమనశీలమగు విశ్వకర్తచేఁ బ్రేరింపఁబడి అధోముఖముగా సంచరించుచు కుహూనాడివలన మలమును, సినీవాలీనాడివలన మూత్రమును, రక్తాహ్వయనాడివలన శుక్లమును విసర్జన చేయుచుండును ఈ ప్రాణము, షడ్విభాగులను

ఊర్ధ్వమునకుఁ దెచ్చునట్టిది, ఇది కంఠమునందు వసించి అజుఁడనెడు అధిష్ఠానదేవతచే ప్రేరేపింపఁబడి మనస్సునందు జనించెడు సంకల్పవికల్పములను నాలుక మొదలగు అష్టస్థానములయందు ధ్వనిరూపంబుగాఁ బలికించుచు సుషుప్తి యనెడు అవస్థయందు సమస్తయింద్రియములయొక్క యుపసంహారమును చేసి తనకు కారణమయిన అజ్ఞానమునందు లయించుచు జాగ్రదావస్థయందు యింద్రియములను ఆయాస్థానముల యందు నిల్పుచు నంత్యకాలమందు సర్వేంద్రియములను గ్రహించి లోకాంతరమునకు బోవ మరల సామర్థ్యము గలిగి తేజస్సుచే ప్రకాశించుచు సుషుమ్నానాళమనెడు ద్వారముగుండా బ్రహ్మరంధ్రమునకు బోవుచుండును. వ్యానమనగా శరీరమందంతటను నుండునది, ఇది విశ్వయోని యను అధిష్ఠానదేవతచే ప్రేరేపింపఁబడి లోపలి వేడిమిని చల్లఁదనమును బయటికి తెచ్చుచు వెలుపలి వేడిమిని చల్లఁదనమును లోనికి తీసుకొనిపోవుచు భుజింపఁబడిన అన్నముయొక్క సారమును దేహమందంతటను వ్యాపింపఁజేయుచుండును. సమానవాయువు నాభిప్రదేశమునందు వసించి ఒయుంఁడను యధిష్ఠానదేవతచే ప్రేరేపింపఁబడి జఠరాగ్నిని ప్రజ్వలింపజేసి చతుర్విధఅన్నాదులను ఆ యగ్నిచే పక్వము చేసి డెబ్బదిరెండువేలనాడులకుఁ బంచి పెట్టును. నాగవాయువు గమనమును కలుగఁజేయును. కూర్మవాయువు కంటిరెప్పలను దెరపించుట యును మూయించుటయును చేయును, కృకరవాయువు తుమ్మును గలుగఁజేయును. దేవదత్తవాయువు ఆవలింతలను గలుగఁజేయును. సర్వవ్యాపియగు ధనంజయుఁడను వాయువు చచ్చినను విడువక దేహమందంతటను వ్యాపించి శరీరమును వదలక వృద్ధిపఱచుచుండును. మనస్సనునది ప్రాణాది దశవాయువులతోఁ గూడినదియును, దశేంద్రియములగు జ్ఞానేంద్రియకర్మేంద్రియములతోఁ జేరినదియును, కామము రాగము ద్వేషము మొదలగు షడ్వికారములతోఁ గూడినదియును, శబ్దస్పర్శాదులవల్లనైన ఆనందము అనుభవించుటకుగాను ప్రపంచవ్యాపారము గలదియును నై శ్రోత్రేంద్రియములవలన ధ్వన్యాత్మక వర్ణాత్మకశబ్దములనున్ను త్వగింద్రియమువలన మృదు కఠిన శీత ఉష్ణ మిశ్రములు అనియెడు అయిదు విధములయిన స్పర్శలనున్ను నేత్రేంద్రియమువలన రక్త నీల పీత హరిత శ్వేత మిశ్రములను ఆరువర్ణములనున్ను రసనేంద్రియమువలన ఉప్పు పులుసు తీపు మొదలగు ఆరురసములనున్ను ఘ్రాణేంద్రియముచేత సుగంధ దుర్గంధ మిశ్రగంధములనెడు మూఁడువిధములగు గంధములనున్ను ననుభవించునదియై వాక్పాణి పాద యుపస్థలతోఁ గూడి సుశబ్దాపశబ్దభాషణములును, దానాదానాదులును, నడచుట మొదలగు గమనములును, మలమూత్రములయొక్క విసర్జనములును నైన కర్మములను చేయుచు ప్రకాశించుచుండును, ఆ మనస్సును సాధనముగాఁ జేసికొని ప్రాణవాయువుయొక్కయు మనస్సుయొక్కయు అగ్రమునందున్నదియును, నేను చేయుచున్నాను నేను గుణించుచున్నాను నేననుభవించుచున్నాను అనెడు కర్తృత్వభోక్తృత్వాది స్వభావములతోఁ గూడుకొన్నదియునై విలసిల్లెడు బుద్ధియే బిందు వనఁబడును, ఆ బిందువు సమస్తములయిన విషయేంద్రియములకు ఆధారమయినదియు, సర్వాభిలాషలయందు వసించునదియు, మనస్సుతోడను పంచవాయువులతోడను మూఁడుశరీరములతోడను గూడినదియు నై ఆ విషయలోలతవలన బిందురూపమయినబుద్ధియును చలించుచుండు మతియు, బాహ్యేంద్రియముల కర్మేంద్రియములయొక్కయు, మనోబుద్ధిచిత్తఅహంకారములయొక్కయు, శబ్ద స్పర్శ రూప రస గంధ వచన దాన ఆనంద గమన విసర్జన సంకల్ప నిశ్చల చంచల కర్తృత్వములయొక్కయు నైన యనుభవమును అనుభవించుచు నిద్రయందు జడస్వభావము గలదియును, జాగ్రత్స్వప్నములయందు మనోబుద్ధిచిత్తాహంకార రూపముగాఁ గనఁబడునదియును, ప్రపంచనిర్మాణకర్మేచ్ఛ జనింపనికాలమునందుండియే బ్రహ్మప్రాప్తిపర్యంతము అనంతమయిన పుణ్యపాపకర్మములను చేయుచున్నదియును, ఆ కర్మానుగుణ్యములగు ఐహికాము

ష్మిక సుఖముల ననుభవించునదియును, బ్రహ్మజ్ఞానమునకు కారణ మయిన జీవేశ్వర నగద్వారములేని దియును, ఎల్లప్పుడును సంచరించుస్వభావము గలదియు నై నివసించు చుండు నని తాత్పర్యము

నా ద బిం దు క ళా వి వ ర ణ ము.

క. ప్రతనుప్రాణమనోగ్రస్థితబుద్ధియె బిందు వనఁగ నీ జెలఁగడి యాత్మ
ప్రతిబింబమె కళ పవనోన్నతఘోషమె సుమ్ము ప్రణవనాదము వత్సా. ౧౬౭

టీక వత్సా = బాలుఁడా, ప్రతను = స్థూలశరీరము యొక్క, ప్రాణ = ప్రాణవాయువు యొక్క, మనః = చంచలాత్మక మైన మనస్సుయొక్క, అగ్ర = అగ్రభాగమందు, స్థిత = ఉన్నట్టి, బుద్ధియె = నిశ్చయాత్మక మయిన ప్రజ్ఞయే - అనఁగా అన్నమయ ప్రాణమయ మనోమయ కోశాగ్రస్థిత మయిన విజ్ఞానమయకోశమే, బిందువు = బిందు వనఁబడును, అందుకా = ఆ బిందుస్వరూపక విజ్ఞానమయకోశమందు, చెలఁగడి = తేజరిల్లెడు, ఆత్మ = పరమాత్మయొక్క, ప్రతిబింబమె = ప్రతిచ్ఛాయ యైన జీవుఁడే, కళ = కళ యనఁబడును, పవనోన్నతఘోషమె—పవన = ప్రాణాదివాయువులయొక్క, ఉన్నత = అధిక మైన, ఘోషమే = ధ్వనియే, ప్రణవనాదము సుమ్ము = ఓంకారనాదము సుమా "శ్లో॥ పంచభూతాగ సంయోగా జ్ఞాయతే నాదసంజ్ఞికమ్। హృచ్చిత్త బుద్ధి సంయోగా జ్ఞాయతే బిందుసంజ్ఞికమ్॥ జీవాత్మ శివ్యాత్సర్వం కళానామేతి విశ్రుతః। బిందునాదకళాతీతం ప్రణవం మోక్షదాయకమ్" ఇట్లని రామయోగసిద్ధాంతము.

తా వత్సా! ఆంజనేయా! బిందు వనఁగా స్థూలశరీరమం దుండెడు ప్రాణవాయువు మనస్సు వీట్లయొక్క అగ్రభాగమునందు నున్నట్టి నిశ్చయాత్మక మగు విజ్ఞానమే, ఆ బిందుస్వరూప విజ్ఞానమయ కోశమందు ప్రకాశించెడు పరమాత్మయొక్క ప్రతిబింబమే కళ యనఁబడును, ప్రాణాదివాయువుల యొక్క విశేషమే ఓంకార మనఁబడును.

క. ఆ నాదబిందుకళలం, గానంబడు చుండువానిఁ గను పురుషుఁడె ప్ర
జ్ఞానఘనుఁ డైన రాముఁడు, నానావిధతత్త్వములకు నాథుఁడు పుత్త్రా. ౧౬౮

టీక పుత్త్రా = కుమారా, ఆనాదబిందుకళలన్ = ముందుఁ జెప్పఁబడిన నాదబిందు పరమ కళలయందు, కానంబడుచుండువానిన్ = కనఁబడెడి అభిమాని యైన జీవుని, కనుపురుషుఁడె = అవలోకించు ద్రష్టయే, ప్రజ్ఞాన = అనుభవజన్యజ్ఞానమందు, ఘనుఁ డైన = అధికుఁ డైన, రాముఁడు = పరబ్రహ్మ యైన శ్రీరాముఁడు - ఆ శ్రీరామబ్రహ్మమే, నానావిధతత్త్వములకున్ — నానావిధ = పెక్కు తెఱఁగు లైన, తత్త్వములకున్ = షట్త్రింశత్తత్త్వములకు, నాథుఁడు = ప్రభువు, "శ్లో॥ అమాత్రం శబ్దరహితం స్వరవ్యంజనవర్జితమ్। బిందునాదకళాతీతం యస్తం వేద స వేదవిత్" అని యోగతత్త్వగీతయందు, "శ్లో॥ ఆకాశాదీని భూతాని పంచ తేషాం ప్రకీర్తితాః। గుణాః శబ్దాదికం పంచ పంచ కర్మేంద్రియాణి చ॥ జ్ఞానేంద్రియాణి పంచైతే ప్రాణాది దశవాయవః। మనోబుద్ధిరహంకార చిత్తం చేతి చతుష్టయమ్॥ తేషాం కారణభూతైకా విద్యా షట్త్రింశతః పరః। విశ్వస్య జగతః కర్తా పశోర్దస్య పరశ్శివః" అని వాసుదేవమననమందు, ఇవియే ముప్పదియారుతత్త్వములు.

తా. ఆ నాదబిందువుయొక్క కళలయందు కనఁబడెడు జీవుని చూచువాఁడే అనుభవమువల్ల బుట్టిన జ్ఞానమందు అధికుఁ డయిన శ్రీరామపరబ్రహ్మము, ఈ రామపరబ్రహ్మమే ముప్పదియారుతత్త్వములకును ప్రభువు, (ముప్పదియారుతత్త్వము లనఁగా, శ్రోత్రము త్వక్కు చక్షు జిహ్వ ఘ్రాణము అనునట్టి

యయిదు జ్ఞానేంద్రియములును, వాక్కు పాణి పాదము పాయు వుపస్థ యనెడు కర్మేంద్రియములు అయిదును, ప్రాణ అపాన ఉదాన సమాన వ్యానము లనెడు పంచవాయువులును, శబ్దము స్పర్శము రూపము రసము గంధము అను విషయపంచకమును, మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అను అంతఃకరణచతుష్టయమును, స్థూల సూక్ష్మ కారణము అను శరీరత్రయమును, జాగ్రత్స్వప్న సుషుప్తు లనెడు మూఁడువయవస్థలును, ఒకటి యగు అజ్ఞానమును, ఒక్కొకటి అయిదయిగుగాఁ జేయఁబడిన పృథివ్యాది పంచభూతములును జేరి ముప్పదియాఱుతత్త్వము లనఁబడు నని తాత్పర్యము.

సీ. అట్టి శ్రీరామతత్త్వాభాసకళ తోడ, నెనసిన యాబిందు వెల్ల ప్రొద్దు
మార్తాండచంద్రాగ్నిమండలాన్వితసూక్ష్మ, చక్షురగ్రమునకు సరి నధోము
ఖంబుగా నున్న హృత్కమలంబుతో బహి, ర్ముఖ మై స్వవిషయానుభూతిఁ దగిలి
మానక పవమానమానసేంద్రియదేహ, సంగతి నూరక సంచరించు

తే. నట్లు గావున దశనాడికాంతరస్థ, దశవిధేంద్రియపవనచిత్తముల నెల్ల
హంసతత్త్వానుభవమున నడఁచినిలిపి, యచలముగఁ జేయుమంతట నాంజనేయా.

టీక. ఆంజనేయా = అంజనాపుత్రా, అట్టి = ముందుఁ జెప్పఁబడినట్టి, శ్రీరామతత్త్వ = బ్రహ్మవిద్యానాయకుఁ డైన పరమాత్మయొక్క, ఆభాస = ప్రతిఫలిత మైన, కళతోడన్ = జీవకళలతోడ, ఎనసినయాబిందువు — ఎనసిన= కలిసిన, ఆబిందువు = ఆ యంతఃకరణము, ఎల్లప్రొద్దు = సర్వకాలము, మార్తాండ = సూర్యమండలముతోడ, చంద్ర = సోమమండలముతోడ, అగ్నిమండల = వహ్నిమండలముతోడ, అన్విత = కూడిన, సూక్ష్మచక్షుః = జ్ఞాననేత్రముయొక్క, అగ్రమునకున్ = చివరకు, సరిన్ = సూటిగా, అధోముఖంబుగా నున్న = క్రిందివంగము గలదై యున్న, హృత్కమలంబుతోన్ = మనఃపద్మముతోడ, బహిర్ముఖ మై = ప్రపంచాభిముఖమై, స్వవిషయానుభూతిఁ దగిలి—స్వవిషయ = స్వకీయము లైన శబ్దస్పర్శాది వ్యాపారములయందు, అనుభూతిఁ దగిలి = అనుభవము గలదై, మానక = విడువక, పవమాన = ప్రాణాదిదశవాయువులయొక్క, మానస = మనస్సుయొక్క, ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములయొక్క, దేహ = శరీరత్రయముయొక్క, సంగతిన్ = సహవాసముచేత, ఊరక సంచరించున్ = విశ్రామము లేక తిరుగుచుండును, కావునన్ = కనుక, దశనాడికా = ఇడా పింగళా గాంధారి హస్తి జిహ్వా పూషా లంబుసా శుక్ల శంఖినీ దామినీ యను పదినాడులయొక్క, అంతర = నడుమను, స్థ = ఉన్నట్టి, దశవిధ = పదివిధము లయిన, ఇంద్రియ=జ్ఞానకర్మేంద్రియములను, పవన = ప్రాణాది దశవాయువులను, చిత్తములనెల్లన్ = మనోబుద్ధిచిత్తాహంకారములను, హంసతత్త్వానుభవమునన్ = అష్టదళకమలాంతర్వర్తి యగు జీవతత్త్వమునందలి అనుభవముచేత, అడఁచి = లోఁబఱచి, నిలిపి = నిరోధించి, అచలమునన్ = కదల కుండునటుల, చేయుము = కావింపుము, అంతటన్ = అనంతరము

తా. అంజనీదేవియొక్క కుమారుఁడ వగు గారా యాంజనేయా! పూర్వము చెప్పఁబడిన బ్రహ్మవిద్యానాయకుఁ డయిన పరమాత్మయొక్క ప్రతిఫలిత మైన జీవకళతోడఁ గలిసిన యా యంతఃకరణము యెల్లప్పుడును సూర్యమండల చంద్రమండల వహ్నిమండలములతోఁ గూడినదియును, జ్ఞాననేత్రమునకు సరిగా క్రింగిముఖము గలదియును, మనఃపద్మముతో ప్రపంచముతట్టు తిరిగినదియును, తనసంబంధము లైన స్పర్శాదివ్యాపారముల ననుభవించునదియు నై ప్రాణాదిదశవాయువులతోను జ్ఞానేంద్రియ

తా॥ పురుషశ్రేష్ఠుఁడ వయిన యో యాంజనేయా! హంస యను శబ్దమందు హకారముతోఁ గూడి యుండు సకార మెట్టిదనఁగా శరీరేంద్రియచిత్తములను ఆకారముగాఁ గలదియును, అజ్ఞానము రూపముగాఁ గలదియును, సత్త్వరజస్తమోగుణములతోఁ గూడినదియును, పుట్టుక లేనిదియును, షడ్భావవికారములు లేనిదియును నై యుండు నని తాత్పర్యము

క॥ విను మా పురుషప్రకృతుల, ఘనతాదాత్మ్యంబు మధ్యగతబిందువు గా
వున హంస యనఁగ జీవుం, డనిలమనోయుక్తుఁ డగుచు నతఁడు వెలుంగున్.

టీక॥ వినుము = ఆకర్ణింపుము, ఆ పురుషప్రకృతులకు = పైనఁ జెప్పఁబడిన హకారసకారస్వరూపము లైన పురుషప్రకృతులయొక్క, ఘన = మిక్కుటమైన, తాదాత్మ్యంబు = చేరికయె, మధ్యగతబిందువు = నడిమియున్న, కావునన్ = కనుక, హంసయనఁగన్ = హంస యనఁగా, జీవుండు = చిదాభాసుఁడు, అతఁడు = ఆ జీవుఁడు, అనిలమనోయుక్తుఁ డగుచున్ = మనోమారుతములతోఁ గూడినవాఁడై, వెలుఁగున్ = తేజరిల్లును

తా॥ ఆంజనేయా! వినుము, పూర్వము చెప్పిన హకారసకారస్వరూపము లయిన పురుషప్రకృతులయొక్క చేరికయే మధ్యమునం దుండెడు బిందువు, అందుచేతనే హంస యనఁగా జీవుఁ డని చెప్పుట, అట్లు చెప్పఁబడు జీవుఁడు మనోమారుతములతోఁ గూడువాఁడై ప్రకాశించుచుండు నని తాత్పర్యము.

అష్టదళపద్మమున హంస తిరుగునపుడు గలిగెడు గుణవిశేషముల వివరణము.

వ॥ ఇట్లు నిర్వికారుం డైన పురుషునకుఁ గేవలజడాత్మిక యైన ప్రకృతికిఁ బ్రత్యేకంబుగాఁ గర్తృత్వభోక్తృత్వాదిరూప సర్వసంసారంబు ఘటింపదట్లు గావున హకారస్వరూపకుం డైన యాత్ముండు శక్తి యైన సకారంబుతో నన్యోన్యతాదాత్మ్యాధ్యాసరూపంబునఁ గూడి హంసస్వరూపకుం డైన జీవుం డై నవద్వారపురంబునం బ్రవేశించి వివిధేంద్రియప్రాణమనోయుక్తుం డై పంజరాంతరంబున నెలంగు పులుంగు తెఱంగునం జిక్కి వెడల నుపాయంబు గానక నానావిధభోగంబు లనుభవించుచుం గ్రీడించుచున్నట్టి హంసకు నగ్నిసోములు పక్షంబు లోంకారంబు శిరంబు త్రినేత్రంబు ముఖంబు రుద్రరుద్రాణులు చరణంబు లై యొప్పార భానుకోటిప్రతీకాశం బై కాష్ఠంబులయందు వహ్నియుఁ దిలలయందుఁ దైలంబు క్షీరంబులయం దాజ్యంబు వ్యాపించి యున్న చందంబున బ్రహ్మాదిస్తంభపర్యంత సర్వభూతంబులయందు హృదయకమలం బధిష్ఠించి యుండు నందుఁ బూర్వదళంబునఁ బుణ్యమతియు నాగ్నేయదళంబున నిద్రాలస్యాదులు యామ్యదళంబునఁ గ్రౌర్యాసీ మషియు నైరృతిదళంబునఁ బాపబుద్ధియుఁ బశ్చిమదళంబునఁ గ్రీడయు వాయవ్యదళంబునఁ గమనాదిమనీషయు సౌమ్యదళంబున రతిప్రీతియు నీశాన్యదళంబున ద్రవ్యాదానంబు మధ్యంబున వైరాగ్యంబుఁ గేసరంబుల జాగ్రదవస్థయుఁ గర్ణికయందు స్వప్నంబు లింగంబున సుషుప్తియుఁ బొందుచుండు. మఱియు నెప్పుడు పద్మత్యాగి యగు నప్పుడు నాదంబున విలీనం బగు నది తురీయం బున్నాదం బాధా

రాది బ్రహ్మరంధ్ర పర్యంతంబు శుద్ధస్ఫటికసంకాశంబై నిండియుండు నదియె పర
మార్థతత్త్వరహస్యం బని యోగీశ్వరులచేతఁ జెప్పంబడు నట్లగుటం జేసి. ౧౭౬

టీక ఇట్లు = ఇవ్విధముగా, నిర్వికారుండు = షడ్భావవికారములు లేనివాఁడగు, ఐన పురుషు
నకున్ = ఐనట్టి పరబ్రహ్మమునకు, కేవలజడాత్మిక—కేవల = అత్యంతము, జడాత్మిక = అజ్ఞానరూపము
గలది, ఐన ప్రకృతికిన్ = ఐనట్టి ప్రధానమునకు, ప్రత్యేకంబుగాన్ = వేఱు వేఱుగా, కర్తృత్వ = కర్త
యగుట, భోక్తృత్వ = భోక్త యగుట, ఆదిరూప = మొదలైన స్వభావములు గల, సర్వ = నానావిధ
మైన, సంసారంబు = అభిమానకృత్యము, ఘటింపదు = కలుగదు, అట్లు గావున్ = అటుల సంభవింపగు
గాఁబట్టి, హకారస్వరూపకుండు = హకారసంజ్ఞ గలవాఁడు, ఐన యాత్ముండు=ఐనట్టి పరమాత్మ, ఆత్మ
శక్తి = స్వశక్తి, ఐన సకారంబుతోన్=ఐనట్టి సకారసంజ్ఞ గల ప్రకృతితో, అన్యోన్యతాదాత్మ్యధ్యాన
రూపంబునన్—అన్యోన్య = ఒకటితో నొకటి, తాదాత్మ్య = కలిసి యుండుటవలన, ధ్యానరూపంబునన్ =
ఆ ప్రకృతి తా నను నభేదస్ఫురణచేత, కూడి = మిళితమై, హంసస్వరూపకుండు = హంసస్వరూపుఁడు,
ఐన జీవుండై = ఐన శబళబ్రహ్మమై, నవద్వారపురంబునన్=తొమ్మిదివాకిండ్లు గల శరీర మనెడు పట్టణ
మందు, ప్రవేశించి = చొచ్చి, వివిధ = బహువిధంబులైన, ఇంద్రియ = దశేంద్రియములతోడ, ప్రాణ =
దశవిధప్రాణములతోడ, మనః = మనస్సుతోడ, యుక్తుండై = చేరినవాఁడై, పంజరాంతరంబునన్ =
గూఁటిలోపల, మెలఁగు = చరించుచున్న, పులుఁగులెఱంగునన్ = పక్షివలె, చిక్కి = తగులుకొని,
వెడలన్ = బయలు దేరుటకు, ఉపాయంబు = యుక్తి, కానక = తెలియక, నానావిధభోగంబులు—నానా
విధ = పెక్కు తెఱఁగు లయిన, భోగంబులు = సుఖములను, అనుభవించుచున్ = పొందుచు, క్రీడించు
నట్టి హంసకున్ = విహరించుచున్న జీవునకు, అగ్నిసోములు = అగ్నిమండల చంద్రమండలములు, పక్ష
ంబులు = రెక్కలు ఓంకారంబు = ప్రణవము, శిరంబు = శిరస్సు, త్రినేత్రంబు = మూఁడవకన్ను—అనఁగా
జ్ఞాననేత్రము, ముఖంబు = మొగము, రుద్రరుద్రాణులు—రుద్ర = రుద్రబీజ మయిన హకారమును, రుద్రా
ణులు = శక్తిబీజ మయిన సకారమును, చరణంబులై = పాదములై, ఒప్పారన్ = శోభిల్లఁగా, భాను
కోటి = కోటిసూర్యులతోడ, ప్రతీకాశంబై = సమానమై, కాష్ఠంబులయందున్ = దారువులయందు,
వహ్నియున్ = అగ్నియు, తిలలయందున్ = నువ్వులయందు, తైలంబు = నూనెయు, క్షీరంబులయందున్ =
పాలయందు, ఆజ్యంబు = ఘృతమును, వ్యాపించియున్నచందంబునన్ = నిండియున్నట్లు, బ్రహ్మాది =
పరమేష్ఠి మొదలు, స్తంభపర్యంత = తృణమువఱకైన, సర్వభూతంబులయందున్ = సమస్తప్రాణుల
యందు, హృదయకమలంబు = సహస్రారములు– సహస్రార మనఁగా వేయి చిన్న రేకులు గల కమలము,
దానిని యెనిమిదింట భాగించిన భాగమునకు నూటయిరువదియైదు చిన్న రేకులు గల పెద్దదళ మొకటి
యగుచున్నది, అట్టి దళము లెనిమిది దిక్కులయందుఁ గలిగి యుండునట్టి సహస్రారకమలమును, అధి
ష్ఠించియుండున్ = ఆశ్రయించి యుండును, అందున్ = ఆ హృదయకమలమందు, పూర్వదళంబునన్ =
తూర్పుదిక్కు రేకునందు, పుణ్యమతియున్ = సద్బుద్ధియు, ఆగ్నేయదళంబునన్ = అగ్నిదిక్కున నుండు
రేకునందు, నిద్రాలస్యాదులు — నిద్ర = ఆలస్యము, ఆఁకలి = దప్పి మొదలగునవియు, యామ్యదళం
బునన్ = దక్షిణపు రేకునందు, క్రౌర్యశేముషియున్ = క్రూరబుద్ధియు, నైరృతిదళంబునన్ = నైఋతి
దిక్కు రేకునందు, పాపబుద్ధియున్ = పాపమతియు, పశ్చిమదళంబునన్ = పడమటిదిక్కు రేకునందు,
క్రీడయున్ = విలాసమును, వాయవ్యదళంబునన్ = గాలిమూల నుండు రేకునందు, గమనాది మనీ
షయున్— గమన = నడుచుట, ఆది = మొదలగువానియందును, మనీషయున్=బుద్ధియు, సౌమ్యదళం

బునన్ = ఉత్తరపువైపు రేకునందు, రతిప్రీతియున్ = సురతమునందాసక్తియు, ఈశాన్యదళంబునన్ = ఈశాన్యదిక్కు రేకునందు, ద్రవ్యాదానంబున్ – ద్రవ్య = విత్తమును, ఆదానంబున్ = ఇయ్యవలయు నను తలంపును, మధ్యంబునన్ = పద్మాంతరాళమందు, వైరాగ్యంబున్ = ఇహపరలోక భోగవిరక్తియును, కేసరంబులన్ = కింజల్కములయందు, జాగ్రదవస్థయు = మెలఁకువయును, కర్ణికయందున్ = దుద్దునందు, స్వప్నంబు = కలయును, లింగంబునన్ = తామరదుంపయందు, సుషుప్తియున్ = నిద్రయును, పొందుచుండున్ = చెందుచుండును, మఱియున్ = మఱియు, ఎప్పుడు = ఏ సమయమందు, పద్మత్యాగి యగున్ = సహస్రారమును విడుచునో, అప్పుడు = ఆ సమయమందు, నాదంబునన్ = అఖండ సచ్చిదానందపరబ్రహ్మమందు, విలీనంబగున్ = ఐక్యమగును అది = ఆ ఐక్యము, తురీయంబు = తురీయావస్థ, అన్నాదంబు = ప్రణవవాచ్యమైన పరబ్రహ్మము, ఆధారాదిబ్రహ్మగ్రంథిపర్యంతంబు = ఆధార చక్రము మొదలు సహస్రారచక్రమువఱకు, శుద్ధస్ఫటికసంకాశంబై – శుద్ధ = నిర్మలమయిన, స్ఫటిక = పటికముతో, సంకాశంబై = సమానమై, నిండియుండున్ = సంపూర్ణమై యుండును అదియే = అక్షర బ్రహ్మమే, పరమార్థతత్త్వరహస్యం బని – పరమార్థ = ఉత్కృష్టవాచ్యమైన, తత్త్వ = యాథార్థ్యము యొక్క, రహస్యం బని = గోప్యమని, యోగీశ్వరులచేతన్ = బ్రహ్మవేత్తలచేత, చెప్పంబడున్ = పలుకఁబడును అట్లగుటంజేసి = అటుల పలుకంబడుటవలన

తా॥ ఈ ప్రకారము షడ్భావవికారములు లేని పరమాత్మయును, కేవలజడాత్మక మగు ప్రకృతికిని వేఱ్వేఱుగా కర్తృత్వ భోక్తృత్వంబులు మొదలయిన స్వభావములు గల సంసారము లేదు గనుక హాకార సంజ్ఞ గల యాత్ముఁడు స్వశక్తియైన సకారసంజ్ఞ గల ప్రకృతితోఁ గలిసి యుండుటవలన కలిగిన ఆత్మయే తానను అభేదస్ఫురణచేతఁ జేరినవాఁడై హంసస్వరూప మగు శబ్దబ్రహ్మ మాయెను, అట్టి యీ శబ్ద బ్రహ్మము తొమ్మిదివాకిండ్లు గల శరీర మనెడు పట్టణమందుఁ బ్రవేశించి యింద్రియములతోడను ప్రాణములతోడను మనస్సుతోడను గూడినవాఁడయి పంజరమందు చరించుచున్న పక్షి యందంబున బయలు వెడలుటకు వుపాయంబు తెలియక అనేకవిధము లయిన సుఖములను అనుభవించుచు క్రీడించు చుండును, అట్లు క్రీడించుచున్న హంస యనంబరఁగెడు జీవుఁడు అగ్నిమండల సంగ్రమండలములను రెండు రెక్కలుగాను, ఓంకారములు శిరస్సుగాను, జ్ఞాననేత్రము ముఖముగాను, రుద్రబీజ మగు రకారమును శక్తిబీజ మయిన సకారమును పాదములుగాను గలవాఁడై ప్రకాశించుచు కొయ్యలయం దగ్నియు, నువ్వులయందు నూనెయు, పాలయందు ఘృతమును వ్యాపించియుండు చందంబున సమస్తప్రాణులయందు వ్యాపకమలంబు నాశ్రయించి యుండును, ఈ సహస్రారము నూటయిరువదియగు చిన్న రేకులు గల పెద్దదళములు యెనిమిదిదిక్కులయందును యెనిమిదిదళములు గలది గావున తూర్పుదిక్కుల రేకునందు సద్బుద్ధియు, అగ్నిదిక్కులయం దుండు రేకునందు నిద్ర ఆలస్యము దప్పి మొదలగునవియు, దక్షిణపు రేకునందు క్రూర బుద్ధియు, నైఋతిదిక్కు రేకునందు పాపబుద్ధియు, పడమటిదిక్కు రేకునందు విలాసమును, వాయువ్యమూలయం దుండు రేకునందు నడచుట మొదలగువానియందు బుద్ధియు, ఉత్తరపువైపు రేకునందు సురతమునం దాసక్తియు యీశాన్యదిక్కు రేకునందు ద్రవ్యమును యియ్యవలయు ననెడి తలంపును, ఈయెనిమిదింటిని యెనిమిదిరేకులయందును పద్మాంతరాళమునందు యిహపరలోకవిరక్తియును, కింజల్కములయందు మెలఁకువయును, దుద్దునందు కలయును, దుంపయందు నిద్రయును చెందుచుండును, మఱియు యే సమయమునందు సహస్రారమును విడుచునో ఆ సమయమందు అఖండసచ్చిదానందపరబ్రహ్మమునందు ఐక్యమగును, ఆ యైక్యమునకే తురీయావస్థ యందురు, ఆ నాదము ప్రణవవాచ్యమైన పరబ్రహ్మము, ఈ నాదమే ఆధార

చక్రము నందలి సహస్రారచక్రమువలెను నిర్మలపటికముతో సమానమై సంపూర్ణమై యుండును, ఆ పర బ్రహ్మము నే యుత్కృష్టవాచ్యమైన యథార్థముయొక్క గోప్యమని బ్రహ్మవేత్తలు చెప్పుదురు, అట్లు బ్రహ్మవేత్తలు చెప్పుటవలన నని తాత్పర్యము (ఈ వచనమునకు పై పద్యముతో నన్వయము)

## హంసాదలయస్థానసూచనము.

క. దేశికనాథుని మహదుప, దేశమువలనను వివేకదృష్టివలనఁ ద
న్నాశస్థలము సుషుమ్నా, దేశం బని దానికీలుఁ దెలియఁగవలయున్. ౧౭౮

టీక దేశికనాథుని = పరమగురునియొక్క, మహత్ = ఘనమైన, ఉపదేశమువలనన్ = బోధవలనను, వివేకదృష్టివలనన్ = జ్ఞానదృష్టివలనను, తన్నాశస్థలము = ఆ నాదలయస్థానము, సుషుమ్నా దేశం బని = దహరమని, దానికీలు = దానిమర్మము, తెలియఁగవలయున్ = ఎఱుఁగవలెను

తా. పరమగురువుయొక్క యుపదేశమువలనను, జ్ఞానదృష్టివలనను ఆ నాదలయస్థానము సుషుమ్నా దేశమని దానిమర్మము తెలియవలయు నని తాత్పర్యము.

ఆ. సర్వభూతహృదయజలజాతములయందుఁ, సమతఁ బవనమానసములతోడ
హంస యనుచుఁ బలుకు నతఁడె నేననుకీలుఁ, దెలిసి తలఁప నదియుఁ బొలియు నంత.

టీక అంతన్ = పిమ్మట, సర్వభూత = సమస్తప్రాణులయొక్క, హృదయజలజాతములయందున్ = మనఃపద్మములయందు, సమతన్ = సమత్వముచేత, పవనమానసములతోడన్ — పవన = ప్రాణవాయువుతోడ, మానసములతోడన్ = మనస్సుతోడ, హంసయనుచున్ = హంస యని, పలుకు నతఁడె = పలికెడు పురుషుఁడె, నే ననుకీలు తెలిసి = నే నను మర్మ మెఱిఁగి, తలఁపన్ = సోహ మని మననము చేయఁగా, అదియున్ = ఆ యనుసంధానమును, పొలియున్ = నశించును

తా. అనంతరము సమస్తప్రాణులయొక్క హృదయకమలములయందు సమముగా ప్రాణవాయువుతోడను మనస్సుతోడను హంస యని పలికెడు పురుషుఁడే నేనను మర్మ మెఱిఁగి మననము చేయఁగా నా యనుసంధానము నశించు నని తాత్పర్యము.

ఆ. ఈ రహస్య మెఱిఁగి యేకాగ్రచిత్తుఁడై
సంతతము భజింపఁజాలు నేని
యనిలమానసములు హంసంబుతోఁ గూడ
విలయ మొందు మొదలి వెలుఁగునందు. ౧౭౯

టీక ఈ రహస్యమెఱిఁగి = ఈ గుట్టు తెలిసి, ఏకాగ్రచిత్తుఁడై = నిశ్చలచిత్తుఁడై, సంతతమున్ = ఎప్పుడును, భజింపఁజాలు నేనిన్ = ఆరాధింపసమర్థుఁ డాయె నేని, అనిలమానసములు = ప్రాణవాయువును మనస్సును, హంసంబుతోఁగూడన్ = శబళబ్రహ్మముతోడ, మొదలివెలుఁగునందున్ = బిందుత్రయాతీత మగు నిష్కళియందు - అనఁగా పరిపూర్ణచైతన్యమునందు, విలయమొందున్ = ఐక్య మగును

తా. ఈ రహస్యమును దెలిసి చలింపనిమనస్సు గలవాఁడై యెప్పుడును నారాధింప సమర్థుఁ డాయె నేని ప్రాణవాయువును మనస్సును శబళబ్రహ్మముతో బిందుత్రయాతీత మగు నిష్కళ మందు (అనఁగా పరిపూర్ణచైతన్యమందు) ఐక్య మగు నని తాత్పర్యము.

## రేచకపూరకకుంభకముల వివరణము.

సీ. హృదయగతప్రాణుఁ డేతెంచు నాసికావివరంబువలనను వెలికి ద్వాద
శాంగుళపర్యంత మది రేచకం బగు, నరుదెంచు నంతలో నర్ధసమయ
మచ్చోట లయ మగు నది బహిఃకుంభకం, బారీతి లోపలి కరుగునదియె
పూరకం బన నొప్పుఁ బూరించు నంతలో, నర్ధకాలంబు దా నడఁగు నచట
తే. నదియె యాంతరకుంభకం బనఁగఁ దనరుఁ, బొసఁగ నిబ్భంగి రేచక పూరకాది
గతులచే విహరించు నీగాలి వానిఁ, గలిసి మది జీవహంసంబు మెలఁగు నపుడు.

టీక హృదయగతప్రాణుఁడు = హృదయస్థానమం దుండు ప్రాణవాయువు, నాసిక = ముక్కు యొక్క, వివరంబువలనన్ = రంధ్రములనుండి, వెలికిన్ = బాహ్యమునకు, ద్వాదశాంగుళపర్యంతము = పండ్రెండంగుళములవఱకు, ఏతెంచున్ = వచ్చును, అది = ఆ వచ్చుట, రేచకం బగున్ = ఉచ్ఛ్వాస మగును, అరుదెంచునంతలోన్ = వెలుపలికి వచ్చునంతటిలోపల, అర్ధసమయము = అర్ధనిమేషము, అచ్చోటన్ = ఆ వెలుపలనే, లయ మగున్ = నశించును, అది = ఆ నశించుట, బహిఃకుంభకంబు = బాహ్యకుంభకము, ఆరీతిన్ = ఆ వచ్చినతీరుననే, లోపలికరుగునదియె = లోపలికి బోవుటయే, పూరకం బన నొప్పున్ = నిశ్వాస మనఁబడును, పూరించునంతలోన్ = నిశ్వాసము చేయు నంతలో, అర్ధకాలంబు = అర్ధనిమేషము, అచటన్ = ఆలోపలనే, తా నడఁగున్ = ప్రాణవాయువు లయ మగును, అదియు = ఆ లయమగుటయే, అంతరకుంభకం బనఁగఁ దనరున్ = లోకుంభక మనఁబడును, పొసఁగన్ = లెస్సగా, ఇబ్భంగిన్ = పైన జెప్పినప్రకారము, రేచకపూరకాదిగతులచేన్ = రేచకము పూరకము కుంభకము బహిఃకుంభకము అంతరకుంభకము లను నడకలచేత, విహరించునీగాలి = సంచరించెడి యీప్రాణవాయువు, వానిన్ = ఆ రేచకాదులతోడ, కలిసి = చేరి, మదితోడన్ = మానసముతోడ, హంసంబు = ప్రణవాంగ మైన జీవహంస, మెలఁగునపుడు = సంచరించునప్పుడు

తా హృదయస్థానమం దుండు ప్రాణవాయువు ముక్కుయొక్కరంధ్రములనుండి బాహ్యమునకు పండ్రెండుఅంగుళములవరకు వచ్చును, ఆ వచ్చుట యుచ్ఛ్వాస మనఁబడును, వెలుపలికి వచ్చునంతలోపల అర్ధనిమేషము ఆ వెలుపలనే లయ మగును, అట్లు నశించుట బాహ్యకుంభక మనఁబడును. ఆ వచ్చినతీరుననే లోపలికి పోయినది పూరకం బనఁబడును. (పూరకము = నిశ్వాసము) నిశ్వాసము చేయునంతలోనే లోపల ప్రాణవాయువు అర్ధనిమేషము లయ మగును, ఆ లయమునకే లోకుంభక మందురు ఈప్రకారము రేచకకుంభకాది నడకలచే సంచరించెడు యీప్రాణవాయువును ఆ రేచకాదులతోడ కలిసి మానసముతోడ ప్రణవాంగ మైన జీవహంస తిరుగునప్పుడు నిశ్వాసమునందు హాకారముచేఁ జెప్పఁబడియెడు సచ్చిదానందపరబ్రహ్మమును చేర్చి ప్రాణవాయువు నిలుపుటయందు ఆత్మప్రతిబింబమును కూర్చి అనంతరము వుచ్ఛ్వాసమందు (లయసంజ్ఞయందు) సకారాకారమును పొందిన ప్రకృతిని చూచి ఆ పురుషప్రకృతిబింబమును తెలుసుకొను తెలివియే నేనని తెలియవలయు నని తాత్పర్యము.

తే. పూరకమున హాకారంబుఁ బొందుపఱచి, కుంభకంబున బిందువుఁ గూర్చి యంత
రేచకమున సకారంబుఁ జూచి వానిఁ, దెలియు తెలివియె నే ననఁ దెలియవలయు.

టీక పూరకమునన్ = నిశ్వాసమునందు, హాకారంబు = హాకారవాచ్య మైన సచ్చిదానందపరబ్రహ్మమును, పొందుపఱచి = మిళితము చేసి, కుంభకంబునన్ = ప్రాణవాయువు నిల్పుటయందు

బిందువున్ = ఆత్మప్రతిబింబమును, కూర్చి = చేర్చి, అంతన్ = వెనుక, రేచకమునన్ = ఉచ్ఛ్వాస మందు-అనఁగా లయసంజ్ఞ యందు, సకారంబున్ = సకారస్వరూపిణి యైన ప్రకృతిని, చూచి=వీక్షించి వానిన్ = ఆపురుషప్రకృతిప్రతిబింబములను, తెలిసియు తెలివియు = ఎఱుఁగడు తెలియకయు, నే నని తెలియవలయున్ = ఏ నని యెఱుఁగవలయును

తా॥ ఓయాంజనేయా! నిశ్శ్వాసవాయువునందు 'హంస' అను దానియందలి హకారముచేతఁ బ్రతిపాదింపఁబడు చున్న పరబ్రహ్మమును చేర్చవలయును పిమ్మట ప్రాణవాయువును నిలుపుటయే స్వరూపముగాఁ గల కుంభకమునందు ఆత్మబింబమును చేర్పవలయును అంతట ప్రాణవాయువును బయలు నకు విడుచుట యనునట్టిదియును, లయ మను పేరు గలిగియును, రేచకమునందు మహామాయా స్వరూప మగు సకారమును చేర్పవలయును, ఇట్లు చేసి యీమూఁటిని చక్కఁగా తెలిసికొనునట్టి తెలివిఁ ను నే నని తెలిసికొని పరమానందమును బొందవలయు నని తాత్పర్యము

తే. ఇట్లనిలమానసములతోఁ గెలసి హంస, యాఱుకమలంబులందు నహర్నిశంబు
లీలచే నిరువదియొక్క వేలయాఱునూఱుమాఱులు విహరించు గ్రమముతోడ.

టీక. ఇట్లు = ఈప్రకారము, హంస = ప్రణవాంగ మైన జీవహంస, అనిలమానసములతోన్ = మనోమారుతములతోడ, ఎనసి = చేరి, ఆఱుకమలంబులందున్ = మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞాయము లనెడు షట్కమలములయందు, అహర్నిశంబు = దివారాత్రములయందు, లీలచేన్ = గమనక్రియచేత, ॥ని॥ 'లీలావిలాసః క్రియయోః' అని అమరము, ఇరువదియొక్క వేలయాఱు నూఱుమాఱులు = ఏకవింశతిసహస్రషట్ఛతవారములు, క్రమతోడన్ = నిర్ణయప్రకారముగా, విహరించున్ = సంచరించును.

తా॥ ఈప్రకారము ప్రణవాంగ మైన జీవహంస ప్రాణవాయువుతోను మనస్సుతోను చేరి మూలాధారాది షట్కమలములయందు దివారాత్రములు యిరువదియొక్క వేలయాఱునూఱు మాఱులు నిర్ణయ ప్రకారము సంచరించు చుండు నని తాత్పర్యము

## షట్కమలముల నిర్ణయము.

వ. అట్లు గావున గుదస్థానంబున వశషసవర్ణగం బై చతుర్దళయుక్తం బై త్రికోణాం చనపుష్పసన్నిభం బై మహీనిలయం బై ఘ్రాణకారణం బై మూలాధార చక్రంబు విలసిల్లు నందు వినాయకుని కాఱునూఱులును, లింగస్థానంబున బభమ యరలవర్ణగం బై షడ్దళసమన్వితం బై రక్తవర్ణం బై జలాలయం బై రసనాకారణం బై స్వాధిష్ఠానచక్రంబు రంజిల్లు నందుఁ జతుర్ముఖున కాఱు వేలును, నాభి స్థానంబున డఢణతథదధనపఫవర్ణగం బై దశదళోపేతం బై తేజోనివాసం బై పీతవర్ణం బై నేత్రకారణం బై మణిపూరచక్రంబు ప్రకాశించు నందు శ్రీమహా విష్ణున కాఱు వేలును, హృదయస్థానంబున కఖగఘఙచఛజఝఞటఠ వర్ణగం బై ద్వాదశదళోపేతం బై శ్వేతవర్ణం బై మరున్మందిరం బై త్వగింద్రియకారణం బై యనాహతచక్రంబు దనరు నందు రుద్రున కాఱు వేలును, కంఠస్థానం బునను దకారాదిషోడశస్వరగం బై షోడశదళయుతం బై నీలవర్ణం బై గగన

సదనం బై శ్రోత్రకారణం బై విశుద్ధచక్రం బలరు నందు జీవాత్మునకు సహ
స్రంబును, భ్రూమధ్యస్థానంబున హాంక్షు మ్మను వర్ణంబులు గలిగి ద్విదళలలితం బై
మాణిక్యవర్ణం బై యంతఃకరణభవనం బై యాజ్ఞాచక్రం బొప్పు నందుఁ బర
మాత్మునకు సహస్రంబును, బ్రహ్మరంధ్రస్థానంబున నోంకారవర్ణకం బై సహ
స్రదళశోభితం బై కోటిసూర్యప్రకాశమానం బై ధవిలమస్థలం బై సహ
స్రారచక్రం బలరారు నందు శ్రీగురుస్వామికి సహస్రంబును శ్రీమ ద్దేశికో
క్తాసనముద్రాలక్ష్యమంత్రధ్యానక్రమపూర్వకంబుగా సమర్పించు సద్గురుభక్తుండు
జీవన్ముక్తుం డగు నట్లొప్పించు నప్పుడు. ౧౮౩

టీక అట్లుగావునన్ = అట్లు సంచరింమను గనుక, గుదస్థానంబునన్ = వాయువునంగు, వశషస
వర్ణకంబై = వ శ ష స అను నక్షరములు గలదై, చతుర్దళయుక్తంబై = నాల్గు రేకులు గలదై, తప్తకాంచన
పుష్పసన్నిభంబై — తప్తకాంచన = అపరంజియొక్క, పుష్ప = పూవుతోడ, సన్నిభంగ = సమానమై,
మహీనిలయంబై = భూమికి నివాసమై, ఘ్రాణకారణంబై = నాసికమునకు హేతువై, మూలాధారచక్రం
బు = మూలాధారచక్రము, విలసిల్లున్ = శోభించును, అందున్ = ఆ మూలాధారచక్రమందు, విఘ్నేశునకు =
విఘ్నేశ్వరునకు, ఆఱునూఱులును = షట్ఛతములును, లింగస్థానంబునన్ = మేహనస్థానమందు, బభమయ
రలవర్ణకంబై = బ భ మ య ర ల అను వడక్షరములు గలదై, షడ్దళసమన్వితంబై = ఆఱుంగళములతోఁ
గూడినదై, రక్తవర్ణంబై = ఎఱ్ఱనిరంగు గలదై, జలాలయంబై = ఉదకమునకు నిలయమై, రసనాకారణంబై =
నాలుకకు హేతువై, స్వాధిష్ఠానచక్రంబు = స్వాధిష్ఠానచక్రము, రంజిల్లున్ = వెలుఁగును, అందున్ =
ఆస్వాధిష్ఠానచక్రమందు, చతుర్ముఖునకున్ = బ్రహ్మకు, ఆఱువేలును = షట్సహస్రములును, నాభిస్థా
నంబున్ = పొక్కిలియందు, డఢణతథదధనపఫవర్ణకంబై = డ ఢ ణ త థ ద ధ న ప ఫ అను వర్ణములు
గలదై, దశదళోపేతంబై = పది రేకులతోఁ గూడినదై, తేజోనివాసంబై = అగ్నికి స్థానమై, పీతవర్ణంబై =
పసుపుచాయ గలదై, నేత్రకారణంబై = కన్నులకు హేతువై, మణిపూరకచక్రంబు = మణిపూరకచక్రము,
ప్రకాశించున్ = మెఱయును, అందున్ = ఆచక్రమందు, శ్రీమహావిష్ణునకున్ = బ్రహ్మవిద్యాయుక్తుఁడైన
విష్ణుదేవునకు, ఆఱువేలును = షట్సహస్రములును, హృదయస్థానంబునన్ = వక్షస్స్థలమందు, కఖగఘఙ
చఛజఝఞటఠవర్ణకంబై = క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ అనెడు పండ్రెం డక్షరములు గలదై, ద్వాదశదళో
పేతంబై = పండ్రెండు రేకులతోఁ గూడినదై, శ్వేతవర్ణంబై = తెల్లనిచాయ గలదై, మరున్మందిరంబయి =
వాయువునకు నిలయమై, త్వగింద్రియకారణంబయి = చర్మేంద్రియమునకు హేతువై, అనాహతచక్రంబు =
అనాహతచక్రము, తనరున్ = ఒప్పును, అందున్ = ఆచక్రమందు, రుద్రునకున్ = రుద్రమూర్తికి, ఆఱు
వేలును = షట్సహస్రములును, కంఠస్థానమందున్ = కుత్తుకయందు, అకారాదిషోడశస్వరకం బయి =
అకారము మొదలగు పదియాఱు అచ్చులు గలదై, షోడశదళయుతంబై = పదియాఱు రేకులు గలదై, నీలవర్ణం
బయి = నల్లనిరంగు గలదై, గగనసదనంబై = ఆకాశమునకు స్థానమై, శ్రోత్రకారణంబై = కర్ణములకు
హేతువై, విశుద్ధచక్రంబు = విశుద్ధచక్రము, అలరున్ = రాణించును, అందున్ = ఆ చక్రమందు, జీవా
త్మునకున్ = క్షేత్రజ్ఞునకు, సహస్రంబును = పదినూరులును, భ్రూమధ్యస్థానంబునన్ = బొమలనడుమ,
హాంక్షు మ్మను వర్ణంబులు గలిగి = హం క్షం అను నక్షరములుగలిగి, ద్విదళలలితంబై = రెండు రేకులు గలిగి
యొప్పిద మైనదై, మాణిక్యవర్ణంబై = మానికపుచాయ గలదై, అంతఃకరణభవనంబై = మనోబుద్ధిచిత్తా

హంకారరూపము గల యంతఃకరణమునకు నివాసమై, ఆజ్ఞాచక్రంబు = ఆజ్ఞాచక్రము, ఒప్పుఁ = ప్రకాశించును, అందుఁ = ఆ చక్రమందు, పరమాత్మునకుఁ = పరబ్రహ్మమునకు, సహస్రంబును = దళశతములును, బ్రహ్మరంధ్రస్థానంబునకు = దహరాకాశమునందు, ఓంకారవర్ణంబయి = ప్రణవాక్షరము గలదై, సహస్రదళశోభితంబయి = వేయి రేకులు గలిగి రాజిల్లుచున్నదై, కోటిభాస్కరప్రభాసమానంబయి = కోటిభాస్కరతుల్యతేజము గలదై, ధీవిలయస్థలంబయి = బుద్ధికి లయస్థానమై, సహస్రారచక్రంబు = వేయిదళములు గల చక్రము, అలరారుఁ = ఒప్పును, అందుఁ = ఆచక్రమందు, శ్రీగురుస్వామికిఁ = దేశికేంద్రునకు, సహస్రంబును = పదినూఱులును, శ్రీమత్ = నిత్యవిభూతియుక్తుండయిన, దేశిక = గురునిచేత, ఉక్త = బోధింపఁబడిన, ఆసన = పద్మాసనాద్యాసనములచేత, ముద్రాలక్ష్య = ఖేచర్యాదిముద్రాలక్ష్యములచేత, మంత్ర = అజపామంత్రముచేత, ధ్యానక్రమపూర్వకంబుగాఁ = అనుష్ఠానసరణి మున్నుగలుగునట్లుగా, సమర్పించు = అర్పణము చేసెడి, సత్ = ఉత్తముండైన, గురు = పెద్దలయొక్క, ధన్యుండు = శిష్యుఁడు, జీవన్ముక్తుండు = ఉపాధిశూన్యుఁడు, అగుఁ = అవును, అట్లు ఆ యజపామంత్రానుష్ఠానక్రమమును ఒప్పించునప్పుడు = సమర్పణ చేయునపుడు, "శ్లో॥ మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం స్థితం స్వాధిష్ఠానే హృది మరుతమాకాశముపరి। మనోపి భ్రూమధ్యే సకలమపి భిత్వా కులపథం సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసే" అని సౌందర్యలహరియందును, "శ్లో॥ మూలాధారం గుదస్థానం స్వాధిష్ఠానంతు మేహనమ్। నాభిస్తు మణిపూరాఖ్యం హృదయాబ్జమనాహతమ్। తాలుమూలం విశుద్ధాఖ్యమాజ్ఞాఖ్యం నిటలాంబుజమ్। సహస్రారం బ్రహ్మరంధ్ర మిత్యాగమవిదో విదుః॥ ఆధారస్తు చతుర్దళోరుణరుచి ర్వాసాంతవర్ణాశ్రయః స్వాధిష్ఠానమపేక్ష్యవిద్యుతనిభం బాలాంతషట్పత్రకమ్। రత్నాభం మణిపూరకం దశదళం డాద్యం ఫకారాంతకం। పత్రైర్ద్వాదశభిస్త్వనాహతపురీ హైమీ కఠాంతాన్వితా॥ ద్విట్స్వారం సత్వషోడశైశ్చసహితం జ్యోతిర్విశుద్ధాంబుజం హంక్షేత్యక్షరపద్మపత్రయుగళం రక్తోజ్జ్వలమాజ్ఞాపురీ। తస్మాదూర్ధ్వమధోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదం నిత్యానందమయీం సదా శివపురీ శక్తేనమ శ్శాశ్వతమ్" ఇట్లని శ్రీవిద్యయందును, "శ్లో॥ ఆధారే లింగనాభౌ హృదయసరసిజే తాలుమూలే లలాటే ద్వేపత్రే షోడశారే ద్విదశదశదళే ద్వాదశార్ధే చతుష్కే। వాసాంతే బాలమధ్యే డఫకఠసహితే కంఠమూలే స్వరాణాం హంక్షం తత్త్వార్థయుక్తం సకలదళయుతం వర్ణరూపం నమామి॥ షట్ఛతాని గణేశాయ షట్సహస్రం స్వయంభువే। విష్ణవే షట్సహస్రంతు షట్సహస్రం పినాకినే। సహస్రమాత్మనే చైవ సహస్రం పరమాత్మనే। సహస్ర మేకం గురవే అర్పయామి కృతం జపమ్" ఇట్లని అజపాగాయత్రియందు చెప్పఁబడినది.

తా. ఆప్రకారము సంచరించును గనుక గుదస్థానమందు వశషస అను యక్షరములు గలదియును, నాలుగుదళములతోఁ గూడినదియును, ఆపగంజిరేకుయొక్క పుష్పముతో సమానమయినదియును, భూమికి నివాసమయినదియును, నాసికమునకు హేతువైనదియును నై మూలాధారచక్రంబు ప్రకాశించుచుండును, ఆ మూలాధారచక్రమందు విఘ్నేశ్వరునకు ఆఱునూఱుమారులు అజపామంత్రమును, (సోహం అనుమంత్రము) మేహస్థానమునందు బ భ మ య ర ల అను యాఱక్షరములతోఁ గూడినదియును, ఆఱు రేకులతోఁ గూడినదియును, ఎఱ్ఱనిరంగు గలదియును, ఉదకమునకు స్థానమైనదియును, నాలుకకు హేతువైనదియునునై స్వాధిష్ఠానచక్రము వెలుఁగుచుండును, ఆ స్వాధిష్ఠానచక్రమునందు బ్రహ్మకు ఆఱువేల పర్యాయములు అజపామంత్రమును, పొక్కిలియందు డ ఢ ణ త థ ద ధ న ప ఫ అను వర్ణములు గలదియును, పదిరేకులతోఁ గూడినదియును, తేజోనివాసమైనదియును, (అగ్నికి స్థానమయినదియు) పసుపుచాయ గలదియును, కన్నులకు హేతువైనదియును నయి మణిపూరకచక్రంబు ప్రకాశించుచుండును, ఆచక్రము

నందు బ్రహ్మవిద్యాయుక్తుఁ డయిన విష్ణువునకు ఆఱువేలమారులు అజపామంత్రమును, పన్నెండుస్థానములయందు క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ యనెడు పన్నెండక్షరములు గలదియును, పన్నెండు రేకులతోఁ గూడినదియును, తెల్లనిచాయ గలదియును, వాయువునకు వాసస్థాన మైనదియును, చర్మేంద్రియమునకు కారణ మయినదియును నయి అనాహతచక్రము ప్రకాశించుచుండును, ఆ అనాహతచక్రమందు రుద్రునకు ఆఱువేల మారులు అజపామంత్రమును, కంఠమునందు అకారము మొదలు పదియాఱచ్చులు గలదియును, పదియాఱు రేకులు గలదియును, నల్లనిరంగు గలదియును, ఆకాశమునకు స్థాన మైనదియును, శబ్దములకు హేతు వైనదియును, విశుద్ధచక్రము వెలుఁగుచుండును, ఈ విశుద్ధచక్రమందు జీవాత్ముఁ డగు జీవునకు వేయి మారులు అజపామంత్రమును, కనుబొమలమధ్యయందు హం క్షం అను వర్ణము గలదియును, రెండు రేకులు గలదియును, మాణిక్యపుచాయ గలదియును, మనోబుద్ధిచిత్తాహంకారములు గల యంతఃకరణమునకు నివాస మయినదియును నై ఆజ్ఞాచక్రంబు ప్రకాశించును, ఆచక్రమునందు పరబ్రహ్మమునకు వేయిమారులు అజపామంత్రమును, దహరమునందు ప్రణవాక్షరము గలదియును, వేయిరేకులచేఁ బ్రకాశించునదియును, కోటి సూర్యులతో సమాన మగు తేజస్సు గలదియును, బుద్ధికి లయస్థాన మయినదియును నై సహస్రారచక్రంబు వేయిదళములు గల చక్రము యొప్పుచుండును, ఆ చక్రమునందు శ్రీగురుస్వామికి వేయిమారులు అజపామంత్రమును, ఈప్రకారముగా వినాయకుఁడు మహావిష్ణువు రుద్రుఁడు మొదలగువారికి పైఁ జెప్పినప్రకారము యిరువదియొక్క వేలయాఱునూరుమారులు అజపామంత్రమును నిత్యవిభూతిగుఱుత్తుఁ డైన గురువుచేత బోధింపఁబడిన పద్మాసనాద్యాసనములచేతను ఖేచరాదిముద్రాలక్ష్యములచేతను అనుష్ఠానసరణితోఁ గూడుకొన్నట్లు యర్పణము చేసి యుత్తమగురువుయొక్క శిష్యుఁడును జీవన్ముక్తుఁడును అగును. అట్లు ఆ యజపామంత్రానుష్ఠానక్రమమున సమర్పణ చేయునప్పు డని తాత్పర్యము.

క. కుడియెడమనాడులందుఁ, నడుచు న్వాయువులు లోనివెలుపలఁ బోఁ
బొడగనుచు నెపుడు మెలఁగుఁ, నడిమినడవనంటి నమ్మనంబు కుమారా. ౧౮౪

టీక కుమారా = ఆంజనేయా, వాయువులు = ఉచ్ఛ్వాసనిశ్శ్వాసవాయువులు, కుడియెడమ నాడులందుఁ = దక్షిణవామపార్శ్వములయం దుండెడి పింగళ యిడానాడులయందు, నడుచుఁ = చరించును, నెమ్మనంబు = నిండుమనస్సు, వానినడువడిఁ = ఆ యుచ్ఛ్వాసనిశ్శ్వాసవాయువులయొక్క ప్రవర్తనములను, వెలిఁ = వెలుపల, లోఁ = లోపల, పొడగనుచుఁ = చూచుచు, ఎపుడు = సార్వకాలము, నడిమినడవనంటి = మధ్యమార్గ మగు సుషుమ్నానాళమును జెంది, మెలఁగుఁ = సంచరించును.

తా. ఓ ఆంజనేయా! ఉచ్ఛ్వాస నిశ్శ్వాసవాయువులు కుడియెడమపార్శ్వములయం దుండెడు యిడాపింగళానాడులయందు సంచరించును, మనస్సు ఆ యుచ్ఛ్వాసనిశ్శ్వాసములయొక్క ప్రవర్తనలను లోపల వెలుపల చూచునప్పుడును సుషుమ్నానాళమును జెంది సంచరించు నని తాత్పర్యము.

## హం స స్థా న సూ చ న ము.

క. ఆ రెంటికిని విలక్షణ, మై రాజిల్లెడు సుషుమ్న నందమలాజ్ఞాం
భోరుహమున హంసుం డాత్మారాముఁడు సర్వసాక్షి యై వెల్గు సుతా. ౧౮౫

టీక సుతా = కుమారా, ఆరెంటికిఁ = ఆ యిడాపింగళానాడులకు, విలక్షణమై = పరమై, సుషుమ్న = నడినాళము, రాజిల్లెడుఁ = దీపించుచుండును, అందుఁ = ఆ సుషుమ్నానాళమందలి, అమలాజ్ఞాంభోరుహమునఁ — అమల = స్వచ్ఛమైన, ఆజ్ఞాంభోరుహమునఁ = ప్రణవకుండలియందు, హంసుండు = కూటస్థుఁ డైన, ఆత్మారాముఁడు = సర్వజీవులయం దంతర్యామిరూపముగాఁ

గ్రీడించు చున్న పరబ్రహ్మము, సర్వసాక్షియై = అంతర్మధ్యబాహ్యత్రిపుటులను గ్రహించుచు, వెలుఁగున్ = ప్రకాశించును.

తా. ఓ కుమారా! ఇడా పింగళా యను నాడులకంటెను విలక్షణమైన నాళము (సుషుమ్న) ప్రకాశించు చుండును. ఆ సుషుమ్నా నాళమందలి స్వచ్ఛ మయిన ప్రణవరూపుండగు నాత్మస్థానమును సర్వజీవులయం దంతర్యామిరూపంబున గ్రీడించు చున్న పరబ్రహ్మము అంతర్మధ్యబాహ్యత్రిపుటులను (అంతరనవవిధప్రపంచమును) చూచువాఁడై ప్రకాశించు నని తాత్పర్యము

కర్త, క్రియ, హేతువు ఇవి బాహ్యత్రిపుటులు, జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు ఇవి అంతరత్రిపుటులు, ద్రష్టృ, దర్శన, దృశ్యములు ఇవి మధ్యత్రిపుటులు, వీటికి నవవిధసంస్కారములని యు, అనంతర నవవిధప్రపంచ మనియుఁ జెప్పఁబడును.

ఆ. అచలహంసరూప మెచట సంభవ మగు, నెచట సంచరించు నెచట నడఁగు
నదియ సూసుషుమ్న యదియపో ద్విదళాబ్జ, మది సుసూక్ష్మదృష్టి నరయు మనఘ

టీక. అనఘ = ఆంజనేయా, అచలహంసరూపము — అచల = చలనరహిత మయిన — అనఁగా అవినాశియైన, హంస = నామరూపక్రియలు లేని పరమాత్మరు, రూపము = రూపనామక్రియలు, ఎచటన్ = ఏస్థలమందు, సంభవమగున్ = కలుగునో, ॥ని॥ "హంసస్స్వరే ఖగే విష్ణౌ యతౌ నిర్లేప భూభుజి। శ్రేష్ఠే శ్వేతగృష్టే స్యాత్ మంత్రభేద పరమాత్మనోః" అని రత్నమాల, ఎచటన్ = ఏ నెలవున, సంచరించున్ = విరాడ్రూపముగ వ్యాపించునో, ఎచట నడఁగున్ = ఎచ్చోట రూపనామక్రియలు లీనమగునో, సుషుమ్న = బ్రహ్మనాడి - అనఁగా ప్రథమసృష్టిగను, అదియ సూ = అదియే సుమా, ద్విదళాబ్జము = మనోబుద్ధు లనెడు రెండు రేకులుగల యాజ్ఞాచక్రము, అదియపో = అదేసుమా, సుసూక్ష్మదృష్టిన్ = అత్యంతనిర్మలజ్ఞాన దృష్టిచేత, అది యరయుము = దానిని యెఱుంగుము "శ్రు॥ యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి। యత్ప్రయం త్యభిసంవిశంతి। త ద్విజ్ఞాన స్వ తద్బ్రహ్మేతి" అని

తా. ఓ ఆంజనేయా! చలనము లేనట్టిదియు నామరూపక్రియలు లేనట్టిదియు నగు పరమాత్మకు నేస్థలమందు నామరూపక్రియలు గలుగునో, ఏస్థలమునందు పరమాత్మ సంచరించునో, ఏస్థలమునందు పరమాత్మకు నామరూపక్రియలు లీన మగునో ఆ స్థలమునకే సుషుమ్న యని పేరు. (బ్రహ్మనాడి) ఈ బ్రహ్మనాడినే మనోబుద్ధు లనెడు రెండురేకులుగల యాజ్ఞాచక్ర మందురు, దానిని అత్యంతనిర్మలజ్ఞానదృష్టిచేత తెలిసికొను మని తాత్పర్యము.

చ. అది యతిసూక్ష్మదృష్టియు దృగాద్యవసానపదంబు ధీమన
స్సదనము స్వప్రకాశము నసంగము నిర్విషయంబు గాన న
ప్పదమున హంసనాదములు భంగుల నూర్పఁ దదంతరంబునం
దుదయము నొంది చిత్కళ మహోన్నతి వాని నడంచు నెంతయున్ ౧౮౭

టీక. అది = దేహిగిసర్వప్రపంచోదయకారణ మగు ప్రథమస్ఫురణము, అతిసూక్ష్మదృష్టియుం = మిక్కిలి సూక్ష్మస్వరూపమును, దృగాద్యవసానపదంబున్ — దృగాది = ద్రష్టృ దర్శన దృశ్యములయొక్క, అవసానపదంబున్ = లయస్థానమును, ధీమనస్సదనమున్ — ధీ = నిశ్చయాత్మకమైన బుద్ధికిని, మనః = సంశయాత్మకమైన మనస్సునకును, సదనమున్ = స్థానమును, స్వప్రకాశమున్ = తనంతట వెలిఁగెడిదియు, అసంగమున్ = జేనిసంగమునిదియు, నిర్విషయంబున్ = చతుర్దశేంద్రియ విషయశూన్యమును, కానన్ = కనుక,

అప్పుడమునన్ = ఆ సుషుప్తియందే-అనఁగా చతుర్దశేంద్రియవ్యాపారకారణ మగు ప్రధానప్రజ్ఞయందే, హంసనాదముల = జీవేశ్వరులయొక్క, భంగులన్ = కించిద్జ్ఞత్వసర్వజ్ఞత్వాదిధర్మములను, దూర్పన్ = చేర్చఁగా, తదంతరంబునందు = ఆ యొఱికయందే, చిత్కళ = అపరోక్షజ్ఞానము, ఉదయించునో-ంగి=పుట్టి, మహోన్నతిన్ = అధికవిజృంభణముచేత, వానిన్ = ఆ జీవేశ్వరోపాధులను, ఎత్తయింటన్ = మిగుల, అడంచున్=నశింపఁజేయును - అపరోక్షజ్ఞానముచేత జీవేశ్వరభేదము నశించు ననుట.

తా॥ దేహాది సర్వప్రపంచముయొక్క పుట్టుటకు కారణ మైన ప్రథమస్ఫురణ అతిసూక్ష్మముగను, ద్రష్టృదర్శనదృశ్యములయొక్క లయస్థానముగను, నిశ్చయాత్మక మగు బుద్ధికిని సంశయాత్మక మగు మనస్సునకును స్థానముగను, తనంతట వెలుఁగునదిగను దేని నంటకుండునదిగను చతుర్దశేంద్రియవిషయశూన్యముగను నుండుటవలన ఆ సుషుప్తియందే (ఇంద్రియవ్యాపారములకు కారణ మగు ప్రధానప్రజ్ఞయందె) జీవేశ్వరులయొక్క కించిద్జ్ఞత్వ సర్వజ్ఞత్వాది ధర్మములను చేర్చగా ఆ కలిసినంగే అపరోక్షజ్ఞానము పుట్టి అధికవిజృంభణముతో ఆ జీవేశ్వరోపాధులను నశింపఁజేయు నని తాత్పర్యము.

౮. భూరిహంసనాదకపూర్వోత్తరారణి, జనితచిత్కళాగ్ని కే ఘనత మెఱసి
స్వాదివస్తువులను కే స్వస్వరూపంబుగాఁ, జేయుచున్న పైని కే జేరుఁ పుడుము. ౧౮౮

టీక. భూరి = శ్రేష్ఠము లయిన, హంస = కార్యోపాధి గల జీవుఁ డనెడు, నాద= కారణోపాధి గల యీశ్వరుఁ డనెడు, పూర్వోత్తరారణి=క్రిందిమీఁది యరణులయందు, జనిత = ధ్యానమనెడి మథనమువలనఁ బుట్టిన, చిత్కళా = అపరోక్షజ్ఞాన మనెడు, అగ్ని = అనలము, ఘనత మెఱసి = మిగులఁ బ్రజ్వలించి, స్వాదివస్తువులను—స్వ = తనకు, ఆది = ఉత్పత్తికారణము లైన, వస్తువులను = జీవేశ్వరు లనెడి పూర్వోత్తరారణులను, పైని = ఊర్ధ్వమందు - అనఁగా పరబ్రహ్మమందు, చేరునప్పుడు = నిర్గమించునప్పుడు, స్వస్వరూపంబుగాఁ జేయుచున్న = తనరూపముగాఁ జేయుచుండును.

తా॥ కార్యోపాధి గల జీవుఁ డనెడు కారణోపాధి గల యీశ్వరుఁ డనెడు అరణులయందు ధ్యాన మనెడి మథనమువలనఁ బుట్టిన యపరోక్షజ్ఞాన మనెడు యగ్ని ప్రజ్వరిల్లి తనయుత్పత్తికి కారణము లయిన జీవేశ్వరు లనెడి అరణులను పూర్ధ్వమందు (పరబ్రహ్మమందు) చేరునప్పుడు తనరూపము గాఁ జేయుచుండును - అనఁగా జేయు నని తాత్పర్యము.

బిందునాదకళాప్రకారాంతరసూచనము.

౯. అంగము నిర్మలబిందువు, లింగము నాదంబు పరమలింగాంగమహా
సంగమె మంగళకళ యని, లింగాంగులు దెలియుదురు చదలింగాంగియుక్తిన్. ౧౮౯

టీక అంగము = ప్రణవాంగ మైన జీవుఁడు, నిర్మలబిందువు—నిర్మల = స్వచ్ఛ మైన, బిందువు = బ్రహ్మానందరసబిందువు, లింగము = శుద్ధస్ఫటికసంకాశ మై ఆ యానందబిందు నంగుళమ్మందుంచు తేజరిల్లుచుండెడు నీశ్వరరూప మగు జ్యోతియే, నాదంబు = ప్రణవనాదము, పరమలింగాంగమహాసంగమె—పరమ = శోభాయమాన మైన, లింగ = లింగస్వరూప మైన యీశ్వరునియొక్క, అంగ = అంగస్వరూపుఁ డైన జీవునియొక్క, మహాసంగమె = అభేదైక్యమే, మంగళకళ యని=పరమశివకళ యని, లింగాంగులు= జీవబ్రహ్మైక్యజ్ఞానము గలవారు - అనఁగా శరీరత్రయాభిమాను లయిన విశ్వతైజసప్రాజ్ఞప్రత్యగాత్మ లనెడు యిష్టలింగ ప్రాణలింగ భావలింగ ఆత్మలింగములలక్షణముల నెఱిఁగి ఆత్మలింగస్వరూపుఁ డగు తనయందు యిష్టప్రాణభావలింగముల నైక్యము చేసి ఆత్మలింగస్వరూపుఁ డగు తన్ను మహాలింగమంగు

మహాలింగస్వరూపనిష్కళపరబ్రహ్మమును తనయందు నేకముగఁజూచు లింగాంగులు, చలింపని యుక్తిక్ = వికల్పము లేని శ్రవణ మనన నిదిధ్యాసనములచేత, తెలియుదురు = ఎఱుంగుదురు

తా॥ బ్రహ్మైక్యజ్ఞానము గలవారు ప్రణవాంగమైన జీవుఁడు స్వచ్ఛమయిన బ్రహ్మానందరసబిందు వనియు, శుద్ధస్ఫటికముతో సమానమై ఆనందబిందువునంగు శబ్దించుచు ప్రకాశించెడు యీశ్వరస్వరూపమగు సూక్ష్మ ప్రణవనాద మనియు, లింగస్వరూప మయిన యీశ్వరునియొక్కయు అంగస్వరూపుఁడైన జీవునియొక్కయు అభేదైక్యమే పరమనిష్కళ మనియు వికల్పము లేని శ్రవణ మనన నిదిధ్యాసనములచేత తెలుసుకొనుచున్నారని తాత్పర్యము

ఆ॥ అట్లు గావునఁ గళ హంసనాదంబుల, రూప మడఁచి తనదు రూపుఁ జేసి
తాను తానయైన తత్త్వంబునం దైక్య, మొందు బయలు బయల నొందినట్లు

టీక. అట్లుగావునన్ = అవ్విధముగాఁ దెలియుదురు కాఁబట్టి, కళ=ఆత్మజ్ఞానము, హంసనాదంబులరూపమున్ = జీవేశ్వరులయొక్క కించిజ్జ్ఞత్వసర్వజ్ఞత్వాద్యుపాధులను, అడఁచి = నశింపఁజేసి, తనదు రూపుఁజేసి = ఆత్మజ్ఞానాకారము చేసి, బయలు బయల నొందినట్లు = ఘటాకాశము మహాకాశమం దైక్యమైనట్లు, తాను తానయైన తత్త్వంబునందున్ = తానే తానై వెలిఁగెడి పరబ్రహ్మమంగు, ఐక్యమొందున్ = కలయును.

తా॥ ఆప్రకారము తెలియుదురు కాఁబట్టి జీవేశ్వరులయొక్క కించిజ్జ్ఞత్వ సర్వజ్ఞత్వాద్యుపాధులను నశింపఁజేసి ఆత్మజ్ఞానాకారముగాఁ జేసి ఘటాకాశము మహాకాశమందు ఐక్యమయినట్లు తాను తానై వెలిఁగెడు పరబ్రహ్మమంగు కలయు నని తాత్పర్యము

మ॥ కలహంసాన్విత నాదబిందుకళ లైక్యంబెప్పుడో నప్పుడు
జ్జ్వలకర్పూరశిఖిప్రణాళముగతిన్ సర్వేంద్రియోపేతకా
నిలచిత్తంబులు శూన్యమై చనఁగ దా నిర్వాతదీపోపమా
చలసచ్చిత్సుఖవిగ్రహాత్ముఁ డలరున్ సంపూర్ణుఁడై యంతటన్. ౧౯౧

టీక. కల = అవ్యక్తమధురధ్వనులతోఁ గూడిన, హంస = బ్రహ్మప్రణవముతోడ, అన్విత = చేరిన, నాదబిందుకళలు = అకార ఉకార మకారాత్మకులైన పరమనాదబిందుకళలు, ఐక్యంబెప్పుడో = పరబ్రహ్మమందు మిళిత మెప్పుడౌనో, అప్పుడు = మిళితమైన ఆవేళయందు, ఉజ్జ్వల = మిగుల వెలుఁగుచున్న, కర్పూరశిఖి = కర్పూరదీపముయొక్క, ప్రణాళముగతిన్ = చల్లారుటవలననే, సర్వేంద్రియ = జ్ఞానకర్మేంద్రియములతోడ, ఉపేత = కూడిన, అనిల = ప్రాణపంచకమును, చిత్తంబులు = సంశయాత్మకచిత్తమును, శూన్యమై చనఁగన్ = లయింపఁగా, తాన్ = తానయిన బ్రహ్మజ్ఞాని, నిర్వాత = గాలిలేని, దీపోపమ = దివియవలె, అచల = చలింపని, సత్ = త్రికాలాబాధ్యమును, చిత్ = అపరోక్షజ్ఞానమును, సుఖ = దుఃఖనివృత్తిపూర్వకానందమును, విగ్రహాత్ముండు = స్వరూపము గలవాఁడును, అంతటన్ = సర్వత్ర, సంపూర్ణుఁడు = నిండినవాఁడును, ఐ = అగుచు, అలరున్ = శోభిల్లును – అనఁగా అఖండపరిపూర్ణసచ్చిదానందపరబ్రహ్మమై వెలుఁగు ననుట.

తా॥ అవ్యక్తధ్వనులతోఁ గూడిన బ్రహ్మప్రణవముతోఁ జేరిన అకార ఉకార మకారాత్మకమయిన నాదబిందుకళలు పరబ్రహ్మమందు యెప్పుడు చేరునో అప్పుడు వెలుఁగుచున్న కర్పూరదీపముయొక్క చల్లారుటవలననే కర్మేంద్రియజ్ఞానేంద్రియములతోఁ గూడిన ప్రాణపంచకమును, సంశయాత్మక

చిత్తంబును లయింపఁగా తానైన బ్రహ్మజ్ఞాని గాలిలేని దీపమువలె చలింపని కాలత్రయముచేత బాధింపఁ దగనిదియు అపరోక్షజ్ఞాన మయినదియు నైన సుఖదుఃఖనివృత్తిపూర్వకానందమును స్వరూపముగాఁ గలిగి అంతటను నిండినవాఁడై ప్రకాశించు నని తాత్పర్యము.

అ మ న స్క ని రూ ప ణ ము.

వ. ఇట్లు హంసనాదబిందుకళలతో సకలేంద్రియసమన్వితమనఃప్రాణంబు లెప్పుడు విలయం బగు నప్పు డయ్యవస్థ తురీయం బనియు నున్మని యనియు సహజామనస్కం బనియు జెప్ప నొప్పు నట్టి పూర్ణనిర్వికల్పసమాధియం దద్వితీయాపరోక్షస్వయంప్రకాశమానాఖండసచ్చిదానందస్వరూప పరమాత్మారామచైతన్యమాత్రుండవై యుండు మని యుపదేశించి వెండియు నిట్లనియె. ౧౯౩

టీక ఇట్లు = ఈప్రకారము, హంస = ప్రణవమందలి, నాదబిందుకళలతోన్ = నాదబిందుకళలతోడ సకలేంద్రియ = జ్ఞానకర్మేంద్రియములతోడ, సమన్విత = గూడిన, మనః = మనస్సు, ప్రాణంబులు = అసువులును, ఎప్పుడు విలయం బగున్ = ఎప్పుడు లయించునో, అప్పు డయ్యవస్థ = అప్పు డాదశ, తురీయం బనియున్ = తురీయ మని, ఉన్మని యనియున్ = ఉన్మని యని, సహజామనస్కం బనియున్ = సహజామనస్క మని, చెప్పనొప్పున్ = పలుకఁదగును, అట్టి = ఆ లయించినట్టి, పూర్ణ = సమగ్ర మైన, నిర్వికల్ప = వికల్పము లేని, సమాధియందున్ = నిష్ఠయందు, అద్వితీయ = స్వేతరవస్తుశూన్య మయిన, అపరోక్ష = తానె తా నయిన, స్వయంప్రకాశమాన = తనంతట వెలుఁగు చున్న, అఖండ = విభాగింపరాని, సచ్చిదానందస్వరూప = సత్యజ్ఞానానందరూప మయిన, పరమ = సర్వోత్తమ మైన, ఆత్మారామ = తనయందు తాను తానుగా క్రీడించు చున్న, చైతన్యమాత్రుండవై యుండుము = పరమాత్మస్వరూపివై యుండుము, అని యుపదేశించి = అని బోధించి, వెండియున్ = మరల, ఇట్లనియెన్ = ఇట్లు చెప్పనారంభించెను.

తా. సకలేంద్రియములతోఁ గూడిన మనస్సు ప్రాణములును నాదబిందుకళలతోడ నెప్పుడు లయించునో అప్పుడు ఆయవస్థ తురీయ మనియు, ఉన్మని యనియు, సహజామనస్కం బనియు, పలుకఁదగును అట్లు లయించినట్టి పూర్ణ మైనదియు, వికల్పము లేనిదియు నగు నిష్ఠయందు తనకంటె నితరము లేనట్టిదియు, తానె తా నైనట్టిదియు, తనంతటఁ బ్రకాశించు చున్నదియు, విభాగింపఁ దగని సత్యజ్ఞానానందరూప మగునట్టిదియు నగు సర్వోత్తమ మయిన తనయందు తాను క్రీడించు చున్న పరమాత్మస్వరూపివి కమ్మని తాత్పర్యము.

రా జ యో గ ని రూ ప ణ ము.

సీ. పరమహంసంబు లేపగలు చింతింపంగ, బిందు విందందుఁ గంపించు చుండు
దశవిధప్రణవనాదము లాలకింపంగఁ, దుదను ఘంటానాద మొదవి మ్రోయు
బహులక్ష్యలక్ష్యముల్ పరికించి చూడంగ, సురుచిరం బై స్వయంజ్యోతి యొప్పు
యామద్వయంబు యోగారూఢుఁ డై వాని, ధ్యానింపఁ దన్మయత్వంబు గలుగు
తే. నట్టియున్మనియందు మనోనిలములు, వివిధవిషయేంద్రియగుణాళి విలయ మొందు
సిద్ధి యొసఁగు సర్వవేదాంతవిదితపరమ, రాజయోగంబు దేవతారాజివినుత. ౧౯౪

టీక. దేవతారాజిసంస్తుత = దేవసంఘముచేతఁ గొనియాడఁబడు చున్న యోయాంజనేయా, పరమ = ముఖ్య మైన, హంసంబుల్ = రేచకపూరకాత్మక మైన హంసమంత్రమును, రేపగలు = రాత్రియందును పగలును, చింతింపంగన్ = ధ్యానింపఁగా, ధీవిభవము = బుద్ధి, ఇందఁగుచున్ = అంతర్బాహ్యములయందు, కంపింపకుండున్ = కదలకుండును, దశవిధ = చిణి మొదలగు పదివిధము లైన, ప్రణవనాదములు = ఓంకారధ్వనులు, ఆలకింపంగన్ = వినఁగా, తుదను = చివరను, ఘంటానాదము = ఘంటాధ్వని, ఒడవి ప్రోయున్ = లెస్సగా శబ్దించును, బహు = నానాప్రకారము లైన, లక్ష = చిహ్నములు గల, లక్ష్యములు = అంతర్బాహ్యమధ్యలక్ష్యములను, పరికించి = శోధించి, చూడంగన్ = కనుఁగొనఁగా, సురుచిరంబై = రమ్యమై, స్వయంజ్యోతి = ప్రకాశము, ఒప్పున్ = తగును - అనఁగా కనఁబడు ననుట, యామద్వయంబు = రెండుజాములు, యోగి = శివజీవైక్యనిష్ఠయందు, ఆరూఢుండై = నిశ్చయుండై, వానిన్ = ఆనాదబిందుకళలను, ధ్యానింపన్ = మననము చేయఁగా, సమ్మదయుత్వంబు = ఉపశాంతి, కలుగున్ = లభించును, అట్టి యున్మనియందున్ = ఉన్మనత్వము గల యోగావస్థయందు, మనోనిలములు = అంతఃకరణమును ప్రాణాదివాయువులను, వివిధ = బహువిధము లయిన, విషయ = శబ్దాదివిషయములు గల, ఇంద్రియములతోన్ = జ్ఞానకర్మేంద్రియములతోడ, విలయమొందున్ = నశించును, సర్వ = సకల మైన, వేదాంత = ఉపనిషత్తులయందు, విదిత = తెలియఁబడిన, పరమ = ఉత్కృష్ట మైన, రాజయోగంబు = అమనస్కయోగము, ఇదియనూ = ఇదే సుమా

తా. దేవసమూహములచేత కొనియాడఁబడు చున్న యో ఆంజనేయా! ముఖ్య మయిన రేచకపూరకాత్మక మగు హంసమంత్రమును రాత్రియును పగలును ధ్యానింపఁగా బుద్ధి అంతర్బాహ్యములయందు కదలకుండును, చిణి మొదలగు ఓంకారనాదములను వినుచుండఁగా కడపట ఘంటాధ్వని చక్కఁగా మ్రోయును, నానావిధము లయిన గుర్తులు గల అంతర్బాహ్యమధ్యలక్ష్యములను శోధించి కనుఁగొనఁగా రమ్య మైన స్వయంప్రకాశము కనఁబడును, రెండుజాములు శివజీవైక్యనిష్ఠయందు నిశ్చయుఁడై ఆనాదబిందుకళలను మననము చేయఁగా నుపశాంతి కలుగును. అట్టి యున్మన్యవస్థయందు అంతఃకరణమును ప్రాణవాయువులను బహువిధము లయిన శబ్దాదివిషయములు గల ఇంద్రియములతో (జ్ఞానేంద్రియకర్మేంద్రియములతో) నశించును ఇదియే యుపనిషత్తులయందుఁ దెలియఁబడిన రాజయోగ మని తాత్పర్యము.

అధికారితారతమ్యమున యోగసిద్ధి యగుటకుఁ గాలనిర్ణయముఁ దెలుపుట.

వ. ఇవ్విధంబునఁ బ్రతిదివసంబు యామద్వయనియమంబు దప్పక యభ్యసించిన నిర్మలనిశ్చలచిత్తవృత్తి గల పురుషునకు షణ్మాసంబులకు మందప్రజ్ఞునకు సంవత్సరంబునకుఁ గేవలమూఢాత్మునకు ద్వాదశవర్షంబులకుఁ బరమసూక్ష్మతారకయోగసిద్ధి యగు నని యోగశాస్త్రంబుల వినంబడు దివ్యజ్ఞానవిజ్ఞానసంపన్నుం డైన యాచార్యునిసాన్నిధ్యంబున వసియించి స్థానాంగభావాత్మశుశ్రూషలు గావించుచు నిరంతరంబు సేవించు మహానుభావునకు నిరంతరాయంబుగా శీఘ్రకాలంబున నిర్గుణబ్రహ్మసాక్షాత్కారం బగు సందేహంబు వలదు. ౧౫౪

టీక. ఇవ్విధంబునన్ = ఇట్లు, ప్రతిదివసంబు = అనుదినము, యామద్వయ = రెండుజాముల యొక్క, నియమంబున్ = నేమమును, తప్పక = విడువక, అభ్యసించినన్ = అలవాటుచేసినను, నిర్మల =

స్వచ్ఛ మైన, నిశ్చల = స్థిర మైన, చిత్తవృత్తి గల=మనఃప్రవర్తన గల, పురుషులకున్=నరులకు, షణ్మాసంబులకున్ = ఆఱు నెలలకును, మందప్రజ్ఞునకున్ = చిత్తపరిపాకము లేనివానికి, సంవత్సరంబునకున్= ఒక అబ్దమునకును, కేవలమూఢాత్మునకున్ = మిక్కిలి యవివేకికి, ద్వాదశవత్సరంబులకున్ = పండ్రెండేండ్లకు, పరమసూక్ష్మ = సూక్ష్మతర మయిన, తారకయోగ = ప్రణవానుసంధానము యొక్క, సిద్ధి యగు నని = సిద్ధి కలుగు నని, యోగశాస్త్రంబులన్ = జ్ఞానశాస్త్రములయందు, వినంబడున్=ఆకర్ణింపఁబడును, దివ్య = అనితరసాధారణ మైన, జ్ఞాన = శాస్త్రజ్ఞానమును, విజ్ఞాన = బ్రహ్మజ్ఞానమును, సంపన్నుండు= కలవాఁడు, ఐనయాచార్యునిసాన్నిధ్యంబునన్ = ఐనట్టి గురుసన్నిధానమందు, వసియించి = ఉండి, స్థానాంగభావాత్మశుశ్రూషలు = స్థాన అంగ భావ ఆత్మ లనెడు చతుర్విధ శుశ్రూషలను, కావించుచు= చేయుచు, నిరంతరంబు = ఎల్లప్పుడు, సేవించు = భజించెడు, మహానుభావునకున్ = ఘనునకు, నిరంతరాయంబుగాన్ = నిర్విఘ్నముగా, శీఘ్రకాలంబునన్ = అల్పకాలమునందు, నిర్గుణ = త్రిగుణరహిత మైన, బ్రహ్మ = పరమాత్మయొక్క, సాక్షాత్కారంబు = ప్రత్యక్షము, అగున్ = కలుగును, సందేహంబు వలదు = సంశయింపకుము

తా॥ ఈప్రకారము స్వచ్ఛ మైనట్టియు స్థిర మయినట్టియు మనఃప్రవర్తన గల మనుష్యులకు ఆఱు నెలలకు మిక్కిలి సూక్ష్మ మయిన ప్రణవానుసంధానముయొక్క సిద్ధి గలుగు ననియు, చిత్తపరిపాకము లేనివానికి ఒకసంవత్సరమునకు ఆ ప్రణవానుసంధానసిద్ధి కలుగు ననియు, కేవలమూఢాత్మునకు పండ్రెండుసంవత్సరములకు గాని గలుగ దనియు జ్ఞానశాస్త్రములయందు వినఁబడును, ఇతరము లేనట్టి సాధారణ మైన శాస్త్రజ్ఞానము కలవాఁడును అయిన గురువుయొక్క సన్నిధానమందు నుండి స్థానాంగ భావాత్మ లనెడు నాలుగువిధము లయిన శుశ్రూషలను చేయుచు నెల్లప్పుడు సేవించుచున్నవారికి విఘ్నము లేకుండ స్వల్పకాలములోనే త్రిగుణరహిత మైన పరమాత్మయొక్క సాక్షాత్కారము కలుగును ఇందుకు సందేహము లే దనిన తాత్పర్యము

(౧) ఆత్మశుశ్రూష యనఁగా—గురువు కోరినవస్తువులు శక్తికొలఁది సమర్పించుట

(౨) అంగశుశ్రూష యనఁగా—గురుమూర్తికి అభ్యంగన పదసేవ భూషణాలంకారాదులు సేయుట

(౩) స్థానశుశ్రూష యనఁగా—గురువును గృహారామక్షేత్రాదులయందు పోషించుట.

(౪) సద్భావశుశ్రూష యనఁగా—గురువే సాక్షాత్పరబ్రహ్మ మని ధ్యానించు చుండుట.

ఈ నాలుగును చతుర్విధశుశ్రూష లనఁబడును.

మ॥ అని బోధించిన నాంజనేయుఁడు తురీయానందముం బొంది చె
య్యన సీతాలలనాశిరోమణికి సాష్టాంగప్రణామంబు చే
సె నటంచున్ బరమేశ్వరుండు గృపచే శ్రీపార్వతీదేవికిన్
వినుపింప న్విని రాముఁ డేమనియె నావృత్తాంతముం జెప్పవే. ౧౬౫

టీక॥ అని బోధించినన్ = అని తెలుపఁగా, ఆంజనేయుఁడు = హనుమంతుఁడు, తురీయానందమున్=అష్టవిధ యోగానందములను మీఱిన నిర్విషయానందమును, పొంది=చెంది, చెయ్యనన్ = వేగముగా, సీతాలలనాశిరోమణికిన్ = అంగనారత్న మగు సీతాదేవికి, సాష్టాంగప్రణామంబు—సాష్టాంగ = ఎనిమిది

## సాష్టాంగనమస్కారలక్షణము.

అవయవములతోఁగూడిన, ప్రణామంబు = నమస్కారమును, చేసెన్ = ఒనర్చెను, శ్లో॥ ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తథా। పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోష్టాంగ ఉచ్యతే' అటంచున్ = అని, కృపచేత్ = నిర్వ్యాజకరుణచేత, పరమేశ్వరుండగు = సాంబమూర్తి, శ్రీపార్వతీదేవికిన్ = నిత్యవిభూతి గల పరమేశ్వరికి, వినుపింపన్ = శ్రుతపఱచఁగా, విని=ఆలించి, గాఢుఁడే యనియుచున్ = శ్రీరాము పరబ్రహ్మమేమని పలికెను, ఆ వృత్తాంతమున్ = ఆ వార్తను, చెప్పవే=పలుకరమ్మా.

## అష్టవిధానందవివేచనము.

బ్రహ్మానందము, వాసనానందము, విషయానందము, ముఖ్యానందము, ఆత్మానందము, అద్వయానందము, నిజానందము అని యానందము లెనిమిదివిధములు, అందు, సుషుప్తియందు స్వజాతీయ విజాతీయ స్వగతభేదరహితముగ జ్ఞానము వెలుఁగుచున్నది గావున అదే బ్రహ్మానందము, నిద్ర గడచిన క్షణమె వృత్తితోఁచుట వాసనానందము, స్రక్చందనాభరణవసనవనితాదిభోగములచేఁ గలిగినది విషయానందము, ద్రవ్యాదిసమస్తవస్తువులు లభించినప్పుడును తొలఁగినప్పుడును సుఖదుఃఖములు లేక యుండుట ముఖ్యానందము, వనితాదివిషయాభిలాషలయందు తోఁచు ప్రవృత్తి లే కుండుట ఆత్మానందము, బ్రహ్మము సత్యము నామరూపాత్మకప్రపంచము అసత్యమని తోఁచుట అద్వయానందము, యోగాభ్యాసముచేత మనోలయ మగుట నిజానందము, తత్త్వమస్యాదివాక్యార్థవిచారజనితాపరోక్షజ్ఞానమే విద్యానందము.

వ. అని యడుగుటయును. ౧౯౬

టీక. అని యడుగుటయును = అని యడుగఁగా

తా॥ ఈలాగు తెలుపఁగా ఆంజనేయుఁడు సీతాదేవికి సాష్టాంగనమస్కారము చేసెనని సాంబమూర్తి పార్వతీదేవికి కృపతోఁ జెప్పగా విని పార్వతిదేవి అనంతరము రాముపరబ్రహ్మమేమని పలికెను చెప్పవయ్యా యని యడిగెనని తాత్పర్యము

చ. పరమదయాసముద్ర గుణభద్ర కరాంచితబోధముద్ర భా
 స్కరశతకోటిధామ జితకామ బుధాంబుధిసోమ విస్ఫుర
 న్నిరతిశయప్రభావ ఘననిర్మలభావ మహార్ద్రభావ శం
 కర హరి ధాతృరూప చిదఖండకలాప జగత్ప్రదీపకా. ౧౯౭

టీక పరమదయాసముద్ర—పరమ = నిరతిశయ మైన, దయా = కృపకు, సముద్ర = సాగరమువంటి వాఁడా! గుణభద్ర = శాంతశమదమాది కల్యాణగుణములు గలవాఁడా! కర = హస్తమందు, అంచిత= ఒప్పిద మగుచున్న, బోధముద్ర = చిన్ముద్ర గలవాఁడా! భాస్కరశతకోటిధామ — భాస్కరశతకోటి = నూరుకోట్లసూర్యులయొక్క, ధామ= తేజస్సువంటి తేజస్సు గలవాఁడా! జితకామ = గెలువఁబడిన మన్మథుఁడు గలవాఁడా! బుధాంబుధిసోమ — బుధ=బ్రహ్మవిదులనెడి—నాలుగని యర్థాంతరము, అంబుధి= సముద్రమునకు, సోమ = చంద్రుఁడా! విస్ఫురత్= మిగుల వెలుఁగుచున్న, నిరతిశయ=మహత్తర మైన, ప్రభావ = మహాత్త్వము గలవాఁడా! ఘననిర్మలభావ—ఘన=గొప్ప దైన, నిర్మల = స్వచ్ఛ మైన, భావ= స్వరూపము గలవాఁడా! ॥ని॥ 'భావస్సత్తా స్వభావాభిప్రాయచేష్టాత్మజన్మసు' అని అమరము. మహార్ద్ర భావ—మహత్ = మిక్కుటమైన, ఆర్ద్ర = సరస మైన, భావ = అంతరంగము గలవాఁడా! శంకరహరి

ధాతృరూప=శివ విష్ణు బ్రహ్మస్వరూపుఁడా! చిదఖండకలాప—చిత్ = బ్రహ్మజ్ఞాన మనెడు, అఖండ=పరిపూర్ణ మైన, కలాప = ఆభరణము గలవాఁడా! జగత్ప్రదీపకా — జగత్ = పదునాలుగులోకములను, ప్రదీపకా=వెలిగించువాఁడా

తా॥ నిరతిశయ మైన కృపకు సముద్రమువంటివాఁడా! శాంతశమదమాది కల్యాణగుణములు గలవాఁడా! హస్తమునం దొప్పుచున్న జ్ఞానముద్రయు గలవాఁడా! నూఱుకోట్లసూర్యులయొక్క తేజస్సు గలవాఁడా! మన్మథుని గెలిచినవాఁడా! బ్రహ్మవిదు లనెడు సముద్రమునకు చంద్రునివంటివాఁడా! మిగుల వెలుఁగుచున్న మహత్తర మయిన మహత్త్వము గలవాఁడా! గొప్పదియగు నిర్మల మయినదియు నగు స్వరూపము గలవాఁడా! అతిశయసరస మైన అంతరంగము గలవాఁడా! శివ విష్ణు బ్రహ్మస్వరూపుఁడా! బ్రహ్మానంద మనెడు పరిపూర్ణఆభరణము గలవాఁడా! పదునాలుగులోకములను వెలిఁగించువాఁడా! ఓ సచ్చిదానందమూర్తీ యని తాత్పర్యము. (ఈ పద్యమునకు కడపటిపద్యములో నన్వయము.)

క. జగదింద్రజాలకల్పక, సగుణాగుణరూప పరమసత్యాలాపా
నిగమాగమాంతవినుతా, త్రిగుణాతీతస్వభావ ధీనుతభావా. ౧౯౮

టీక జగత్ = విషయేంద్రియాది దేవతారూపము లగు త్రిలోకము లనెడు, ఇంద్రజాల=గారడిని, కల్పక=నిర్మించువాఁడా! సగుణాగుణరూప = సగుణ నిర్గుణ స్వరూపుఁడా! పరమసత్యాలాపా—పరమ=సర్వోత్తమ మైన, సత్య=పరబ్రహ్మమును, ఆలాపా = ప్రతిపాదించువాఁడా! నిగమాగమాంతవినుతా — నిగమ = ఋగ్వాదిచతుర్వేదములయొక్క, ఆగమ=కామికాది వాతూలాంతాష్టావింశతిమహాగాగమముల యొక్క, అంత=అగ్రము లైన యుపనిషత్తులచేత—పర్యాక్రియా యోగ జ్ఞానపాదము లను నాల్గింటిచేతను చెప్పఁబడు నడధ్వములతోఁ గూడిన కర్మకర్తృమూర్తిఅమూర్తికివమహాసాంగాఖ్యములచేత, వినుతా = పొగడఁబడువాఁడా! త్రిగుణాతీతస్వభావ — త్రిగుణ = రజస్సత్త్వతమోగుణములకు, అతీత = విలక్షణ మైన, స్వభావ = స్వరూపముగలవాఁడా! ధీనుతభావా— ధీ=విజ్ఞానులచేత, నుత=అగ్గింపఁదగిన, భావా = ప్రవర్తనలు గలవాఁడా

తా॥ విషయేంద్రియములకు అధిదేవతారూపము లగు త్రిలోకము లనెడు యింద్రజాలమును కల్పించువాఁడా! సత్యమైన పరబ్రహ్మమును ప్రతిపాదించువాఁడా! ఋగ్వేదము మొదలయిన నాలుగువేదములయొక్కయు కామికాది యిరువదియెనిమిదిమహాగమములయొక్కయు అగ్రము లయిన యుపనిషత్తులచేత పొగడఁబడినవాఁడా! త్రిగుణములకంటె విలక్షణ మయిన స్వరూపము గలవాఁడా! విజ్ఞానులచే స్తోత్రము చేయఁదగిన ప్రవర్తన గలవాఁడా! ఓ సచ్చిదానందమూర్తీ యని తాత్పర్యము (ఈ పద్యమునకును కడపటిపద్యములో నన్వయము)

బ్రహ్మయొక్కముఖమునుండి నాలుగువేదములు యెట్లు పుట్టినవో ఆప్రకారముగానే ఈశ్వరుని యొక్క సద్యోజాత వామదేవ అఘోర తత్పురుషము లను నాలుగుముఖములనుండి యిరువదియాగమములును, అయిదవది యగు ఈశానముఖమునందుండి యెనిమిదియాగములును వచ్చెను

మాలిని. కలుషచయవిరామా ఖండితాశేషకామా
సులభసుఖవిచారా సూరిచేతోవిహారా
విలయజననదూరా విశ్వరూపావికారా
సలలితశుభకీర్తీ సచ్చిదానందమూర్తీ. ౧౯౯

టీక కలుషచయవిరామా — కలుష = పాపములయొక్క, చయ = గుంపును, విరామా = నశింపఁజేయువాఁడా! ఖండితాశేషకామా — ఖండిత = త్రుంపఁబడిన, అశేష కామా = ఎల్లకోరికలు గలవాఁడా! సులభసుఖవిచారా — సులభ = అనాయాసముగ లభించిన, సుఖవిచారా = బ్రహ్మవిచారము గలవాఁడా! సూరిచేతోవిహారా — సూరి = బ్రహ్మవేత్తలయొక్క, చేతః = మనస్సునందు, విహారా = విహరించువాఁడా! విలయజననదూరా — విలయ = నాశమునకు, జనన = పుట్టుకకు, దూరా = దవ్వైనవాఁడా! విశ్వరూపా = ప్రపంచ స్వరూపుఁడా — లోకమయుఁడని అర్థాంతరము, అవికారా = షడ్భావవికారములు లేనివాఁడా! సలలితశుభకీర్తీ — సలలిత = రమ్యమైన, శుభ = మంగళకరమైన, కీర్తి = యశస్సు గలవాఁడా! సచ్చిదానందమూర్తీ = సత్యజ్ఞానానందస్వరూపుఁడా!

పద్యలక్షణము॥ ననమయయ యుతంబై నాగవిశ్రాంతమై యు। న్వినుత గుణము మాలిన్యాఖ్యమగు బద్యమ్ము ధాత్రిన్ ॥ మాలినీవృత్తమునకు ననమయయగణములును తొమ్మిదవ యక్షరము యతియు నుండవలయు ననుట

తా॥ పాపములయొక్క సమూహమును నాశనము చేయువాఁడా! ఖండింపఁబడిన సకల కోరికలు గలవాఁడా! అనాయాసముగ లభించిన బ్రహ్మవిచారము గలవాఁడా! బ్రహ్మవేత్తలయొక్క మనస్సులయందు విహరించువాఁడా! పుట్టుకయును నాశమును లేనివాఁడా! ప్రపంచస్వరూపుఁడా! (లోకమయుఁడా) షడ్భావవికారములు లేనివాఁడా! రమ్యమైనట్టిదియు మంగళకరమైనట్టిదియు నగు కీర్తి గలవాఁడా! ఓ తత్త్వజ్ఞానస్వరూపుఁడా యని తాత్పర్యము (కడపటిపద్యముతో నన్వయము)

గద్య. ఇది శ్రీమన్నారాయణమహాదేవగురుకరుణాకటాక్షవీక్షణవిమలీకృతనిజహృదయకమలకర్ణికాంతసందర్శితాఖండసచ్చిదానందరసైకస్ఫూర్తి షట్చక్రసీతారామమూర్తి పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి ప్రణీతంబైన శ్రీసీతారామాంజనేయసంవాదం బను యోగశాస్త్రంబునందుఁ దారకయోగానుభవవిచారం బనునది ప్రథమాశ్వాసము.

టీక. ఇది = ఈగ్రంథము, శ్రీమత్ = అణిమాదిసంపదలు గల, నారాయణ = నారాయణుఁడను గురువు యొక్క, మహాదేవగురు = మహాదేవగురువుయొక్క, కరుణ = కృపతోఁ గూడిన, కటాక్షవీక్షణ = క్రేఁగంటి చూపుచేత, విమలీకృత = నిర్మలముగాఁ జేయఁబడిన, నిజ = స్వకీయమైన, హృదయకమల = మనఃపద్మముయొక్క, కర్ణికాంత = గుద్దుమీఁద, సందర్శిత = చూడఁబడిన, అఖండ = అభిన్నములైన, సచ్చిదానందరస = సత్యజ్ఞానానందములయొక్క, ఏక = ఏకీభావముచేత, స్ఫూర్తి = ప్రకాశించుచున్న, షట్చక్ర = మూలాధారాది షట్చక్రములయందు, సీతా = యోగమాయయైన సీతాదేవితో విహరించుచున్న, రామమూర్తి = శ్రీరామరూపము గల, పరశురామపంతుల = పరశురామపంతులవారనెడు గృహనామము గల, లింగమూర్తి గురుమూర్తి = లింగమూర్తి గురుమూర్తియను కవిచేత, ప్రణీతంబైన = రచియింపఁబడిన, శ్రీ = బ్రహ్మవిద్యాస్వరూపిణియైన, సీతా = మూలప్రకృతియగు సీతాదేవియొక్కయు, రామ = పరబ్రహ్మమైన రామునియొక్కయు, ఆంజనేయ = ప్రత్యగాత్మయైన ఆంజనేయునియొక్కయు, సంవాదంబు = పరమార్థప్రతిపాదకమయిన సంభాషణము, అను యోగశాస్త్రంబునందు = అనెడు వేదాంతశాస్త్రమునందు, తారకయోగ = ప్రణవానుసంధానముయొక్క, అనుభవ = స్వానుభూతియొక్క, విచారం బనునది = పరిశీలన మనునది ప్రథమాశ్వాసము.

తా. ఈగ్రంథము అణిమాదులు సంపదలు గల నారాయణమహాదేవు లనెడు గురువులయొక్క క్రీఁగంటిచూపులచేత నిర్మలముగాఁ జేయఁబడిన స్వకీయమైన మన స్సనెడు కమలములయొక్క గద్దె మీఁద చూడఁబడిన సత్యజ్ఞానానందములయొక్క యేకీభావముచేత ప్రకాశించుచున్న మూలాధారాది షట్చక్రములయందు యోగమాయ యైన సీతాదేవితో విహరించుచున్న శ్రీరామరూపము గల పరశు రామపంతులవా రనెడు యింటిపేరు గల లింగమూర్తి గురుమూర్తి యనెడు కవీంద్రునిచేత రచియింపఁ బడిన మూలప్రకృతి యగు సీతాదేవియొక్కయు, పరబ్రహ్మ మైన రామునియొక్కయు, ప్రత్యగాత్మ యయిన యాంజనేయునియొక్కయు పరమార్థప్రతిపాదకసంభాషణ మనెడు వేదాంతశాస్త్రమునందు ప్రణవానుసంధానముయొక్క అనుభవవిచారం బను ప్రథమాశ్వాసము ముగిసె నని తాత్పర్యము

మొదటియాశ్వాసము - సంపూర్ణము.



శ్రీ రస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# శ్రీ సీతారామాంజనేయసంవాదము

## ద్వితీయాశ్వాసము

## టీకాతాత్పర్యప్రతిమాసహితము.

క. శ్రీదత్తాత్రేయగురు, ప్రాదుర్భూతాపరోక్షపరమజ్ఞాన
శ్రీద్యుత మహాదేవ మహాదేవాచార్య వినమితామరవర్యా ౧

టీక శ్రీ=బ్రహ్మవిద్యాయుక్తుఁ డయిన, దత్తాత్రేయ = దత్తాత్రేయుఁ డనెడు, గురు=ఆచార్యుని వలన, ప్రాదుర్భూత=పుట్టిన, అపరోక్ష=సాక్షాత్కార మయిన, పరమ=ఉత్తమ మైన, జ్ఞాన=బ్రహ్మజ్ఞాన మనెడు, శ్రీ=సంపదను, ధృత=ప్రియుఁడా! మహాదేవ=సకలమునం దత్యంతముగ వెలుఁగుచున్న వాఁడా! 'దివు క్రీడా విజిగీషా వ్యవహార ద్యుతి స్తుతి మోద మద స్వప్న కాంతిగతిషు' వినమితామరవర్యా — వినమిత = నమస్కరించుచున్న, అమరవర్య = దేవతాశ్రేష్ఠులు గలవాఁడా! మహాదేవాచార్యా = మహాదేవనామము గల గురుమూర్తీ

తా. బ్రహ్మవిద్యతోఁ గూడుకొన్న దత్తాత్రేయుఁ డనెడి యాచార్యునివలనఁ బుట్టిన దగు సాక్షాత్కార మయిన బ్రహ్మజ్ఞాన మనెడు సంపదకు ప్రియుఁడా! సకలమునందు విశేషముగాఁ ప్రకాశించుచున్నవాఁడా! దేవతలచే నమస్కరింపఁబడువాఁడా! మహాదేవనామము గల గురుమూర్తీ యని తాత్పర్యము ఈ పద్యమునకు క్రిందివచనమునం దుండు 'అవధరింపుము' అనుపదమును క్రియగా నన్వయించుకొనవలయును.

వ. అవధరింపుము శ్రీమహాదేవుండు అమ్మహాదేవి కిట్లనియె. ౨

టీక అవధరింపుము = వినుము, శ్రీమహాదేవుండు—శ్రీ = నిత్యవిభూతి గల, మహాదేవుండు=శివుఁడు, అమ్మహాదేవికిన్ = ఆ పార్వతీదేవికి, ఇట్లు = ఈ చెప్పఁబోవునట్లు, అనియెన్ = పలికెను

తా. (ఓగురుమూర్తీ!) వినుము. సాంబమూర్తి పార్వతీదేవికి యీ చెప్పఁబోవువిధమున పలికెనని తాత్పర్యము.

క. శ్రీరాముఁ డపుడు శ్రీసీ, తారమణుఁ బంపుఁ జూచి తలయూఁచి మహా
కారుణ్యకటాక్షముచే, మారుతివరసుతునిఁ గాంచి మందస్మితుఁడై. ౩



సీతాదేవి



శ్రీరాములు



ఆంజనేయులు

టీక. అపుడు = ఆంజనేయుఁడు సీతాదేవికి మ్రొక్కి నిలిచియున్న సమయమందు, శ్రీరాముఁడు = శ్రీరామమూర్తి, శ్రీ = లక్ష్మీస్వరూపురా లయిన, సీతారామ = సీతాదేవియొక్క, ముఖంబున్ = మొగమును, చూచి = కాంచి, తలయూఁచి = శిరఃకంపనముచేసి — అనఁగా శ్రీరాముఁడు తనకు నిత్యభక్తుఁడైన ఆంజనేయుని తారకయోగపరిపూర్ణునిఁగాఁ జేసిన సీతాదేవిని జూచి మిగుల సానందముచేఁ దలయూఁచె ననుట. మహాకారుణ్య = మిక్కిలి యక్కటికము గల, కటాక్షముచేన్ = కడగంటిచూపు చేత, మారుతవరసుతునిన్ = ఆంజనేయుని, కాంచి = చూచి, మందస్మితుఁడై = చిఱునవ్వు గలవాఁడై.

తా. ఆంజనేయుఁడు సీతాదేవికి మ్రొక్కి నిలుచున్న సమయంబున శ్రీరాముఁడు లక్ష్మీస్వరూపురా లయిన సీతాదేవియొక్క మొగమును జూచి తమకు నిత్యభక్తుఁ డయిన యాంజనేయుని తారకయోగ పరిపూర్ణునిఁగా జేసెను గదా యని తలయూఁచి యానందించెను, మఱియు మిక్కిలి దయతోఁ గూడిన కడగంటచూపుచేత యాంజనేయునిఁ జూచి చిఱునవ్వు గలవాఁ డాయె నని తాత్పర్యము.

తే. తెలిసె నయ్య సీతాదేవి దెలియఁ జెప్ప, గలితతారకయోగప్రకార మెల్ల
నింక నీపయిఁ గరుణచే నెఱుక పఱతు, సాంఖ్యయోగంబు వినుమా ప్రసంగ మనఘ.

టీక. అనఘ = ఆంజనేయా, సీతాదేవి = మైథిలి, తెలియఁజెప్పన్ = బోధింపఁగా, కలిత = ఒప్పిద మయిన, తారకయోగ = ప్రణవార్థానుసంధానముయొక్క, ప్రకారమెల్లన్ = స్వరూప మంతయును, తెలిసెనయ్య = అవగతమాయెను, (అనఁగా, 'శ్లో॥ అకారో వహ్ని రిత్యుక్త ఉకార స్సూర్య ఉచ్యతే । మకార శ్చంద్ర ఇత్యుక్త ఏత త్తారకలక్షణమ్' తా బ్రహ్మప్రణవమందలి అకార ఉకార మకారములే అగ్నిసూర్యచంద్రులు గావున ఆ మండలత్రయమధ్యగతం బయి వెలుఁగునది తారకము - అనఁగా ప్రణవము, ఆప్రణవార్థ మగు బ్రహ్మము నేనని అనుసంధానము చేయుటయే తారకయోగము, అది విశదముగా దెలిసినది గదా యనుట) ఇంకన్ = ఇంకమీఁద, నీపయిఁ గరుణచేన్ = నీయందలి దయచేత,

సాంఖ్యయోగంబుఁ = జ్ఞానయోగమును, ఎఱుకపఱతుఁ = తెలిపెదను, ఆ ప్రసంగముఁ = ఆ యుపన్యాసమును, వినుము = ఆలకింపుము

తా॥ ఇట్లు చూచి చిఱునగవు గలవాఁడై, ఓ యాంజనేయా! ప్రణవార్థానుసంధానముయొక్క స్వరూప మంతయు సీతాదేవివలన తెలిసెనుగదా, ఇఁక నీయందలికరుణచేత జ్ఞానయోగమును తెలిపెదను ఆకర్ణింపు మని తాత్పర్యము

వ. సాంఖ్యామనస్కంబు లుపనిషదర్థప్రతిపాదకంబు లందు దొలుత సాంఖ్యంబు తేటపడ వివరించెద నిశ్చలచిత్తుండవై విను మని యిట్లనియె. ౫

టీక. సాంఖ్యామనస్కంబులు = సాంఖ్యయోగమును అమనస్కయోగమును - అనఁగా సంఖ్యయే సాంఖ్యము, సంఖ్య యనఁగా లెక్క - అనఁగా జ్ఞానేంద్రియకర్మేంద్రియప్రాణవిషయపంచకములును అంతఃకరణచతుష్టయమును అనెడు చతుర్వింశతితత్త్వములును ప్రకృతి యనియును, పంచవింశతితత్త్వాత్మకుఁడు జీవుఁ డనియును షడ్వింశతితత్త్వాత్మకుఁడు యీశ్వరుఁ డనియును, ఈ జీవేశ్వరసమ్మేళనమే సప్తవింశతితత్త్వాత్మక పరబ్రహ్మ మనియును, ఆ పరబ్రహ్మమే నే నని యిివ్విధముగ అనుసంధానముచేయుటయే సాంఖ్యయోగము, అమనస్క మనఁగా మనోలయము, అది స్వరూపలయ మనియు, అరూపలయ మనియు ద్వివిధము, అందు స్వరూపలయము జీవన్ముక్తిదశయందును, అరూపలయము విదేహముక్తిదశయందును అగును అవి రెండును, ఉపనిషదర్థప్రతిపాదకంబులు — ఉపనిషదర్థ = వేదాంతతాత్పర్య మగు పరబ్రహ్మమును, ప్రతిపాదకంబులు = నిరూపించినవి, తొలుతఁ = మొదట, సాంఖ్యంబు = జ్ఞానయోగము, తేటపడఁ = విశద మగునట్లు, వివరించెదఁ = చెప్పెదను, నిశ్చలచిత్తుండవై = స్థిరబుద్ధి గలవాఁడవై, వినుము = ఆకర్ణింపు మని, ఇట్లనియెఁ = వక్ష్యమాణప్రకారము గాఁ జెప్ప నారంభించెను

తా॥ ఇరువదియైదుతత్త్వములతోఁ గూడినవాఁడు జీవుఁ డనియు, ఇరువదియాఱుతత్త్వములతోఁ గూడినవాఁడు ఈశ్వరుఁ డనియు, ఈ జీవేశ్వరసమ్మేళనమే ఇరువదియేడుతత్త్వములతోఁ గూడిన పరబ్రహ్మ మనియు, ఆ పరబ్రహ్మమే నే నని యనుసంధానము చేయుట సాంఖ్య మనఁబడును స్వరూపారూపలయ విశిష్ట మగు మనోలయము అమనస్క మనఁబడును, అట్టి సాంఖ్య అమనస్కయోగములు రెండును వేదాంతతాత్పర్య మగు పరబ్రహ్మమును నిరూపించునవి, వాటిలో మొదటిది యగు సాంఖ్యము (జ్ఞానయోగము)ను చెప్పెదను స్థిరబుద్ధి గలవాఁడవై విను మని యిట్లు చెప్ప నారంభించె నని తాత్పర్యము

## పరబ్రహ్మస్వరూపనిర్ణయము.

సీ. ఏకమై పరమై విశోకమై సత్యమై, లోకమై వ్యాపకాలోక మగుచు
జ్ఞానమై జగదధిష్ఠానమై ముక్తినిదానమై మాయావిహీన మగుచు
నందమై కేవలానందమై నంతతానందమై శ్రుతిపద్మకంద మగుచు
సారమై చిదచిదాకారమై యతినిర్వికారమై విగతసంసార మగుచు
తే. వెలుఁగు మెలసూలకలనలు గలుగుకొనుచు
మెలఁగుప్రకృతిని దగులక మిగిలి వెలుఁగు

క. ప్రస్థానత్రయవేద్యుం డవస్థాత్రయసాక్షి సర్వవస్తుస్తోమాం
తస్థుం డస్థిరవిశ్వభవస్థిత్యంతాదిమూర్తి వాయుకుమారా. ౯

టీక వాయుకుమారా = ఆంజనేయా, ప్రస్థానత్రయవేద్యుండు—ప్రస్థానత్రయ = ఉపనిషద్భాష్య గీతాభాష్యసూత్రభాష్యములచేత, వేద్యుండు = ఎఱుంగఁదగినవాఁడును- లేక అకార ఉకార మకారము లనెడు త్రిస్థానములు గల ప్రణవముచేత యెఱుంగఁదగినవాఁడు, 'శ్లో॥ అష్టాంగం చ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతమ్ । ఓమిత్యేవం నజానాతి బ్రాహ్మణో న భవేత్సహి' అని బ్రహ్మప్రణవార్థప్రకాశికయందు, అవస్థాత్రయసాక్షి—అవస్థాత్రయ = జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలకు, సాక్షి = ద్రష్టయును, సర్వవస్తుస్తోమాంతస్థుండు—సర్వ = సమస్తములైన, వస్తు = చేతనాచేతనరూపపదార్థములయొక్క, స్తోమ = సమూహములయొక్క, అంతస్థుండు = లోపల నుండువాఁడును, అస్థిర = శాశ్వతములు కాని, విశ్వ = లోకములయొక్క, భవ = ఉత్పత్తికిని, స్థితి = ఉనికికిని, అంత = లయమునకును, ఆదిమూర్తి = కారణస్వరూపుఁడును పై పద్యములో నన్వయము

తా ఓ యాంజనేయా! ప్రస్థానత్రయముచేఁ దెలియఁదగినవాఁడును, (ఉపనిషద్భాష్య గీతాభాష్య సూత్రభాష్యాదులచే దెలియఁదగినవాఁడు, లేక అకార ఉకార మకారము లనెడు త్రిస్థానములు గల ప్రణవముచేత యెఱుంగఁదగినవాఁడు) జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను చూచువాఁడును, సమస్తమయిన వస్తుసమూహములయొక్క లోపల నుండువాఁడును, అశాశ్వతము లయిన లోకములయొక్క పుట్టుకకును వునికికిని నాశమునకును కారణస్వరూపుఁడును నైన పరమాత్మ యని తాత్పర్యము.

పంచచామరము ఇలాజలానలానిలాంబరేందుభానుమండలో
జ్జ్వలాఖిలావిలామలాత్మజాలకాంతరస్థచం
చలాచలావిలాసశూన్యసంతతాపరోక్షచి
త్కళాకలాపలాలితప్రకాశకుం డతం డగుస్. ౧౦

టీక అతండు = ఆ పరబ్రహ్మము, ఇలా = భూమి, జల = ఉదకము, అనల = అగ్ని, అనిల = గాలి, అంబర = ఆకాశము, ఇందు = చంద్రుఁడు, భాను = సూర్యుఁ డనెడు, మండల = ఈ సప్తమండలములును, ఉజ్జ్వల = వెలుఁగుచున్న, అఖిల = సమస్తమైన, ఆవిల = కలుషజీవులగునంగు, అమల = నిర్మలజీవులయం దుండెడు-అనఁగా పాపులైన కృతక్రిమి జలచర పశు పక్ష్యాదులయందును, పుణ్యు లయిన బ్రహ్మాదిదేవతలయందును, మిశ్రులైన మనుష్యులయందును నుండెడు, ఆత్మ=అంతర్యామి యగును - అనఁగా 'శ్లో॥ ద్వయ ముష్ణం ద్వయం శీతం అనుష్ణాశీతలద్వయమ్ । ద్వయోః మూర్తస్పర్శనం చైవ సాంతస్య శివమూర్తయః' తా సూర్యాగ్నులు జలచంద్రులు పృథివీవాయువులు ఆకాశాత్మలు యివి శివాష్టమూర్తులు ఇవి యనెడు, జాలక = సోరణగండ్లయొక్క, అంతరస్థ = లోపల నున్నట్టి, చంచల = కదలెడు, అచల = కదలని, అవిలాస = క్రియలయొక్క, ॥ని॥ 'విలాసో విభ్రమః క్రియయోః' అని అమరము. శూన్య = లేనిదై, సంతత = ఎప్పుడు, అపరోక్షచిత్ = అపరోక్షజ్ఞానముయొక్క, కళా = చిత్కళలయొక్క, కలాప = సమూహమును, ॥ని॥ 'కలాపో భూషణే బర్హే తూణీరే సంహతేపిచ' అని అమరము, లాలిత = ఒప్పిదమగునట్లు, ప్రకాశకుండు = వెలిఁగించువాఁడు, అగుస్ = అవును-అనఁగా పరబ్రహ్మము జ్ఞానాతీతమయిన దని భావము. 'శ్లో॥ వాచాతీతం మనోతీత భావాతీతం చ తత్పదమ్ । జ్ఞానాతీతం నిరంజనం కళాయాం సూక్ష్మభావయేత్' అని చెప్పఁబడినది

పద్యలక్షణము॥ జరజ్జగజ్జగంబుగూడి సన్నుతి ప్రచారింపఁగా । బరాజితారి ధీరవీర పంచచామరం బగున్. తా॥ పంచచామరమునకు జర జర జగణములును ఒక్క గురువును పదియవ అక్షరము యతి స్థానము నుండవలయు ననుట

తా॥ అట్టి పరబ్రహ్మము భూమి ఉదకము అగ్ని గాలి ఆకాశము చంద్రుఁడు సూర్యుఁడు అను నీ సప్తమండలములయందు ప్రకాశించుచున్న పాపులయిన పురుగులు వృక్షములు మొదలగువానియందును, పుణ్యులైన బ్రహ్మ మొదలగు దేవతలయందును, మిశ్రులైన మనుష్యులయందును నుండెడు అంతర్యామి యొక్క, బాలకములయొక్క (గవాక్షములు) లోపల నున్నట్టి కదలునదియు కదలనిదియు నైన క్రియ లేనిదియు, అపరోక్షజ్ఞానము యొక్క చిత్కళా సమూహమునకు ప్రకాశించునదియును నై యున్నదని తాత్ప

క॥ ఆద్యుం డపరిచ్ఛేద్యుఁ డ,విద్యాధ్వాంతద్యుమణి సువిద్యావద్యో

వేద్యుఁడు గర్కశతర్కా,భేద్యుం డనవద్యుఁ డగు నభేదాత్ముఁ డజా ౧౧

టీక॥ అజా = ఉత్పత్తిలేని యోయాంజనేయా, ఆద్యుండు = సృష్టిస్థితిసంహారతిరోధానానుగ్రహము లనెడు పంచకృత్యములకు కారణుండును-అనఁగా బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివు లనెడు పంచకర్తల కతీతుఁ డనుట అపరిచ్ఛేద్యుఁడు=దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యుఁడు, అవిద్యాధ్వాంతద్యుమణి— అవిద్యా = అజ్ఞాన మనెడు, ధ్వాంత = చీఁకటికి, ద్యుమణి = సూర్యుఁడును - అనఁగా అజ్ఞాననాశకుం డనుట, సువిద్యాసద్వేద్యుఁడు—సువిద్యా = ఉత్తమ మగు బ్రహ్మజ్ఞానముచేత, సద్యః = తత్క్షణమే, వేద్యుఁడు = ఎఱుఁగఁదగినవాఁడును- అనఁగా బ్రహ్మజ్ఞానముచేతనే తెలియఁదగినవాఁ డనుట, కర్కశతర్కాభేద్యుండు—కర్కశ = కఠిన మైన, తర్క = తర్కశాస్త్రముచేత, అభేద్యుండు = భేదింపఁగాని వాఁడును - అనఁగా తర్కము ప్రత్యక్షానుమానోపమానశాబ్దము లనెడు చతుర్విధప్రమాణములు గలది, పరబ్రహ్మము ప్రమాణాతీతుండు గనుక తర్కశాస్త్రముచేతఁ దెలియఁదగనివాఁ డనుట, అనవద్యుఁడు = నిరుపాధికుఁడును - అనఁగా స్థూలసూక్ష్మకారణోపాధులు లేనివాఁ డనుట, అభేదాత్ముఁడు—అభేద = విభాగింపఁగూడని, ఆత్ముఁడు = స్వరూపము గలవాఁడును-అనఁగా అఖండస్వరూపుఁ డనుట, అగుక = అవును.

తా॥ ఉత్పత్తి లేని యోయాంజనేయా! పరబ్రహ్మ మెట్టిదో నింకను వివరించెదను వినుము పరబ్రహ్మము సృష్టి స్థితి సంహార తిరోధా నానుగ్రహము లనెడు పంచకృత్యములకు కారణుఁడును, (బ్రహ్మ రుద్ర విష్ణు మహేశ్వర సదాశివు లనెడు పంచకర్తల కతీతుఁడును) దేశము, కాలము, వస్తువు వీటిచేత వేఱుకలుపఁబడనివాఁడును, చీఁకటికి సూర్యునివలె అజ్ఞానమునకు నాశకుఁడును, ఉత్తమ మగు బ్రహ్మజ్ఞానముచేతఁ దెలియఁదగినవాఁడును, తర్కశాస్త్రమందలి ప్రత్యక్షాదిప్రమాణములచేతఁ దెలియఁదగనివాఁడును, స్థూలసూక్ష్మకారణోపాధులు లేనివాఁడును, విభాగింపఁగూడనిస్వరూపము గలవాఁడును నై యున్నాఁడని తాత్పర్యము.

క॥ భూతానుభూతమిథ్యా,భూతద్వైతమయపంచభూతోత్థజగ

జ్జాతానుస్యూతాజా,ద్వైతాత్ముఁ డతండు వాయుతనయ మహాత్మా. ౧౨

టీక॥ మహాత్మా—మహత్ = శ్రేష్ఠ మైన, ఆత్మా = బుద్ధి గల, వాయుతనయ = ఆంజనేయా, అతండు = ఆ పరబ్రహ్మము, భూత = రెండువిధము లైన స్థావరజంగమప్రాణులను, అనుభూత = పొందియున్నట్టి, మిథ్యా= నాన రూపములుగాఁ దోఁచుచున్న ప్రకృతివలన, భూత= పుట్టిన, ద్వైతమయ = పంచ

కృత అపంచీకృతము లని రెండువిధము లయిన, పంచభూత = భూజలాగ్నివాయుగగనములవలన, ఉత్థ = పుట్టిన, జగత్ = జననలయములు గల లోకములయొక్క, జాత = సమూహమందు, అనుగ్యాత = కూడిన వాఁడై- అనఁగా 'శ్లో॥ అస్తిభాతి ప్రియం రూపం నామచేత్యంశపంచకమ్ । ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయమ్' అనుటవలన నామరూపాత్మకప్రకృతిజన్యము లయిన పంచభూతమయప్రపంచమందు అస్తి భాతి ప్రియరూపపరబ్రహ్మము చేరియుండియును సకలమునంగు గూడి వానివికారములనంటుని మింటివలె నిర్వికారమై విలక్షణమై అసంగమై వెలుఁగుచున్నదని భావము అజ = ఉత్పత్తిలేని, అద్వైత = తనకంటె రెండవదిలేని, ఆత్మః = రూపము గలవాఁడు అగును, ॥ని॥ 'యుక్తే క్ష్మాదావృతే భూతం ప్రాణ్యతీతే సమే త్రిషు' అని అమరము, "న్యాత్తో గేవలకే పుంసి త్రిషు ప్రాప్తేన కల్పితే" అని శేష. "భూతం క్ష్మాదౌ పిశాచాదౌ న్యాయే సత్యోపమానయోః॥ భూతో గేవలకే ప్రాప్తే తథా వృత్తే విధేయవత్" అని విశ్వప్ర "ఉత్పన్నభూతయోర్జాతం బృందజాత్యోశ్చ ఘనద్వయోః" అని రత్నమాల. ॥వ్యు॥ భూయతే భవతీతిచ భూతం భూ ప్రాప్తౌ వ భూ సత్తాయాం- పొందఁగాఁబడునదియు కలుగునదియును గనుక భూతము

తా॥ బుద్ధిమంతుఁడవయిన రామాంజనేయా! మఱియు నా పరబ్రహ్మము స్థావరజంగమప్రాణులను పొంది యున్నట్టి నామరూపముగఁ దోఁచుచున్న ప్రకృతివలనఁ బుట్టిన పుట్టుకయు నాశమును గలిగి లోకముయొక్క సమూహముతోఁ గూడినవాఁడును పుట్టుకలేనివాఁడును తనకంటె రెండవదియగు రూపము లేనివాఁడును నై యున్నాఁడని తాత్పర్యము.

## భా వా భా వ ప దా ర్థ ని ర్ణ య ము.

క. భావాభావమయావిర్భావతిరోభావరహితభావుం డన్యా
భావస్వభావుఁ డతులవిభావసుపావకసుధాంశుభాప్రదుఁ డరయన్. ౧౩

టీక. అరయన్ = విమర్శింపఁగా, భావ = ద్రవ్యాదిభావములయొక్కయు, అభావ = ప్రాగభావాద్యభావములయొక్కయు, మయ = స్వరూపమైన, ఆవిర్భావ = పదార్థోత్పత్తియు, తిరోభావ = పదార్థనాశనమును, రహిత = లేని, భావుండు = స్వరూపము గలవాఁడు - అనఁగా పదార్థము, భావమని అభావమని ద్వివిధము ద్రవ్యగుణకర్మసామాన్యవిశేషసమవాయము లని భావ మాఱువిధములు. అందు ద్రవ్యము— పృథివ్యప్తేజోవాయ్వాకాశకాలదిగాత్మమనస్సు లని తొమ్మిదివిధములు గుణము— రూప రస గంధ స్పర్శ సంఖ్యాపరిమాణ పృథక్త్వసంయోగ విభాగ పరత్వాపరత్వ గురుత్వ ద్రవత్వ స్నేహ శబ్ద బుద్ధి సుఖ దుఃఖేచ్ఛా ద్వేష ప్రయత్న ధర్మాధర్మసంస్కారము లని యిరువదినాలుగువిధములు కర్మము—ఉత్క్షేపణాపక్షేపణాకుంచన ప్రసారణ గమనము లని యైదువిధములు. సామాన్యము— పరము అపరము అని ద్వివిధము విశేషము—నిత్యద్రవ్యవృత్తులచే ననంతము సమవాయము— అవయవావయవగుణగుణి క్రియాక్రియావన్నిత్య ద్రవ్యవిశేషసంసర్గరూపము ప్రాగభావ ప్రధ్వంసాభావ అత్యంతాభావ అన్యోన్యాభావము లని అభావము నాలుగువిధములు అందు, ప్రాగభావముత్పత్తి లేక నాశము మాత్రము గలది, ఇది పదార్థోత్పత్తికి ముందే యుండునది. ప్రధ్వంసాభావముత్పత్తి గలిగి నాశనము లేనిది, ఇది పదార్థము నశించిన పిదపఁ గలుగునది. త్రైకాలికము లత్యంతాభావాన్యోన్యాభావములు - అనఁగా ఇట్టి భావాభావములు లేనివాఁ డనుట వీని విషయము లతివిస్తారములు గావున నింగు వ్రాయఁబడవు ఇది నైయాయికమతసిద్ధాంతము మఱియు భావ మనఁగా దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్య మగు సత్పదార్థము, అభావమనఁగా త్రిపరిచ్ఛేదరూప మగు అసత్పదార్థము, ఈ ద్వివిధస్వరూపములయొక్క ఉత్పత్తి

నాశములు లేని స్వభావము గలవాఁడు - అనఁగా సదసద్విలక్షణుఁడని వేదాంతసిద్ధాంతము. అద్వయభావ స్వభావుఁడు = తన కితరము లేమియే నైజముగాఁ గలవాఁడు - స్వజాతీయ విజాతీయ స్వగత భేదశూన్యుఁడనుట, అతుల = సరిలేని, విభావసు = సూర్యునకును, పావక = అగ్నికిని, సుధాంశు = చంద్రునకును, భా = కాంతులను, ప్రగుండు = ఇచ్చువాఁడు.

తా॥ ఓ ఆంజనేయా! విచారించిచూడఁగా యీ పరమాత్మ దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్య మగు సత్పదార్థముయొక్కయు పరిచ్ఛేద మగు అసత్పదార్థముయొక్కయు రాగవిషయు లయిన స్వరూపముల యొక్క పుట్టుక నాశము లేని స్వభావము గలవాఁడును, (అనఁగా సదసద్విలక్షణుఁడును) తనకంటె నితరము లేనివాఁడయ్యు జగము గలవాఁడును, స్వజాతీయ విజాతీయ స్వగత శూన్యుఁడును, సూర్యునకును యగ్నికిని చంద్రునకును కాంతులను యిచ్చువాఁడును నై యున్నాఁడని తాత్పర్యము

క. ఆప్తసుషుప్తవిలుప్తాలిప్తవ్యాప్తప్రదీప్తలింగరహితసం
ప్రాప్తాప్రాప్తవిహీనజ్ఞప్తియె సర్వప్రపంచసాక్షి మహాత్మా. ౧౧౮

టీ॥ మహాత్మా = మహానుభావా, ఆప్త = ప్రాప్త మైన, సుషుప్త = అవ్యక్తనామకసుషుప్తి యందు, అవిలుప్త = నశింపనట్టి, అలిప్త=ఆ సుషుప్తిలోఁ గలయనట్టి, వ్యాప్త= వ్యాపకముచేత, ప్రదీప్త= మిక్కిలి ప్రకాశించుచున్నట్టి, లింగరహిత = అంతఃకరణవృత్తిరహిత మైన తెలివియొక్క, సంప్రాప్త = పొందుటయు, అప్రాప్త= పొందమియు, విహీన= లేనిజ్ఞప్తియె, అపరోక్ష= జ్ఞానమె, సర్వప్రపంచసాక్షి= సర్వలోకద్రష్ట. “శ్రు॥ ప్రజ్ఞానం బ్రహ్మ, విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్” అని యుపనిషత్తు

తా॥ కుండలోనిజలమే కుండవెలుపలి చెమ్మ యైనట్లు జగన్నిర్మాణమునకు బీజరూప మగు అవ్యక్తనామప్రకృతిరూపసుషుప్తియందు లేనింపక ఆ సుషుప్తి నంటక సర్వవ్యాపక మై వెలుఁగు అహంభావము లేని యెఱుకను పొందుట పొందకపోవుట యనునవి లేని ప్రజ్ఞానమే సమస్తలోకద్రష్ట యని తా.

ఈ పద్యమున కర్థాంతరము — ఆప్త = లభ్యమైన, సుషుప్త= కారణశరీరావస్థయందు, అవిలుప్త= క్షీణింపనిదై, అలిప్త = ఆసుషుప్తిలోఁ గలయనిదై, వ్యాప్తప్రదీప్తలింగరహిత= అంతట నిండి వెలిఁగెడు సూక్ష్మశరీరావస్థ యగు స్వప్నము లేనిదై, సంప్రాప్తాప్రాప్తవిహీనజ్ఞప్తియే = ఆ సుషుప్త స్వప్నావస్థలు ప్రాప్తించుట ప్రాప్తింపకపోవుటలు గల స్థూలదేహావస్థ యగు జాగ్రత్తయు లేని అపరోక్షజ్ఞానమే సర్వప్రపంచసాక్షి యని అర్థాంతరము. (అనఁగా సమష్టివ్యష్ట్యాత్మకశరీరావస్థాభిమాని యీశ్వరజీవత్రయవిలక్షణ మైన ప్రజ్ఞానమే సర్వలోకసాక్షి యని భావము)

అర్థాంతరతాత్పర్యము —కారణశరీరావస్థయందు క్షీణింపనిదియు, ఆసుషుప్తిలోఁ జేరనిదియు, అంతటను నిండి ప్రకాశించెడు సూక్ష్మశరీరావస్థ యగు స్వప్నము లేనిదియు, ఆ సుషుప్త స్వప్నావస్థలు ప్రాప్తించుట ప్రాప్తించకపోవుటలు గల స్థూలదేహావస్థ యగు జాగ్రత్తయు లేని అపరోక్షజ్ఞానమే సర్వప్రపంచసాక్షి యని తాత్పర్యము

క. వ్యక్తం బవ్యక్తాది, వ్యక్తావ్యక్తాతిరిక్తి యగు బ్రహ్మము గా
బ్రాక్తనుకృతి భాక్తనుయుత, భోక్తను సతతంబు సాక్షిపోలికఁ జూచున. ౧౧౯

టీ॥ అవ్యక్తాది = అవ్యక్తనామప్రకృతియే మొదలుగాఁగల, వ్యక్త=స్ఫుటము లైన, అవ్యక్త = అస్ఫుటము లైన - అనఁగా వ్యష్టి సమష్టిరూప జీవేశ్వరులయందు కార్యకారణరూపములచే వెలిఁగెడు అవ్యక్తమువలన క్రమముగా పుట్టిన మహదాది సప్తావరణములకంటె, అతిరిక్తము = విలక్షణము, అగు

బ్రహ్మము = ఐనపరమాత్మ, వ్యక్తంబు = జ్ఞానగమ్యము, తక్ =అబ్రహ్మము, ప్రాక్ =తొల్లిటి, తను=శరీర మందు, కృత=చేయబడినదానిని- అనఁగా సంచితప్రారబ్ధమును, భాక్ =పొందఁదగిన, తను=వర్తమానశరీర ముతో, యుక్=కూడిన, భోక్తను=జీవుని, సతతంబు=ఎల్లప్పుడు, సాక్షిపోలిక = ద్రష్టవలె, చూచుక్= వీక్షించును - అనఁగా బ్రహ్మము జీవసాక్షియై వెలుఁగు ననుట.

తా వ్యష్టిసమష్టిరూప జీవేశ్వరులయందు —[(౧) సమష్టిరూపమగు యీశ్వరుఁడనఁగా సకలచేతన సమూహముయొక్క-కారణశరీరము, సూక్ష్మశరీరము, స్థూలశరీరము అనెడు శరీరత్రయముతోడ శరీర త్రయోపాధులనుపొంది సమస్తప్రాణులచే సేవింపఁబడుచు ప్రకాశించువాఁడు (౨) వ్యష్టిరూపమగు జీవుఁ డనఁగా ఒక్కొక్క ప్రాణియొక్క దేహత్రయమును అట్టి దేహత్రయముయొక్క అవస్థలను అనుభ వించుచు పూర్వము చెప్పిన సమష్ట్యుపాద్యభిమాని యగు ఈశ్వరు నారాధించుచు యజ్ఞానవశుఁడై యుండువాఁడు ] కార్యకారణములచే ప్రకాశించెడు అవ్యక్తమునలనఁ బుట్టిన మహాదాదిసప్తావరణముల కంటె విలక్షణ మగు బ్రహ్మము జ్ఞానముచే పొందఁదగినది అట్టి యీపరబ్రహ్మము సంచితప్రారబ్ధమును పొందఁదగిన వర్తమానశరీరముతోఁ గూడిన జీవుని యెప్పుడును ద్రష్టవలె చూచుచుండు నని తాత్పర్యము.

తే. జాగ్రదాదివినిగ్రహానుగ్రహప్ర,తిగ్రహానుగ్రాగ్రాకారాగ్రయా గ్ర
విగ్రహాత్యగ్రసాభాసవిశ్వహేతు,ధీప్రకాశకుఁ డతఁడె సందేహ మేల ౧౬

టీక జాగ్రదాది = జాగ్రత్తు మొదలగు మూఁడవస్థలయొక్క, వినిగ్రహ = లయింపఁజేయుటయు, అనుగ్రహ = రక్షించుటయు, ప్రతిగ్రహ= ఆయవస్థల వహించుటయుఁ గలిగినట్టి, సమగ్రాకారాగ్ర=అమల సత్త్వగుణస్వభావమయిన సంపూర్ణజాగ్రత్తయు, ఆగ్రహ=రజోగుణస్వభావ మయిన రోపమును, ఉగ్ర= తామసగుణస్వరూప మయిన భయంకరమును, విగ్రహ=ఆకృతిగాఁ గలిగినట్టి, అత్యగ్ర=సర్వోన్నత మైనట్టి, సాభాస—స = ప్రకృతియొక్క, ఆభాస = ప్రతిచ్ఛాయ యైన, విశ్వ = ప్రపంచమునకు, హేతు= ఉత్పత్తి స్థితిలయకారణ మైన, ధీ=ప్రజ్ఞానమును, ప్రకాశకుఁడు = వెలిఁగించువాఁడు, అతండె= ప్రజ్ఞానపదలక్ష్యార్థ మైన పరబ్రహ్మమే, సందేహ మేల = సందియ మెందుకు - అనఁగా, "శ్లో॥ బుద్ధిర్జాగరణం స్వప్నం సుషుప్తి రితి వృత్తయః" అని యున్నందున వ్యష్టి సమష్టిరూపులగు జీవేశ్వరుల జాగ్రత్స్వప్నసుషుప్తులను స్థూల సూక్ష్మకారణశరీరములను వానియం దభిమానము గల విశ్వతైజసప్రాజ్ఞ విరాట్ హిరణ్యగర్భావ్యాకృతు లను గలిగింప పెంప త్రుంప కర్తయై ఆ జీవేశ్వర శరీ రావస్థాభోగాభిమాన దేవతారూపములుగా నయి పరిణమించుటకు త్రిగుణస్వరూపిణి యై బ్రహ్మ విష్ణు రుద్రరూపములచే ప్రపంచ జననపాలన విలయములఁ జేయుటకు కారణ మైన ప్రజ్ఞానమును పరబ్రహ్మము వెలిఁగించు చున్న దనుట

## త్రి గు ణ ము ల వి వ ర ణ ము.

సీ॥ సంయమివరులార సత్త్వరజస్తమోనామరూపములు గుణంబు లవి యిల । నన్యోన్యమిథునత్వ మన్యోన్యసంశ్రయ మన్యోన్యసంకలితాదివృత్తిభావ మన్యోన్యోపజీవనాచరణంబు గలిగి గురుత్వభత్వ గాఢభంగు । లైయుండు దమము నియమిత మైన రజస్సు దన్నియమము సత్త్వంబు నడచు । సత్త్వ ముడిగినపోఁ దమశ్చరణ మెసఁగు । లోభశోకసమోహమానిద్రాభయములు । వికృతి గర్వాన హోష్యపాపకృతికోప । శౌర్యమాత్సర్యములు తమస్సంభవము౹౹ ఈ॥ హాములుఁ దేళ్లును ౯నులుఁ బందులుఁ గుక్కలు మాలుగోళ్లును । జీమలుఁ గాకులుం గ్రిములు జింకలు నక్కలు గోంకనక్కలుం । దోమను ప్రాఁకులుం బొదలు నోపులఁ బీడలఁ బొంగువారు ముక్ । గామసభావులట్లు మఱి తద్విధజంతువు లెన్ని

యన్నియుఁ॥ క॥ ఇవి తామసంబు లని గుణ । నివహములోఁ గీడువాప నేర్చునటఁగు త।ద్ద్వివిధవికృతి నిరసనహే।తువివేకము గలుగఁగా నధోగతి దలఁగున్॥ చ॥ బలమును గర్వము న్మదముఁ బ్రాభవమున్ సుఖదుఃఖభాగితా । కలనముఁ జెల్మిచేతయును గాంతుయనొల్లనియుం బ్రతాపమున్ । గలహము నీర్ష్యయున్ స్పృహావికల్పవుభావముఁ గామినీజనం।బులయెడ గాఢరాగతయు బొందును నుబ్బరజఃప్రభూతముల్॥ చ॥ అవి తొలుబాముగం గలుగునట్టి జనంబులకిను లిట్టి వి।ట్టివి యవినీతులన్మతిపటిష్ఠతగల్గి త్రివర్గవర్తనం । బు వెరవునొంది యర్థములఁ బొంపరివోవుచు గామసౌఖ్యవై । భవములఁ గ్రాలుచు న్మనుజభావనిరూఢతఁ బొల్తు రెంతయున్॥ క॥ రాజసగుణములకుం గల । నైజమెఱుఁగుహారు తజ్జనవైకృతముఁగ । ధీజతములు గావింపఁగ । నోజగలిగి శుభదవృత్తి నొందుదు రెందున్॥ సీ॥ సంతోషమును బ్రకాశత్వంబుఁ బ్రియమును సానందమును గరుణాభిరతియుం । శుచియును సత్యంబు శౌచంబు ధృతియును గార్పణ్యమును దితిక్షయు నహింస । యును సాన్నిధ్యంబును ననసూయయును క్రోధరాహిత్యమును ననరంభతయును । సమత దాక్షిణ్యంబు శ్రద్ధధానతయు నక్రూరభావంబు గౌరవంబు । సత్త్వజాతంబు లివి పూర్వ జన్మసంచి । తతము లయినట్టి వారహంకృతి మమత్వ । మగతృష్ణకామార్తిలీక తులబోధ।భరితులై యూర్ధ్వలోక వైభవము గంద్రు॥ అని భారతము. 'శ్లో॥ కామఏవః క్రోధఏవ రజోగుణ సముద్భవః' అని భగవద్గీత

తా॥ జాగ్రత్త మొదలగు మూఁడవస్థలయొక్క నశింపఁజేయుటయు, కాపాడుటయు, వహించుటయు గలిగినట్టి నిర్మల మయిన సత్వగుణమే స్వభావముగాఁ గలిగినట్టి సంపూర్ణజాగ్రత్తయు రజోగుణస్వభావ మైన కోపమును తామసగుణస్వభావ మయిన భయంకరమును యాకృతిగాఁ గల సర్వోన్నత మయిన ప్రకృతియొక్క చిచ్ఛాయ యగు ప్రపంచకముయొక్క యుత్పత్తిస్థితిలయకారణ మైన ప్రజ్ఞానమును ప్రకాశింపఁజేయువానినే పరబ్రహ్మ మందురు, ఇంగుకు సందేహము వల దని తాత్పర్యము.

ఆ. ఇదియు నదియు నట్టి దిట్టి దింతం తని, పలుకరాని దెద్ది బ్రహ్మ మదియె
యిదియు నదియు నట్టి దిట్టి దింతం తని, యరయు తెలివి యదియె యదియు నదియె.

టీక ఇదియున్ = 'సర్వం ఖల్విదం బ్రహ్మ' యను తటస్థలక్షణముచే నొప్పెడు పరిదృశ్యమాన జగద్రూప మయినది, అదియున్ = 'సత్యజ్ఞాన మనంతం బ్రహ్మ' యను స్వరూపలక్షణము గల పరమాత్మరూపమైనది, అట్టిది = సర్వజ్ఞత్వాదిగుణములు గలది, ఇట్టిది = కించిద్జ్ఞత్వాదిగుణములు గలది, ఇంత = వ్యష్టిరూప మయినది, అంత = సమష్టిస్వరూప మైనది, అని = ఇట్లని, పలుకరానిదెద్ది = వచించుటకు నశక్యమైనది యేదో, అదియే = ఆ వస్తువే, బ్రహ్మము = పరమాత్మ, ఇదియున్ = జగద్రూప మైనది, అదియున్ = పరమాత్మరూప మైనది, అట్టిది = సర్వజ్ఞత్వాదిగుణములు కలది, ఇట్టిది = కించిద్జ్ఞత్వాదిగుణములు గలది, ఇంత = వ్యష్టిరూప మయినది, అంతఅతని = సమష్టిరూప మైనదని, అరయు = ఎఱుఁగునట్టి, తెలివి = ఎఱుక, అదియే = ఆ పరబ్రహ్మమే, అదియున్ = పైఁ జెప్పిన యిది అది అనునవి మొదలగునవి అన్నియును, అదియే = ఆ పరమాత్మచైతన్యమే

తా. మఱియు పరబ్రహ్మము 'సర్వం ఖల్విదం బ్రహ్మ' యను తటస్థలక్షణముచే నొప్పెడు పరిదృశ్యమాన (కనఁబడెడి) ప్రపంచాకారము గలది యనిగాని, 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' యను స్వరూపలక్షణము గల పరమాత్మరూప మయినది యని గాని, సర్వజ్ఞత్వాదిగుణములు గలది యని గాని, కించిద్జ్ఞత్వాదిగుణములు గలది యని గాని, వ్యష్టిసమష్టిరూపములు గలది యని గాని చెప్పుటకు వీలు లేదు, జ్ఞానమో ఇది జగద్రూప మయినది, ఇది పరమాత్మరూప మయినది, సర్వజ్ఞత్వాదిగుణములు గలది, కించిద్జ్ఞత్వాదిగుణములు గలది, వ్యష్టిసమష్టిరూప మయినది యని తెలుసుకొనునట్టి తెలివిగా నున్న దని తా.

తే. అట్టి పరిపూర్ణతత్త్వ మైనట్టి నేను, బూర్వకల్పాంతమున నీ యపూర్వవిశ్వ
జననమునకంటె మును నిరంజనుఁడనగుచు, నద్వయుఁడనై వెలుంగుదు నాంజనేయ.

టీక ఆంజనేయ = వాయుపుత్త్రా, అట్టి = పైనఁ జెప్పఁబడినట్టి, పరిపూర్ణ = నిండిన, తత్త్వ మైనట్టి నేను = పరబ్రహ్మ మైనట్టి నేను, పూర్వ = వెనుకటి, కల్ప = విశ్వప్రళయముయొక్క, అంతమునన్ = తుదయందు, ఈ = కనఁబడెడు, అపూర్వ = నవీన మైన, విశ్వ = ప్రపంచముయొక్క, జననమునకంటెన్ = ఉత్పత్తికంటె, మును = ముందును, నిరంజనుఁడగుచున్ = సాధనాంతరాపేక్ష లేనివాఁడనై, అద్వయుఁడనై = ఏకస్వరూపుఁడనై, వెలుఁగుదున్ = ప్రకాశింతును - అనఁగా కార్యకారణహేతుప్రకృతివికారములు లేక వెలుఁగుదు ననుట

తా ఓయి వాయుపుత్త్రా! పరబ్రహ్మ మైన నేను విశ్వప్రళయముయొక్క కడపట యీ కనఁబడెడు ప్రపంచముయొక్క పుట్టుకకంటె పూర్వము సాధనాంతరాభిలాష లేనివాఁడును, ఏకస్వరూపుఁడును నై ప్రకాశింతు నని తాత్పర్యము

## మాయాస్వరూపనిర్ణయము.

తే. అట్టినాయందు ననాదిగా నాత్మశక్తి, యలరు నవ్యక్తమయి జగదాది యగుచుఁ
గలితమృత్తికయందున్న కలశశక్తి, యేర్పడక కుంభహేతువై యెనసినట్లు.

టీక అట్టి నాయందున్ = నిరంజనుఁడ నైన నాయందు, కలితమృత్తికయందున్ — కలిత = కూడిన, మృత్తికయందున్ = మట్టియందు, ఉన్నకలశశక్తి — ఉన్న = ఉండునట్టి, కలశశక్తి = ఘటపరిణామశక్తి, ఏర్పడక = తోఁపక, కుంభహేతువై = ఘటవ్యవహారమునకు కారణమయి, ఎనసినట్లు = పొందినట్లు, అనాదిగాన్ = మొదటనుండి, అవ్యక్తమై = వేఱు చేయఁగూడనిదై, జగదాదియగుచున్ = ప్రపంచోత్పత్తికి ప్రధానకారణ మైనదయి, ఆత్మశక్తి — ఆత్మ = నాయొక్క, శక్తి = అవ్యక్తనామకశక్తి, అలరున్ = వెలుఁగును

తా నిరంజనుఁ డైన నాయందు మట్టియందు కుండరూపముగాఁ జేసెడు శక్తి యుండి తాను తెలియఁబడక కుండయొక్క వ్యవహారమునకు కారణమయినట్లు మొదటనుండి వేఱు చేయఁగూడనిదయి ప్రపంచోత్పత్తికిఁ బ్రధానకారణమై నాశక్తి అవ్యక్తనామకశక్తిగా బ్రకాశించుచుండు నని తాత్పర్యము.

సీ. వటబీజమున మహావటమహీరుహశక్తి, యుజ్జ్వలవహ్నియం దుష్ణశక్తి
యింద్రజాలకునియం దెపుడు మాయాశక్తి, కలితోపలములందుఁ గఠినశక్తి
సలిలజాతమునందు సలలితద్రవశక్తి, పవనంబునం దతిస్పందశక్తి
పౌరిశుక్లశోణితంబులయందుఁ దనుశక్తి, తగుశరీరములఁ జైతన్యశక్తి

తే. దనరి యవ్యక్త మగుచు దత్సన్నిధాన, మై యధిష్ఠానమునకంటె ననితరంబు
నగుపగిది నొప్పు నాయందు నాత్మశక్తి, యేర్పడక యన్యమై విశ్వహేతువగుచు.

టీక వటబీజమునన్ = మఱ్ఱివిత్తునందు, మహావటమహీరుహశక్తి — మహాత్ = గొప్పదయిన, వటమహీరుహ = మఱ్ఱిమ్రాఁకును గలిగించునట్టి, శక్తి = సామర్థ్యమును, ఉజ్జ్వలవహ్నియందున్ — ఉజ్జ్వల = వెలుఁగుచున్నట్టి, వహ్నియందున్ = అగ్నియందు, ఉష్ణశక్తి = వేఁడిమిని గలుఁగించెడి, శక్తి = సమర్థతయును, ఇంద్రజాలకునియందున్ = గారడివానియందు, ఎపుడు = ఎల్లప్పుడు, మాయాశక్తి — మాయా =

టక్కరితనముయొక్క, శక్తి = సామర్థ్యమును, కఠినోపలములందుఁ—కఠిన = ఒప్పిదము లైన, ఉపలములందుఁ = ఱాళ్లయందు, కఠినశక్తి = గట్టిగా నుండునట్టి శక్తియును, సలిలజాతమునందుఁ = ఉదక సమూహమునందు, సలలితద్రవశక్తి—సలలిత = మిక్కిలి యొప్పిదమైన, ద్రవశక్తి = చెమ్మగించునట్టి శక్తియును, పవనంబునందుఁ = గాలియందు, అతిస్పందశక్తి—అతి = మిక్కిలి, స్పంద = కదలునట్టి, శక్తి = నేర్పును, పోరిఁ = అత్యంతము, శుక్లశోణితంబులయందుఁ = రేతస్సునందును రక్తమునందును, తనుశక్తి = శరీరకల్పనాసామర్థ్యమును, తగుశరీరములఁ—తగు = ఒప్పిదము లయిన, శరీరములఁ = దేహములయందు, చైతన్యశక్తి = కదలెడు మెదలెడు సామర్థ్యమును, తనరి = ఒప్పి, అవ్యక్తమగుచుఁ = ఎఱుఁగరానిదయి, తత్సన్నిధానమై = ఆయావస్తువుల కాధారమయి, అధిష్ఠానమునకంటెఁ = ఆధారమగు వస్తువులకంటె—అనఁగా వటవహ్న్యింద్రజాలకాది ఆధారవస్తువులకంటె, అనితరంబగుపగిదిఁ = వేఱు కానియట్లు, నాయందుఁ = నాలోపల, ఆత్మశక్తి=స్వశక్తి, ఏర్పడక = నాకంటె భిన్నముగా దోఁచక, అన్యమై = నాకంటె వేఱుగా కనఁబడుచున్నదయి, విశ్వహేతువగుచుఁ = ప్రపంచోత్పాదనాది కార్యములకు కారణమయి, ఒప్పుఁ = ప్రకాశించును

తా. మఱ్ఱివిత్తునందు గొప్పమఱ్ఱిచెట్టును కలుగఁజేయుశక్తియును, వెలుఁగుచున్నయగ్నియందు వేడిమిని గలిగించెడుశక్తియును, గారడివానియందు టక్కరితనముయొక్క-శక్తియును, ఱాళ్లయందు గట్టిగా నుండు శక్తియును, ఉదకసమూహమునందు చెమ్మగించుశక్తియును, వాయువునందు కదలునట్టిశక్తియును, రేతస్సునందును రక్తమునందును శరీరమును కలుగఁజేసెడి సామర్థ్యమును, శరీరమునందు కదలెడు మెదలెడు శక్తియును ఇట్లు యెఱుఁగరానిదయి ఆధారము లయిన వటబీజాదిఆయావస్తువులకంటె వేఱు కాదో ఆప్రకారముగా నాయందుండు ఆత్మశక్తి (స్వశక్తి) నాకంటె భిన్నముగా దోఁచక ప్రపంచముయొక్క యుత్పత్తిస్థితులకు కారణమై ప్రకాశించుచుండు నని తాత్పర్యము.

సీ. సత్తు గా దాత్మవిజ్ఞానంబుచే నెం ద,భావ మై బాధింపఁబడుటవలన
నెలమి నసత్తుగా దేనజ్ఞుఁడ నటంచు, నజ్ఞానభూతమై యలరుచునికిఁ
సదసత్తు గాదు విచారింప లే దట్టి, ద్రవ్యంబు గడువిరుద్ధంబు గాన
నిరవయవము గాదు నిఖిలజగత్స్వరూ, పము చేత మిగుల నేర్పడుటవలన
తే. సావయవమును గాదు దృశ్యము సుషుప్తియందడంగినఁ దాను శూన్యంబు గామి
నొనర నుభయాత్మకముగా దయుక్తమగుట, నాంజనేయ మదీయ మాయాతమంబు.

టీక. ఆంజనేయ = హనుమంతుఁడా, మదీయమాయాతమంబు— మదీయ = నాసంబంధమయిన, మాయా=మాయ యనెడు, తమంబు= కాఱుచీఁకటి—మాయ యనఁగా 'యా మా సా మాయా' ఏది నిషిద్ధమైనదియో అది మాయ యని అర్థము, అట్టిమాయ, ఆత్మవిజ్ఞానంబుచేఁ = బ్రహ్మజ్ఞానముచేత, ఎందుఁ = ఎప్పుడు, అభావమై = శూన్యమయి, బాధింపఁబడుటవలనఁ = పీడింపఁబడుచుండుటవలన, సత్తుగాదు = కాలత్రయమం దుండునదిగాదు—అనఁగా మాయ బ్రహ్మజ్ఞానముచేత కాలత్రయమందు బాధ్యరూపమయి యున్నది గనుక సత్తని చెప్పరాదనుట, ఎలమిఁ = ప్రీతితో, ఏనజ్ఞుఁడనటంచుఁ = నేను మూఢుఁడనని, అజ్ఞానభూతమై = తెలివిలేనిదానివంటిదై, అలరుచునికిఁ = ఒప్పుచుండుటచేత, అసత్తుగాదు = కాలత్రయమందు లేనిదియును గాదు—అనఁగా 'అహ మజ్ఞః అహం సుఖీ దుఃఖీ' యని అనుభవమున్నది గనుక అసత్తని చెప్పఁగూడదనుట, విచారింపఁ = శోధింపఁగా, సదసత్తుగాదు—సత్=సత్యమైనదియు, అసత్=

అనిత్య మయినదియు, కాదు = కానేరదు, అట్టిద్రవ్యంబు = అట్టివస్తువు, కడువిరుద్ధంబు గాన = యున్న దనుట మిక్కిలి విరోధము గనుక, లేదు = భూమియం దుండదు - అనఁగా సదసద్రూప మైనవస్తువు భూమియం దున్న దనుట, అత్యంతవిరుద్ధధర్మము గనుక మాయ సదసత్తనియును చెప్పరా దనుట నిఖిల జగత్స్వరూపముచేతన్—నిఖిల = సమస్త మైన, జగత్ = లోకముయొక్క, స్వరూపముచేతన్ = ఆకృతిచేత, మిగుల నేర్పడుటవలనన్ = లెస్సగాఁ గనఁబడు చుండుటవలన, నిగవయవము గాదు = అవయవములు లేనిదియును గాదు, దృశ్యము = ప్రపంచము, సుషుప్తియం దడఁగినన్ = నిద్రయందు నశించినను, తాను శూన్యంబు గామిన్ = తాను లేనిది కాదు గాన, సావయవమును గాదు = అవయవములు గలదియును గాదు, ఒనరన్ = క్రమముగా, అయుక్తము గుటన్ = ఒకవస్తువు అవయవములు గల దనియు లే దనియు చెప్పుట కడువిరుద్ధము గనుక ఉభయాత్మకము గాదు, అవయవరహితమును అవయవసహితమును గాదు

తా॥ ఆంజనేయా! నాసంబంధ మయిన మాయ యనెడు కారుచీఁకటిని (ఏది నిషిద్ధ మయినదో అది మాయ) సత్తని చెప్పుద మన్నయెడల బ్రహ్మజ్ఞానముచే మూఁడు కాలములయందు బాధింపఁబడుచున్నది గనుక సత్తని చెప్పరాదు, అసత్తని చెప్పుద మన్న నేను తెలియనివాఁడను నేను సుఖిని నేను దుఃఖిని యని అనుభవ మున్నందున అసత్తని చెప్పరాదు, సదసత్తని చెప్పుద మన్న యీమాయ సదసత్తు గాదు, యెట్లనఁగా అసద్రూప మైన వస్తువు భూమియం దున్న దనుట అత్యంతవిరుద్ధము, దీనిని నిరవయవ మని చెప్పుద మన్న సమస్త మయిన లోకముయొక్క ఆకృతిచేత బాగుగా గనఁబడు చున్నందున అట్లు చెప్పరాదు, అవయవములు గల దని చెప్పుద మన్న ప్రపంచము నిద్రయందు నశించినను తాను నశింపదు గనుక అవయవములు గలదియును గాదు, ఒకవస్తువు అవయవములు గల దనియు లే దనియు చెప్పుట విరుద్ధము గనుక ఉభయాత్మకమును గాదు (అవయవములతోఁ గూడియుఁ గూడక యుండునది) అని తాత్పర్యము

తే. అరయ నాయున్కికంటె వేఱైనయున్కి
 లేదు గాన మద్భిన్నంబు గా దవిద్య
 ప్రకృతియజ్ఞాన మని పల్కఁబడుటవలన
 గాదు మదభిన్నమును నాయనాదిమాయ. ౨౨

టీక అవిద్య=ప్రకృతి-అనఁగా 'యా నవిద్యతే సా అవిద్య' ఏది లేనిదో అది యవిద్య యని యర్థము, అరయన్ = శోధింపఁగా, నాయున్కికంటెన్ = నాయందలియునికికంటె, వేఱైనయున్కి లేదు = వేఱొకనివాసము లేదు - అనఁగా నేనే నివాస మనుట, గానన్ = కాఁబట్టి, మద్భిన్నంబు గాదు = నాకంటె వేఱైనది గాదు, నాయనాదిమాయ = సనాతన మైన నామాయాశక్తి, ప్రకృతి=మాయ యని, అజ్ఞాన మని= అవిద్యయని, పల్కఁబడుటవలనన్ = ఉచ్చరింపఁబడుటచేత, మదభిన్నమును గాదు = నాకంటె వేఱుగా నిదియుఁ గాదు - అనఁగా నాకంటె వేఱైన దని భావము. 'ప్రారంభం క్రియతే అనయేతి ప్రకృతిః' అని వ్యుత్పత్తి, 'డుకృఞ్ కరణే' యని ధాతువు, తా॥ దీనిచేత జగత్ప్రారంభము చేయఁబడు చున్నది 'ప్రకరోతి పురుషోపభోగార్థం శబ్దాది భోగ్యా నితి వా ప్రకృతిః' తా॥ పురుషోపభోగముకొఱకు శబ్దస్పర్శాది భోగ్యవస్తువులఁ జేయునది గాన ప్రకృతి యనఁబడును

తా॥ ఓ యాంజనేయా! విచారింపఁగా ప్రకృతి (లేనిది, దీనికే యవిద్య యని పేరు) నాయందలి యునికికంటె వేఱొకయున్కి లేనిది గనుక నాకంటె భిన్న మయినది కాదు, సనాతన మయిన యీ మాయ ప్రకృతి యనియు, అజ్ఞాన మనియుఁ జెప్పఁబడుటవలన నాకంటె వేఱు కా దని తాత్పర్యము.

క. భిన్నాభిన్నము గాదని, యెన్నంగా నేల ప్రకృతి కీ యిట్లగుట సుసం
పన్ను లనిర్వాచ్యం బని, మున్న గణించిరి సమస్తముం దెలిసి సుతా. ౨౩

టీక సుతా=కుమారా, ప్రకృతి=మాయ, భిన్నాభిన్నము గాదని—భిన్నము=నాకంటె నన్యమైనదియు, అభిన్నము గాదని = నాకంటె నన్యము గానిదియుం గాదని, ఎన్నంగా నేల = విచారింప నేల, ఇట్లగుటన్ = భేదాభేదములు కాని దగుటచేతనే, సుసంపన్నులు = మేలగు జ్ఞానసంపత్తిగలవారు, సమస్తముం దెలిసి=ఈ మాయస్వరూప మంతయుం దెలిసి, అనిర్వాచ్యం బని= అనిర్వచనీయ మని, మున్న=పూర్వము, గణించిరి = చెప్పిరి.

తా ఓరి కుమారా! ఈమాయ నాకంటె భిన్న మనియు, అభిన్న మనియు విచారించుట యెందుకు? భేదాభేదములు లేనందుననే బ్రహ్మవేత్తలు యీ మాయాస్వరూపము నెఱిఁగి ఇది అనిర్వచనీయ మని చెప్పి రని తాత్పర్యము (అనిర్వచనీయ మనఁగా ఇట్టి దని చెప్పుటకు వీలు లేనిది)

తే. అనుభవజ్ఞానదృష్టిచే నరయఁ దుచ్ఛ, మొగి ననిర్వచనీయమౌ యుక్తిదృష్టి
చేత లౌకికమయదృష్టిచే ననంత, మగు దలంప మదీయమాయాతమంబు. ౨౪

టీక మదీయమాయాతమంబు— మదీయ = నాయొక్క, మాయా = మాయ యనెడు, తమంబు= చీకటి, అరయన్ = విచారింపఁగా, అనుభవజ్ఞానదృష్టిచేతన్ = విజ్ఞానదృష్టిచేత - అనఁగా బంధత్రయరహితజ్ఞానముచేత, తుచ్ఛము = హైన్యమైన దగును, ఒగిన్=లెస్సగా, యుక్తిదృష్టిచేతన్ = అపవాదయుక్తరూపమైన లక్ష్యముచేత, అనిర్వచనీయమౌన్ = వాక్కునఁ బలుకఁదగని దగును - అనఁగా మిథ్యాస్వరూపమైన దనుట, లౌకికమయదృష్టిచేతన్=లోకదృష్టిచేత, తలంపన్ = యోచింపఁగా, అనంత మగున్ = మితము లేని దగును.

## జ్ఞానప్రతిబంధత్రయనిరూపణము.

జ్ఞానమునకు భూతప్రతిబంధ మనియు, వర్తమానప్రతిబంధ మనియు, భావిప్రతిబంధ మనియు ప్రతిబంధములు మూఁడు గలవు, అందు.—

భూతప్రతిబంధము — బహుకుటుంబి యగు నొక విప్రుఁడు జీవనార్థము ఒకగోవును సంపాదించి దాని పాలు పెరుగు నెయ్యి విలిచిన రొక్కముచేత పుత్త్రికళత్రాదులను గాపాడుచు ఆగోవును కసువు ప్రత్తిగింజలు మొదలగువానిచేత తుష్టిగా మేపుచు తదేకనిష్ఠుఁడై యుండ కొంతకాలమునకు ప్రారబ్ధవశమున అతనిపుత్త్రికళత్రాదులు చచ్చిరి, గోవును మృతినొందె, నప్పు డతఁ డేకాకియై అసత్యమగు సంసారమును నమ్మి పడరానిపాట్లు పడితిని, కడపట యిప్పు డది కలవలె కల్లయయ్యె, సంసారాపేక్ష గలవానికంటె మూఢుండు మఱియొక్కఁడు లేఁ డని వినికి సంసారము తుచ్ఛ మని యెంచి విరాగియై సన్న్యసించి సద్గురుసాన్నిధ్యము చేరి శ్రవణాదులఁ జేయుచుండఁగా నొకనాఁడు గురువు లతనిఁ జేరఁ బిలిచి నీవు బహునాళ్లనుండి శ్రవణాదులు జేసితివే కృతకృత్యత నీకుఁ గలదా అనిన, స్వామీ మ ఱేమియుఁ గానను, పూర్వాశ్రమమం దొక గోవు గల దది నాఁడే చచ్చినను శ్రవణమనననిదిధ్యాసనకాలములందు ఆగోవే కనఁబడు చున్న దనెను. అంతట గురువులు మిక్కిలి కటకటపడి యిది భూతప్రతిబంధ మని తలఁచి దానిని బోఁగొట్టుటకై ఆగోవునందలి చెలిమి ననుసరించి తత్త్వబోధఁ గావింపఁ దలంచి, ఓయీ! నీకుఁ గనఁబడుగోవు అస్తి భాతి ప్రియ నామ రూపము లనెడి అయిదుగుణములు గలది కనుక నామరూపములను విడిచి అస్తి భాతి ప్రియములు నేనని మననము చేయు మని

బోధించెను అట్లా విప్రుఁడు మననము చేయుచు రాఁగా కల్పితనామరూపములతోఁ జేరక సచ్చిదానంద రూపపరబ్రహ్మము నేనని యెడు నిశ్చయము తోఁచి ధన్యుఁ డయ్యె విద్యారణ్యస్వాములు ప్రతిబంధత్రయమును దానికి నివృత్తియును పంచదశీప్రకరణమం దిట్లని రూపించిరి గాన ఇది భూతప్రతిబంధము.

వర్తమానప్రతిబంధము — విషయాసక్తిలక్షణ ప్రజ్ఞామాంద్య కుతర్క విపర్యయ దురాగ్రహము లని నాల్గువిధములు అందు— విషయాసక్తిలక్షణ మనఁగా— విషయసుఖములయందు మిగుల నాసక్తి గల్గియుండుట, ప్రజ్ఞామాంద్య మనఁగా— గురువులు చెప్పిన వేదాంతవాక్యార్థములు బుద్ధియం దెక్కకపోవుట, కుతర్క మనఁగా— గురువు లానతిచ్చిన వాక్యార్థమునకు విపరీతార్థము తోఁచుట, విపర్యయదురాగ్రహ మనఁగా— నేను శ్రోత్రియుఁడను, విరక్తుఁడ నని దేహేంద్రియాదులయం దాత్మ బుద్ధి గలుగుట, యీనాలుగును వర్తమానప్రతిబంధములు వీనికి నివృత్తి యెట్లనఁగా, శమదమోపరతి తితిక్షాసంపదచేత విషయాసక్తిలక్షణము, అనవరతశ్రవణముచేత ప్రజ్ఞామాంద్యము, మననమువలన కుతర్కము, నిదిధ్యాసముచేత విపర్యయదురాగ్రహమును చెడును ఇట్లు ప్రతిబంధము నశింపఁగా ముముక్షువులకు నేను బ్రహ్మ మను దృఢము గలుగును ఇది వర్తమానప్రతిబంధము

భావిప్రతిబంధము:— పాపకర్మమువలన కాలనియతిఁ దెలియక వచ్చునట్టి దాని నెట్లెఱుఁగ నగు ననఁగా, సంచితపాపకర్మ ముముక్షువున కొక్క తెలియఁగునంగు రూపమై గర్వరూప మగు నాసక్తిని పుట్టించును, అది భావిప్రతిబంధ మని యెఱుఁగవలయును. అట్లెఱుఁగఁజాలక నేను అసంగుఁడను అగు నన్నియాసక్తి యేమి చేయు నని సడ్డ చేయక యుండెనేని అది వానికి గొన్నిజన్మంబులను కలిగించును, అవి జన్మములను కలిగించుటకు తార్కాణ మే మనఁగా, వామదేవునకు ఒకజన్మమును, భరతునకు మూఁడుజన్మములను, మఱికొందఱికి పెక్కుజన్మములను గల్గె నని పురాణములు చెప్పుచున్నవి గనుక ముముక్షు నీబంధత్రయమును విచారించి అవి తన్నంటకయుండునట్లు తొలఁగించుకొనవలయును అట్లు చేయ కున్న కొన్నిజన్మములు గలుగుట సిద్ధము సంశయము లేదు ఈ బంధత్రయము నీజన్మమున నివృత్తియైన వాని కాజన్మముననే ముక్తి గలుగును.

తా ఆలోచించి చూడఁగా నాయొక్క మాయ యనెడు చీఁకటి సాత్త్వికాదిబంధత్రయరహితమైన జ్ఞానదృష్టికి నీచగా మైనదినున్ను అపవాదయుక్తిరూప మైన లక్ష్యమునకు (ఇది కా దని నిర్ధారణ చేయు జ్ఞానరూప మయిన చూపు) మిథ్యాస్వరూప మైనదిగానున్ను, లోకదృష్టికి మితము లేనిది గానున్న యున్న దని తాత్పర్యము

సీ. త్రాడు భుజంగ మై స్థాణువు పురుషుఁ డై, రాజిల్లు శుక్తిక రజత మగుచు
మరుమరీచికలు నిర్మలసలిలంబు లై, తోడరి మిన్ననీలమై తోఁచుపగిది
నద్వయామలసచ్చిదానందమయుఁడ నై, తగు నేను మిగుల నవిద్యావలనఁ
దోలుత నసజ్జడ దుఃఖాత్మకము లైన, జగము లై కనుపింతు జనుల కెల్ల

తే. దృఢతరాద్వైతవిజ్ఞానదృష్టిచేతఁ
బండితులు పూర్ణనిర్గుణబ్రహ్మమయుఁడ
నైన నను గాంచినంత నెయ్యది యభావ
మగు నదియె సూ మదీయమాయాతమంబు. ౭౫

టీక. త్రాడు=రజ్జువు, భుజంగమై=సర్పమై, స్థాణువు=ఆకులు కొమ్మలు లేని చెట్టు, పురుషుఁడై=మనుష్యుఁడై, రాజిల్లుశుక్తిక = ప్రకాశించునట్టి ముత్యపుఁజిప్ప, రజత మగుచు = వెండియై, మరుమరీచికలు=ఎండమావులు, నిర్మలసలిలంబులై= తేటనీళ్లయి, తొడరి=పూనికతో, మిన్ను=ఆకాశము, అసితమై=నల్లనై, తోఁచుపగిది = కనఁబడునట్లుగా, అద్వయ = తనకంటె వేఱులేని, అమల = నిర్మలమైన, సత్ = అవస్థాత్రయమునందు నశింపని, చిత్ = సాధనాంతర నిరపేక్ష స్వయంప్రకాశ మగు జ్ఞానమును, ఆనంద= నిత్య నిరుపాధిక నిరతిశయసుఖమును, మయుఁడనై = సర్వరూపముగాఁ గలవాఁడనై, తగు నేను = ఈ చెప్పఁబడిన లక్షణములు గలిగి వెలుఁగుచున్న నేను, మిథలన్ = ముక్కాలి, ఎద్దానివలనన్ = ఏమాయ వలన, తొలుతన్ = మొదట, జనులకెల్లన్ = మనుష్యులకందఱికి, అసత్ = అసత్యము, జడ=అజ్ఞానము, దుఃఖ = శోకము, (వీనియొక్క) ఆత్మకములై = రూపములైన, జగములై = లోకములై, కనుపింతున్ = కనఁబడుదునో, పండితులు = విద్వాంసులు, దృఢతర=అతిగాఢ్యమైన, అద్వైత = అఖండమైన, విజ్ఞాన దృష్టిచేతన్ = అనుభవజన్యజ్ఞానదృష్టిచేత, పూర్ణ = సమగ్రమైన, నిర్గుణ = త్రిగుణాతీతమైన, బ్రహ్మమయుఁడన్ = పరమాత్మస్వరూపిని, ఐన నను = ఎనట్టి నన్ను, కాంచినంతన్ = దర్శించినమాత్రముననే, ఎయ్యది = ఏమాయ, అభావ మగున్ = శూన్యమగునో, మదీయమాయాతమంబు — మదీయ = నాసంబంధమయిన, మాయ=అజ్ఞాన మనెడు, తమంబు=చీఁకటి, అదియసూ=అదేసుమా

తా. త్రాడు సర్పముగాను, ఆకులు కొమ్మలు లేని మొక్క మనుష్యుఁడుగాను ప్రకాశించెడు ముత్యపుచిప్ప వెండిగాను ఎండమావులు నిర్మలమైన యుదకములుగాను ఆకాశము నీలవిధముగాను కనఁబడునట్లు తనకంటె వేఱులేనట్టిదియును అవస్థాత్రయమునంగు నశింపనిదియు ఇతరసాధనములను యపేక్షింపక తానుగా ప్రకాశించునదియు నగు జ్ఞానమును సత్యమైనట్టిదియు యుపాధిలేనట్టిదియు నిరతిశయ మయినట్టిదియు నగు సుఖమును ఆకారముగా గలిగినవాఁడనైన నేను యేమాయవలన జనులకందరికి అసత్యము, అజ్ఞానము, శోకము వీట్లతోఁ గూడిన లోకములవలె కనఁబడుచున్నో అట్టి నన్ను పండితులు అతిదృఢ మయినట్టిదియు అఖండమైనట్టిదియు నగు యనుభవజ్ఞానదృష్టిచేత పరమాత్మస్వరూపి యని తెలిసికొన్నంతమాత్రముననే యేది నశించుచున్నదో అదియే నాసంబంధమైన మాయ యనఁబడు నని తాత్పర్యము

వ. అది మఱియు సర్వభూతసుషుప్తిసమష్టిరూపంబు సమస్తప్రపంచవాసనామయంబు సత్త్వరజస్తమోగుణాత్మకంబు స్వాంతర్గుప్తానంతకోటిజీవసంఘాతంబుఁ గేవలజడంబు మోహాత్మకంబు సకలజగదుపాదానకారణంబు నవిద్యావ్యక్తతమస్సుషుప్తిప్రకృతిప్రళయప్రధానమాయాజ్ఞానాదిశబ్దవాచ్యంబునై యొప్పుచుండు నని వెండియు. ౨౬

టీక. అది = ఆప్రకృతి, మఱియున్ = వెండియు, సర్వభూత = సకలప్రాణులయొక్క, సుషుప్తి సమష్టి = నిద్రయంతయు, రూపంబును = ఆకృతిగాఁ గలదియు, సమస్తప్రపంచ = ఎల్లలోకములయొక్క, వాసనా = పూర్వ మనుభవించిన విషయసుఖములను మఱచి నిద్రించి పిదప నిద్రవిడచియు విషయానుభవము లేకయున్న జ్ఞప్తియొక్క, మయంబును = స్వరూప మయినదియు, సత్త్వరజస్తమోగుణాత్మకంబును=త్రిగుణస్వరూపమైనదియు, స్వాంతః = తనలోపల, గుప్త=దాఁచఁబడిన, అనంతకోటి = లెక్కలేనిదైన, జీవ = ప్రాణులయొక్క, సంఘాతంబును=గుంపు గలదియు, కేవలజడంబును = అతిమూఢరూపము గలదియు, మోహాత్మకంబును=భ్రమరూపముగాఁ గలదియు, సకలజగత్=సమస్తలోకములకు, ఉపా

దానకారణంబును = ఉపాదానహేతు వైనదియు, అవిద్యావ్యక్తతమస్సుషుప్తిప్రకృతిప్రళయప్రధాన మాయాజ్ఞానాది శబ్దవాచ్యంబునై = అవిద్య అవ్యక్తము తమస్సు సుషుప్తి ప్రకృతి ప్రళయము ప్రధానము మాయ అజ్ఞానము అనునవి మొదలగు శబ్దములచేతఁ బలుకఁదగినదై, ఒప్పుచుండు నని = ప్రకాశించు చుండు నని చెప్పి, పెండియున్ = మఱల

తా. మఱియు నాప్రకృతి సమస్తప్రాణులయొక్క నిద్రయంతయు నాకృతిగాఁ గలదియును, వాసనయే యాకారముగాఁ గలదియును, (వాసన యనఁగా పూర్వ మనుభవించిన విషయసుఖమును మఱచి నిద్రించి మరల జాగ్రత్తను పొందినను తా ననుభవించిన విషయములు జ్ఞప్తి లేక యుండుట) సత్త్వరజస్తమోగుణము లనెడు మూడుగుణములే స్వరూపముగాఁ గలదియును, సమస్తప్రాణులయొక్క సమూహమును తనయందుఁ గలదియును, అతిసూక్ష్మరూప మయినదియును, భ్రమయే రూపముగాఁ గలదియును, సమస్తలోకములకు నుపాదానకారణ మైనదియును, (ఉపాదానకారణ మనఁగా సమవాయి కారణము, ఘటమునకు మృత్తికవలె ముఖ్యకారణము) యై అవిద్య అవ్యక్తము తమస్సు సుషుప్తి ప్రకృతి ప్రళయము ప్రధానము మాయ అజ్ఞానము అను నీ పేళ్లచే ప్రకాశించు చుండు నని తాత్పర్యము

తే. ఆదిమధ్యాంతశూన్యయై నట్టిప్రకృతి
యాదిమధ్యాంతములు గల్గినట్లఁ దోఁచి
యాదిమధ్యాంతరహితాద్వయాత్మునకును
నాదిమధ్యాంతములు గల్గ నావరించె. ౨౭

టీక. ఆది=మొదటను, మధ్య=నడుమను, అంత=తుదను, శూన్యయైనట్టి=లేనట్టి, ప్రకృతి=మాయ, ఆదిమధ్యాంతములన్ = మొదలు నడుమ తుదలయందు, కల్గినట్లఁదోఁచి = ఉన్నదానివలెఁ గనఁబడి, ఆదిమధ్యాంతరహిత = జననస్థితివిలయములు లేని, అద్వయ=రెండవది లేని, ఆత్మునకున్ = పరబ్రహ్మమునకు, ఆదిమధ్యాంతములు = జన్మస్థితినాశములు, కల్గన్=సంభవించునట్లు, ఆవరించెన్=ఆక్రమించెను.

తా. ఈప్రకారము చెప్పి మఱలఁ జెప్పుచున్నాడు, ఆప్రకృతి మొదటను నడుమను అంత్యమందును లేని దయ్యును మొదటను నడుమను కడపటను యున్నదానివలె కనఁబడి జన్మస్థితిలయములు లేని పరమాత్మకు జన్మస్థితినాశములు గలుగునట్లు ఆక్రమించును

క. కవియ న్మూలప్రకృతియు, ద్వివిధ యగును మాయ యన నవిద్య యనఁగ నా
ద్యవిమలసత్త్వాత్మిక యగు, నవిమలసత్త్వప్రధాన యగు నన్య తగన. ౨౮

టీక. కవియన్=ఇట్లు క్రమ్మఁగానఁగా, మూలప్రకృతియున్ = మూలాజ్ఞానము, మాయ యనన్= మాయ యని, అవిద్య యనఁగన్ = అవిద్య యని, ద్వివిధ యగున్ = రెండువిధములు గల దగును, ఆద్య= మొదటిది యయిన మాయ, విమలసత్త్వాత్మిక యగున్—విమల = నిర్మల మైన, సత్త్వ= సత్త్వగుణమే, ఆత్మిక యగున్ = స్వరూపముగాఁ గలది యగును, అన్య = రెండవది యయిన యవిద్య, తగన్ = క్రమముగా, అవిమలసత్త్వప్రధాన—అవిమల = మలిన మయిన, సత్త్వ=సత్త్వగుణమే, ప్రధాన = ముఖ్యముగాఁ గలది, అగున్ = ఔను - అనఁగా రజోగుణస్వరూప మయిన దగు నని భావము

తా. ఈప్రకారము క్రమ్మఁగాను మూలప్రకృతి మాయ యనియు, అవిద్య యనియు రెండు విధములు గలది అందులో మొదటిది యగు మాయ నిర్మల మయిన సత్త్వగుణమే స్వరూపముగాఁ గలది, రెండవది యగు యవిద్య మాలిన్య మయిన సత్త్వగుణమే ముఖ్యముగాఁ గలది యని తాత్పర్యము

## ఈ శ్వ ర వి చా ర ఘ ట్ట ము.

తే. అమలసత్త్వప్రధాన మైనట్టి మాయ, యందు దాని కధిష్ఠాన మైన నేను
ప్రతిఫలించితి మేఘసంగతజలముల, మించి యాకాశ మమర బింబించినట్లు.

టీక అమలసత్త్వప్రధాన మైనట్టి మాయయందున్ = స్వచ్ఛ మగు సత్త్వగుణమే ప్రధానము గాఁ గల సమష్టిరూప మయిన మాయయందు, దానికిన్ = ఆ మాయకు, అధిష్ఠాన మైననేను = ఆధారభూతుఁడ నైన నేను, ఆకాశము = మిన్ను, మేఘసంగతజలములన్ = మబ్బుతోఁ గూడిన నీళ్లయందు, మించి = విజృంభించి, అమరన్ = లెస్సగా, బింబించినట్లు = ప్రతిఫలించినటువలె, ప్రతిఫలించితిన్ = ఆ మాయయందుఁ గనఁబడితిని

తా సత్త్వగుణమే ముఖ్యము గాఁ గల సమష్టిరూప మయిన మాయయందు అట్టి మాయకు నాధారభూతుఁ డైననేను ఆకాశము మబ్బుతోఁ గూడిన నీళ్లయందు ప్రతిఫలించినవిధమున నేను గనఁబడుదు నని తాత్పర్యము

క. మాయాప్రతిబింబంబును, మాయాధిష్ఠానపరము మాయయుఁ గూడన్
మాయావి యైన యీశుఁ డ, మాయికుఁ డగు నతఁడు బ్రహ్మమయుఁడై యుంటన్.

టీక మాయాప్రతిబింబంబును — మాయా = సత్త్వగుణస్వరూప మైన మాయయందు, ప్రతిబింబంబును = ప్రతిఫలించిన బ్రహ్మచ్ఛాయయును, మాయాధిష్ఠానపరము — మాయా = మాయకు, అధిష్ఠాన = ఆశ్రయ మైన, పరము = పరమాత్మయును, మాయయున్ = సత్త్వగుణప్రధాన మైన మాయయును, కూడన్ = చేరఁగా, మాయావియైన = మాయికుఁ డైన, ఈశుఁడు = ఈశ్వరుఁడు, అగున్ = ఔను, అతఁడు = ఆ ఈశ్వరుఁడు, బ్రహ్మమయుఁడై = ఆత్మరూపుఁడై, ఉంటన్ = ఉండుటవలన, అమాయికుఁ డగున్ = మాయా సంబంధము లేనివాఁ డగును

తా. సత్త్వగుణప్రధాన మయిన మాయయందుఁ బ్రతిఫలించిన బ్రహ్మచ్ఛాయయును మాయాధిష్ఠాన మయిన పరబ్రహ్మమును మాయయుఁ జేరి యీశ్వరుఁ డగును, ఆ యీశ్వరుఁడు పరమాత్మస్వరూపి యయినందున మాయారహితుఁడై వెలుఁగు నని తాత్పర్యము

క. ఆ యీశ్వరుండ నే నా, మాయయె సీతావధూటి మదిఁ దలఁప మహా
మాయుఁడ నయ్యు వశీకృత, మాయుఁడ నై యవతరింతు మహి నిట్లనఘా. ౩౧

టీక. అనఘా = ఆంజనేయా, ఆ యీశ్వరుండన్ = మాయోపాధితోఁ గూడిన యాయీశ్వరుఁడను, నేను = నేనే, ఆమాయయే = సత్త్వగుణస్వరూపి యయిన మాయయే, సీతావధూటి = సీతాదేవి, మదిన్ = బుద్ధియందు, తలంపన్ = యోచింపఁగా, మహామాయుఁడ నయ్యున్ = గొప్పమాయ గలవాఁడ నయ్యును — అనఁగా మాయను స్వాధీనపఱచుకొన్నవాఁ డయినను, వశీకృతమాయుఁడనై = మాయకు స్వాధీనుండనై, మహిన్ = భూమియందు, ఇట్లు = ఈప్రకారము, అవతరింతున్ = పుట్టుదును.

తా పాపరహితుఁడ వయిన యో యాంజనేయా! ఆలోచించిచూడఁగా సత్త్వగుణస్వరూప మైన మాయయే సీత, అట్టి మాయతోఁ గూడిన యీశ్వరుఁడను నేను, నాకు మాయ స్వాధీన మయినప్పటికిని మాయకు నేను స్వాధీనుఁడనై యీప్రకారము పుట్టుదు నని తాత్పర్యము.

వ. ఇట్లు శుద్ధసత్త్వప్రధానమాయోపాధికుండును సర్వేశ్వరుండ నైన నేను వశీకృతమాయుండ నగుటం జేసి జగంబులు సృజియించి తద్రక్షణంబుకొఱకుఁ దొల్లి

మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన పరశురామావతారంబులు ధరియించి దుష్టనిగ్రహశిష్టానుగ్రహంబులం గావించి యిప్పుడు శ్రీరామరూపంబుచే నవతరించిన రావణకుంభకర్ణాది రాక్షసుల సంహరించి భూభారంబు నివారించితి నింక నిటమీఁదట బలరామకృష్ణబుద్ధకల్కి రూపంబుల నే నవతరింపఁగలవాఁడ నాచరిత్రంబులు లోకత్రయపవిత్రంబులు భవలతాలవిత్రంబులై యొప్పు నని చెప్పి వెండియును 32

టీక ఇట్లు = ఈతీరున, శుద్ధ = నిర్మలమైన, సత్త్వప్రధాన = సత్త్వగుణమే ముఖ్యముగాఁ గల, మాయ = మాయ యనెడు, ఉపాధికుండఁ = కారణోపాధి గలవాఁడను, సర్వేశ్వరుండఁ = సమస్తప్రాణికోట్లకు నియంతను, ఐన నేను = ఐనట్టి నేను, వశీకృతమాయుండఁ = లోఁబఱచఁబడిన మాయ గలవాఁడను, అగుటం జేసి = కాఁబట్టి, జగంబులు సృజియించి = లోకములఁ బుట్టించి, తద్రక్షణంబు కొఱకు = ఆ లోకములఁ గాపాడుటకై, తొల్లి = పూర్వము, మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన పరశురామావతారంబులు = మత్స్య కూర్మ వరాహ నరసింహ వామన పరశురామరూపములను, ధరియించి = తాల్చి, దుష్టనిగ్రహ = దుర్జనసంహారమును, శిష్టానుగ్రహంబులఁ = సజ్జనపరిపాలనమును, కావించితిఁ = చేసితిని, ఇప్పుడు = ఈవర్తమానకాలమందు, శ్రీరామరూపంబుచేఁ = శ్రీరామావతారముచేత, అవతరించి = పుట్టి, రావణకుంభకర్ణాదిరాక్షసులఁ = రావణుఁడు కుంభకర్ణుఁడు మొదలయిన రాక్షసులను, సంహరించి = చంపి, భూభారంబు—భూ = నేలయొక్క, భారంబు = బరువును, నివారించితిఁ = తొలఁగించితిని, ఇంక నిటమీఁదటఁ = ఇఁక భవిష్యత్కాలమందు, బలరామకృష్ణబుద్ధకల్కిరూపంబులఁ = బలరామకృష్ణబుద్ధకల్క్యవతారములచేత, ఏ నవతరింపంగలవాఁడ = నేఁ బుట్టఁగలను, నాచరిత్రంబులు = నానడవడులు, లోకత్రయపవిత్రంబులు—లోకత్రయ = స్వర్గమర్త్యపాతాళము లనెడు మూఁడులోకములను, పవిత్రంబులు = పరిశుద్ధము చేయునట్టి, భవలతాలవిత్రంబులై—భవ = పుట్టుక లనెడు, లతా = తీఁగెలకు, లవిత్రంబులై = కొడవండ్లై, ఒప్పుఁ = ప్రకాశించును, అని చెప్పి = అని యానతిచ్చి, వెండియును = మఱియును

తా. ఈతీరున నిర్మలమయిన సత్త్వగుణమే ముఖ్యముగాఁ గల మాయ యనెడు కారణోపాధి గలవాఁడను, సమస్తప్రాణికోట్లకు నియంతయు నైన నేను మాయను లోఁబఱచుకున్నవాఁడనై లోకములను సృజించి అట్లు నాచే సృజింపబడ్డ లోకములను గాపాడుటకై పూర్వము మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన పరశురామరూపములను ధరించి దుష్టులయొక్క సంహారమును సజ్జనులయొక్క పరిపాలనమును చేసితిని, ఇప్పుడు శ్రీరామరూపముచేత రావణుఁడు కుంభకర్ణుఁడు మొదలగు రాక్షసులను వధించి నేలయొక్క బరువును పోఁగొట్టితిని, ఇఁకమీఁదు బలరామ కృష్ణ బుద్ధ కల్క్యవతారములను పొందఁబోవుచున్నాను, నాచరిత్రములు త్రిలోకములను శుద్ధము చేయునట్టివియు పుట్టుక లనెడు తీఁగెలకు కొడవండ్లై ప్రకాశించును. ఇట్లు చెప్పి మఱియుఁ జెప్పుచున్నాఁ డని తాత్పర్యము.

చ. గురుఁడు హిరణ్యగర్భుఁ డని కొందఱు గొంద ఱిల స్వాయంభువిరా
ట్పురుషుఁ డటంచుఁ గొందఱు ఋషిప్రభుఁ డంచు ముకుందుఁ డంచుఁ గొం
దఱు శివుఁ డంచుఁ గొందఱు వినాయకుఁ డంచును గొందఱుం బరా
పరవరు నన్నెఱుంగక యుపాస్తి యొనర్తు రజ్ఞులై తగన్. 33

టీక. ఇలన్ = భూమియందు, కొందఱు = మత్స్యమయవాదులలోఁ గొంతమంది, పరాపరవరున్ — పరా = పరాప్రకృతికంటె, అపర=అపరాప్రకృతికంటె, వరున్ = విలక్షణుఁడైన, నన్నున్ = సచ్చిదానందనిత్యనిర్మలుఁడైన నన్ను, అజ్ఞులై = మూఢబుద్ధి గలవారై, ఎఱుంగక = ఎఱుఁగఁజాలక, గురుఁగను = బృహస్పతి యని, కొందఱు = కొంతమంది, హిరణ్యగర్భుఁ డని = చతుర్ముఖబ్రహ్మ యని, కొందఱు = కొంతమంది, మహావిరాట్పురుషుఁ డటంచున్=సమష్టివిగ్రహస్వరూపుఁ డనియు, కొందఱు=కొంతమంది, ఋభుప్రభుఁ డంచున్—ఋభు=దేవతలకు, ప్రభుఁ డంచున్=నాయకుఁడైన యింద్రుఁ డని, ॥ని॥ 'అదితేయా ఋభవో స్వప్నా' అని అమరము, ॥వ్యు॥ 'ఋః అదితిః తస్యా భవంతీతి ఋభవః - ఋతేన సత్యేన భవంతీతి వా ఋభవః' తా॥ అదితిదేవివలనఁ బుట్టినందునను, లేక సత్యముతోఁ బుట్టినవారైనందునను ఋభువు లనుట, మఱికొందఱు డంచున్ = విష్ణు వని, కొందఱు=కొంతమంది, శివుఁ డంచున్=సాంబమూర్తి యని, కొందఱు=కొంతమంది, వినాయకుఁ డంచున్ = బుద్ధదేవుఁ డని- లేక విఘ్నేశ్వరుఁ డని పక్షులకు నాయకుఁ డయిన గరుడుఁ డని ॥ని॥ 'షడభిజ్ఞో దశబలో ద్వయవాదీ వినాయకః । వినాయకో విఘ్నరాజః విపక్షః పరమాత్మనోః' అని అమరము తగన్ = లెస్సగా, ఉపాంతిరొమనర్పుగురు=ఆరాధింతురు.

## పరాపర ప్రకృతి విభాగము

శ్లో॥ భూమి రాపోనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ । అహంకార యితీయం మే భిన్నా ప్రకృతి రష్టధా॥ అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం । జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్॥ తా పంచమహాభూతములు గుణములు లగు గంధ రస రూప స్పర్శ శబ్దము లని మనోబుద్ధ్యహంకారము లని మాయాశక్తి యెనిమిది తెఱఁగులుగా వివరింపఁబడి యున్నది, ఇదియే అపరాప్రకృతి, ఈప్రకృతికంటె వేఱై సర్వప్రాణధారణనిమిత్తభూతమై జగత్తును ధరించునది యేదో అది పరాప్రకృతి.

తా. అవివేకు లగు కొందఱు సచ్చిదానందనిత్యనిర్మలుఁ డయిన నన్నుఁ దెలియఁజాలక పరాపరప్రకృతులకంటె విలక్షణుఁ డనియు, బృహస్పతి యనియు, చతుర్ముఖబ్రహ్మ యనియు, సమష్టివిగ్రహస్వరూపి యనియు, దేవతలకుఁ బ్రభు వైన యింద్రుఁ డనియు, విష్ణు వనియు, సాంబమూర్తియనియు, వినాయకుఁ డనియు, బుద్ధదేవుఁ డనియు, గరుత్మంతుఁ డనియు ఆరాధించుచున్నా రని తాత్పర్యము

## విశ్వమునకు ఉపాదాననిమిత్తకారణములు.

ఆ. వినుము నేను విశ్వమునకు నుపాదాన, కారణమును నిమిత్తకారణంబు
నగుచు వూర్ణనాభిపగిది నొప్పుదు నింకఁ, గార్యములును నేన కపివరేణ్య 38

టీక. కపివరేణ్య = వానరశ్రేష్ఠుఁడా, వినుము = ఆకర్ణింపుము, నేను = నేను, విశ్వమునకున్ = లోకమునకు, ఉపాదానకారణమును = కలిగించుటకు కారణమును, నిమిత్తకారణంబును = కలిగించిన దానిని వేఱుగాఁ జేయుటకుఁ గారణమును, అగుచున్ = ఐనవాఁడనై, ఊర్ణనాభిపగిదిన్ = సాలెపురుగువలె, ఒప్పుదున్ = ప్రకాశింతును, ఇంకన్ = మఱియు, కార్యములును = జీవేశ్వరజగత్తులును, నేన = నేనే.

తా ఓ ఆంజనేయా ! ఘటపటములయుత్పత్తికి మృత్తంతువు లుపాదానకారణమును, కులాలతంతువాయులు వారల వ్యాపారసాధనము లగు చక్ర దండ తురి వేమాదులు నిమిత్తకారణము లైనట్లు జగత్సృష్టికి రెండుకారణములు గావలయును కనుక లోకము దూర్ణనాభి యను జంతువు శరీరప్రధానమై

నూలు పుట్టించుటవలన తానే యుపాదానకారణమును బుద్ధిప్రధానమై యానూలు చిత్రముగా నల్లుట తనవలననే యైనందున నిమిత్తకారణము నైనట్లు యీ నిమిత్తోపాదానకారణము లోకప్రాణికి యున్నవి గనుక యిట్లు నేనును సత్త్వగుణప్రధాన మయిన మాయతోఁ గూడి నిమిత్తకారణమును తమోగుణప్రధానమైన యవిద్యతోఁ గూడి యుపాదానకారణమునై జీవేశ్వర జగద్రూప కార్యములు చేసే యగుచున్నా ననుట.

వ. ఇట్లు సర్వేశ్వరుండనైన నాకు నవ్యాకృతంబు మహానందమయకోశంబు నగు, సమస్తభూతసమష్టిలక్షణజ్ఞానంబు కారణశరీరంబు, మహాసుషుప్త్యవస్థ బ్రహ్మాది స్తంబపర్యంతంబులైన సకలభూతంబు లవయవంబులు, జగదుత్పత్తిస్థితిలయంబులు వ్యాపారంబులు, వేదశాస్త్రంబులు నిశ్వాసంబులై యొప్పు నని చెప్పి వెండియు నిట్లనియె. 3౫

టీక. ఇట్లు = ఈప్రకారము, సర్వేశ్వరుండనైన నాకుక్ = ఎల్లజీవులకు ప్రభుండనైన నాకు, అవ్యాకృతంబున = ఇట్టిదట్టిదని పలుకరానిదియు, మహానందమయకోశంబును = సమష్ట్యానందమయకోశమును- అనఁగా ఏకజీవునియొక్క సుషుప్త్యవస్థయందు తోఁచిన సుఖము, వ్యష్ట్యానందమయకోశము, బ్రహ్మవిష్ణురుద్రాది పిపీలికాంత మగు సమస్తప్రాణులయొక్క సుషుప్త్యానందములను గూడి సమష్ట్యానందమయకోశ మనంబడు, అగు = ఐన, సమస్తభూత = ముందు చెప్పిన బ్రహ్మాది జీవులయొక్క, సమష్టిజ్ఞానంబు = అజ్ఞానమంతయును, కారణశరీరంబు = కారణదేహము, మహాసుషుప్తి = సకలప్రాణులనిద్ర, అవస్థ = గతి, బ్రహ్మాది = పరమేష్ఠి మొదలు, స్తంబపర్యంతంబులు = తృణమువఱకు - స్తంబ మనఁగా అతిసూక్ష్మక్రిమివిశేష మని కొందఱు, ఐన సకలభూతంబులు = అన్ని సమస్తజంతువులు, అవయవంబులు = అంగములు, జగదుత్పత్తిస్థితిలయంబులు = ప్రపంచమును బుట్టించుట రక్షించుట నశింపఁజేయుటలే, వ్యాపారంబులు = పనులు, వేదశాస్త్రంబులు—వేద = ఋగ్యజుస్సామాథర్వణములును, శాస్త్రంబులు = శిక్షాదివ్యాకరణశాస్త్రములును, నిశ్వాసంబులై = నిట్టూర్పులై, ఒప్పుక్ = తగును, అని చెప్పి = అని పలికి, వెండియు నిట్లనియె = మఱల నిట్లు చెప్పఁదొడఁగెను

తా. ఈప్రకారము యెల్లజీవులకు ప్రభువైన నాకు యిట్టిదట్టిదని చెప్పనలవికానిదియు బ్రహ్మ మొదలుకొని పిపీలికాపర్యంతము యుండు సమస్తప్రాణులయొక్క సుషుప్త్యానందములు గూడి సమష్ట్యానందకోశ మగు అజ్ఞాన మంతయు కారణదేహమును సకలప్రాణులయొక్క నిద్రయవస్థయు బ్రహ్మ మొదలుకొని తృణమువఱకు నుండు సమస్తభూతములు యవయవములును ప్రపంచమును పుట్టించుట రక్షించుట నశింపఁజేయుటలే వ్యాపారములును వేదశాస్త్రములు నిట్టూర్పులును నై యున్నవని చెప్పి మఱలఁ జెప్పుచున్నాఁ డని తాత్పర్యము.

జీవనిర్ణయము.

తే. మలినసత్త్వప్రధాన యౌక్ నల యవిద్య, దానియందు నధిష్ఠానమైన నేను
బ్రతిఫలించితిఁ గలశసంగతజలముల, సాభ్రనక్షత్రఖచ్ఛాయఁ జందమునను. 3౬

టీక. అలయవిద్య = జీవోపాధి యైన మాయవిద్య, మలినసత్త్వప్రధాన = రాజసగుణస్వభావము గలది, ఔక్ = అగును, దానియందుక్ = ఆ యవిద్యయందు, అధిష్ఠానమైన నేను = త్రిగుణసహితమై మూలప్రకృతి కాధారమైన నేను, కలశసంగతజలములక్ = కడవలోని నీళ్లయందు, సాభ్రనక్షత్ర

ఖచ్ఛాయచందమున్ = మేఘనక్షత్రసహితాది ఆకాశప్రతిబింబమువలె, ప్రతిఫలించితిన్ = ఆ యవిద్య యందుఁ దోఁచితిని

తా॥ జీవోపాధి యయిన యవిద్య రాజసగుణస్వభావముగాఁ గలది యగును, అట్టి త్రిగుణసహితమైన మూలప్రకృతికి ఆధార మగు నేను కడవలోని నీళ్లయందుఁ బ్రతిఫలించెడు మేఘములు నక్షత్రములు ఆకాశము మొదలగువానివలె అవిద్యయందు ప్రతిఫలించితి నని తాత్పర్యము

క. జీవుం డగు నాతఁ డవిద్యావశుఁడై స్థూలసూక్ష్మతనువాసనలన్
భావించుచు సేవించుచుఁ, గేవలమూఢప్రవృత్తిఁ గ్రీడించు మెయిన్. 32

టీక॥ అతఁడు = కలశజలమందు ప్రతిఫలించిన గగనచ్ఛాయవలె అవిద్యయందుఁ దోఁచిన యా ప్రతిబింబస్వరూపుఁడు, జీవుం డగు = జీవసంజ్ఞ గలవాఁ డగును, (ఆ జీవుఁడు) అవిద్యావశుఁడై = మలినసత్త్వప్రధాన మైన యవిద్యకు స్వాధీనుఁడై, స్థూలసూక్ష్మతనువాసనలన్ = స్థూలసూక్ష్మశరీరాభిమానములచేత, భావించుచున్ = ఆ స్థూలసూక్ష్మదేహములే తా నని యెంచుచు, సేవించుచున్ = ఆ శరీరముల ననుసరించుచు - అనఁగా రక్షించుకొనుచు, కేవలమూఢప్రవృత్తిమెయిన్ = మిగుల తెలివిలేని నడవడిచేత, క్రీడించున్ = సంచరించును

తా॥ ఆ కడవలో ప్రతిఫలించిన ఆకాశమువలె అవిద్యయందుఁ దోఁచిన ప్రతిబింబస్వరూపుఁడు మలినసత్త్వమే ప్రధానముగాఁ గల యవిద్యకు స్వాధీనుఁడై స్థూలసూక్ష్మశరీరము తా నని యెంచుచు ఆ శరీరములను రక్షించుచు మిగుల తెలివిలేనివాఁడై చరించు నని తాత్పర్యము

ఆ. అతఁడు ప్రాజ్ఞుఁ డనఁగ నానందమయుఁ డనఁ, బారమార్థికుఁ డనఁ బరఁగుచుండు
వ్యష్టికారణాంగవశుఁడై సుషుప్తిసుఖానుభూతి మఱిగి యనిలతనయ 33

టీక॥ అనిలతనయ = వాయుకుమారా, అతఁడు = ఆ జీవుఁడు, వ్యష్టికారణాంగవశుఁడై = ఒక కారణశరీరమునకు స్వాధీనుఁడై, సుషుప్తిసుఖానుభూతిన్ — సుషుప్తి = నిదురయొక్క, సుఖ = ఆనందము యొక్క, అనుభూతిన్ = అనుభవమందు, మఱిగి = చొక్కి, ప్రాజ్ఞుఁ డనఁగన్ = స్వప్రకాశస్వరూపుఁడు గాన ప్రాజ్ఞనామముచేత, ఆనందమయుఁ డనన్ = ఆనందమయకోశము గలవాఁడు గాన ఆనందమయుఁ డను పేరుచేత, పారమార్థికుఁ డనన్ = అవస్థాత్రయమం దనుస్యూతుఁడై యున్నాఁడు గనుక పారమార్థికుఁ డను నామముచేత, పరఁగుచుండున్ = ఒప్పుచుండును.

తా॥ ఓయి వాయుకుమారా! ఆ జీవుఁడు ఒక కారణశరీరమునకు లోఁబడినవాఁడై నిదురయొక్క యానందము ననుభవించుచు తానుగా ప్రకాశించుస్వరూపము గలవాఁ డగుటవలన ప్రాజ్ఞుఁ డను పేరుచేతను, ఆనందమయకోశము గలవాఁ డగుటచేత ఆనందమయుఁ డను పేరుచేతను, అవస్థాత్రయమందు చేరి యుండుటవలన పారమార్థికుఁ డను పేరుచేతను ఒప్పుచుండు నని తాత్పర్యము

వ. ఇట్లవిద్యయు నవిద్యాప్రతిబింబంబుఁ దదధిష్ఠానచైతన్యంబుం గూడి జీవుం డనం బరఁగు నాజీవున కానందమయకోశసంజ్ఞికం బైన వ్యష్ట్యజ్ఞానంబు కారణశరీరంబు సుషుప్తియవస్థ యగు నారెంటియందు నభిమానంబు గల యతండు ప్రాజ్ఞుం డన నొప్పు నతని కింతమాత్రంబుచే జీవత్వంబు పర్యాప్తంబు గామిం జేసి తదీయాదృష్టసహాయపూర్వకసూక్ష్మశరీరసృష్టిప్రకారంబు చెప్పెద విను మని యిట్లనియె. 34

టీక ఇట్లు = పైనఁ జెప్పినతీరున, అవిద్యయుఁగా = మలినసత్త్వప్రధాన మైన యవిద్యయును, అవిద్యాప్రతిబింబంబును = ఆ యవిద్యయందుఁ దోఁచిన బ్రహ్మచ్ఛాయయును, తదధిష్ఠానచైతన్యంబును = ప్రతిబింబమునకు బింబభూత మైన బ్రహ్మస్వరూపమును, కూడి=చేరి, జీవుఁ డనం బరఁగుకా=జీవుఁ డని చెప్పఁబడును, ఆ జీవునకుకా = ఆ క్షేత్రజ్ఞునకు, ఆనందమయకోశసంజ్ఞకం బైన = ఆనందమయకోశ సంజ్ఞ కల దైన, వ్యష్ట్యజ్ఞానంబు = వ్యష్టిరూప మయిన యవివేకము, కారణశరీరంబు= కారణదేహము, సుషుప్త్యవస్థ యగుకా = నిద్రయవస్థ యగును, ఆరెంటియందుకా=ఆ కారణశరీరసుషుప్త్యవస్థలయందు, అభిమానంబు గల యతండు = కర్తృత్వము గలవాఁడు, ప్రాజ్ఞుం డన నొప్పుకా = ప్రాజ్ఞుఁ డని చెప్పఁబడును; అతనికికా= ఆ ప్రాజ్ఞునకు, ఇంతమాత్రంబుచేతకా=ఈతావన్మాత్రముచేత, జీవత్వంబు=జీవధర్మము, పర్యాప్తంబు=పూర్ణము, కామింజేసి=కానందున, తదీయ=ఆ జీవునియొక్క, అదృష్ట=కనఁబడని, భవిష్య లబ్ధ= ఫలమునకు, సహాయపూర్వక = సహాయభూత మైన, సూక్ష్మశరీరసృష్టిప్రకారంబు = లింగ దేహోత్పత్తిక్రమము, చెప్పెదకా = వక్కాణించెదను, విను మని = ఆకర్ణింపు మని, ఇట్లనియుకా = వక్ష్యమాణప్రకారముగ నానతిచ్చెను

తా ఈప్రకారము మలినసత్త్వము ముఖ్యముగాఁ గల యవిద్యయును ఆ యవిద్యయందుఁ బ్రతి ఫలించిన బ్రహ్మచ్ఛాయయును చేరి జీవుఁ డని చెప్పఁబడును, ఆ జీవునకు ఆనందమయకోశ మను పేరుగల వ్యష్టిరూప మయిన యవివేక కారణము దేహముగాను నిద్రయవస్థగాను అగుచున్నది, ఆ కారణశరీరనిద్రల యందుఁ గర్తృత్వము గలవాఁడు ప్రాజ్ఞుఁ డని చెప్పఁబడును. ఆ ప్రాజ్ఞునకు యింతమాత్రముచేత జీవ ధర్మము పూర్ణము గానందున ఆ జీవునియొక్క దృష్టికి గోచరింపని భవిష్యత్కాలమునందుఁ బొందఁదగిన ఫలమునకు సహాయభూత మైన లింగదేహముయొక్క యుత్పత్తిక్రమమును జెప్పగలను చెప్పుటకు ప్రారం భించె నని తాత్పర్యము

## సూక్ష్మశరీరసృష్టిప్రకారము

తే అమలసత్త్వప్రధానమాయాసమన్వి, తేశ్వరుఁడ నగు నేను సృష్టిచ్ఛచేతఁ
బూని వీక్షించితి తమఃప్రధానమాయ, నఖిలచేతనకర్మసహాయముగను. ౮౦

టీక అమలసత్త్వప్రధానమాయా = శుద్ధసత్త్వప్రధాన మైన మాయతోడ, సమన్విత= కూడిన ఈశ్వరుఁడకా = పరమేశ్వరుఁ డను, అగు నేను = ఐన నేను, సృష్టిచ్ఛచేతకా=నిర్మాణాభిలాషచేత, తమః ప్రధానమాయకా = తమోగుణప్రధాన మైన మాయను, అఖిలచేతన = ఎల్లజీవులయొక్క, కర్మ = పుణ్య పాపమిశ్రకర్మములకు, సహాయముగకా=తోడ్పాటుగా, పూనివీక్షించితికా=సంపూర్ణదృష్టిచేతఁ జూచితిని.

తా శుద్ధసత్త్వప్రధాన మై మాయతోఁ గూడిన పరమేశ్వరుఁ డగు నేను నిర్మించుకోరికచేత తమోగుణప్రధాన మైన మాయను సమస్త మైన జీవులయొక్క పుణ్యపాపమిశ్రకర్మలకు తోడ్పాటుగా సంపూర్ణదృష్టిం జూచితి నని తాత్పర్యము.

వ. ఇట్లు చూచిన నాతమఃప్రధానసమష్ట్యజ్ఞానావచ్ఛిన్నచైతన్యంబువలన శబ్దగుణ కాకాశంబు నయ్యాకాశావచ్ఛిన్నచైతన్యంబువలన స్పర్శగుణకానిలంబు నయ్యా నిలావచ్ఛిన్నచైతన్యంబువలన రూపగుణకానలంబు నయ్యనలావచ్ఛిన్నచైతన్యంబు వలన రసగుణకజలంబు నజ్జలావచ్ఛిన్నచైతన్యంబువలన గంధగుణకపృథివియు

బుట్టె నివియ పంచీకృతసూక్ష్మభూతంబులనియుఁ బంచతన్మాత్రలనియుం జెప్పంబడు నీభూతపంచకప్రత్యేకసత్త్వగుణార్థంబులవలనఁ గ్రమంబున దిగ్వాతార్కప్రచేతోశ్వినీదేవతాసమన్విత శ్రోత్ర త్వక్చక్షు ర్జిహ్వా ఘ్రాణంబులు జనియించె మిగిలిన సత్త్వార్ధసమష్టివలనఁ జంద్ర వాచస్పతి రుద్ర క్షేత్రజ్ఞ దేవతాయుక్త మనోబుద్ధ్యహంకారచిత్తంబులును సంభవించె నవ్విధముదాదిపంచకరజోగుణార్థంబులవలన వగుసం దోగన వహ్నీంద్రోపేంద్రమృత్యుప్రజాపతిదేవతాసమేత వాక్పాణి పాద పాయూపస్థలు జన్మించెఁ దక్కిన రజోగుణార్ధసమష్టివలన విశిష్ట విశ్వకర్తృ విశ్వయోన్యజజయదేవతాక ప్రాణాపానవ్యానోదానసమానంబు లుద్భవించె నివ్విధంబున నుత్పన్నంబులైన జ్ఞానేంద్రియ పంచకంబు నంతఃకరణచతుష్టయంబు గర్మేంద్రియ పంచకంబుఁ బ్రాణాదిపంచకంబుం గూడి యేకోనవింశత్యవయవంబులు లింగశరీరంబు గలిగి యీసూక్ష్మదేహంబు వృక్షవనంబులభంగి నొక్కటి వ్యష్టి యనియు సర్వంబు సమష్టి యనియుం జెప్ప నొప్పు వీనికి వ్యష్టి సమష్టి స్వప్నంబు లవస్థలగు నివ్యష్టిసూక్ష్మాంగ స్వప్నంబులయం దాప్రాజ్ఞుం డభిమాని యై ప్రాతిభాసికుండు స్వప్నకల్పితుండుఁ దైజసుం డనం బ్రవర్తిల్లు నాసమష్టి సూక్ష్మకాయ స్వప్నవిశిష్టుండ నై యీశ్వరుండ నయిన నేను హిరణ్యగర్భుండు సూత్రాత్మకుండుఁ బ్రాణుం డన సర్వజీవోపాస్యుండ నై యుండుదు నిది సూక్ష్మసృష్టి తెఱంగు ఇంక స్థూలప్రపంచప్రకారంబు వినుపించెద విను మని యిట్లనియె. ౭౧

టీక. ఇట్లు చూచినన్ = ఇవ్విధముగా సంపూర్ణదృష్టిచేత వీక్షింపఁగానే - అనఁగా నీశ్వరుఁడు సత్త్వగుణప్రధాన మైన మాయతోఁ గూడి తమోగుణప్రధాన మైన మాయను వీక్షింపఁగానే, అతమః ప్రధాన = మూందుఁ జెప్పఁబడిన తమోగుణప్రధాన మైన, సమష్ట్యజ్ఞాన = సర్వమునకు నుపాదానకారణ మైన మాయతోడ, అవచ్ఛిన్న = కూడిన, చైతన్యంబువలనన్ = బ్రహ్మశక్తివలన, శబ్దగుణకాకాశంబును = శబ్దమే గుణముగాఁ గల గగనమును, అయ్యాకాశ = శబ్దమే గుణముగాఁ గల యాగగనముతోడ, అవచ్ఛిన్న = చేరిన, చైతన్యంబువలనన్ = ఆత్మశక్తివలన, స్పర్శగుణకానిలంబును = స్పర్శమే గుణముగాఁ గల వాయువును, అయ్యనిల = ఆ వాయువుతో, అవచ్ఛిన్న = మిళిత మైన, చైతన్యంబువలనన్ = పరబ్రహ్మశక్తివలన, రూపగుణక = రూపమే గుణముగాఁ గల, అనలంబును = అగ్నియును, అయ్యనలావచ్ఛిన్నచైతన్యంబువలనన్ = ఆ యగ్నితోఁ గూడిన పరబ్రహ్మశక్తివలన, రసగుణకజలంబును = రసగుణక = మాధుర్యమే గుణముగాఁ గల, జలంబును = ఉదకమును, అజ్జల = ఆ యుదకముతోడ, అవచ్ఛిన్న = విశిష్ట మైన, చైతన్యంబువలనన్ = బ్రహ్మచైతన్యమువలన, గంధగుణక = గంధగుణమే గుణముగాఁ గల, పృథివియున్ = భూమియు, పుట్టెన్ = ఈ సూక్ష్మభూతము లొకటివలన నొకటి యుద్భవించెను, ఇవి = ఈ పుట్టినవి, అపంచీకృత = ఐదుగా భాగింపని సూక్ష్మభూతములు, అనియున్ = అని, పంచతన్మాత్రలనియున్ = పంచతన్మాత్రలని, చెప్పంబడున్ = పలుకఁబడును, ఈ భూతపంచక = పైనం జెప్పిన పంచమహాభూతములయొక్క, ప్రత్యేక = వేఱైన - అనఁగా వ్యష్టిసమష్టిరూపము లైన, సత్త్వగుణార్థంబులవలనన్ = సత్త్వగుణభాగములు రెంటిలో సత్త్వవ్యష్టిసూక్ష్మపంచభూతభాగములవలన - అనఁగా తమోగుణమువలనఁ బుట్టిన సూక్ష్మ

భూతము లైదును, సత్త్వరజోగుణములచేత సత్త్వసూక్ష్మపంచభూతము లని రజస్సూక్ష్మపంచభూతము లని రెండువిధము లగును, మఱియు నవి వ్యష్టిసమష్టిభేదములచేత సత్త్వవ్యష్టిసూక్ష్మభూతము లని రజస్సమష్టిసూక్ష్మభూతము లని నాలుగువిధము లగును, వానిలో సత్త్వవ్యష్టిసూక్ష్మపంచభూతముల వలన, క్రమంబునన్ = వరుసగా, దిక్ = దశదిశలు, వాత = గాలి, అర్క = సూర్యుఁడు, ప్రచేతః = వరుణుఁడు, అశ్వినీదేవతా = అశ్వినీదేవతలు, సమన్విత = వీ రనెడి అధిదేవతలతోఁ గూడిన, శ్రోత్ర = చెవి, త్వక్ = చర్మము, చక్షుః = నేత్రము, జిహ్వా = నాలుక, ఘ్రాణంబులు = నాసికము, జనియించెన్ = ఈ జ్ఞానేంద్రియము లైదును పుట్టెను - అనఁగా ఆకాశముయొక్క సాత్త్వికాంశమువలన శ్రోత్రేంద్రియము, వాయువుయొక్క సాత్త్వికాంశమువలన త్వగింద్రియము, తేజస్సుయొక్క సాత్త్వికాంశమువలన చక్షురింద్రియము, జలముయొక్క సాత్త్వికాంశమువలన జిహ్వేంద్రియము, పృథివియొక్క సాత్త్వికాంశమువలన ఘ్రాణేంద్రియము పుట్టె నని భావము, మిగిలిన సత్త్వార్ధసమష్టివలనన్ — మిగిలిన = మిక్కిన, సత్త్వార్ధ = సాత్త్వికగుణార్ధాంశ మైన, సమష్టివలనన్ = సమష్టిభూతపంచకమువలన, చంద్ర = చంద్రుఁడు, వాచస్పతి = బృహస్పతి, రుద్ర = ఈశ్వరుఁడు, క్షేత్రజ్ఞ = జీవుఁడు, దేవతాయుక్త = వీ రనెడి అధిదేవతలతోఁ గూడిన, మనః = సంశయాత్మక మగు మనస్సును, బుద్ధి = నిశ్చయాత్మక మగు ప్రజ్ఞయు, అహంకార = కర్తవ్యాత్మక మైన యహంకారమును, చిత్తంబులు = చంచలాత్మక మైన చిత్తమును, సంభవించెన్ = ఈ యంతఃకరణచతుష్టయము జన్మించెను - అనఁగా పంచభూతములసాత్త్వికాంశసమష్టివలన అంతఃకరణము పుట్టి అది వృత్తిభేదములచేత మనోబుద్ధిచిత్తాహంకారంబు లాయెను, సూక్ష్మశరీరమునకు గొందరిమతమున పది యేడుతత్త్వములు, అప్పుడు మనశ్చిత్తము లొక్కటి, బుద్ధ్యహంకారము లొకటి యగు నని భావము, అవ్యయదాదిపంచక = పైనఁ జెప్పఁబడిన ఆకాశాదిపంచభూతములయొక్క, రజోగుణార్ధంబువలనన్ = రజోగుణముయొక్క సగ మైన వ్యష్టిభాగమువలన, వరుసన్ = క్రమముగా, తోడన = వెంటనే, వహ్ని = అగ్ని, ఇంద్ర = దేవేంద్రుఁడు, ఉపేంద్ర = విష్ణువు, మృత్యు = మృత్యువు, ప్రజాపతి = బ్రహ్మ, [illegible] సమేత = వీరు మొదలగు దేవతలతోఁ గూడిన, వాక్ = నోరు, పాణి = హస్తము, పాద = అంఘ్రి), పాయు = గుదము, ఉపస్థలు = గుహ్యము అను కర్మేంద్రియపంచకము, జన్మించెన్ = పుట్టెను - అనఁగా ఆకాశముయొక్క రజోంశము వలన వాగింద్రియము, వాయువుయొక్క రజోంశమువలన పాణీంద్రియము, తేజస్సుయొక్క రజోంశము చేత పాదేంద్రియము, జలముయొక్క రజోంశమువలన ఉపస్థేంద్రియము, పృథ్వియొక్క రజోంశమువలన పాయురింద్రియమును గా నిట్లు కర్మేంద్రియము లుత్పత్తి యయ్యె ననుట, తక్కిన = మిగిలిన, రజోగుణ = రజోగుణముయొక్క, అర్ధ = సగ మైన, సమష్టివలనన్ = సమష్టిరూపము లైన పంచభూతములవలన, విశిష్ట విశ్వకర్తృ విశ్వయోన్యజ జయదేవతాక ప్రాణాపాన వ్యానోదాన సమానంబులు = విశిష్టుఁడు విశ్వకర్త విశ్వయోని అజుఁడు జయుఁడు నను నధిదేవతలు గల ప్రాణము అపానము వ్యానము ఉదానము సమానము అను పంచప్రాణములు పుట్టెను, ఇవ్విధంబునన్ = ఇట్లు, ఉత్పన్నంబు లైన = పుట్టిన, జ్ఞానేంద్రియపంచకంబును = జ్ఞానేంద్రియము లైదును, అంతఃకరణచతుష్టయంబును = మనోబుద్ధిచిత్తాహంకారములును, కర్మేంద్రియపంచకంబును = కర్మేంద్రియము లైదును, ప్రాణాదిపంచకంబునుం గూడి = ప్రాణాదివాయువు లైదును చేరి, ఏకోనవింశత్యవయవంబులన్ — ఏకోనవింశతి = పందొమ్మిది యైన, అవయవంబులన్ = అంగములచేత, లింగశరీరంబు గలిగెన్ = సూక్ష్మశరీర ముద్భవించెను; ఈ సూక్ష్మదేహంబు = ఈ లింగశరీరము, వృక్షవనములభంగిన్ = వృక్షమువలెను వనమువలెను, ఒక్కటి వ్యష్టి యని యొకన్ = ఒకటి వ్యష్టి యని, సర్వంబు = అన్నియు, సమష్టి యనియుం — సమష్టి యని, చెప్పంబడున్ = పలుకఁబడును, వీనికిన్ = ఈ సూక్ష్మశరీరములకు, వ్యష్టిసమష్టిస్వప్నములు = వ్యష్టిసమష్టిస్వప్నములు,

అవస్థలగుక=దశలగును, ఈ వ్యష్టి సూక్ష్మాంగ స్వప్నంబులతనుంగుక=ఈ వ్యష్టి లింగశరీర స్వప్నముల యందు, ఆ ప్రాజ్ఞుండు = పూర్వము చెప్పిన సుషుప్త్యవస్థాభిమాని యయిన ప్రాజ్ఞ నామకుఁడు, అభిమాని యైన కర్తృత్వము గలవాఁడై, ప్రాతిభాసికుండు=ప్రపంచాకారవృత్తితోఁ దత్కాలమాత్రము నున్నాఁడు గనుక ప్రాతిభాసికుండు, స్వప్నకల్పితుండు=అజ్ఞానకార్య మయిన నిద్రాశక్తితోఁ గల్పింపఁబడును గనుక స్వప్నకల్పితుఁడు, తైజసుండు = తేజోరూప మయిన అంతఃకరణవృత్తితోఁ గూడినందున తైజసుఁడు, అనక = అనునట్లు, ప్రవర్తిల్లుక= ఒప్పుచుండును- అనఁగా వ్యష్టి సూక్ష్మశరీర స్వప్నములయందు కర్తృత్వము గల ప్రాజ్ఞుఁడు ప్రాతిభాసికుఁడు స్వప్నకల్పితుఁడు తైజసుఁడను నామములచే శోభిల్లునని భావము, ఆ సమష్టిసూక్ష్మకాయస్వప్నవిశిష్టుండనై= ముందుఁ జెప్పిన సమష్టిశరీరస్వప్నములయం దవచ్ఛిన్నుఁడనై, ఈశ్వరుండ నయిన నేను = ఈశ్వరనామము గల నేను, హిరణ్యగర్భుండు=జ్ఞానశక్తి గలవాఁడ నగుటవలన హిరణ్యగర్భుండు, సూత్రాత్మకుండు=మణులయందు సూత్రమువలె నానావిధప్రపంచ మంతయందును వ్యాప్తి మయి యున్నాను గనుక సూత్రాత్మకుండు, ప్రాణుండు = ఎల్లప్రాణులయందును క్రియాశక్తితోఁ గూడి యుండుటచేత ప్రాణుఁడు అనక = అను నామములచేత, సర్వజీవోపాస్యుఁడనై — సర్వజీవ = ఎల్లప్రాణులచేత, ఉపాస్యుండనై = ఆరాధింపఁ దగినవాఁడనై, ఉండుగుక=నివసింతును, ఇది = ఈ చెప్పఁబడినది, సూక్ష్మసృష్టి తెఱంగు=జీవేశ్వరులయొక్క సూక్ష్మసృష్టిక్రమము, ఇంకక=ఇఁక మీఁద, స్థూలప్రపంచప్రకారంబు= స్థూలపంచీకరణప్రకారము, వినిపించెదక = తెలియఁజేసెదను, వినుమని = ఆకర్ణింపుమని, ఇట్లనిరొక = ఇట్లు చెప్పఁదొడఁగెను

తా॥ ఈప్రకారము ఈశ్వరుఁడు సత్త్వగుణప్రధాన మైన మాయతోఁ గూడి తమోగుణప్రధాన మైన మాయను చూడఁగానే పూర్వము చెప్పఁబడిన తమోగుణప్రధాన మైనట్టిదియు సర్వమునకు నుపాదాన కారణ మయినదియు నగు మాయతోఁ గూడుకొనిన బ్రహ్మశక్తివలన శబ్దమే గుణముగాఁ గల యాకాశమును, ఆ యాకాశముతోఁ జేరిన యాత్మశక్తివలన స్పర్శమే గుణముగాఁ గల వాయువును, ఆ వాయువుతోఁ గూడిన పరబ్రహ్మశక్తివలన రూపమే గుణముగాఁ గల యగ్నియును, ఆ యగ్నితోఁ గూడిన పరబ్రహ్మశక్తివలన మాధుర్యమే గుణముగాఁ గల యుదకంబును, ఆ యుదకముతోఁ గూడిన బ్రహ్మశక్తివలన గంధమే గుణముగాఁ గల భూమియును పుట్టెను, ఒకటివలన నొకటి పుట్టిన యీభూతములు అయిదుగాఁ భాగింపఁబడని సూక్ష్మభూతము లనియు, పంచతన్మాత్ర లనియుఁ జెప్పఁబడును, తమోగుణము వలనఁ బుట్టిన యీసూక్ష్మభూతము లయిదును సత్త్వరజోగుణములచేత సత్త్వసూక్ష్మపంచభూతము లని రజస్సూక్ష్మపంచభూతము లని రెండువిధములై మఱియు, నీవ్యష్టి సమష్టి భేదములచేత సత్త్వవ్యష్టి సూక్ష్మభూతము లని, సత్త్వసమష్టిసూక్ష్మభూతము లని, రజోవ్యష్టిసూక్ష్మభూతము లని, రజస్సమష్టి సూక్ష్మభూతము లని నాలుగు విధములై వానిలో సత్త్వవ్యష్టిసూక్ష్మపంచభూతములవలన పది దిక్కులు, గాలి, సూర్యుఁడు, వరుణుఁడు, అశ్వినీదేవతలు వీరనెడు అధిదేవతలతోఁ గూడిన చెవి, చర్మము, నేత్రము, నాలుక, ముక్కు అను జ్ఞానేంద్రియములు అయిదును పుట్టెను, మిగిలిన సత్త్వ సమష్టివలన చంద్రుఁడు, బృహస్పతి, ఈశ్వరుఁడు, జీవుఁడు వీరనెడు అధిదేవతలతోఁ గూడిన సంశయాత్మక మగు మనస్సును, నిశ్చయాత్మక మగు బుద్ధియును, కర్తవ్యాత్మక మగు యహంకారమును, చంచలాత్మక మగు చిత్తమును గలిగెను, పైఁ జెప్పఁబడిన ఆకాశాదిపంచభూతములయొక్క రజోగుణవ్యష్టిభాగమువలన అగ్ని, దేవేంద్రుఁడు, విష్ణువు, యముఁడు, బ్రహ్మ వీరను అధిదేవతలతోఁ గూడిన నోరు, హస్తము, పాదము, గుద, యుపస్థము అను కర్మేంద్రియపంచకము పుట్టెను. మిగిలిన రజ

మైన రజోగుణముయొక్క సమష్టిపంచభూతములవలన విశిష్టుఁడు, విశ్వకర్త, విశ్వయోని, అజుఁడు, జయుఁడు నను నధిదేవతలుగల ప్రాణములును, అపానము, వ్యానము, ఉదానము, సమానము అను పంచ ప్రాణములను పుట్టెను ఈవిధముగా పుట్టిన జ్ఞానేంద్రియము లయిదును, మనో బుద్ధి చిత్తాహంకారము లనెడు అంతఃకరణచతుష్టయమును, కర్మేంద్రియములు అయిదును ప్రాణాదివాయువులయిదును చేరి పందొమ్మిది యయిన అంగములచేత లింగశరీరము కలిగెను. ఈ సూక్ష్మశరీరము తోఁపువలెను, వనమువలెను వ్యష్టి సమష్టి యని చెప్పఁబడును ఈ లింగశరీరములకు వ్యష్టిసమష్టిస్వప్నములు దశలగును ఈ వ్యష్టిలింగశరీరస్వప్నములయందు పూర్వము చెప్పఁబడిన సుషుప్త్యవస్థాభిమాని యగు ప్రాజ్ఞుఁడను జీవుఁడు కర్తృత్వము గలవాఁడై ప్రపంచాకారవృత్తి దోఁచు కాలమునందుమాత్ర మున్నాఁడు గనుక ప్రాతిభాసికుఁడనియు అజ్ఞానకార్య మయిన నిద్రాశక్తితోఁ గల్పింపఁబడును గనుక స్వప్నకల్పితుఁడనియు అంతఃకరణ వృత్తితోఁ గూడినందున తైజసుఁడనియు చెప్పఁబడును. సమష్టిసూక్ష్మశరీరములయందుఁ గూడుకొనిన యీశ్వరుఁడగు నేను జ్ఞానశక్తి గలవాఁడ నగుటవలన హిరణ్యగర్భుఁడనియు మణులయందు సూత్రమువలె నానావిధప్రపంచమందును చేరియుండుటవలన సూత్రాత్మకుఁడనియు క్రియాశక్తితోఁ గూడుకొని యుండుటచేత ప్రాణుఁడనియు సమస్తప్రాణులచేత పూజింపఁదగినవాఁడనై యుందును ఇప్పుడు చెప్పినది జీవేశ్వరులయొక్క సూక్ష్మసృష్టిక్రమము ఇఁక మీఁదు స్థూలపంచీకరణప్రకారము చెప్పెదను వినుమని యీప్రకారము చెప్పుటకు ప్రారంభించెనని తాత్పర్యము.

## సూక్ష్మశరీరపంచీకరణచక్రము.

| అపంచీకృత పంచ సూక్ష్మభూతములు | | ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి | సత్త్వగుణసూక్ష్మ భూతములు |
|---|---|---|---|---|---|---|---|
| సత్త్వగుణ పంచభూతములు | సత్త్వసమష్టి సూక్ష్మపంచ భూతములు | | మనస్సు చంద్రుఁడు | బుద్ధి బృహస్పతి | చిత్తము జీవుఁడు | అహంకారము రుద్రుఁడు | అంతఃకరణములు అధిదేవతలు. |
| | సత్త్వవ్యష్టి సూక్ష్మపంచ భూతములు | శ్రోత్రము దిక్కులు | త్వక్కు వాయువు | చక్షువు అర్కుఁడు | జిహ్వ వరుణుఁడు | ఘ్రాణము అశ్వినులు | జ్ఞానేంద్రియములు అధిదేవతలు. |
| రజోగుణ పంచభూతములు | రజస్సమష్టి సూక్ష్మపంచ భూతములు | సమానము జయుఁడు | వ్యానము విశ్వయోని | ఉదానము అజుఁడు | ప్రాణము విశిష్టుఁడు | అపానము విశ్వకర్త | పంచప్రాణములు అధిదేవతలు |
| | రజోవ్యష్టి సూక్ష్మపంచ భూతములు | వాక్కు వహ్ని | పాణి ఇంద్రుఁడు | పాదము విష్ణువు | గుహ్యము బ్రహ్మ | పాయువు మృత్యువు | కర్మేంద్రియములు అధిదేవతలు |

జీవసూక్ష్మదేహతత్త్వములే యీశ్వరసూక్ష్మదేహతత్త్వములు.

సీ. తత తమోగుణక భూతముల నైదింటిని, గ్రమమున రెండు భాగములుఁ జేసి
తొలుతఁ బంచార్ధాంశములఁ బూని వేర్వేఱఁ, దునియలు నాల్గుగా ననుపఱచి
ముఖ్యార్ధముల శేషభూతఖండచతుష్ట, యములనొండొంట నైయ్యమునఁ గూర్పఁ
బంచీకృతంబులై పటుతరస్థూలంబులై, యభివ్యక్తంబు లయ్యె నొకట

తే. వాయునందన వినుమింక వానివలన, నఖిలజగములు నానాచరాచరములు
బహువిధాన్నంబులును ఘటపటగృహాది, సకలదృశ్యపదార్థముల్ సంభవించె.

టీక. వాయునందన = వాయుపుత్త్రా, వినుము = ఆకర్ణింపుము. తత = గొప్పలైన, తమోగుణక = తమోగుణప్రధానములైన, భూతములనైదింటిని = స్థూలభూతములైన పృథివ్యాప్తేజోవాయ్వాకాశముల నైదింటిని, క్రమమునన్ = వరుసగా, రెండుభాగములు చేసి = రెండుభాగములుగా విభజించి, తొలుతన్ = ముందుగా, పంచార్ధాంశములన్ = పంచభూతములయొక్క సగభాగములను, పూని = ధరించి, వేర్వేఱన్ = ప్రత్యేకములుగా, తునియలునాల్గుగాన్ = నాలుగుభాగములుగా, అనువుపఱచి = చక్కఁబఱచి – అనఁగా విభజించి, ముఖ్యార్ధములన్ = ముఖ్యములైనట్టి సగభాగములను – అనఁగా భాగింపక యుండు నైదవభాగములను, శేష = మిగిలిన, భూత = పంచభూతములయొక్క, ఖండచతుష్టయములన్ = నాలుగుగా భాగించిన తునుకలను, ఒండొంటికిన్ = ఒకటితో నొకటి, నైయ్యమునన్ = ప్రీతితోడ, కూర్పన్ = చేర్పఁగా, పంచీకృతంబులై = పంచఁబడినవై, ఒకటన్ = ఏకకృత్తిగానే, పటుతర స్థూలంబులై – పటుతర = మిక్కిలి, స్థూలంబులై = విజృంభించినవై, అభివ్యక్తంబు లయ్యెన్ = అతి స్పష్టము లాయెను, ఇంకన్ = ఇంకను, వానివలనన్ = ఆ పంచీకృత పంచమహాభూతములవలన, అఖిల జగములు = సకలలోకములు, నానా = బహురూపములైన, చర = సంచరించెడు మనుష్యపశ్వాదులును, అచరములున్ = సంచరింపని పర్వతవృక్షాదులును, బహువిధాన్నంబులును = నానావిధము లగు భోజ్య పదార్థములను, ఘట = కుండలు, పట = వస్త్రములు, గృహ = ఇండ్లు, ఆది = మొదలైన, సకల = సర్వములైన, దృశ్య = కనఁబడెడు, పదార్థములును = వస్తువులును, సంభవించెన్ = పుట్టెను.

తా. ఓ ఆంజనేయా! తమోగుణప్రధానములైన పంచభూతములను రెండుభాగములు చేయఁగా నవి పదియవును. వానిలో నైదింటిని నాల్గు నాలుగు తునియలు జేసి యాతునియలను, భాగింపని యైదర్ధ భాగములను ఒకటితో నొకటిఁ జేర్పఁగా పంచీకృతములై విజృంభించె. వానివలన చతుర్దశభువనములు చరాచరజంతువులు ఆ జంతువులకుఁ దగిన నానావిధాహారములు ఘటపటగృహాది సమస్తవస్తువులు పుట్టెను. ఎట్లనఁగా, మొదట పృథివిని రెండుగా భాగించి ఆ రెంటిలో నొకభాగమును గూటముగానుంచి రెండవభాగమును నాలుగుభాగములు చేసి ఆ నాలుగుభాగములను కడగా నుంచిన పృథివిభాగములోఁ జేర్పక నాలుగుగా భాగింపఁబడిన జల అగ్ని వాయు ఆకాశభాగములతోఁ జేర్చవలెను. మీఁదఁ జెప్పిన ప్రథమాది క్రమముగాఁ జేర్చుటచేతఁ గలిగెడు మనస్సు మొదలగువాని నామములను వివరముగా తెలిసికొనుటకు మీఁద పంచీకరణపటము వ్రాయఁబడు చున్నది.

ఆకాశ నిరూపణము. నాలుగుగా భాగింపఁబడిన ఆకాశార్ధభాగములతో నితరభూతార్ధ భాగములు చేరుటచేఁ గలుగు తత్త్వములు వివరణము – 1. నాలుగుగాఁ జేయఁబడిన పృథివిభాగములలో నొకటి చేరుటచే అహంకారమును, 2. ఆకాశభాగములలో జలభాగము కలియుటచేత చిత్తమును, 3. ఆకాశభాగముతో అగ్నిభాగము చేరుటచే బుద్ధియును, 4. ఆకాశభాగముతో వాయుభాగము కూడుటచేత మన

స్సును పుట్టెను. నాలుగుగా భాగింపని ఆకాశార్ధాంశ మంతఃకరణమాయెను. వాయునిరూపణము—౧. వాయుభాగములు నాలుగింటిలో నొకభాగముతో పృథ్వియొక్క నాలుగుభాగములలో నొకభాగము చేరుటచేత అపానమును, ౨ వాయుభాగముతో జలభాగము చేరుటచేత ప్రాణవాయువును, 3. వాయు భాగముతో తేజోభాగము చేరుటచేత ఉదానవాయువును, ౪ వాయుభాగముతో ఆకాశభాగము చేరుటచేత సమానవాయువును పుట్టెను భాగింపని సగము వ్యానవాయు వయ్యెను తేజోనిరూపణము— ౧ తేజోభాగముతో భూభాగము చేరుటవలన ఘ్రాణేంద్రియమును, ౨. తేజోభాగముతో జలభాగము చేరుటచేత రసనేంద్రియమును, 3. తేజోభాగముతో వాయుభాగము చేరుటచేత త్వగింద్రియమును, ౪ తేజోభాగముతో ఆకాశభాగము చేరుటవలన శ్రోత్రేంద్రియమును నుదయించెను భాగింపని సగము తేజ స్సును చక్షురింద్రియ మయ్యెను జలనిరూపణము—౧ జలభాగముతో భూభాగము చేరుటచేత గంధ మును, ౨ జలభాగముతో తేజోభాగము చేరుటవలన రూపమును, 3. జలభాగముతో వాయుభాగము చేరుటచేత స్పర్శమును, ౪ జలభాగముతో ఆకాశభాగము చేరుటవలన శబ్దమును పుట్టెను భాగింప నిఅర్ధజలభాగము రస మయ్యెను పృథివీనిరూపణము—౧ పృథివీభాగముతో జలభాగము చేరుటవలన ఉపస్థేంద్రియమును, ౨ పృథివీభాగముతో తేజోభాగము చేరుటచేత పాదేంద్రియమును, 3. పృథివీ భాగముతో వాయుభాగము చేరుటచేత పాణీంద్రియమును, ౪ పృథివీభాగముతో ఆకాశభాగము చేరుటచేత వాగింద్రియమును పుట్టెను భాగింపక యుండు సగము పృథివీభాగము పాయ్వింద్రియ మయ్యెను

పంచీకరణకదంబము—౧ అంతఃకరణము, సమానవాయువు, శ్రోత్రేంద్రియము, శబ్దము, వాక్కు ఇవి యైదు ఆకాశకదంబము, ౨ మనస్సు, వ్యానవాయువు, త్వగింద్రియము, స్పర్శము, పాణి ఇవి యైదు వాయుకదంబము, 3 బుద్ధి, ఉదానవాయువు, చక్షురింద్రియము, రూపము, పాదము ఇవి యైగును తేజఃకదంబము, ౪ చిత్తము, ప్రాణవాయువు, రసనేంద్రియము, రసము, ఉపస్థేంద్రియము ఇవి యైదును జలకదంబము, ౫ అహంకారము, అపానము, ఘ్రాణేంద్రియము, గంధము, పాయ్వింద్రి యము ఇవి యైదును పృథివీకదంబము

శ్లో॥ జ్ఞాతా సమానవాయుశ్చ శ్రోత్రశ్శబ్దస్తథైవచ। పాణిపంచ ఇదంప్రోక్త మిత్యేతే వ్యోమపంచకమ్॥౧॥
మనశ్చవ్యానవాయుశ్చ త్వక్స్పర్శశ్చ తథైవచ। పాణిపంచ ఇదంప్రోక్త మిత్యేతే వాయుపంచకమ్॥౨॥
బుద్ధిశ్చోదానవాయుశ్చ చక్షూరూపం తథైవచ। పాదపంచ ఇదంప్రోక్త మిత్యేతే వహ్నిపంచకమ్॥3॥
చిత్తంచ ప్రాణవాయుశ్చ జిహ్వాచ రసఏవచ। గుహ్యపంచ ఇదంప్రోక్త మిత్యేతే జలపంచకమ్॥౪॥
అహంచాపానవాయుశ్చ ఘ్రాణంగంధ స్తథైవచ।పాయుపంచ ఇదం ప్రోక్త మిత్యేతే భూమిపంచకమ్॥౫॥

| ఆత్మ | స్థూల శరీర పంచీకరణ చక్రము. | | | |
|---|---|---|---|---|
| ఆకాశము అంతఃకరణము | మనస్సు | బుద్ధి. | చిత్తము | అహంకారము. |
| సమానవాయువు | వాయువు వ్యానవాయువు | ఉదానవాయువు | ప్రాణవాయువు | అపానవాయువు |
| శ్రోత్రేంద్రియము | త్వగింద్రియము | తేజస్సు చక్షురింద్రియము | రసనేంద్రియము | ఘ్రాణేంద్రియము. |
| శబ్దము | స్పర్శము. | రూపము. | జలము. రసము | గంధము. |
| వాగింద్రియము | పాణీంద్రియము | పాదేంద్రియము | ఉపస్థేంద్రియము | పృథివి. పాయ్వింద్రియము |

జీవస్థూలదేహతత్త్వాధిదేవతలే యీశ్వరస్థూలదేహతత్త్వములు.

## బ్రహ్మాండ పంచీకరణ చక్రము నందు స్థూలశరీర నిర్ణయము.

బ్రహ్మణో౽వ్యక్తః, అవ్యక్తా న్మహతః, మహతో౽హంకారః, అహంకారా త్పంచతన్మాత్రాణి, పంచతన్మాత్రేభ్యః పంచమహాభూతాని, పంచమహాభూతేభ్యో ఽఖిలం జగత్. తా॥ అద్వితీయపరబ్రహ్మమువలన అవ్యక్తమును, దానివలన మహత్తత్త్వమును, అందున మహదహంకారమును, దానివలన పంచతన్మాత్రలును, వానివలన పంచభూతములును, వానివలఁ జతుర్దశభువనములును పుట్టెను అది స్పష్టముగాఁ దెలియుటకై క్రింద బ్రహ్మాండపంచీకరణచక్రము వ్రాయఁబడు చున్నది స్థూలజగత్సృష్టికి మునుపు పంచభూతములు ప్రకృత్యవచ్ఛిన్నములై యున్నవి

### పంచతన్మాత్రలు.

| శబ్దము | స్పర్శము | రూపము | రసము | గంధము |
|---|---|---|---|---|
| సత్త్వగుణాకాశము | సత్త్వగుణవాయువు | సత్త్వగుణాగ్ని | సత్త్వగుణజలము | సత్త్వగుణపృథివి |
| రజోగుణాకాశము | రజోగుణవాయువు | రజోగుణాగ్ని | రజోగుణజలము | రజోగుణపృథివి |
| తమోగుణాకాశము | తమోగుణవాయువు | తమోగుణాగ్ని | తమోగుణజలము | తమోగుణపృథివి |
| తమోగుణాకాశార్ధభాగ మంతఃకరణ చతుష్టయగోళక మయ్యెను<br>శేషార్ధము ౪ భాగములై తమోగుణానిలాగ్ని జలభూములఁ గలసి మానసాదిస్థానము లయ్యె | తమోగుణాకాశార్ధభాగ చతుశ్శకలములలో ప్రథమశకలము తామసవాయువులోఁ జేరి మనోగోళక మయ్యెను. | తమోగుణాకాశార్ధభాగ చతుశ్శకలములలో ద్వితీయశకలము తామసాగ్నియందుఁ గలసి బుద్ధిగోళక మయ్యెను | తమోగుణాకాశార్ధభాగ చతుశ్శకలములలో తృతీయశకలము తామసజలమందుఁ గలసి చిత్తగోళక మాయెను | తమోగుణాకాశార్ధభాగ చతుశ్శకలములలో చతుర్థశకలము తామసపృథివిలోఁ గలసి అహంకారస్థాన మాయెను. |
| తమోగుణానిలార్ధభాగ చతుశ్శకలములలో ప్రథమశకలము తామసాకాశములోఁ జేరి సమానవాయుగోళక మయ్యెను | తమోగుణానిలార్ధభాగము వ్యానగోళక మయ్యెను<br>శేషార్ధము ౪ భాగములై తమోగుణాకాశాగ్ని జలభూములఁ గలసి సమానోదానాపాన ప్రాణగోళకము లయ్యెను | తమోగుణానిలార్ధభాగ చతుశ్శకలములలో ద్వితీయశకలము తామసాగ్నియందుఁ గలసి ఉదానవాయుగోళక మయ్యెను | తమోగుణానిలార్ధభాగ చతుశ్శకలములలో తృతీయశకలము తామసజలమందుఁ గలసి ప్రాణవాయుగోళక మయ్యెను | తమోగుణానిలార్ధభాగ చతుశ్శకలములలో చతుర్థశకలము తామసపృథివియందుఁ గలసి అపానగోళక మయ్యెను |

బ్రహ్మాండపంచీకరణ చక్రమునందు సూక్ష్మశరీర నిర్ణయము.

| సత్త్వగుణాకాశము. రజోగుణాకాశము | సత్త్వగుణవాయువు రజోగుణవాయువు | సత్త్వగుణాగ్ని రజోగుణాగ్ని | సత్త్వగుణజలము రజోగుణజలము | సత్త్వగుణపృథివి రజోగుణపృథివి |
| --- | --- | --- | --- | --- |
| సత్త్వగుణాకాశాది పంచభూతార్ధసమష్ట్యంశ మేకీభవించి ప్రత్యగాత్మాధిదేవతతోఁ జేరి తమోగుణాకాశాది పంచభూతార్ధసమష్ట్యంశముచే గల్గిన అంతఃకరణగోళకమందుండి ౧ము జీవుఁడను పేరుచేత సర్వేంద్రియప్రాణవిభుత్వము చేయుచున్నాఁడు | సత్త్వగుణాకాశార్ధభాగ సమష్ట్యంశములో ప్రథమభాగమువలనఁ గల్గిన మనస్సు చంద్రాధిదేవతతోఁ జేరి తామసగుణాకాశార్ధభాగ ౪ లలో ౧ము తామసవాయువులోఁ జేరి కల్గిన మనోగోళమందు నిల్చి సంకల్పించుచున్నది | సత్త్వ ములో ౨ము తమోగుణాగ్నిలోఁ గలసి కలిగిన బుద్ధి బృహస్పత్యధిదేవతతోఁ జేరి తామసగుణాకాశార్ధభాగ ములో ౨ము తామసాగ్నియందుఁ గలసి కలిగిన బుద్ధిగోళకమందు నిల్చి మనస్సునందలి సంకల్పమును దృఢపఱచుచున్నది | సత్త్వ ములో ౩ము సత్త్వగుణజలములోఁ జేరి కలిగిన చిత్తము క్షేత్రజ్ఞాధిదేవతతోఁ గూడి తామసగుణాకాశార్ధభాగ ౪లలో ౩ము తామసజలమందుఁ జేరి కలిగిన చిత్తగోళమందు నిల్చి ఆలోచన చేయుచున్నది | సత్త్వ ములో ౪ము సత్త్వగుణపృథివిలోఁ గలసి కలిగి-న అహంకారమును రుద్రాధిదేవతతోఁ గూడి తమోగుణాకాశార్ధభాగచతుర్థకలములలో ౪లము తామసగుణపృథివిలోఁ జేరి పుట్టిన అహంకారగోళమందు నిల్చి అంతఃకరణనియమకకార్యములు చేయుచున్నది |
| రజోగుణానిలార్ధభాగ సమష్ట్యంశములో ౧ము రజోగుణాకాశమునఁ జేరి కల్గిన సమానము జయధిదేవతతోఁ తమోగుణానిలార్ధ ౪లలో ౧ము తమోగుణాకాశమునఁ జేరి కల్గిన సమానవాయుస్థానమందు నిల్చి జఠరాగ్ని వెలిఁగించి భక్షితాన్నరస మెల్లనాడులకు భాగించును | రజోగుణానిలార్ధభాగ సమష్ట్యంశమువలనఁ గలిగిన వ్యానవాయువు విశ్వయోన్యధిదేవతతోఁ గూడి భక్షితాన్నరసమును శరీరమునం దంతటను వ్యాపింపఁజేయుచుండును | రజో లో ౨ము రజోగుణాగ్నిలోఁ జేరి కలిగిన యుదానవ జాధిదేవతతోఁ గూడి తమోగుణానిలార్ధభాగ ౪లలో ౨ము తామసాగ్నిలోఁ జేరి కలిగిన వుదానగోళమందు నిల్చి జిహ్వాద్యష్టస్థానములందు శబ్దనిల్చి ... మంచి సర్వేంద్రియములను అవిద్యయందుఁ జేర్చి ప్రబోధవేళ వానివాని నెలవులందు నిల్పి నిద్రావుచుండును | రజో. ములో ౩ము రజోగుణజలములోఁ గలసి కలిగిన ప్రాణము విశిష్టాధిదేవతతోఁ గూడి తమోగుణానిలార్ధభాగ ౪లలో ౩లము తమోజలమునఁ జేరి కలిగిన ప్రాణగోళమందు నిల్చి ఉచ్ఛ్వాసముచేత వెలుపలకు ఆకర్షించుచు లోపలికి విడిచుచుండును | రజో. ములో ౪ము రజోగుణపృథివియందుఁ గలసి కలిగిన అపానుఁడు విశ్వకర్తను నధిష్ఠానదేవతతోఁ గూడి తమోగుణానిలార్ధ ౪లలో ౪ము తామసపృథివియందుఁ గలసి కలిగిన అపానగోళమందు నిల్చి నిశ్వాసముచేత ప్రాణుండు బాహ్యమునకు నిర్గమింపఁజేసినదానిని లోపలికిఁ బ్రవేశింపఁజేయును |

## ఈశ్వరశరీరవివేచనము.

వ. ఇట్లు గగనార్ధంబున వాయు తేజో జల భూ భాగంబుల ననిలార్ధంబున నాకాశానల సలిలేలాంశంబులఁ బావకార్ధంబున నభస్సమీర తోయ ధరణీ ఖండంబుల నీరార్ధంబున వియన్మరుత్కృశానుధాత్రీ శకలంబుల ధరార్ధంబున వ్యోమపవనాగ్న్యుదకంబుల తునియల జీవాదృష్టసహాయంబునం గూర్చిన క్రమంబుచేత శబ్దగుణకంబయిన యాకాశంబు శబ్దస్పర్శగుణకంబైన పవమానంబు శబ్దస్పర్శరూపగుణకంబైన దహనంబు శబ్దస్పర్శరూపరసగుణకంబైన యంబువులు శబ్దస్పర్శరూపరస గంధసమేతంబైన ధరణియుఁ బంచీకృతంబులై మహాస్థూలంబులై యభివ్యక్తంబులయ్యె నిమ్మహాభూతంబులవలన నతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళ భూలోక భువర్లోక స్వర్లోక మహర్లోక జనలోక తపోలోక సత్యలోకంబులను చతుర్దశభువనంబులు దత్తల్లోకోచిత జరాయుజాండజ స్వేదజోద్భిజరూప చతుర్విధభూతగ్రామంబులుఁ దత్తత్ప్రాణియోగ్యాన్నపానాదికంబులు ఘటపటాది సర్వపదార్థంబులు సంభవించె నంతవట్టునుం గూడి స్థూలప్రపంచం బగు దీనికి వ్యష్టిసమష్ట్యాత్మకంబైన జాగరం బవస్థ యగు నందొకొక్క వ్యష్టిస్థూలశరీర జాగరంబులయం దాలింగి దేహోపాధికుండైన తైజసుం డభిమానంబు చేసి చిదాభాసుం డన వ్యావహారికుం డన విశ్వుం డన నొప్పు హిరణ్యగర్భుండ నయిన నేను సమష్టిస్థూలవిగ్రహజాగ్రద్విశిష్టుండ నయి వైరాజుం డన వైశ్వానరుం డన విరాట్పురుషుం డన సకలజగదారాధ్యుండ నయి ప్రకాశించుచుందు మఱియును.

టీక ఇట్లు = ఇవ్విధముగా, గగనార్ధంబునన్ = నాలుగుగా భాగించిన ఆకాశార్ధభాగమునందు, వాయుతేజోజలభూభాగంబులన్ = వాయు వహ్ని జల భూములతునుకలను, అనిలార్ధంబునన్ = నాలుగుగా భాగించిన వాయ్వర్ధభాగమందు, ఆకాశానలసలిలేలాంశంబులన్ = ఆకాశాగ్ని జల భూముల భాగములను, పావకార్ధంబునన్ = నాలుగుతునుకలుగాఁ జేసిన అగ్నిభూతార్ధభాగమందు, నభః = ఆకాశము, సమీర = వాయువు, తోయ = జలము, ధరణి = భూమి, (వీనియొక్క) ఖండంబులన్ = శకలములను, నీరార్ధంబునన్ = నాలుగుగా భాగించిన జలభూతార్ధభాగమందు, వియత్ = ఆకాశము, మరుత్ = వాయువు, కృశాను = అగ్ని, ధాత్రీ = భూమి, (వీనియొక్క) శకలంబులన్ = అంశములను, ధరార్ధంబునన్ = నాలుగుగా భాగించిన పృథ్వీభూతముయొక్క సగభాగమందు, వ్యోమ = గగనము, పవన = వాయువు, అగ్ని = వహ్ని, ఉదకంబుల = సలిలము, తునియలన్ = వీనియొక్క భాగములను, జీవాదృష్టసహాయంబునన్ - జీవ = ప్రాణికోట్లయొక్క, అదృష్ట = ప్రారబ్ధానుభోగములయొక్క, సహాయంబునన్ = తోడ్పాటుచేత, కూర్చినక్రమంబుచేతన్ = ఒకభూతభాగములతో నొకభూతములను గూర్చినప్రకారముచేత, శబ్దగుణకంబైన = శబ్దమే గుణముగాఁ గల, ఆకాశంబును = గగనమును, శబ్దస్పర్శగుణకంబైన = శబ్దస్పర్శములు గుణములుగాఁ గల, పవమానంబును = వాయువును, శబ్దస్పర్శరూపగుణకంబైన = శబ్దస్పర్శరూపములు గుణములుగాఁ గల, దహనంబును = అగ్నియును, శబ్దస్పర్శరూపరసగుణకంబైన = శబ్దస్పర్శరూపరసములు గుణములుగాఁగల, అంబువులును = జలములును, శబ్దస్పర్శరూపరసగంధసమేతంబైన = శబ్ద

స్పర్శరూపరసగంధము లనెడు గుణములతోఁ గూడిన, ధరణియున్ = భూమియును, పంచీకృతంబులై = ఐదువిధములుగా భాగింపఁబడినవై, మహాస్థూలంబులై = మిగుల విజృంభించినవై, అభివ్యక్తంబు లయ్యెన్ = మిక్కిలి ప్రబల మాయెను, ఇమ్మహాభూతంబులవలనన్ = ఈ పంచమహాభూతముల వలన, అతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాల భూలోక భువర్లోక స్వర్లోక మహర్లోక జనలోక తపోలోక సత్యలోకంబు లను చతుర్దశభువనంబులు = అతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళ భూలోక భువర్లోక స్వర్గలోక మహర్లోక జనలోక తపోలోక సత్యలోకంబు లనెడు పదునాలుగులోకములును, తత్తల్లోకోచిత = ఆయాలోకములకుఁ దగిన, జరాయుజ = మావివలనఁ బుట్టిన మనుష్యులు పశువులు గుఱ్ఱములు మొదలయినవియును - మావి యనఁగా కడుపులోని పిండమునకుఁ జుట్టికొని యుండు మాంసపుపొర, అండజ = గ్రుడ్లవలనఁ బుట్టిన సర్పములు పక్షులు పిపీలికలు మొదలైనవియు, స్వేదజ = చెమటవలనఁ బుట్టిన పురుగులు యీఁగలు దోమలు మొదలైనవియు, ఉద్భిజరూప = భూమిని బ్రద్దలు చేసికొని యుద్భవించెడు వృక్షములు పొదలు తృణములు ననెడు, చతుర్విధ = నాలుగువిధము లయిన, భూతగ్రామంబులును = ప్రాణిసమూహములును, తత్తత్ప్రాణియోగ్య = ఆయా జీవులకుఁ దగిన, అన్నపానాదికంబులును = అన్నోదకములు మొదలగునవియు, ఘటపటాది సర్వపదార్థంబులును = కడవలు గుడ్డలు మొదలగు సమస్తవస్తువులును, సంభవించెన్ = పుట్టెను, ఇంతవట్టునుంగూడి = ఇంతవట్టుకుఁ జేరి, స్థూలప్రపంచం బగున్ = స్థూలప్రపంచసృష్టి యగును, దీనికిన్ = ఈ స్థితిలోపాదికి, వ్యష్టిసమష్ట్యాత్మకంబైన = వ్యష్టిసమష్టిరూపమైన, జాగరంబు = జీవేశ్వరుల జాగ్రత్, అవస్థయగున్ = దశ యగును - అనఁగా వ్యష్టిస్థూలశరీరాభిమాని యైన జీవునకు వ్యష్టిజాగ్రదవస్థయును, సమష్టిస్థూలశరీరాభిమాని యైన యీశ్వరునకు సమష్టిజాగ్రదవస్థయును యగునని భావము, అంగున్ = ఆ వ్యష్టిసమష్ట్యాత్మక మయిన జాగ్రద్దశయందు, ఒక్కొక్క వ్యష్టిస్థూలశరీరజాగరంబులయందున్ = ఒక్కొక్కపురుషుని స్థూలశరీరజాగ్రదవస్థలయందు, అలింగదేహోపాధి రుండనయి = ముందుఁ జెప్పఁబడిన సూక్ష్మశరీరాభిమాని యైన, తైజసుండభిమానంబుచేసి = తైజసుఁడను స్థూలశరీరమునం దభిమానమును పొంది, చిదాభాసుండనన్ = చిల్లక్షణములు లేకనే చిత్తువలె దోఁచుచున్నాఁడు గాన చిదాభాసుఁ డని, వ్యావహారికుం డనన్ = సకలప్రపంచవ్యవహారము చేయుచున్నాఁడు గాన వ్యావహారికుఁ డని, విశ్వుం డనన్ = సర్వమం దభిమానము గలవాఁడు గనుక విశ్వుఁ డని, ఒప్పున్ = ఈ మూఁడు నామములచేత తేజరిల్లును - అనఁగా జాగ్రదవస్థతోఁ గూడిన జీవునకు చిదాభాసుఁ డని వ్యావహారికుఁ డని విశ్వుఁ డని మూఁడు పేళ్లు గలవని భావము, హిరణ్యగర్భుఁడనైననేను = సమష్టిసూక్ష్మశరీరాభిమాని యైన హిరణ్యగర్భుఁ డను పేరు గల నేను, సమష్టిస్థూలవిగ్రహజాగ్రద్విశిష్టుఁడనై = సమస్తజీవసముదాయరూప మహాస్థూలశరీరజాగ్రదవస్థతోఁ గూడినవాఁడనై, వైరాజునుం డనన్ = విశేషముగా తోఁచుచున్నాను గాన వైరాజుఁ డని, వైశ్వానరుం డనన్ = యెల్ల జీవులయందు నేనను నభిమానము చేయుచున్నాను గావున వైశ్వానరుఁ డని, విరాట్పురుషుం డనన్ = నానావిధంబులుగ తోఁచుచున్నాను గనుక విరాట్పురుషుఁ డని - అనఁగా సమష్టి జాగ్రచ్ఛరీరముతోఁ గూడిన యీశ్వరునకు వైరాజుఁ డని వైశ్వానరుఁ డని విరాట్పురుషుఁ డని మూఁడుపేళ్లు కలవని భావము, సకలజగత్పూజ్యుండనై = సకలభువనములచేతఁ బూజింపఁదగినవాఁడనై, ప్రకాశింపుచుండుదున్ = తేజరిల్లు చుండుదును, మఱియున్ = వెండియును

తా. ఈప్రకారము నాలుగుభాగములుగా భాగింపఁబడిన ఆకాశముయొక్క సగ మయిన భాగమునందు గాలి, జలము, అగ్ని, భూమి వీట్లయొక్క తునుకలను, నాలుగుగా భాగింపఁబడిన గాలియొక్క-

సగమయిన భాగమునందు ఆకాశము, అగ్ని, జలము, భూమి వీట్లయొక్క భాగములను, నాలుగు తునుకలుగాఁ జేయఁబడిన అగ్నియొక్క సగమయినభాగమునందు ఆకాశము, వాయువు, జలము, భూమి, వీట్లయొక్క తునుకలను, నాలుగుగా భాగింపఁబడిన యుదకముయొక్క సగమయిన భాగమునందు ఆకాశము, వాయువు, అగ్ని, భూమి వీట్లయొక్క భాగములను, నాలుగుగా భాగింపఁబడిన భూమి యొక్క సగభాగమునందు ఆకాశము, వాయువు, అగ్ని, జలము వీనియొక్క భాగములను సమస్త ప్రాణుల ప్రారబ్ధానుభోగములతోడ్పాటుచేత ఒకభూతభాగముతో నొక్కొకభూతభాగమును చేర్చి నట్లుగా శబ్దమే గుణముగాఁ గల యాకాశమును, శబ్దస్పర్శములు గుణములుగాఁ గల వాయువును, శబ్ద స్పర్శరూపములు గుణములుగాఁ గల యగ్నియును, శబ్దస్పర్శరూపరసములు గుణములుగాఁ గల యుద కములును, శబ్దస్పర్శరూపరసగంధములతోఁ గూడిన భూమియును అయిదువిధములుగా భాగింపఁబడినదై మిగుల విజృంభించి ప్రబలమాయెను ఈ పంచమహాభూతములవలన పదునాలుగులోకములును, ఆయా లోకములకుఁ దగిన మనుష్యులు గుఱ్ఱములు పశువులు మొదలైనవియును, గ్రుడ్లవలనఁ బుట్టిన సర్పములు పక్షులు పిపీలికములు మొదలైనవియును, చెమటవలనఁ బుట్టిన పురుగులు ఈఁగెలు దోమలు మొదలైనవి యును, భూమిని బ్రద్దలు చేసికొని బయట వచ్చెడు వృక్షములు పొదలు తృణములు మొదలయినవి యును నగు నాలుగువిధములైన ప్రాణిసమూహములును, ఆజీవులకుఁ దగిన అన్నపానాదులును, వడవలు వస్త్రములు మొదలగు సమస్తవస్తువులును పుట్టెను, ఇవి యన్నియును చేరి స్థూలప్రపంచ సృష్టి యాయ్యెను ఈ స్థూలోపాధికి వ్యష్టిసమష్టిరూపమైన జీవేశ్వరులజాగ్రత్తగళ యగును, ఆ వ్యష్టి సమష్ట్యాత్మకం బగు జాగ్రత్తయనెడు దశయందు ఒక్కొక్కపురుషుని స్థూలశరీరజాగ్రదవస్థలయందు మునుపుఁ జెప్పఁ బడిన లింగదేహాభిమాని యగు తైజసుండు స్థూలశరీరమునందు అభిమానమును పొంది ప్రస్తుతలఁ దోఁచు చుండుటచేత చిదాభాసుఁ డనియు, సకలప్రపంచవ్యవహారము చేయుచుండుటచేత వ్యావహారికుండు నయి సర్వమునందు అభిమానము గలవాఁ డగుటచేత విశ్వుఁ డనియుఁ జెప్పఁబడుచుండును, (అనఁగా జాగ్రదవస్థతోఁ గూడిన జీవునకు చిదాభాసుఁ డని వ్యావహారికుఁ డని విశ్వుఁ డని పేళ్లు సమష్టి సూక్ష్మశరీరాభిమాని యగు హిరణ్యగర్భుఁ డయిన నేను సమస్తప్రాణికోట్లురూప మగు మహాస్థూల శరీరజాగ్రదవస్థతోఁ గూడినవాఁడనై విశేషముగా తోఁచడముచేత వైరాజుఁ డనియు, ఎల్లజీవుల యందు నేనను అభిమానము చేయుచున్నాను గనుక వైశ్వానరుఁ డనియు, అనేకవిధములుగా తోఁచు చున్నాను గనుక విరాట్పురుషుఁ డనియు సమస్తజగములచేత పూజింపఁబడినవాఁడనై ప్రకాశించు చుందు నని తాత్పర్యము

చ. ధరణి పదంబులున్ దివి తలంబగు మస్తక మంతరిక్షమున్
సురుచిరనాభిచండకరసోములు లోచనముల్ దిశల్ శ్రుతుల్
వరదహనుండు నెమ్మొగము వాయువు ప్రాణములున్ మహావిరా
ట్పురుషుఁడ నైన నాకుఁ గపిపుంగవ విశ్వశరీరి నాటచేన్. ౪౪

టీక కపిపుంగవ = వానరోత్తమా, విశ్వశరీరినాటచేన్ = ప్రపంచమే శరీరముగాఁ గలవాఁడ నగుట చేత- విశ్వనామకజీవుఁడే శరీరముగాఁ గలవాఁడ నగుటచేత నని యర్థాంతరము.—అనఁగా సర్వాంతర్యామి నని భావము మహావిరాట్పురుషుఁడన్ = 'విశేషణ రాజత ఇతి విరాట్' అనెడు వ్యుత్పత్తిచేత మిగులఁ బ్రకాశించుచున్నవాఁడను, ఐననాకున్ = ఐనట్టి నాకు, ధరణిపదంబులును = భూమి పాదములును, దివి = స్వర్గము, తలంబు = విశాలము, అగుమస్తకము = ఐనశిరస్సును, సురుచిరనాభి = రమ్యమైన

పాక్కిలి, అంతరిక్షమును = ఆకాశమును, లోచనములు = కన్నులు, చండకరసోములు = సూర్య చంద్రులును, దిశలు = దిక్కులు, శ్రుతులు = చెవులును, వెహ్నిగము = నోరు, వరగహనుండు = మంత్రపూత మగు శ్రౌతస్మార్తాగ్ని, వాయువు = గాలి, ప్రాణములును = అసువులును.

తా. ఓయి వానరోత్తమా! ప్రపంచమే శరీరముగాఁ గలవాఁ డగుటచేఁ బ్రకాశించెడు నాకు భూమి పాదములును, స్వర్గము విశాల మగు తలయును, ఆకాశము రమ్య మైన పొక్కిలియును, సూర్యుఁడు చంద్రుఁడు కన్నులును, దిక్కులు చెవులును, మంత్రముచేత పవిత్రము చేయఁబడిన శ్రౌత స్మార్తాగ్ని నోరును, గాలి ప్రాణములును నై యున్న వని తాత్పర్యము.

సుగంధివృత్తము. ధారుణీసురు ల్ముఖంబు ౯ ధాత్రిపు ల్భుజంబు లో
సూరి వైశ్యు లూరువు ల్సుశూద్రు లంఘ్రులు న్మహా
భూరుహౌషధీలతాళి ౯ భూరిరోమము ల్విరా
ట్పూరుషుండ నైన నాకు ౯ బోధశుద్ధమానసా. ౭౫

టీక బోధ = బ్రహ్మజ్ఞానముచేత, శుద్ధ = నిర్మల మైన, మానస=ఉల్లము గలవాఁడా, ఓసూరి= ఆత్మానాత్మవివేకము గల ఆంజనేయా, విరాట్పూరుషుండ నైన నాకు౯ = విరాట్పురుషుఁడ నైన నాకు, ధారుణీసురులు = విప్రులు, ముఖంబు = మొగము, ధాత్రిపులు=రాజులు, భుజంబులు = చేతులు, వైశ్యులు = కిరాటులు, ఊరువులు = తొడలు, సుశూద్రులు = సచ్ఛూద్రులు, అంఘ్రులు౯=పాదము లును, మహాభూరుహ = శ్రేష్ఠము లైన, అశ్వత్థ= బిల్వ తులసీ వటాదివృక్షములయొక్క, ఓషధీ = యవ వ్రీహిగోధూమాదిసస్యములయొక్క, లతా = మల్లికా మాలతీ మాధవి మొదలగు తీఁగలయొక్క, ఆళి= పంక్తి, భూరిరోమములు = గొప్ప లైన తనూరుహములు

తా బ్రహ్మజ్ఞానముచేత నిర్మల మైన మనస్సు గలవాఁడవును, ఆత్మానాత్మవివేకము గలవాఁడవు నైన యో యాంజనేయా! విరాట్పురుషుఁ డైన నాకు విప్రులు మొగముగాను, రాజులు చేతులుగాను, వైశ్యులు తొడలుగాను, శూద్రులలో శ్రేష్ఠు లైనవారు పాదములుగాను, శ్రేష్ఠము లైన రాగిచెట్టు మారేడుచెట్టు బృందావనము మఱ్ఱిచెట్టు మొదలైన చెట్లయొక్కయు, యవలు గోధుమలు మొదలగు ధాన్యములయొక్కయు, మల్లెలు బండిగురిగింజలు పీట్లతీఁగలయొక్కయు సమూహములు విశేషము లైన రోమములుగాను యున్న వని తాత్పర్యము.

వనమయూరము. శైలములు శల్యములు ౯ సన్నదులు నాడీ
జాలములు వార్ధులు పిచండము త్రిసంధ్యా
కాలములు చేలములు ౯ కాలజలవాళు
ల్వాలములు విశ్వతనువర్తి నగు నాకున్. ౭౬

టీక విశ్వతనువర్తి నగు నాకు౯ = విశ్వశబ్దము ఓంకారమందును ప్రపంచమందును వర్తించును గనుక ఓంకార మనెడు శరీరమందు సంచరించెడి నాకు-ప్రపంచ మనెడు శరీరాంతర్వర్తి నైన నాకని యర్థాంతరము, శైలములు = పర్వతములు, శల్యములు= ఎముకలు, సన్నదులు = శ్రేష్ఠము లైన గంగాది పుణ్యనదులు, నాడీజాలములు = సుషుమ్నాది డెబ్బదిరెండువేలనాడులు, వార్ధులు = సముద్రములు, పిచండము = కుక్షి, త్రిసంధ్యాకాలములు = ప్రాతర్మధ్యాహ్న వేళలు, చేలములు = వస్త్రములు, కాల

జలదాళులు = నీలమేఘపంక్తులు, వాలములు = వెంట్రుకలు, ॥ని॥ "చికురః కుంతలోవాలః కచః కేశ శ్శిరోరుహః" అని అమరము, ఇచ్చట చెప్పిన దంతయు పురుషసూక్తార్థము

తా॥ ప్రపంచ మనెడు శరీరమందు సంచరించెడు (విశ్వశబ్దమునకు ఓంకార మని యున్నది గనుక ఓంకారమునందు సంచరించెడు) నాకు పర్వతములు ఎముకలుగాను, గంగాదిపుణ్యనదులు సుషుమ్నాది డెబ్బదిరెండువేల నాడులుగాను, సముద్రములు కడుపుగాను, త్రిసంధ్యాకాలములు, వస్త్రములుగాను నీలమేఘ పంక్తులు వెంట్రుకలుగాను యున్న వని తాత్పర్యము

శా॥ ఆధారం బిలయై జలంబు మణిపూరాంభోజ మై వహ్ని యై
స్వాధిష్ఠాన మనాహతం బనిల మై సంచద్విశుద్ధంబు ఖం
బై ధీమానసరూపక ప్రకృతియాజ్ఞాజ్ఞాత మై యొప్పు న
ర్వాధారోన్నతవిశ్వమూర్తి నగు నాకాదిత్యసంపూజితా ౪౭

టీక ఆదిత్య = దేవతలచేత, సంపూజిత = అర్చింపఁబడు ఆంజనేయా, సర్వ = స్థావరజంగమాత్మక మగు సర్వప్రాణులకు, ఆధార = స్థాన మైన, ఉన్నత = అతిశయ మైన, విశ్వమూర్తి నగు నాకున్ = ప్రణవరూప ప్రపంచస్వరూపుఁడ నైన నాకు, ఆధారంబు = ఆధారచక్రము, ఇలయై = భూమియై, జలంబు = ఉదకము, మణిపూరాంభోజమై = మణిపూరచక్రమై, స్వాధిష్ఠానము = స్వాధిష్ఠానచక్రము, వహ్నియై = అగ్నియై, అనాహతంబు = అనాహతచక్రము, అనిలమై = వాయువై, సంచద్విశుద్ధంబు = ప్రకాశమాన మైన విశుద్ధచక్రము, ఖంబై = ఆకాశమై, ధీమానసరూపకప్రకృతి — ధీ = బుద్ధియొక్క, మానస = మనస్సుయొక్క, రూపక = స్వరూప మైనట్టి, ప్రకృతి = అవ్యక్తనామకప్రకృతి, ఆజ్ఞాజ్ఞాత మై = ఆజ్ఞాచక్రమై, ఒప్పున్ = ప్రకాశించును (ఆధారాదిషట్కమలములవివరణము ప్రథమాశ్వాసము చివరఁ జెప్పియున్నది)

తా॥ దేవతలచేత పూజింపఁబడు రో యాంజనేయా! సర్వప్రాణులకు స్థాన మైనట్టియు, అతిశయ మైన ప్రణవరూప ప్రపంచస్వరూపుఁ డైనట్టియు నాకు ఆధారచక్రము భూమిగాను, మణిపూరచక్రము యుదకముగాన, స్వాధిష్ఠానచక్రము అగ్నిగాను, అనాహతచక్రము వాయువుగాను ప్రకాశించెడు విశుద్ధచక్రము ఆకాశముగాను, బుద్ధి మనస్సు వీనియొక్కస్వరూపం బగు అవ్యక్త మగు పేరు గల ప్రకృతి ప్రకాశించునట్టి ఆజ్ఞాచక్రముగాను యున్న వని తాత్పర్యము

క॥ మేరు వగు బ్రహ్మదండియె, యారయఁగా దక్షిణోత్తరాయణములు సొం
పార నిడాపింగళ లో, సూరి పరమపదము వరసుషుమ్న కుమారా. ౪౮

టీక కుమారా = కుత్సితము లైన రాగద్వేషాద్యంతశ్శత్రువులను అక్షకుమారాదిబాహ్య శత్రువులను సంహరించినట్టి, ఓసూరి = శ్రుతియుక్త్యనుభవజ్ఞానము గల యాంజనేయా, బ్రహ్మదండియే = వెన్నెముకయే, మేరు వగున్ = మేరుపర్వత మగును, సొంపారన్ = గమ్యముగా, ఆరయఁగాన్ = విచారింపఁగా, ఇడాపింగళలు = ఇడాపింగళ లనునాడులు, దక్షిణోత్తరాయణములు = దక్షిణాయన ఉత్తరాయణములు - అనఁగా మేరువునకు వసవ్యములుగా సంచరించుచుండెడు సూర్యగతులే విరాట్పురుషుఁడ నైన నా బ్రహ్మదండికి నిరుప్రక్కల నుండెడి యిడాపింగళ లని భావము, వరసుషుమ్న = శ్రేష్ఠ మైన సుషుమ్నానాళము, పరమపదము = ముక్తిస్థానము, అగున్ = కాను

తా॥ కుత్సితము లైన రాగద్వేషాద్యంతశ్శత్రువులను జయించినట్టివాఁడవును, అక్షయకుమారాది బాహ్యశత్రువులను సంహరించినట్టివాఁడవును, శ్రుతియుంగుఁ జెప్పఁగడు అనుభవజ్ఞానము గలవాఁడవును

నగు రామాంజనేయా! నాకు మేరుపర్వతము వెన్నెముకగాను, ఇడాపింగళానాడులు దక్షిణాయన ఉత్తరాయణములుగాను, శ్రేష్ఠమైన సుషుమ్నానాళము ముక్తిస్థానముగాను యున్న దని తాత్పర్యము

సీ. అతలంబు పదములు వితలంబు గుల్ఫముల్, సుతలంబు జంఘికల్ సుజననివహ
నుత రసాతలము జానువులు దారుణమహాతల మూరువులు తలాతలము కటియు
నాగలోకము మహానాభ్యధోభాగంబు, భూర్భువస్స్వర్లోకములును నాభి
జఠరవక్షంబులు సరిమహర్లోకంబు, కంఠంబు సుజనలోకంబు ముఖము

తే. మఱి తపోలోక మరయ భ్రూమధ్యమంబు, సత్యలోకంబు విపులమస్తకముసుమ్ము
విశ్వరూపధరుండనై వెలయు నాకు, జలనిధిగభీర వీర కేసరికుమారా. ౭౮

టీక సుజననివహానుత = సత్పురుషులచే నుతింపఁబడునట్టి, జలనిధి = సముద్రమువలె, గభీర = గాంభీర్యము గలిగినట్టి, వీరకేసరికుమార = శూరుఁడైన కేసరి యను వానరునిపుత్త్రుఁడైన యాంజనేయా, విశ్వరూపధరుండనై = ప్రపంచరూపుఁడనై, వెలయునాకు = వెలుఁగుచున్న నాకు, అతలంబు = అతల లోకము, పదములు = అడుగులు, వితలంబు = వితలలోకము, గుల్ఫముల్ = చీలమండలు, సుతలంబు = సుతలలోకము, జంఘికలు = పిక్కలు, రసాతలము = రసాతలలోకము, జానువులు = మోఁకాళ్లు, దారుణ మహాతలము = భయంకరమైన మహాతలలోకము, ఊరువులు = తొడలు, తలాతలము = తలాతలలోకము, కటియున్ = పిఱుఁదులును, నాగలోకము = పాతాళలోకము, మహానాభ్యధోభాగంబు = విశాలమైన పొక్కిలి క్రిందిపార్శ్వము - అనఁగా పొత్తికడుపు, భూర్భువస్స్వర్లోకములును = భూలోక భువర్లోక స్వర్గలోకములును, నాభిజఠరవక్షంబులు — నాభి = పొక్కిలి, జఠర = కుక్షి, వక్షంబు = ఱొమ్మును - అనఁగా భూలోకము బొడ్డు, భువర్లోకము కుక్షి, స్వర్గలోకము ఱొమ్మని భావము, సరిమహర్లోకంబు = అవిషయమైన మహర్లోకము, కంఠంబు = కుత్తుక, సుజనలోకంబు = సుజనలోకము, ముఖము = ఆననము, మఱి = పిమ్మటయును, అరయన్ = విచారింపఁగా, తపోలోకము = తపోలోకంబు, భ్రూమధ్యమంబు = కనుబొమలనడుమ, సత్యలోకంబు = బ్రహ్మలోకము, విపులమస్తకముసుమ్ము = గొప్పదైన శిరస్సుసుమా - అనఁగా చతుర్దశభువనస్వరూపుఁడ నని భావము

తా సత్పురుషులచేత స్తోత్రము చేయఁబడువాఁడవును, సముద్రమువలె గాంభీర్యము కలిగినవాఁడవును, శూరుఁడైన కేసరునియొక్క కుమారుఁడవును నైన రామాంజనేయా! ప్రపంచమే రూపముగాఁ గలిగినట్టి నాకు అతలలోకము పాదములుగాను, వితలలోకము చీలమండలుగాను, సుతలలోకము పిక్కలుగాను, రసాతలలోకము మోఁకాళ్లుగాను, భయంకరమగు మహాతలలోకము తొడలుగాను, తలాతలలోకము పిఱుఁదులుగాను, పాతాళలోకము విశాలమగు పొత్తికడుపుగాను, భూలోక భువర్లోక స్వర్గలోకములు క్రమముగా బొడ్డు కడుపు ఱొమ్ములుగాను, సరియైనదగు మహర్లోకము కంఠముగాను, సుజనలోకము ముఖముగాను, తపోలోకము కనుబొమలనడిమిప్రదేశముగాను బ్రహ్మలోకము గొప్పదైన శిరస్సుగాను యుండుటవలన సమస్తలోకములు రూపముగాఁ గలవాఁడనై ప్రకాశించుచున్నా నని తాం

వ ఇట్లు సర్వాధిష్ఠానంబు సర్వపరిపూర్ణంబు నామ రూప గుణ ధర్మ కర్మ వికార రహితాఖండ సచ్చిదానందపరబ్రహ్మంబు నైన నేను సమష్టికారణ సూక్ష్మస్థూల శరీరోపాధివిశిష్టత్వంబువలన నవ్యాకృతుం డన హిరణ్యగర్భుం డన విరాట్పురుషుం డన సకలజీవోపాస్యుండ నై ప్రకాశింపుదు మఱియు వ్యష్టికారణ సూక్ష్మస్థూల

దేహోపాధి తాదాత్మ్యాభిమానంబువలన బ్రాజ్ఞుం డనఁ దైజసుం డన విశ్వుం డన సుషుప్తిస్వప్నజాగ్రదవస్థల ననుభవించుచు నజ్ఞానవశుండనై జీవుం డన నీశ్వరోపాసకుండనై ప్రవర్తించినచందంబునం దోఁచుదు నీ జీవేశ్వరతత్త్వంబు లవిద్యాకల్పితంబు లయ్యవిద్య శశవిషాణవంధ్యాపుత్త్రగగనారవిందంబులభంగి నాయందు నన్నంటింగిన నభావం బగు నట్లు గావున నింక జీవేశ్వరైక్యం బుపదేశించెద సావధానచిత్తుండవై యాకర్ణింపు మని యాత్మారాముం డంజనేయున కిట్లనియె.

టీక. ఇట్లు = ఇవ్విధముగా, సర్వాధిష్ఠానంబున — సర్వ = సకలలోకములకు, అధిష్ఠానంబును = ఆశ్రయమైనదియు, సర్వపరిపూర్ణంబును = అంతట నిండియున్నదియు, నామ = కేశవనారాయణరామాది నామములును, రూప = మత్స్యకూర్మవరాహాదిరూపములును, గుణ = శాంతిశమదమాద్యనంతకళ్యాణ గుణములును, ధర్మ = వర్ణాశ్రమోచిత వేదోక్తధర్మములును, కర్మ = గర్భాదానాది షోడశకర్మములును, వికార = జననజరామరణాది వికారములును, రహిత = లేని, అఖండ = సంపూర్ణమై, సచ్చిదానంద = సత్యజ్ఞానానందస్వరూపమైన, పరబ్రహ్మంబును = పరమాత్మస్వరూపిని, ఐన నేను = ఐనట్టి నేను, సమష్టి = సకలచేతనసంఘముయొక్క, కారణ = కారణశరీరము, సూక్ష్మ = లింగశరీరము, స్థూలశరీర = స్థూలశరీరము, (వీనితోడ) ఉపాధి=జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడు మూఁడవస్థలతోడ, విశిష్టత్వంబుగలన్ = అభిమానముతోఁ గూడియుండుటవలన, అవ్యాకృతుండనన్ = అవ్యాకృతుఁ డని, హిరణ్యగర్భుఁ డనన్ = హిరణ్యగర్భుఁ డని, విరాట్పురుషుం డనన్ = విరాట్పురుషుఁ డని — అనఁగా సమష్టికారణశరీరమున కవ్యాకృతుఁడు, సూక్ష్మశరీరమునకు హిరణ్యగర్భుఁడు, స్థూలశరీరమునకు విరాట్పురుషుఁడు అభిమానులని భావము సకలజీవోపాస్యుఁడనై = సమస్తప్రాణులచేత భజింపఁదగినవాఁడనై, ప్రకాశింపుచున్ = వెలుఁగుచును, మఱియున్ = పిమ్మట, వ్యష్టి = ఒకప్రాణియొక్క, కారణ = కారణశరీరమును, సూక్ష్మ = సూక్ష్మశరీరమును, స్థూలదేహ = స్థూలశరీరమును, ఉపాధి = వీనిసంబంధము లైన జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడు అవస్థలును, తాదాత్మ్యాభిమానంబువలనన్ = నేనే యనెడు తాదాత్మ్యాభిమానమువలన, ప్రాజ్ఞుం డనన్ = ప్రాజ్ఞుఁ డని, తైజసుండనన్ = తైజసుఁ డని, విశ్వుం డనన్ = విశ్వుఁ డని, సుషుప్తిస్వప్నజాగ్రదవస్థలన్ — సుషుప్తి = నిద్రను, స్వప్న = కలను, జాగ్రదవస్థలన్ = మెలఁకువను, అనుభవించుచున్ = పొందుచు, ఇచ్చట క్రమాలంకారము, అజ్ఞానవశుండనై = ప్రకృతికి స్వాధీనుఁడనై, జీవుం డనన్ = జీవుం డను నామముచేత, ఈశ్వరోపాసకుండనై = ముందుఁ జెప్పిన సమష్ట్యుపాధ్యభిమాని యగు నీశ్వరు నారాధించు చున్నవాఁడనై, ప్రవర్తించినచందంబునన్ = సంచరించినవానివలె, తోఁచుదున్ = కనఁబడుదును — అనఁగా స్వేచ్ఛతరముగ ప్రకృతిని గల్పించి ఆ ప్రకృత్యుపాధివలన యీశ్వరజీవనామములు గలిగి యభావముచేత నీశ్వరోపాసన చేయుచున్నవానివలెఁ దోఁచుదును గాని నిజముగ వ్యావృత్తేశ్వరజీవులు నుపాస్యోపాసకత్వములు వ్యష్టిసమష్ట్యుపాధ్యవస్థలు తత్తదభిమాననామములు నాకు లేవనుట, ఈ జీవేశ్వరతత్త్వంబులు = ఈ జీవేశ్వరస్వరూపములు, అవిద్యాకల్పితంబులు = అజ్ఞానముచేత నారోపితమైనవి, అయ్యవిద్య = ఆ ప్రకృతి, శశ = కుందేటియొక్క, విషాణ = కొమ్మువలె, వంధ్యాపుత్త్ర = గొడ్డురాలిబిడ్డవలె, గగనారవిందంబుల భంగిన్ = ఆకాశపద్మమువలె, నాయందున్ = వ్యష్టిసమష్ట్యుపాధిరహితపరబ్రహ్మము నైన నాయందు, నన్నంటింగినన్ = తన్నుఁ దెలుసుకొనినచో నేని, అభావం బగున్ = ప్రకృతిశూన్య మగును, అట్లు గావునన్ = అట్లు శూన్య మగుటవలన, ఇంకన్ = ఇంకమీఁద, జీవేశ్వరైక్యంబు — జీవ = కించిజ్జ్ఞత్వాది గుణములు గల జీవునియొక్క, ఈశ్వర = సర్వజ్ఞత్వాదిగుణములు గల యీశ్వరునియొక్క, ఐక్యంబు =

కూడికను, ఉపదేశించెదన్ = బోధించెదను, సావధానచిత్తుండవై = స్థిరబుద్ధి గలవాఁడవై, ఆకర్ణింపుమని = వినుమని, ఆత్మారాముఁడు = తనయందే విహరించుచున్న శ్రీరాముఁడు, ఆంజనేయునకున్ = హనుమంతునకు, ఇట్లనియెన్ = వక్ష్యమాణప్రకారముగాఁ జెప్పఁబూనెను

తా. సమస్తలోకములకు ఆశ్రయమైనట్టిదియును, అంతటను వ్యాపించి యుండునదియును, శ్రీమన్నారాయణాదినామములును మత్స్యము కూర్మము వరాహము మొదలుగాఁగల రూపములు లేనట్టిదియును, శమదమాద్యనంతగుణములు లేనట్టిదియును, వర్ణాశ్రమములకుఁ దగినట్టి వేదోక్తధర్మములు లేనట్టిదియును, గర్భాధాన షోడశకర్మల ననుష్ఠింపనట్టిదియును, ముసలితనము చావు మొదలగువికారములు లేనట్టిదియును నగు బ్రహ్మమైన నేను సకలచేతనసమూహములయొక్క జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడు మూఁడుఅవస్థలు గల కారణశరీరము, సూక్ష్మశరీరము లనెడు మూఁడుశరీరములతోఁ గూడియుండుటవలన అవ్యాకృతుఁ డనియు, హిరణ్యగర్భుఁ డనియు, విరాట్పురుషుఁ డనియు, సమస్తజీవులచేత సేవింపఁబడినవాఁడనై ప్రకాశించుచుండును, మఱియు ఒక్కప్రాణియొక్క శరీరత్రయము దీనికి సంబంధించిన మూఁడుఅవస్థలును నేనే యనెడు తాదాత్మ్యాభిమానమువలన ప్రాజ్ఞుఁ డనియు తైజసుఁ డనియు విశ్వుఁ డనియు సుషుప్తిస్వప్న జాగ్రదవస్థలను పొందుచు అజ్ఞానమునకు లోఁబడినవాఁడనై జీవుఁ డను పేరుచేత సమస్తప్రాణులయొక్క శరీరములతోను వాటితోఁ గూడిన మూఁడుఅవస్థలతోను గూడియుండెడి యీశ్వరుని ఆరాధించువాఁడనై ప్రవర్తించువానివలె కనఁబడుదును, ఈ జీవేశ్వరస్వరూపములు అజ్ఞానముచేత కలిగెను గాని, అట్టి యవిద్య సమష్టివ్యష్ట్యుపాధులు లేని పరబ్రహ్మమైన నాయందు నస్తిత్వముగ నేని యుండదు, కొమ్ములు గలిగిన గుఱ్ఱముబిడ్డవలెను, ఆకాశపద్మమువలెను శూన్యము గనుక యిఁక మీఁదట కించిజ్జ్ఞత్వాదిగుణములు గల జీవునియొక్కయు, సర్వజ్ఞత్వాదిగుణములుగల యీశ్వరునియొక్కయు కూడికను బోధించెదను వినుమని ఆంజనేయునకుఁ జెప్పుచున్నాఁ డని తాత్పర్యము

## జీ వే శ్వ రై క్య వి చా ర ఘ ట్ట ము.

క. కలశాంబుదములఁ దద్గత, జలములఁ గడఁద్రోయ నాకసము ప్రతిబింబా
బులు లేమి నొకటయై యిమ్ముల నుండు నఖండమై యమూర్తం బగుటన్. ౫౧

టీక కలశాంబుగములన్ — కలశ = ఘటమును, అంబుదములన్ = మేఘమును, తద్గతజలములన్ = ఆ ఘటమేఘనిష్ఠము లయిన జలములను, కడఁద్రోయన్ = త్యజింపఁగాను, ప్రతిబింబములు లేమిన్ = ఆ ఘటమేఘ నిష్ఠము లయిన జలములయందు ప్రతిఫలించిన యాకాశప్రతిబింబములు లేనందున, ఆకసము = గగనము, అమూర్తం బగుటన్ = నిరాకార మయినందున, అఖండమై = భాగింపరానిదై, ఒకటియై = ఏకమై, ఇమ్ములనుండున్ = అన్నిచోట్ల నిండియుండును.

తా. కడవయందుండు జలమును మేఘమునం దుండు యుదకమును త్యజింపఁగా ఆ కడవయందును మేఘమందును యుండు నీళ్లయందు ప్రతిఫలించిన ఆకాశప్రతిబింబములు లేనందున ఆకాశము ఆకారము లేనిదియును, భాగింపరానిదియును, ఏకమైనదియును నై అన్నిచోట్ల నిండియుండు నని తాత్పర్యము.

క. ఆవిధమునఁ దనువులమాయావిద్యలఁ ద్రోలఁగఁద్రోయ నంతటిలోనన్
జీవేశ్వరులు వెలుంగమిఁ, గేవలతత్త్వంబు వెలుఁగుఁ గీశాధీశా. ౫౨

టీక కీశాధీశా = వానరశ్రేష్ఠా, ఆవిధమునన్ = పైనఁ జెప్పినరీతిన, తనువులన్ = వ్యష్టిసమష్ట్యాత్మక జీవేశ్వర స్థూలసూక్ష్మకారణశరీరములను, మాయావిద్యలన్ = కారణకార్యోపాధులు గల మాయ

యను అవిద్యను, తొలఁగఁద్రోచుక = పరిత్యజింపఁగాను, అంతటిలోనక = పరిత్యజించినమాత్రముననే, జీవేశ్వరులు = జీవుఁడును యీశ్వరుఁడును, వెలుఁగమిక = ప్రకాశింపకపోవుటవలన, కేవలతత్త్వంబు— కేవల = ముఖ్యమైన, తత్త్వంబు = అఖండాద్వితీయబ్రహ్మచైతన్యము, వెలుంగుక = తేజరిల్లును.

తా. ఓయి వానరశ్రేష్ఠా! పైన జెప్పినతీరుననే వ్యష్టిసమష్ట్యాత్మక జీవేశ్వరుల స్థూలసూక్ష్మకారణ శరీరములను కారణకార్యోపాధు లగు మాయ యను యవిద్యను పరిత్యజింపఁగానే జీవుఁడును యీశ్వరుఁడును ప్రకాశింపకపోవుటచేత బ్రహ్మచైతన్యము ముఖ్యమైనదియును భాగింపరానిదియును తన కంటె యితరము లేనిదియును నై ప్రకాశించు చున్నదని తాత్పర్యము

వ. అది యెట్లం టేని. ౫౩

టీక. అది యెట్లంటేని = ఆ వెలుంగుట యెట్లనఁగా

క. కలశజలప్రతిబింబంబులకు విలక్షణ మసంగము నమూర్తంబై
యలరు ఘటాకాశము తజ్జ్ఞులకు మహాకాశ మదియెసుమి వివరింపన. ౫౪

టీక కలశజలప్రతిబింబంబులక— కలశ = ఘటమునకు, జల = ఆ ఘటనిష్ఠమయిన జలమునకు, ప్రతిబింబంబులకుక = ఆ జలమందుఁ దోఁచిన యాకాశప్రతిబింబమునకును, విలక్షణము = వేఱైనదియు, అసంగము = వస్త్వంతరసంబంధరహితమైనదియు, అమూర్తంబై = నిరాకారమైనదియునై, ఘటాకాశము = కలశనిష్ఠ మయిన గగనము, అలరుక = ప్రకాశించును, వివరింపక = గాలోచింపఁగా, తజ్జ్ఞులకుక = ఆత్మానాత్మవివేకము గల పండితులకు, అదియె=ఆ ఘటాకాశమే, మహాకాశముసుమి=అఖండ మయిన గగనము సుమా

తా. కడవకును కడవయందుండు జలమునకును ఆ జలమునందు కనఁబడు ఆకాశప్రతిబింబమునకును వేఱైనదియును, ఇతరవస్తువులతో సంబంధము లేనిదియును, ఆకారము లేనిదియును నై కడవయందలి యాకాశము ప్రకాశించును, ఆలోచింపఁగా ఆత్మానాత్మవివేకము గల పండితులకు ఆ ఘటాకాశమే అఖండాకాశ మని తాత్పర్యము

తే. క్రమముతో స్థూలసూక్ష్మకారణములకును, సుకరజాగరణస్వప్నసుప్తులకును
ప్రభువు లగు విశ్వతైజసప్రాజ్ఞులకు విలక్షణుం డగు నాత్ముండు సాక్షి యగుచు.

టీక క్రమముతోక = వరుసగా, స్థూలసూక్ష్మకారణములక = స్థూలసూక్ష్మకారణదేహముల కును, సుకర = రమ్యములైన, జాగరణ = జాగ్రదవస్థలకును, స్వప్న = స్వప్నావస్థకును, సుప్తులకు= నిద్రావస్థకు, ప్రభువు లగు విశ్వతైజసప్రాజ్ఞులకుక = ఆ త్రయావస్థాభిమానులైన విశ్వతైజసప్రాజ్ఞనామక జీవులకును, ఆత్ముండు = పరమాత్ముఁడు, సాక్షి యగుచుక =ద్రష్టయై, విలక్షణుం డగుక = వేఱై ప్రకాశించును.

తా. వరుసగా స్థూలసూక్ష్మకారణదేహములకును జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడు అవస్థలకును అభి మానులయిన విశ్వుఁడు తైజసుఁడు ప్రాజ్ఞుఁడు అను వీరికంటె పరమాత్ముఁడు వేఱై సాక్షియై ప్రకా శించు చున్నాఁడని తాత్పర్యము.

తే అతఁడు కూటస్థుఁడనఁ బ్రత్యగాత్ముఁ డనఁగ, నక్షరుండనఁ బుణ్యుం డసంగసాక్షి
యనఁగవిలసిల్లుఁ దాఁబరమాత్ముఁడగుచు, బ్రకృతిపురుషులనంటక పరమపురుష.

టీక పరమపురుష = పురుషశ్రేష్ఠుఁడ వైన యాంజనేయా, అతఁడు = ఆ పరమాత్ముఁడు, కూటస్థుఁ డనఁగ = కూట మనఁగా మహాభూతపంచకము, జ్ఞానేంద్రియ కర్మేంద్రియపంచకములు, మనోహంకారబుద్ధిప్రకృతులు, శబ్దాదిపంచకము, ఇచ్ఛాద్వేషసుఖదుఃఖధైర్యాదికముఁ జేరి కూటం మని క్షేత్ర మని పేరు, అట్టి కూటమం దుండువాఁ డని, ప్రత్యగాత్ముఁ డనఁగ = పంచవింశతితత్త్వస్వరూపుఁ డని, అక్షరుం డనఁగ = నశింపనివాఁ డని, పురుషుం డనంగ = సర్వశరీరములయం దుండువాఁ డని, సాక్షి యనఁగ = ద్రష్ట యని - అనగా నీనామములచేత, తాఁ = తాను, ప్రకృతిపురుషులఁ = మాయాజీవులను, అంటక = స్పృశింపక, పరమాత్ముఁ డగుచుఁ = సచ్చిదానందచైతన్యమై, విలసిల్లుఁ = తేజరిల్లును

తా. పురుషులలో శ్రేష్ఠుఁడ వగు యో యాంజనేయా, ఆ పరమాత్ముఁడు కూటమం దుండువాఁడు, (కూట మనఁగా పంచమహాభూతములు, జ్ఞానేంద్రియకర్మేంద్రియములు, మనోహంకారబుద్ధిప్రకృతులు, శబ్దాదిపంచకము, ఇచ్ఛాద్వేషసుఖదుఃఖాదికము అనువివి యన్నియుఁ జేరి కూటం మనఁబడును) పంచవింశతితత్త్వస్వరూపుఁడు, నశింపనివాఁడు, ద్రష్ట అను నీపేళ్లచేత పిలువఁబడువాఁడై మాయాజీవులను అంటక సచ్చిదానందచైతన్యమై ప్రకాశించు నని తాత్పర్యము

క. జలదజలప్రతిబింబంబులకు విలక్షణ మసంగమము నమూర్తం బై
యలరు మహాకాశము కేవల మై నల మై కవిప్రవరభావజ్ఞా. ౫౭

టీక కవిప్రవరభావజ్ఞా—కవిప్రవర = ఆత్మానాత్మవివేకజ్ఞు లైన పండితోత్తములయొక్క, భావజ్ఞా = అభిప్రాయ మెఱిఁగిన యాంజనేయా, జలదజలప్రతిబింబంబులకుఁ — జలద = మేఘమునకు, జల = ఆమేఘస్థిత మైన జలమునకు, ప్రతిబింబంబులకుఁ = బ్రహ్మప్రతిచ్ఛాయ యైన యీశ్వరునకు, విలక్షణము = వ్యతిరిక్త మైనదియును, అసంగమును = లేని సంటునిదియును, అమూర్తంబై = నిరాకార మైనదియును, కేవలమై = ఏకస్వరూప మైనదియును, నలమై = సర్వవ్యాపక మైనదియును నై, మహాకాశము = అఖండ మయిన గగనము, అలరుఁ = ప్రకాశించును

తా. ఆత్మానాత్మవివేకము గల పండితులయొక్క అభిప్రాయ మెఱిఁగిన యో యాంజనేయా! మేఘమునకును మేఘమం దుండెడి జలమునకును బ్రహ్మప్రతిచ్ఛాయ యైన యీశ్వరునకును వ్యతిరిక్త మైనదియును, లేని సంటునిదియును, ఆకారము లేనిదియును, ఏకస్వరూప మైనదియును, సర్వవ్యాపక మైనదియును నై మహాకాశము ప్రకాశించు నని తాత్పర్యము

క. జీవసమష్టితనుత్రిత, యావస్థాత్రితయములకు నఖిలాత్మకమా
యావిప్రాణవిరాట్పురు, షావలికి సాక్షి యై పరాత్ముఁ డొప్పున్. ౫౮

టీక. జీవసమష్టి = ఈశ్వరునియొక్క, తనుత్రితయ = స్థూలసూక్ష్మకారణ దేహములకును, అవస్థాత్రితయములకుఁ = జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలకును, అఖిలాత్మక = సకలజీవాత్మకుఁ డైన, మాయావి = కారణదేహాభిమాని యైన మాయావియొక్క, ప్రాణ = సూక్ష్మదేహాభిమాని యైన ప్రాణునియొక్క, విరాట్పురుష = స్థూలదేహాభిమాని యైన విరాట్పురుషునియొక్క, ఆవలికిఁ = పంక్తికిని- అనఁగా వ్యష్టిస్థూలదేహాభిమాను లైన అనేక విశ్వులు గూడి విరాట్టువు, వ్యష్టిసూక్ష్మదేహాభిమాను లైన యనేక తైజసులు గూడి హిరణ్యగర్భుఁడు, వ్యష్టి కారణదేహాభిమాను లగు ప్రాజ్ఞులు పెక్కండ్రు గూడి అవ్యాకృతుఁడు, గాన (వీరికి పరమాత్ముండు పరబ్రహ్మము) సాక్షియై = ద్రష్టయై, ఒప్పుఁ = వెలుఁగును

తా. ఈశ్వరునియొక్క స్థూలసూక్ష్మకారణ దేహములకును వ్యష్టిస్థూలదేహాభిమాను లయిన యనేక విశ్వులు గూడి విరాట్టువు, వ్యష్టిసూక్ష్మదేహాభిమాను లయిన యనేక తైజసులు గూడి హిరణ్యగర్భుఁడు,

వ్యష్టికారణదేహాభిమాను లగు ప్రాజ్ఞులు అనేకులు గూడి అవ్యాకృతుఁడు గాన వీనికిని పరబ్రహ్మము సాక్షి యై ప్రకాశించు నని తాత్పర్యము.

తే. అతఁడు పరమాత్ముఁ డనఁగ బ్రహ్మం బనంగ
నలఘుపరిపూర్ణచైతన్య మనఁగ నొప్పు
నిర్వికల్పుం డసంగుండు నిర్వికారుఁ
డద్వితీయుఁ డనంతుఁ డై యాంజనేయ. ౫౯

టీక. ఆంజనేయ = హనుమంతా, అతఁడు = ఆ సర్వసాక్షి, నిర్వికల్పుండు = సంకల్పవికల్పములు లేనివాఁడు, అసంగుండు = వస్త్వంతరసంబంధము లేనివాఁడు, నిర్వికారుఁడు = షడ్వికారశూన్యుఁడు, అద్వితీయుఁడు = స్వాతిరిక్తశూన్యుఁడు, అనంతుఁడై = దేశకాలవస్తుపరిచ్ఛేదరహితుఁడై, పరమాత్ముం డనఁగన్ = కేవలాత్మ యనఁగను, బ్రహ్మం బనఁగన్ = పరబ్రహ్మ మనఁగను, అలఘు=మిక్కుటమయిన పరిపూర్ణ = అంతట నిండియుండెడు, చైతన్య మనఁగన్ = శుద్ధచిత్స్వరూపుఁ డనఁగాను, ఒప్పున్ = వెలుఁగును.

తా. ఆంజనేయా! ఆ సర్వసాక్షి యగు పరమాత్ముఁడు సంకల్పవికల్పములు లేనివాఁడును, ఇతర వస్తువులతో సంబంధము లేనివాఁడును, షడ్వికారములు లేనివాఁడును, తనకంటె నతిరిక్తము లేనివాఁడును, దేశము కాలము వస్తువు వీటిచేత భాగింపఁదగనివాఁడును, పరమాత్మయును, పరబ్రహ్మమును, అంతటను నిండియుండెడు చిత్స్వరూపుఁడును నై ప్రకాశించుచున్నాఁ డని తాత్పర్యము

వ. అట్లు గావున. ౬౦

టీక. అట్లు గావున = ఈశ్వరదేహత్రయావస్థాత్రయాభిమానత్రయవిలక్షణుఁడు గనుక.

సీ. కలశమేఘములఁ దోఁద్గతజలంబులఁ దదీయప్రతిబింబద్వయంబు నొకటఁ
గడకుఁ ద్రోచిన ఖలోకాశమహాకాశములకు నేకత్వంబు గనిగినట్లు
వ్యష్టిసమష్టిదేహములను ధీమాయలను జీవపరమేశులను విచార
దృష్టిచేఁ గని నిషేధించినయెడఁ బ్రత్యగాత్మున కప్పరమాత్మునకును
తే. సమరసైక్యంబు ఘటియించు సత్య మనుచు
నిఖిలవేదాంతశాస్త్రము లెల్ల ఘోషించు
గురువు లిట్లుపదేశింపుదురు బుధులకు
ననఘ యిదియె మదీయదివ్యాశయంబు. ౬౧

టీక. అనఘ = ఆంజనేయా, కలశమేఘజలములన్ — కలశ=ఘటమును, మేఘములన్ = మబ్బును, తద్గతజలంబులన్ = ఆకలశమేఘములయందలి జలమును, తదీయ = ఆ జలములయందు, ప్రతిబింబ = ప్రతిఫలితము లయిన యాకాశములయొక్క, ద్వయంబున్ = జంటను, ఒకటన్ = ఒక్కసారే, కడకు ద్రోచినన్ = త్యజింపఁగానే, ఘటాకాశ=ఘటనిష్ఠమైన గగనమునకు, మహాకాశములకున్ = మేఘనిష్ఠమైన మహాకాశమునకును, ఏకత్వంబుగల్గినట్లు=ఐక్యము గలిగినతీరున, వ్యష్టిసమష్టిదేహములన్ — వ్యష్టి=జీవునియొక్క, సమష్టి = ఈశ్వరునియొక్క, దేహములన్ = స్థూలసూక్ష్మకారణశరీరములను, ధీమాయలన్ = అవిద్య యను మాయను, జీవపరమేశులన్ = జీవుని ఈశ్వరుని, విచారదృష్టిచేన్ = తత్త్వ

మస్యాది మహావాక్యవిచారజ్ఞానముచేత, కని = చూచి, నిషేధించినయెడన్ = వర్జించినప్పుడు, ప్రత్యగాత్మునకున్ = జీవనిష్ఠ మయిన కూటస్థునకును, నప్పరమాత్మునకున్ = ఈశ్వరనిష్ఠ మైన పరబ్రహ్మమునకును, సమరసైక్యంబు=సమాన మగు నైకమత్యము, సుటియించున్ = కలుగును, సత్యమనుచున్ = నిక్కమని, నిఖిలవేదాంతశాస్త్రములు = సకలోపనిషదర్థప్రతిపాదకశాస్త్రములు, నిశ్చయించున్ = నిర్ణయించును, బుధులరున్ = పండితులరు, గురువులు = బ్రహ్మజ్ఞానోపదేష్టలు, ఇట్లు=ఈ నిశ్చయించినట్లు, ఉపదేశింపుదురు= బోధింతురు, మదీయదివ్యాశయంబు—మదీయ= నాయొక్క, దివ్య=శ్రేష్ఠ మైన, ఆశయంబు= అభిప్రాయమును, ఇదియే= ఇదేసుమా – అనఁగా నింగురు సందేహము లే దనుట

తా॥ ఆంజనేయా! కడవయందలి జలమునందు ప్రతిఫలించు యాకాశమును మేఘమందలి జలమునందు ప్రతిఫలించు యాకాశమును ఒక్కతేపనే త్యజించినయెడల ఘటమేఘములయందలి యాకాశమునకు నైక్యత్వము గలిగినట్లు జీవేశ్వరులను జీవేశ్వరులయొక్క స్థూలసూక్ష్మకారణశరీరములను, అవిద్యామాయలను తత్త్వమసీత్యాది మహావాక్యవిచారజ్ఞానముచేత చూచి వర్జించినపుడు జీవనిష్ఠ మయిన కూటస్థునకును ఈశ్వరనిష్ఠ మయిన పరబ్రహ్మమునకును సమాన మగు నైకమత్యము కలుగును. ఇట్లు ఐక్యము గలుగుట నిశ్చయ మని సమస్తవేదాంతశాస్త్రములు నిర్ణయించును, ఆ శాస్త్రములు నిర్ణయించు విధముననే నాయొక్క దివ్య మైన అభిప్రాయమును బోధింతు రని తాత్పర్యము

వ. కావున. ౬౨

టీక కావున = కాఁబట్టి

సీ. పరఁగ శరావకుంభక నామరూపముల్, ద్రోచి మన్నొకటిగాఁ జూచుపగిది
ఘటతటాకముల నొక్కట నిషేధించి తద్గతజల మొకటిగాఁ గాంచుకరణి
దీపప్రదీపవర్తియుగ మ్మడంచి తత్తేజంబు నొకటిగాఁ దెలియుభాతిఁ
గలశగృహంబులఁ గడనుంచి వానిలోఁ, గల మింటి నొకటిగాఁ దలఁచురీతిఁ
తే. బాధ్యజీవేశ్వరత్రయోపాధియుగముఁ, బ్రాకటవివేకదృష్టి నిరాకరించి
తనరు పరిపూర్ణశుద్ధచైతన్య మొకటిగా విలోకింపవలయు మేధావి యనఘ. ౬౩

టీక అనఘ = ఆంజనేయా, పరఁగన్ = ఒప్పునట్లు, శరావ = మూఁకుడు, కుంభక = కుండ యనెడు, నామ = నామధేయములను, రూపమును = వానియాకృతులను, ద్రోచి = త్యజించి, మన్ను= మృత్తిక, ఒకటిగాన్ = ఏకముగా, చూచుపగిదిన్ = అవలోకించినట్లును, ఘటతటాకములన్ — ఘట= కుండను, తటాకములన్ = చెఱువును, ఒక్కటనిషేధించి = ఏక కాలమందే విసర్జించి, తద్గతజలములన్= ఆ ఘటతటాకములయందలి యుదకమును, ఒకటిగాన్ = అభిన్నముగా, కాంచుకరణిన్ = వీక్షించు నట్లును, దీపప్రదీపవర్తియుగము—దీప=దివియయొక్క, ప్రదీప = దీవిటియొక్క, వర్తియుగమున్ = రెండు వత్తులను, అడంచి = వదలి, తత్తేజంబున్— తత్ = ఆదీపప్రదీపములయందలి, తేజంబున్ = వెలుఁగును, ఒకటిగాఁ దెలియుభాతిన్ = ఒక్కటే యని తెలిసినట్లును, కలశగృహంబులన్ = ఘటమును మఠమును, కడనుంచి = విడిచి, వానిలోఁగలమింటిన్= ఆ ఘటమఠములయందలి గగనమును, ఒకటి గాఁదలఁచురీతిన్= ఒక్కటిగా నెంచినట్లును, బాధ్య = అవిద్యామాయోపాధులు గల, జీవ = క్షేత్రజ్ఞునియొక్క, ఈశ్వర= ఈశ్వరునియొక్క, త్రయ = మూఁడువిధము లైన, ఉపాధి = స్థూలసూక్ష్మకారణోపాధులయొక్క, యుగ్మమున్ = జంటను, ప్రాకటవివేకదృష్టిన్—ప్రాకట = ప్రసిద్ధ మైన, వివేకదృష్టిన్ = జ్ఞాననేత్రము

చేత, నిరాకరించి = తిరస్కరించి, తనరు = మనోహర మైన, పరిపూర్ణశుద్ధచైతన్యము = అఖండ నిర్మలపరమాత్మరూపమును, మేధావి = పండితుఁడు, ఒకటిగాఁ = అభిన్నముగా, విలోకింపవలయుఁ = చూడవలెను

తా. ఆంజనేయా! ఆత్మానాత్మవివేకి యగువాఁడు మూఁకుడు కుండ యను నామధేయములను వానియాకృతులను వదలి మన్నును ఒకటిగాఁ జూచునట్లును, కుండను చెఱువును ఏక కాలమందే విసర్జించి ఆ ఘటతటాకములయందలి యుదకమును ఒకటిగాఁ జూచునట్లును, దివము యొక్కయు దీవిటి యొక్కయు రెండువత్తులను వదలి ఆదీపదీవిటీలయొక్క తేజస్సును ఒకటిగాఁ దలఁచుచున్నట్లును, ఘటమును మఠమును విడిచి ఆ ఘటమఠములయందలి ఆకాశమును ఒకటిగా నెంచినట్లును అవిద్యామాయోపాధులు గల జీవేశ్వరులయొక్క స్థూలసూక్ష్మకారణోపాధులజంటను ప్రసిద్ధ మయిన జ్ఞాననేత్రముచేత తిరస్కరించి మనోహర మైన పరిపూర్ణశుద్ధచైతన్యమును అఖండనిత్యనిర్మలపరమాత్మరూపమును ఒకటిగాఁ జూచు చుండవలె నని తాత్పర్యము

## తత్త్వమసి యను సామవేదమహావాక్యార్థనిర్ణయము.

వ. ఇట్లు వ్యష్టిశరీరావస్థాత్రితయంబు విశ్వతైజసప్రాజ్ఞనామకంబు లైన జీవచైతన్యంబుఁ గించిద్‌జ్ఞత్వకర్తృత్వభోక్తృత్వాదిగుణంబులుం గూడి త్వంపదవాచ్యార్థంబు దేహత్రయవిలక్షణంబు నవస్థాత్రయసాక్షియుఁ బంచకోశవ్యతిరిక్తంబు సచ్చిదానందస్వరూపంబు నైన కూటస్థచైతన్యమాత్రంబు త్వంపదలక్ష్యార్థంబు సమష్టిశరీరావస్థాత్రయాత్మిక యైన మాయయు వైశ్వానరహిరణ్యగర్భావ్యాకృతనామకం బైన మాయాప్రతిబింబేశ్వరచైతన్యంబు సర్వజ్ఞత్వసర్వేశ్వరత్వసర్వాంతర్యామిత్వాది గుణంబులుంగూడి తత్పదవాచ్యార్థంబు దేశకృత కాలకృత వస్తుకృత పరిచ్ఛేదశూన్యంబు స్వజాతీయ విజాతీయ స్వగతభేదరహితంబు సత్యజ్ఞానానందస్వరూపంబు నైన పరిపూర్ణాద్వితీయబ్రహ్మచైతన్యమాత్రంబు తత్పదలక్ష్యార్థం బగు విరుద్ధధర్మకంబు లయిన వాచ్యార్థంబులకు లక్ష్యార్థంబుల కైక్యంబు సంభవింపదు గావున నొక్కదేశంబున నొక్కకాలంబున నొక్కరూపంబున నున్న పురుషుని వేఱొక్క దేశంబున మఱియొక్క కాలంబున నొండొకరూపంబుచే నుండఁగనుంగొని తద్దేశతత్కాలతదవస్థాదిభేదంబుల నేతద్దేశైతత్కాలైతదవస్థాదిభేదంబుల గణించి లక్షింపక లక్ష్యభూతుం డైన యాతం డితం డని యొక్కనిఁగా నెఱింగిన తెఱంగున జహదజహల్లక్షణచేత నుపాధికంబు లైన యుభయవాచ్యార్థంబుల నిషేధించి ద్వివిధలక్ష్యార్థచైతన్యంబుల కైక్యంబు దెలియుట యిది యసిపదార్థం బిదియె జీవేశ్వరైక్యజ్ఞానం బిదియె మహావాక్యార్థం బింక జీవబ్రహ్మైక్యం బుపదేశించెద నాకర్ణింపు మని మఱియు నిట్లనియె. ౭౮

టీక. ఇట్లు = ఈతీరున, వ్యష్టిశరీరావస్థాత్రితయంబును—వ్యష్టి = జీవునియొక్క, శరీర = స్థూలసూక్ష్మకారణదేహములతోఁ గూడిన, అవస్థాత్రితయంబును = జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడు మూఁడవస్థలను,

విశ్వతైజసప్రాజ్ఞనామకంబు లైన = విశ్వుఁడు తైజసుఁడు ప్రాజ్ఞుఁడు అను నామత్రయముతోఁ గూడిన, జీవచైతన్యంబును = అవిద్యోపాధి గల జీవస్వరూపమును, కించిద్జ్ఞత్వ=అహంసుఖి అహందుఃఖి యనెడు స్వల్పజ్ఞానమును, కర్తృత్వ = నేను కర్త ననుకొనుటయు, భోక్తృత్వ = నే ననుభవించువాఁడను అను కొనుటయు, ఆది=మొదలైన, గుణంబులును = అల్పగుణములును, కూడి=చేరి, త్వంపదవాచ్యార్థంబు = త్వంపదమునకు వాచ్యార్థము, దేహత్రయవిలక్షణంబును = స్థూలసూక్ష్మకారణశరీరములకంటె వ్యతిరిక్త మైనదియును, అవస్థాత్రయసాక్షియుఁ = జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడు మూఁడవస్థలకు ద్రష్టయును, పంచకోశవ్యతిరిక్తంబును = అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ యానందమయము లను నైదుకోశములకంటె అతీత మైనదియును, సచ్చిదానందస్వరూపంబు నైన = అనృతజడదుఃఖరహిత మైనదియు నైన, కూటస్థచైతన్యమాత్రంబు = ప్రత్యగాత్మస్వరూపమె, త్వంపదలక్ష్యార్థంబు = త్వంపదమునకు లక్ష్యార్థము, సమష్టి = ఈశ్వరునియొక్క, శరీర = స్థూలసూక్ష్మకారణోపాధులును, అవస్థాత్రయ = జాగ్రత్స్వప్నసుషుప్తులును, ఆత్మక = స్వరూపముగాఁ గలది, ఐనమాయయుఁ = ఐనట్టి సమష్ట్యుపాధియును, వైశ్వానరహిరణ్యగర్భావ్యాకృతనామకంబు = వైశ్వానరుఁడు హిరణ్యగర్భుఁడు అవ్యాకృతుఁడనెడు పేళ్లు గలది, ఐన = ఐనట్టి, మాయా = సమష్ట్యుపాధియందు, ప్రతిబింబ = ప్రతిఫలించిన, ఈశ్వర = కారణోపాధియుఁ డైన యీశ్వరునియొక్క, ఐశ్వర్యంబును = స్వరూపమును, 'శ్లో॥ కార్యోపాధి రయం జీవః కారణోపాధి రీశ్వరః' అని భగవద్గీత సర్వజ్ఞత్వ = అంతయుఁ దెలిసియుండుట, సర్వేశ్వరత్వ = అంతటికిఁ బ్రభు వగుట, సర్వాంతర్యామిత్వ = అన్నిటియందు నిండియుండుట యనెడి, ఆదిగుణంబులును = మొదలగు షడ్విధకల్యాణగుణములును, కూడి=చేరి, తత్పదవాచ్యార్థంబు = తత్పదమునకు వాచ్యార్థము దేశకృతకాలకృతవస్తుకృతపరిచ్ఛేదశూన్యంబుఁ = ఈదేశమం దున్నది ఆదేశమందు లే దనుట దేశకృతపరిచ్ఛేదము, ఈకాలమం దున్నది ఆకాలమందు లే దనుట కాలకృతపరిచ్ఛేదము, ఈ వస్తువునం దున్నది ఆ వస్తువునందు లే దనుట వస్తుకృతపరిచ్ఛేదము వీనిచేత శూన్యంబును - అనఁగా నివి లేనిదియును, స్వజాతీయ విజాతీయ స్వగతభేదరహితంబును = స్వజాతీయమును విజాతీయమును స్వగతము నను భేదములు లేనిదియును - ఇది స్థావరము జంగమము నని రెండువిధములు గలది, వృక్షమునకు వృక్షాంతరము సజాతీయము, పర్వతశిలాదులు విజాతీయములు, పత్రపుష్పఫలాదులు స్వగతము - ఇది స్థావరము, పురుషునకు పురుషాంతరము సజాతీయము, వృక్షాదులు విజాతీయములు, నఖకేశాదులు స్వగతములు- ఇది జంగమము, ఈభేదములు లేని దనుట, సత్యజ్ఞానానందస్వరూపంబును = సత్తు చిత్తు ఆనందములే స్వరూపముగాఁ గలది, ఐన = ఐనట్టి, పరిపూర్ణ = అంతట నిండిన, అద్వితీయ = రెండవది లేని, బ్రహ్మచైతన్యమాత్రంబు = జ్ఞానస్వరూపపరబ్రహ్మమె, తత్పదలక్ష్యార్థం బగుఁ = తత్పదమునకు లక్ష్యార్థమగును, విరుద్ధ = విరోధ మైన, ధర్మకంబు లైన = స్వభావములు గల, వాచ్యార్థంబులతోఁ = జీవేశ్వరరూపములతో, లక్ష్యార్థంబులకుఁ = స్వభావధర్మములు గల ప్రత్యగ్బ్రహ్మములకు, ఐక్యంబు = చేరిక, సంభవింపదు = కలుగదు, కావునఁ = కనుక, ఒక్కదేశంబునఁ = ఒక రాజ్యమందు, ఒక్క కాలంబునఁ = ఒక్కసమయమందు, ఒక్కరూపంబున నున్న పురుషునిఁ=ఒకానొక రూపముతో నున్న నరుని, వేఱొక్కదేశంబునఁ = మఱియొక రాజ్యమందు, మఱియొక్క కాలంబునఁ = వేఱొక కాలమందు, కొండొకరూపముచేఁ = మఱియొకరూపముచేత, ఉండఁగనుంగొని = ఒకపురుషుఁ డుండఁగా జూచి, తద్దేశ = ఆరాజ్యమును, తత్కాల = ఆకాలమును, తదవస్థావిశేషంబులఁ = ఆ దశయందలి భేదములను, ఏతద్దేశ=ఈరాజ్యమును, ఏతత్కాల=ఈకాలమును, ఏతదవస్థా = ఈదశయందలి, విశేషంబులఁ = అతిశయములను, గణించి = లెక్కపెట్టి, లక్షింపక = ఆయాకాలదేశరూపవిశేషములను జూడక,

లక్ష్యభూతుండయిన = కనఁబడిన, అతం డితం డని = ఆ పురుషుఁడే యీపురుషుఁ డని, ఒకనిఁగాన్ = ఒకనిఁగా, ఎఱిఁగిన తెఱంగునన్ = తెలిసికొన్నట్లు, జహదజహల్లక్షణ చేతన్ = 'సోఽయం దేవదత్తః' అను విడిచివిడువనిలక్షణములచేత, మాయికంబులు = మాయాస్వరూపములు, ఐన = ఐనట్టి, ఉభయ = రెండైన, వాచ్యార్థంబులన్ = తత్పద త్వంపదములకు వాచ్యార్థము లైన జీవేశ్వరులను, నిషేధించి = త్యజించి, ద్వివిధ=రెండువిధము లైన, లక్ష్యార్థ=తత్త్వంపదములకు లక్ష్యార్థము లైన, చైతన్యంబులకున్ = ప్రత్యగాత్మపరమాత్మలకు, ఐక్యంబు = పొందికను, తెలియుము=ఎఱుఁగుము, ఇదియ = ఈ చెప్పంబడినదే, అసిపదార్థంబు = నీవు బ్రహ్మము బ్రహ్మము నీవు అయితివనెడు పదమునకు తాత్పర్యము, ఇదియె జీవేశ్వరైక్యజ్ఞానంబు = ఇదియే జీవేశ్వరైక్యవివేకము, ఇదియె మహావాక్యార్థంబు = ఈ చెప్పఁబడినదే తత్త్వమసి యను మహావాక్యతాత్పర్యము, ఇంకన్ = ఇంకమీఁద, జీవబ్రహ్మైక్యంబు = జీవునకు బ్రహ్మమునకు ఐక్యము గలిగెడు విధము, ఉపదేశించెద = చెప్పెదను, ఆకర్ణింపు మని = వినుము మని, మఱియున్ = వెండియు, ఇట్లనియెన్ = వక్ష్యమాణప్రకారముగాఁ జెప్ప నుద్యుక్తుఁ డాయెను

తా॥ ఓ ఆంజనేయా! రజోగుణ మను నామాంతరము గల అవిద్యయందు ప్రతిఫలించిన బ్రహ్మచ్ఛాయకు జీవుఁ డని పేరు, ఆ జీవునిశరీరత్రయమును అవస్థాత్రయమును విశ్వతైజసప్రాజ్ఞ నామములును, కించిద్జ్ఞత్వ కర్తృత్వ భోక్తృత్వాది స్వల్పగుణములును గూడి త్వంపదవాచ్యార్థభూతుం డయిన జీవస్వరూపము దేహత్రయవిలక్షణ మై అవస్థాత్రయసాక్షి యై పంచకోశవ్యతిరిక్త మై సచ్చిదానంద స్వరూప మైన ప్రత్యగాత్మయె త్వంపదమునకు లక్ష్యార్థము, సత్త్వగుణ మను నామాంతరము గల మాయయందు ప్రతిఫలించిన బ్రహ్మచ్ఛాయకు ఈశ్వరుఁ డని పేరు, ఆ యీశ్వరునిశరీరత్రయమును అవస్థాత్రయమును అవస్థాత్రయాభిమాను లయిన వైశ్వానరహిరణ్యగర్భావ్యాకృత నామములును సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వాది మహాగుణములును గూడి తత్పదవాచ్యార్థభూతుఁ డయిన ఈశ్వరునిస్వరూపము దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్య మైన సజాతీయ విజాతీయ స్వగతభేదరహిత మై సజ్జ్ఞానానందస్వరూప మైన పరబ్రహ్మమే తత్పదలక్ష్యార్థము, అసి యనఁగా జీవుఁడె బ్రహ్మము బ్రహ్మమే జీవుఁ డని యర్థము, కించిద జ్ఞత్వసర్వజ్ఞత్వాది ధర్మములు గల జీవేశ్వరులకును, దేహత్రయవిలక్షణాది సమానధర్మములు గల ప్రత్యగాత్మ పరమాత్మలకును ఐక్యము గలుగనేరదు గనుక వాచ్యార్థాంగీకారమువలన నెక్కుడు ప్రత్యక్షవిరోధ మగునో అక్కడ లక్ష్యార్థ మంగీకరింపఁదగినది మఱియును, ఈ మహావాక్యమందు జహల్లక్షణము అజహల్లక్షణము జహదజహల్లక్షణ మని మూఁడులక్షణములు గలవు, విడిచిన లక్షణము విడువనిలక్షణము విడిచివిడువనిలక్షణ మని వీనికి నామాంతరములు, ఈ లక్షణములకుఁ గ్రమముగా నుదాహరణములు 'గంగాయాం ఘోషః' అనఁగా గంగయందు గొల్లపల్లె గల దని యర్థము, గంగాపదమునకు ప్రవాహ మర్థము గనుక ప్రవాహమందు గొల్లపల్లె గల దని యంగీకరించినయెడల ప్రత్యక్షవిరోధము గనుక గంగాశబ్దమున కర్థ మైన ప్రవాహమును విడిచి దానిగట్టున పల్లె యున్న దని చెప్పవలెను. ఇది జహల్లక్షణము, ఇట్లు మహావాక్యమందు జహల్లక్షణము చెప్పఁగూడదు ఎందువలన ననఁగా త్వంపదార్థ మైన కూటస్థచైతన్యపర్యంతము విడిచినయెడల ముముక్షువులరూపమే లేకపోవునుగాక ప్రత్యక్షవిరోధమును గావున జహల్లక్షణము గూడదు ఏలక్షణముచేత నేవాక్యము బ్రహ్మమును బోధించుచున్న దనిన అన్నమయకోశాది విజ్ఞానమయకోశపర్యంతము పరబ్రహ్మ మని చెప్పెడువాక్యమందు జడ మైన కోశములు బ్రహ్మ మని పలుకరాదు గావున వాని కతీత మైన చైతన్యంబునకే తాత్పర్యము చెప్పవలెను, ఇది జహల్లక్షణము. అజహల్లక్షణ మనఁగా 'మంచాః క్రోశంతి' అనఁగా మంచములు అరచు

చున్నదని యర్థము, ఇట్లనుట ప్రత్యక్షవిరోధము, కాబట్టి మంచెలక్షణను విడువకనే మంచెల మీఁద జనులు కూయుచున్నా రని అజహల్లక్షణముచేత తాత్పర్యము నిశ్చయింపఁదగినది ఇట్లు వేదమందు 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' యనెడు వాక్యమునకు ఆనందమయకోశయుక్త మయిన యాత్మను బ్రహ్మవిదులు చెప్పుచున్నారు గనుక శ్రుతి సచ్చిదానందములను విడువకనే ఆనందమయకోశమును చెప్పుచున్నది ఈ యర్థము మహావాక్యమం దంగీకరింపదగు మనిన కించిజ్జ్ఞత్వ సర్వజ్ఞత్వాది విరుద్ధగుణసహితులగు జీవేశ్వరులకును, సచ్చిదానంద నిత్యపరిపూర్ణాది స్వభావగుణములు గల ప్రత్యగాత్మపరమాత్మలకును ఐక్యము చెప్పరాదు గనుక నిక్కడ అజహల్లక్షణము కూడదు గనుక జహదజహల్లక్షణమే గ్రహింపవలయును జహదజహల్లక్షణ మనఁగా 'సోయం దేవదత్తః' అని యీవాక్యమందు గంగగట్టున నిదివఱకు దేవదత్తునిఁ జూచితిమి, మఱల వానిని కావేరీతీరమందు ఏఁబదియవయేటఁ జూచితిమి అను వ్యవహారమునందు ఆయాదేశకాలములతోఁ గూడిన దేవదత్తుఁడే వాక్యార్థ మని యంగీకరించితిమేని విరోధము ఎట్లనఁగా, గంగాతీర కావేరీతీరములును ఆయాకాలములును ఆయావయస్సులును ఆయావేషభావములును భేదములు గనుక ప్రమాణాంతర మైన ప్రత్యక్షమునకు విరుద్ధమై యున్నది గాన వాచ్యార్థము లయిన ఆయాకాలదేశవయోవేషభావములను వదలి లక్ష్యభూతుం డగు దేవదత్తుఁడే వాక్యార్థ మని భావింపవలయును మహావాక్యమందు తత్పదార్థమునకు వాచ్యార్థ మయిన మాయాప్రతిబింబేశ్వర సర్వజ్ఞత్వాది గుణములకును, త్వంపదార్థమునకు వాచ్యార్థ మయిన అవిద్యా ప్రతిబింబ చిదాభాస కించిద్జ్ఞత్వాది గుణములకును అన్యోన్యైక్య మంగీకరించిన ప్రత్యక్షవిరోధ మయినను మాయాసర్వజ్ఞత్వాదిగుణములను అవిద్యాకించిద్జ్ఞత్వాది గుణములను త్యజించి లక్ష్యభూత మయిన చైతన్యమాత్రమునుబట్టి ఆ సచ్చిదానంద బ్రహ్మమే నీవు, నీవే సచ్చిదానందబ్రహ్మ మని జహదజహల్లక్షణములచేత మహావాక్యంబులు బోధించుచున్నవి గాన నీవే బ్రహ్మము సంశయము లేదని తాత్పర్యము ఇవ్విధము 'తత్త్వమసి' యను సామవేదమహావాక్యార్థము వివరింపఁబడెను, తక్కిన 'ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, అయమాత్మా బ్రహ్మ' అను ఋగ్వేద యజుర్వేదాథర్వణవేదముల యందలి మహావాక్యార్థములవివరణము మూఁడవయాశ్వాసమందుఁ జెప్పఁబడును

## జీవ బ్రహ్మైక్య విచారము

సీ. గగనరజ్జుస్థాణుమృగతృష్ణికాశుక్తితతు లాదిమధ్యమాంతములయందు
స్వస్వభావములచే వసియించి యున్నయు, వరుసతో నజ్ఞానవశమువలన
నీలతాహిమనుష్యనీరరౌప్యంబు లై, కనుపట్టి వివరించి కాంచునెడలఁ
గల్పితరూపముల్ గడుమిథ్య లై పోవఁ, దత్త్వంబు లైనచందమున నాత్మఁ

తే. దయ్యె నతఁడు ననాద్యవిద్యాత్మశక్తి
వలన జీవుఁడై తోఁచి కేవలనిజస్వ
రూపము నెఱుంగుచోఁ బూర్వరూప మడఁగి
యద్వయానందమూర్తి యై యలరు ననఘ. ౭౧

టీక. అనఘ = అంజనేయా, గగన = ఆకాశము, రజ్జు = త్రాడు, స్థాణు = దాగపు, మృగతృష్ణికా = ఎండమావులు, శుక్తి = ముత్యపుఁజిప్ప (నీనియొక్క) తతులు = గుంపులు, ఆది = మొదటను, మధ్యమ = నడుమ, అంతములయందుఁ = కడపటను, స్వస్వభావములచేఁ = వాని

వానినిజరూపములచేత, వసియించి = ఉండి, అన్నియుక్ = ఆ గగనాదులెల్లను, వరుసతోక్ = క్రమముగా, అజ్ఞాన = అవివేకమునకు, వశములవలనక్ = స్వాధీన మవుటచేత, సిత = నలుపును, అహి = సర్పమును, మనుష్య = పురుషుండును, నీర = జలమును, రౌప్యంబు లై = రజతములై, కనుపట్టి = కనఁబడి, వివరించి = శోధించి, కాంచునెడలక్ = చూచునప్పుడు, కల్పిత = ఆరోపింపఁబడిన, రూపములు = నీలత్వాదిరూపములు, కల్పిత=మిక్కిలి, మిథ్యలై = అసత్యములై, పోవక్ = పోఁగాన్, తత్త్వంబు లైనచందమునక్ = యథార్థము లైనట్లు - అనఁగా అజ్ఞానవశముచేత గగనము నల్లగాను, త్రాడు పాముగాను, దారువు పురుషుఁడుగాను, ఎండమావులు ఉదకము గాను, ముత్యపుచిప్ప వెండిగాను తోఁచి విమర్శింపఁగా గగనాదులయందుఁ గల్పితము లయిన నీలత్వాదు లసత్యము లయి యాకాశము శుభ్రవర్ణము గలదిగాను, రజ్జువు రజ్జువుగాను, దారువు దారువుగాను, ఎండమావు లెండమావులుగాను, ముత్తెపుచిప్ప ముత్తెపుచిప్పగా నున్నట్లు, ఆత్ముఁడు = ప్రత్యగాత్మ, అఖండ చిన్మయుక్ = పరబ్రహ్మమయ్యును, అనాది = మొదలులేని, అవిద్యా = అజ్ఞానస్వరూప మయిన, ఆత్మ = తనయొక్క, శక్తి వలనక్=స్వభావముచేత, జీవుఁడై తోఁచి = జీవరూపముగా నగుపడి, కేవల = ముఖ్య మైన, నిజస్వరూపముక్ = తనస్వభావమును, ఎఱుఁగుచోక్ = తెలిసికొను వేళ, పూర్వగిరూప ముడిగి = మునుపటిజీవరూపమును విడిచి, అద్వయానందమూర్తియై — అద్వయ= పరిపూర్ణ మయిన, ఆనందమూర్తియై = సుఖస్వరూపక పరబ్రహ్మమై, అలరుక్ = భాసిల్లును

తా అంజనేయా! అజ్ఞానవశముచేత నాకాశము నల్లగాను, త్రాడు పాముగాను, దారువు పురుషుఁడుగాను, ఎండమావులు ఉదకములుగాను, ముత్యపుచిప్ప వెండిగాను తోఁచి చక్కగా పరిశీలింపఁగా గగనాదులయందు భ్రాంతిచేఁ గల్పింపఁబడిన నీలత్వాదులు అబద్ధము లై ఆకాశము శుభ్రవర్ణము గలదిగాను, త్రాడు త్రాడుగాను, ఎండమావులు ఎండమావులుగాను, ముత్తెపుచిప్పలు ముత్తెపుచిప్పలుగా నున్నట్లు ప్రత్యగాత్మ పరబ్రహ్మమయ్యును ఆది లేని అజ్ఞానస్వరూప మయిన తనయొక్క స్వభావముచేత జీవరూపముగా నగుపడి ముఖ్య మయిన తనస్వభావమును తెలిసికొనునపుడు మునుపటి జీవరూపమును విడిచి పరిపూర్ణ మైన సుఖస్వరూపకపరబ్రహ్మమై ప్రకాశించు నని తాత్పర్యము

వ. ఇవ్విధంబున రజ్జ్వజ్ఞానంబువలన రజ్జువునందు భుజంగం బారోపితం బగు యాప్త వాక్యములచేతఁ దత్సర్పభ్రాంతి వినాశం బగుచుండ రజ్జుపురస్సర మగునట్లగున నఖండసచ్చిదానందస్వరూపుం డాత్మాజ్ఞానంబువలనఁ దనకుఁ దాన జీవుం డయి తోఁచి యనంతరంబున శ్రీగురువాక్యంబుచేత నీవు జీవుండవు గావు పరిపూర్ణ చైతన్యమాత్రుండ వని యెప్పుడు బోధితుం డగు నప్పు డాతండు దేహేంద్రియ ప్రాణ మనో బుద్ధి చిత్తాహంకా రాత్మభ్రాంతి నివర్తించు చుండఁ బ్రత్యగభిన్నా ద్వితీయ బ్రహ్మచైతన్యమాత్రుం డగు నిది జీవబ్రహ్మైక్యం బిక నోంకారస్వరూపం బెఱింగించెద విను మని యిట్లనియె. ౬౬.

టీక ఇవ్విధంబునక్ = ఈతీరున, రజ్జ్వజ్ఞానంబువలనక్ = త్రాడని తెలివి లేనందున, రజ్జువునందుక్ = దారమందు, భుజంగంబు = పాము, ఆరోపితంబై = కల్పింపఁబడినదై - అనఁగా సర్పమను భ్రమ యుంచఁబడినదై, ఆప్తవాక్యంబులచేతక్ = మిత్రునిమాటలచేత, తత్సర్పభ్రాంతి = త్రాడుపామనెడు భ్రమ, వినాశం బగుచుండక్ = నశించు చుండఁగా, రజ్జుపురస్సరమైనతెఱంగునక్ = త్రాడు

త్రాడే యైనట్లు, అఖండ = అద్వయ మైన, సచ్చిదానందస్వరూపుండు=సద్రూప చిద్రూప ఆనందస్వరూపుఁ డైన పరబ్రహ్మము, ఆత్మాజ్ఞానంబువలనన్ = స్వస్వరూపవిస్మృతివలన, తనరున్ = తనరు, తాన = తానే, జీవుండై తోఁచి = జీవరూపముగాఁ గనఁబడి, అనంతరంబునన్ = వెనుక, శ్రీ = శోభాయుక్తుఁ డైన, గురు=విహితగురువుయొక్క, వాక్యంబుచేతన్ = ఉపదేశవాక్యముచేత, నీవు జీవుండవు గావు= నీవు కించిద్జ్ఞత్వకర్తృత్వభోక్తృత్వాదిగుణయుక్తుఁ డైన కూటస్థుఁడవు కావు, పరిపూర్ణచైతన్యమాత్రుండ వని = అఖండపరమాత్మస్వరూపి వని, ఎప్పుడు = ఏక్షణమందు, బోధితుం డగుదున్ = తెలుపఁ బడుదునో, అప్పుడు = ఆక్షణమందు, అతండు = ఆ బోధింపఁబడినపురుషుఁడు, దేహ = స్థూలశరీరము, ఇంద్రియ = జ్ఞానేంద్రియములు, ప్రాణ = దశప్రాణములు, మనః = సంశయాత్మకమనస్సు, బుద్ధి = నిశ్చయాత్మకబుద్ధి, చిత్త = చంచలాత్మకచిత్తము, అహంకార = కర్తృత్వాత్మకాహంకారము, ఆత్మ = నేననెడి, భ్రాంతి = భ్రమ, నివర్తించుచుండఁగన్ = తొలఁగుచుండఁగా, ప్రత్యక్ = కూటస్థబ్రహ్మమునరు, అభిన్న = వేఱు గాని, అద్వితీయ = రెండవది లేని, బ్రహ్మచైతన్యమాత్రుం డగున్ = సత్యజ్ఞానానందనిత్యపరిపూర్ణపరబ్రహ్మమే యగును, ఇది జీవబ్రహ్మైక్యంబు = ఈ చెప్పఁబడినది జీవాత్మపరమాత్మల యేకీభావము, ఇంకన్ = ఇంక మీఁద, ఓంకారస్వరూపంబు = ప్రణవస్వరూపమును, ఎఱిఁగించెదన్ = తెలిపెదను, విను మని = ఆలకింపు మని, ఇట్లు = మీఁదఁ జెప్పఁగోయెడులాగున, అని యెన్ = పలుక నారంభించెను

తా॥ ఈప్రకారము త్రా డని తెలివి లేనందున త్రాడునందు కలిగిన సర్పభ్రాంతి స్నేహితుని మాటలచేత నశింపఁగా త్రాడు త్రాడే యైనట్లు అద్వయ మైన సద్రూప చిద్రూప ఆనందస్వరూపుఁ డైన పరబ్రహ్మము స్వరూపజ్ఞానమువలన తనరు తానే జీవరూపముగాఁ గనఁబడి అనంతరము శ్రీగురువాక్యము చేత నీవు జీవుఁడవు గావు అఖండపరమాత్మస్వరూపి వని యేక్షణమందు తెలుపఁబడునో ఆ క్షణమందు ఆ బోధింపఁబడిన పురుషుఁడు స్థూలాదిశరీరములు జ్ఞానేంద్రియకర్మేంద్రియములు పదిప్రాణములు సంశయాత్మక మనస్సు నిశ్చయాత్మకబుద్ధి చంచలాత్మకచిత్తము కర్తృత్వాత్మకఅహంకారము ఆత్మ నేననెడు భ్రమ యివి యన్నియుఁ దొలఁగుచుండఁగా వేఱు గానట్టిదియు రెండవది లేనట్టిదియు నగు సత్యజ్ఞానానందనిత్యపరిపూర్ణపరబ్రహ్మమే యగును, ఈ చెప్పఁబడినది జీవాత్మపరమాత్మలయేకీభావము. ఇంక మీఁదు ప్రణవస్వరూపమును తెలిపెదను విను మని యీప్రకారము పలుక నారంభించె నని తాత్పర్యము

## ఓంకారస్వరూపనిరూపణము.

సీ. ఘనతరదేహజాగ్రద్విశ్వవైరాజ,సు లకారమాత్ర మౌ సుగుణధుర్య
తనువిగ్రహాస్వప్నతైజససూత్రాత్మ,కులు నుకారార్థ మౌ లలితచరిత
పృథులకారణసుషుప్తి ప్రాజ్ఞసర్వేశ్వ,రుల్మకారార్థ మౌ రుచిరవర్ణ
సంతతపరిపూర్ణసచ్చిదానందాత్మ,తత్త్వ మోంకార మౌ తత్త్వమూర్తి
తే. అట్లు గావున వర్ణత్రయాత్మకం బ,వాత్మరూపక మైనవాచ్యార్థ మగుటఁ
గాను బ్రణవస్వరూపుఁడ నే నటంచుఁ, దెలిసి భావింపవలయు నిర్మలవిచార.

టీక. సుగుణధుర్య = శమదమాది కల్యాణగుణములు గల యోయాంజనేయా, ఘనతరదేహ = వ్యష్టి సమష్ట్యాత్మకము లయిన స్థూలదేహములను, జాగ్రత్ = వ్యష్టిసమష్టిజాగ్రదవస్థలను, (ఉభయ

దేహావస్థాభిమాను లయిన) విశ్వ = విశ్వనామక జీవుఁడును, వైరాజనుతు = విరాట్టనెడు యీశ్వరుఁడును, అకారమాత్రమహాన్ = ప్రణవార్థ మయిన పరబ్రహ్మముయొక్క అవిద్యాపాదాత్మక మయిన అకారప్రణవార్థ మగును, లలితచరిత = ఒప్పిద మైన ప్రవర్తనగల యాంజనేయా, అనుగ్రహా = వ్యష్టి సమష్ట్యాత్మకము లయిన సూక్ష్మశరీరములును, స్వప్న = ఉభయశరీరావస్థ లైన స్వప్నములును, (ఆ దేహావస్థాభిమాను లయిన) తైజస = తైజసనామక జీవుఁడును, సూత్రాత్మకులును = హిరణ్యగర్భుఁ డనెడు యీశ్వరుఁడును, ఉకారార్థవహా = బ్రహ్మప్రణవార్థమందలి విద్యాపాదాత్మక మైన వుకారప్రణవార్థ మగును, రుచిరవర్ణ = ప్రకాశించు చున్న కాంతి గల ఓ యాంజనేయా, ఘనుల = ఘనము లయిన, కారణ=వ్యష్టి సమష్టి కారణశరీరములును, సుషుప్తి=ఉభయనిద్రావస్థలును, ప్రాజ్ఞ = ప్రాజ్ఞుఁ డను జీవుఁడును, సర్వేశ్వరుల్=అవ్యాకృతుఁ డనెడి యీశ్వరుఁడును, మకారార్థమహాన్=బ్రహ్మప్రణవమందలి ఆనంద పాదస్వరూప మయిన మకారప్రణవార్థ మగును, సత్త్వమూర్తి = ఓ సాత్త్వికస్వరూపుఁడా! సంతత= ఎల్లప్పుడు, పరిపూర్ణ = సర్వవ్యాపక మయిన, సత్ = శాశ్వత మైన, చిత్ = జ్ఞానస్వరూప మైన, ఆనంద = సుఖస్వరూప మైన, ఆత్మతత్త్వము = ప్రత్యగ్బ్రహ్మచైతన్యము, ఓంకారమహాన్ = వ్యష్టిసమష్ట్యాత్మక మయిన ప్రత్యగ్బ్రహ్మస్వరూపములచేత శోభిల్లు చున్న తురీయపాదాత్మక మయిన ఓంకార మను అర్థమాత్ర యగును, అట్లు కావున్ = అర్థమాత్ర యగుటవలన, వర్ణత్రయాత్మకంబు = అవిద్యావిద్యానందపాదాత్మకము లయిన అకార వుకార మకారములును వీని సమ్మేళనరూపమగు తురీయపాదాత్మక మయిన సామ్యావస్థయును, అనాత్మరూపక మైన = అవిద్యారూపక మైన, వ్యర్థ మగుటన్ = ఇది యంతయు వదింపఁదగిన యర్థ మగుటవలన, తాను = ఈ వాక్యార్థము నీను గాను, ప్రణవస్వరూపుఁడన్ = శుద్ధోంకారస్వరూపుఁడను, నే నటంచున్ = నేనే యని, తెలిసి=లక్ష్యార్థమును దలిసి-అనఁగా

శ్లో॥ అష్టాంగంచ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతమ్। ఓ మిత్యేవం నజానాతి బ్రాహ్మణో న భవేత్సహి। ప్రథమం తారకం చైవ ద్వితీయం దండ ముచ్యతే। తృతీయం కుండలాకారం చతుర్థం త్వర్ధచంద్రకమ్। పంచమం బిందు సంయుక్త మో మితి జ్యోతిరూపకమ్॥ చతుష్పా త్పరబ్రహ్మ పాదోస్య విశ్వాభూతాని త్రిపాద స్యామృతం దివి। అస్యైకపాదో విద్యా స్యా న్నిరవిద్యా త్రిపాదభూః - ఓ మితి బ్రహ్మ - ఓ మితీదగ్ం సర్వమ్' అను స్మృతిశ్రుతులను బట్టి అలంటి అలంబభావములు లక్ష్యార్థమును దలిసి, భావింప వలయున్ = బ్రహ్మప్రణవలక్ష్యార్థ మయిన పరబ్రహ్మము నేనే యని వూహింపవలయును.

తా॥ శమదమాదిగుణములు గల యాంజనేయా! వ్యష్టిసమష్ట్యాత్మకము లగు స్థూలదేహములును, వ్యష్టిసమష్టిజాగ్రదవస్థలును, విశ్వుఁ డను పేరు గల జీవుఁడును, విరాట్టనెడు యీశ్వరుఁడును ప్రణవార్థ మయిన పరబ్రహ్మముయొక్క అవిద్యాపాదాత్మక మయిన అకారప్రణవార్థ మగును వ్యష్టిసమష్ట్యాత్మకము లగు సూక్ష్మశరీరములును, ఆ యుభయశరీరావస్థ లగు స్వప్నములును, ఆ దేహావస్థాభిమాను లగు తైజసుఁ డను పేరు గల జీవుఁడును, హిరణ్యగర్భుఁ డను యీశ్వరుఁడును, బ్రహ్మప్రణవార్థమందలి విద్యాపాదాత్మక మయిన వుకారప్రణవార్థ మగును వ్యష్టి సమష్టి కారణశరీరములును, ఆ యుభయశరీరావస్థ లయిన నిద్రావస్థలును, ప్రాజ్ఞుఁ డను జీవుఁడును, అవ్యాకృతుఁ డనెడు యీశ్వరుఁడును బ్రహ్మప్రణవమందలి ఆనందపాదస్వరూప మగు మకారప్రణవార్థ మగును అన్ని కాలములయందు వ్యాపించి యుండునదియును, శాశ్వత మైనదియును, సుఖస్వరూప మయినదియును, జ్ఞానస్వరూప మయినదియు నైన ప్రత్యగ్బ్రహ్మ చైతన్యము తురీయపాదాత్మక మయిన ఓంకార మను అర్థమాత్ర యగును ఇట్లు అర్థమాత్ర యగుటవలన అవిద్యావిద్యానందపాదాత్మకము లయిన అకార వుకార మకారములును, వీని కూడికయొక్క రూప మగు

కడపటిపాద మగు సామాన్యావస్థయును, అవిద్యారూప మయిన యిది యంతయును చెప్పుటకు తగిన యర్థ మగుటవలన యీ వాచ్యార్థము నేను గాను, నేను శుద్ధఓంకారస్వరూపుఁడను, నేనును లక్ష్యార్థమును దెలిసి బ్రహ్మప్రణవమునకు లక్ష్యార్థ మయిన పరబ్రహ్మము నే నని వూహింపవలయు నని తాత్పర్యము

వ. ఇట్లు దేహత్రయా వస్థాత్రయ తాపత్రయ సుఖత్రయ కర్మత్రయ కర్తృత్రయ బుద్ధిత్రయ శ్రద్ధాత్రయ ధృతిత్రయ గుణత్రయ శక్తిత్రయ కాలత్రయ లోకత్రయ దేవత్రయ మూర్తిత్రయ వృత్తిత్రయ స్థానత్రయ జీవత్ర యేశ్వరత్రయ విరక్తిత్రయ భక్తిత్రయ దీక్షాత్రయ నేత్రత్రయ లక్ష్యత్రయ జ్ఞానత్రయ మండలత్రయ ముక్తిత్రయాత్మకం బయిన వర్ణత్రయం బారోపితం బయిన వాచ్యార్థంబు గావున నేతత్సర్వంబుం గ్రమంబున నకారంబున నకారంబు నుకారంబున నుకారంబు మకారంబున మకారంబు నోంకారంబునం బ్రవిలాపంబు నొందించి యంతటఁ దత్ప్రవిలాపంబును విశ్వాధిష్ఠానంబుఁ బరిపూర్ణంబుఁ దురీయంబు నక్షరంబు లక్ష్యార్థంబు నయిన శుద్ధోంకారమాత్రంబుగా నవలోకించి నిరంతరంబు దత్స్వరూపమాత్రుండ వై ప్రకాశింపుము. ౬౮

టీక. ఇట్లు = పైన జెప్పిన ప్రణవార్థప్రకారము, దేహత్రయ = స్థూలసూక్ష్మకారణశరీరములు, అవస్థాత్రయ = జాగ్రత్స్వప్నసుషుప్తులు, తాపత్రయ = ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతికములు, సుఖత్రయ = విషయానంద వాసనానంద బ్రహ్మానందములు, కర్మత్రయ = పుణ్యపాపమిశ్రకర్మములు - లేక విధినిషేధప్రాయశ్చిత్తకర్మములు, కర్తృత్రయ = జీవేశ్వరప్రత్యక్కర్తృత్వములు, బుద్ధిత్రయ = సాత్త్విక రాజస తామసబుద్ధులు, శ్రద్ధాత్రయ = గురుశాస్త్రనిష్ఠలయందు విశ్వాసములు లేక సాత్త్విక రాజస తామసశ్రద్ధలు, ధృతిత్రయ = సత్త్వరజస్తమోధృతులు, గుణత్రయ = సాత్త్విక రాజస తామసములు, శక్తిత్రయ = ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు, కాలత్రయ = భూతభవిష్యద్వర్తమానములు, లోకత్రయ = స్వర్గమర్త్యపాతాళములు, దేవత్రయ = వసురుద్రాదిత్యులు, మూర్తిత్రయ = బ్రహ్మ విష్ణు రుద్రులు, వృత్తిత్రయ = శాంత ఘోర మూఢవృత్తులు, స్థానత్రయ = నాభిహృదయభ్రూమధ్యములు, జీవత్రయ = విశ్వతైజసప్రాజ్ఞులు, ఈశ్వరత్రయ = విరాట్ హిరణ్యగర్భావ్యాకృతులు, విరక్తిత్రయ = ఐహికాముష్మికమిశ్రవైరాగ్యములు, భక్తిత్రయ = బాహ్యభక్తి అనన్యభక్తి ఏకాంతభక్తి, దీక్షాత్రయ = దృగ్వాక్స్పర్శదీక్షలు, నేత్రత్రయ = వామదక్షిణనాసాగ్రనేత్రములు, లక్ష్యత్రయ = అంతరమధ్యబాహ్యలక్ష్యములు, జ్ఞానత్రయ = సంజ్ఞాన విజ్ఞాన ప్రజ్ఞానములు, మండలత్రయ = సోమసూర్యాగ్నిమండలములు, ముక్తిత్రయ = క్రమముక్తి జీవన్ముక్తి విదేహముక్తులు, (వీనియొక్క) ఆత్మకంబైన = ఈ చెప్పఁబడినవియే స్వరూపముగాఁ గల, వర్ణత్రయంబు = అకార వుకార మకారములు, ఆరోపితం బైన = కల్పిత మైన, వాచ్యార్థంబు గావునన్ = పలుకఁదగిన యర్థము గనుక, ఏతత్సర్వంబున్ = ఈ చెప్పఁబడిన దంతయును, క్రమంబునన్ = త్రివిధభాగములలో వరుసగా, అకారంబునన్ = అకారార్థమందున, అకారంబున్ = అకారార్థమును, ఉకారంబునన్ = ఉకారార్థమందును, ఉకారంబున్ = ఉకారార్థమును, మకారంబునన్ = మకారార్థమందును, మకారంబున్ = మకారార్థమును, ఓంకారంబునన్ = సామాన్యావస్థ యైన యర్ధమాత్రయందును, ప్రవిలాపంబు నొందించి = చేర్చి, అంతటన్ = తర్వాత, తత్ప్రవిలాపంబును = చేర్పఁబడిన యర్ధమాత్ర స్వరూప మయిన శుద్ధసత్త్వమును, విశ్వాధిష్ఠానంబును = ప్రపంచమునకు స్థాన మయినదియును, పరిపూర్ణం

బును = అఖండస్వరూప మైనదియును, తురీయంబును = తుర్యపాద తుర్యావస్థాస్వరూప మైనదియును, అక్షరంబును = నశింపనిదియును, లక్ష్యార్థంబును = దృగ్రూప మైనదియును, ఐన = అయిన దీనిని, శుద్ధ = నిర్మల మైన యర్ధమాత్రలలో నర్ధమాత్ర తుర్యతుర్యము అవికల్పావికల్ప మని చెప్పనొప్పెడు, ఓంకార మాత్రంబుగాక = ప్రణవముగా, అవలోకించి = చూచి, నిరంతరంబు = సార్వకాలమును, తత్స్వరూప మాత్రుండవై = ఆ యవికల్పావికల్పమాత్రుండవై, ప్రకాశింపుము = వెలుఁగుము

తా పైనఁ జెప్పిన ప్రణవార్థప్రకారము స్థూలసూక్ష్మకారణశరీరములు, జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడు యవస్థలు, ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతికము లనెడు మూఁడువిధము లయిన తాపములు, విషయానంద వాసనానంద బ్రహ్మానందములు, పుణ్యపాపమిశ్రకర్మములు, (లేక విధినిషేధప్రాయశ్చిత్తకర్మములు) జీవేశ్వరప్రత్యక్కూటస్థత్వములు, సాత్త్విక రాజస తామసబుద్ధులు, గురుశాస్త్రనిష్ఠలయందుంగు విశ్వాసము లేక సాత్త్విక రాజస తామసశ్రద్ధలు, సత్త్వరజస్తమోధృతులు, సాత్త్విక రాజస తామసగుణములు, ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులు, భూతభవిష్యద్వర్తమానకాలములు, స్వర్గమర్త్యపాతాళలోకములు, వసురుద్రాదిత్యు లను దేవతలు, బ్రహ్మ విష్ణు రుద్రు లను త్రిమూర్తులు, శాంతఘోరమూఢవృత్తులు, నాభిహృదయభ్రూమధ్యము లను మూఁడుస్థానములు, విశ్వతైజసప్రాజ్ఞు లను ముగ్గురుజీవులు, విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతు లను ముగ్గురు యీశ్వరులు, ఐహిక ఆముష్మిక।మిశ్రము లనెడు వైరాగ్యములు,।బాహ్యభక్తి అనన్యభక్తి ఏకాంతభక్తి అను భక్తిత్రయము, దృగ్వాక్సవిర్మదీక్షలు, వామదక్షిణనాసాగ్రనేత్రములు, అంతర్మధ్యబాహ్యలక్ష్యములు, సంజ్ఞాన విజ్ఞాన ప్రజ్ఞానములు, చంద్రసూర్యాగ్నిమండలములు, క్రమముక్తి సద్యోముక్తి విదేహముక్తి అను మూఁడువిధము లగు ముక్తులు అను నీచెప్పఁబడినవే స్వరూపముగాఁ గల అకార ఉకార మకారములు కల్పింపఁబడిన (పలుకఁదగిన) యర్థము గనుక యీచెప్పఁబడిన దంతయును క్రమముగా (అనఁగా అకారార్థమందు యుండెడి అకారార్థమును, ఉకారార్థమునందు యుండెడి ఉకారార్థమును, మకారార్థమందు యుండెడి మకారార్థమును) ఓంకారమునందుఁ జేర్చి అనంతరము చెప్పఁబడిన యర్ధమాత్రస్వరూప మయిన శుద్ధసత్త్వమును ప్రపంచమునకు స్థాన మయినదియును, అఖండస్వరూప మయినదియును, నాశరహిత మయినదియును, తద్రూప మయినదియును నైన దీనిని నిర్మల మయిన ప్రణవముగాఁ జూచి యెప్పుడును ఆ యవికల్పావికల్పమాత్రుండ వై ప్రకాశింపు మని తాత్పర్యము.

## బ్రహ్మప్రణవచక్రము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అకార ఉకార మకార అర్ధమాత్రాన్యోన్య మేళన విభాగములు | అవిద్యా విద్యానందతురీయపాదాన్యోన్య మేళన విభాగములు | స్థూలాదిదేహచతుష్టయాన్యోన్య మేళన విభాగములు | అవస్థాచతుష్టయాన్యోన్య మేళన విభాగములు | జీవచతుష్టయాన్యోన్య మేళన విభాగములు | ఈశ్వరచతుష్టయాన్యోన్య మేళనవిభాగములు | జీవేశ్వర చతుష్టయైక్య ప్రత్యగ్చతుష్టయాన్యోన్య మేళన విభాగములు |

అకారము—అవిద్యాపాదము, స్థూలదేహము, జాగ్రదవస్థ, విశ్వుఁడు, విరాట్టు, ఓత ఇవి చేరి బ్రహ్మపీఠము, సద్యోజాతముఖము, పృథివీతత్త్వము, నకారము, నివృత్తికళ, తారకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అకారమున అకారము | అవిద్యాపాదమున అవిద్యాపాదము | స్థూలదేహమున స్థూలదేహము | జాగ్రత్తులో జాగ్రత్తు | విశ్వునిలో విశ్వుఁడు | విరాట్టులో విరాట్టు | ఓతలో ఓత |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అ కారమున ఉ కారము | అవిద్యాపాదమున విద్యాపాదము | స్థూలదేహమున సూక్ష్మదేహము | జాగ్రత్తులో స్వప్నము | విశ్వునిలో తైజసుఁడు | విరాట్టులో హిరణ్యగర్భుఁడు | ఓతలో అనుజ్ఞాత |
| అ కారమున మ కారము | అవిద్యాపాదమున ఆనంద పాదము | స్థూలదేహమున కారణదేహము | జాగ్రత్తులో సుషుప్తి | విశ్వునిలో ప్రాజ్ఞుఁడు | విరాట్టులో అవ్యాకృతుఁడు | ఓతలో అనుజ్ఞైకరసుఁడు |
| అ కారమున అర్ధమాత్రము | అవిద్యాపాదమున తురీయపాదము | స్థూలదేహమున మహాకారణదేహము | జాగ్రత్తులో తురీయము | విశ్వునిలో ప్రత్యగాత్ముఁడు | విరాట్టులో పరమాత్మ | ఓతలో అవికల్పుఁడు |

ఉ కారము.—విద్యాపాదము, సూక్ష్మదేహము, స్వప్నావస్థ, తైజసుఁడు, హిరణ్యగర్భుఁడు, అనుజ్ఞాత ఇవి అన్నియుం చేరి విష్ణుపీఠము, వామదేవముఖము, జలతత్త్వము, మ కారము, ప్రతిష్ఠాకళ, దండము.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఉ కారమున అ కారము | విద్యాపాదమున అవిద్యాపాదము | సూక్ష్మదేహమున స్థూలదేహము | స్వప్నములో జాగ్రత్తు | తైజసునిలో విశ్వుఁడు | హిరణ్యగర్భునిలో విరాట్టు | అనుజ్ఞాతలో ఓత |
| ఉ కారమున ఉ కారము | విద్యాపాదమున విద్యాపాదము | సూక్ష్మదేహమున సూక్ష్మదేహము | స్వప్నములో స్వప్నము | తైజసునిలో తైజసుఁడు | హిరణ్యగర్భునిలో హిరణ్యగర్భుఁడు | అనుజ్ఞాతలో అనుజ్ఞాత |
| ఉ కారమున మ కారము | విద్యాపాదమున ఆనందపాదము | సూక్ష్మదేహమున కారణదేహము | స్వప్నములో సుషుప్తి | తైజసునిలో ప్రాజ్ఞుఁడు | హిరణ్యగర్భునిలో అవ్యాకృతుఁడు | అనుజ్ఞాతలో అనుజ్ఞైకరసుఁడు |
| ఉ కారమున అర్ధమాత్రము | విద్యాపాదమున తురీయపాదము | సూక్ష్మదేహమున మహాకారణదేహము | స్వప్నములో తురీయము | తైజసునిలో ప్రత్యగాత్మ | హిరణ్యగర్భునిలో పరమాత్మ | అనుజ్ఞాతలో అవికల్పుఁడు |

మ కారము.—ఆనందపాదము, కారణదేహము, సుషుప్త్యవస్థ, ప్రాజ్ఞుఁడు, అవ్యాకృతుఁడు, అనుజ్ఞైకరసుఁడు ఇవి చేరి రుద్రపీఠము, అఘోరముఖము, అగ్నితత్త్వము, శి కారము, విద్యాకల, కుండలాకృతి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| మ కారమున అ కారము | ఆనందపాదమున అవిద్యాపాదము | కారణదేహమున స్థూలదేహము | సుషుప్తిలో జాగ్రత్తు | ప్రాజ్ఞునిలో విశ్వుఁడు | అవ్యాకృతునిలో విరాట్టు | అనుజ్ఞైకరసునిలో ఓత |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| మకారమున ఉకారము | ఆనందపాదమున విద్యాపాదము | కారణదేహమున సూక్ష్మదేహము | సుషుప్తిలో స్వప్నము | ప్రాజ్ఞునిలో తైజసుడు | అవ్యాకృతునిలో హిరణ్యగర్భుడు | అనుజ్ఞైకరసునిలో అనుజ్ఞాత |
| మకారమున మకారము | ఆనందపాదమున ఆనందపాదము | కారణదేహమున కారణదేహము | సుషుప్తిలో సుషుప్తి | ప్రాజ్ఞునిలో ప్రాజ్ఞుడు | అవ్యాకృతునిలో అవ్యాకృతుడు | అనుజ్ఞైకరసునిలో అనుజ్ఞైకరసుడు |
| మకారమున అర్ధమాత్రము | ఆనందపాదమున తురీయపాదము | కారణదేహమున మహాకారణదేహము | సుషుప్తిలో తురీయము | ప్రాజ్ఞునిలో కూటస్థుడు | అవ్యాకృతునిలో పరమాత్మ | అనుజ్ఞైకరసునిలో అవికల్పుడు |

అర్ధమాత్రము.—తురీయపాదము, మహాకారణదేహము, తురీయావస్థ, కూటస్థుడు, పరమాత్మ, అవికల్పుడు ఇవి అన్నియుఁగూడి మహేశ్వరపీఠము, తత్పురుషముఖము, వాయుతత్త్వము, వకారము, శాంతికళ, అర్ధచంద్రాకారము.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అర్ధమాత్రమున అకారము | తురీయపాదమున అవిద్యాపాదము | మహాకారణదేహమున స్థూలదేహము | తురీయమున జాగ్రత్తు | కూటస్థునిలో విశ్వుడు | పరమాత్మలో విరాట్టు | అవికల్పునిలో ఓత |
| అర్ధమాత్రమున ఉకారము | తురీయపాదమున విద్యాపాదము | మహాకారణదేహమున సూక్ష్మశరీరము | తురీయమున స్వప్నము | కూటస్థునిలో తైజసుడు | పరమాత్మలో హిరణ్యగర్భుడు | అవికల్పునిలో అనుజ్ఞాత |
| అర్ధమాత్రమున మకారము | తురీయపాదమున ఆనందపాదము | మహాకారణదేహమున కారణశరీరము | తురీయమున సుషుప్తి | కూటస్థునిలో ప్రాజ్ఞుడు | పరమాత్మలో అవ్యాకృతుడు | అవికల్పునిలో అనుజ్ఞైకరసుడు |

పైఁ జెప్పినవి యెల్లఁగూడి సదాశివపీఠము, ఈశానముఖము, ఆకాశతత్త్వము, యకారము, శాంత్యతీతకళ, బిందురూపము—ఇవి ఆరు శక్తితత్త్వములు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అర్ధమాత్రమున అర్ధమాత్రము | తురీయపాదమున తురీయపాదము | మహాకారణశరీరమున మహాకారణశరీరము | తురీయమున తురీయము | కూటస్థునిలో కూటస్థుడు | పరమాత్మలో పరమాత్మ | అవికల్పునిలో అవికల్పుడు |

ఇది శివతత్త్వము, శివతత్త్వమును శక్తితత్త్వములను మీఱినదే నిర్గుణపరబ్రహ్మము. అది నిష్కళము, నిరీహము, నిష్ప్రపంచము, నిర్మలము, నిరంజనము, నిర్వికారము, నిరాలంబము, నిర్ముక్తము, నిత్యము, బుద్ధము, కేవలము, అఖండము, అప్రమేయము, అద్వితీయము, ఆద్యంతవిహీనము, పరాత్పరము, అశోకము, స్వయంజ్యోతి, సర్వవ్యాపకము, నిరతిశయానందము

మ. అని బోధించిన నాంజనేయుఁ డపు డాత్మారామునిం జూచి యో
యనఘా యేవరయుక్తిచే నొకట వాచ్యార్థంబుఁ బోఁ ద్రోచినం
తనె లక్ష్యార్థము చూడఁగా వలయు నందం బొప్ప నాయుక్తి హె
చ్చినకూర్మి న్వినిపింపు భక్తవరదా శ్రీరామసీతాపతీ. ౬౯

టీక అని బోధించినన్ = అని తెలుపఁగా, ఆంజనేయుండు = పావని, అపుడు = ప్రణవోపదేశ కాలమందు, ఆత్మారామునిన్ = ఆత్మయందే క్రీడించుచున్న శ్రీరాముని, చూచి = తిలకించి, ఓ యనఘా = ఓ పుణ్యపురుషుఁడా, ఏవరయుక్తిచేన్ = ఏ మంచియుపాయముచేత, ఒకటన్ = ఏక కాలమందే, వాచ్యార్థంబున్ = వచింపఁ దగిన యర్థమును, పోఁ ద్రోచినంతనె = త్యజించినమాత్రముననే, లక్ష్యార్థము = యథార్థమైన పరబ్రహ్మమును, చూడఁగావలయున్ = దర్శింపవలెనో, అందంబొప్పన్ = సొంపుగా, ఆ యుక్తిన్ = ఆ యుపాయమును, హెచ్చినకూర్మిన్ = మిక్కుటమగు ప్రేమచేత, భక్తవరదా = భక్తజనులకోరిక నీడేర్చువాఁడా, సీతాపతీ = జానకీనాథుఁడ వైనట్టి, శ్రీరామా = ఓ శ్రీరామమూర్తీ, వినిపింపుము = తెలియపఱచుము

తా॥ ఈప్రకారము తెలుపఁగా నాంజనేయుఁడు ప్రణవమును యుపదేశించుకాలమందు ఆత్మయందే క్రీడించుచున్న శ్రీరామునిఁజూచి పుణ్యపురుషుఁడవును భక్తజనులకోరిక నీడేర్చువాఁడవును నైన యో జానకీపతీ! ఒక్కకాలముననే వచింపఁదగినయర్థమును, వాచ్యార్థమును వదలినమాత్రముననే యథార్థమైన పరబ్రహ్మను చూడవచ్చునో అట్టి యుపాయమును తెలియఁజేయుము అని ప్రార్థించె నని తాత్పర్యము.

క. అని తనపదపద్మములకు, ఘనభక్తిని వందనములు గావించు మహా
త్ముని హనుమంతునిఁ గని యి, ట్లనియెన్ శ్రీరామచంద్రుఁ డానందమునన్. ౭౦

టీక అని = ఇట్లు వినిపింపుమని, తనపదపద్మములకున్ = తనచరణకమలములకు, ఘనభక్తిని = అఖండభక్తిచేత, వందనములు = నమస్కృతులను, కావించు = చేయునట్టి, మహాత్మునిన్ = ప్రఖ్యాతుఁడైన, హనుమంతునిన్ = ఆంజనేయుని, శ్రీరామచంద్రుఁడు = శ్రీరామమూర్తి, కని = చూచి, ఆనందమునన్ = మోదముచేత, ఇట్లనియెన్ = వక్ష్యమాణార్థమును జెప్పఁదొడఁగెను

తా॥ ఈప్రకారము వినిపింపుమని అతిశయమైన భక్తితో తనపాదపద్మములకు నమస్కరింపుచున్న యాంజనేయుని శ్రీరామమూర్తి జూచి సంతోషముతో నిట్లు చెప్పుటకు ప్రారంభించె నని తాత్పర్యము.

## పంచకోశముల వివేచనము.

సీ. అన్నజసంభూతమై యన్నవర్ధిత మగు, తను వన్నమయకోశమనఁగ నొప్పు
ప్రాణకర్మేంద్రియపంచకంబులు గూడి, విను ప్రాణమయకోశమనఁగఁ దనరు
జ్ఞానేంద్రియోపేతమానసచిత్తంబులను మనోమయకోశమనఁగఁ జెల్లు
శబ్దాదివిషయపంచకసమన్వితబుద్ధి, విజ్ఞానమయమన వెలయుచుండు
తే. మోహజప్రియమోదప్రమోదవృత్తి, సంయుతోరుసమస్తదృశ్యప్రపంచ
కారణానాద్యవిద్యాంధకారపటల, మంచితానందమయకోశమనఁగఁ దనరు.

టీక. వినుము = ఓ యాంజనేయా వినుము, అన్నజసంభూత — అన్న = అన్నముచేత, జ = పుట్టిన రేతముపలన, సంభూతము = ఉద్భవించినదియును, అన్న = అన్నముచేత, వర్ధితము = వృద్ధిఁబొందింపఁబడు చున్నదియును, అగుతనువు = ఐదుశరీరము, అన్నమయకోశమనఁగఁ = అన్నమయకోశ మనునట్లుగా, ఒప్పుఁ = తనరును, ప్రాణ = ప్రాణములయొక్క, కర్మేంద్రియ = కర్మేంద్రియములయొక్క, పంచకంబులు = ఐదులు, కూడి = చేరి, ప్రాణమయకోశ మనఁగఁ = ప్రాణమయకోశ మనుపేర, తనరుఁ = ఒప్పును, జ్ఞానేంద్రియ = నేత్రశ్రోత్రాదీంద్రియములతోడ, ఉపేత = కూడిన, మానసచిత్తంబులు = మనస్సును చిత్తమును, మనోమయకోశమనఁగఁ = మనోమయకోశ మను పేర, చెల్లుఁ = తగును, శబ్దాది = శబ్దము మొదలయిన, విషయము = ఇంద్రియార్థములయొక్క, పంచక = ఏనింటితోడ, సమన్విత = కూడిన, బుద్ధి = ప్రజ్ఞయే, విజ్ఞానమయ మనఁ = విజ్ఞానమయకోశ మనుపేర, వెలయుచుండుఁ = ఒప్పుచుండును, మోహజ = మఱపుచేఁ గల్గిన, ప్రియ = ఇష్టవస్తుదర్శనమాత్రజనిత సంతోషము, మోద = కోరినవస్తువు లభించుటచేఁ గలిగెడు సంతోషము, ప్రమోద = లభించినవస్తువు ననుభవించుటచేఁ గలిగిన సంతోషము, వృత్తి = ఈ మూఁడువృత్తులతోడ, సంయుత=కూడిన, ఉరు = అధిక మగు, సమస్త = సకలమైన, దృశ్య = కనఁబడు, ప్రపంచ=జగత్తునకు, కారణ = నిమిత్తమైన, అనాది = ఉత్పత్తి లేని, అవిద్య = అజ్ఞాన మనెడు, అంధకార = చీఁకటియొక్క, పటలము = గుంపు, అంచితానందమయకోశము = ఒప్పిదమైన యానందమయకోశము, అనఁగఁ = అను పేరుచేత, తనరుఁ = వెలయును

తా. ఓ యాంజనేయా! అన్నమువలనఁ బుట్టిన రేతమువలన జన్యమై అన్నముచేత వృద్ధిఁబొందు చున్నదై స్తంభమువలె స్థూలమై కరచరణాద్యవయవములు గలదై షడ్భావవికారసహితమై షట్కోశాత్మకమై యుండు స్థూలశరీరమే అన్నమయకోశము, కర్మేంద్రియము లైదును పంచప్రాణములునుగూడి ప్రాణమయకోశము, మనస్సు, చిత్తమును, జ్ఞానేంద్రియము లైదును గూడి మనోమయకోశము, బుద్ధియు శబ్దస్పర్శరూపరసగంధము లైదును గూడి విజ్ఞానమయకోశము, ప్రియ మోద ప్రమోదవృత్తులు గలదై జగదుత్పత్తికి ప్రధానకారణ మైన అనాది యగు అజ్ఞానమే ఆనందమయకోశ మని తాత్పర్యము.

పంచకోశాదిక మనాత్మ యని నిరూపించుట.

సీ. మహనీయకలితాన్నమయకోశమగు నాత్మఁ, డనిపల్కుదురు కొందఱజ్ఞులగుచు
మహితేంద్రియప్రాణమయకోశమగు నాత్మఁ, డనిపల్కుదురు కొందఱజ్ఞులగుచు
మంజులతరమనోమయకోశ మగు నాత్మఁ, డని పల్కుదురు కొందఱ జ్ఞులగుచు
మానితవిజ్ఞానమయకోశ మగు నాత్మఁ, డని పల్కుదురు కొందఱ జ్ఞులగుచు
తే. సుప్తియం దేమితోఁపని శూన్యతత్త్వ
మాత్మఁ డని పల్కుదురు కొందఱ జ్ఞులగుచు
రూఢి నానందమయకోశరూపుఁ డగు మ
హాత్ముఁ డని పల్కుదురు కొందఱ జ్ఞులగుచు. 23

టీక. కొందఱు = కొంతమంది, అజ్ఞులగుచుఁ = తెలివిమాలినవారై, మహనీయ = పూజ్యతతోడ, కలిత = కూడిన, అన్నమయకోశము = అన్నమయకోశమే, ఆత్ముఁడగు నని = పరబ్రహ్మ మగు నని, పల్కుదురు = చెప్పుదురు, కొందఱు = కొంతమంది, అజ్ఞులగుచుఁ = అవివేకులై

సహిత = ఒప్పిదము లగు చున్న, ఇంద్రియ = కర్మేంద్రియమయ మైన, ప్రాణమయ = పంచప్రాణ మయ మయిన, కోశ = ప్రాణమయకోశమే, ఆత్ముఁ డగు నని = పరమాత్ముఁ డగు నని, పల్కుదురు= వచింతురు. కొందఱు = కొంతమంది, అజ్ఞులగుచుఁ = వివేకహీనులై, మంజులతర = మిగుల నొప్పిద మయిన, మనోమయకోశము = మనోమయకోశమే, ఆత్ముఁ డగు నని = సచ్చిదానందస్వరూపుఁ డవు నని, పల్కుదురు=వచింతురు. కొందఱు=కొంతమంది, అజ్ఞులగుచుఁ = మూఢులై, మానిత= కొనియాడఁ దగిన, విజ్ఞానమయకోశము=విజ్ఞానమయకోశమే, ఆత్ముఁ డగు నని = పరమాత్ముఁ డగు నని, పల్కుదురు= నొడువుదురు కొందఱు=కొంతమంది, అజ్ఞులగుచుఁ =తెలివిలేనివారై, సుషుప్తియందుఁ =నిద్రయందు, ఏమితోఁచనిశూన్యతత్త్వము=ఏమియు గోచరింపని స్వరూపమే, ఆత్ముఁ డని పల్కుదురు = పరిపూర్ణ బ్రహ్మ మని వచింతురు. కొందఱు = కొంతమంది, అజ్ఞులగుచుఁ = జ్ఞానహీనులై, గూఢిఁ =సగ్యముగా, మహాత్ముఁడు = పరబ్రహ్మము, ఆనందమయకోశరూపుఁ డగు నని = ఆనందమయకోశస్వరూపుఁ డగు నని, పల్కుదురు = చెప్పుదురు.

తా. ఓ ఆంజనేయా! కొందఱు వివేకహీనులు పూజ్యతతోఁ గూడిన అన్నమయకోశమే పర బ్రహ్మ మగు నని చెప్పుదురు, కొంతమందిమూఢులు కర్మేంద్రియములతోఁ గూడిన ప్రాణమయకోశమే పరమాత్ముఁ డగు నని వచింతురు, కొంతమందిబుద్ధిహీనులు మనోమయకోశమే సచ్చిదానందస్వరూపుఁ డని పల్కుదురు, కొంతమందిమూఢులు విజ్ఞానమయకోశమే పరమాత్ముఁ డని చెప్పుదురు, కొందఱు బుద్ధి హీనులు నిద్రయం దేమితోఁచనిశూన్యతత్త్వము పరిపూర్ణబ్రహ్మ మని చెప్పెదరు, మఱికొందఱు మూఢులు బ్రహ్మము ఆనందమయకోశస్వరూపుఁ డగు నని చెప్పెదు రని తాత్పర్యము

వ. మఱియును. 23

టీక మఱియును = వెండియును

క. పరమాణు వనుచు మధ్యమ,పరిమాణుం డనుచు విభుఁడు పరుఁ డనుచు ని
ద్ధరఁ గొందఱు వాదింతురు, పరిపూర్ణాత్ముఁ డని యెఱుఁగు ప్రాజ్ఞత లేమిన్.

టీక. ఇద్ధర = ఈ భూమియందు, కొందఱు = కొంతమంది, పరిపూర్ణాత్ముఁడని = అంతట నిండి యుండెడు స్వరూపము గలవాఁ డని, ఎఱుంగుప్రాజ్ఞత = తెలియందగినట్టినేర్పు, లేమిఁ = లేనందున, పరమాణువనుచుఁ = త్రసరేణువులో ఐదవభాగ మైన పరమాణుస్వరూపుఁ డని, మధ్యమపరిమాణుం డనుచుఁ = త్రసరేణువులో మూఁడవభాగ మైన మధ్యమపరిమాణస్వరూపుఁ డని, విభుఁడు = సర్వ మూర్తద్రవ్యసంయోగ మని – ద్రవ్యము లనఁగా పృథివ్యాప్తేజోవాయ్వాకాశకాలదిగాత్మమనస్సులు తొమ్మిదియు ద్రవ్యములు, వానిలో పృథివ్యప్తేజోవాయుమనస్సులు మూర్తద్రవ్యములు, వానిసంయో గము గలది విభుద్రవ్యము, అట్టివాఁ డాత్మ యనుట, పరుఁడనుచుఁ = పరాహంకారకరీతుఁ డని – లేక ప్రకృతికి పరుఁ డని, వాదింతురు = తర్కింతురు – అనఁగా నైయాయిక వైశేషిక పాంచరాత్రాగులు పరిపూర్ణజ్ఞానము లేనందున పరమాత్మ పరమాణు వని మధ్యమపరిమాణుఁ డని విభు వని బహుభంగులం బలుకుదు రనుట

పరమాణు మధ్యమపరిమాణములనిర్ణయము—'జాలసూర్యమరీచిస్థ' సూక్ష్మతమరేణువు త్ర్యణుక మని త్రసరేణు వని చెప్పఁబడును, దాని మూఁడవభాగము మధ్యమపరిమాణ మని ద్వ్యణుక మని చెప్పఁ బడును, ఆ ద్వ్యణుకముయొక్క రెండవభాగము పరమాణువు ద్వ్యణుకపరమాణువులు రెండును పృథ్వీ

విషయములు; అది యెట్లనఁగా, ఈ ద్వ్యణుకము ఏతత్పరమాణుద్వయసంయోగమువలన ఆ ద్వ్యణుకమునకంటె వేఱనియు, ఈ పరమాణువు ఏతత్పరమాణుగతవిశేషమువలన ఆ పరమాణువునకంటె వే ఱనుట అనుమానసాధ్యములు గాని ప్రత్యక్షసాధ్యములు గావు కావున మధ్యమపరిమాణ మనఁగా త్ర్యణుకపరమాణువులమధ్యనుండు ద్వ్యణుకము, ఈ న్యాయమువలన ఆత్మపరమాణుస్వరూప మనియు, మధ్యమపరిమాణస్వరూపమనియు కొందఱు వక్కాణింతురు, నిత్యద్రవ్యగతము లగు విశేషము లనంతములు గావున తత్తన్నిత్యద్రవ్యవిశేషములు వేఱువేఱుగా నగుచున్నవి అంత్యావయవము పరమాణు వనియు అది నిరవయవ మనియు మధ్యమపరిమాణము ద్వ్యణుక మని సిద్ధించుచున్నది ఈ పరమాణుద్వ్యణుకనిర్ణయము నయ్యాయికమతసిద్ధాంతము మఱియు, "శ్లో॥ జాలసూర్య మరీచిస్థం యత్సూక్ష్మం దృశ్యతే రజః। తస్య షష్ఠతమోభాగ స్త్ర్యణురి త్యభిధీయతే। తస్య షష్ఠతమోభాగః పరమాణుః ప్రకీర్తితః" అనఁగా గృహరంధ్రములయందు వ్యాపించిన సూర్యకిరణములోఁ దిరుగుచుండెడు సూక్ష్మతమ రేణువులో ఆఱవభాగముగాని యెనిమిదవభాగముగాని అణు వగును, అట్టి యణువులో ఆఱవభాగముగాని యెనిమిదవభాగముగాని పరమాణువు, ఆ పరమాణువులో సగము మధ్యమపరమాణువు గనుక పరమాత్మ యట్టిస్వరూపుఁ డని కొందఱ యభిమతము.

తా. కొందఱు అంతట నిండియుండెడువాఁ డని యెఱుఁగునట్టి తెలివి లేనందున త్రసరేణువులలో ఐదవభాగ మయిన పరమాణుస్వరూపుఁ డనియును, త్రసరేణువులలో మూఁడవభాగ మయిన మధ్యమపరిమాణస్వరూపుఁ డనియును, సమస్తమూర్తద్రవ్యములయందు కూడినవాఁ డనియును, (నవద్రవ్యములలో పృథివ్యప్తేజోవాయుమనస్సులు మూర్తద్రవ్యములు, వీటితో సంయోగము గలది విభుద్రవ్యము, ఇట్టి విభుద్రవ్యము ఆత్మ యనియును) ప్రకృతికంటె నితర మయినవాఁ డనియును తర్కింతు రని తాత్పర్యము (అనఁగా నైయాయికులు త్రసరేణువులో ఐదవభాగ మయిన పరమాణుస్వరూపుఁ డనియు, కణాదుఁడు మొదలగు వైశేషికులు త్రసరేణువులో మూఁడవభాగ మైన మధ్యమపరిమాణస్వరూపుఁ డనియు, పాంచరాత్రులు విభుఁ డనియు తర్కింతు రని భావము )

తే. మఱియుఁ జిద్రూపుఁ డనుచుఁ గొందఱు గణింతు
రలఘుచిదచిత్స్వరూపకుం డండ్రు గొంద
ఱరసి సద్రూపుఁ డనుచుఁ గొందఱు వచింతు
రాత్మ నెఱుఁగక నిజవిమోహాంధు లగుచు. ౭౫

టీక. ఆత్మన్ = పరబ్రహ్మమును, ఎఱుఁగక = తెలియక, నిజవిమోహాంధులగుచున్—నిజ = తమయొక్క, విమోహ = అజ్ఞానముచేత, అంధులగుచున్ = గ్రుడ్డివారై, మఱియున్ = ఇంకను, కొందఱు = కొంతమంది, చిద్రూపుఁ డనుచున్ = జ్ఞానస్వరూపుఁ డని, గణింతురు = ఎన్నుదురు, కొందఱు = కొంతమంది, అలఘు = గొప్ప యగు, చిత్ = జ్ఞానమును, అచిత్ = అజ్ఞానమును, స్వరూపకుండు = ఆకృతిగాఁ గలవాఁడు, అండ్రు = అందురు, కొందఱు = కొంతమంది, అరసి = విచారించి, సద్రూపుఁ డనుచున్ = త్రయావస్థలయందు నశింప కుండు రూపము గలవాఁ డని, వచింతురు = పలుకుదురు.

తా. ఓ ఆంజనేయా! తమయొక్క అజ్ఞానముచేత గ్రుడ్డివారగు మఱికొందఱు పరబ్రహ్మమును తెలియఁజాలక జ్ఞానస్వరూపుఁడే పరబ్రహ్మ మని యెన్నుదురు, కొందఱు గొప్పవి యగు జ్ఞానాజ్ఞానములను స్వరూపముగాఁ గలవాఁ డని చెప్పుదురు, కొంతమంది త్రయావస్థలయందు నశింపనిరూపము గలవాఁ డని పలుకుదు రని తాత్పర్యము.

క. కావున సచ్చిత్సుఖమయు, భావాతీతాద్వయాత్మకపరతత్త్వము సం
భావించి తెలియఁజెప్పెదఁ, గేవలమతిచే గ్రహింపు కేసరినందనా. ౭౩

టీక కేసరినందనా = ఆంజనేయా, కావునన్ = కనుక, సత్ = సద్రూపుఁడును, చిత్ = జ్ఞానస్వరూపుఁడును, సుఖమయు = ఆనందస్వరూపుఁడు నగుటయు, భావ = ఊహను, అతీత = కడచిన, అద్వయాత్మ = స్వాతిరిక్తశూన్యరూపము గల, పరతత్త్వమున్ = పరమాత్మను, సంభావించి = లెస్సగా నూహించి, తెలియఁజెప్పెదన్ = తెలియునట్లు వచించెదను, కేవలమతిచేన్ = చిత్తైకాగ్రతచేత, గ్రహింపుము = తెలిసికొనుము

తా ఓ ఆంజనేయా! పరమాత్మవిషయమై మూఢత్వముచేత యనేకులు యనేకాభిప్రాయములు గలిగియుండుటవలన సద్రూపుఁడును జ్ఞానస్వరూపుఁడును ఆనందస్వరూపుఁడు నగుటయు జ్ఞానమును వదలి తనకంటె నతిరిక్తము లేని రూపము గల పరమాత్మను బాగుగా నూహించి తెలియునట్లు చెప్పెదను, స్థిరచిత్తుఁడవై తెలిసికొను మని తాత్పర్యము

మహాస్రగ్ధర. ఘటము వీక్షించువాఁ డేగతిని ఘటము దాఁ గాక వేఱైనభంగిం
బటుదేహద్రష్టనై చిత్పరమసుఖమయబ్రహ్మ మైనట్టి నే నె
న్నటికిన్ దృశ్యంబు మాయానగరసమమసన్నామరూపాత్మకంబున్
గుటిలావిద్యాకృతం బాకులగ మగు తనూకోశముం గాను వత్సా.

టీక వత్సా = బాలుఁడా, ఘటమున్ = కుండను, వీక్షించువాఁడు = అవలోకించు పురుషుఁడు, ఏగతిన్ = ఏప్రకారము, ఘటము = కుండ, తాఁగాక = తానుగాక, వేఱైనభంగిన్ = భిన్నుఁడైనట్లు, పటుదేహద్రష్టనై—పటు = దృఢ మైన, దేహ = శరీరమునకు, ద్రష్టనై = సాక్షినై, చిత్ = జ్ఞానస్వరూపమయిన, పరమ = శ్రేష్ఠ మైన, సుఖమయ = ఆనందరూప మైన, బ్రహ్మము = పరమాత్మ, ఐనట్టి నే నెన్నటికిన్ = ఐన నే నెప్పుడును, దృశ్యంబును = కనఁబడునదియు, మాయానగరసమమును = గంధర్వపురముతో సరియైనదియును, అసన్నామరూపాత్మకంబును—అసత్ = ఎల్లప్పుడు నుండని, నామ = పేళ్లును, రూప = స్వరూపములే, ఆత్మకంబును = రూపముగాఁ గలదియును, కుటిలావిద్యాకృతంబును—కుటిల = వక్రగతి గల, అవిద్యా = కారణోపాధి యైన యవిద్యచేత, కృతంబును = కల్పిత మైనదియును, ఆకులదము = వ్యాకులము నిచ్చునట్టిదియు నైన, తనూకోశమును = స్థూలోపాధి, కాను = నేను గాను

తా బాలుఁడా ఆంజనేయా! కుండను చూచువాఁడు తాను కుండ గాక కుండకంటె భిన్నుఁడైనట్లు దృఢ మైన శరీరమును చూచునట్టి జ్ఞానస్వరూపమును ఆనందస్వరూపమును పరబ్రహ్మమును నైన నేను సర్వకాలములయందుఁ గనఁబడునదియును, గంధర్వపురముతో సరి యైనదియును, యెల్లప్పుడు నుండని నామరూపములు గలదియును, కుటిల మగు కారణోపాధి యైన యవిద్యచేత కల్పింపఁబడినదియును వ్యాకులము నిచ్చునట్టిదియును నైన తనూకోశము (స్థూలోపాధి) నేను గా నని తాత్పర్యము

మహాస్రగ్ధరావృత్తలక్షణము॥ స్తతనస్రాగల్వ్విరించాష్టవిరతులు మహాస్రగ్ధరం జెప్ప సుప్పాన్.
తా॥ సతతనసరరగ గణములును ప్రతిపాదమున తొమ్మిదవయక్షరమునను అచ్చట నుండి యెనిమిదవయక్షరమునను యతులు రెండు గలుగఁ జెప్పిన మహాస్రగ్ధరావృత్త మనుటం

మ. సమతన్ మేను నెఱుంగుచందమున నీసర్వేంద్రియప్రాణచి
త్తమనోహంకృతులం గనుంగొనుచుఁ జైతన్యంబు నై యొప్పు నే

ను మరుత్పుత్త్ర తదింద్రియాదికము నెంకేదుం గాను నా కింక ల
క్ష్యములౌ వా నిజని ప్రణాశములు జాగ్రత్సుప్తులం జారయున్. ౭౮

టీక మరుత్పుత్త్ర=ఆంజనేయా, సమతన్ = భేదము లేమిచేత, మేనున్ = శరీరమును, ఎఱుంగు చుండమునన్ = తెలిసికొనునట్లు, ఈ = కనఁబడు చున్న, సర్వ = సమస్తము లైన, ఇంద్రియ = దశేంద్రియములను, ప్రాణ = పంచప్రాణములను, చిత్త = చంచలాత్మక మైన చిత్తమును, మనః = సంశయాత్మక మైన మనస్సును, అహంకృతులన్ = కర్తవ్యాత్మక మైన యహంకారమును, కనుంగొనుచున్ = చూచుచు, చైతన్యంబునై = పరబ్రహ్మస్వరూపినై, ఒప్పునేను = ఒప్పెడి నేను, తదింద్రియాదికమున్ = ఆశరీరేంద్రియప్రాణాదులను, ఎందుంగాను = ఎప్పుడు కానేరను, నాకున్ = పరబ్రహ్మము నైన నాకు, అరయన్ = శోధింపఁగా, ఇంకన్ = ఇఁక మీఁద, వానిజనప్రణాశములు = ఆ శరీరేంద్రియప్రాణాదుల యుత్పత్తిలయములు, జాగ్రత్సుప్తులయందున్ = మేలుకొనుట నిద్రపోవుటలయందు, లక్ష్యముల్ = చూడఁబడిన వగును

తా ఆంజనేయా! అభేదముచేత శరీరమును తెలిసికొనునట్లు యీ కనఁబడు చున్న దశేంద్రియములను పంచప్రాణములను చంచలాత్మక మయిన చిత్తమును సంశయాత్మక మయిన మనస్సును కర్తవ్యాత్మక మయిన యహంకరమును చూచుచు పరబ్రహ్మస్వరూపినై ప్రకాశించెడి నేను ఆ శరీరేంద్రియప్రాణాదులు యెప్పుడును కానేరను, విచారించఁగా పరబ్రహ్మమైన నాకు ఆ శరీరేంద్రియ ప్రాణాదులయొక్క యుత్పత్తిలయములు (పుట్టుట నశించుట అను,వి) మేలుకొనుట నిద్రపోవుటల యందుఁ జూడఁబడిన వగు నని తాత్పర్యము

వ. అదియునుం గాక ౭౯

సీ. నామందిరం బిది నాసువర్ణం బిది, నాతల్ప మిది యని నరుఁడు దాను
దన్మందిరసువర్ణతల్పంబులకు విలక్షణసాక్షి నై యవి గాలికగిది
నాశరీరం బిది నాయింద్రియము లివి, నాప్రాణ మిది యిది నామనంబు
నాయహంకృతి యిది నాబుద్ధి యిది యని, బహువిధదృశ్యరూపముల నెల్ల
తే. నాయవి యటంచుఁ దెలిసి నిర్ణయము సేయ, నేను దత్తచ్ఛరీరాదినిఖిలవస్తు
సంగమునకు విలక్షణసాక్షి నగుదుఁ, గాని యెందెద్ది యును గాను వానరేంద్ర.

టీక వానరేంద్ర = ఆంజనేయా, నరుఁడు = మనుజుఁడు, నామందిరం బిది = ఇది నాయిల్లు, నాసువర్ణం బిది = ఇది నాధనము, నాతల్ప మిది యని = నాభార్య యిది యని, ॥ని॥ 'తల్పం శయ్యాట్ట దారేషు' అని అమరము, తాను=ఇట్లనెడు తాను, తన్మందిరసువర్ణతల్పంబులకున్ = అగృహధనతల్పములకు, విలక్షణ = వ్యతిరిక్తుఁ డైన, సాక్షియై = కూటస్థుఁడై, అవిగానిపగిదిన్ = ఆ గృహధనతల్పములు తాఁ గానట్లు, నాశరీరం బిది = ఇది నాదేహము, ఇవి నాయింద్రియములు = ఇవి నానేత్రశ్రోత్రాదులు, ఇది నాప్రాణము = ఇది నా ప్రాణవాయువు, ఇది నామనంబు = ఇది నా మనస్సు, ఇది నాయహంకృతి = ఇది నాగర్వము, నాబుద్ధి యిది యని = ఇది నా తెలివి యని, బహువిధ = నానావిధము లైన, దృశ్యరూపముల నెల్లన్ = చూడంబడు నాకారముల నన్నిటిని, నాయవి యటంచున్ = నాసంబంధ మైన వని, తెలిసి = ఎఱిఁగి, నిర్ణయము = నిశ్చయమును, చేయునేను = కావించెడు నేను, తత్తత్ = ఆయాయి, శరీరాది = దేహము మొదలైన, నిఖిలవస్తు = సమస్తవస్తువులయొక్క, సంఘమునకున్ = సమూహా

హూనకు, విలక్షణసాక్షి నగుదుఁగాని = వ్యతిరిక్తమైన కూటస్థుఁడ నగుదును గాని, అందుఁగాక = ఆ వస్తు సంఘమందు, ఎద్దియును గాను = నే నేదియుఁ గాను

తా॥ వానరేంద్రా! మనుష్యుఁడు ఇది నాయిల్లు, ఇది నాధనము, ఇది నా భార్య యని తాను ఆ గృహతల్పములకు వ్యతిరిక్తుఁడయిన కూటస్థుఁడై ఆ గృహధనతల్పము తానుగానట్లు, ఇది నా ప్రాణవాయువు, ఇది నామనస్సు, ఇది నాగర్వము, ఇది నాబుద్ధి, ఇది నా తెలివి యని నానావిధము లయిన చూడఁబడు నాకారము లన్నిటిని నాసంబంధమైనవని తెలిసి నిశ్చయము చేయుచు నేను అహంకారాదులు మొదలయిన సమస్తవస్తువులయొక్క సమూహమునకు వ్యతిరిక్తమగు కూటస్థుఁడ నగుదును గాని ఆ వస్తు సమూహమునందు నేదియు నేను గా నని తాత్పర్యము.

తే॥ బుద్ధ్యహంకారములతోడి పొందు గలిగి, నేను నే ననువాఁడను నేను నన్ను
నేను నే ననువాఁడను నే నటంచుఁ, దెలియఁబడువృత్తి నెఱిఁగెడి తెలివి నేను.

టీక. బుద్ధి = ప్రజ్ఞతోడ, అహంకారములతోడి = అభిమానముతోడ, పొందుగలిగి = చేరిక గలిగి, నేను నేననువాఁడనుజుమ్ము = అహమ్మహమ్మనువాఁడను నేనే సుమా నేను నే ననువాఁడను నే నటంచుఁగా = అహమ్మహమ్మని పల్కువాఁడను నేనే యని, తెలియఁబడు వృత్తిఁగా = ఎఱుంగఁబడు చున్నవృత్తిని, ఎఱిఁగెడి తెలివి = తెలిసికొనెడు జ్ఞానము, నేను = నేనేసుమా

తా॥ బుద్ధితోడను అహంకారముతోడను చేరి నేను నేననువాఁడను నేనే సుమా, నేను నేను అని పలుకువాఁడను నేనే యని తెలియఁగాను చున్నవృత్తిని తెలిసికొనెడుజ్ఞానము నేనేసుమా యని తా.

సీ॥ శ్రవణేంద్రియంబుచే వివిధశబ్దంబుల, నేర్పఱించి యెఱుంగు నెఱుక నేను
స్పర్శేంద్రియంబుచే స్పర్శగుణంబుల, నేర్పఱించి యెఱుంగు నెఱుక నేను
నేత్రేంద్రియంబుచే నిఖిలరూపంబుల, నేర్పఱించి యెఱుంగు నెఱుక నేను
రసనేంద్రియంబుచే రసముల నన్నింటి, నేర్పఱించి యెఱుంగు నెఱుక నేను
తే॥ ఘ్రాణకరణంబుచే సర్వగంధములను, నేర్పఱించి యెఱిఁగెడి యెఱుక నేను
ఘనమనముచేత నఖిలసంకల్పములను, నేర్పఱించి యెఱిఁగెడి యెఱుక నేను

టీక. శ్రవణేంద్రియంబుచేఁగా = శ్రోత్రేంద్రియంబుచేత, వివిధశబ్దంబులఁగా = వర్ణాత్మక ధ్వన్యాత్మకము లైన సమస్తశబ్దములను, ఏర్పఱించి = విభాగించి, ఎఱుంగు నెఱుక నేను = తెలిసికొనెడు తెలివిని నేనుసుమా, స్పర్శేంద్రియంబుచేఁగా = త్వగింద్రియంబుచేత, స్పర్శగుణంబులఁగా = మృదుకఠినశీతోష్ణమిశ్రము లనెడు స్పర్శభేదములను, ఏర్పఱించి = విభజించి, ఎఱుంగు నెఱుక నేను = ఎఱిఁగెడు తెలివిని నేనేసుమా, నేత్రేంద్రియంబుచేఁగా = చక్షురింద్రియములచేత, నిఖిలరూపంబులఁగా = రక్తము శ్వేతము నీలము పసుపు ఆకుపసుపు మిశ్రము హ్రస్వము దీర్ఘము స్థూలము సూక్ష్మమని పదివిధము లైన రూపములను, ఏర్పఱించి = ఏర్పఱచి, ఎఱుంగు నెఱుక నేను = తెలిసికొనుజ్ఞప్తి నేనేసుమా, రసనేంద్రియంబుచేఁగా = జిహ్వేంద్రియంబుచేత, రసములనన్నింటిఁగా = కట్వామ్లలవణమధురతిక్తకషాయము లనెడు షడ్రసములను, ఏర్పఱించి = విభాగముచేసి, ఎఱుంగు నెఱుక నేను = తెలిసి గ్రాహ్యపఱచుకొనెడు జ్ఞానమును నేనేసుమా, ఘ్రాణకరణంబుచేఁగా = నాసికేంద్రియముచేత, సర్వగంధములఁగా = సుగంధ దుర్గంధ మిశ్రగంధములను, ఏర్పఱించి = భిన్నపఱచి, ఎఱిఁగెడి యెఱుక నేను = తెలిసికొనెడుజ్ఞప్తి

నేనేసుమా, ఘనముచేతన్ = గొప్పదైన మనస్సుచేత, అఖిలసంకల్పములన్ = ఎల్లతలంపులను, ఏర్పఱించి = విభజించి, ఎఱింగెడి యెఱుక నేను = తెలిసికొనెడు జ్ఞానము నేనేసుమా.

తా. శ్రోత్రేంద్రియముచేత ధ్వన్యాత్మక వర్ణాత్మకము లయిన సమస్తశబ్దములను (ధ్వన్యాత్మకము లనగా భేరీమృదంగాదులు, వర్ణాత్మకము లనఁగా సంస్కృతభాషాదులు) విభాగించి తెలిసికొనెడు తెలివిని నేనేసుమా, ముక్కుచేత సుగంధ దుర్గంధ మిశ్రగంధములను యేర్పఱచి తెలిసికొనెడు జ్ఞానమును నేనే సుమా, త్వగింద్రియముచేత మృదుకఠినశీతోష్ణమిశ్రము లనెడు స్పర్శభేదములను విభజించి తెలిసికొనెడు తెలివిని నేనేసుమా, నేత్రములచేత సమస్తరూపములను యేర్పఱచి తెలిసికొను జ్ఞప్తిని నేనే సుమా, నాలుకచేత షడ్రసములను విభగించి తెలిసికొనుజ్ఞానము నేనేసుమా, గొప్పదైన మనస్సుచేత తలంపుల నన్నిటిని విభజించి తెలిసికొనెడు జ్ఞానమును నేనేసుమా యని తాత్పర్యము.

క. పలుకుల దానాదానం,బుల గమనాగమనములను మూత్రపురీషం
బుల రాకడపోకడలను, దెలియు తెలివి నేను సర్వదృక్కనుటచేన్. ౮౩

టీక. సర్వదృక్కనుటచేన్ = సమస్తాంతరబాహ్యవ్యాపారసాక్షి నగుటచేత, పలుకులన్ = వాగింద్రియవ్యాపారము లైన శుభశబ్దాపశబ్దమిశ్రశబ్దములను, దానాదానంబులన్ = హస్తేంద్రియవ్యాపారము లైన యిచ్చుట పుచ్చుకొనుటలను, గమనాగమనములన్ = పాదేంద్రియక్రియ లైన రాకపోకలను, మూత్రపురీషంబుల రాకడపోకడలను = పాయూపస్థేంద్రియవిషయము లైన మలమూత్రసావముల రాకడపోకడలను, తెలియు తెలివి నేను = ఎఱిఁగెడు నెఱుకను నేనేసుమా

తా. సమస్తాంతర బాహ్యవ్యాపారసాక్షి నగుటచేత వాగింద్రియ (నోరు) వ్యాపారము లైన శుభశబ్దాపశబ్దమిశ్రశబ్దములను, హస్తేంద్రియవ్యాపారము లైన యిచ్చుట పుచ్చుకొనుటలను, పాదేంద్రియక్రియ లగు రాకపోకలను, పాయూపస్థేంద్రియములకు విషయము లగు మలమూత్రసావముల రాకపోకడలను తెలిసికొనుజ్ఞానము నేనని తాత్పర్యము

క. సర్వోపాధిస్థుఁడ నై, సర్వవ్యాపారములు వెసనం జేయుచుఁ ద
త్సర్వమునంటక వెలిఁగెదు, సర్వాత్ముఁడ నేన సుమ్ము సజ్జనతిలకా. ౮౪

టీక. సజ్జనతిలకా = సత్పురుషశ్రేష్ఠుఁడా, సర్వోపాధిస్థుఁడనై — సర్వ = సమస్తము లైన, ఉపాధిస్థుఁడనై = స్థూలసూక్ష్మకారణదేహములయం దున్నవాఁడనై, సర్వవ్యాపారములు = సర్వేంద్రియక్రియలను, వెసన్ = శీఘ్రముగా, చేయుచున్ = ఒనర్చుచు, తత్సర్వమున్ = ఆ చేయఁబడిన గంతటిని, అంటక = స్పృశింపక, వెలిఁగెడు సర్వాత్ముఁడన్ = ప్రకాశించెడు సర్వవ్యాపకుఁడను, నేనసుమ్ము = నేనే సుమా

తా. ఓయి సత్పురుషులలో శ్రేష్ఠుఁడ వగు యాంజనేయా! సమస్తము లైన స్థూలసూక్ష్మకారణదేహములం దున్నవాఁడనై సమస్తమైన యింద్రియములయొక్క క్రియలను చేయుచు ఆ చేయఁబడిన దంతటిని యంటక ప్రకాశించెడు బ్రహ్మము నేనేసుమా యని తాత్పర్యము.

క. అపరిచ్ఛిన్నావ్యయనిత్యపరంజ్యోతిర్మయుఁడ నై శశిహుతభు
క్తపనాదుల వెలిఁగించుచు, నెపు డంతట నొక్కరీతి నేను వెలుఁగుదున్. ౮౫

టీక. అపరిచ్ఛిన్న = సంపూర్ణమైన, అవ్యయ = తఱుగు లేని, నిత్య = శాశ్వతమైన, పరంజ్యోతిర్మయుండనై = ప్రకృతిపరమైన తేజోరూపుఁడనై, శశిహుతభుక్తపనాదులన్ — శశి = చంద్రుని, హుత

భుక్ = అగ్నిహోత్రుని, తపన = సూర్యుని, ఆదులన్ = మొదలు గాఁగలవారిని - అనఁగా సమస్తతేజో మూర్తులను, వెలిఁగించుచున్ = సచ్చిదానందస్వరూపుఁడ నైన నేను, ఒక్కరీతిన్ = ఏకస్వరూపముగా, వెలుఁగుదున్ = తేజరిల్లుచుందును

తా. సచ్చిదానందస్వరూపుఁడ నైన నేను సంపూర్ణ మైనదియును శాశ్వత మైనదియు నగు ప్రకృతికంటె వేఱైన తేజస్సే రూపముగాఁ గలవాఁడనై చంద్రుఁడు సూర్యుఁడు అగ్నిహోత్రుఁడు మొదలుగాఁ గల సప్తతేజోమూర్తులను ప్రకాశింపఁజేయుచు సర్వకాలములయందును సర్వదేశములయందును యేకస్వరూపముగాఁ బ్రకాశించుచుందు నని తాత్పర్యము.

క. ఔపాధికనామంబులు, రూపంబులు లేవు నాకు రూఢిగ సకల
వ్యాపారముఁ గను సర్వ,వ్యాపకచిన్మయుఁడ నేను వాయుతనూజా. ౬౨

టీక. వాయుతనూజా = వాయుపుత్త్రా, ఔపాధికనామంబులు—ఔపాధిక = ప్రాకృతము లైన వ్యష్టిసమష్ట్యాత్మక స్థూలసూక్ష్మకారణోపాధులయొక్క, నామంబులు = విశ్వతైజసప్రాజ్ఞజీవవిరాడ్ధిరణ్యగర్భావ్యాకృతేశ్వరనామములును, రూపంబులు = ఆ మాయోపాధులవలనఁ గలిగెడు రూపములును, రూఢిగన్ = సత్యముగా, నాకు లేవు=నాకు గలుగవు (ఎందువల్ల ననఁగా) నేను=పరమాత్మస్వరూపుఁడ నైన నేను, సకలవ్యాపారమున్ = చతుర్దశేంద్రియవ్యాపారములను, కను = చూచుచుండెడు, సర్వ = అంతర్బాహ్యప్రపంచమందు, వ్యాపక = ఆవరించియుండెడి, చిన్మయుఁడన్ = జ్ఞానస్వరూపుఁడను - అనఁగా నేను సర్వసాక్షి నైనందున వుపాధిజన్యము లగు నామరూపములు నాకు లే దని భావము.

తా వాయునందనా! ప్రాకృతము లయిన వ్యష్టిసమష్ట్యాత్మక స్థూలసూక్ష్మకారణోపాధులయొక్క విశ్వ తైజస ప్రాజ్ఞ జీవ విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృత ఈశ్వర నామములును, మాయోపాధులవలన గలిగిన రూపములును వాస్తవముగా నాకు లేవు, ఎందువల్లనంటె పరమాత్ముఁడగు నేను చతుర్దశేంద్రియ వ్యాపారములను చూచుచు అంతట (అంతర్బాహ్యప్రపంచమందు) వ్యాపించి యుండు జ్ఞానస్వరూపుఁడను, (అనఁగా సర్వసాక్షి యయిన) నాకు వుపాధిజన్యము లగు నామరూపములు లే వని తాత్పర్యము

సీ. ఏను శరీరంబు గా నింద్రియంబులు, గాను బ్రాణమ్ములు గాను మనము
గాను జిత్తంబును గా నహంకారంబు, గాను శూన్యంబును గాను బుద్ధి
గాను దీర్ఘంబును గాను కుబ్జంబును, గాను స్థూలమును సూక్ష్మమును గాను
గా నతికృష్ణరక్తశ్వేతపీతవర్ణములును బంచభూతములు గాను

తే. గాను గా నను వాఁడును గాను వినుము, కాను గా నను వానిని గాంచువాఁడ
గాంచువానిని సతతంబుఁ గాంచువాఁడ, నేను గా నను వికృతులు లేనివాఁడ.

టీక. వినుము = ఆకర్ణింపుము, ఏను = జ్ఞానస్వరూపుఁడ నైన నేను, శరీరంబుగాను = దేహమును గాను, ఇంద్రియంబులుగాను = జ్ఞానకర్మేంద్రియములుగాను, ప్రాణమ్ములుగాను = ప్రాణపంచకములు గాను, మనముగాను = సంకల్పరూప మైన మనస్సును గాను, చిత్తంబునుగాను = చంచలస్వభావ మైన చిత్తమును గాను, అహంకారంబుగాను=అభిమానాత్మక మగు నహంకారమును గాను, శూన్యంబును గాను = లేనిదియును గాను, బుద్ధిగాను = నిశ్చయాత్మక మైన బుద్ధిని గాను, దీర్ఘంబును గాను = పొడుగును గాను, కుబ్జంబును గాను = పొట్టియును గాను, స్థూలమును సూక్ష్మమును గాను= లావును సన్నమును గాను, అతి=

మిక్కిలి, కృష్ణ=నలుపు, రక్త=ఎఱుపు, శ్వేత = తెలుపు, పీత = పసుపు, (అనెడు) వర్ణములును గాను = రంగులునుగాను, పంచభూతములుగాను = భూజలాగ్నివాయుగగనములును గానేగను, కాను గా నను వాఁడనుగాను = శరీరాదులు నేను గాను నేనుగా ననెడు వాఁడను గాను - అనఁగా ద్వైతవృత్తి గల జీవుఁడ నేఁ గా ననుట, కానుగాననువానిని గాంచువాఁడన్ = శరీరాదులు నేనుగాను కా ననెడువానిని జూచువాఁడను - అనఁగా జీవసాక్షి ననుట, కాంచువానిని సతతంబు గాంచువాఁడన్ = చూచు చుండునట్టివాని నెల్లప్పుడు చూచువాఁడను - అనఁగా సాక్షికిసాక్షి ననుట, కాను గా నను వికృతులు లేనివాఁడన్ = సర్వము నేను గాను అవుదు నను వికారములు లేనివాఁడను - అనఁగా అవును గా దనెడు వికారములు గలది ప్రకృతి గాన ఆ ప్రకృతిధర్మములు లేనివాఁడ నని భావము

తా॥ ఆకర్ణింపుము, జ్ఞానస్వరూపుఁడ నయిన నేను దేహ మును గాను, ఇంద్రియములు గాను, పంచ ప్రాణములు గాను, సంకల్పరూప మైన మనస్సును గాను, చంచలాత్మక మయిన చిత్తమును గాను, అభి మానాత్మక మగు నహంకారమును గాను, లేనిదియును గాను, నిశ్చయాత్మక మయిన బుద్ధిని గాను, పొడు గును గాను, పొట్టియును గాను, లావును గాను, సన్నమును గాను, నలుపు ఎఱుపు తెలుపు మొదలగు వర్ణములు గాను, పృథివ్యాది పంచభూతములు గానేరను, శరీరాదులు నేను గాను నేనుగా ననెడు జీవుఁ డను నేను కాను, శరీరాదులు నేను గాను నేను గా ననెడు జీవునకు సాక్షిని, చూచు చుండువానిని చూచువాఁడను (సాక్షికి సాక్షి ననుట) సర్వమును నేను గాను అవుదు నను వికారములు లేనివాఁడ నని తాత్పర్యము (అనఁగా సర్వము నే నవుదు గా దనునది ప్రకృతి,) అట్టి ప్రకృతికి యుండు ధర్మములు నాకు లే వని భావము

చ॥ అచలచరేంద్ర దీపము ఘటాదిపదార్థముల న్వెలుంగఁ జే
యుచును వెలుంగురీతిని సముజ్జ్వలమానసచక్షు రాదిదృ
శ్యచయము నెల్ల నాత్మవిషయంబులయందుఁ జరించునట్లు చూ
చుచు మఱి యేను సాక్షి నగుచు న్విలసిల్లుదు నిర్వికారతన్. ౮౦

టీక॥ అచలచరేంద్ర—అచల = పరబ్రహ్మమందు, చర = తిరిగెడు బ్రహ్మవిద్వరిష్ఠులలో, ఇంద్ర = శ్రేష్ఠుఁ డైన ఆంజనేయా, దీపము = దీపము, ఘటాదిపదార్థములన్ = కుండలు మొదలగువస్తువులను, వెలుంగఁజేయుచున్ = ప్రకాశింపఁజేయుచును, వెలుంగురీతిన్ = తానును ప్రకాశించునట్లు, సముజ్జ్వల = తెల్లగాఁ బ్రకాశించెడి, మానస = మనస్సు, చక్షు = నేత్రము, ఆది = మొదలయిన, దృశ్య=ఇంద్రియార్థ ములయొక్క, చయము నెల్లన్ = సంఘములనన్నింటిని, ఆత్మవిషయంబులయందున్ = తమపనులయందు, చరించునట్లు = తిరుగునట్లు, చూచుచున్ = వీక్షించుచు - అనఁగా సంచరింపఁజేయుచు, మఱి = మరల, ఏను= నేను, సాక్షినగుచున్ = ద్రష్టనై, నిర్వికారతన్ = మానసాదుల వికారముల సంటని యునికిచేత, విలసిల్లుదున్ = ప్రకాశింతును

తా॥ పరబ్రహ్మమునందు సంచరించెడు బ్రహ్మవిద్వరిష్ఠులలో శ్రేష్ఠుఁడ వగు యో యాంజనేయా! దీప మేలాగు కుండలు మొదలైనపదార్థము లను ప్రకాశింపఁ జేసి తానును ప్రకాశించునో ఆ ప్రకారము బాగుగాఁ బ్రకాశించెడి మనస్సు నేత్రము మొదలగు యింద్రియార్థములయొక్క సమూహముల నన్నిఁటిని తమపనులయందు సంచరింపఁజేయుచు నేను చూచువాఁడనై మానసాదులవికారము నంటని యునికిచేతఁ బ్రకాశింతు నని తాత్పర్యము.

మత్తకోకిల. భానుతేజము నాశ్రయించి స్వభావకర్మములందు నీ
మానవు ల్విహరించుకైవడి మత్ప్రకాశమునంటి ధీ
మానసేంద్రియము ల్స్వకీయసమస్తకార్యములం దొగిన్
మానకం జరియించు నెం దభిమానపూర్వకవృత్తులన్. ౮౯

టీక ఈ మానవులు = ఈ మనుష్యులు, భానుతేజమున్ = సూర్యతేజస్సును, ఆశ్రయించి = పొంది, స్వభావకర్మములందున్ = స్నానసంధ్యాద్యనుష్ఠానాది నైసర్గికక్రియలయందు, విహరించు కైవడిన్ = సంచరించునట్లు, మత్ప్రకాశమున్ — మత్ = కేవలాత్మనైన నాయొక్క, ప్రకాశమున్ = వెలుగును, అంటి = పొంది, ధీమానసేంద్రియములు — ధీ=బుద్ధియు, మానస = మనస్సును, ఇంద్రియములు = జ్ఞానకర్మేంద్రియములును, స్వకీయ = తనయొక్క, సమస్త=అశేషము లైన, కార్యములందున్ = నిశ్చయసంకల్పశబ్దస్పర్శచంచలత్వాభిమానములయందు, ఒగిన్ = క్రమముగా, మానకన్ = విరామము లేక, ఎందున్ = అంతట, అభిమానపూర్వకవృత్తులన్ = అభిమానసహితవర్తనములచేత - అనఁగా తలఁచుట నిశ్చయించుట వినుట లోనగు పనుల నేఁజేయు చున్నా నను నభిమానములచేత, చరియించున్ = తిరుగు చుండును

తా. మనుష్యులు సూర్యునియొక్క తేజస్సును పొంది స్నానసంధ్యాద్యనుష్ఠాననైసర్గికక్రియల యందు ప్రవర్తించువిధమున కేవలాత్మనైన నాయొక్క తేజస్సును పొంది బుద్ధియు మనస్సును జ్ఞానేంద్రియ కర్మేంద్రియములును తమయొక్క సమస్తకార్యములయందు (నిశ్చయసంకల్పశబ్దస్పర్శచంచలత్వాభిమానములయందు) విరామము లేక తలఁచుట నిశ్చయించుట వినుట మొదలగు పనుల నేఁ జేయు చున్నానను నభిమానములచేతఁ బ్రవర్తించు చుండు రని తాత్పర్యము

మత్తకోకిలలక్షణము॥ భావశాభరణాంక వీరసజాభ రేఫలఆదిరా। మావహంబుగ మత్తకోకిల యంద్రు దీని గవీశ్వరుల్. తా॥ రసజజభరగణములును పదింటయతియును మత్తకోకిలవృత్తమునకు నుండవలయు ననుట.

వ అట్లు గావున. ౯౦

టీక. అట్లుగావున = అటులఁ గిరుగుదును గనుక.

తే. ఎఱుకమఱపుల నెఱిఁగెడి యెఱుక నేను
విధినిషేధములను గాంచు విభుఁడ నేను
దర్క్యములనెల్లఁ దర్కించు తత్త్వ మేను
నేను నేనని వివరించు నేత నేను. ౯౧

టీక ఎఱుకమఱపులన్ = జ్ఞానాజ్ఞానములను, ఎఱిఁగెడిఎఱుకన్ = తెలిసికొనెడి జ్ఞానమును, నేను=నేనే సుమా, విధినిషేధములన్ — విధి = శాస్త్రవిహితకర్మములను, నిషేధములన్ = శాస్త్రవిరోధకర్మములను, గాంచువిభుఁడన్ — గాంచు = తెలిసికొనునట్టి, విభుఁడన్ = నాయకుఁడను, నేను = నేనే సుమా, తర్క్యములనెల్లన్ = వాదవిషయముల నన్నిటిని, తర్కించుతత్త్వము — తర్కించు = వాదించునట్టి, తత్త్వము = యథార్థవస్తువును - అనఁగా పరబ్రహ్మమును, ఏను = నేనే, నేను = నే నని, వివరించు నేతన్ = నేనే నే నని విశదపఱచునట్టి యధికారిని, నేనే=నేనే సుమీ.

తా॥ అట్లు దిరుగుటవలన జ్ఞానాజ్ఞానములను తెలుసుకొనుజ్ఞానము నే నగుచున్నాను, విధిశాస్త్ర విహితకర్మములను శాస్త్రవిరోధకర్మములను తెలుసుకొనునట్టి నాయకుఁడను నేనై యున్నాను, వాదముల వాదించునట్టి యథార్థవస్తు వగు పరబ్రహ్మము నేనై యున్నాను, నేను నేనని తెలియఁజెప్పు యధికారి నేనై యున్నా నని తాత్పర్యము

క. నే ననిన నన్ను మూర్ఖుఁడు, మే నని వీక్షించుఁ గాన కీ మేల్కని సత్య
జ్ఞానానందమయునిఁగా, జ్ఞానముచే నెఱుఁగవలయు కీ సద్గుణశాలీ. ౨

టీక సద్గుణశాలీ— సద్గుణ = సత్యధర్మదయాదిశ్రేష్ఠగుణములచేత, శాలీ = ఒప్పుచున్న యాంజనేయా, మూర్ఖుఁడు = అవివేకి, నే ననినన్ = అహ మనఁగా, మే నని వీక్షించుఁ గానన్ = పంచకోశాత్మకశరీర మని చూచును గనుక, మేల్కని = పరజాగ్రత్తనొంగి, నన్నున్ = అహంశబ్దవాచ్యుఁడ నైన నన్ను, సత్యజ్ఞానానందమయునిఁగాన్ = సచ్చిదానందస్వరూపునిఁగా, జ్ఞానముచేన్ = అపరోక్షజ్ఞానముచేత, ఎఱుఁగవలయున్ = నే ననెడు శబ్దమున కర్థము పరమాత్మ యనియు పంచకోశాత్మకశరీరము గా దనియుఁ దెలియవలయును.

తా॥ సత్యధర్మదయాది శ్రేష్ఠగుణములచేత నొప్పుచున్న యో యాంజనేయా! తెలివిలేనివాఁడు అహ మనఁగా పంచకోశాత్మక మయిన శరీరమును జూచును గనుక పరజాగ్రత్త నొంగి అహంశబ్దవాచ్యుఁడ నయిన నన్ను సచ్చిదానందస్వరూపుఁ డయిన పరమాత్మఁగా అపరోక్షజ్ఞానముచేత నెఱుంగవలయును, అనఁగా పంచకోశాత్మక మగు శరీరము నే నగు నెడు శబ్దము నర్థము గా దనియు, నే ననఁగా పరమాత్మ యనియు తాత్పర్యము

క. నే ననిన దనువునకు నభిమానమునకు నర్థ మగుఁ బ్రమాదమువలనం
గాన నివి రెం డనర్థము, లౌ నే నన నేన కేవలాత్ముఁడ ననఘా. ౩

టీక అనఘా = నిర్మలుఁడా, (దేహాత్మబుద్ధి గలవానికి) ప్రమాదమువలనన్ = భ్రాంతివలన, నే ననిన్ = నే ననెడు శబ్దము, తనువునకున్ = శరీరమునకు, అభిమానమునకున్ = అహంకారమునకు, అర్థమగున్ = ఆశయ మగును, గానన్ = కనుక, అవిరెండు = ఆ యర్థములు రెండును, అనర్థములౌన్ = అనన్వయము లగును, నే ననన్ = నే ననెడు శబ్దమునకు, కేవలాత్ముండన్ — కేవల = శరీరమునకును అహంవృత్తికిని వేఱైన, ఆత్ముఁడన్ = ప్రత్యగాత్మ నైన, నేన = అర్థము నేనే సుమా

తా॥ నిర్మలుఁడా! (ఇది దేహము, ఇది యాత్మ యను తెలివి గలవాఁడా) జనులు భ్రాంతిచే నే నను శబ్దము శరీరమునకును అహంకారమునకును అర్థ మగు నని తలంచెదరు ఆ రెం డర్థములును నే నను శబ్దమునకు అనన్వయము లగును, నే ననఁగా శరీరముకంటెను అహంకారముకంటెను వేఱైన ప్రత్యగాత్మ సుమా యని తాత్పర్యము

క. నానానూనుని నని న న్నే నే నన నిన్ను నన్ను నే నన ననినన్
నే నను నే నన్నానా, నే నను న న్నెన్ని నన్ను కీ నిను నే ననవా. ౪

టీక. అనా = ఓ ఆంజనేయా, నన్నే = సర్వజ్ఞత్వాదిగుణవిశిష్టునివలెఁ దోఁచు చుండెడు పరమాత్మ నయిన నన్నే, నానానూనునిన్—నానా = అంతట, అనూనునిన్ = నిండి యుండువానినిఁగా—అనఁగా పరబ్రహ్మస్వరూపునిఁగా, అని = నిశ్చయించి, నేను = కేవలాత్మ యగు నేను, అనన్ = చెప్పలేదా - అనఁగా సర్వజ్ఞత్వాది గుణరహితునివలె నీయెదురను గనఁబడు నన్ను పరబ్రహ్మ మని నేను నీకుఁ

చెప్పియుణ్నానుగదా యని భావము, నిన్నుక్ = అజ్ఞానోపాధివలన కించిద్జ్ఞత్వ కర్తృత్వ భోక్తృత్వాది గుణవిశిష్టునివలె దోఁచు చున్న సచ్చిదానంద ప్రత్యగాత్మ యగు నిన్ను, నన్ను = కేవలపరిపూర్ణాత్మ యగు నన్నని, నేను = అహంపదలక్ష్యార్థపరబ్రహ్మ మైన నేను, అనను = చెప్పియుండలేదా - అనఁగా అవిద్యాసంబంధమువలన కించిద్జ్ఞత్వాదిగుణములు గల జీవునివలె దోఁచు ప్రత్యగాత్మ యైన నిన్ను పరబ్రహ్మ మని చెప్పితిని గదా యనుట, నన్ను = అఖండ సచ్చిదానంద నిత్య పరిపూర్ణ మైన నన్ను, ఏనను = అవిద్యాకల్పితశరీరత్రయము నే ననెడి అభిమాని, నేనన్నా నా = నే నని యంటినా - అనఁగా సచ్చిదానందపరబ్రహ్మ మైన నన్ను అవిద్యాకల్పితశరీరత్రయాభిమాని యైన కూటస్థుఁ డనలేదు గనుక నీవు, నే నను నన్నుక్ = పంచకోశాది వ్యతిరిక్తాఖండసచ్చిదానందపరమాత్ముఁడ నే ననెడు నన్ను, ఎన్ని = విచారించి-అనఁగా అహంపదమునకు వాచ్యార్థము లైన సర్వజ్ఞత్వాదిగుణములతోఁ గూడినమాయను, త్వంపదమునకు వాచ్యార్థము లైన కించిద్జ్ఞత్వాదిగుణములు గల యవిద్యను, నిత్యానిత్యవస్తువివేకదృష్టిచేత విచారించి సకలోపనిషత్సార మైన నేతినేతి యను మహావాక్యముచేత మాయావిద్యలఁ బరిత్యజించి, నన్నుక్ = అహంపదలక్ష్యార్థస్వరూప మగు సర్వసాక్షి యైన నన్నును, నినుక్ = త్వంపదలక్ష్యార్థభూతజీవసాక్షి యైన నిన్నును, నే నను = సత్యజ్ఞానానంతనిత్యపరిపూర్ణ పరమాత్మరమే యని తెలిసి పలుకుము అనఁగా 'బ్రహ్మై వాహ మస్మి' యని పలుకు మనుట.

తా॥ ఓ అంజనేయా! సర్వజ్ఞత్వాదిగుణములతోఁ గూడుకొన్న వానివలెఁ దోఁచుచుండెడి నన్ను అంతట నిండియుండువానినిఁగా (అనఁగా పరబ్రహ్మస్వరూపునిఁగా) చెప్పితిని, అవిద్యాసంబంధమువలన కించిద్జ్ఞత్వాదిగుణములు గల జీవునివలె కనఁబడు చున్న ప్రత్యగాత్మ యయిన నిన్ను పరబ్రహ్మ మని చెప్పితిని, అఖండసచ్చిదానందనిత్యపరిపూర్ణ మైన నన్ను అవిద్యచేత కల్పింపఁబడిన స్థూలసూక్ష్మకారణ శరీరత్రయాభిమాని యగు కూటస్థుఁ డని చెప్పలేదు గనుక నీవు పంచకోశాదివ్యతిరిక్తాఖండసచ్చిదానంద పరమాత్ముఁడ నే ననెడు నన్ను చక్కఁగా విచారించి (అనఁగా నేను అనుపదమునకు వాచ్యార్థ మైన సర్వజ్ఞత్వాదిగుణములతోఁ గూడిన మాయను, నీవు అనుపదమునకు వాచ్యార్థ మైన కించిద్జ్ఞత్వాదిగుణములు గల యవిద్యను నిత్యానిత్యవస్తువివేకదృష్టిచేత విచారించి) సమస్త మయిన యుపనిషత్తులకు సార మైన నేతినేతి యను మహావాక్యములచేత మాయావిద్యలను వదలి నేను అనుపదమునకు లక్ష్యార్థస్వరూపమును సర్వసాక్షియును నైన నన్నును నీవు అనుపదమునకు లక్ష్యార్థభూతమును జీవసాక్షియును నైన నిన్నును సత్యజ్ఞానానంతనిత్యపరిపూర్ణ పరమాత్మరమే యని తెలిసి పలుకుము (అనఁగా నేనే పరబ్రహ్మము పరబ్రహ్మమే నే నని పలుకుము) అని తాత్పర్యము.

క॥ మేను మనము మానము మును, నే నను మననమ్ము మాని నీ నేమమ్మున న
న్నే నే నని నమ్మిన నీ, మాన మనూనానుమాన మై మను నెమ్మిన్. ౬౯

టీక. మును = ముందుగా, మేను = శరీరము, మనము = మనస్సును, మానము = అహంకారమును - అనఁగా శరీరత్రయమునను, నేనను మననమ్మునక్ = నేనే యనెడు స్మరణను, మాని=వదలి, నేమమ్మునక్ = నిష్ఠచేత, నన్నే = పరమాత్మ యైన నన్ను, నెమ్మిక్ = ప్రియముతో, నే నని నమ్మినక్ = ఏ నని విశ్వసించితివేని - అనఁగా ప్రత్యగాత్మ యగు నీ వని తలఁచితివా, నీమానము = నీసంశయజ్ఞానము, అనూన = తక్కువ గాని - అనఁగా నపైకాంత్యాదిదోషానాక్రాంతహేతుసిద్ధ మయిన, అనుమానమై = అనుమానరూపప్రమాణము గలదై - అనఁగా పక్షహేతుసాధ్యములచేత అభేదనిశ్చయము గలదై, మనుక్ = వృద్ధినొందును - అనఁగా నీసంశయము నేనే పరబ్రహ్మ మనెడు నిశ్చయము గలదై వృద్ధిఁ బొందు

నటుం, నీప్రజ్ఞావిశేషము అఖండ మయిన పరబ్రహ్మమును సచ్చిదానందనిత్యనిర్మలత్వాము లనెడు లక్షణ ములచేత స్వేతరము గానియట్లూహించుటకు కారణమై తదాకారమై యొప్పునించు నని యర్థాంతరము.

తా. ముందుగా శరీరమును మనస్సును అహంకారమును నేననెడు స్మరణను వదలి నిష్ఠచేత పరమాత్మ యైన నన్నే ప్రియముతో నే నని విశ్వసించితివేని (ప్రత్యగాత్మ యగు నీ వని తలంచినటు లయితె) నీసంశయజ్ఞానము తప్పక గాని నైకాంత్యాదిదోషములచేత (అక్రమింపఁబడని హేతువులచేత) సిద్ధ మయిన అనుమానరూపప్రమాణము గలదై (అనఁగా పక్షము హేతువు సాధ్యము వీనిచేత యథేద నిశ్చయము గలదై) వృద్ధి పొందు నని తాత్పర్యము. (ఈ ప్రజ్ఞానవిషయము అఖండ మయిన పరబ్రహ్మ మును సచ్చిదానందనిత్యనిర్మలత్వము లనెడు లక్షణములచేత తనకంటె నితరము గానట్లు నూహించు టకు కారణమై వృద్ధిఁ బొందు ననియును భావము.)

క. మన మేపని జేసిన నది, మనమే చేసితి మటంచు కనుది దోఁచు సనా
తనమై ద్యోతనమై చేతనమై తగు మనకుఁ గల్పితం బిది యనఘా. ౯౩

టీక. అనఘా = నిర్దోషుఁడ వయిన యాంజనేయా, మనము = శాంతఘోరమూఢవృత్తులతోఁ గూడిన మనస్సు, ఏపనిని = దైవమానుషాసురకృత్యములలో దేనిని, చేసినను = జరగినను, అది = ఆ కృత్యము, మనమేచేసితిమటంచున్ = మన మిరువురమే చేసితి మని, మదిని = హృదయమునందు, తోఁచున్ = స్ఫురించును, సనాతనమై = శాశ్వతమై, ద్యోతనమై = ప్రకాశమానమై, చేతనమై = ఆత్మస్వరూపమై, తగు మనకున్ = ఒప్పు చున్న మనయిద్దఱకు, ఇది = ఇట్లు తోఁచుట, కల్పితంబు = ఆరోపణము

తా. పాపరహితుఁడ వగు యోయాంజనేయా! శాంతఘోరమూఢవృత్తులతోఁ గూడిన మనస్సు దైవమానుషాసురకృత్యములలో దేనిని చేసినను ఆకృత్యము మన మిరువురమే చేసితి మని హృదయమునందు స్ఫురించును, శాశ్వతమును ప్రకాశమానమును ఆత్మస్వరూపమును నై యొప్పు చున్న మన యిద్దఱకు నిట్లు తోఁచుట కల్పిత మని తాత్పర్యము.

ఉ. నమ్ము మనమ్ములో ననుదినమ్ము వెలుంగు చిదాత్మ సత్ప్రభా
సమ్ము నిజమ్ము నేను నిధనమ్మును సంజననమ్ము రూపవ
ర్ణమ్ములు కర్తృకార్యకరణమ్ములు వర్ణగుణాశ్రమాభిమా
నమ్ములు నాకు లే వను ఘనమ్మగు నావచనమ్ము నెమ్మదిన్. ౯౪

టీక మనమ్ములోన్ = అంతరంగమందు, అనుదినమ్ము = ఎల్లప్పుడు, వెలుంగు = శోభించునట్టి, చిదాత్మ = పరబ్రహ్మముయొక్క, సత్ = నశింపని, ప్రభాసమ్ము = తేజస్సు, నేను = ఏను, నిజమ్ము= సత్యము, నమ్ము = విశ్వసింపుము, నిధనమ్మును = మరణమును, సంజననమ్మును = పుట్టుకయును, రూప వర్ణమ్ములును — రూప = స్థూలకృశహ్రస్వదీర్ఘవక్రాదిరూపములును, వర్ణమ్ములును = రక్తశ్వేతకృష్ణనీల పీతాదివర్ణములును, కర్తృ = అహంకర్తృత్వములును, కార్య = శబ్దాదివిషయములును, కరణమ్ములును= బుద్ధి మొదలగు నింద్రియములును, వర్ణ = బ్రాహ్మణాదిజాతులును, గుణ = సత్త్వాదిప్రకృతిగుణములును, ఆశ్రమ = బ్రహ్మచర్యాద్యాశ్రమములును, అభిమానమ్ములును = స్థూలసూక్ష్మకారణశరీరకర్తలైన విశ్వతైజసప్రాజ్ఞాభిమానములును, నాకు లేవు = నాకుఁ గలుగవు, అను = అని పలుకునను, ఘనమ్మగు నావచనమ్మున్ = శ్రేష్ఠ మయిన నావాక్యమును, నెమ్మదిన్ = దృఢచిత్తమునందు, నమ్ముము = సత్య మని తలంపుము

తా॥ ఎల్లప్పు డంతరంగమునందు ప్రకాశించునట్టి పరబ్రహ్మముయొక్క తేజస్సు నేను, ఇది (తేజస్సు నే ననుమాట) సత్యము, దీనియందు విశ్వాస ముంచుము చావును పుట్టుకయును రక్తశ్వేతాది వర్ణములును పొడుగు కుఱుచ వంకర లను రూపములును నేను చేయుచున్నాను నేను భుజించుచున్నాను అనునివి మొదలుగాఁ గల కర్తృత్వములును కార్యము లగు శబ్దాదివిషయములును కరణము లగు బుద్ధి మొదలగు యింద్రియములును బ్రాహ్మణాదిజాతులును సత్త్వాదిప్రకృతిగుణములును బ్రహ్మచర్యాద్యాశ్రమములును స్థూలసూక్ష్మకారణశరీరములును కర్త లైన విశ్వ తైజస ప్రాజ్ఞాభిమానములును నాకు లే వని చెప్పును, శ్రేష్ఠమైన నావాక్యమును దృఢచిత్తమునందు సత్య మని నమ్ముమని తాత్పర్యము

చ. అరుచి జనింప నింపగు మహావిషయేచ్ఛలు మాని మానిత
స్ఫురదభిమానమానసవచోఘనకాయనివాసవాసనం
బారయకు మేను నే ననెడి బుద్ధిని దోఁచుటచేతఁ గానఁ గే
తరమును గాను గానఁ బరతత్త్వమె విశ్వ మభావభావనన్. ౯౦

టీక విశ్వము = ప్రపంచము, అభావ = శూన్య మని, భావనన్ = భావించుటవలన, అరుచి = విరక్తి, జనింపన్ = పుట్టుచుండఁగా, ఇంపగు = ప్రియములై తోఁచెడు, మహా = గొప్ప లైన, విషయేచ్ఛలు = శబ్దాదివిషయములవలని కోరికలు, మాని = వదలి, మానిత = కొనియాడఁదగిన, స్ఫురత్ = వెలుఁగుచున్న, అభిమాన = త్రివిధాహంకారజన్యము లైన, మానస = మనస్సు, వచః = వాక్కు, ఘన కాయ = స్థూలశరీరము, (వీనికి) నివాస = నివాసస్థాన భూతమైన, వాసనన్ = ఇచ్ఛను, పొరయకు = పొందకుము, ఏను = ప్రత్యగాత్మ నైన నేనే, నేను = పరబ్రహ్మమును, అనెడిబుద్ధిని = నే ననెడి తెలివిచేతను, కానన్ = విచారింపఁగా, ఇతరమును గాను = పరబ్రహ్మేతరమును కాను, (అని) తోఁచుటచేతన్ = స్ఫురించుటచేత, పరతత్త్వమె = నేను పరబ్రహ్మస్వరూపమె అని నిశ్చయింపు మనుట

తా॥ ప్రపంచము శూన్య మని యెంచుటచే పుట్టెడు విరక్తివలన ప్రియములై తోఁచెడు శబ్దాది విషయములవలని కోరికలను వదలి కొనియాడఁదగినదియును ప్రకాశించుచున్నదియును మూఁడువిధములైన యహంకారములవలన బుట్టిన మనస్సు వాక్కు స్థూలశరీరము వీనికి స్థానభూతమైనదియు నగు యిచ్ఛను పొందకుము, ప్రత్యగాత్మ యగు నేనే పరబ్రహ్మ మను జ్ఞానముచేత విచారింపఁగా పరబ్రహ్మమునకంటె నితరము కా నని తోఁచుటవలన నేనే పరబ్రహ్మస్వరూప మని నిశ్చయింపు మని తాత్పర్యము

చ. ఇలఁపుగ నెన్న నెన్నఁ డొకయించుక లేకయ యున్న యున్నతిం
బొరలు వికారకారణ మబోధము దీని తెఱంగు రంగుగా
నెఱిఁగి శమించి మించి పరమేశ్వర భావముఁ బొంది బొందిఁ బా
మఱచిన ధీరధీరుచిరమార్గుఁడు మోక్షముఁ జేరు జేరువన్ ౯౧

టీక. ఇలఁపుగన్ = అనుభవజ్ఞానదృష్టిచేత లెస్సగా, ఎన్నన్ = పరిశీలింపఁగాను, ఎన్నఁడు = ఎప్పుడును, ఒకయించుక లేకయ = కొంచెమైన వస్తురూపముగాఁ గనఁబడక నే, ఉన్న యున్నతిన్ = వస్తు రూపముగా నున్నదానివలెనే, పొరలువికారకారణము — పొరలు = వృద్ధిఁ బొందుచున్న, వికార = షడ్భావవికారములకు, కారణము = హేతు వైనది, అబోధము = అజ్ఞానమే, దీని తెఱఁగున్ = ఈ యజ్ఞాన లక్షణమును, రంగుగాన్ = చక్కఁగా, ఎఱిఁగి = తెలిసికొని, శమించి = ప్రకృతిని లయింపఁజేసి, మించి = ప్రజ్ఞానముచేత నతిశయించి, పరమేశ్వరభావముఁ బొంది = పరబ్రహ్మస్వరూపియై, బొందిన్ = శరీరమును,

తాన్ = తాను, మఱచిన = విస్మరించిన, ధీర = చలనము లేని, ధీ = బుద్ధిచేత, రుచిర = ప్రకాశించుచున్న, మార్గుఁడు = ప్రవర్తనము గలవాఁడు, చేరువన్ = సమీపముననే, మోక్షమున్ = ముక్తిని, చేరున్ = పొందును

తా॥ అనుభవజ్ఞానముచేత చక్కఁగా పరిశీలింపఁగా నెప్పుడును కొంచెమయిన వస్తురూపముగా గనఁబడకనే వస్తురూపముగ యున్నదానివలె వృద్ధి పొందుచున్న షడ్భావవికారములకు కారణము అజ్ఞానముగా నున్నది ఈ యజ్ఞానలక్షణమును చక్కఁగా దెలిసికొని ప్రకృతిని నశింపఁజేసి ప్రజ్ఞానముచేత నతిశయించి పరబ్రహ్మస్వరూపియై తాను శరీరమును మఱచిన చలనము లేని బుద్ధిచే ప్రకాశించుచున్న ప్రవర్తన గలవాఁడు స్వల్పకాలములోనే మోక్షమును బొందు నని తాత్పర్యము

వ. అని యుపదేశించి వెండియు నాత్మస్వరూపం బతిస్పష్టంబుగా నెఱుంగుకొఱకు
నింక నొక్క పరమరహస్యంబు జెప్పెద సావధానచిత్తుండ వై యాకర్ణింపు మని
యిట్లనియె. ౧౦౦

టీక॥ అని యుపదేశించి = అని బోధించి, వెండియున్ = మఱియు, ఆత్మస్వరూపంబు = పరబ్రహ్మస్వరూపమును, అతిస్పష్టంబుగాన్ = మిగులఁ దెలివిడిగా, ఎఱుంగుకొఱకున్ = తెలిసికొనుటకై, ఇంకన్ = ఇదిగాక, ఒక్కపరమరహస్యంబున్ = ఒకానొక మహాగోప్యమును, చెప్పెదన్ = వచించెదను, సావధానచిత్తుండవై = నెమ్మది గలవాఁడవై, ఆకర్ణింపుము = వినుమని, ఇట్లనియెన్ = ఈవిధముగాఁ బలుకఁదొడఁగెను

తా॥ ఈ ప్రకార ముపదేశించి మఱియును పరబ్రహ్మమును మిక్కిలి స్పష్టముగా తెలిసికొనుటకై ఒకానొక మహాగోప్యమును చెప్పెదను నెమ్మది గలవాఁడవై వినుమని యీవిధముగాఁ జెప్పఁ బ్రారంభించె నని తాత్పర్యము

## దృగ్దృశ్యవివేకము.

సీ. కలితశబ్దశ్రోత్రఘనమనోహంకృతు, ల్దృశ్యము లీనికి దృక్కు నేను
స్పర్శత్వగింద్రియాంచన్మనోహంకృతు, ల్దృశ్యము లీనికి దృక్కు నేను
సలలితరూపలోచనమనోహంకృతు, ల్దృశ్యము లీనికి దృక్కు నేను
గమనీయరసరసజ్ఞామనోహంకృతు, ల్దృశ్యము లీనికి దృక్కు నేను
తే. అతిసురభినాసికామనోహంకృతులును
దృశ్యములు గాన వీనికి దృక్కు నేను
బహువిధాంతర్బహిస్స్థప్రపంచ మెల్ల
దృశ్యమ కౌటఁ బరిపూర్ణదృక్కు నేను. ౧౦౧

టీక॥ కలిత = వర్ణాత్మక ధ్వన్యాత్మకము లై యొప్పెడు, శబ్ద = శబ్దములతోఁ గూడిన, శ్రోత్ర = కర్ణేంద్రియమును, ఘన = గొప్ప లైన, మనః = ఆ శబ్దాదులతోఁ గూడిన మనస్సును, అహంకృతులు = ఆ మనస్సుతోఁ గూడిన అహంకారమును, దృశ్యములు = కనఁబడునవి, వీనికిన్ = ఈ శబ్దాదులతోఁ గూడిన మనోహంకృతులకు, నేను = అఖండపరిపూర్ణసచ్చిదానందస్వరూపుఁడ నైన నేను, దృక్కున్ = ద్రష్టను, స్పర్శ = పంచవిధస్పర్శములతోఁ గూడిన, త్వగింద్రియ = చర్మముతోఁ గూడినవై, అంచత్ = ఒప్పుచున్న,

మనోహంకృతులు = మనస్సును అహంకారమును, దృశ్యములు = గోచరించునవి, వీనికిన్ = ఈ పంచవిధ స్పర్శములతోఁ గూడిన త్వగింద్రియాధిష్ఠానము లైన మనోహంకారము లనెడు దృశ్యములకు, నేను=కేవ లాత్మ నైన నేనే, దృక్కున్=అధిష్ఠానమును, సలలిత = ఒప్పిద మగుచున్న, రూప=దశవిధరూపసహిత మైన, లోచన = నేత్రేంద్రియముతోఁ గూడిన, మనోహంకృతులు = మానసాహంకారములు, దృశ్యములు= విషయములు, వీనికిన్ = ఈవిషయములకు, నేను = తత్పదబ్రహ్మపదలక్ష్యార్థస్వరూపుఁడ నైన నేను, దృక్కున్ = చూచువాఁడును, కమనీయ = మనోజ్ఞము లైన, రస = సప్తవిధరససహిత మైన, రసజ్ఞా= జిహ్వేంద్రియముతోఁ గూడిన, మనోహంకృతులు = మనస్సును అహంకారమును, దృశ్యములు= జ్ఞేయ ములు, నేను=స్వగతాదిభేదశూన్యుఁడ నైన నేను, వీనికిన్=ఈ దృశ్యములకు, దృక్కున్= జ్ఞాతను, అతి సురభి = త్రివిధపరిమళయుక్త మైన, నాసికా = ఘ్రాణేంద్రియముతోఁ గూడిన, మనోహంకృతులు = మనోహంకారములు, దృశ్యములు గానన్ = ఇంద్రియగ్రాహ్యము లగుటవలన, వీనికిన్ = ఈవిషయములకు, నేను = ప్రత్యగభిన్నాద్వితీయబ్రహ్మస్వరూపము నైన నేను, దృక్కున్= అధిష్ఠానమును, అట్లగుటన్= అట్లధిష్ఠాన మగుటవలన, బహువిధ = అనేకవిధము లైన, అంతర్బహిస్థ = లోపల వెలుపల నున్నట్టి, ప్రపంచమెల్లన్ = లోకమంతయు – అనఁగా కామాది సకలదృశ్యము లాంతరప్రపంచము బ్రహ్మాది పిపీలికాంతము బహిఃప్రపంచము యిది యంతయు, దృశ్యము = గోచరము, అట్లౌటన్ = అట్లు దృశ్య మగుటవలన, నేను = నిత్యనిరంజననిర్వికారుఁడ నైన నేను, పరిపూర్ణదృక్కున్ – పరిపూర్ణ = అఖండ మైన, దృక్కున్ = ద్రష్టను

తా. ధ్వన్యాత్మక వర్ణాత్మకము లై యొప్పు కర్ణేంద్రియమును, ఆ శబ్దాదులతోఁ గూడిన మనస్సును, ఆ మనస్సుతోఁ గూడిన యహంకారమును కనఁబడునవి, ఈ శబ్దాదులతోఁ గూడిన మనోహంకృతులకు నఖండపరిపూర్ణసచ్చిదానందస్వరూపుఁ డగు నేను ద్రష్టను (చూచువాఁడను) పంచవిధస్పర్శలతోఁ గూడిన చర్మముతోఁ గూడినదై యుప్పుచున్న మనస్సును అహంకారమును గోచరించునవి, ఈ గోచ రించు మనోహంకారములకు నేను అధిష్ఠానమును ఒప్పిద మగుచున్న దశవిధరూపసహిత మగు నేత్రేం ద్రియముతోఁ గూడిన మానసాహంకారములు విషయములు, ఈ విషయములకు బ్రహ్మపదలక్ష్యార్థస్వరూ పుఁడగు నేను చూచువాఁడను, మనోహరము లగు సప్తవిధరససహిత మగు జిహ్వేంద్రియముతోఁ గూడిన మనోహంకారములు కనఁబడునవి, ఈ కనఁబడు మనోహంకారములకు స్వగతాదిభేదశూన్యుఁడ నైన నేను జ్ఞాతను (తెలిసికొనువాఁడను) త్రివిధపరిమళయుక్త మగు నాసికతోఁ గూడిన మనోహంకార ములు యింద్రియములకు విషయము లగుటవలన నీ విషయములకు ప్రత్యగాత్మకంటె వేఱైనవాఁడును, తనకంటె నితరము లేనివాఁడును, పరబ్రహ్మస్వరూపమును నైన నేను అధిష్ఠాన మగుచున్నాను, అట్లు స్థానభూతుఁడ నగుటవలన దృశ్యము లగు యనేకవిధము లైన కామాది సకలదృశ్యము లనెడు అంతర ప్రపంచమును బ్రహ్మ మొదలుకొని పిపీలికాపర్యంత ముండునట్టి బహిఃప్రపంచమును నిత్యనిరంజననిర్వికారుఁ డైన నేను చూచువాఁడ నని తాత్పర్యము.

వ. అది యెట్లంటేని.                    ౧౦౨

టీక. అది యెట్లంటేని = ద్రష్ట యగు టెట్లనఁగా.

సీ. శబ్దాదివిషయపంచకము దృశ్యం బగు, శ్రవణాదికరణపంచకమునకును
శ్రవణాదికరణపంచకము దృశ్యం బగుఁ, దతమనోబుద్ధ్యహంకృతుల కరయఁ

దతమనోబుద్ధ్యహంకృతులు దృశ్యం బగుఁ, బరిపూర్ణదృష్ట్యయౌ బ్రహ్మమునకుఁ
బరిపూర్ణదృష్ట్యయౌ బ్రహ్మంబు నగు నాకు, దృశ్యత్వ మెందుఁ జింతింప లేదు

తే. గాన నిరతిశయస్వప్రకాశనిర్వి, కారనిర్విషయావ్యయాకాశకల్ప
కల్పనాతీతసచ్చిత్సుఖస్వరూప, సురుచిరాఖండశుద్ధవస్తువును నేను. ౧౦౩

టీక అరయన్ = విచారింపఁగా, శ్రవణ = శ్రోత్రేంద్రియము, ఆది = మొదలైన, కరణ=ఇంద్రియములయొక్క, పంచకమునకున్ = అయిదింటికి, శబ్ద = ధ్వనియు, ఆది = మొదలైన, విషయపంచకము=పంచవిషయములు, దృశ్యం బగున్=చూడఁదగినది యగును, తత = విస్తారము లైన, మనోబుద్ధ్యహంకృతులకున్ = మానసప్రజ్ఞాహంకారములకు, శ్రవణాదికరణపంచకము=శ్రోత్రము మొదలగు నింద్రియపంచకము, దృశ్యంబగున్ = కాంచదగిన దగును, పరిపూర్ణ = అంతట నిండినట్టి, దృష్ట్యయ = దృక్స్వరూప మైన, బ్రహ్మమునకున్ = పరమాత్మకు, తత = ప్రసిద్ధము లయిన, మనోబుద్ధ్యహంకృతులు= మనస్సును బుద్ధియు అహంకారమును, దృశ్యం బగున్ = జ్ఞేయ మగును, పరిపూర్ణదృష్ట్యయబ్రహ్మంబు నగు నాకున్ = పరిపూర్ణదృక్కు గల బ్రహ్మస్వరూప మైన నాకు, ఎందున్ = ఎప్పటను, చింతింపన్ = ఆలోచింపఁగాను, దృశ్యత్వము = వేఱొకదానిచేతఁ జూడఁబడుట, లేదు = గలుగదు, కానన్ = కాఁబట్టి, నేను = ఏను, నిరతిశయ = సర్వోత్కృష్ట మైన, స్వప్రకాశ = స్వయంజ్యోతి యైన, నిర్వికార=షడ్భావవికారశూన్య మైన, నిర్విషయ = విషయశూన్య మైన, అవ్యయ = నాశరహిత మైన, ఆకాశకల్ప=చిదాకాశస్వరూపుఁ డైన, కల్పనాతీత—కల్పనా=అపవాదమునకు, అతీత=వ్యతిరిక్త మై, (ఆరోప మనఁగా బంధము, అపవాద మనఁగా ముక్తి) సత్ = సద్రూపముచేత, చిత్ = చిద్రూపముచేత, సుఖస్వరూప = ఆనందస్వరూపముచేత, సురుచిర = వెలుఁగుచున్న, అఖండ = విభాగింపఁగూడని, శుద్ధవస్తువును=నిర్మల మైన పరబ్రహ్మమును

తా నేను ద్రష్ట యెట్లైన జెప్పెద వినుము, చక్కఁగా నాలోచింపఁగా శ్రోత్రేంద్రియము మొదలుగాఁ గల యింద్రియపంచకమునకు ధ్వనియే మొదలుగాఁ గల పంచవిషయములు చూడఁదగినవి విస్తారము లగు మనోబుద్ధ్యహంకృతులకు శ్రోత్రము మొదలగు నింద్రియపంచకము చూడఁదగిన దగును, అట్టి ప్రసిద్ధము లైన మనోబుద్ధ్యహంకారములకు అంతట నిండి యుండు దృక్స్వరూపుఁడ నైన నేను చూచువాఁడను, అట్టి పరిపూర్ణదృక్స్వరూపుఁడ నైన నేను యేమిటిచేత గాని గూడఁబడుట లేనందున సర్వోత్కృష్ట మైనదియును, స్వయంజ్యోతి యైనదియును, షడ్భావవికారములు లేనిదియును, విషయశూన్య మైనదియును, నాశరహిత మైనదియును, చిదాకాశస్వరూప మైనదియును, అపవాదమునకు వ్యతిరిక్త మైనదియును, సచ్చిదానందరూపములచేతఁ బ్రకాశించుచున్నదియును నగు విభాగింపఁగూడని నిర్మల మైన పరబ్రహ్మమును నేనుగా యున్నానని తాత్పర్యము.

వ. అట్టి దృగ్వస్తువు నైన నాకు దృశ్యత్వంబు గలుగ దెట్లనిన వినుము, దృక్కును
సంవిత్తును జిత్తును జ్ఞప్తియు జ్ఞానంబును బోధంబును జైతన్యంబును నను నివి ఘట
కుంభకలశశబ్దంబులభంగి బర్యాయనామంబు, లట్లగుట దృక్కు నైన నన్నవ
లోకించునది దృగన్యం బసిన దీపభాస్యంబు లై జడంబు లైన ఘటాదులు భాసకం
బైన దీపంబుం బ్రకాశింపం జేయ నేరనిపగిది నాచేతఁ బ్రకాశ్యంబు లై యచేత
నంబు లైన యహంకారమనోనేత్రరూపాదికంబులు ప్రకాశకం బైన మత్స్వ

రూపంబుం దెలియనోపవు, దృగంతరంబనిన నాదృగంతరంబు స్వల్పప్రభారూపం
బైన ప్రదీపం బనల్పతేజోవంతుం డగు భానుమంతుని వెలిఁగింప లేనిచందంబున
నికృష్టంబై యెఱుంగ సమర్థంబుగాదు, సమానంబై తేజరిల్లఁజేయు ననిన రత్నంబు
స్వసదృశరత్నాంతరంబును భాసిల్లం జేయ క్షమంబు గాన పోలిక మత్సమంబై విల
సిల్లంజేయ శక్తంబు గా, దదియునుంగాక వేదాంతంబులయందు చైతన్యద్వయం
బనుక్తం బది యట్లుండనిమ్ము, సముత్కృష్టం బై కాంచు ననిన నదియు మఱియొక
దృగంతరంబునకు దృశ్యంబు గావలయు, నట్లయిన దానిం గనుంగొను దృగంత
రాంతరం బింకొక్కటి యనిన నిట్టులగున ననంఖ్యాతదృగంతరాంగీకారంబు
దోఁచు నందువలన ననవస్థాదోషంబు ప్రాప్తం బగు, నట్లు గాక కొన్నిదృగంతరం
బుల నూహించి యొక్కటి నిలిపి యిటమీఁద దీనికి ద్రష్ట లేఁ డనిన నన్నింటికిం
గలుగ నితని కెట్లు లే కుండు, గలం డనిన వానికి వ్యభిచారంబు నచ్చు, నివ్విధంబు
గాక మొదటిదృగంతరంబు నిరతిశయుం బనిన నెయ్యది సర్వకారణంబై నిష్కార
ణంబై తనకంటె నితరం బైన సర్వంబును సాధనంబు లేక తాన వీక్షించు నదియ
నేను గావున స్వప్రకాశపరిపూర్ణదృష్టియు బ్రహ్మంబు నగుదు నని యుపదేశించి ౧౦౪
మఱియు నిట్లనియె

టీక అట్టి దృగ్వస్తువు నైన నాకున్—అట్టి = ముందుఁ జెప్పఁబడిన దృశ్యము లైన మనోబుద్ధులు
మొదలగు సకలేంద్రియములకు వ్యతిరిక్త మైనట్టి, దృగ్వస్తువు నైన నాకున్ = ద్రష్ట నైన నాకు, దృశ్య
త్వంబు గలుగదు = వేఱొకదానిచేతఁ జూడఁబడుట లేదు, ఎట్లనినన్ = ఏలా గనఁగా, వినుము = ఆక
ర్ణింపుము, దృక్కును = దృక్కు, సంవిత్తును = సంవిత్తు, చిత్తును = చిత్తు, జ్ఞప్తియున్ = జ్ఞప్తి, జ్ఞానం
బును = జ్ఞానము, బోధంబును = బోధంబు, చైతన్యంబును = చైతన్యము, అనునివి = అను నీ శబ్దములు,
ఘటకుంభకలశశబ్దంబులభంగిన్ = ఘటము కుంభము కలశ మనెడు శబ్దములవలె, పర్యాయనామంబులు =
అభిన్నార్థకశబ్దములు, అట్లగుటన్ = అట్లభిన్నార్థకశబ్దము లగుటచేత, దృక్కు నైన నన్ను = సాక్షి
నైన నన్ను, అవలోకించునది = చూచునది, దృగన్యం బనినన్ = వేఱొక్క దృక్కని పలికినయెడల, దీప
భాస్యంబులై = దీపముచేత వెలుఁగునవియై, జడంబు లైన = అచేతనము లైన, ఘటాదులు = కుండలు
లోనగునవి, భాసకం బైన దీపంబున్ = తమ్ము వెలుఁగఁజేయునట్టి దీపమును, ప్రకాశింపఁ జేయనేరని
పగిదిన్ = తేజరిల్లఁజేయఁజాలనియట్లు, నాచేతం బ్రకాశ్యంబులై = సాక్షి నైన నాచేత వెలిఁగింపఁబడు
చున్నవై, అచేతనంబు లైన = జడము లైన, అహంకార = అభిమానము, మనః = మనస్సు, నేత్ర = నేత్రము,
రూప = రూపము, ఆదికంబులు = మొదలైనవి, ప్రకాశకంబైన = వెలుఁగునట్టి, మత్స్వరూపంబున్ =
నాస్వరూపమును, తెలియనోపవు = ఎఱుఁగఁజాలవు, దృగంతరంబనినన్ = నాస్వరూప మెఱుఁగునది
వేఱొక దృక్కనినయెడల, ఆదృగంతరంబు = వేఱైనదృక్కు, స్వల్పప్రభారూపంబు = అల్పప్రకాశము
గలది, ఐనప్రదీపంబు = ఐనదీపము, అనల్పతేజోవంతుండగు = అధికకాంతి గలిగినట్టి, భానుమంతుని
వెలింగింపలేనిచందంబునన్ = సూర్యునిఁ బ్రకాశింపఁజేయలేని యట్లు, నికృష్టంబై = నీచమై, ఎఱుంగ
సమర్థంబుగాదు = తెలుసుకొనఁజాలదు, సమానంబై తేజరిల్లంజేయు ననినన్ = తుల్యతేజస్సు గలదై వెలిఁ

గించునంటివేని, రత్నంబు = మణి, స్వసదృశరత్నాంతరంబుఁ = తనతో జతయైన మఱియొకరత్నమును, భాసిల్లంజేయుఁ = వెలిఁగింపఁజేయుటకు, క్షమంబుగానిపోలికఁ = శక్తి గలది గానియట్లు, సత్సమంబై = నాతో సాటియై, విలసిల్లంజేయశక్తంబుగాదు = ప్రకాశింపఁజేయఁజాలదు, అదియునుంగాక = అంత మాత్రమేగాక, వేదాంతంబులయందుఁ = ఉపనిషత్తులయందు, ద్వైతసద్ద్వయంబు = వస్తుద్వయము, అనుక్తంబు = చెప్పఁబడదు, అది యట్లుండనిమ్ము = అవ్వృత్తాంత మటుల నుండనిమ్ము, సముత్కృష్టంబై = నాకంటె నధికప్రకాశము గలదై, కాంచుననినఁ = నన్ను వీక్షించునంటివేని, అదియుఁ = ఆ చూచు నదియును, మఱియొకదృగంతరంబునకుఁ = వేఱొకదృగ్వస్తువునకు, దృశ్యంబు గావలయుఁ = కనఁబడు నది గావలయును, అట్లయినఁ = అటుల దృశ్య మాయెనేని, దానిఁ = ఆదృశ్యమును, కనుంగొనుదృగంతరాంతరంబు—కనుంగొను = చూచునట్టి, దృగంతరాంతరంబు = వేఱొకదృక్కు, ఇంకఁ = మఱియు, ఒక్కటియనినఁ = ఒక్కటి గావలయు ననిన, ఇత్తెఱంగునఁ = ఇవ్విధముగా, అసంఖ్యాత = లెక్కలేని, దృగంతర = అన్యదృక్కులయొక్క, అంగీకారంబు = పరిగ్రహము, తోఁచుఁ = కావలయు నను నపేక్ష గలుగును, అందువలనఁ = అట్లపేక్ష గలుగుటవలన, అనవస్థాదోషంబు = నిలుకడలేని దోషము, ప్రాప్తంబగుఁ = సంభవించును, అట్లు గాక = అట్లనవస్థాదోషము ప్రాప్తించుటయే గాక, కొన్నిదృగంతరంబులఁ—కొన్ని = కతిపయము లైన, దృగంతరంబులఁ = దృగ్భేదములను, గణించి = ఆలోచించి, ఒక్కటినిలిపి = ఒకటినియుంచి, ఇటమీఁద = ఇంకమీఁద, దీనికిఁ = ఈ దృక్కునకు, ద్రష్ట లేఁడనినఁ = దీని వీక్షించువాఁడు లేఁడని చెప్పితివేని, అన్నింటికిం గలుగఁ = అన్నిటికి ద్రష్ట గల్గియుండఁగా, వీనికెట్లు లేకుండుఁ = వీనికి మాత్ర మెటులు గలుగ కుండును, కలఁడనినఁ = ఉన్నాఁడంటివేని, వానికిఁ = ఆ చెప్పఁబడిన ద్రష్టకు, వ్యభిచారంబువచ్చుఁ = నిషేధము గలుగును, ఇవ్విధంబుగాక = ఇట్లు గాక, మొదటిదృగంతరంబు = తొలుతఁ దోఁచిన దృగస్యము, నిరతిశయం బనినఁ = శ్రేష్ఠ మైన దంటివేని, ఎయ్యది = ఏ దృగ్వస్తువు, సర్వకారణంబై = సమస్తమునకు హేతువై, నిష్కారణంబై = తనకు వేఱొక హేతువు లేనిదై, తనకంటె నితరం బైన సర్వంబుఁ = తనకంటె నన్యము గాఁ దోఁచు సకలమును, సాధనంబు లేక = హేతువు లేక, తాన వీక్షించు = తానే చూచునో, అదియు = ఆ సర్వద్రష్టయే, నేను గావునఁ = నేను గనుక, స్వప్రకాశ = స్వయంజ్యోతి యైన, పరిపూర్ణ = అఖండ మైన, దృఙ్మయ = జ్ఞానస్వరూప మైన, బ్రహ్మంబుఁ = పరమాత్మను, అగుదుఁ = ఔదున, అని యుపదేశించి = ఇట్లని బోధించి, మఱియు నిట్లనియెఁ = మరల నిటులఁ జెప్పఁబూనెను

తా॥ పూర్వము చెప్పఁబడిన మనోబుద్ధులు మొదలగు సకలేంద్రియములకు వ్యతిరిక్త మైనట్టి దృగ్వస్తువు నైనవాఁడు చూడఁబడుట యెట్లు లే దనఁగా చెప్పెదను వినుము, దృక్కు, సంవిత్తు జ్ఞప్తి జ్ఞానము బోధము చైతన్యము అనునివి ఘటము కలశము కుంభ మనెడు శబ్దములవంటి పర్యాయనామములు, ఈ శబ్దములును అట్లు వేఱు లేని అర్థములు కల వగుటచేత సాక్షి యైన నన్ను చూచునది వేఱొక్కదృక్కని చెప్పినయెడల దీపముచేతఁ బ్రకాశింపఁబడు ఘటము లైన కుండలు మొదలగునవి తమ్ముఁ బ్రకాశింపఁజేయునట్టి దీపమును ప్రకాశింపఁజేయ నేరనివిధమున నాచేతఁ బ్రకాశించెడు అచేతనము లైన అహంకారము మనస్సు నేత్రము రూపము మొదలగునవి ప్రకాశించునట్టి నాస్వరూపమును తెలిసికొనఁజాలవు, నేను యెట్లు ప్రకాశింపఁజేయుచున్నానో ఆప్రకారము నన్నును ప్రకాశింపఁజేయు దృక్కు మఱొక్కటి యున్న దన్నయెడల అల్పప్రకాశము గల దీపము అధికప్రకాశము గల సూర్యుని యెట్లు ప్రకాశింపఁజేయఁజాలదో ఆప్రకారముగానే అధికప్రకాశము గల నాస్వరూపమును నీచ మగు దృగంతరము తెలిసికొనఁ

వ. ఇట్లు పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులును మనోబుద్ధ్యహంకారములును వీనికిఁ
గారణంబైన యవ్యక్తంబును శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులు వాక్పాణిపాదపాయూ
పస్థలను దశేంద్రియంబులును శబ్దస్పర్శరూపరసగంధంబులను పంచవిషయం
బులుం గూడి యిరువదినాలుగుతత్త్వంబు లగు గొందఱు వాగాదికర్మేంద్రియ
పంచకంబును శ్రోత్రాదిజ్ఞానేంద్రియపంచకంబును శబ్దాదివిషయపంచకంబును
ప్రాణాదివాయుపంచకంబును మనస్సాద్యంతఃకరణచతుష్టయంబును గూడి యిరు
వదినాలుగుతత్త్వంబు లని చెప్పుదురు ఈచతుర్వింశతితత్త్వంబులను శరీరత్రయం
బనియుఁ బంచకోశంబు లనియుఁ బండితులు గణింతురు ఇది మూలప్రకృతి యిది
క్షేత్రంబు క్షరంబు ప్రకృతి యనాత్మ దృశ్యంబు నసత్తు జడంబు దుఃఖాత్మకంబు
సంసారం బన నొప్పు దీని పిండంబుతోఁ గూడి ప్రకాశించు కృశానునిచందం
బున మిథ్యాతాదాత్మ్యాధ్యాసంబుచేత దీనితో నెనసి ప్రవర్తించు మదంశభూతుం
డైన జీవుండు పంచవింశకుం డితం డస్మదీయప్రకృతిక్షేత్రజ్ఞుం డక్షరుండు పురు
షుం డాత్ముండు ద్రష్ట సద్రూపకుండు చేతనుం డానందమయుండు సంసారి యనం దేజ
రిల్లుచుండు నది యెట్లనినఁ బూర్వోక్తతత్త్వంబులలోఁ బ్రధానావయవంబు సర్వ
కార్యకారణాశ్రయంబు సకలవాసనామయంబు ననాద్యనిర్వచనీయాజ్ఞానకల్పితంబు
నైన బుద్ధ్యహంకారాత్మకాంతఃకరణవృత్తివిశేషంబునందుఁ జలఘటంబునం దా
దిత్యప్రతిబింబంబు దర్పణంబునందు ముఖాభాసంబునుం బోలెఁ జిదాభాసంబున నస్మ
చ్ఛాయ ప్రతిఫలించి యదుపాధికుం డై కర్తృభోక్తృప్రమాతృత్వాద్యభిధానవాచ్యుం
డైన స్థూలగోళకోపహితజ్ఞానకర్మేంద్రియప్రాణపంచకసమష్టిగాత్ర యుపశ్రిత్యాత్మ
కాంతఃకరణవృత్తివిశేషసాధనంబు చే గార్యభోగక్షేత్రప్రముఖశబ్దవాచ్యంబు
లైన శబ్దాదివిషయంబుల ననుభవించుచుఁ గర్తయు భోక్తయు జ్ఞాతయుఁ
బ్రమాతయు శ్రోతయు స్ప్రష్టయు ద్రష్టయు రసయితయు ఘ్రాతయు వక్తయు
దాతయు గంతయు విసర్జయితయు నానందయితయు శ్రోతయు మంతయు దేహియు
జీవుండు నగుచుఁ బ్రసిద్ధుం డై సమష్టిశరీరజాగ్రదవస్థాభిమానియై విశ్వుం డన
సూక్ష్మదేహస్వప్నావస్థాభిమానియై తైజసుం డనఁగ గారణాంగసుషుప్త్యవస్థాభి
మాని యై ప్రాజ్ఞుఁ డన విలసిల్లి నిఖిలనానానామయుం డై యయస్కాంతసాన్ని
ధ్యంబువలన నయస్సు చలించెడుతెఱంగున సూర్యాలోకంబు నాశ్రయించి
స్వస్వవ్యాపారంబులం బ్రవర్తించు జనంబుభంగి సర్వాధిష్ఠానభూతుండును
బ్రధానపురుషేశ్వరుండును గారణపురుషోత్తమాఖ్యుండును దనరు ముఖ్యబింబ
భూతుండు మదంశకుండును బరుండు బరమాత్ముండు నైన నా సన్నిధానంబువలన
నస్మదీయ తేజంబు సంశ్రయించియు నన్నెఱుంగక తన్ను నామరూపాత్మకునింగా

యించువాఁడును, దాతయుఁగా = హస్తేంద్రియముచేత నిచ్చువాఁడును, గంతయుఁగా = పాదేంద్రియముచేత నడుచువాఁడును, విసర్జయితయుఁగా = పాయ్వింద్రియముచేత మలము విడుచువాఁడును, ఆనందయితయుఁగా = గుహ్యేంద్రియముచేత సంతోషించువాఁడును, ప్రాణియుఁగా = పంచప్రాణములతోఁ గూడినవాఁడును, మంతయుఁగా = మననము చేయువాఁడును, దేహియుఁగా = దేహము గలవాఁడును, జీవుండును = చిదాభాసుఁడును, అగా = అని పలుకఁబడుచు, ప్రసిద్ధుండై = వెలసినవాఁడై, సమధికశరీర = స్థూలశరీరమునందు, జాగ్రదవస్థ = జాగ్రదావస్థయందు, అభిమానియై = కర్తయై, విశ్వుండనఁగా = విశ్వుఁడను పేరు నామముచేతను, సూక్ష్మదేహ = లింగశరీరమునందు, స్వప్నావస్థా = స్వప్నావస్థయందు, అభిమానియై = కర్తయై, తైజసుండనఁగా = తైజసుఁడను నామముచేతను, కారణాంగ = కారణశరీరమునందు, సుషుప్త్యవస్థా = నిద్రావస్థయందు, అభిమానియై = అధికారియై, ప్రాజ్ఞుఁడనఁగా = ప్రాజ్ఞుఁడను పేరుచేతను, విలసిల్లి = ప్రసిద్ధి కెక్కి, నిఖిలవాసనాసమేతుండై = సమస్తాభిలాషలతోఁ గూడినవాఁడై, అయస్కాంతసాన్నిధ్యంబువలనఁగా = సూదంటురాతిచేరికవలన, అయస్సు చలించు తెఱంగునఁగా = ఇనుము కదలెడులాగున, సూర్యాలోకంబు నాశ్రయించి = సూర్యకిరణము ననుసరించి, స్వస్వవ్యాపారంబులయందు = తమపనులయందు, ప్రవర్తించుజనంబుభంగిఁగా = నటించెడు జనమువలెను, సర్వాధిష్ఠానభూతుండును = సర్వప్రపంచమున కాశ్రయ మైనవాఁడును, ప్రధానపురుషేశ్వరుండునుఁగా — ప్రధాన = మాయాప్రకృతికిని, పురుష = జీవులకును, ఈశ్వరుండును = ప్రభు వైనవాఁడును, పురాణపురుష = ప్రాచీను లైన బ్రహ్మవిష్ణురుద్రాదులకంటె, ఉత్తమాఖ్యుండును = శ్రేష్ఠుఁ డైనవాఁడును, ఘనుఁడుగా = పరబ్రహ్మ మైన తనకు, ముఖ్యబింబభూతుండును = ప్రతిబింబమున కధిష్ఠాన మైనవాఁడును, పంచవింశకుండును = ఇరువదియైదవవాఁడును — అనఁగా జ్ఞాత యనుట, పరుండును = ప్రకృతికి పర మైనవాఁడును, పరమాత్ముఁడు నైన నా సన్నిధానంబువలనఁగా = సచ్చిదానందస్వరూపము నైన నా సాన్నిధ్యమువలన, అస్మదీయతేజంబుఁగా = నా దివ్యతేజస్సును, సంగ్రహించియుఁగా = పొందియు, నన్నెఱుంగక = పరబ్రహ్మము నైన నన్నెఱుఁగఁజాలక, తన్నుఁగా = తా నైన జీవుని, నామరూపాత్మకునింగాఁగా = నామరూపములు కలవానిఁగా, తలంచి = ఎంచి, సంసృతిచక్రంబునఁగా = సంసారచక్రమందు, పరిభ్రమించుచుండుఁగా = తిరుగుచుండఁగా, ఇట్లనాద్యనంతకాలంబు ప్రవర్తించుచుండి = ఇవ్విధముగా బహుకాలము వర్తించుచుండి, ఎట్టకేలకుఁగా = కొంతకాలమునకు, అనేకజన్మ = పెక్కుజన్మములయందు, ఆర్జిత = సంపాదింపఁబడిన, పుణ్యపుంజ = సుకృతరాశియొక్క, పరిపాక = పరిపక్వముయొక్క, విశేషంబువలనఁగా = సమృద్ధివలనను, మదనుగ్రహంబువలనఁగా = నా కృపవలనను, పరిశుద్ధహృదయుండును = స్వచ్ఛ మైన మనస్సు గలవాఁడును, సాధనచతుష్టయ = నిత్యానిత్యవస్తువివేకము యిహాముత్రార్థఫలభోగవిరాగము శమాదిషట్కసంపత్తి మోక్షేచ్ఛ యను నాలుగు నుపకరణములయొక్క, సంపత్ = సమృద్ధితోడ, విశిష్టుండు నై = కూడినవాఁడై, సద్గురుచరణంబు — సద్గురు = విహితగురువుయొక్క, చరణంబు = పాదమును, శరణంబునొంది = ఆశ్రయించినవాఁడై, తత్ = ఆ గురునియొక్క, ప్రసాద = అనుగ్రహముచేత, లబ్ధ = పొందఁబడిన, ఆత్మ = ఇది పరబ్రహ్మ మని, అనాత్మ = ఇది ప్రకృతి యని, వివేక = నిత్యానిత్యవస్తువుల నెఱుంగఁ దగిన, జ్ఞాన = అపరోక్షజ్ఞానముతోడ, సహితుండై = కూడినవాఁడై, అతండు = జీవుఁడు, కాయాద్యహంకృత్యంతం బైన = స్థూలదేహము మొదలు అహంకారమువఱకుఁ గల, ఇతరం బంతయుఁగా = అనాత్మ వంతయు, తాను గా నని = నేను గా నని, నిరాకరించి = వదలి, కలశజలనాశానంతరంబునఁగా = కడవలోని నీరింకినపిమ్మట, ఉపసూర్యకంబు = సూర్యప్రతిబింబము, మార్తాండునిం జెందినకైవడిఁగా = సూర్యునియం దైక్య మైనట్లు, ముకురవిరహం బగుచుండఁగా = అద్దము విడువఁబడుచుండఁగా, వదనాభాసంబు = ముఖప్రతిబింబము, ప్రధానాననంబునఁగా = ముఖ్య మైన ముఖ

అంతరహృదయమురొక్క నిర్మలవృత్తియందు నీళ్లకడవలో సూర్యబింబమును అద్దమందు ముఖప్రతిబింబమును కనఁబడినట్లు నానీడ కనఁబడి ఆ యంతఃకరణవృత్తిరూపోపాధి గలవాఁడై వ్యాపారము గల కారణము నగు చక్షురాదు లనునట్టిదియును అనుభవించుటకు యోగ్య మగు పదార్థము లనునట్టిదియును ఆ పదార్థవిషయకజ్ఞాన మను నట్టిదియును నగు ప్రత్యక్షాదిప్రమాణము లనెడు శబ్దజాలముచేత పలుకఁదగిన స్థూలశరీరసంబంధము లయిన అవకాశస్థానములయందు చేరిన కర్మేంద్రియ జ్ఞానేంద్రియములతోను ప్రాణపంచకముతోను గూడిన సంశయరూప మగు మనస్సుయొక్కయు చంచలాత్మక మగు చిత్తముయొక్క స్వరూప మయిన అంతరింద్రియవ్యాపార మనెడు గొప్పసాధనముచేత చక్షురాదికరణములచేతఁ బుట్టిన కార్యము లనునట్టియు ప్రాప్త మైన భోగము లనునట్టియు జ్ఞానముచేత నెఱుఁగఁదగిన దనునట్టియు ప్రమాణము లయిన కారణములచే గనించిన ప్రమేయములను శబ్దములచేఁ జెప్పఁదగిన శబ్ద స్పర్శ రూప రస గంధము లనెడు పంచవిషయముల ననుభవించుచు చేయువాఁడును, సహించువాఁడును, తెలుసుకొను వాఁడును, ప్రమాణములచేత ప్రమేయములను విచారించువాఁడును, శ్రోత్రేంద్రియముచేత శబ్దములను విను వాఁడును, త్వగింద్రియముచేత తాఁకువాఁడును, నేత్రేంద్రియముచేతఁ జూచువాఁడును, జిహ్వేంద్రియము చేత రుచి నెఱుఁగువాఁడును, ఘ్రాణేంద్రియముచేత వాసన చూచువాఁడును, వాగింద్రియముచేత పలుకు వాఁడును, హస్తేంద్రియముచేత నిచ్చువాఁడును, పాదేంద్రియముచేత నడుచువాఁడును, పాయ్వింద్రియము చేత మలమువిడుచువాఁడును, గుహ్యేంద్రియముచేత సంతోషించువాఁడును, పంచప్రాణములతోఁ గూడినవాఁడును, మననము చేయువాఁడును, దేహము గలవాఁడును, జీవుఁడును అనునట్లు గూఁయో వేళ్లచే ప్రకాశించుచు స్థూలశరీరమునకును జాగ్రదావస్థకును కర్తయై విశ్వుఁ డనెడు పేరుచేతను, లింగశరీరము నకును స్వప్నావస్థకును కర్తయై తైజసుఁ డను పేరుచేతను, కారణశరీరమునకును సుషుప్త్యవస్థకును అధికారియై ప్రాజ్ఞుఁడను పేరుచేతను ప్రసిద్ధిని జెంది సమస్తాభిలాషలతోఁ గూడినవాఁడై సూదంటురాతి చేరికవలెను సూర్యదర్శనము ననుసరించి తమతమ పనులయందు ప్రవర్తించు జనమువలెను ప్రపంచమునకు ఆశ్రయమయినవాఁడును, ప్రకృతికిని జీవునకు ప్రభు వైనవాఁడును, ప్రాచీను లయిన బ్రహ్మ విష్ణు రుద్రాదులకంటె శ్రేష్ఠుఁ డయినవాఁడును, పరబ్రహ్మ మైన తనకు ముఖ్యబింబ మగువాఁడును, ఇరువదియాఱవ వాఁడును (జ్ఞాత) ప్రకృతికి పర మైనవాఁడును, పరమాత్మయును నైన నా సాన్నిధ్యమువలన నాదివ్యతేజస్సును పొందియును పరబ్రహ్మ మైన నన్నెఱుఁగ లేక తా నగు జీవుని నామరూపములు గలవానిఁగా తలంచుచు సంసారచక్రమందు తిరుగుచుండును, ఈలాగు బహుకాలము సంచరించి కొంతకాలమునకు అనేకజన్మములయందు ఆర్జింపఁబడిన సుకృతపుంజములయొక్క పరిపక్వమువలనను నా యనుగ్రహము వలనను స్వచ్ఛ మయిన మనస్సు గలవాఁడును, నిత్యానిత్యవస్తువివేకము ఇహాముత్రఫలభోగవిరాగము శమాదిషట్కసంపత్తి మోక్ష మను నాలుగు సుపకరణములయొక్క సంపత్తితోఁ గూడినవాఁడును, సద్గురుపాదముల నాశ్రయించినవాఁడును ఆ సద్గురునివలన ఇది పరబ్రహ్మము ఇది ప్రకృతి యని నిత్యానిత్య వస్తువుల నెఱుఁగఁదగిన అపరోక్షజ్ఞానముతోడఁ గూడినవాఁడును నైన జీవుఁడు స్థూలదేహము మొదలు అహంకారమువఱకుఁ గల ఆత్మ కానిది యంతయు నేను గా నని నిరాకరించి కడవలోని యుదకము పోయిన పిమ్మట సూర్యప్రతిబింబము సూర్యునియం దైక్యము జెందునట్లును, అద్దము విఱిగిన అద్దము నందలి ముఖప్రతిబింబము ముఖమునందుఁ జేరునట్లును, ఇల్లు కుండ గోడ గాదె స్తంభము వస్త్రము మొద లగు సమస్తవస్తువులను ప్రత్యేకముగ విభాగింపఁగా సమస్తవస్తువులను విడుచుటకు అంత మైనదియును రూపము లేనిదియును నైన యాఘటపటాదులతోఁ గూడిన యాకాశము మహాకాశ మైనట్లును, స్థూల సూక్ష్మకారణదేహములకంటె వేఱైనవాఁడును, జాగ్రత్స్వప్నసుషుప్తులను చూచువాఁడును, పంచకోశ

ములకంటె భిన్నుఁడును (అనఁగా అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయము లనునవి పంచకోశము లనఁబడును) నై భాగింపఁగూడనట్టియు ఒకటేఁ నైనట్టియు సద్రూప చిద్రూప ఆనందస్వరూప మైనట్టియు అంతట నిండియున్నట్టియు బ్రహ్మస్వరూపమే యగును, అట్టి పరబ్రహ్మ స్వరూపమే పంచకోశాత్మక మగు శరీరముకంటెను జీవునికంటెను వేరైన యాత్మస్వరూపము, ఆ యాత్మస్వరూపమే నే నని చెప్పి మరల చెప్పుచున్నాఁ డని తాత్పర్యము

సా క్షి త్వ మ న న ము.

ఆ. పంచవిషయములను బంచేంద్రియములచేఁ, గాంచు తెలివి నేను కపివరేణ్య
పంచకోశములను బంచభూతంబుల, నెంచి చూచునట్టి యెఱుక నేను. ౧౧౨

టీక కపివరేణ్య = వానరేంద్రా, పంచవిషయములన్ = శబ్ద స్పర్శ రూప రస గంధములను, పంచేంద్రియములచేన్ = శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములచేత, కాంచుతెలివి = కనుఁగొనెడి యెఱుక, నేను = నేనే, పంచకోశములన్ = అన్నమయాది పంచకోశములను, పంచభూతంబులన్ = భూజ లాగ్ని వాయు గగనములను, ఎంచి = విభజించి, చూచునట్టి = కాంచునట్టి, ఎఱుక = జ్ఞానము, నేను = నేనే

తా ఓ వానరశ్రేష్ఠా! శబ్ద స్పర్శ రూప రస గంధములను శ్రోత్ర త్వక్ చక్షు ర్జిహ్వా ఘ్రాణముల చేత (శ్రోత్రము = చెవి, త్వక్ = చర్మము, చక్షుః = నేత్రము, జిహ్వ = నాలుక, ఘ్రాణము = ముక్కు) తెలిసికొను తెలివియును, అన్నమయాది పంచకోశములను పంచభూతములను విభజించి తెలిసికొను తెలివియును నే నని తాత్పర్యము.

లయవిభాతి. తెలిసె నిది నా కిపుడు తెలియ దది తెన్నగను
దెలియ వివరింపుదును దెలిసెద నటంచున్
బలికితిని బలుక నిఁకఁ బలికెద నటంచు మదిఁ
దలఁపను దలంచితిని దలఁచెద నటంచున్
వెలుపలను లోపలను దెలియఁబడు వృత్తులను
దెలియుచు వెలుంగులను వెలుఁగు లగు చుండన్
గలయ వెలిఁగించు తొలివెలుగునుని నేను నను
దెలియును వివేకదశ గల మనముచేతన్. ౧౧౩

టీక తెలిసె నిది నాకిపుడు = నాకిప్పు డిది తెలియవచ్చెను, అది = ఆ విషయము, తెన్నగన్ = చక్కఁగా, తెలియదు = తెలియరాదు, తెలియన్ = ఈవిషయము నీకు విశదమగునట్లు, వివరింపుదున్ = జెప్పుదును, తెలిసెదనటంచున్ = ఆవిషయమును చక్కఁగా తెలిసికొనెద నని, పలికితిన్ = వచించితిని, ఇఁకన్ = పిమ్మట, పలుకన్ = వచింపను, పలికెదనటంచున్ = వచియించెద నని యును, మదిన్దలఁపన్ = మనస్సునందు తలంచను, తలంచితిన్ = ఎంచితిని, తలఁచెదన్ = స్మరించెదను, అటంచున్ = అని, వెలుపలన్ = బాహ్యమందు, లోపలన్ = అంతరమందు, తెలియఁబడు వృత్తులన్ = గోచరము లగు చున్న యింద్రియ వ్యాపారములను, దెలియుచున్ = ఎఱుఁగుచు, వెలుఁగులన్ = సూర్యచంద్రాగ్ను లను, వెలుఁగు లగుచుండన్ = ప్రకాశించునట్లు, కలయన్ = అంతట, వెలిఁగించు తొలివెలుఁగు =

ప్రకాశింపఁజేయు సనాతనప్రకాశము, నేనుసుమీ = నేనేసుమా, ననున్ = సనాతనప్రకాశము గల నన్ను, వివేకదశ గల మనముచేతన్ = విజ్ఞానసంపత్తి గల మనస్సుచేత, తెలియుము = ఎఱుఁగుము

తా. నాకిపుడు దెలిసినది, ఆవిషయము చక్కఁగా తెలియలేదు, ఈవిషయము నీవు చక్కఁగా తెలియునట్లు చెప్పుదును, ఆవిషయమును చక్కఁగా నెఱిఁగెద నని పలికితిని, ఇఁకను బలుకను, చెప్పెద ననియును మనస్సునందు యెంచను, యెంచిలిని, తలఁచితిని, తలఁచెద నటంచు లోపలను వెలుపలను గోచరము లగు చున్న యింద్రియవ్యాపారములను తెలిసికొనుచు సూర్యచంద్రాగ్నులను ప్రకాశించునట్లు ప్రకాశింపఁజేయు సనాతనప్రకాశము నేనుసుమా, అట్టి సనాతనప్రకాశ మగు నన్ను విజ్ఞానసంపత్తి గల మనస్సుచే నెఱుఁగు మని తాత్పర్యము

లయవిభాతిలక్షణము॥ న స న న సగంబులును న స న న సగంబులును బొసఁగఁ గృతిపాదముల రసికముగఁ జెప్పన్। గుసుమశరవల్లభ్రశ వెస లయవిభాతి యని రసను సుకవీంద్రు లిల రసికులలి మెచ్చన్.

తా॥ న స న న స న న స న స స గ గణములును, పదియక్షరములకు మీఁద ప్రాసయుతులలో నేది యైనఁ గలుగఁ జెప్పిన లయవిభాతి యనుటు

మ. నతదేవా వెలిలోఁ బదార్థముల నానాఛిద్రభాండోదర
స్థితదీపం బెఱిఁగించుచందమున హృద్ధీప్రాణసర్వేంద్రియా
న్వితదేహస్థుఁడ నైన నేననిశముం నిర్హేతుకాజ్ఞానక
ల్పితబాహ్యాంతరనామరూపతతులన్ లీల న్వెలింగింపుదున్. ౧౧౪

టీక. నతదేవా = దేవతలచేత నమస్కరింపఁబడు చున్న ఓయాంజనేయా, నానా = అనేకము లైన, ఛిద్ర = రంధ్రములు గల, భాండ = కుండయొక్క, ఉదర = లోపల, స్థిత = ఉన్న, దీపంబు = దీపియు, వెలిలోఁబదార్థములన్ = వెలుపలి లోపలి వస్తువులను, ఎఱింగించు చందమునన్ = తెలియఁబఱచు చున్నట్లు, హృత్ = మనస్సుతోడ, ధీ = బుద్ధితోడ, ప్రాణ = దశవిధప్రాణములతోడ, సర్వేంద్రియ = జ్ఞానకర్మేంద్రియములతోడ, అన్విత = కూడిన, దేహస్థుఁడన్ = శరీరమం దుండెడువాఁడను, ఐన నేను = అగునట్టి నేను, అనిశము = ఎల్లప్పుడు, నిర్హేతుక = కారణము లేని, అజ్ఞాన = అవివేకముచేత, కల్పిత = ఆరోపింపఁబడిన, బాహ్యాంతర = వెలుపల లోపల నుండెడు, రూపతతులన్ = నామరూపసమూహములను, లీలన్ = విలాసమాత్రముగా, వెలింగింపుదున్ = ప్రకాశింపఁజేయుదును

తా. దేవతలచే నమస్కరింపఁబడు హోయాంజనేయా! అనేకరంధ్రములు గల కుండలో నున్న దీపము వెలుపలి లోపలి వస్తువులను తెలియఁజేయునట్లు మనస్సుతోడను బుద్ధితోడను దశవిధప్రాణములతోడను జ్ఞానేంద్రియ కర్మేంద్రియములతోడను గూడి శరీరమం దుండు నేను యెల్లప్పుడు కారణము లేని యవివేకముచేత ఆరోపింపఁబడిన వెలుపల లోపల నుండెడు నామరూపములయొక్క సమూహములను విలాసార్థము ప్రకాశింపఁజేయుదు నని తాత్పర్యము

ఉ. తమ్ము నెఱుఁగ లేవు విహితమ్ముగ దేహము ప్రాణపంక్తిచి
త్తమ్ము దశేంద్రియమ్ము లుచితమ్ముగ నన్యము గాన లేమి స
త్యమ్మగు నోకపీంద్ర సతతమ్మును వానిఁ దదీయకార్యజా
తమ్మును నేను గాంతు నన్యతమ్ముగ నన్ను బుధమ్ముగాఁ దగన్. ౧౧౫

టీక. ఓకపీంద్ర = ఓ యాంజనేయా, దేహము = కళేబరము, ప్రాణపంక్తి = ప్రాణముల గుంపు, చిత్తమ్ము = మనస్సు, దశేంద్రియమ్ములు = జ్ఞానకర్మేంద్రియములు, విధి వమ్ముగన్ = ఉన్నది వున్నట్టుగా, తమ్ముఁ = తమ్మును, ఎఱుంగలేవు = తెలుసుకొనఁజాలవు, (అవియే యెఱుంగనప్పుడు) ఉచితమ్ముగన్ = తగునట్లు, అన్యమున్ = ఇతరమును, కానలేమి = ఎఱుంగక పోవుట, సత్యమ్ము = యథార్థము, అగున్ = అవును, సతతమ్మున్ = ఎల్లప్పుడును, వానిన్ = ఆ దేహేంద్రియాదులను, తదీయ కార్యజాతమ్మును = ఆ దేహేంద్రియాదుల వ్యాపారజాలములను, నేను = సర్వసాక్షి నైన నేను, అనృతముగన్ = అసత్యముగాను, తగన్ = ఒప్పునటుల, నన్నున్ = పరబ్రహ్మమైన నన్నును, ఋతమ్ముగాన్ = సత్యముగాను, కాంతున్ = కనుఁగొందును

తా. ఓయాంజనేయా! దేహమును ప్రాణములును జ్ఞానేంద్రియకర్మేంద్రియములును యథార్థముగ తమ్మును తాము తెలుసుకొనఁజాలవు, తమ్మును తాము తెలుసుకొనఁజాలనవి యితరమును నెట్లు తెలుసుకొనును, అవి యితరమును తెలిసికొన కనుట యథార్థము, సర్వసాక్షి నైన నే నెప్పుడును ఆ దేహేంద్రియాదులను ఆ దేహేంద్రియములయొక్క వ్యాపారములను అసత్యముగాను పరబ్రహ్మమైన నన్ను సత్యముగాను జూతు నని తాత్పర్యము.

శా. ధీచేతోవిషయాత్మకంబు లగు జ్ఞాతృజ్ఞానవిజ్ఞేయముల్
సూచించుం దగఁ దల్లయోదయములన్ సుప్తిప్రబోధంబులే
నాచిత్రంబుల వానిఁ జేయు నిజమాయన్ సాక్షినై చూచుచున్
రోచిష్ణుత్వముచే వసింతు సదసద్రూపాతిరిక్తంబుగాన్. ౧౧౬

టీక. జ్ఞాతృ = తెలిసికొనువాఁడును, జ్ఞాన = తెలివియును, విజ్ఞేయములు = తెలియఁదగినవిషయములును, ధీ = ప్రజ్ఞయొక్కయు, చేతః = మనస్సుయొక్కయు, విషయ = నిశ్చయ సంకల్పవృత్తులే, ఆత్మకంబులు = స్వరూపములుగా గలవి, అగున్ = అవును, తగన్ = బాగుగా, తల్లయోదయములన్ — తత్ = ఆ జ్ఞాతృజ్ఞానవిజ్ఞేయములయొక్క, లయ = నాశనమును, ఉదయములన్ = ఉత్పత్తిని, సుషుప్తిప్రబోధంబులు = సుషుప్తిజాగ్రదవస్థలు, సూచించున్ = అగపడుచుండును, ఏను = ఆ త్రిపుటికి నతీతుఁడ నైన నేను, ఆ చిత్రంబులన్ = ఆ యాశ్చర్యములను, వానిన్ = ఆ జాగ్రత్స్వప్నసుషుప్తులను, చేయున్ = కలిగించెడు, నిజ = స్వకీయమైన, మాయన్ = ప్రకృతిని, సాక్షినై = కూటస్థబ్రహ్మమునై, చూచుచున్ = వీక్షించుచు, రోచిష్ణుత్వముచేన్ = ప్రకాశత్వముచేత, సదసద్రూపాతిరిక్తంబుగాన్ — సత్ = భావమైన, అసత్ = అభావమైన, రూప = ఆకృతులు గల వస్తువులను, అతిరిక్తంబుగాన్ = విలక్షణముగా, వసింతున్ = ఉందును

తా. తెలిసికొనువాఁడు తెలివి జ్ఞానము అనునవి మనస్సుయొక్కయు ప్రజ్ఞయొక్కయు సంకల్పవృత్తులే స్వరూపముగాఁ గలవి, అట్టి జ్ఞాతృజ్ఞేయజ్ఞానములయొక్క నాశమును యుత్పత్తిని సుషుప్తిజాగ్రదవస్థలు అగపడుచుండును, నేను కూటస్థబ్రహ్మము నై ఆయాశ్చర్యములను ఆ సుషుప్త్యవస్థలను కలిగించెడు స్వకీయమైన ప్రకృతిని చూచుచు ప్రకాశముచేత యున్నట్టిదియును లేనట్టిదియు నగు వస్తువులకంటె విలక్షణుఁడనై యుందు నని తాత్పర్యము

క. మత్సాన్నిధ్యమువలన న-చిత్తాహంకారపవనధీచిత్తేంద్రియముల్
వత్సా చలియించు నురఁగత్సదయస్కాంతసూచికలచందమునన్. ౧౧౭

టీక. వత్స = బాలకుఁడా, మత్సాన్నిధ్యమువలనన్ — మత్ = నాయొక్క, సాన్నిధ్యము వలనన్ = సన్నిధానబలమువలన, అచిత్ = అవ్యక్తమును, సాహంకార = ఆ యవ్యక్తజన్య మగు నహంకారముతోఁ గూడిన, పవన = ప్రాణాదివాయువులు, చిత్త = మనస్సు, ఇంద్రియములు = నేత్రశ్రోత్రాది దశేంద్రియములు, సుగంగత్ = మిగులఁ బ్రకాశించుచున్న, సత్ = శ్రేష్ఠమైన, అయస్కాంత = సూదంటుఱాతిసమీపమందు, సూచికలచందమునన్ = సూదులవలెనే, చలింపుచున్ = చేష్టించు చుండును

తా. బాలకుఁడా! సూదంటుఱాతిసమీపమునందు సూదులు చలించువిధమున అవ్యక్తము, అవ్యక్తమువలనఁ బుట్టిన సహంకారముతోఁ గూడిన ప్రాణాదివాయువులును, మనస్సును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములును యచేతనము లైనంగున తాము స్వయముగాఁ బ్రకాశింప లేక నాసమీపమునందుఁ బ్రకాశించు నని తాత్పర్యము (సూదంటుఱాతి నీడ సోఁకినమాత్రముచేతనే సూదులు కదలఁబాఱిన రీతిని దేహేంద్రియాదు లచేతనము లైనందున నాతేజస్సుచేత సంచరించును గాని తమంతట దిరుగ నేర వని భావము)

క. తప్తాయఃపిండాంత, ర్వ్యాప్తానలమండలంబుకైవడుపున మాయా
గుప్తబ్రహ్మాండసము, ద్దీప్తచిదాత్ముఁడ నేను ధీరవరేణ్యా. ౧౧౦

టీక ధీర = బ్రహ్మవేత్తలలో, వరేణ్య = ఉత్తముఁడా, తప్త = కాఁచఁబడిన, అయఃపిండ = ఇనుపముద్దయొక్క, అంతః = లోపల వెలుపల, వ్యాప్త = వ్యాపించిన, అనలమండలంబువడువునన్ = అగ్నిమండలమువలెనే, నేను = ఏను, మాయా = అవిద్యచేత, గుప్త = ఆవరింపఁబడిన, బ్రహ్మాండ = ప్రపంచమును, సముద్దీప్త = లెస్సగా వెలిఁగించుచున్న, చిదాత్ముఁడన్ = జ్ఞానస్వరూపుఁడను

తా. బ్రహ్మవేత్తలలో నుత్తముఁడ వగు గురూ యోగనేయా! కాఁచఁబడిన యినుపముద్దయొక్క లోపలను వెలుపలను వ్యాపించి యుండు అగ్నిమండలమువలె నేను అవిద్యచేత యావరింపఁబడిన ప్రపంచమును లెస్సగా వెలిఁగించుచున్న జ్ఞానస్వరూపుఁడని తాత్పర్యము.

సీ. ధరణీజలానలమరుదంబరాంతరా, విష్టాఖిలాధారద్రష్ట నేను
ఆదిత్యచంద్రగ్రహర్క్షతారాతటి, త్సంవ్యాప్తదివ్యతేజంబు నేను
అమరమానవతిర్యగాదిచేతనధీప్ర, కాశమానజ్ఞానఘనుఁడ నేను
బ్రహ్మాదిదేవతాప్రార్థనీయానంత, కల్యాణగుణకవిగ్రహుఁడ నేను
తే. కార్యరూపంబు లైన జగంబులకును, స్ఫురదుపాదానకారణంబును నిమిత్త
కారణము నైన నిర్మలాకారతత్త్వ, పరమమాయాసమన్వితేశ్వరుఁడ నేను.

టీక నేను = ఏను, ధరణి = భూమి, జల = ఉదకము, అనల = అగ్ని, మరుత్ = గాలి, అంబర = మిన్ను, (వీనియొక్క) అంతర = లోపల, ఆవిష్ట = వ్యాపించియున్న, అఖిలాధారద్రష్టన్ = సకలమున కాధారభూత మైన సాక్షిని, నేను = నేనే, ఆదిత్యచంద్ర = సూర్యచంద్రులయందు, గ్రహ = అంగారకాదిగ్రహములయందు, ఋక్ష = నక్షత్రములయందు, తారా = అశ్విన్యాదితారలయందు, తటిత్ = మెఱుపులయందు, సంవ్యాప్త = అవతరించియున్న, దివ్య = అప్రాకృత మైన, తేజంబున్ = ప్రకాశమును, నేను = నేనే, అమర = వేల్పులు, మానవ = నరులు, తిర్యక్ = పశు పక్షి మృగములు, ఆది = మొదలగుయిన, చేతన = ప్రాణులయొక్క, ధీ = బుద్ధిని, ప్రకాశమాన = వికసింపఁజేసెడు,

జ్ఞానఘనుఁడన్ = మహాజ్ఞానసంపన్నుఁడను, నేను = నేనే, బ్రహ్మాది = నలువ మొదలగు, దేవతా = వేల్పులచేత, ప్రార్థనీయ = వేఁడుకొనఁదగిన, అనంత = అనేకము లైన, కల్యాణగుణాక = శాంతశమదమాద్యనంతసద్గుణములతోఁ గూడిన, విగ్రహుఁడన్ = శరీరము గలవాఁడను, నేను = నేనే, కార్యరూపంబు లైన = దృశ్యము లైన, జగంబులకున్ = చతుర్దశభువనములకు, స్ఫురత్ = శోభిల్లుచున్న, ఉపాదానకారణంబును = ఘటశరావాదులకు మృత్తికవలె సమవాయకారణమును, నిమిత్తకారణంబును = కులాలుఁడును తద్వ్యాపారసాధనభూతము లగు చక్రదండాదులవలె నిమిత్తకారణమును, ఐన = ఐనట్టి, నిర్మలాకారసత్త్వ = శుద్ధసత్త్వస్వరూప మైన, పరమ = నిరతిశయ మైన, మాయాసమన్విత = కారణోపాధి యైన మాయతోఁ గూడిన, ఈశ్వరుఁడన్ = పరమాత్మను

తా. నేను భూమి ఉదకము అగ్ని గాలి ఆకాశము వీనియొక్క లోపల వ్యాపించియున్న సమస్తమున కాధారభూత మైన సాక్షిని, నేను సూర్యచంద్రులయందును అంగారకాదిగ్రహములయందును నక్షత్రములయందును అశ్విని మొదలగు తారలయందును మెఱపులయందును వ్యాపించియున్న అప్రాకృత మయిన ప్రకాశము, నేను దేవతలు మానవులు పక్షులు మృగములు మొదలయిన చేతనములయొక్క బుద్ధిని వికసింపఁజేసెడు మహాజ్ఞానసంపన్నుఁడను, నేను బ్రహ్మ మొదలగు దేవతలచేత స్తోత్రము చేయఁబడు శాంతశమదమాద్యనంతకల్యాణగుణములతోఁ గూడుకొన్న శరీరము గలవాఁడను, మఱియు నేను కార్యరూపము లగు పదునాలుగులోకములకు శోభిల్లుచున్న కుండ మూఁకుడు మొదలగువానికి మన్నువలె సమవాయికారణమును కులాలుఁడు (కుమ్మరవాఁడు) చక్రము దండము మొదలగువానివలె నిమిత్తకారణమును నగు కారణోపాధి యైన మాయతోఁ గూడిన పరమాత్మనని తాత్పర్యము

తే. వేదశాస్త్రాగమములచే వేదితవ్య
మైనవస్తువు నేను మహాత్ములకు
జపతపోదానయజ్ఞసంచయముచేత,
వరసమారాధనీయదైవంబు నేను ౧౨౦

టీక. వేద = ఋగ్యజుస్సామాధర్వణము లనెడు చతుర్వేదములచేత, శాస్త్ర = శిక్షాదిషట్శాస్త్రములచేత, ఆగమములచేన్ = కామికాదివాతూలాంతాష్టావింశన్మహాగమములచేత, వేదితవ్య మైన = ఎఱుఁగఁదగినవస్తువు, నేను = బ్రహ్మస్వరూపమును నేనే, మహాత్ములకున్ = సర్వజ్ఞు లైన మహానీయులకు, జప = అజపాగాయత్ర్యాదిజపములయొక్క, తపః = కృచ్ఛ్రచాంద్రాయణనిత్యనైమిత్తికశమదమాదితపస్సులయొక్క, దాన = గోదానాదిదానములయొక్క, యజ్ఞ = పాకహవిరాదియజ్ఞములయొక్క, సంచయముచేతన్ = సంఘముచేత, వర = లెస్సగా, సమారాధనీయ = ఆరాధింపఁదగిన, దైవంబున్ = దేవతను, నేను = నేనే.

తా. నేను ఋగ్యజుస్సామాధర్వణము లనెడు నాలుగు వేదములచేతను, శిక్షావ్యాకరణము మొదలుగాఁ గల యాఱుశాస్త్రములచేతను, కామిక మొదలుకొని వాతూలమువఱకు నుండు ఇరువదియెనిమిది మహాగమములచేతను తెలియఁదగిన పరబ్రహ్మముగాను, సమస్తముఁ దెలిసిన మహనీయుల గాయత్ర్యాదిజపములయొక్కయు కృచ్ఛ్రచాంద్రాయణ నిత్యనైమిత్తిక శమదమాది తపస్సులయొక్కయు గోదానము మొదలుగాఁగల దానములయొక్కయు పాకహవిరాది యజ్ఞములయొక్కయు సమూహముల చేత చక్కఁగా పూజింపఁదగిన దైవముగాను యున్నానని తాత్పర్యము.

తే. అనఘ సాకారుఁడను గాను విను సమష్టి
ఘనసలమద్వయుతాదాత్మ్యకమునకుఁ జేరఁబు

పరి నిరాకారుఁడను గాను సాక్షి నగుచుఁ
గారణశరీర మే నను కలఁక లేమి. ౧౨౧

టీక. అనఘ = రాగాదిమాలిన్యశూన్యుఁడ వైన యాంజనేయా, వినుము = ఆకర్ణింపుము, సాక్షి నగుచున్ = సర్వద్రష్టనై, సమష్టి = ఈశ్వరునియొక్క, ఘనతనుద్వయ = స్థూలసూక్ష్మశరీరముల యొక్క, తాదాత్మ్యమునకున్ = మేళనమునకు, చొరమిన్ = ప్రవేశింపనందున, సాకారుఁడనుగాను = సప్రకారజ్ఞానము గలవాఁడను గాను, పరి = స్థూలసూక్ష్మశరీరములకు సమతావస్థ యైన, కారణశరీరము = సమష్టికారణదేహము, ఏ నను కలఁక లేమిన్ = నే ననెడు భ్రమ లేనందున, నిరాకారుఁడను గాను = నిష్ప్రకారజ్ఞానము గలవాఁడను గాను

తా. మాలిన్యశూన్యుఁడ వైన యో యాంజనేయా! వినుము సమస్తమునకు సాక్షినై యీశ్వరుని స్థూలసూక్ష్మశరీరములయొక్క చేరికయందు ప్రవేశింపనందున సప్రకారజ్ఞానము గలవాఁడను గాను, స్థూలసూక్ష్మశరీరములకు సమాన మగు కారణశరీరము నే ననెడు భ్రమ లేనందున నిష్ప్రకారజ్ఞానము గలవాఁడను గా నని తాత్పర్యము

తే. అఖిలభూతములందు నే నఖిలభూత
ములును నాయందుఁ గలుగఁగ బొరయ నెందు
వాని నవియు నన్నంటవు వానరేంద్ర
సమత నొప్పారు గగనంబుచందమునను. ౧౨౨

టీక. వానరేంద్ర = కపిపుంగవా, సమతన్ = సమత్వముచేత, ఒప్పారు = ప్రకాశించుచున్న, గగనంబుచందమునన్ = ఆకాశమువలె, అఖిలభూతములందున్ = సమస్తప్రాణులయందు, ఏను = నేనును, అఖిలభూతములును = సకలజీవులును, నాయందున్ = నాలోపల, కలుగంగన్ = ఉండఁగా, ఎందున్ = ఎచ్చటను, వానిన్ = ఆ సకలభూతములను, పొరయన్ = అంటను, అవియున్ = ఆ ప్రాణులును, నన్నంటవు = నన్ను స్పృశింపవు - అనఁగా గగనము సకలమందును సకలము గగనమందును వసించినను, సకలవస్తువులను గగనమును గగనము సకలవస్తువులను స్పృశింపనటుల సకలభూతములయందు నేనును సకలభూతములు నాయందును వసించినను ఆ సకలభూతములును వానివికారములును నన్నంట వనుట.

తా. ఓ వానరశ్రేష్ఠా! ప్రకాశించుచున్న యాకాశమునందు సమస్తవస్తువులును సమస్తవస్తువుల యం దాకాశమును వసించినను సకలవస్తువులను గగనమును గగనము సమస్తవస్తువులను అంటనియట్లు సకలభూతములయందు నేనును నాయందు సకలభూతములును వసించినను ఆ సకలభూతములును వానివికారములును నన్నంట వని తాత్పర్యము.

క. మృగతృష్ణికల నెఱింగినఁ, దగ జలము లభావ మగు విధమునఁ దెలివిచే
నగుణుఁ డగు నన్ను దెలిసిన, జగములు నాయందు లేవు సత్యం బనఘా ౧౨౩

టీక. అనఘా = పాపరహితా, తగన్ = లెస్సగా, మృగతృష్ణికలన్ = ఎండమావులను, ఎఱింగినన్ = తెలుసుకొనినయెడల, జలములు = నీళ్లు, అభావ మగువిధమునన్ = శూన్య మైనటుల, తెలివిచేన్ = వివేకముచేత, అగుణుఁ డగు నన్నున్ = త్రిగుణాతీతుఁడ నైన నన్నును, తెలిసినన్ = ఎఱుఁగఁగానే, జగములు = చతుర్దశభువనములు, నాయందున్ = నాలోపల, లేవు = ఉండవు, సత్యంబు = నిక్కము.

తా. పాపరహితుఁడ వగు ఓ యాంజనేయా! తొలుత నెండమావులను జూచి జలము లని భ్రమసి వెనుక నెండమావు లని యెఱిఁగినవానికి జలము లగపడనట్టుల నన్నెఱిఁగినవానికి జగము లగపడక నేనే గనఁబడుదు నని తాత్పర్యము

చ. అనృత మచేతనం బసుఖ మైనజగంబు ఋతంబుఁ జేతనం
బును సుఖమై విమూఢులకు భోగముగాఁ గనుపట్టు నట్లు న
న్నెనయుటచేతఁ జుమ్మిది కపీంద్రఘృతాన్వితదుగ్ధపూరముల్
ఘనమధురంబు లై వెలయుకైవడి భక్తజనానురంజనా ౧౨౪

టీక. భక్తజనానురంజనా – భక్తజన = సేవకజనులను, అనురంజనా = సంతోషింపఁజేసెడు, కపీంద్ర = వానరశ్రేష్ఠుఁడ వైన ఆంజనేయా, ఘృత = నేతితోడ, అన్విత = కూడిన, దుగ్ధపూరములు = పాలసమూహము, ఘనమధురంబులై = మిగుల తీయనై, వెలయుకైవడిన్ = ప్రకాశించునట్లు, ఇది = ఈ కనఁబడుచున్న, అనృతము = అసత్యమును, అచేతనంబు = జడమును, అసుఖము = దుఃఖరూపమును, ఐన జగంబు = ఐన ప్రపంచము–అనఁగా అనృతజడదుఃఖాత్మక మైన శరీరసంఘము గల జగత్తు, విమూఢులకున్ = అజ్ఞానులకు, ఋతంబును = సత్యముగా, చేతనంబును = చైతన్యముగా, సుఖమై = ఆనందస్వరూపముగా, భోగముగాన్ = అనుభవయోగ్యముగా, కనుపట్టునట్లున్ = కనఁబడుచున్న దిది – అనఁగా సత్యజ్ఞానానందస్వరూపముగాఁ గనఁబడుట, నన్నున్ = సత్యజ్ఞానానందస్వరూపుఁడ నైన నన్ను, ఎనయుటచేతం జుమ్ము = పొందియుండుటచేత సుమా

తా. భక్తులను సంతోషింపఁజేసెడు వానరశ్రేష్ఠుఁడ వైన ఓ యాంజనేయా! నేతితోఁ గూడిన పాలు మధుర మైనట్లు యీ కనఁబడుచున్న అసత్యాచేతనదుఃఖాత్మక మగు శరీరసంఘము గల జగత్తు అజ్ఞానులకు సత్యముగాను చైతన్యముగాను ఆనందస్వరూపముగాను అనుభవయోగ్యముగాను కనఁబడుట యంతయు సత్యజ్ఞానానందస్వరూపుఁ డగు నన్ను పొందియుండుటచేతనే యని తాత్పర్యము

క. జ్ఞానుల కఖండసత్యజ్ఞానానందస్వరూపసాక్షి నగుచు వి
జ్ఞానముచేఁ దెలియంబడి, నేనై సాక్షాత్కరింతు నిక్కం బనఘా. ౧౨౫

టీక. ఓ అనఘా = ఓ దురితదూర, జ్ఞానులకున్ = బ్రహ్మజ్ఞానులకు, అఖండ = అంతట నిండి యున్న, సత్య = సద్రూప మైన, జ్ఞాన = చిద్రూప మైన, ఆనందస్వరూప = సుఖస్వరూప మైన, సాక్షి నగుచున్ = ద్రష్టనై, విజ్ఞానముచేత = పరోక్షరహితజ్ఞానముచేత, తెలియంబడి = ఎఱుంగఁబడి, నేనై సాక్షాత్కరింతున్ = చూచువాఁడను నేనై యావిర్భవింతును, నిక్కంబు = సత్యము (ద్రష్టను నేనే యగుదు ననుట)

తా. ఓ పాపరహితుఁడా! బ్రహ్మజ్ఞానులకు అంతట నిండి యున్న సద్రూపమును చిద్రూపమును ఆనందస్వరూపమును నైన సాక్షి నగుచు పరోక్షరహితజ్ఞానముచేతఁ దెలియఁబడుచుందును, ఇట్లు చూచు వాఁడనై యావిర్భవించుట సత్య మని తాత్పర్యము.

తే. అట్లు గావున ననఘ మహాత్ము లెల్ల
సచ్చిదానందమయునిఁగా సర్వకర్త
కరణకార్యములకు సాక్షిగాఁగ నన్ను
గీ. దెలిసి యనవరతంబు చింతింపవలయు. ౧౨౬

టీక. అనఘ = ఓ అఘవినాశనా, అట్లుగావునఁ = నేనైన సాక్షాత్కరించుటవలన, మహాత్ము లెల్లన్ = బ్రహ్మజ్ఞాను లందఱు, నన్నున్ = కేవలాత్మ నైన నన్ను, సచ్చిదానందమయునిఁగాన్ = సత్య జ్ఞానానందస్వరూపునిఁగాను, సర్వకర్తృకరణకార్యములకున్—సర్వ= సమస్తము లైన, కర్తృ = అహం కర్త భోక్త యను కర్తృత్వములకు, కరణ = చతుర్దశేంద్రియములకు, కార్యములకున్ = ఆ యింద్రియ వ్యాపారములకు, సాక్షిగాఁగన్ = అధిష్ఠాతఁగా, తెలిసి = ఎఱిఁగి, అనవరతంబు = ఎల్లప్పుడు, చింతింప వలయున్ = స్మరణ చేయవలెను.

తా. ఓయి పాపరహితా! నేనై సాక్షాత్కరించుటవలన బ్రహ్మజ్ఞాను లందరు నన్ను సత్యజ్ఞానా నందస్వరూపునిఁగాను సమస్తము లైన కర్తృత్వములను (నేను చేయువాఁడను, నేను భుజించు వాఁడను అను కర్తృత్వములు) కరణము లగు చతుర్దశేంద్రియములను ఆ యింద్రియవ్యాపారముల ను అధిష్ఠాతనుగా నెఱిఁగి యెల్లప్పుడు స్మరణ చేయవలయు నని తాత్పర్యము

క. అన విని హనుమంతుఁడు రా,ముని దివ్యపదారవిందములకు ఘనవం
దన మాచరించి పలికెన్, వినయము భక్తియును దృఢవివేకము మెఱయన్.

టీక. అన విని = ఇట్లు చెప్పఁగా విని, హనుమంతుఁడు = ఆంజనేయుఁడు, రాముని = శ్రీరామ చంద్రునియొక్క, దివ్య = అప్రాకృతము లైన, పదారవిందములకున్ = పాదపద్మములకు, ఘనవందన మాచరించి = సాష్టాంగప్రణామము గావించి, వినయమున్ = అడఁకువయు, భక్తియున్ = ప్రీతియు, దృఢవివేకమున్ = నిశ్చయజ్ఞానమును, మెఱయన్ = ప్రకాశింపఁగా, పలికెన్ = వచియించెను

తా. ఇట్లు చెప్పఁగా విని యాంజనేయుఁడు శ్రీరామచంద్రునియొక్క అప్రాకృతపాదారవింద ములకు సాష్టాంగప్రణామం బాచరించి అడఁకువయును ప్రీతియును నిశ్చయజ్ఞానమును ప్రకాశింపఁగా పలికె నని తాత్పర్యము.

ఉ. ఏనియమంబులం గలిగి యేసమయంబున నెవ్విధంబునన్
మౌనము పూనిరో యదియు మానిరొ మంత్రము తంత్ర మెద్దియో
నీనయరూప మారయఁగ నిర్గుణమో సగుణంబొ నెమ్మదిన్
ధ్యానము సేయఁగా వలయు నన్నియుఁ బ్రేమ నెఱుంగఁ జెప్పవే.      ౧౨౮

టీక. ఏ నియమంబులం గలిగి = ఏ యాచారములు గలిగి, ఏ సమయంబునన్ = ఏ కాలమందు, ఎవ్విధంబునన్ మౌనముఁబూనిరో = ఏలాటి యుత్తమ మైన తూష్ణీంభావము గలిగి యుండిరో—అనఁగా

త్రి వి ధ మౌ న వి వే చ న ము.

వాఙ్మౌనము, అక్షమౌనము, కాష్ఠమౌన మని మౌనము త్రివిధము, అందు మాటలాడక యుండుట వాఙ్మౌ నము, ఇంద్రియములఁ గుదియించిపట్టుట అక్షమౌనము, చేష్టారహితుఁడై యుండుట కాష్ఠమౌనము, అదియు మానిరొ = ఆ మౌనము విడిచిరో, మంత్రము = రహస్యమును, తంత్రము = క్రియయు, ఎద్దియో = ఏదో, నీనయరూప మారయఁగన్ = సౌలభ్యసహిత మైన నీరూపము విచారింపఁగా, నిర్గు ణమో = త్రిగుణములు లేనిదో, సగుణంబో = త్రిగుణములు గలదో, నెమ్మదిన్ = స్థిరబుద్ధితో, ధ్యానము సేయఁగావలయున్ = మననము చేయవలెను, అన్నియున్ = ఇపుడు నే నడిగిన వన్నియు, ప్రేమతోన్ = ప్రీతితో, ఎఱుంగఁజెప్పవే = తెలియఁజెప్పవయ్యా

తా. ఓ మహానుభావా! రామమూర్తీ! నీ రూపమును ధ్యానము చేయవలయును గనుక నీ రూప మెట్టిదో (అనఁగా త్రిగుణములతోఁ గూడినదియో, లేక త్రిగుణాతీత మైనదియో) దానిని యెట్లు ధ్యానము చేయవలయునో (అనఁగా యేకాలమందు యేయాచారములను గలిగియో - వాగ్మైన అత్యున్నత శాస్త్ర జ్ఞానమ లనెడు జ్ఞానత్రయమును గలిగియో) దానిని నాకుఁ బ్రీతితో తెలియఁజెప్పవే యని రామ మూర్తిని యాంజనేయుఁ డడిగె నని తాత్పర్యము

క. అనినఁ జిఱునవ్వు నవ్వుచు, మనమున దేహాత్మబుద్ధి మల్లడిగొన ని
ట్లనియెడు నాహనుమంతునిఁ, గనుఁగొని రాముండు పలికెఁ గౌతుక మలరన్.

టీక అనినన్ = అని పలుకఁగా, చిఱునవ్వునవ్వుచున్ = మందహాసము చేయుచు, మనమునన్ = అంతరంగమందు, దేహాత్మబుద్ధి = శరీరమే బ్రహ్మమనెడు తలంపు, మల్లడిగొనన్ = పెనఁగొనఁగా, ఇట్లనియెడు నాహనుమంతునిన్ = పైనఁ జెప్పినతీరునఁ బలికెడి యాంజనేయుని, కనుఁగొని = చూచి, రాముండు = శ్రీరామమూర్తి, కౌతుక మలరన్ = ఆనంద ముప్పొంగఁగా, పలికెన్ = వచియించెను.

తా. ఆంజనేయుఁ డిట్లడుగఁగా రామమూర్తి చిరునవ్వు నవ్వి మనస్సునందు శరీరమే బ్రహ్మ మనెడు తలంపు పెనఁగొనఁగా పైనఁ జెప్పినవిధమున బలికెడు యాంజనేయుని కనుఁగొని శ్రీరామమూర్తి ఆనందముతోఁ బలికె నని తాత్పర్యము.

ఉ. వానరనాథ దేహమును వాయువు లింద్రియపంక్తి చిత్తమున్
మానసబుద్ధు లేననుచు మానము పూనిన మానవాళికిన్
జ్ఞానము దేశకాలనియమంబులు మంత్రము తంత్రము ల్విధుల్
వానిని జూచు సాక్షి ననువానికిఁ గల్గునె తద్వికారముల్. ౧౩౦

టీక వానరనాథ = ఓ మర్కటేంద్రా, దేహమును = శరీరమును, వాయువులున్ = ప్రాణాది దశ వాయువులును, ఇంద్రియపంక్తి = శ్రోత్రాదింద్రియసమూహమును, చిత్తమున్ = చేతస్సును, మానస బుద్ధులు = మనస్సును బుద్ధియును, ఏ ననుచున్ = నే నని, మానము = అభిమానము, పూనినమానవాళికిన్— పూనిన = వహించిన, మానవాళికిన్ = జనసంఘమునకు, జ్ఞానము = పైనఁ జెప్పిన త్రివిధజ్ఞానములును, దేశకాలనియమంబులు = దేశసమయాచారములును, మంత్రము = రహస్యమును, తంత్రములు = కర్మము లును, విధులు = ప్రమాణములును, వానిన్ = ఆ శరీరేంద్రియాదులను, చూచుసాక్షిననువానికిన్ = కనుఁ గొను ద్రష్ట నే ననెడు పురుషునకు, తద్వికారములు = ఆ దేహేంద్రియాదులవిక్రియలు, కల్గునే = సంభ వించునా

తా. వానరులలో శ్రేష్ఠుఁడ వగు యో యాంజనేయా! శరీరమును ప్రాణవాయువు మొదలగు దశవాయువులును శ్రోత్రము మొదలుగాఁ గల యింద్రియములును మనస్సును బుద్ధియును నే నని యభి మానమును బొందిన మనుష్యసమూహమునకు పైనఁ జెప్పిన త్రివిధజ్ఞానములును దేశకాలనియమములును మంత్రతంత్రములును (మంత్రము = రహస్యము, తంత్రము = కర్మ) ప్రమాణములును ఆ శరీరేంద్రియాదుల యొక్క వికారములును లే వని తాత్పర్యము.

ఆ రూ ఢు ని ల క్ష ణ ము.

శా. ఆత్మానాత్మలు రెండువస్తువులు లోకఖ్యంబు ల్గదా యం దనా
త్మాత్మభ్రాంతి యనాదినుండి సహజం బై యుండఁగా నిప్పు డీ

వాత్మజ్ఞప్తి వటంచుఁ జెప్పితిఁక నన్యం బేమియు న్లేదు శు
ద్ధాత్మప్రత్యగభిన్నపూర్ణపరమాత్మారాముని దక్కఁగన్. ౧౩౧

టీక ఆత్మానాత్మలు—ఆత్మ = పంచలక్షణసమన్విత మైన పరబ్రహ్మ మనెడు, అనాత్మలు = నామరూపాత్మిక మైన ప్రకృతి యనెడు, రెండువస్తువులు = ఈ వస్తుద్వయము, లక్ష్యంబుల్గదా = భావాభావము లని నీకుఁ దెలియఁబడినవే గదా, అందున్ = ఆ వస్తుద్వయమందు, అనాత్మాత్మభ్రాంతి— అనాత్మ = దేహేంద్రియాదులే, ఆత్మ = నే ననెడు, భ్రాంతి = భ్రమ, అనాదినుండి = సృష్ట్యాది నుంచి, సహజంబైయుండఁగాన్ = స్వభావమైయుండఁగా, ఇప్పుడు = ఏతత్కాలమందు, ఈవు = నీవు, ఆత్మజ్ఞప్తివి = జ్ఞప్తికళామాత్ర మైన అక్షరస్వరూపుండవు, అటంచున్ = అని, చెప్పితిన్ = వచించితిని, ఇఁకన్ = ఇఁకమీఁద, శుద్ధ = నిర్మల మైన, ఆత్మ = పరబ్రహ్మమువలన, ప్రత్యక్ = కూటస్థచైతన్యమునకును, అభిన్న = వేఱుగాని, పూర్ణ = అఖండ మైన, పరమ = నిరతిశయ మైన, ఆత్మారామునిన్ = అంతరాత్మను, తక్కఁగన్ = విడఁగా, అన్యంబు = వేఱైనది, ఏమియును లేదు = ఏమాత్రము గలుగదు

తా. పంచలక్షణములతోఁ గూడిన పరబ్రహ్మ మనునట్టియు నామరూపములు గల ప్రకృతి యనునట్టియు రెండువస్తువులలో మొదటిది యగు పరబ్రహ్మము భావరూప మనియు, రెండవదియగు ప్రకృతి అభావరూపమనియు నీకుఁ దెలియఁబడినదే గదా ఆ రెండువస్తువులయందు దేహేంద్రియాదులే నే ననెడు భ్రమ సృష్టియొక్క ఆదినుండి స్వభావమై యుండఁగా నిప్పుడు జ్ఞప్తికళామాత్ర మైన యక్షరస్వరూపుఁడవని చెప్పితిని, ఇఁకమీఁద చెప్పునదే మనిన, నిర్మల మగు పరబ్రహ్మముకంటెను కూటస్థచైతన్యముకంటెను వేఱుగాని నిరతిశయ మైన అంతరాత్మనివినా యన్యమేదియు లే దనునదే యని తాత్పర్యము.

క. అసమానసమగ్రతురీయసమాధినిఁ బొందు మింద్రియమనోబుద్ధి
శ్వసనగ్రసనాభ్యసనవ్యసనము వెస నుడిగి సమరసాత్ముఁడ వగుచున్. ౧౩౨

టీక. ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములను, మనః = మనస్సును, బుద్ధి = ప్రజ్ఞను, శ్వసన = పంచప్రాణములను, గ్రసన = లయింపఁజేయవలయు ననెడి, అభ్యసన = అభ్యాసమందలి, వ్యసనము = వ్యాకులమును, వెసన్ = శీఘ్రముగా, ఉడిగి = వదలి, సమరసాత్ముఁడ వగుచున్—సమరస = ఏకీభావము గల, ఆత్ముఁడ వగుచున్ = బుద్ధి గలవాఁడవై, అసమాన = సమానము గాని, సమగ్ర=సంపూర్ణమై, తురీయసమాధిన్ = నిర్వికల్పసమాధిని, పొందుము = చెందుము

తా జ్ఞానేంద్రియకర్మేంద్రియములను మనస్సును ప్రజ్ఞను పంచప్రాణములను లయింపఁజేయవలయు ననెడు యభ్యాసమందలి వ్యాకులమును వదలి యేకీభావము గల బుద్ధి గలవాఁడవై సమానము గానట్టిదియును సంపూర్ణ మైనదియును నగు నిర్వికల్పసమాధిం జెందు మని తాత్పర్యము.

క. మాయామయజాయాసుత, కాయేంద్రియమానసాదిక పరిత్యాగో
పాయజ్ఞేయామేయ, ధ్యేయాత్ముఁడ వీవు గురువిధేయాత్మవరా. ౧౩౩

టీక. గురు = ఉపదేష్టలకు, విధేయ = నమ్ర మైన, ఆత్మ = బుద్ధి గలవారిలో, వరా = శ్రేష్ఠుఁడా, ఈవు = నీవు, మాయామయ = మాయావికారము లైన, జాయా = భార్య, సుత = పుత్త్రులు, కాయ = శరీరము, ఇంద్రియ = జ్ఞానేంద్రియకర్మేంద్రియములు, మానసాదిక = మనోబుద్ధిచిత్తాహంకారాదులు (వీనియొక్క) పరిత్యాగోపాయ = విడువఁదగిన యుక్తిని, జ్ఞేయ = ఎఱిఁగిన, అమేయ = ప్రమాణాతీత మైన, ధ్యేయాత్ముఁడవు = జ్ఞేయస్వరూపుఁడవు.

తా. గురువిధేయుఁడ వగు ఓయాంజనేయా! నీవు మాయికవికారము లగు భార్యాపుత్త్రులను, శరీరేంద్రియములను, మనోబుద్ధిచిత్తాహంకారాదులను వీనిని వదలుటకుఁ దగిన యుక్తిని దెలిసిన ప్రమాణాతీత మైన జ్ఞేయస్వరూపుఁడ వని తాత్పర్యము

సీ. ఏదేశమున నైన నేకాలమున నైన, నేమి సేయుచు నైన నెట్టు లైన
నఖిలవికారంబు లావిద్యకంబులు, నే నవికారుండ నిష్ప్రపంచ
నిర్వికల్పాఖండనిశ్చలనిర్మలా,వ్యయసచ్చిదానందమయనిరీహ
పరిపూర్ణనిర్గుణప్రత్యగాత్మాభిన్న,పరమాత్ముఁడ నటంచుఁ బరమనిష్ఠ
తే. సంతతంబును దనుఁ గాంచు సజ్జనునకు, మంత్రతంత్రంబు లేల కర్మంబు లేల
జపతపోవ్రతదానయజ్ఞంబు లేల, నామవర్ణాశ్రమాభిమానంబు లేల. ౧౩౪

టీ. ఏదేశముననైనన్ = ఏస్థలమం దైనను, ఏకాలముననైనన్ = ఏసమయమం దైనను, ఏమి సేయుచునైనన్ = ఏపనిచేయుచునైనను, ఎట్టులైనన్ = మఱి యెవ్విధముగ నైనను, అఖిలవికారంబులు = సమస్తవిక్రియలు, అవిద్యకంబులు = అజ్ఞానకల్పితములు, నేను = ఏను, అవికారుఁడన్ = అజ్ఞానవికారములు లేనివాఁడను, నిష్ప్రపంచ = ప్రపంచశూన్య మైన, నిర్వికల్ప = కల్పనారహిత మైన, అఖండ = సంపూర్ణ మైన, నిశ్చల = కదలిక లేని, నిర్మల = పరిశుద్ధ మైన, అవ్యయ = నాశము లేని, సత్ = సత్యస్వరూప మైన, చిత్ = జ్ఞానస్వరూప మైన, ఆనందమయ = సంసారదుఃఖనివృత్తిపూర్వక సుఖస్వరూప మైన, నిరీహ = ఆకారరహిత మైన, పరిపూర్ణ = అంతట నిండియున్న, నిర్గుణ = త్రిగుణాతీత మైన, ప్రత్యగాత్మ = కూటస్థునికంటె, అభిన్న = వేఱు గాని, పరమాత్ముఁడన్ = పరబ్రహ్మమును, అటంచున్ = అని, పరమనిష్ఠన్ = తురీయసమాధిచేత, సతతంబున్ = ఎల్లప్పుడు, తనుఁ గాంచు సజ్జనునకున్ = ఆత్మావలోకనఁ జేసెడు సత్పురుషునకు, మంత్ర = ప్రణవాదిమంత్రములును, తంత్రంబులు = శాస్త్రములును - లేక విధులును, ఏల = ఎందుకు, కర్మంబు లేల = విధినిషేధకామ్యప్రాయశ్చిత్తాది కర్మము లెందుకు, జప = గాయత్ర్యాదిమంత్రజపములును, తపః = చాంద్రాయణాదితపస్సులును, వ్రత = ఏకాదశీ శివరాత్ర్యాది వ్రతములును, దాన = గోదానాదిదానములును, యజ్ఞంబులు = పాకహవిరాదియాగములును, ఏల = ఎందుకు, నామ = అన్వర్థనామధేయములును, వర్ణ = బ్రాహ్మణాది వర్ణములును, ఆశ్రమ = బ్రహ్మచర్యాద్యాశ్రమములును, అభిమానంబులు = కర్తృత్వాద్యభిమానములును, ఏల = ఎందుకు, ఏవియు వల దని భావము.

తా. ఏస్థలమం దైనను నేకాలమం దైనను నేపనులు చేయుచు నైనను మఱి యేవిధముగ నైనను సమస్తవికారములు అజ్ఞానకల్పితము లనియు తాను వికారము లేనివాఁ డనియు ప్రపంచశూన్య మైనట్టిదియును కల్పనారహిత మైనట్టిదియును సంపూర్ణ మైనట్టిదియును కదలలేనట్టిదియును పరిశుద్ధ మైనట్టిదియును నాశము లేనట్టిదియును సత్యస్వరూప మైనట్టిదియును జ్ఞానస్వరూప మయినదియును సంసారదుఃఖమును పోఁగొట్టి సుఖమును గలుగఁజేసెడు సుఖస్వరూప మైనట్టిదియును ఆకారరహిత మయినదియును అంతట నిండియున్నదియును త్రిగుణాతీత మైన కూటస్థునికంటె వేఱు గానిదియును నగు పరబ్రహ్మము నే నని తురీయసమాధిచేత నెల్లప్పుడు ఆత్మావలోకనము చేయు సత్పురుషునకు ప్రణవాదిమహామంత్రములును, శాస్త్రములును, విధినిషేధప్రాయశ్చిత్తాది కర్మములును, గాయత్రీ మొదలగు మహామంత్రజపములును, చాంద్రాయణాది తపస్సులును, ఏకాదశీ శివరాత్రి మొదలగు వ్రత

ములును, గోదానము మొదలగు దానములును, అశ్వమేధాదియాగములును, బ్రాహ్మణాదివర్ణములును, బ్రహ్మచర్యము మొదలగు ఆశ్రమములును, కర్తృత్వాద్యభిమానములును నివి యన్నియును నిరర్థకము లని తాత్పర్యము

**తే.** వాయుసుత సర్వవాసనావాసితంబు, సూక్ష్మదేహంబు జడ మగుచు సుమ్ము దాని
నంటక వెలుంగుచుండు చిదాత్ముఁ డచ్చి, దాత్ముఁ డగువానివిక్రృతు లెట్లంటు ననఘ.

టీక అనఘ = పాపరహితుఁడ వైన, వాయుసుత = ఆంజనేయా, సూక్ష్మదేహంబు = లింగశరీరము, సర్వ= సమస్తము లైన, వాసనా = అభిలాషలచే, వాసితంబు = స్థాన మైనదియును, జడము= అజ్ఞానమయమును, అగుసుమ్ము = అగుసుమా, చిదాత్ముఁడు = పరబ్రహ్మము, దానిన్ = ఆ యజ్ఞానరూప మైన లింగశరీరమును, అంటక = స్పృశింపక, వెలుంగుచుండున్ = ప్రకాశించుచుండును, అచ్చిదాత్ముఁడగువానిన్ = ఆ పరబ్రహ్మము తానైనవానిని, వికృతులు = ప్రకృతివికారములు, ఎట్లంటున్= ఏలాగు స్పృశించును

తా పాపరహితుఁడ వగు నో యాంజనేయా! లింగశరీరము సమస్తాభిలాషలచే స్థాన మైనదియును అజ్ఞాన మైనదియును నై యున్నది, పరబ్రహ్మమో ఆ యజ్ఞానరూప మైన లింగశరీరము నంటకనే వెలుఁగుచుండును, అట్టి పరబ్రహ్మమే తానుగా నున్నవానిని ప్రకృతివికారములు యెట్లు స్పృశింపఁ గల వని తాత్పర్యము

**సీ.** ఘటగతనానావికారము ల్తత్ప్రకా, శకసూర్యు నంటనిచందమునను
దేహేంద్రియప్రాణధీమనోహంకార, తద్ధర్మతతులు తద్భాసకుండు
సాక్షియై యొప్పారు సచ్చిదానందమ, యాత్మునిఁ బొరయవయ్యాత్ముఁ డగుచు
వెలుఁగుపండితున కెవ్విధమునఁ గల్గు వర్ణాశ్రమాచారాదు లరసిచూడఁ
**తే** కర్త గాఁడు గానఁ గరణకార్యములును, భోక్త గాఁడు గాన భోజ్యభోగ
ములును లేవు సర్వమును గల్గ దతనికి, సర్వరూపుఁ డగుట సాధువర్య ౧౩౬

టీక సాధువర్య = సత్పురుషశ్రేష్ఠుఁడ వైన యాంజనేయా! ఘట = కుండ, గత = పొందఁబడిన ప్రతిబింబముయొక్క, నానా = బహుప్రకారము లయిన, వికారములు = జలచలనాదివికారములు, తత్ప్రకాశకసూర్యున్ — తత్ = ఆ ప్రతిబింబమును, ప్రకాశక = అధిష్ఠానమై శోభిల్లఁజేయుచున్న, సూర్యున్ = అర్కుని, అంటనిచందమునన్ = స్పృశింపనియట్లు, దేహ = శరీరత్రయమును, ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములును, ప్రాణ = పంచప్రాణములును, ధీ = బుద్ధియును, మనః = మనస్సును, అహంకార = అహంభావమును, తత్ = ఆ దేహేంద్రియాదులయొక్క, ధర్మ = స్వభావము లైన జాగ్రత్స్వప్నసుషుప్త్యాదులయొక్క, తతులు = సంఘములు, తద్భాసకుండు — తత్ = ఆ దేహేంద్రియాది ధర్మములను, భాసకుండు = వెలుఁగఁజేసెడు, సాక్షియై = ద్రష్టయై, ఒప్పారు= శోభిల్లుచున్న, సత్ = సద్రూపుఁడును, చిత్ = జ్ఞానస్వరూపుఁడును, ఆనందమయ = సుఖస్వరూపుఁడు నైన, ఆత్మునిన్ = పరబ్రహ్మమును, పొరయవు = అంటవు, అరసిచూడన్ = విచారించిచూడఁగా, అయ్యాత్ముఁడగుచున్ = అట్టి పరబ్రహ్మస్వరూపియై, వెలుఁగుపండితునకున్ = ఒప్పెడు బ్రహ్మవేత్తకు, వర్ణ = బ్రాహ్మణాదివర్ణములును, ఆశ్రమ = బ్రహ్మచర్యాద్యాశ్రమములును, ఆచార = వర్ణాశ్రమములకుఁ దగిన నియమములును, ఆదులు = మొదలగునవి, ఎవ్విధమునన్ = ఎట్లు, కల్గున్= సంభవించును,

కర్త గాఁడు గానన్ = అభిమాని కాఁడు గనుక, కరణ = చతుర్దశేంద్రియములయొక్క, కార్యములును = విషయము లయిన శబ్దస్పర్శాది సర్వవ్యాపారములును, భోక్త గాఁడు గానన్ = అనుభవించువాఁడు కాఁడు గనుక, భోజ్యభోగములును—భోజ్య = అనుభవింపఁదగిన పదార్థములును, భోగములును = అనుభవములును, లేవు = కలుగవు, సర్వరూపుఁడగుటన్ = సకలస్వరూపుఁ డగుటవలన, అతనికిన్ = ఆ బ్రహ్మవేత్తకు, సర్వమును = పైనఁ జెప్పఁబడిన దంతయు, కల్గదు = సంభవింపదు.

తా. సత్పురుషులలో శ్రేష్ఠుఁడ వగు యోగాంజనేయా! కుండను బొందిన ప్రతిబింబముయొక్క నానావిధము లయిన జలచలనాదివ్యాపారములు ఆ బింబమున కధిష్ఠానమై ప్రకాశింపఁ జేయుచున్న సూర్యుని యంటనియట్లు శరీరత్రయమును జ్ఞానేంద్రియకర్మేంద్రియములును పంచప్రాణములును బుద్ధియును మనస్సును అహంభావమును ఆ యింద్రియాదులకు స్వభావము లయిన జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును ఆ దేహేంద్రియాదిధర్మములను వెలుఁగఁ జేయుచు సాక్షియై ప్రకాశించు సద్రూపుఁడును జ్ఞానస్వరూపుఁడును సుఖస్వరూపుఁడును నైన పరబ్రహ్మమును అంటవు, విచారించిచూడఁగా నట్టి పరబ్రహ్మస్వరూపియై యొప్పు బ్రహ్మవేత్తకు బ్రాహ్మణాదివర్ణములును బ్రహ్మచర్యాద్యాశ్రమములును ఆ వర్ణాశ్రమములకుఁ దగిన నియమములును గలుగనేరవు, బ్రహ్మవేత్త కర్త గాఁడు గనుక చతుర్దశేంద్రియములయొక్క వ్యాపారములు లేవు, భోక్త గాఁడు గనుక అనుభవములును అనుభవింపఁదగిన పదార్థములును లేవు, మఱియు నితఁడు సకలవస్తుస్వరూపుఁ డగుటవలన నేదియు నితనికి లే దని తాత్పర్యము.

క. జ్ఞాని యనఁగ వే ఱొక్కఁడె, నేనసుమీ తెలియ నాతనికి నాకును సు
జ్ఞానముచేఁ బరికించినఁ, గానఁబడదు భేద మెందుఁ గవినుతచరితా. ౧౩౮

టీ. కవి = వాల్మీకాదికవులచేత, నుత = పొగడఁబడిన, చరితా = నడవడిగల యోగాంజనేయా, జ్ఞాని యనఁగన్ = బ్రహ్మవేత్త యనఁగా, వే ఱొక్కఁడె = అన్యుఁడా, తెలియన్ = ఎఱిఁగిన, నేన సుమీ = నేనేసుమా, సుజ్ఞానముచేన్ = బ్రహ్మసాక్షాత్కారజ్ఞానముచేత, పరికించినన్ = విచారింపఁగా, అతనికిన్ = ఆ బ్రహ్మవేత్తకును, నాకున్ = పరబ్రహ్మము నైన నాకును, ఎందున్ = ఏవిషయమునను, భేదము = వేఱుపాటు, కానఁబడదు = గోచరింపదు – అనఁగా 'బ్రహ్మైవ బ్రహ్మవి ద్భవతి' అను వాక్యముచేత బ్రహ్మమే బ్రహ్మవేత్త యనుట

తా. కవిశ్రేష్ఠు లగు వాల్మీకాదులచే స్తుతింపఁ దగిన యోగాంజనేయా! బ్రహ్మవేత్త నాకంటె నితరుఁడు గాఁడు, బ్రహ్మసాక్షాత్కారముచే విచారించినయెడల ఆ బ్రహ్మవేత్తకును పరబ్రహ్మమైన నాకును భేదము లే దని తాత్పర్యము.

క. జ్ఞానికి నేను బరోక్షుఁడఁ, గాను పరోక్షుండు నాకు గాఁ డతఁ డిది సు
జ్ఞానం బజ్ఞున కిది మది, గానఁబడదు తన్ను నన్నుఁ గానమి ననఘా ౧౩౯

టీ. అనఘా = నిర్మలుఁడా, నేను = కేవలాత్మ యయిన నేను, జ్ఞానికిన్ = బ్రహ్మనిష్ఠునకు, పరోక్షుండఁ గాను = అన్యుఁడఁ గాను, అతఁడు = ఆ బ్రహ్మనిష్ఠుఁడు, నాకున్ = బ్రహ్మము నయిన నాకు, పరోక్షుండు గాఁడు = అన్యుఁడు గాఁడు, ఇది = ఈయర్థము, సుజ్ఞానంబు = బ్రహ్మజ్ఞాన మనునది, తన్నున్ = అజ్ఞాని యయిన తన్నును, నన్నున్ = విజ్ఞానస్వరూపుఁ డయిన నన్నును, కానమిన్ = దర్శింపమిచేత, ఇది = ఈ బ్రహ్మజ్ఞానము, అజ్ఞునకు = తెలివి లేనివానికి, మదిన్ = అంతఃకరణమునందు, కానఁబడదు = గోచరింపదు.

తా॥ పాపరహితుఁడ వగు రామా యాంజనేయా! కేవలాత్మ యగు నేను బ్రహ్మనిష్ఠున కన్యుఁడను గాను, ఆ బ్రహ్మవిదుఁడు బ్రహ్మ మైన నాకంటె నన్యుఁడు గాఁడు, బ్రహ్మజ్ఞాన మనునది అజ్ఞాని యైన తన్నును విజ్ఞానస్వరూపుఁ డైన నన్నును తెలియఁజాలమిచే తెలివి లేనివానికి మనస్సునందు గోచరింప దని తాత్పర్యము

క. త్రిగుణాత్మిక యగు ప్రకృతిం, దగిలినచో సగుణుఁ డండ్రు ॥ దాని విడుచుచో
నగుణుఁ డని యండ్రు నన్నతి,సుగుణులు ఈరెండు గాను ॥ జుమ్మవి లేమిన్. ౧౩౯

టీక॥ అతిసుగుణులు = శాంతశమదమాద్యనంతకల్యాణగుణరహితులు, నన్ను = నిర్వికారుఁడ నైన నన్ను, త్రిగుణాత్మిక = జ్ఞానదుఃఖమోహాత్మకము లైన సత్త్వరజస్తమోగుణస్వరూపిణి, అగు ప్రకృతిన్ = ఐనట్టి ప్రధానమును, తగిలినచోన్ = అంటినప్పుడు, సగుణుఁ డండ్రు = శాంతఘోరమూఢత్వములు గలవాఁ డందురు, దానిన్ = ఆ ప్రకృతిని, విడుచుచోన్ = వదలినప్పుడు, అగుణుఁ డని యండ్రు = గుణరహితుఁ డందురు, అవి లేమిన్ = ఆ సంయోగవియోగములు లేవు గనుక, ఈ రెండు = ఇప్పుడు చెప్పిన సగుణనిర్గుణములు, గాను జుమ్మ = నేను గాను సుమా

తా॥ శాంతశమదమాద్యనంతకల్యాణగుణప్రపూర్ణు లగు కొందరు నన్ను జ్ఞానదుఃఖమోహములతోఁ గూడిన సత్త్వరజస్తమోగుణస్వరూపిణి యగు ప్రకృతి నంటినప్పుడు శాంతఘోరమూఢాత్మకగుణవిశిష్టుఁ డని చెప్పుదురు, ఆ ప్రకృతిని వదలినపుడు నన్ను గుణరహితుఁ డందురు, అట్లు ప్రకృతితోఁ గూడుటయు గూడకపోవుటయు నాకు లేదు గనుక యీ చెప్పిన సగుణ నిర్గుణములు నాకు లే వని తా

లయగ్రాహి॥ భృంగములయందును బతంగములయందును వి
హంగములయందును గురంగములయందుఁ గుర్
సింగములయందును బ్లవంగములయందును దు
రంగములయందును భుజంగములయం దే
కాంగు లగు దేవమునిపుంగవనరాది ఘన
జంగమములందును నజంగమములందున్
సంగమును భంగము గలుంగ కొకభంగిని వె
లుంగు నను నే నని కనుంగొనుము వత్సా. ౧౪౦

టీక॥ వత్సా = బాలకా, భృంగములయందున్ = తుమ్మెదలయందు ॥ని॥ 'భృంగ స్త్వళిని ధూమ్యాటే షిద్గే భృంగంతు పంతకే' అని రత్నమాల. పతంగములయందున్ = మిడుతలయందు ॥ని॥ 'పతంగ శ్శాలిభేదేర్కే బిడాలే శలభే ఖగే' అని రత్నమాల. విహంగములయందున్ = పక్షులయందు, కురంగములయందున్ = లేళ్లయందు, సింగములయందున్ = సింహములయందు, ప్లవంగములయందున్ = కోఁతులయందు, తురంగములయందున్ = గుఱ్ఱములయందు, భుజంగములయందున్ = పాములయందు, ఏకాంగులు = యతులలోపల విశేషులు, అగు = ఐన, దేవ = వేలుపులు, మునిపుంగవ = నారదాదిమునిశ్రేష్ఠులు, నర = మనుజులు, ఆది = మొదలైన, ఘన = శ్రేష్ఠము లయిన, జంగమములందు = చరజంతువులయందు, అజంగమములందు = కదలనిపర్వతవృక్షాదులయందు, సంగమున్ = చేరియుండుటయు, భంగమున్ = చేరకయుండుటయు, కలుంగక = లేక, ఒకభంగిని = ఒక్కరీతిగా, వెలుంగునను = ప్రకాశించు పరబ్రహ్మమైన నన్ను, నే నని = నేనే యని - అనఁగా నీవే యని, కనుంగొనుము = చూడుము.

తా. బాలకా! పరబ్రహ్మ మగు నేను తుమ్మెదలు మిడుతలు పక్షులు సింహములు శేష్యకోఁతులు గుఱ్ఱములు పాములు దేవతలు మనుష్యులు మునిశ్రేష్ఠులు మొదలగు చరించు జంతువులతోను, అచరము లగు పర్వతములు వృక్షములు మొదలగువానితోను గూడియుం గూడకయు నుండక నేకరీతిగాఁ బ్రకాశించు చుండుదును, అట్టి నేను నీకంటె భిన్నమును గాను గనుక నన్ను నీవే యని తెలిసికొను మని తాత్పర్యము.

లయగ్రాహిలక్షణము॥ ఇంబడరఁగా భజసనంబుల తుద న్భజసనంబులు పదంపడి భయంబుల లయగ్రాహిం బరఁగుఁ బ్రాసవిరమంబు నలుమాఱుం గుదురం బటు కవీశులు థిరంబుగ వచింపన్। నంబరము గావలసి తోంబగలి దానవకదంబమును హేయముగఁ బంచి త్రిదశల్దుగ్ధాంబునిధి ద్రచ్చి యమృతంబు గొనఁజాలు సమయంబు దొరికించితి ముదంబున ముకుందా తా॥ భ జ స న భ జ స న భ య గణము లును, ప్రతిపాదమునకు రెనిమిదవయక్షరములమీఁది ప్రాసయతులలో నేదియైన నలుమాఱు గలుగఁ జెప్పిన లయగ్రాహి యనుట

తే. తనువు తా నను దృష్టియె ధనువు కర్త
కనిశము గుణత్రయమ్ముతో నెనసి యున్న
యమ్మనమె యమ్ము దాని కాయమ్ము లతిన
యమ్ములై తోఁచు దుర్విషయమ్ము లనఘ. ౧౮౧

టీక. అనఘ = నిర్మలుఁడా, కర్తకున్ = అభిమాని యగు జీవునకు, తనువు=శరీరము, తా నను దృష్టియె = తా ననెడి లక్ష్యమే, ధనువు = విల్లు, అనిశమున్ = ఎల్లప్పుడు, గుణత్రయమ్ముతోన్ = సత్త్వరజస్తమోగుణమ్ములతోడ, ఎనసియున్న = కూడియున్నట్టి, అమ్మనమే - ఆ మనస్సే, అమ్ము=బాణము, దానికిన్ = ఆ బాణమునకు, అతినయమ్ములై=మిగులయుక్తము లై, దోఁచు దుర్విషయమ్ములు= కనఁబడెడు దుష్టేంద్రియవ్యాపారములు, ఆ యమ్ములు = మర్మస్థానములు - అనఁగా లక్ష్యము లనుట

తా. నిర్మలుఁడ వగు యో యాంజనేయా! అభిమాని యగు జీవునకు శరీరము తానే యనెడు దృష్టియె విల్లుగాను ఎల్లప్పుడు సత్త్వరజస్తమోగుణములతోఁ గూడిన మనస్సే బాణముగాను, ఆ బాణమునకు మిగుల యుక్తము లై కనఁబడెడు చెడుయింద్రియవ్యాపారములు లక్ష్యములుగాను యున్న వని తాత్పర్యము

క. మానస మఖిలంబునకుఁ బ్రధానంబు ప్రధానమే ప్రధానము మదికిన్
దాని విడిచి నను గను మది, తానవముం బొంది యంతఁ దా నవిసి చెడున్.

టీక. మానసము = మనస్సు, అఖిలంబునకున్ = సకలమునకు, ప్రధానంబు = ముఖ్య మయినది, మదికిన్ = ఆ యుల్లమునకు, ప్రధానమే = ప్రకృతియె, ప్రధానము=ముఖ్య మయినది, దానిన్=ఆ ప్రకృతిని, విడిచి = త్యజించి, ననున్ = కేవలాత్మ యయిన నన్ను, కనుము = చూడుము, అది = ఆ ప్రకృతి, అంతన్ = పిమ్మట, తానవమున్ = క్షీణత్వమును, పొంది=చెంది, తాను, అవిసిచెడున్ = నశించును

తా సమస్తమునకు ముఖ్యమైనది మనస్సు, ఆ మనస్సునకు ముఖ్యమైనది ప్రకృతి, అట్టి ప్రకృతిని వదలి కేవలాత్మ యగు నన్నుఁజూచిన తక్షణమే ఆ ప్రకృతి తనంతట తానే క్షీణత్వమును బొంది నశించు నని తాత్పర్యము.

ఆ. ప్రకృతి వికృతి దానిప్రకృతి యెఱింగి యో
సుకృతి నన్నుఁ గనుము ప్రకృతమునను
నాత్మ నెఱుఁగునప్పు డాప్రకృతియె యుప
కృతి యొనర్చుచుండు నెపుడు కడఁగి. ౧౪౩

టీక. ఓ సుకృతి = ఓ ధన్యుఁడా, ప్రకృతి = ప్రధానము, వికృతి = వికారరూపము గలది, దాని ప్రకృతి = ఆ ప్రకృతియొక్క స్వభావము, ఎఱిఁగి = తెలిసి, ప్రకృతమునను = ఇప్పుడే, నన్నున్ = పరబ్రహ్మ మైన నన్ను, కనుము = చూడుము, ఆత్మన్ = పరబ్రహ్మమును, ఎఱుఁగునప్పుడు = తెలిసికొనునప్పుడు, ఆ ప్రకృతియె = ఆ ప్రధానమే, ఎపుడు = సార్వకాలము, కడఁగి = యత్నపడి, అప్రకృతి = అప్రకారము, ఒనర్చుచుండున్ = చేయుచుండును.

తా. ఓ ధన్యుఁడా! వికారరూపము గలది ప్రకృతి, అట్టి ప్రకృతియొక్క స్వభావమును దెలిసి పరబ్రహ్మ మైన నన్నిప్పుడే చూడుము, ఆ పరబ్రహ్మము నెఱుఁగునప్పుడు ప్రకృతి జ్ఞానికతో నప కారము జేయుచుండు నని తాత్పర్యము.

క. ఖంబుసుమీ మదివిషయసు,ఖంబుసుమీ త్రిజగదభిముఖంబుసుమీ దుః
ఖంబుసుమీ యది తద్విముఖంబుసుమీ నిరతిశయసుఖంబు కపీంద్రా. ౧౪౪

టీక. కపీంద్రా = ఆంజనేయా, మది = మనస్సు, ఖంబుసుమీ = ఆకాశమువంటిది సుమా- అనఁగా శూన్య మైన దనుట ॥ని॥ 'ఖమింద్రియసుఖవ్యోమ సత్యుత్ర క్షేత్రపట్టనే । కృపాపలకరో శూన్య బిందౌ సంవేశరంధ్రయోః' అని రత్నమాల. అది = ఆ మనస్సు, విషయసుఖంబుసుమీ = శబ్దాదివిషయ సుఖరూప మైనది సుమా- అనఁగా బ్రహ్మసుఖస్వరూప మయినది గా దనుట, త్రిజగదభిముఖంబుసుమీ- త్రిజగత్ = ముల్లోకములకు, అభిముఖంబుసుమీ = ఎదురైనదిసుమా - అనఁగా బహిర్ముఖ మయినదిగాని అంతర్ముఖ మైనదిగా దనుట, దుఃఖంబుసుమీ = వ్యథారూప మయినదిసుమా - అనఁగా ఆనందస్వరూప మయినది గా దనుట, (అటులైనది గనుక) నిరతిశయసుఖంబు — నిరతిశయ = సర్వోత్కృష్ట మయిన, సుఖంబు = బ్రహ్మానందము, తద్విముఖంబుసుమీ — తత్ = మనస్సునకు, విముఖంబుసుమీ = పరాఙ్ముఖ మయినదిసుమా - అనఁగా మనస్సు జడ మగుటవలన బ్రహ్మానందసుఖము నెఱుఁగ నేర దనుట.

తా. ఓ ఆంజనేయా! మనస్సు ఆకాశమువలె శూన్య మైనదియును, బ్రహ్మసుఖస్వరూపము గాక శబ్దాదివిషయసుఖరూప మయినదియును అంతర్ముఖ మైనదిగాక బహిర్ముఖ మైనదియును, ఆనంద స్వరూప మయినదిగాక దుఃఖస్వరూప మయినదియును, పరాఙ్ముఖ మగు బ్రహ్మానందసుఖము గలది యును నై యున్నదని తాత్పర్యము (అనఁగా మనస్సు జడ మగుటవలన బ్రహ్మానందసుఖము నెఱుఁగ నేర దని భావము)

క. విను వినువీథి తెఱంగున, ఘనఘనమయి విభువు సర్వగతమయి తగు చే
తనుఁ దనుఁ దనుతనువునఁ గని, మనుమనుజుని బ్రతుకు బ్రతుకు మారుతతనయా.

టీక. మారుతతనయా = వాయుపుత్రా, వినుము = ఆకర్ణింపుము, విభువు = పరమాత్మ, వినువీథి తెఱంగునన్ = గగనమువలె, ఘనఘనమయి = మహోన్నత మయి, సర్వగతమయి = అంతటను నిండి యున్నదై, తగున్ = ఒప్పునట్టి, చేతనన్ = అట్టి యాత్మస్వరూపుఁ డైన, తనన్ = తన్ను, తనతనువునన్ = విజ్ఞానశరీరమందు - అనఁగా అంతరదేహమందు, కని = అనుభవదృష్టిచేతఁ జూచి, మను = జీవించు

నట్టి, మనుజుని = బ్రహ్మవేత్తయొక్క, బ్రతుకు = మనుగడయె, బ్రతుకు= మనుగడ ॥శ్రు॥ "అణోరణీయా న్మహతో మహీయా నాత్మా గుహాయాం నిహితోస్య జంతోః" అని

తా॥ ఆంజనేయా వినుము, పరమాత్మ యాకాశమువలె పొడవైనదియును, అంతట నిండియున్నదియును నై యున్నది, అట్టి యాత్మస్వరూపుఁడైన తన్ను విజ్ఞానశరీరమందు అనుభవదృష్టిచేతఁ దెలిసికొని జీవించునట్టి బ్రహ్మవేత్తల బ్రతుకే బ్రతుకు గాని యితరుల బ్రతుకు బ్రతుకు గాదని తాత్పర్యము.

క॰ సారాసారవిచారవి,శారదుఁ డగు సుకృతి వికృతిజనికృతితతికిన్
శారదనీరదవారవి,దూరవియత్తలముభంగిఁ దొలఁగి వెలుంగున్. ౧౮౬

టీక॰ సార = సత్తైన పరబ్రహ్మముయొక్క, అసార = అసత్తైన ప్రకృతియొక్క - అనఁగా ఆత్మానాత్మలయొక్క, విచార = విమర్శనమందు, విశారదుఁడు = నేర్పరి, అగుసుకృతి = ఐన పండితుడు, వికృతిజనికృతితతికిన్—వికృతి = వికారముగా, జని = పుట్టిన, కృతి = దృశ్యమైన ప్రపంచముయొక్క, తతికిన్ = సమూహమునకు, శారద = శరత్కాలమందలి, నీరద = మేఘములయొక్క, వార = సమూహముకంటె, విదూర = దవ్వైన, వియత్తలముభంగిన్ = ఆకాశమువలె, తొలఁగి = విముఖుఁడై, వెలుంగున్ = ప్రకాశించును

తా॥ సదసత్తు లయిన యాత్మానాత్మలయొక్క విమర్శయందు నేర్పరి యగు పండితుఁడు ఆకాశము యెట్లు శరత్కాలమేఘములకు దూరమో అట్లే వికారమువల్ల జనించిన దృశ్యప్రపంచముయొక్క సమూహమునకు విముఖుఁడై ప్రకాశించు నని తాత్పర్యము

క. వరమై సురుచిరమై సుఖ,కరమై తగు మానసాదికరణావళి స
త్పరమా వరమాదరమా, స్థిరమోదాకరసదాత్మధీరతి గలుగన్. ౧౮౭

టీక స్థిర = శాశ్వతమైన, మోదాకర = సంతోషాస్పదమైన, సత్ = త్రికాలబాధ్యమైన, ఆత్మ = పరబ్రహ్మమందు, ధీ = ప్రజ్ఞయొక్క, రతి = కూడిక, కలుగన్ = లభింపఁగా, మానసాదికరణావళి—మానస = మనస్సే, ఆది = మొదలుగాఁగల, కరణావళి = ఇంద్రియపంక్తి - అనఁగా చతుర్దశేంద్రియములు, వరమై = శ్రేష్ఠమై, సురుచిరమై = మనోహరమై, సుఖకరమై = ఆనందజనకమై, తగున్=ఒప్పును; (ఎందువల్ల ననఁగా, ఆ యింద్రియపంక్తి) సత్పరమా—సత్ = పరమాత్మకంటె, పరమా= అన్యమా - అనఁగా కాదనుట, వరమాదరమా—పరమా = మిక్కిలి, దరమా = భయహేతువైనదా- అనఁగా భయహేతువైనది కాదనుట, ॥ని॥ "దరోస్త్రియాం భయేశ్వభ్రే" అని అమరము (అనఁగా చతుర్దశేంద్రియవ్యాపారకారణమైన ప్రజ్ఞ బ్రహ్మాకార మయ్యెనేని యింద్రియములు తదాకార మయియుండు ననుట )

తా॰ పరబ్రహ్మము శాశ్వతమైనదియును, సంతోషాస్పదమైనదియును, మూఁడుకాలములచేత బాధింపఁబడనిదియును నై యున్నది. అట్టి బ్రహ్మమునందు జ్ఞానము అనఁగా బ్రహ్మజ్ఞానము లభించగా మనస్సు మొదలగు పదునాల్గు యింద్రియములు పరబ్రహ్మముకంటె భిన్నము కావంగున (అనఁగా పరబ్రహ్మస్వరూపమే యైనందున) శ్రేష్ఠముగాను మనోహరముగాను ఆనందమును గలుగఁజేయునదిగాను యున్న దని తాత్పర్యము

క. తరమా పరమానందే,తరమా జగ మనుచుఁ జూడ ధర మూఢున కా
చరమార్థము దెలియుట దుష్కరమా గురుకరుణ వడయు సర్వజ్ఞునకున్. ౧౮౮

టీ॥ ధరన్ = భూమియందు, మూఢునకున్ = అవివేకికి, జగము = ప్రపంచము, పరమానందతరమా—పరమానంద = పరబ్రహ్మమునకు, ఇతరమా = అన్యమయినదా, అనుచున్ = అని, చూడన్ = అవలోకించుటకు, తరమా = శక్యమా, గురుకరుణ = ఆచార్యుని అవ్యాజకృపను, వడయు సర్వజ్ఞునకున్—వడయు = పొందునట్టి, సర్వజ్ఞునకున్ = బ్రహ్మనిష్ఠునకు, ఆచరమార్థము = జగము పరబ్రహ్మేతరము గా దనెడు పరమార్థము, తెలియుట = ఎఱుఁగుట, దుష్కరమా = కష్టమా

తా॥ అవివేకికి ప్రపంచము పరమాత్మస్వరూప మని తెలియుట కష్టము, గురునికృప గల మహాత్మునకు జగత్తు పరబ్రహ్మేతరము గా దని యెఱుఁగుట అనాయాస మని తాత్పర్యము

వ. అని యివ్విధంబున నుపదేశించి హనుమంతునితో శ్రీరామచంద్రుండు మఱియును.

టీ॥ అని యివ్విధంబునన్ = అని యీ ప్రకారము, ఉపదేశించి = చెప్పి, హనుమంతునితోన్ = అంజనేయునితో, శ్రీరామచంద్రుండు = శ్రీరామభద్రుఁడు, మఱియున్ = వెండియును

తా. ఈప్రకారము శ్రీరామచంద్రుండు హనుమంతున కుపదేశించి మఱియు హనుమంతునితో జెప్పుచున్నాఁ డని తాత్పర్యము.

ఉ. మాయను మిథ్యగా దెలియుమీ యను తత్కృత మెల్లఁ గల్ల సు
మ్మీ యను మేను నే ననకుమీ యను సాక్షివి నీవు చూచుకొ
మ్మీ యను జూడఁగా నితరమే యను నే నని నిశ్చయించుకొ
మ్మీ యను గాక పో నితరమే యనుమానము మానుమీ యనున్. ౧౫౦

టీ॥ మాయను = కారణోపాధి యైన మాయను, మిథ్యగాన్ = అసత్యముగా, తెలియుమీ = ఎఱుఁగుమీ, అనున్ = అని పలుకును, తత్కృతమెల్లన్—తత్ = ఆ మాయయొక్క, కృతమెల్లన్ = వ్యాపారమంతయు, కల్లసుమ్మీ = అసత్యము సుమ్మీ, అనున్ = అని వచియించును, మేను నే ననకుమీ = పిండబ్రహ్మాండరూప మయిన శరీరమే నే నని పలుకకుమీ, అనున్ = అని వచియించును; నీవు = ఈవు, సాక్షివి = ద్రష్టవు, చూచుకొమ్మీ = అలోకింపుమీ, అనున్ = అని నొడువును, చూడఁగాన్ = అవలోకింపఁగా, ఇతరమే = నీవు సాక్షికంటె వ్యతిరిక్తమే, అనున్ = అని వాక్రుచ్చును, నే నని నిశ్చయించుకొమ్మీ = ఆ సాక్షిని నేనే యని నిర్ణయింపుమీ, అనున్ = అని వక్కాణించును, కాక పోన్ = ఆ సాక్షి నీవు కాక యుండుటకు, ఇతరమే = ఆ సాక్షికంటె నీ వన్యమే, అనుమానము = సంశయము, మానుమీ = వదలుమీ, అనున్ = అని చెప్పును - అనఁగా సంశయము కలిగిన అసంభావన విపరీతభావనలు గలుగును గాన నేను ద్రష్టనో కానో యనెడు సంశయము విడిచి ద్రష్ట నే ననెడి నిశ్చయము గలిగి యుండు మని భావము

## సంశయాసంభావన విపరీతభావనల వివరణము.

వస్తుద్వయము నొకదాని యం దారోపించుట సంశయము - అనఁగా చీకటియందు స్థాణువును జూచి యిది స్థాణువో పురుషుఁడో అని తలఁచు చిత్తవృత్తి, ఇక్కడ స్థాణు వుండ నిమిత్తమేమి స్థాణువు కాదు పురుషుఁడే యని తలంచు చిత్తవృత్తి అసంభావన, ఒక వస్తువునందుఁ గల నైజమును వేఱొకవిధముగాఁ దలఁచుట విపరీతభావన, ఇవి మూఁడును ప్రమాణప్రమేయ భేదములచేత ప్రమాణగతసంశయము, ప్రమేయగతసంశయము, ప్రమాణగతాసంభావన, ప్రమేయగతసంభావన, ప్రమాణగతవిపరీతభావన,

ప్రమేయగతవిపరీతభావన అని యీఱుతెఱఁగు లగును, అందు శ్రుతికర్మమును ప్రతిపాదించుచున్నదా, లేక విశిష్ట మయిన ప్రత్యగ్బ్రహ్మమును ప్రతిపాదించుచున్నదా అని వచ్చు సంశయమే ప్రమాణగతసంశయము, జగత్కారణము బ్రహ్మమా, లేక ప్రధానాదులా అను సంశయమే ప్రమేయగతసంశయము, బ్రహ్మము శుద్ధవస్తు వగుటవలన ప్రమాణాంతరముచేత భూమి పొందలగువానివలె నెఱుఁగఁబడుచున్నది గావున శ్రుతు లాశుద్ధబ్రహ్మము జగత్కారణ మని యెట్లు ప్రతిపాదించు?, ప్రతిపాదింప నేర వనెడు నిశ్చయము ప్రమాణగతసంభావన, 'జగద్విలక్షణం బ్రహ్మ' అను వాక్యమును బట్టి జగముకంటె బ్రహ్మము విలక్షణమై యున్నది గనుక జగత్తునకు బ్రహ్మము కారణ మనరాదు, ప్రధానాదులే జగత్కారణ మను నిశ్చయము ప్రమేయగతాసంభావన, బ్రహ్మము శుద్ధవస్తువు గనుక శ్రుతులకు శుద్ధబ్రహ్మమును ప్రతిపాదించుటయందు తాత్పర్యము లేదు, శ్రుతులు పరబ్రహ్మమునే ప్రతిపాదించెనేని పురుషునకు ప్రవృత్తినివృత్తులు లేవు గాన వ్యర్థ మగును, లోకమందు ప్రవృత్తిపూర్వకముగానే పురుషార్థము గాంచితిమి, అపరిశుద్ధము వికారము లోనగువానితోఁ గూడియుండు జగత్తునకుఁ గారణ మయిన బ్రహ్మము అపరిశుద్ధాత్మకతోఁ గూడియుండవలెను, అట్లు లేదు కాఁబట్టి ప్రధానాదులే జగత్తునకు కారణ మని బుద్ధిలోఁ దోఁచుటయే ప్రమేయగతవిపరీతభావన, ఇట్లు తనయందును జీవుఁడు గాను జగత్తులో నొకఁడుగా దోఁచు తాను జగద్విలక్షణ మయిన బ్రహ్మ మౌదునో కానో యను నది ప్రత్యగాత్మవిషయికసంశయము, అటులఁ గర్తృత్వాద్యనేకధర్మయుక్తుఁడై పరిచ్ఛిన్నుఁడై జననమరణములతోఁ గూడి యుండు తనకు సచ్చిదానందాదిలక్షణములు గల బ్రహ్మస్వరూపత్వ మెట్లు గూడును, కూడ దని నిశ్చయించుట ప్రత్యగాత్మవిషయిక మయిన అసంభావన, ఇట్లు తానే కర్త యయ్యెనేని గన్నుఁగొర్చి యీ పని చేయుము చేయకుము దీనిని మానుము దీనిని మానకుము దీనిని గ్రహింపుము దీనిని గ్రహింపకుము దీనిని భక్షింపుము దీనిని భక్షింపకు మనెడు నీలాటిధర్మములు శ్రుతు లెట్లు దెలుపును గాఁబట్టి నేనే కర్తను సందేహము లే దనెడు కర్తృత్వాదుల కుపయోగ్య మయిన యభిమానాగులకు సర్వధర్మప్రతీతిలక్షణమైనదే విపరీతభావము, ఇట్లు న్యాయమందు సంశయత్రయమును విచారించి త్యజించి విజ్ఞానము నార్జితముగా నార్జించువాఁడే ముక్తుఁడు

తా॥ కారణోపాధి యగు మాయను అసత్యముగా దలిసికొనుము, ఆ మాయాసంబంధ మయిన వ్యాపార మంతయు అసత్యము, పిండబ్రహ్మాండసంజ్ఞ గల శరీరమే నే నని పలుకకుము, నీవు సాక్షి వని తెలిసికొనుము, ఎందుకంటే నీవు సాక్షికంటే భిన్నుఁడవు గావు, సాక్షిని నేను యగుదునో కానో యను సంశయమును (సంశయ మనఁగా యొకదానియందు రెండువస్తువుల నారోపించుట, అదెట్లనిన చీఁకటియందు స్థాణువును జూచి యిది స్థాణువా లేక పురుషుఁడా యని తలఁచుట, ఈ సంశయము ప్రమాణసంశయ మనియు ప్రమేయసంశయ మనియు రెండువిధములు, అందు ప్రమాణసంశయ మనఁగా ప్రమాణములయందు సంశయము ప్రమాణసంశయము, అదెట్లన్న ప్రమాణము లగు శ్రుతులు కర్మమును ప్రతిపాదించుచున్నవా లేక విశిష్ట మగు ప్రత్యగ్బ్రహ్మను ప్రతిపాదించుచున్నవా యని తోఁచుట, ప్రమేయసంశయ మనఁగా వాస్తవమునందు సంశయము ప్రపంచమునకు కారణము బ్రహ్మమా, లేక ప్రధానాదులా యని తలఁచుట) వదలి (అనఁగా సంశయము గలిగిన అసంభావన విపరీతభావనలు గలుగును అసంభావన రెండువిధములు, ప్రమాణగతాసంభావన ప్రమేయగతాసంభావన యని, ప్రమాణగతాసంభావన యనఁగా ప్రమాణములయందు నిశ్చయము లేకపోవుట - అదెట్లన్న శ్రుతులు పరబ్రహ్మమున కెట్లు జగత్కారణత్వము ప్రతిపాదించు ననుట, ప్రమేయగతాసంభావన యనఁగా వాస్తవమునందు వాస్తవికబుద్ధి లేక

పోవుట-అది యట్లుండేని ప్రపంచమునకంటె బ్రహ్మము విలక్షణ మయి యున్నది గనుక బ్రహ్మము జగత్తునకు కారణ మనరాదు గనుక ప్రధానాదులే జగత్కారణ మని నిశ్చయించుట - అనఁగా నిచ్చట వాస్తవముగా పరబ్రహ్మము జగత్తునకు కారణ మను మనోనిశ్చయము లేకపోవుట) రెండవది యగు విపరీత భావన శ్రుతులచే నిశ్చయింపఁబడిన శుద్ధబ్రహ్మము గాదు పరబ్రహ్మము, అట్లు శ్రుతులు పరబ్రహ్మమునే ప్రతిపాదించెనేని పురుషునకు ప్రవృత్తినివృత్తులు లేవు గనుక వ్యర్థ మగును, (లోకమునందు ప్రవృత్తిలేక నే పురుషార్థము లేదు) అపరిశుద్ధము వికారము వీనితోఁ గూడిన ప్రపంచమునకు కారణ మగు పరబ్రహ్మము అపరిశుద్ధాదులతోఁ గూడి యుండవలెను, అట్లు లేదు గనుక పరబ్రహ్మము ప్రపంచమునకు కారణము గానేరదను నిశ్చయము ప్రమేయగతవిపరీతభావన గనుక అట్టి సంశయత్రయమును పరిత్యజించి విజ్ఞానమును విశేషముగ సార్జించువాఁడే ముక్తుఁడని తాత్పర్యము.

వ. అని వెండియు నిట్లనియె, ఇది యారూఢుని ప్రకారం బింక నారురుక్షుని మార్గంబు వివరించెద.                    ౧౫౧

టీక అని = ఇట్లు పలికి, వెండియుఁ = మరల, ఇట్లనియెన్ = ఇటులు చెప్పెను, ఇది=ఇప్పుడు చెప్పినది, ఆరూఢునిప్రకారంబు = బ్రహ్మవిద్వరిష్ఠునివిధము, ఇంకన్=ఇఁక మీఁద, ఆరురుక్షునిమార్గంబు= జ్ఞానభూమికలను క్రమముగా పొంద నిశ్చయించినవానిత్రోవను, వివరించెదన్ = తెలుపుచున్నాఁడను

తా ఈప్రకారము చెప్పి మగల నిట్లనియె. ఇప్పుడు చెప్పినది బ్రహ్మవేత్తయొక్కవిధము, ఇఁకమీఁదు జ్ఞానభూమికలను క్రమముగాఁ బొందువానియొక్కమార్గమును తెలుపుచున్నాను విను మని తాత్పర్యము

తత్త్వోపదేశార్హుం డగు నారురుక్షునిలక్షణము.

సర్వతఃప్రాసపీసము.—

అస్తోకసద్గురూపాస్తిచే సతతవిధ్వస్తకాముండును నిరస్తమోహుఁ
డస్తంగతాంశుఁ డుపాస్తలోభుండు సన్యస్తరోషుండు విశ్రస్తమానుఁ
డుత్తసిస్తత్యేంద్రియస్తోముఁ డశ్రాంతవిస్తారితవిధిప్రశస్తుఁ డగుచు
స్వస్తిస్వమస్తకన్యస్తనిజాచార్యహస్తాబ్జవిదితచిద్వస్తుతత్త్వుఁ

తే. డమితశమదమముఖగుణసముదయయుత
సుముఖసమరసవిమలహృత్కమలుఁ డఖిల
విషమవిషసమసకలవిషయవిముఖుఁ
డైన మేధావి తత్త్వబోధార్హుఁ డనఘ.                    ౧౫౨

టీక. అనఘ = నిర్మలుఁడవైన యోజనేయా, అస్తోక = మిక్కుటమైన, సద్గురూపాస్తిచేన్ = విహితగురూపాసనచేత, సతత = ఎల్లప్పుడు, విధ్వస్త = తొలఁగింపఁబడిన, కాముండు = గృహారామక్షేత్రధనధాన్యాదుల సంపాదింపవలయు ననెడు వృత్తి గలవాఁడును, నిరస్త = క్షీణింపఁజేయఁబడిన, మోహుండు = అజ్ఞానము గలవాఁడును, అస్తంగతాంశుఁడు = అణఁగింపఁబడిన ఆశలు కలవాఁడును,

అపాస్త = వదలింపఁబడిన, లోభుండు = ఆర్జించినపదార్థముల సెలవు చేయఁగూడ దనెడు వృత్తి గలవాఁడును, సన్యస్తరోషుండు = త్యజింపఁబడిన క్రోధము గలవాఁడును, విస్రస్తమదుండు — విస్రస్త = సడలింపఁబడిన, మదుండు = ధనవిద్యాకులవయోరూపమదములు గలవాఁడును, గ్రస్త = లోఁబఱచుకొనఁబడిన, నిస్తుత్య = నీచము లైన, ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములయొక్క, స్తోముఁడు = సమూహము గలవాఁడును, ఆక్రాంత = ఎల్లప్పుడును, విస్తారిత = వృద్ధిఁబొందింపఁబడిన, విధి = స్వధర్మానుష్ఠానము చేత, ప్రశస్తుఁడు = ప్రసిద్ధికెక్కినవాఁడును, అగుచుఁ = అవుచు, స్వస్తి = శుభకర మగునట్లు, స్వమస్తక = తనశిరస్సునందు, న్యస్త = ఉంచఁబడిన, నిజాచార్య = తనదేశికునియొక్క, హస్తాబ్జ = హస్తపద్మముచేత, విదిత = తెలుపఁబడిన, చిద్వస్తు = ప్రజ్ఞానస్వరూప మైన పరబ్రహ్మముయొక్క, తత్త్వుఁడు = యథార్థము గలవాఁడును, అమిత = గణనాతీతము లైన, శమదమముఖ = శమదమశాంతి తితీక్షాశ్రద్ధాసమాధానము మొదలగు, సుగుణసముదయయుత = మంచిగుణములగుంపుతోఁ గూడిన, సుముఖ = ప్రసన్న మైన, సమరస = సమభావము గల, విమల=నిర్మల మైన, హృత్కమలుఁడు = హృదయాబ్జము గలవాఁడును, అఖిల = సమస్తము లైన, విమత = విరుద్ధకార్యసహితము లైన, విషసమ= గరళతుల్యము లైన, సకలుష = పాపసమేతము లైన, విషయ=ఇంద్రియార్థములకు, విముఖుఁడు = మూరుమొంగము గలవాఁడు, ఐన మేధావి = ఐన ప్రతిభాశాలి, తత్త్వబోధార్హుఁడు = బ్రహ్మజ్ఞానము నెఱుఁగుటకు పాత్రుఁడు, అగుఁ = అవును.

తా. నిర్మలుఁ డైన యో యాంజనేయా! బ్రహ్మజ్ఞానము నెఱుఁగుట కెట్టివాఁడు పాత్రుఁ డనిన జెప్పెదను వినుము, బ్రహ్మజ్ఞానమునకు పాత్రుఁ డగువాఁడు విహితగురూపాసనచేత ఇండ్లు తోఁటలు భూములు ద్రవ్యము ధాన్యము మొదలగువాటిని సంపాదింపవలె ననెడు వ్యాపారము లేనివాఁడుగాను, నశింపఁజేయఁబడిన యజ్ఞానము గలవాఁడుగాను, ఆశలు లేనివాఁడుగాను, సంపాదించిన పదార్థములను సెలవుసేయక దాఁచవలె నను వ్యాపారము లేనివాఁడుగాను, క్రోధమును వదలినవాఁడుగాను, ధనము విద్య కులము వయస్సు అను వీనిచేత మదించనివాఁడుగాను, ఇంద్రియనిగ్రహము గలవాఁడుగాను, ఎల్లప్పుడును వృద్ధి పొందింపఁబడిన తనయొక్క ధర్మానుష్ఠానములచేత ప్రసిద్ధికెక్కినవాఁడుగాను, గురువు తనశిరస్సునందు హస్తము నుంచి తెలిపిన ప్రజ్ఞానస్వరూప మైన పరబ్రహ్మముయొక్క యథార్థము తెలిసినవాఁడుగాను, గణింపఁగూడని శమ దమ శాంతి తితీక్షా శ్రద్ధా సమాధానము మొదలగు మంచి గుణములయొక్క సమూహముతోఁ గూడినదియును ప్రసన్న మైనదియును సమభావము గలదియును నిర్మల మైనదియు నగు మనస్సు గలవాఁడుగాను, సమస్తము లైన విరుద్ధకార్యములతోఁ గూడినవియును గరళముతో సమాన మగు పాపముతోఁ గూడినవియును నగు యింద్రియార్థములకు మూగుమోము గలవాఁడుగాను యుండునట్టి ప్రతిభ గలవాఁడే యని తాత్పర్యము.

## సా ధ కు ని ల క్ష ణ ము.

సర్వతఃప్రాసీనము.—

మేధావి మొదలఁ దా సాధూక్తశాస్త్రాది, సాధనాసాధితబోధుఁ డై స
దా ధీంద్రియముల నిరోధించి మనమునో, శోధించి కామసుక్రోధముఖవి
రోధియూథంబున భేదించి బాధించి, బాధయోగ్యాఖిలసాధులను ని
షేధించి సర్వనిషేధావధీభూత, సాధిభూతాధిదైవాధియజ్ఞ

తే. బోధమయనిరుపాధికాగాధలసద
బాధకానందవిమలపాథోధి యగుచు
వ్యాధుల మహాధుల జయించునట్టి ఘనస
మాధిసుఖలోలుఁ డగువాఁడె సాధకుండు. ౧౫౩

టీక మేధావి = తత్త్వోపదేశమునకు పూర్వాధికారి యైన ఆ మేధావి, మొదలన్ = ప్రథమమందు, తాన్ = తాను, సాధు = సత్పురుషులచేత, ఉక్త = చెప్పఁబడిన, శాస్త్ర = వేదాంతశాస్త్రశ్రవణమే, ఆది = మొదలైన, సాధన = ఉపకరణములచేత - అనఁగా శ్రవణమనననిదిధ్యాసనములచేత, ఆసాధిత = సంపాదింపఁబడిన, బోధుఁడై = బ్రహ్మజ్ఞానము గలవాఁడై, సదా = ఎల్లప్పుడు, ధీంద్రియములన్ = జ్ఞానేంద్రియములను, నిరోధించి = లోఁబఱచుకొని, మనములో శోధించి = మానసమందు పరిశీలించి, కామ = అనురాగము, సుక్రోధ = కోపము, ముఖ = మొదలైన. విరోధియూథంబులన్ = శత్రుసంఘములను, వేధించి = క్షోభపెట్టి, బాధించి = పీడించి, బాధ = దుఃఖములకు, యోగ్య = పాత్రము లైన, అఖిల = అశేషము లైన, ఉపాధులన్ = స్థూలసూక్ష్మకారణశరీరములను, నిషేధించి = వదలి, సర్వ = సమస్తమును, నిషేధ = త్యజించుటకు, అనధీభూత = కడపటి దైన, సాధిభూత = శబ్దస్పర్శరూపాది చతుర్దశేంద్రియవిషయములతోఁ గూడిన, అధిదైవ = దిగ్వాతార్కాదిచతుర్దశేంద్రియాదిదేవతలతోఁగూడిన, అధియజ్ఞ = అధ్యాత్మికము లయిన శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాది సకలేంద్రియములతోఁ గూడిన, బోధమయ = జ్ఞానస్వరూప మైన, నిరుపాధిక = దుఃఖరహిత మైన, అగాధ = గంభీర మైన, లసత్ = మనోహర మైన, అబాధక = నిర్బాధక మైన, ఆనంద=సంతోషమయ మైన, విమల = నిర్మల మైన, పాథోధియగుచున్ = సముద్రము గలవాఁడై - అనఁగా నిత్యనిర్మలసచ్చిదానందరసమునకు నివాసభూతుఁడై, వ్యాధులన్ = శరీరపీడలను, మహాధులన్ = గొప్ప లయిన మనోవ్యాధులను, జయించునట్టి = గెలువఁదగినట్టి, ఘన = ఉత్తమమయిన, సమాధి = నిర్వికల్పనిష్ఠవలన నుదయించిన, సుఖ = ఆనందమందు, లోలుఁ డగున్ = ఆశ గలవాఁ డగును, వాఁడె = అట్టి యాశ గల పురుషుఁడే, సాధకుండు = అభ్యాసి - అనఁగా నుపాసకుఁ డనఁబడు ననుట.

## ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికముల వివరణము.

శ్రోత్ర మధ్యాత్మికము, శబ్ద మధిభూతము, దిక్కు లధిదైవతములు, చర్మ మధ్యాత్మము, స్పర్శ మధిరూపము, వాయు వధిదైవతము, నేత్ర మధ్యాత్మము, రూపము అధిభూతము, సూర్యుఁ డధిదైవతము, జిహ్వా యధ్యాత్మము, రస మధిభూతము, వరుణుఁ డధిదైవతము, ఘ్రాణ మధ్యాత్మము, గంధము అధిభూతము, అశ్వినీదేవత లధిదైవతములు, వాక్కు అధ్యాత్మము, వచన మధిభూతము, అగ్ని యధిదైవతము, హస్తము లధ్యాత్మము, దానము అధిభూతము, ఇంద్రుఁ డధిదైవతము, పాదము లధ్యాత్మము, గమన మధిభూతము, ఉపేంద్రుఁ డధిదైవతము; పాయు వధ్యాత్మము, విసర్గ మధిభూతము, మృత్యు వధిదైవతము, ఉపస్థ మధ్యాత్మము, ఆనంద మధిభూతము, ప్రజాపతి యధిదైవతము, మన స్సధ్యాత్మము, సంకల్ప మధిభూతము, చంద్రుఁ డధిదైవతము, బుద్ధి యధ్యాత్మము, నిశ్చయ మధిభూతము, బ్రహ్మ యధిదైవతము, చిత్త మధ్యాత్మము, స్మరణ మధిభూతము, క్షేత్రజ్ఞుఁ డధిదైవతము, అహంకార మధ్యాత్మము, అభిమాన మధిభూతము, రుద్రుఁ డధిదైవతము, తమ స్సధ్యాత్మము, గుణత్రయ మధిభూతము, ఈశ్వరుఁ డధిదైవతము, జ్ఞాతృ అధ్యాత్మము, జ్ఞాన మధిభూతము, జ్ఞేయ మధిదైవతము ఇవి జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు, వీనికి సాక్షి యయిన ఆత్మ నేనని యెఱుంగువాఁడే ముక్తుఁడు

తా. తత్త్వోపదేశమునకు పూర్ణాధికారి యగు మేధావి ప్రథమమందు సత్పురుషులచేఁ జెప్పఁబడిన వేదాంతశాస్త్రము (శ్రవణము మొదలుగాఁ గల శ్రవణము మననము నిదిధ్యాసనము) సాధనములచేత బ్రహ్మజ్ఞానమును సాధించవలయును, అట్లు బ్రహ్మజ్ఞానమును సాధించినవాఁడై యెల్లప్పుడు జ్ఞానేంద్రియములను లోఁబఱచుకొని మనస్సునందు చక్కఁగా విచారించి అనురాగము కోపము మొదలైన శత్రుసంఘములను శోభవెట్టి పీడించవలయును, అట్లు పీడించి దుఃఖములకు పాత్రము లైన సమస్తస్థూలసూక్ష్మ కారణశరీరములను వదలవలయును, అట్లు సమస్తమును వదలుటను కడపటి ప్రసవియును ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికము లనెడు తాపత్రయములతోఁ గూడి (చతుర్దశేంద్రియములకు విషయము లగు శబ్ద స్పర్శ రూప రస గంధాదులు ఆధిభూతములు, శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వ మొదలగు సమస్తయింద్రియములు అధ్యాత్మములు, దిక్కు వాయువు సూర్యుఁడు మొదలగు దేవతలు వీటి కధిదేవతలు) జ్ఞానస్వరూప మైనదియును దుఃఖరహిత మయినదియును గంభీర మయినదియును మనోహర మైనదియును నిర్బాధక మైనదియు నగు సంతోషమయ మైన నిర్మలసముద్రము గలవాఁ డగుచు (అనఁగా నిత్యనిర్మలసచ్చిదానందరసనివాసభూతుఁ డగుచు) శరీరసంబంధము లయిన వ్యాసంగను మనోవ్యాధులను గెలువఁ దగినట్టి నిర్వికల్పనిష్ఠవలన నుదయించిన ఆనందమునందు ఆశను బొందును, అట్టి యాశ గల పురుషుఁడే యుపాసకుఁ డనఁబడు నని తాత్పర్యము

సర్వతః ప్రాససీసము.—

శ్రీసదాచార్యసుశాసనాభిజ్ఞుఁ డబ్జాసనాసీనుఁ డబ్జాసనాది
వాసనారాయణోపాసనామ్నాయాంత, వాసనావాసితోల్లాసహృద్యుఁ
డై సనాతననిరాభాసనానార్థావభాసకానందసత్యాసమాన
ధీసాక్షివరచిదాభాసైక్యసంతతాభ్యాసవివర్జితాయాసుఁ డగుచు

తే. గాసువీసంబుపై సుదతీసుతార్థ, దాసదాసీజనములపై నాసఁ జేసి
మోసపోవక దోసము ల్మోసికొనక, వాసుదేవాత్ముఁడై చిద్విలాసుఁ డగుచు.

టీక. శ్రీ=అణిమాద్యష్టసంపదలు గల, సదాచార్య = విహితగురువుయొక్క, అనుశాసన = శిక్షచేత, అభిజ్ఞుఁడు=వస్తుతత్త్వజ్ఞానము నెఱిఁగినవాఁడును, అబ్జాసనాసీనుఁ డగు = పద్మాసనమునం గూర్చున్నవాఁడును, అబ్జాసన = బ్రహ్మయే, ఆది = మొదలైన దేవతలకు, వాస = నివాసభూముండైన, నారాయణ = పరబ్రహ్మముయొక్క, ఉపాసనా = నిష్ఠచేత, ఆమ్నాయాంతవాసనా = ఉపనిషద్రహస్యార్థ విచారజ్ఞానముయొక్క, ఆవాసిత = ఉనికిచేత, ఉల్లాస = వికాసము గల, హృద్యుండై = అంతరంగము గలవాఁడై-అపరోక్షజ్ఞానము గలవాఁడై, సనాతన = అనాది యైన, నిరాభాస=ప్రతిబింబము లేని, నానా= అనేకము లైన, అర్థ = ఇంద్రియార్థములను, అవభాసక = ప్రకాశింపఁ జేయుచున్న, ఆనంద = బ్రహ్మానందస్వరూప మైన, సత్య = నిత్య మైన, అసమాన = సాటిలేని, ధీ=ప్రజ్ఞానమునకు, సాక్షి=ద్రష్ట యైన పర బ్రహ్మమందు, వర = శ్రేష్ఠ మైన, చిదాభాస = జీవునకు, ఐక్య = ఏకీభావముయొక్క, సంతత = ఎడతెగని, అభ్యాస = అలవాటుచేత, వివర్జిత = పోఁగొట్టఁబడిన, ఆయాసుఁడగుచున్ = బడలిక గలవాఁడై, కాసువీసంబుపైన్ = ధనలేశములమీఁదను, సుదతీ = స్త్రీలు, సుత = పుత్త్రులు, అర్థ = ధనములు, దాస = భృత్యులు, దాసీ = పరిచారికలు, జనములపైన్ = ఈ జనులమీఁద, ఆసఁజేసి = ఆశను బొంది, మోసపోవక = భ్రమనొందక, దోసములు = బ్రహ్మహత్యాది పాపములను, మోసికొనక = వహింపక

వాసుదేవాత్మఁడై = పరబ్రహ్మస్వరూపియై, ("వసనివాసే ఇత్యస్మాద్ధాతోః వసత్యసౌ సర్వత్రేతి వాసుః దీవ్యతే ప్రకాశత ఇతి దేవః స చాసౌ సచేతి వాసుదేవః" తా॥ చతుర్దశభువనము లెవనియందుఁ గలవో వానియం దెవఁ డుండి వెలుఁగుచున్నాఁడో వాఁడు వాసుదేవుఁడు) చిద్విలాసుఁ డగుచుఁ = స్వస్వరూపజ్ఞాన మనెడు క్రియలు గలవాఁడై

తా॥ అణిమాద్యష్టసంపదలు గల గురువుయొక్క శిక్షచేత వస్తుతత్త్వము నెఱిఁగినవాఁడును, పద్మాసనమునందుఁ గూర్చున్నవాఁడును, బ్రహ్మయే మొదలుగాఁ గల సమస్తదేవతలకు నివాసభూతుఁ డయిన పరబ్రహ్మమునందలి నిష్ఠచేతను ఉపనిషత్తులయొక్క రహస్యార్థవిచారజ్ఞానముయొక్క యునికిచేతను వికసించిన హృదయకమలము గలవాఁడై (అనఁగా సపరోక్షజ్ఞానము గలవాఁడై) అనాది యైనదియును, ప్రతిబింబము లేనిదియును, సమస్త మైన యింద్రియార్థములను ప్రకాశింపఁ జేయుచు న్నదియును, బ్రహ్మానందస్వరూప మయినదియును, నిత్య మయినదియును, సాటిలేనిదియును, ప్రజ్ఞానమునకు సాక్షి యైనదియును నగు పరబ్రహ్మ మంగు జీవునకు ఏకీభావముయొక్క యెడతెగని యభ్యాసముచేత పోఁగొట్టఁబడిన ఆయాసము గలవాఁ డగుచు (అనఁగా జీవేశ్వరులయొక్క ఐక్యానుసంధానమునందలి అభ్యాసముచేత ఆయాసము లేనివాఁడై) దారాపుత్త్రాదులయందును, ధనమందును, దాసదాసీజనములయందును ఆశను బొందక భ్రమ నొందక బ్రహ్మహత్యాదిపాపములఁ బొందక పరబ్రహ్మస్వరూపి యై స్వస్వరూపజ్ఞాన మనెడు క్రియలు గలవాఁడు నై యుని తాత్పర్యము (పెంకి సైపద్యముతో నన్వయము)

సర్వతః ప్రాశసీసము.—

శిష్టవరేణ్యనిర్దిష్టోపదిష్టార్థ, దిష్టవిశిష్టసంతుష్టుఁ డగుచుఁ
గష్టమై మూఢసంజుష్టమై త్రిగుణసంశ్లిష్టమై పరమనికృష్ట మగుచు
దష్టమై పరఁగు నీ వ్యష్టిసమష్టిరూపాష్టప్రకృతిమయాదృష్టజగము
భ్రష్టంబుగాఁ గడునష్టంబుగా నాత్మదృష్టిచేఁ గని యవశిష్టుఁ డగుచు

తే. విష్టపస్రష్టమై తదస్పృష్టుఁ డగుచు, ద్రష్టయై నిత్యనిర్మలోత్కృష్టుఁ డై వి
చేష్టుఁ డగు తన్నుఁ గాంచి విస్పష్టముగ న, భీష్టఫలసిద్ధిఁ బొందు సంతుష్టుఁ డగుచు.

టీక శిష్టవరేణ్య = బ్రహ్మవిద్వరిష్ఠులచేత, నిర్దిష్ట = వేదాంతశాస్త్రప్రమాణములచేతను అనుభవజన్యజ్ఞానముచేతను నిశ్చయింపఁబడినదై, ఉపదిష్ట = ఉపదేశింపఁబడిన, అర్థ = మోక్షప్రయోజనమును, దిష్ట = నియతితోడ, విశిష్ట = కూడుకొనుటచేత, సంతుష్టుఁడగుచుఁ = ఆనందము నొందినవాఁ డగుచు, కష్టమై = అసాధ్య మయి, మూఢసంజుష్టమై = తిరోధానశక్తిచేతఁ గప్పఁబడిన దయి, త్రిగుణసంశ్లిష్టమై = సత్త్వరజస్తమోగుణములతోఁ గూడుకొనినదై, పరమనికృష్టమగుచుఁ = మిగుల నీచ మైనదై, దుష్టమై = చెడ్డదై, పరఁగు = ఒప్పుచున్నట్టి, ఈ = పరిదృశ్యమాన మగుచున్న, వ్యష్టి = అవిద్యాసంబంధ మైన, సమష్టి = మాయాసంబంధ మైన, రూప = జీవేశ్వరరూపము లైన, అష్టప్రకృతిమయ = భూజలాగ్నివాయుగగనమనోబుద్ధ్యహంకారమయ మయినదై, దృష్ట = కనఁబడుచుండెడు, జగముఁ = ప్రపంచమును, భ్రష్టంబుగాఁ = పతిత మయినదానినిగా, కడునష్టంబుగాఁ = మిగుల నశించినదిగా, ఆత్మదృష్టిచేఁ = అనుభవజన్యజ్ఞానదృష్టిచేత, కని = వీక్షించి, అవశిష్టుఁడగుచుఁ = మిగిలినవాఁ డగుచు, విష్టపస్రష్టయై = భూర్భువస్సువాది త్రిజగములను సృజించుచున్నవాఁడై, తదస్పృష్టుఁ డగుచుఁ = ఆ జగముల నంటనివాఁడై, ద్రష్టయై = ఆ జగములకు సాక్షియై, నిత్యనిర్మలో

త్కృష్టుఁడై — నిత్య = కాలత్రయస్థాయి యైన, నిర్మల = పరిశుద్ధ మయిన, ఉత్కృష్టుఁడై = పరబ్రహ్మమై, నిశ్చేష్టుఁడు = చతుర్దశేంద్రియవ్యాపారశూన్యుఁడు, అగుతన్నున్ = ఐనతనను, విస్పష్టముగన్ = తెల్లగా, కాంచి = చూచి, సంతుష్టుఁడగుచున్ = ఆనందించు చున్నవాఁడై, అభీష్టఫలసిద్ధిన్ = అభిలషింపఁబడిన మోక్షముయొక్క ప్రాప్తిని, పొందున్ = చెందును.

తా బ్రహ్మవిద్వరిష్ఠుచేత నుపదేశింపఁబడినదియును, వేదాంతశాస్త్రప్రమాణములచేతను అనుభవజన్యజ్ఞానముచేతను నిశ్చయింపఁబడిన మోక్షప్రయోజనమును నియతితోఁ గూడుకొనుటచేత ఆనందము నొందినదియును, అసాధ్య మైనదియును, తిరోధానశక్తిచేతఁ గప్పఁబడినదియును, సత్త్వరజస్తమోగుణములతోఁ గూడుకొన్నదియును, మిగుల నీచ మయినదియును, చెడ్డ దైనదియును, ఈ కనఁబడెడి యవిద్యాసంబంధ మైనదియును, మాయాసంబంధ మైనదియును, జీవేశ్వరరూపము లైన భూజలాగ్నివాయ్వాకాశమనోబుద్ధ్యహంకారములతోఁ గూడినదియును నగు ప్రపంచమును అనుభవప్రాప్తిజ్ఞానముచేత పతిత మయినదిగాను, మిగుల నశించినదిగాను తెలిసికొని మిగిలినవాఁ డగుచు భూర్భువస్స్వరాది ముల్లోకములను సృజించు చున్నవాఁడై ఆ జగములను అంటనివాఁ డగుచు ఆ జగములకు సాక్షియై కాలత్రయములయం దుండువాఁ డైన పరబ్రహ్మమై చతుర్దశేంద్రియవ్యాపారములు లేని తన్ను బాగుగాఁ జూచి ఆనందించు చున్నవాఁడై కోరఁబడినమోక్షమును బొందు నని తాత్పర్యము

సర్వతఃప్రాససీసము —

దాంతుఁడై సకలవేదాంతతాత్పర్యపర్యాలోచనైకాశయంబుచేతఁ
జేతనాచేతనవ్రాతసంయుతపంచభూతాత్మకద్వైతజాత మెల్ల
మెల్లనఁ దనయందె మిథ్యగా భావించి, నిరుపమానందాంబునిధి మునింగి
నింగిభంగి *నెసంగి నిరవయవాత్ముఁడై, కారణకార్యవికారరహిత

తే. హితనిరీహనిరామయనిర్వికల్ప, కల్పనాతీతసచ్చిత్సుఖస్వభావ
భావనాభావ్యశూన్యచిద్వ్యాప్తి మగుచు, సంతసించుచు నుండు సజ్జనవరుండు.

టీక. సజ్జనవరుండు = సత్పురుషశ్రేష్ఠుఁడు, దాంతుఁడై = జితేంద్రియుఁడై, సకలవేదాంత = సర్వోపనిషత్తులయొక్క, తాత్పర్య = వాక్యార్థములయొక్క, పర్యాలోచన = పరిశీలనవలనఁ బుట్టిన, ఏకాశయంబుచేతన్ = ముఖ్యాభిప్రాయముచేతను, చేతనాచేతనవ్రాతసంయుత = ప్రాణ్యప్రాణి సముదాయముతోఁ గూడిన, పంచభూతాత్మక = పంచభూతమయము లైన, ద్వైతజాతమెల్లన్ = నీవు నేననెడు భిన్నభావముల నన్నిటిని, మెల్లనన్ = తిన్నగా, తనయందె = తా నైన ప్రత్యగాత్మయందే, మిథ్యగా భావించి = అసత్య మని తలంచి, నిరుపమ = సాటిలేని, ఆనంద = నిజానంద మనెడు, అంబునిధిన్ = సముద్రమందు, మునింగి = మగ్నుఁడై, నింగిభంగిన్ = ఆకాశమువలె, నిరవయవాత్ముండై = నిర్వికార స్వరూపుఁడై, ఎసంగి = ప్రకాశించి, కారణ = కారణము లైన దేహేంద్రియాదులును, కార్య = శబ్దస్పర్శాదివిషయములును, వికార = స్థూలదీర్ఘహ్రస్వకృశాదివికారములును, రహిత = లేనట్టి, హిత = మే లైన, నిరీహ = కోరికలు లేని, నిరామయ = జరామరణక్షుత్పిపాసాదిరూపవ్యాధిరహిత మైన, నిర్వికల్ప = మనశ్శూన్య మైన, కల్పనాతీత = కల్పనలను నతిక్రమించిన, సత్ = అవస్థాత్రయమునందు నశింపకుండుటయు, చిత్ = అపరోక్షజ్ఞానమును, సుఖ = ఆనందమును, స్వభావ = స్వరూపముగాఁ గల,

భావనా = తలఁపోయు, భావ్య = ఊహింపఁదగినవస్తువును, శూన్య = లేని, చిద్బ్రహ్మ మగుచుక్ = జ్ఞానరూపపరబ్రహ్మమై, సంతసించుచునుండుక్ = ఆనందించుచుండును.

తా. సత్పురుషశ్రేష్ఠుఁడు దుర్గమేంద్రియములను జయించినవాఁడై సమస్తోపనిషత్తులయొక్క తాత్పర్యమును పరిశీలించుటవలనఁ బుట్టిన ముఖ్యాభిప్రాయముచేత చేతనాచేతనసమూహముతోఁ గూడిన పంచభూతమయము లయిన నీవు నేననెడు భిన్నభావముల నన్నిటిని భిన్నముగా తానైన ప్రత్యగాత్మయందే అసత్య మని తలఁచి సాటి లేని నిజానంద మనెడు సముద్రమునందు మునిఁగినవాఁడై ఆకాశమువలె నిర్వికారస్వరూపుఁడై ప్రకాశించి కారణము లయిన దేహేంద్రియాదులను కార్యము లగు శబ్దస్పర్శాదివిషయములను స్థూలదీర్ఘహ్రస్వాది వికారములను లేనట్టిదియును, మే లయినదియును, కోరికలు లేనిదియును, ముసలితనము చావు ఆఁకలి దప్పి మొదలగు రూపములు గల రోగములు లేనిదియును, మనశ్శూన్యమయినదియును, కల్పనలకు మించినదియును, అవస్థాత్రయమునందు నశింప కుండునదియును, అపరోక్షజ్ఞానమును ఆనందమును స్వరూపముగాఁ గల భావనయు నూహింపఁదగిన వస్తువును లేని జ్ఞానరూపపరబ్రహ్మమై ఆనందించుచుండు నని తాత్పర్యము.

సర్వతః ప్రాససీసము.—

డెందంబు నింద్రియబృందంబు నొకట నిష్పందంబుఁ గావించి క్రిందుపఱచి
యందంబుగ మనోరవిందంబునకు మూలకందంబు నౌ చిదానందజలధి
నందంబు బిందు వమందంబుగా నొందు చందంబునం బొంద మందు లెల్ల
నిందించినను నభినందించినను మేలు చెందించినను గీడు చెందు నప్పు
తే. డెందు దగులక విందుగా నందుకొనుచు, సందియంబులసందడి డిందఁజేసి
కంగులేనిమనీషి సనందనాది, వందనీయుండ నైన నాయందుఁ గలఁడు. ౧౯౮

టీక. కంగులేనిమనీషి = నిర్మలజ్ఞానము గల బ్రహ్మవేత్త, డెందంబుక్ = మనస్సును, ఇంద్రియబృందంబుక్ = జ్ఞానకర్మేంద్రియసమూహమును, ఒకటక్ = ఏకవృత్తిగానే, నిష్పందంబు గావించి = నిశ్చలనములుగాఁ జేసి, క్రిందుపఱచి = క్షీణింపఁజేసి, అందంబుగక్ = సుందరముగా, మనోరవిందంబునక్ = మానస మను పద్మమునకు, మూలకందంబునౌ = ఆదికారణ మయిన, చిత్ = అపరోక్షజ్ఞానమువలనఁ గలిగిన, ఆనంద = సుఖ మనెడు, జలధిక్ = సముద్రమునందు, అందంబు = చొక్కమయిన, బిందువు = బుద్ధి, అమందంబుగాక్ = జడత్వము లేనియట్లు, ఒందుచందంబునక్ = ఐక్య మగురీతిని, పొందక్ = కలిసియుండఁగా - అనఁగా బుద్ధి వృత్తిత్రయరూపముగా సంచరింపక యుండఁగా, మందులెల్లక్ = శ్రుతియుక్త్యనుభవములు లేని మూఢు లందఱు, నిందించినను = దూషించినను, అభినందించినను = శ్లాఘించినను, మేలుఁ జెందించినను = సుఖము నొందించినను, కీడు చెందునప్పుడు = దుఃఖము సంభవించునప్పుడు, ఎందుఁదగులక = దేనియందుఁ జిక్కుకొనక, విందుగా నందుకొనుచుక్ = ఆ కీడు మేళ్లను ప్రియముగా ననుభవించుచు, సందియంబులసందడిక్ = నేను బ్రహ్మము నగుదునో కానో అనునది మొదలగు ననేకసంశయములయొక్క రాయిడిని, డిందఁజేసి = నశింపఁజేసి, సనందనాది వందనీయుండక్ = సనక సనందన సనత్కుమార సనత్సుజాతాదులచేత నమస్కరింపఁ దగినవాఁడను, ఐన నాయందుక్ = అగు పరమాత్మనైన నాయందు, కలఁడుక్ = ఐక్య మగును.

తా॥ నిర్మలజ్ఞానము గల బ్రహ్మవేత్త మనస్సును జ్ఞానేంద్రియకర్మేంద్రియములను నొకటిగాఁ జలింప కుండునట్టును నశించునట్టును జేసి అందముగా మనస్సనెడు కమలమునకు ఆదికారణ మగు నట్టి యపరోక్షజ్ఞానమువలనఁ గలిగిన సుఖ మనెడు సముద్రమునంగు చొక్కమయిన బుద్ధి జడత్వము లేనియట్లు ఐక్య మగురీతిని కలిసియుండఁగా (అనఁగా బుద్ధి వృత్తిత్రయరూపమును బొంది యుండఁగా) శ్రుతియుక్త్యనుభవములు లేని మూఢు లందఱు దూషించినను శ్లాఘించినను సుఖము నొందించినను దుఃఖము సంభవించునపుడు దేనియందుఁ జిక్కుకొనక యా కీడు మేలులను ప్రియముగా ననుభవించుచు నేను బ్రహ్మ మగుదునో కానో అనునది మొదలగు ననేకసంశయములను మాని సనక సనందన సనత్కుమార సనత్సుజాతాదులచేత నమస్కరింపఁ దగిన పరమాత్మ యగు నాయం దైక్య మగు నని తాత్పర్యము

క॥ కావున నీవును పావన, భావనచే నింద్రియముల ౹ భజియించి మనీ
షావిల మడంచి యనిశము, భావింపుము నన్ను విజనపదగుఁడ వగుచున్.౧౧౪॥

టీక కావున౯ = పైనఁ జెప్పినతీరున, ఆరురత్నుఁడు నాయందుఁ గలయును గనుక, నీవును = అపరోక్షజ్ఞానము గల నీవును, పావన = పవిత్ర మయిన, భావనచే౯ = బ్రహ్మభావనచేత, ఇంద్రియములన్ = చతుర్దశేంద్రియములను, భజియించి = అణఁచి, మనీషా = బుద్ధియందలి, ఆవిలము = కలుషమును, అడంచి = పోఁగొట్టి, అనిశము = ఎల్లప్పుడు, విజనపదగుఁడ వగుచున్ = ఏకాంతప్రదేశమం దున్నవాఁడవై, నన్నున్ = సచ్చిదానందస్వరూపుఁడ నైన నన్ను, భావింపుము = నన్నుగా ధ్యానము చేయుము.

తా॥ కావున నపరోక్షజ్ఞానము గల నీవును పవిత్ర మయిన బ్రహ్మభావనచేత చతుర్దశేంద్రియములను అణఁచి బుద్ధియందలి కల్మషమును బోఁగొట్టి నిరంతరము నేకాంతప్రదేశమునం దున్నవాఁడవై సచ్చిదానందస్వరూపుఁడ నైన నన్ను నిన్నుగా ధ్యానింపు మని తాత్పర్యము

ఆ॥ ఆంజనేయ సచ్చి౹దానందమయునిఁగా, నన్నుఁ గాంచు తెఱఁగు ౹ విన్నవింతు
నమలమనముచేత ౹ నవధరింపుము నీదు, సకలసంశయములు ౹ సమసిపోవు.౧౧౫॥

టీక ఆంజనేయ = ఆంజనాపుత్రా!, నన్నున్ = పరబ్రహ్మస్వరూపుఁడ నైన నన్ను, సచ్చిదానందమయునిఁగాన్ = సత్యజ్ఞానానందస్వరూపునిఁగా, కాంచుతెఱఁగున్ = చూడఁదగిన మార్గమును, విన్నవింతున్ = తెలుపుచున్నాఁడను, అమలమనముచేతన్ = నిర్మలమానసముచేత, అవధరింపుము = వినుము, (వింటివేని) నీదుసకలసంశయములు = నీయొక్కసందేహము లన్నియును, సమసిపోవున్ = నశించును

తా॥ ఆంజనేయ! పరబ్రహ్మస్వరూపుఁడ నైన నన్ను సర్వజ్ఞానానందస్వరూపునిఁగాఁ జూడఁ దగిన మార్గమును తెలుపుచున్నాను, నిర్మలమానసముచేత వినుము, అట్లు వింటివేని నీయొక్కసందేహము లన్నియును నశించు నని తాత్పర్యము

## సద్రూపలక్షణము.

పంచచామరము. అనాదికాల మాదిగా ౹ ననంతదేహవర్ణగో
త్రనామరూపసౌఖ్యదుఃఖ౹ధర్మపాపకోటులున్

వినాశ మొందు చుండఁ బూని ♦ వీనిఁ జూచు చుందు నే
ననాది నాట సత్స్వరూపుఁ ♦ డం గ్రహ నన్ను మారుతీ. ౧౬౦

టీక మారుతీ = ఆంజనేయా, అనాదికాలమాదిగాన్ = జగత్సృష్టికాది యైనకాలము మొదలుగా, అనంతదేహ = అనేకశరీరములు, వర్ణ = బ్రాహ్మణాది వర్ణములు, గోత్ర = వసిష్ఠాది ఋషిగోత్రములు, నామ = శివ రామ గోవింద నారాయణ మహాదేవాది నామములు, రూప = సురనరస్థావరతిర్యగాదిరూపములు - లేక స్త్రీపున్నపుంసక స్థూల హ్రస్వ దీర్ఘ కృశత్వాదిరూపములు, సౌఖ్య = స్త్రీభోగాదిసౌఖ్యములు, దుఃఖ = పుత్త్రమరణాది దుఃఖములు. ధర్మ = శ్రుత్యుక్తధర్మములు, పాప = శ్రుతిగర్హితవస్తుసేవనాది పాపములు, (వీనియొక్క) కోటులును = గుంపులును, వినాశ మొందుచుండగన్ = నశించుచుండఁగా, నేన్ = పరబ్రహ్మ మయిన నేను, అనాదినాటన్ = జననమరణములు లేనివాఁడ నగుటవలన, పూని = యత్నించి, వీనిఁ జూచు చుండుటన్ = వర్ణదేహగోత్రనామాదుల వీక్షించు చుండుటను, (ఆ హేతువుచేత) నన్నున్ = కేవలస్వరూపుఁడ నైన నన్ను, సత్స్వరూపుఁ డందురు = నశింపనిస్వరూపము గలవాఁ డని వర్ణించెదరు

తా ఆంజనేయా! జగత్తుయొక్క సృష్టికి ఆది యైన కాలము మొదలుగా అనేకశరీరములు, బ్రాహ్మణాదివర్ణములు, వసిష్ఠాదిఋషిగోత్రములు, శివరామకృష్ణవాసుదేవాదినామములు, సురనరస్థావరతిర్యగాదిరూపములు (లేక స్త్రీపున్నపుంసకరూపములు), స్త్రీభోగాదిసౌఖ్యములు, బంధుమిత్రకళత్రమరణాదిదుఃఖములు, వేదమునందుఁ జెప్పఁబడిన ధర్మములు, శాస్త్రనిందితము లగు వస్తువులను సేవించుట మొదలగు పాపములు, వీనియొక్క సమూహములు నశించు చుండఁగా పరబ్రహ్మ నైన నేను జననమరణములు లేనివాఁ డగుటవలన పూనికతో వీనిని జూచు చుండుటను, (అనఁగా వర్ణదేహగోత్రనామాదులను) ఆ హేతువువలన కేవలస్వరూపుఁ డగు నన్ను నశింపనిస్వరూపము గలవాఁ డని చెప్పుదురని తాత్పర్యము

పంచచామరము. ఖగంబులున్ దురంగపన్నగంబులున్ వనంబులున్
మృగంబులు న్నగంబులున్ మహీధరాదికంబులున్
జగంబులున్ లయంబు నొంద ♦ సాక్షి నై సమస్తమున్
దగంగఁ జూచు చుండుదున్ సదా ♦ సదాత్మకుం డనన్. ౧౬౧

టీక ఖగంబులును = చిలుకలు మొదలగు పులుఁగులును, తురంగ = ఉచ్చైశ్శ్రవము మొదలగు గుఱ్ఱములును, పన్నగంబులును = శేషుండు వాసుకి లోనగు సర్పములును, వనంబులును = నైమిశము మొదలైన అడవులును, మృగంబులును = శరభసింహాది మృగములును, నగంబులును = కల్పావృక్షాది వృక్షములును, మహీధరాదికంబులును = మహేంద్ర మలయాది పర్వతములును, జగంబులును = భూలోకాది చతుర్దశలోకములును, లయంబు నొందన్ = నశింపఁగాను, సదా = ఎల్లప్పుడు, సదాత్మకుం డనన్ = సత్యస్వరూపుఁ డనునట్లుల, సాక్షి నై = ద్రష్ట నై, సమస్తమున్ = సకలమును, తగంగన్ = ఒప్పిద మగునట్లు, చూచు చుండుదున్ = ఆలోకించు చుండుదును

తా. చిలుకలు మొదలగు పక్షులును, ఉచ్చైశ్శ్రవము మొదలగు గుఱ్ఱములును, శేషుఁడు వాసుకి మొదలగు సర్పములును, నైమిశము మొదలగు అడవులును, ఎలుఁగు సింహము మొదలగు మృగములును, కల్పావృక్షాది వృక్షములును, మహేంద్రము మలయము మొదలుగాఁ గల పర్వతములును, భూలోకము

పొందలగు పదునాలుగులోకములును నశించుచుండఁగా నెల్లప్పుడు సత్యస్వరూపుఁడనునటుల సాక్షియై సమస్తమును యెప్పుడ మగునటుల జూచుచుండు నని తాత్పర్యము.

సీ. దేహేంద్రియప్రాణధీమనోహంకార,చిత్తములుతమతమచేష్ట లుడిగి
యలఘు సుషుప్తియం దజ్ఞానమున లయ, మొందిన వేళ నే నుంటఁజేసి
యేమియు లేదని యెఱుఁగుదు వాని య,భావ మంతయును స్వబోధమునను
గావున విను తదభావానుభావము, స్మరియింతు మేల్కాంచ్న సమయమునను

తే. వరుసతో నిట్లు జాగరస్వప్నసుషుప్తు, లనుదినం బేగుదెంచుచు నరుగుచుండ
నేకరూపుఁడనై వాని నెప్పుడుఁ గనుచు, నునికివలనను సద్రూపుఁడను గపీంద్ర.

టీక. కపీంద్ర = వానరసార్వభౌమ, వినుము = ఆకర్ణింపుము, దేహేంద్రియములు—దేహ = శరీరములు, ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములును, ప్రాణ = పంచప్రాణములును, ధీ = నిశ్చయాత్మక మైన బుద్ధియును, మనః = సంశయాత్మక మైన మనస్సును, అహంకార = అభిమానమును, చిత్తములు=చంచలాత్మక మైన చిత్తమును, తమతమచేష్ట లుడిగి = స్వస్వవ్యాపారములను విడిచి, అలఘుసుషుప్తియందున్ = గాఢనిద్రయందు, అజ్ఞానమునన్ = అవివేకముచేత, లయమొందువేళన్ = లీనించుకాలమందు, నే నుంటఁజేసి = నేను మిగిలియుండుటవలన, స్వభావమునన్ = నిజబోధమందు, ఏమియు లేదని = దేహేంద్రియాదులలో నొకటియు లేదని, వానియభావ మంతయున్ = ఆ శరీరాదుల లేమియంతయు, ఎఱుఁగుదున్ = తెలిసియుందును - అనఁగా ప్రాజ్ఞుఁడనై యుందు నని భావము, కావునన్= నిజబోధయందు తెలిసియున్నాను గనుక, మేల్కాంచ్న సమయమునను = అంతఃకరణాదివృత్తులు తమతమ వ్యాపారాభిముఖము లయినప్పుడు, తదభావానుభావమున్ = ఆ దేహేంద్రియాదులు లేవనెడు ననుభూతిని, స్మరియింతున్ = తలఁచుచుందును, వరుసతోన్ = క్రమముతోడను, ఇట్లు = ఈవిధముగా, జాగరస్వప్నసుషుప్తులు = జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు, అనుదినంబు = ప్రతిదినము, ఏగుదెంచుచున్ = వచ్చుచు, అరుగుచుండన్ = పోవుచుండఁగా, ఏకరూపుఁడనై= అద్వితీయాపరిచ్ఛిన్నపరబ్రహ్మస్వరూపినై, వానిన్ = ఆ జాగ్రత్స్వప్నసుషుప్తులను, ఎప్పుడున్ = కాలత్రయమందును, కనుచున్= చూచుచు, ఉనికివలనన్ = ఉండుటవలన, సద్రూపుండన్ = త్రికాలములయందును నశింపనిరూపము గలవాఁడను

తా. వానరశ్రేష్ఠుఁడా! ఆకర్ణింపుము (వినుము.) శరీరములును జ్ఞానేంద్రియ కర్మేంద్రియములును పంచప్రాణములును నిశ్చయాత్మక మగు బుద్ధియు సంశయాత్మక మగు మనస్సును అభిమానమును (అనఁగా కర్తృత్వాద్యభిమానము- నేను చేయుచున్నాను, నేను భుజించుచున్నా ననుట) చంచలాత్మక మగు చిత్తమును తమతమచేష్టలను వదలి గాఢనిద్రయందు అవివేకముచేత నశించుచున్నపుడు నేను మాత్రము మిగిలియుండుటవలన నిజబోధయందు దేహేంద్రియాదులలో నొకటియు లేదని ఆ శరీరాదుల యొక్క లేమియంతయు నెఱిఁగియుందును (అనఁగా ప్రాజ్ఞుఁడనై యుందు నని భావము), గనుక అంతఃకరణాదివృత్తులు తమతమవ్యాపారాభిముఖము లయినప్పుడు ఆ దేహేంద్రియాదులు లేవనెడు అనుభవమును జక్కఁగా దలఁచుచుందును, ఇట్లు క్రమమున జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు ప్రతిదినము వచ్చుచు పోవుచుండఁగా అద్వితీయాపరిచ్ఛిన్నపరబ్రహ్మస్వరూపినై ఆ జాగ్రత్స్వప్నసుషుప్తులను త్రికాలములయందును చూచుచుండుటవలనఁ ద్రికాలములయందును నశింపనిరూపము గలవాఁడని తా.

ఆ. జాగరంబునందు స్వప్నసుషుప్తులు, స్వప్నమున సుషుప్తి జాగరములు
సమసుషుప్తియందు స్వప్నజాగరములు, గలుగ నేను వీని గాంతు నెపుడు.

టీక. జాగరంబునందున్ = జాగ్రదవస్థయందు, స్వప్నసుషుప్తులు = స్వప్నావస్థయును సుషుప్త్యవస్థయును, స్వప్నమునన్ = స్వప్నావస్థయందు, సుషుప్తిజాగరములు = సుషుప్త్యవస్థయును జాగ్రదవస్థయును, సమసుషుప్తియందున్ = గాఢనిద్రయందు, స్వప్నజాగరములు = స్వప్నజాగ్రదవస్థలు, కలుగన్ = ప్రసక్తింపఁగా, ఎపుడు = అనవరతము, వీనిన్ = అవస్థాత్రయమును, ఏను = నేను, కాంతున్ = అవలోకింతును - అనఁగా సత్త్వరజస్తమోగుణములచే జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు గాన ఒకటియందు నొకటి పుట్టి అడఁగుచుండఁగా నేను సాక్షినై చూచుచుందు నని భావము.

తా. సత్ప్రవర్తనము గల ఓ యాంజనేయా! వినుము జాగ్రదవస్థయందు స్వప్నావస్థయును సుషుప్త్యవస్థయును, స్వప్నావస్థయందు సుషుప్త్యవస్థయును జాగ్రదవస్థయును, సుషుప్తియందు (గాఢనిద్రయందు) స్వప్నజాగ్రదవస్థలును గలుగఁగా నా యవస్థాత్రయమును నే నెప్పుడును జూతును (అనఁగా సత్త్వరజస్తమోగుణములచే యవస్థాత్రయమును గనుక ఒకటియం దొకటి పుట్టి నశించుచుండఁగా నేను సాక్షినై చూచుచుందును) అని తాత్పర్యము.

సీ. భువి నవస్థాత్రయంబున నేకరూపత, నొకదివసంబునం దున్నయట్లు
విను మతీతాగామిదినవారపక్షమా,సాబ్దయుగప్రకల్పాంతములను
నొక్కచందంబున నుండుదు గావున, సద్రూపుఁడను వినిశ్చయము సుమ్ము
అదిగాక బాధయోగ్యము లైన దేహేంద్రి,యప్రాణధీమనోహంకృతులును

తే. నేను గా నని భావింప నిఖిలదృశ్య,చయనిషేధావధీభూతసర్వబాధ
వర్జితాశేషసాక్షి నై వఱలుచునికి,వలన సత్యస్వరూపుఁడ నలఘుచరిత.

టీక. అలఘుచరిత = సత్ప్రవర్తనము గల యాంజనేయా, వినుము = ఆకర్ణింపుము; భువిన్ = శరీరమను భూమియందు, అవస్థాత్రయంబునన్ = జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడు మూఁడుదశలయందు, ఏకరూపతన్ = ఏకాకృతితో, ఒకదివసంబునం దున్నయట్లు = ఏకదినమం దుండినలాగున, అతీత = కడచిన, ఆగామి = రాఁగల, దిన = దినములు, వార = వారములు, పక్ష = పక్షములు, మాస = మాసములు, అబ్ద = సంవత్సరములు, యుగ = కృతత్రేతాద్వాపరకలియుగములు, ప్రకల్పాంతములన్ = బ్రహ్మాదిప్రళయములు, (వీనియందు) ఒక్కచందంబునన్ = ఏకరూపముగాను, ఉండుదున్ = వసింతును, కావునన్ = కనుక, సద్రూపుఁడను = సత్యస్వరూపము గలవాఁడను, వినిశ్చయము సుమ్ము = నిజము సుమా, అదిగాక = అదియును గాక, బాధయోగ్యము లైన = ఉపద్రవకారణము లయిన, దేహ = త్రిశరీరములును, ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములును, ప్రాణ = పంచప్రాణములును, ధీ = బుద్ధియును, మనః = మానసమును, అహంకృతులును = చిత్తౌన్నత్యమును, నేను గా నని భావింపన్ = నేను గా నని తలఁచుటవలన, నిఖిల = సమస్తము లయిన, దృశ్యచయ = బాహ్యాభ్యంతరదృశ్యసమూహముయొక్క, నిషేధ = త్యజించుటయందును, అవధీభూత = మేరగా నున్నట్టియు, సర్వ = సకలము లయిన, బాధ = దుఃఖంబులనుండి, వర్జిత = తొలఁగినట్టి, అశేషసాక్షినై = సర్వద్రష్టనై, వఱలుచున్ = శోభిల్లుచు, ఉనికివలనన్ = ఉండుటవలన, సత్యస్వరూపుఁడన్ = సద్రూపుఁడను

తా సత్ప్రవర్తన గల యో యాంజనేయా! వినుము శరీర మను భూమియందుగును అవస్థాత్రయ మందును యేకాకారముగా నొకదినము యుండినలాగున నే గతించినదినములందును రాఁగలదినములందును వారములయందును కృతాదియుగములయందును బ్రహ్మాదిప్రళయములయందును వుండును కనుక నే నేను సత్యస్వరూపము గలవాఁడను, యిది సత్యము సుమీ, ఆదియును గాక, ఉపద్రవకారణము లయిన శరీర త్రయమును జ్ఞానేంద్రియకర్మేంద్రియములును పంచప్రాణములును బుద్ధియును మానసమును అహంకృతులును నేను గా నని భావించుటవలన సమస్తము నైన బాహ్యాభ్యంతరద్వౌర్యసమూహమును వదలుటకు మేరగా నున్నట్టి సకలము లయిన దుఃఖముల నుండి తొలంగినట్టి సర్వసాక్షి గ్రము ప్రకాశించు సత్యస్వరూపుఁడ నని తాత్పర్యము

## పంచప్రళయముల వివరణము.

వ మఱియు లఘ్వక్షరోచ్చారణమాత్రకాలంబు నిమేషం, బట్టి నిమేషంబులు పదునెనిమిది యైన గాష్ఠ, యవి ముప్పది యైన గళ, యవి యిన్నియైనం గళం, బవి పండ్రెండు ముహూర్తం, బమ్ముహూర్తంబు ముప్పది యైన నహోరాత్రంబులు గడచు, నయ్యహోరాత్రంబులందు శరీరేంద్రియప్రాణాంతఃకరణంబులు స్వస్వవ్యాపారంబులఁ జలించి తమకుఁ గారణం బైన సుషుప్తిరూపావిద్యాంధకారమ్మునందు లయంబు నొందు, నప్పుడు జాగ్రత్స్వప్నాత్మకం బగు నఖలప్రపంచంబు వాసనారూపమాత్రం బై పల్లవ పత్రపుష్ప శలాటు ఫలమూల శాఖోపశాఖాత్మకం బయిన వటంబు తదీయబీజంబునందు నానావిధవర్ణరక్తం బయిన మయూరంబు తదీయాండాంతర్జలంబునందు నున్నచందంబున నుండు నిది నిత్యప్రళయం బన నొప్పు, నయ్యహోరాత్రపంచదశకంబు పక్షం బయ్యె, శుక్లకృష్ణాఖ్య పక్షద్వయంబు మాసం బిది పితృదేవతల కొక్కదినం బగు, నమ్మాసద్వయంబు ఋతువు, ఋతుత్రయం బయనంబు, దక్షిణోత్తరసంజ్ఞికాయనద్వయంబు హాయనం బది వేల్పుల కొక్కదినం బగుఁ, దద్దివసవారపక్షమాసక్రమంబుచేత ద్వాదశసహస్రవత్సరంబు లైనఁ గృత త్రేతా ద్వాపర కలియుగంబులు నాలుగుం జను, నయ్యుగచతుష్టయంబును మహాయుగం బని చెప్పుగు, రవి డెబ్బది యొక్కటి యైన మన్వంతరంబు చెల్లు, నమ్మన్వంతరంబులు పదునాలుగు చనిన నలువకు నొక్కపగ లగు, నది చతుర్యుగసహస్రపరిమితం, బా పగటిలోఁ జతుర్దశమనుప్రళయంబులు ననేకయుగాంతరప్రళయంబులుఁ బ్రవర్తించు, నవియు నైమిత్తికప్రళయంబు లవాంతరప్రళయంబు లనం బ్రసిద్ధంబు లగు, నం దనంత భూతజాతంబులు నశించు, నయ్యహరవసానంబున ద్రుహిణుండు నిద్రించు, నతని నిద్ర యవ్యక్తం బనం దగు, నందు బ్రహ్మాండంబునం గల సర్వప్రాణివ్యవహారంబు పరతం బగు, నత్తరి మహాభూతంబులుమాత్రంబు శేషించునది యైనందిన ప్రళయం బన విలసిల్లు, నయ్యజున కహఃపరిమాణం బంతియు రేయి యగు, నట్టి

దినసంఖ్యాక్రమంబుచేత శతాబ్దంబులు చనిన శతానందుండు నాశంబుఁ జెందుఁ, నయ్యెడ మృత్యువు సమస్తజీవుల నొక్కపెట్టం బరిమార్చు, రుద్రుండు చిచ్చు కన్ను దెఱచి చూచు, నాదిత్యుండు పంద్రెండుమూర్తులుఁ గైకొని ప్రకాశించు, నవ్వేళ ప్రజ్వలజ్జ్వాలాభీలం బగు మహానలంబు జనియించి విశ్వవిశ్వంబు భస్మీభూతంబుగాఁ జేయు, సప్తమారుతంబు లొక్కపెట్ట విసరు, నవమేఘంబు లుప్పతిల్లి యమోఘంబులై సూఱుదివ్యవర్షంబులు మహావర్షంబు వర్షించు, నందువలన సప్తసముద్రంబులుం గలసి యేకార్ణవం బై మహామహీమండలంబు నాక్రమించుచు నంతట ధరణీచక్రం బమ్మహాసలిలమధ్యంబున మహోదకంబుల స్వల్పలోష్టపిండంబువిధంబున విరిసి చెడుఁ, దప్తాయఃపిండం బాకశోషకంబుం బీల్చినకైవడి బడబాగ్నివిజృంభించి యమ్మహాంభోరాశి శోషణంబు సేయు, దీపంబు గాలియార్చినభంగి నమ్మహాతేజోమండలంబును మహావాయువు దెగటార్చు, నమ్మహాఝంఝామారుతంబు నిరాధేయం బగుటం జేసి యంతరిక్షంబునం గలయం దిరిగి యందు సుషుప్తియందు ప్రాణులపోలిక మ్రగ్గు, శబ్దరూపం బయిననింగి శ్రోత్రరూపం బయిన సంకల్పంబు మ్రింగినతెఱంగు నయ్యాకాశంబు మహామనంబు గ్రసించు, బంచతన్మాత్రసహితం బయిన యమ్మహామానసంబు నిద్రాసమయంబు గబళించుచాడ్పున నహంకారంబు గబళించు, నయ్యహంకృతి మహాబుద్ధిమెసంగు, నమ్మహాబుద్ధియే మహత్తత్త్వం బని చెప్ప నొప్పు, నమ్మహాతత్త్వంబు నవ్యక్తంబు తనయందు విలీనంబు గావించి యడంచుకొను, నది మాయావిద్యావ్యక్తతమస్సుషుప్తిప్రకృత్యానందాదిశబ్దవాచ్యం బయిన ప్రధానం, బదియే బ్రహ్మప్రళయం బగు, నయ్యవాచ్యనిర్వచనీయాజ్ఞానంబు సద్గురూక్తజీవేశ్వరైక్యజ్ఞానానుభవసమయంబున నభావం బగు నదియే మహాప్రళయం బగు, నిట్టి నిత్యనైమిత్తికదైనందినకల్పాంతమహాప్రళయంబులయందే నొక్కటిచేత బాధింపఁబడక సాక్షి నై వాని నన్నింటిం జూచుచు భూతభవిష్యద్వర్తమానకాలంబులయం దేకరూపంబుగా నుంటం జేసి నదూర్ధ్వమండ నగుదు నని యుపదేశించి పొండియు నిట్లనియె. ౧౬౫

టీక. మఱియుఁ = పెండియు, లఘ్వక్షరోచ్చారణమాత్రకాలంబు = లఘువర్ణ ముచ్చరించునంతకాలము-అనఁగా చిటికవేయునంతకాలము, నిమేషంబు = నిమేషము-అనఁగా ఱెప్పపాటు, అట్టి నిమేషంబులు = అట్టినిమిషములు, పదునెనిమిదియైనన్ = అష్టాదశ మాయెనేని, కాష్ఠ = కాష్ఠ యగును, అవి = ఆకాష్ఠలు, ముప్పదియైనన్ = త్రింశ మయ్యెనేని, కళ = కళ యగును, అవి = ఆ కళలు, అన్నియైనన్ = ముప్పది యయ్యెనేని, క్షణంబు = క్షణము, అవి = ఆక్షణములు, పండ్రెండు = ద్వాదశ మాయెనేని, ముహూర్తంబు = రెండుగడియలకాల మగును, అమ్ముహూర్తంబులు=ఆ ముహూర్తములు, ముప్పదియైనన్ = మూఁడుపదు లాయెనేని, అహోరాత్రంబులుగడచున్ = పగలురేయియుఁ గడచును-

అనఁగా దిన మగు నటుల, అయ్యహోరాత్రంబులందుక్ = రాత్రిందినములు గూడిన యాదినమందు, శరీర= స్థూలసూక్ష్మకారణశరీరములును, ఇంద్రియ = దశేంద్రియములును, ప్రాణ = దశవిధప్రాణములును, అంతఃకరణంబులు = మనస్సును, స్వస్వవ్యాపారంబులజాలించి = తమతమనడతలు వదలి, తమకుక్= తా మైన శరీరేంద్రియాంతఃకరణములకు, కారణంబైన = ఆదికారణ మైన, సుషుప్తిరూప = నిద్రారూప మైన, అవిద్యా = జ్ఞాన మనెడు, అంధకారంబునక్ = చీఁకటియందు, లయంబునొందుక్ = నశించి నప్పుడు, జాగ్రత్స్వప్నాత్మకం బగు = జాగ్రత్స్వప్నరూప మైన, అఖిలప్రపంచంబు = సకలేంద్రియ రూప మగు ప్రపంచమును, వాసనరూపమాత్రం బై = పృథివియందు గంధగుణమువలె నున్నదై, పల్లవ= చిగుళ్లు, పత్ర = ఆకులు, పుష్ప = పువ్వులు, శలాటు = కాయలు, ఫల = పండ్లు, మూల = వేళ్లు, శాఖ = కొమ్మలు, ఉపశాఖ = చిఱుకొమ్మలు, (ఇవియే) ఆత్మకంబు= స్వరూపముగాఁ గలది, విన వటంబు = అగునట్టి మఱ్ఱిమ్రాను, తదీయబీజంబునందుక్ = ఆ మఱ్ఱివిత్తునందును, నానావిధవర్ణయుక్తం బైన — నానావిధ = పలుతెఱఁగు లైన, వర్ణ=రంగులతోడ, యుక్తం బైన = కూడిన, మయూరంబు = నెమలి, తదీయాండాంతర్జలంబునందుక్ — తదీయ = ఆ నెమలియొక్క, అండ = గ్రుడ్డుయొక్క, అంతః = లోపలను, జలంబునందుక్ = నీటియందు, ఉన్నచందంబునక్ = ఉన్నయట్లు, ఉండుక్ = ప్రపంచము ప్రకృతిలో లీనమై యుండును, ఇది నిత్యప్రళయం బన నొప్పుక్=ఇది దినప్రళయ మని చెప్పఁ బడును, అయ్యహోరాత్ర = ఆ దినములయొక్క, పంచదశకంబు = పదియైదు, పక్షం బయ్యెక్ = పక్ష సంజ్ఞగల దాయెను, శుక్లకృష్ణాఖ్యపక్షద్వయంబు = శుక్లకృష్ణము లను పేళ్లు గల రెండుపక్షములు, మాసంబు = నెల యగును, ఇది = ఈనెల, పితృదేవతలకుక్ = కవ్యభుక్కులకు, ఒక్కదినం బగుక్= ఒకపగ లగును, అమ్మాసద్వయంబు ఋతువు=ఆ రెండునెలలు ఋతు వగును, ఋతుత్రయం బయనంబు= మూఁడుఋతువు లొక అయన మగును, దక్షిణోత్తరసంజ్ఞికాయనద్వయంబు=దక్షిణాయన ఉత్తరాయణ ము లను సంజ్ఞలు గల రెండయనములు, హాయనంబు = ఒకసంవత్సర మగును, అది = ఆ సంవత్సరము, వేల్పులకుక్ = దేవతలకు, ఒక్కదినం బగుక్= ఒక్కవాసర మగును, తత్=ఆ దేవతలయొక్క, దివస= దినములు, వార = వారములు, పక్ష = పక్షములు, మాస = నెలలు, (వీనియొక్క) క్రమంబుచేతక్ = ప్రమాణముచేత, ద్వాదశసహస్రవత్సరంబు లైనక్ = పండ్రెండువేలేం డ్లాయె నేని, కృత = పదియేడు లక్షలయిరువదియెనిమిదివేలసంవత్సరములు గల కృతయుగమును, త్రేతా = పండ్రెండులక్షలతొంబది యాఱువేల సంవత్సరములు గల త్రేతాయుగమును, ద్వాపర = ఎనిమిదిలక్షల అరువదినాలుగువేల సంవత్సరములు గల ద్వాపరయుగమును, కలియుగంబును = నాలుగులక్షల ముప్పదిరెండు వేల సంవత్సర ములు గల కలియుగమును, నాలుగుక్ = ఈ నాలుగుయుగములును, చనుక్= అతిక్రమించును, అయ్యుగ చతుష్టయంబుక్ = ఆ నాలుగుయుగములును, మహాయుగం బని చెప్పఁదగు = మహాయుగ మని వచియిం తురు, అవి డెబ్బదియొక్కటి యైనక్= ఆ మహాయుగము లేకసప్తతి యయ్యె నేని, మన్వంతరంబులు చెల్లుక్ = మన్వంతరముగడచును, అమ్మన్వంతరంబులు = ఆ మన్వంతరములు, పదునాల్గుచనినక్ = చతు ర్దశము గడచె నేని, నలువకుక్ = బ్రహ్మకు, ఒక్కపగ లగుక్ = ఒకయహ స్సగును, అది = ఆదినము, చతుర్యుగ = నాలుగుయుగములయొక్క, సహస్ర = వేయింటియొక్క, పరిమితంబు = పరిమాణము గలది, ఆ పగటిలోక్ = బ్రహ్మదేవునియొక్క దినములోనే, చతుర్దశమనుప్రళయంబులును = స్వాయంభువ స్వారోచిష ఉత్తమ తామస రైవత చాక్షుష వైవస్వత సూర్యసావర్ణి దక్షసావర్ణి బ్రహ్మసావర్ణి ధర్మ సావర్ణి భద్రసావర్ణి దేవసావర్ణి ఇంద్రసావర్ణి యనెడు పదునాలుగు మనువులలయమును, అనేకయుగాం తరప్రళయంబులున—అనేక = పెక్కులైన, యుగాంతర = యుగసంధులయందుఁ గల, ప్రళయంబులును.

విలయములును, ప్రవర్తించుఁ = జరుగును, అవియుఁ = ఆ ప్రళయములు, నైమిత్తికప్రళయంబులు = విశేషప్రళయము లని, అవాంతరప్రళయంబు లనఁ = ఆగంతుకప్రళయము లని, ప్రసద్ధంబు లగుఁ = ప్రశస్తము లగు, అందుఁ = ఆ బ్రహ్మదేవునిపగటియందు, అనంతభూతజాలంబులు = అనేక ప్రాణులగుంపులు, నశించుఁ = చచ్చును, అహ్యాహరవసానంబుఁ = ఆ దినాంతమందు, గ్రుహిణుండు = బ్రహ్మ, నిద్రించుఁ = నిదురపోవును, అతనినిద్ర = ఆ బ్రహ్మసుషుప్తి, అవ్యక్తంబనందగుఁ = మహామాయ యని యనఁదగును, అందుఁ = ఆ యవ్యక్తతత్త్వమంగు, సర్వప్రాణివ్యవహారంబు = సకలజీవులప్రవర్తనములు, ఉపరతం బగుఁ = విరామము నొంది యుండును, అత్తటిఁ = ఆ సమయమంగు, మహాభూతంబులు మాత్రంబు = ప్రపంచమహాభూతములుమాత్రము, శేషించుఁ = మిగిలియుండును, అది దైనందినప్రళయం బన విలసిల్లుఁ = అది బ్రహ్మయొక్కపగటియందు జరిగెడు ప్రళయ మని చెప్పఁదగును, అయ్యజునకుఁ = ఆ బ్రహ్మకు, అహఃపరిమాణంబంతియుం = పగటిలెక్కయొక్కప్రమాణమంతయు, రేయి యగుఁ = రాత్రియగును, అట్టి దినసంఖ్యాక్రమంబుచేఁ = ఆ బ్రహ్మ దినసంఖ్యప్రమాణముచేత, శతాబ్దంబులు = నూఱేండ్లు, చనినఁ = కడచినేని, శతానందుండు = బ్రహ్మ, నాకంబుఁ = 'కం సుఖం తన్న భవతీ త్యకం తస్మాన్న స్యాత్తేతి నాకః' అని వ్యుత్పత్తి, కం అనఁగా సుఖము అది గానిది అకము, అనఁగా దుఃఖము, ఆ దుఃఖ మచ్చట లేదు గనుక నాక మని అర్థము-అనఁగా సుఖస్థానమును, చెందుఁ = పొందును - అనఁగా బ్రహ్మ మరణ మొందు నని భావము, అయ్యెడఁ = బ్రహ్మశరీరపతనకాలమందు, మృత్యువు = మిత్తి, సమస్తజీవులఁ = సర్వప్రాణులను, ఒక్కపెట్టఁ = ఏకవృత్తిగనే, పరిమార్చుఁ = చంపును, రుద్రుఁడు = శివుఁడు, చిచ్చుకన్ను దెఱచి = ఫాలనేత్రమును విప్పి, చూచుఁ = వీక్షించును, ఆదిత్యుండు = సూర్యుఁడు, పండ్రెండుమూర్తులు గైకొని = 'శ్లో॥ వివస్వా నర్యమా పూషా త్వష్టాథ సవితా భగః। ధాతా విధాతా వరుణో మిత్ర శ్శక్ర ఉరుక్రమః' అనెడు ద్వాదశశరీరములను ధరించి, ప్రకాశించుఁ = వెలుఁగును, అవ్వేళఁ = ఆ కాలమందు, ప్రజ్వలాఖిలం బగు—ప్రజ్వలత్ = మిక్కిలి వెలిఁగెడి, జ్వాలా = మంటచేత, అఖిలం బగు = భయంకర మైన, మహానలంబు=గొప్పయగ్ని - అనఁగా సంకర్షణాగ్ని, జనియించి = పుట్టి, విశ్వవిశ్వంబుఁ = ప్రపంచమునెల్లను, భస్మీభూతంబు గాఁ జేయును = వేలించేయును, సప్తమారుతంబులు = ప్రవహా ఆవహా ఉద్వహా సంవహా నివహా ప్రతివహా పరావహాము లనెడు ఏడువాయువులు, ఒక్కపెట్టఁ = ఒక్కసారిగానే, విసరుఁ = వీచును, నవమేఘంబులు = ఆవర్త సంవర్త పుష్కర ద్రోణ కాల నీల అరుణ తమో వారుణము లను నవమేఘములు, ఉప్పతిల్లి = పుట్టి, అమోఘంబులై = సార్థకములై, నూరుదివ్యవర్షంబులు = నూఱుదేవతాసంవత్సరములు, మహావర్షంబువర్షించుఁ = గొప్పవానకురియును; అందువలనఁ = ఆ వానచేత, సప్తసముద్రంబులును = సప్తసాగరములును, కలసి = చేరి, ఏకార్ణవంబై = ఒక్కటే సముద్రమై, మహామహీమండలంబుఁ = గొప్పదైన భూచక్రమును, ఆక్రమించుఁ = ముంచును, అంతటఁ = పిమ్మట, ధరణీచక్రంబు = భూమండలము, అమ్మహాసలిలమధ్యంబునఁ = ఆ వెన్నీటినడుమ, బహూదకంబులఁ = అధిక జలములంగు, స్వల్పలోష్ఠపిండంబువిధంబునఁ = కొంచెపుమంటిపెళ్లవలె, విరిసిచెడుఁ = కరగిపోవును, తప్తాయఃపిండంబు = కాల్పఁబడిన యినుపముద్ద, ఒకతోయకణంబుఁ = ఒకనీటిబొట్టును, పీల్చినకైవడిఁ = గ్రసించినట్లు, బడబాగ్ని = వార్ధ్యగ్ని, విజృంభించి = రేఁగి, అమ్మహాంభోరాశిఁ = ఆగొప్పసముద్రమును, పానంబుసేయుఁ = త్రాగును, దీపంబుఁ = దీవియను, గాలియార్చినభంగిఁ = వాయువు మరిపినట్లు, అమ్మహాతేజోమండలంబుఁ = ఆ ఘనమైన తేజస్సమూహమును - అనఁగా బడబాగ్నిని, మహావాయువు దొగటార్చుఁ = గొప్పగాలి నశింపఁజేయును, అమ్మహాజంఝూసమీరంబు = ఆ గొప్పయీదుగాలి, నిరాధా

యం బగుటంజేసి = ఆధారము లేని దగుటవలన, అంతరిక్షంబున్ = ఆకాశమందు, కలయందిరిగి = సర్వత్ర వ్యాపించి, అందున్ = ఆ యాకాశమందు, సుషుప్తియందున్ = నిద్రయందు, ప్రాణులపోలికన్ = జీవులవలె, ప్రమగ్గున్ = నశించును, శబ్దరూపం బైననింగిన్ = శబ్దగుణ మైన యాకాశమును, శ్రోత్రరూపం బైన సంకల్పంబు = శ్రవణేంద్రియస్వరూప మైన మనస్సు, మ్రింగినతెఱంగునన్ = కబళించినట్లు, అయ్యాకాశంబున్ = ఆ మహాగగనమును, మహామనంబు = గొప్ప దైన యామనస్సు, గ్రసించున్ = మ్రింగును, పంచతన్మాత్రసహితం బైన = శబ్దస్పర్శరూపరసగంధము లనెడు తన్మాత్ర లైదింటితోఁ గూడిన, అమ్మహామానసంబున్ = ఆమహామనస్సును, నిద్రాసమయంబు = సుషుప్తకాలము, కబళించుచాడ్పునన్ = మ్రింగునట్లు, అహంకారంబు = మహదహంకారము, కబళించున్ = మ్రింగును, అయ్యహంకృతిన్ = ఆ యహంకారమును, మహాబుద్ధి యెసంగున్ = సమష్టిజ్ఞానము కబళించును, అమ్మహాబుద్ధియే = సమష్టిజ్ఞానమే, మహత్తత్త్వంబని = మహత్తత్త్వమని, చెప్ప నొప్పున్ = పలుకఁదగును, అమ్మహాతత్త్వంబున్ = ఆ బుద్ధిని, అవ్యక్తంబు = మూలప్రకృతి, తనయందున్ = తనలోపల, విలీనంబు గావించి = చేర్చుకొని, అడంచికొనున్ = మఱుఁగుపఱచుకొని యుండును, అది = ఆ యవ్యక్తమే, మాయా = మాయ యను, అవిద్యా = అవిద్య యను, అవ్యక్త = అవ్యక్తమను, తమః = తమస్సను, సుషుప్తి = సుషుప్తి యను, ప్రకృతి = ప్రకృతి యను, ఆనంద = ఆనంద మను, ఆది = మొదలైన, శబ్ద = పేళ్లచేత, వాచ్యం బైన = పలుకఁదగిన, ప్రధానంబు = మూలప్రకృతి, అదియే = ఆ మూలకారణమే, బ్రహ్మప్రళయం బగున్ = బ్రహ్మప్రళయ మని చెప్పఁ దగును, అయ్యనాది = అట్టినుద పొందుట లేని, అనిర్వచనీయ = ఇట్టి దట్టి దని పలుకఁగూడని, అజ్ఞానంబు = అవివేకము, సద్గురు = విహితగురువుయొక్క, ఉక్త = బోధింపఁబడిన, జీవ = త్వంపదలక్ష్యార్థ మైన శుద్ధప్రత్యగాత్మయొక్క, ఈశ్వర = తత్పదలక్ష్యార్థ మైన పరిపూర్ణబ్రహ్మచైతన్యముయొక్క, ఐక్యజ్ఞాన = ఏకీభావజ్ఞానముయొక్క, అనుభవ = స్వానుభూతియొక్క, సమయంబునన్ = కాలమందు, అభావం బగున్ = నశించును, అదియే మహాప్రళయం బగున్ = ఆ యజ్ఞాననాశనమే మహాప్రళయ మగును, (దీనినే ఆత్యంతికప్రళయ మందురు) ఇట్టి = ముందుఁ జెప్పఁబడినట్టి, (నిత్యసుషుప్త్యవస్థారూపప్రళయము) నైమిత్తిక = నిశేషప్రళయము, దైనందిన = బ్రహ్మదినమందుఁ గలిగెడు ప్రళయము, కల్పాంత = అవాంతరప్రళయము, మహాప్రళయంబులయందున్ = జీవేశ్వరైక్యజ్ఞానముచేత మాయావిద్యలు నశించునట్టి మహాప్రళయమందు, ఏను = నేను, ఒక్కటిచేతన్ = ఈ చెప్పఁబడిన ప్రళయములలో నొకదానిచేత, బాధింపఁబడక = పీడింపఁబడక, సాక్షినై = పరిపూర్ణద్రష్టనై, వానినన్నిటిం జూచుచున్ = ఆ ప్రళయములనెల్ల జూచుచు, భూత = కడచినట్టి, భవిష్యత్ = రాఁబోయెడు, వర్తమాన = నడచుచున్నట్టి, కాలంబులయందున్ = సమయములయందు, ఏకరూపంబుగాన్ = ఒక్కతీరున, ఉండుటం జేసి = ఉండుటవలన, సగ్రాపకుఁడ నగుదున్ = సర్వకాలపరిచ్ఛేదశూన్యుఁడ నవుదును, అని యుపదేశించి = అని బోధించి, పెండియున్ = మరల, ఇట్లనియెన్ = ఈ ప్రకారము చెప్పెను

తా॥ మాత్రయను లఘువర్ణ ముచ్చరించునంత కాలము (అనఁగా నొకటి నుచ్చరించునంత కాలము) నిమేషము (ఱెప్పపాటు) అట్టి నిమిషములు పదునెనిమిది యైన నొక కాష్ఠ యగు, అట్టి కాష్ఠలు ముప్పది యయ్యేనేని యొకకళ యగును, అట్టికళలు ముప్పది యయ్యేనేని యొకక్షణము, అట్టిక్షణములు పండ్రెండు ఐయెనేని యొకముహూర్తము (రెండుగడియలకాలము), అమ్ముహూర్తంబులు ముప్పది యాయెనేని యహోరాత్రం బగు (పగలును రేయియును దీనినే దిన మందురు), అట్టి దినమందు స్థూలసూక్ష్మకారణశరీరములును

దశేంద్రియములును దశవిధప్రాణములును అంతఃకరణంబులును మనస్సును తత్తద్వ్యాపారములను వదలి తమకు కారణ మగు నిద్రారూప మయిన అజ్ఞాన మనెడు చీకటియందు నశించును, అట్లు నశించి నపుడు జాగ్రత్స్వప్నరూప మయినదియు, సకలేంద్రియరూప మగునదియు నగు ప్రపంచము పృథివి యందు గంధగుణమువలె నున్నదై చిగుళ్లు ఆకులు పువ్వులు కాయలు పండ్లు వేళ్లు కొమ్మలు ఇవియే స్వరూపముగాఁ గల మఱ్ఱిమాను మఱ్ఱివిత్తునందును నానావిధము లయిన రంగులతోఁ గూడుకొన్న నెమలి తనగ్రుడ్డులో నున్న నీటియందును వున్నవిధమున ప్రకృతిలో లీనమై యుండును, (దీనినే దినప్రళయ మని చెప్పుదురు) అట్టి పదునైదుదినము లొకపక్ష మగును, మాసమునకు అట్టిపక్షంబులు రెండు (శుక్లపక్షము కృష్ణపక్షము), ఇట్టినెల పితృదేవతల కొక్కదిన మగును (పగ లగును), ఇట్టి మాసములు రెండైన నొక ఋతువు మూఁడు ఋతువు లొక అయన మగును, అట్టి అయనములు (ఉత్తరాయణము దక్షిణాయనము) రెండైన నొక సంవత్సర మగు, అట్టి సంవత్సరము దేవతల కొకదిన మగు, ఇట్లు ఆ దేవతలయొక్క దినములు వారములు మాసములు వీనిక్రమముచేత పండ్రెండువేలేండ్లాయెనేని మానవులకు పదునేడులక్షల యిరువదియెనిమిదివేలసంవత్సరములు గల కృతయుగమును, పండ్రెండులక్షలతొంబదియాఱువేలసంవత్సరములు గల త్రేతాయుగమును, ఎనిమిదిలక్షల అరువదినాలుగువేలసంవత్సరములు గల ద్వాపరయుగమును, నాలుగులక్షలముప్పదిరెండువేలసంవత్సరములు గల కలియుగమును అతిక్రమించును, ఈ నాలుగుయుగము లొకమహాయుగ మనఁబడును, అట్టి మహాయుగములు డెబ్బదియొక్కటైన మన్వంతర మగును, అట్టి మన్వంతరములు పదునాలుగైన బ్రహ్మకు ఒకపగ లగును, ఆ పగలు వేయిమహాయుగములపరిమిత కాలము; అట్టి బ్రహ్మదేవుని పగటియందే స్వాయంభువు మొదలగు (స్వాయంభువ స్వారోచిష ఉత్తమ తామస రైవత చాక్షుష వైవస్వత సూర్యసావర్ణి బ్రహ్మసావర్ణి దక్షసావర్ణి ధర్మసావర్ణి భద్రసావర్ణి దేవసావర్ణి ఇంద్రసావర్ణి) పదునాలుగుమనువులయొక్క ప్రళయములును, అనేకయుగసంధులు గల ప్రళయములును జరుగును, ఆ ప్రళయములు నైమిత్తికప్రళయము లని, ఆగంతుక ప్రళయము లని ప్రసిద్ధములు, ఆ బ్రహ్మదేవునిపగటియందు అనేకప్రాణులగుంపులు నశించును, ఆ దినాంతమునందు బ్రహ్మ నిద్రించును, ఆ నిద్ర మహామాయ యనఁబడును, ఆ మాయయందు సకలజీవులప్రవర్తనములు విరామము నొందును, ఆ కాలమునందు పంచమహాభూతములమాత్రము శేషించి యుండును, అది బ్రహ్మ యొక్కపగటియందు జరిగెడు ప్రళయ మనంబడును, ఆ బ్రహ్మకు పగటిలెక్కయొక్కప్రమాణమంతయే రాత్రి యగును, ఆ బ్రహ్మదినసంఖ్యాప్రమాణముచేత నూఱేండ్లాయెనేని బ్రహ్మ సుఖస్థానమును బొందును (అనఁగా బ్రహ్మ మరణ మొందును), ఆ బ్రహ్మ మరణకాలమందు మృత్యువు సర్వప్రాణుల నొక్కపెట్టునఁ జంపును, శివుఁడు ఫాలనేత్రము దెఱచిచూచును, సూర్యుఁడు పండ్రెండుమూర్తులను ధరించి ప్రకాశించును (వివస్వాన్ అర్యమా పూషా త్వష్టా సవితా భగః ధాతా విధాతా వరుణః మిత్రః శక్రః ఉరుక్రమః), ఆ కాలమునందు మిక్కిలి వెలిఁగెడి మంటచేత భయంకర మగు గొప్ప యగ్నిబుట్టి ప్రపంచమునెల్లను నీఱు చేయును, సప్తమారుతంబులు (అనఁగా ప్రవహా ఆవహా ఉద్వహా సంవహా నివహా ప్రతివహా పరావహాము లనునవి) వీచును, నవమేఘంబులు (ఆవర్త సంవర్త పుష్కర ద్రోణ కాల నీల అరుణ తమో వారుణము లనునవి) పుట్టి సార్థకములై నూరుదేవతాసంవత్సరములు గొప్పవానకురియును, ఆ వానచేత సప్తసముద్రములును చేరి ఒక్కట సముద్రమై గొప్పదై భూమండలమును ముంచును, అట్లు ముంచునపుడు భూచక్రము ఆ గొప్పప్రవాహమధ్యజలమందు కొంచెపుమట్టిపెళ్లవలె కరగిపోవును, కాల్పఁబడిన యినుపముద్ద యొకనీటిబొట్టును పీల్చినవిధమున బడబాగ్ని విజృంభించి ఆ గొప్పసముద్రమును త్రాగును, గాలి దీపమును మలిపినట్లు ఆ బడబాగ్నిని గొప్పగాలి నశింపఁజేయును, ఆ గొప్పగాలి ఆధా

రము లేని దగుటవలన ఆకాశం బంతటను వ్యాపించి జీవులు నిద్రయందు నశించువిధమున మాయాకాశ మందే నశించును, శబ్దగుణక మైన యాకాశమును శ్రవణేంద్రియస్వరూప మైన మనస్సు మ్రింగినట్లు ఆ మహాగగనమును గొప్ప దైన యామనస్సు మ్రింగును, శబ్ద స్పర్శ రూప రస గంధము లనెడు పంచ తన్మాత్రలతోఁ గూడిన ఆ మహామనస్సును నిద్రాసమయము మ్రింగినట్లు మహదహంకారము మ్రింగును, ఆ యహంకారమును సమష్టిజ్ఞానము గబళించును, ఆ సమష్టిజ్ఞానమును మహత్తత్త్వ మని చెప్పుదురు ఆ మహత్తత్త్వమును మూలప్రకృతి తనలోఁ జేర్చుకొని మఱుఁగుపఱచుకొని యుండును, ఆ మూలప్రకృతియే మాయ యనియును అవిద్య యనియును అవ్యక్త మనియును తమ స్సనియును సుషుప్తి యనియును ప్రకృతి యనియును ఆనంద మనియును జెప్పంబడును, ఆ మూలప్రకృతినే (మూలకారణమే) బ్రహ్మప్రళయ మని జెప్పఁబడును, అట్టి తుద మొదలు లేనిదియును ఇట్టిదట్టి దని జెప్పఁగూడనిదియు నగునది యజ్ఞానము, అట్టి యజ్ఞానము సద్గురువుచేత బోధింపఁబడిన జీవేశ్వరులయొక్క (త్వంపదలక్ష్యార్థ మైన శుద్ధప్రత్యగాత్మ జీవుఁడు, తత్పదలక్ష్యార్థ మైన పరిపూర్ణబ్రహ్మచైతన్యము యీశ్వరుఁడు) ఐక్యజ్ఞానానుభవకాలమందు నశించును, అట్టి యజ్ఞాననాశమే మహాప్రళయ మనఁబడును, ఈ ప్రళయమునే అత్యంతికప్రళయ మనియు జెప్పుదురు, ఇట్టి నిత్యనైమిత్తిక దైనందినకల్పాంతమహాప్రళయములయందు (నిత్యప్రళయ మనఁగా సుషుప్త్యవస్థారూపప్రళయము, నైమిత్తికప్రళయ మనఁగా విశేషప్రళయము, దైనందినప్రళయ మనఁగా బ్రహ్మదినమందు గలిగెడి ప్రళయము, కల్పాంతప్రళయ మనఁగా అవాంతర ప్రళయము) నేనే చెప్పఁబడిన ప్రళయములచేత బాధింపఁబడక సాక్షినై ఆ ప్రళయముల నన్నిఁటిని జూచుచు భూతభవిష్యద్వర్తమానకాలములయందు (భూతము - గడచినకాలము, భవిష్యత్ - రాఁబోయెడికాలము, వర్తమానము - నడచుచున్నట్టి కాలము) ఒక్కరీతిగనే యుండుటవలన సర్వకాలపరిచ్ఛేదశూన్యుఁడ నవుదు నని యుపదేశించి మఱియు నిట్లని జెప్పె నని తాత్పర్యము

## చిద్రూపలక్షణము

సీ. ఇది ఘటం బిది పటం బిది గృహం బిది కుడ్య, మిది యరణ్యం బిది శైల మిదియటంచు
నిది భూమి యిది జలం బితఁడు వైశ్వానరుం, డిది గాలి యాకసం బిది యటంచు
నితఁడు దివాకరుం డితఁడు నిశాకరుం, డివి తారలు గ్రహంబు లివి యటంచు
నివి యచేతనము లివి చేతనము లంచు, నితఁ డాతఁ డతఁ డితఁ డేనటంచు
తే. నరయ నాకంటె భిన్నంబు లై జడంబు, లైన బాహ్యపదార్థసంఘాతముల నెల్ల
సాధనము లేక యెఱిఁగెడిసాక్షి నగుట, నేను జిద్రూపకుఁడ సుమ్ము వానరేంద్ర.

టీక వానరేంద్ర = ఆంజనేయా, ఇది ఘటంబు = ఇదికలశము, ఇదిపటంబు = ఇది వస్త్రము, ఇది గృహంబు = ఇదియిల్లు, ఇదికుడ్యము = ఇదిగోడ, ఇదియరణ్యము = ఇదిఅడవి, ఇదిశైలము = ఇదికొండ, అటంచున్ = అని, ఇదిభూమి = ఇదినేల, ఇదిజలంబు = ఇదినీరు, ఇతఁడు వైశ్వానరుండు = ఈతఁ డగ్ని, ఇదిగాలి = ఇదివాయువు, ఇదియాకసంబు = ఇదియాకాశము, అటంచున్ = అని, ఇతఁడు దివాకరుండు = ఈతఁడు సూర్యుఁడు, ఇతఁడు నిశాకరుండు = ఇతఁడు చంద్రుఁడు, ఇవితారలు = ఇవి నక్షత్రములు, గ్రహంబు లివి = ఇవి అంగారకాదిగ్రహములు, అటంచున్ = అని, ఇవి యచేతనములు = ఇవి జడపదార్థములు, కాన్ = అగును, ఇవి చేతనములంచున్ = ఇవి తెలివి గల వస్తువు లని, ఇతఁ డాఁడు = ఈ పురుషుఁ డాపురుషుఁడు, అతఁ డితఁడు = ఆ పురుషుఁ డీపురుషుఁడు, ఏనటంచున్ = నేనని,

అరయఁగా = విచారింపఁగా, సాకంటె భిన్నంబులై = సాకంటె వేఱై, జడంబు లైన = అచేతనము లైన, బాహ్యపదార్థ సంఘాతుల నెల్లన్ = వెలుపలఁ దోఁచు చుండెడు దృశ్యసంఘముల నన్నింటిని, సాధనము లేక = తెలుసుకొనఁ దగిన సాధనము వేఱొకటి లేకనే, ఎఱిఁగెడిసాక్షి నగుటన్ = తెలిసికొనెడి ద్రష్ట నగుటచేత, నేను = నేను, చిద్రూపకుఁడ సుమ్ము = జ్ఞానస్వరూపుఁడను సుమా.

తా॥ ఆంజనేయా! ఇది కుండ, ఇది వస్త్రము, ఇది గోడ, ఇది యడవి, ఇది కొండ, ఇది నేల, ఇది నీరు, ఇతఁ డగ్ని, ఇది వాయువు, ఇది యాకాశము, ఇతఁడు సూర్యుఁడు, ఇతఁడు చంద్రుఁడు, ఇవి నక్షత్రములు, ఇవి అంగారకాదిగ్రహములు, ఇవి జడపదార్థములు, ఇవి తెలివి గల వస్తువులు, ఈ పురుషుఁ డాపురుషుఁడు, ఆ పురుషుఁ డీపురుషుఁడు, నేను అనియును విచారింపఁగా నాకంటె వేఱై అచేతనము లయిన వెలుపల దోఁచు చుండెడి దృశ్యపదార్థముల నన్నిటిని దెలుసుకొనుటకు వేఱొక సాధనము లేకనే తెలిసికొనెడు ద్రష్ట నగుటచేత నేను జ్ఞానస్వరూపుఁడను సుమా యని తాత్పర్యము

సీ. ఇది శరీరం బిది యింద్రియదశకంబు, లివి పంచవిషయంబు లిదియప్రాణ
మిదిమనం బిది చిత్త మిది యహంకారంబు, నిది బుద్ధి యిది విద్య యిది యవిద్య
యిది కామ మిది క్రోధ మిది లోభ మిది మోహ, మిది మహామత్సర మిదిమదంబు
నిదిజాగరముస్వప్న మిదిసుషుప్తితురీయ, మిదియిదియనుచు నాకెదురఁ దోఁచు
తే. నాంతరపదార్థముల నెల్ల ననవరతము, సాధనం బేమియును లేక సాక్షి నగుచు
నే నెఱుంగుదుఁ గావున నిత్యవిమల, చిత్స్వరూపుఁడ నగుదు రాజితవిచార.

టీక రాజితవిచార—రాజిత = ప్రకాశించుచున్న, విచార= ఆత్మానాత్మవిచారము గల యాంజనేయా, ఇది శరీరంబు = ఇది దేహము, ఇది యింద్రియదశకంబు = ఇది జ్ఞానేంద్రియపంచకంబు కర్మేంద్రియపంచకము, ఇవి పంచవిషయంబులు = ఇవి శబ్ద స్పర్శ రూప రస గంధములు, ఇదియప్రాణము = ఇదే ప్రాణవాయువు, ఇది మనంబు = ఇది సంశయరూపకమానసము, ఇది చిత్తము = ఇది చలనాత్మక మైన చిత్తము, ఇది యహంకారంబు = ఇది కర్తృత్వాత్మకాభిమానము, ఇది బుద్ధి = ఇది నిశ్చయాత్మక ప్రజ్ఞ, ఇది విద్య = ఇది జ్ఞానము, ఇది యవిద్య = ఇది అజ్ఞానము, ఇది కామము = ఇది యభిలాష, ఇది క్రోధము = ఇది రోషము, ఇది లోభము = ఇది కృపణత, ఇది మోహము = ఇది భ్రాంతి, ఇది మహామత్సరము = ఇది దీర్ఘక్రోధము, ఇది మదంబు = ఇది మమత, ఇది జాగరము = ఇది జాగ్రదవస్థ, ఇది స్వప్నము = ఇది కల, ఇది సుషుప్తి = ఇది నిద్ర, ఇది తురీయము = ఇది యంత్యావస్థ, అనుచున్ = అని, నాయెదురన్ = నాముందు, తోఁచు నాంతరపదార్థముల నెల్లన్ = కనఁబడెడి అంతర్దృశ్యముల నన్నిటిని, అనవరతమున్ = ఎల్లప్పుడును, సాధనం బేమియును లేక = ఏకారణము లేక, సాక్షినగుచున్= ద్రష్టనై, నే నెఱుంగుదుగావునన్ = పైఁ జెప్పఁబడిన శరీరేంద్రియాదికమును దెలిసికొందును గనుక, నిత్యవిమల చిత్స్వరూపుఁడన్—నిత్య = శాశ్వత మైన, విమల = నిర్మల మైన, చిత్స్వరూపుఁడన్ = జ్ఞానస్వరూపిని, అగుదున్ = అవుదును.

తా. ఆత్మానాత్మవిచారము గల ఆంజనేయా! ఇది దేహ మనియును, ఇవి జ్ఞానేంద్రియ కర్మేంద్రియము లనియును, ఇవి శబ్ద స్పర్శ రూప రస గంధము లను నైదువిషయము లనియును, ఇది ప్రాణవాయు వనియును, ఇది సంశయాత్మక మగు మన స్సనియును, ఇది చంచలాత్మక మగు చిత్త మనియును, ఇది కర్తృత్వాత్మక మగు (నేను చేయుచున్నాను, నేను భుజించుచున్నా ననెడు యహంకారము)

అహంకార మనియును, ఇది నిశ్చయాత్మక మగు బుద్ధి యనియును, ఇది జ్ఞాన మనియును, ఇది అజ్ఞాన మనియును, ఇది యభిలాష యనియును, ఇది రోష మనియును, ఇది లోభ మనియును, ఇది మోహ మనియును, ఇది దీర్ఘక్రోధ మనియును, ఇది మమత యనియును, ఇది జాగ్రదవస్థ యనియును, ఇది కల యనియును, ఇది నిద్ర యనియును, ఇది తురీయావస్థ యనియును నా యెదురఁ గనఁబడుచుండెడి అంతర్దృశ్యముల నన్నిటిని యెల్లప్పుడు నేలాటికారణములు లేక చూచువాఁడనై పైఁ జెప్పఁబడిన శరీరేంద్రియాదికములను దెలిసికొందును గనుక శాశ్వత మైనట్టియు నిర్మల మైనట్టియు జ్ఞానస్వరూపి నగుదు నని తాత్పర్యము.

## ఆనందలక్షణము.

శా. వరుసం బ్రాప్తము లైన దుఃఖములఁ బోవం జూచుచు న్భూరిసు
స్థిరసౌఖ్యోన్నతిఁ జెంది యుండుటకు నై చింతింపుదుం గాన నేఁ
బరమప్రేమరసాస్పదుండ నగు న్ భావింప నట్లౌటచేఁ
బరమానందమయాత్ముఁడం జుమి జగత్ప్రాణాత్మజా నిత్యమున్. ౧౬౮

టీక. జగత్ప్రాణాత్మజా = వాయుపుత్త్రా, భావింపన్ = తలంపఁగా, నిత్యమున్ = ఎప్పుడును, వరుసన్ = క్రమముగా, ప్రాప్తములు = లభ్యములు, ఐన దుఃఖములన్ = ఐన వ్యథలను, పోవం జూచుచున్ = తొలఁగునటుల వీక్షించుచును, భూరిసుస్థిరసౌఖ్యోన్నతిన్—భూరి = అధిక మైన, సుస్థిర = చలనము లేని, సౌఖ్యోన్నతిన్ = సుఖాతిశయమును, చెందియుండుటకునై = పొంది యుండుటకై, చింతింపుదుం గానన్ = యోచింతును గనుక, నేన్ = నేను, పరమప్రేమరసాస్పదుండన్—పరమ = నిరతిశయ మైన, ప్రేమరస = ఆనందరసమునకు, ఆస్పదుండన్ = స్థానభూతుఁడను, అగుదున్ = అయి యుండుదును, అట్లౌటచేన్ = ఆ హేతువుచేత, పరమానందమయాత్ముఁడం జుమి = బ్రహ్మానందస్వరూపుఁడను సుమా

తా. వాయుపుత్త్రుఁడ వగు యో యాంజనేయా! ఆలోచింపఁగా నెప్పుడును సంభవించెడు దుఃఖములఁ దొలఁగఁజూచుచు అధిక మైనట్టిదియును చలనము లేనట్టిది యును నగు సుఖాతిశయమును బొందియుండుటకై యోచింతును గనుక నేను నిరతిశయ మైన యానందసుఖమునకు స్థానభూతుఁడనై యుందును, అందుచేతనే నేను బ్రహ్మానందస్వరూపుఁడను సుమా యని తాత్పర్యము

తే. వివిధదుఃఖాత్మకము లైన విషయతతులు
దొడరి యత్యంతసుఖము లై తోఁచు నెల్ల
నతులితానందమయుఁడ నైనట్టి నాదు
సలలితాభాసమాత్రంబువలనఁ జువ్వె. ౧౬౯

టీక. వివిధదుఃఖాత్మకములు—వివిధ = నానావిధము లైన, దుఃఖాత్మకములు = దుఃఖసంయుతములు, ఐన విషయతతులు = అయినట్టి శబ్దస్పర్శాది దృశ్యసముదాయములు, తొడరి = అనుసరించి, అత్యంతసుఖములై = మిగుల నానందకరములై, తోఁచు నెల్లన్ = స్ఫురించు నంతయును, అతులితానందమయుఁడన్—అతులిత = సాటిలేని, ఆనందమయుఁడన్ = ఆనందస్వరూపుఁడను, ఐనట్టి నాదుసలలితాభాసమాత్రంబువలనన్—ఐనట్టి = అయిన, నాదు = నాయొక్క, సలలిత = ఒప్పిద మైన, ఆభాసమాత్రంబువలనన్ = ప్రతిబింబమాత్రముచేతనే, చువ్వె = సుమా.

తా. నానావిధదుఃఖమయము లగు శబ్దస్పర్శాదిదృశ్యసమూహములు మిగుల యానందకరము లై తోఁచుటయంతయును అనుపమానానందస్వరూపుఁ డగు నాయొక్క యొప్పిద మగు ప్రతిబింబ మాత్రముచేతనే యని తాత్పర్యము

తే. దుఃఖ మాగంతుకం బయి తోఁచుచుండు
సుఖము స్వాభావికము నాకు సూరివర్య
యట్లు గావున నిరతిశయాప్రమేయ
నిరుపమానందమయుఁడను నేను బుత్త్రి. ౧౭౦

టీక సూరివర్య = ఆత్మానాత్మవివేకజ్ఞులలో శ్రేష్ఠుఁడ వైనట్టి, పుత్త్రి = కుమారా, నాకున్ = నాకు, దుఃఖము = ఖేదము, ఆగంతుకంబై = కల్పితమై, తోఁచుచుండున్ = గోచర మగుచుండును; సుఖము = సౌఖ్యస్థితి, స్వాభావికము = సహజము, అట్లుగావునన్ = ఖేదమోదములు ఆగంతుకస్వాభావికములు గనుక, నేను = సర్వపరిపూర్ణుఁ డగు నేను, నిరతిశయ = పరమ మైన, అప్రమేయ = ప్రత్యక్షాదిప్రమాణముల కగపడని, నిరుపమ = ప్రతిలేని, ఆనంద = ఆనందమే, మయుఁడన్ = స్వరూపము గాఁ గలవాఁడను.

తా ఆత్మానాత్మవివేకులలో శ్రేష్ఠుఁడ వగు కుమారా యాంజనేయా! నాకు దుఃఖము కల్పితము గాను సుఖము సహజముగాను తోఁచు చుండును, అట్లు సుఖదుఃఖములు స్వాభావికాగంతుకములు గనుక సర్వపరిపూర్ణుఁ డగు నేను పరమ మైనట్టిదియును, ప్రత్యక్షాదిప్రమాణముల కగపడనిదియును, సాటి లేనిదియును నగు ఆనందమే స్వరూపము గలవాఁడ నని తాత్పర్యము

అ ఖం డ ల క్ష ణ ము.

వ. ఇట్లు కాలత్రయాబాధ్యత్వంబువలనను స్వారోపితాశేషపదార్థభాసకత్వంబువలనను బరమప్రేమరసాస్పదత్వంబువలనను సచ్చిదానందస్వరూపకుండ నయిన నేను మణి కనక రజత తామ్ర లోహ కాంస్య మృణ్మయ ఘటంబుల లోపల వెలుపల నంతటను నాకాశంబు వ్యాపించి యున్నచందంబున వియత్పవనతేజో జలభూదేవమానవతిర్యక్స్థావరాది చరాచరంబుల యందు బాహ్యాభ్యంతరంబుల నసంగుండనై నిండియుండుటం జేసి నాకు దేశకృతపరిచ్ఛేదంబు లేదనాద్యనిర్వాచనీయమాయాకల్పిత భూతవర్తమానభవిష్యత్సమయములయం దేకరూపత్వంబుచేత సాక్షినై యుండియు వానినెల్ల నెల్లప్పుడు దృశ్యంబుగా నెఱుంగుటవలనఁ గాలకృతపరిచ్ఛేదంబు గలుగదు, మఱియు వృక్షంబునకు వృక్షాంతరంబు సజాతీయం బయి శిలాదికంబు విజాతీయం బయి పత్ర పుష్ప ఫలాదికంబులు స్వగతంబులై యొప్పినకైవడి నీయనాత్మప్రపంచం బసద్రూపం బగుటవలన నిరవయవంబు వ్యాపకంబు నసంగంబు నైన గగనంబునకు నభావరూపంబ స్వభావం బగుటవలనను శశవిషాణం బెద్దియునుం గానిపగిది సజాతీయ విజాతీయ స్వగతంబులు గానేర వట్లగుట వస్తుకృతపరిచ్ఛేదంబు శూన్యం బగు నివ్విధంబునఁ ద్రివిధపరిచ్ఛేదరహితత్వంబువలన నద్వితీయపరిపూర్ణప్రత్యగభిన్న పరబ్రహ్మచైతన్యం బగుదు నని వెండియు నిట్లనియె. ౧౭౧

టీక ఇట్లు = ఈ పూర్వోక్తక్రమమున, కాలత్రయాబాధ్యత్వంబువలనను = భూతభవిష్యద్వర్తమాన కాలములచేత బాధింపఁబడమివలనను, స్వారోపిత = తనయం దధ్యసింపఁబడిన, అశేష = సమస్తము లైన, పదార్థ = శబ్దస్పర్శాది యింద్రియార్థములను, భాసకత్వంబువలనను = ప్రకాశింపఁజేయువాఁడ నగుటవలనను, పరమ = మిక్కుటమైన, ప్రేమరస = ఆనందరసమునకు, ఆస్పదత్వంబువలనను = ఆశ్రయుఁడ నగుటవలనను, సచ్చిదానందస్వరూపుండ నైన నేను = సత్యజ్ఞానానందస్వరూపుఁడ నైన నేను, మణి = రత్నము, కనక = స్వర్ణము, రజత = వెండి, తామ్ర = రాగి, లోహ = ఇనుము, కాంస్య = కంచు, మృత్ = మృత్తిక, మయ = వీనియొక్క స్వరూపము లైన, ఘటంబుల = కలశములయొక్క, లోపల వెలుపలన్ = అంతర్బాహ్యములయందు, అంటక = స్పృశింపక, ఆకాశంబు = మిన్ను, వ్యాపించి యున్న చందంబునన్ = ఆవరించి యున్నట్లు, వియత్ = ఆకాశము, పవన = గాలి, తేజః = అగ్ని, జల = ఉదకము, భూ = భూమి, దేవ = వేల్పులు, మానవ = మనుష్యులు, తిర్యక్ = పశుపక్ష్యాదులు, స్థావర = పర్వతవృక్షాదులు, ఆది = మొదలయిన, చరాచరంబులయందున్ = స్థావరజంగమములయందు, బాహ్యాభ్యంతరంబులన్ = వెలుపల లోపలను, అసంగుండనై = సంబంధము లేనివాఁడనై, నిండియుండుటంజేసి = సంపూర్ణముగా నుండుటవలన, నాకున్ = నాకు, దేశకృతపరిచ్ఛేదంబు — దేశ = దేశముచేత, కృత = చేయఁబడిన, పరిచ్ఛేదంబు = భేదము - అనఁగా ఈదేశమం దున్నాఁడు ఈదేశమందు లేఁడనుట, లేదు = కలుగదు, అనాది = ప్రాగభావమునులేని-అనఁగా ఉత్పత్తి లేని, అనిర్వచనీయ = వచియింపఁగూడని, మాయా = ప్రకృతిచేత, కల్పిత = నిర్మింపఁబడిన, భూత = కడచిన, వర్తమాన=నడుచుచున్న, భవిష్యత్ = రాఁగల, సమయంబులయందున్ = వేళలయందు, ఏకరూపత్వంబునన్ = ఒక్క రూపముచేత, సాక్షినై = ద్రష్టనై, ఉండియున్ = ఉన్నవాఁడ నయ్యును, వాని నెల్లన్ = ఆ త్రికాలాదుల నన్నిటిని, ఎల్లప్పుడున్ = నిరంతరమును, దృశ్యంబుగా నెఱుంగుటవలనన్ = విషయము లని తెలియుటచేత, కాలకృతపరిచ్ఛేదంబు గలుగదు = కాలకృతపరిచ్ఛేదమును లేదు - అనఁగా ఈకాలమం దున్నాఁడు ఆకాలమందు లేఁడనునది లేదని భావము, మఱియున్ = వెండియును, వృక్షంబునకున్ = చెట్టునకు, వృక్షాంతరంబు = మఱియొకచెట్టు, సజాతీయంబై = తనజాతి గలదై, శిలాదికంబు = రాళ్ళు మొదలైనవి, విజాతీయంబై = వేఱుజాతి గలదై, పత్రపుష్పఫలాదికంబులు — పత్ర = ఆకులు, పుష్ప = పూవులు, ఫల = పండ్లు, ఆదికంబులు = మొదలగునవి, స్వగతంబులై=తనయందుఁ గలవై, చెప్పినకైవడిన్ = తెలిపినట్లు, ఈ అనాత్మప్రపంచంబు=మాయామయ మగు నీలోకము, అసద్రూపం బగుటవలనన్=నశించునది యగుటవలన, నిరవయవంబును = కరచరణాద్యవయవశూన్య మైనదియు, వ్యాపకంబును=అంతట నిండి యున్నదియు, అసంగంబును = దేనితోడను చేరనిదియు, ఐన గగనంబునకున్= అయిన యాకాశమునకు, అభావరూపంబ = శూన్యరూపమే, స్వభావం బగుటవలనన్= నైజమైనందున, శశవిషాణంబు = కుందేటి కొమ్ము, ఎద్దియుం గానిపగిదిన్ = ఉన్నదియు లేనిదియు గానట్లు, సజాతీయ = తనజాతివలనఁ గలిగిన, విజాతీయ = వేఱొకజాతివలనఁ గలిగిన, స్వగతంబులు = తనను బొందియున్న భేదములు, కానేరవు = కలుగవు, అట్లగుటవలనన్ = ఈ త్రివిధభేదములు లేక యుండుటవలన, వస్తుకృతపరిచ్ఛేదంబు శూన్యంబగున్ = ఈవస్తువునం దున్నాఁడు ఆవస్తువునందు లేఁడు అనెడు భేదము లేకపోవును, ఇవ్విధంబునన్ = ఈప్రకారముగాను, త్రివిధపరిచ్ఛేదరహితత్వంబువలనన్ = దేశకాలవస్తుకృతభేదము లేకపోవుటవలన, అద్వితీయ = రెండవది లేని, పరిపూర్ణ = అంతట నిండిన, ప్రత్యగభిన్న = కూటస్థునికంటె వేఱుగాని, పరబ్రహ్మచైతన్యంబున్ = పరమాత్మచైతన్యమును, అగుదు నని= అవుదు నని, వెండియున్ = మఱల, ఇట్లనియెన్ = ఈప్రకారము పలికెను.

తా॥ ఈప్రకారము భూతభవిష్యద్వర్తమానకాలములచేత బాధింపఁబడకుండుటవలన సమస్తమైన శబ్దస్పర్శాదివిషయములను ప్రకాశింపఁజేయువాఁడ నగుటవలనను, అతిశయమైన ఆనందరసమున కాశ్రయుఁడ నగుటవలనను, సత్యజ్ఞానానందస్వరూపుఁడ నైన నేను రత్నము బంగారము వెండి రాగి యినుము కంచు మృత్తిక వీనియొక్క స్వరూపము లైన కలశములయొక్క లోపలను వెలుపలను అంతట వ్యాపించియున్న యాకాశమువలె ఆకాశము గాలి అగ్ని ఉదకము భూమి దేవతలు మానవులు పశుపక్ష్యాదులు పర్వతవృక్షాదులు మొదలైన స్థావరజంగమములయందు వెలుపలను లోపలను సంబంధము లేనివాఁడనై సంపూర్ణముగా నిండియుండుటవలన దేశముచేతఁ జేయఁబడిన భేదము లేదు (అనఁగా ఈ దేశమందున్నాఁడు మఱొక దేశమందు లేఁడను భేదము లేదు), పుట్టుక లేనట్టియు, ఇట్టివాఁ డట్టివాఁ డని నిర్ణయింపఁగూడనట్టియు, ప్రకృతిచేత నిర్మింపఁబడిన భూతభవిష్యద్వర్తమానకాలములయందు నేకరూపముచేత సాక్షినై యున్నట్టి నేను ఆ త్రికాలముల నన్నిటిని నిరంతరము విషయములని తెలిసికొనుటచేత నాకు కాలకృతపరిచ్ఛేదంబు లేదు, (అనఁగా ఈ కాలమునం దున్నాఁడు, ఆ కాలమునందు లేఁడనునది లేదని భావము) మఱియు చెట్టునకు మఱొక చెట్టు సజాతీయం బై ఱాళ్లు మొదలగునవి వేఱుజాతి గలవై పూవులు పండ్లు మొదలగునవి తనయందు గలవై యొప్పువిధమున మాయామయ మగు నీలోకము నశించున దగుటవలనను, హస్తపాదాద్యవయవశూన్య మైనదియును, అంతట నిండియున్నదియును, దేనితోడను జేరనిదియును నైన యాకాశమునకు శూన్యరూపమే స్వభావ మగుటవలనను, ఉండేటకిక్కొమ్మ వున్నదియు లేనిదియు గానట్లు జాతియ విజాతీయ స్వగత భేదంబులు గలుగవు, ఇట్టి మూఁడు భేదములు లే కుండుటవలన వస్తుకృతపరిచ్ఛేదశూన్య మగును (అనఁగా ఈ వస్తువునం దున్నాఁడు, ఆ వస్తువునందు లేఁడు అను భేదము లేకపోవుట), ఈప్రకారము దేశకృత కాలకృత వస్తుకృత భేదములు లేకపోవుటవలన రెండవది లేనిదియు, అంతట నిండినదియు కూటస్థునికంటె వేఱు గానిదియు నగు పరబ్రహ్మము తా నగుదు నని చెప్పి మరల యీ ప్రకారము చెప్పుచున్నాఁ డని తాత్పర్యము

ఆ. ఏ నఖండసచ్చిదానందమయుఁడ నై, యిట్లు వెలుఁగుచు నునికి నెఱిఁగి నన్ను
నే నటంచుఁ దెలియు నిపుణులు మత్స్వరూ,పాత్ము లగుచు ముక్తు లగుదు రనఘ.

టీక. అనఘ = పాపరహితుఁడ వైన యాంజనేయా, ఏను = నేను, అఖండసచ్చిదానందమయుండనై = అఖండసత్యజ్ఞానానందములే స్వరూపముగాఁ గలవాఁడనై, ఇట్లు = ముందుఁ జెప్పఁబడినట్లు, వెలుఁగుచున్ = శోభిల్లుచు, ఉనికిన్ = ఉండుటను, ఎఱిఁగి = తెలిసికొని, నన్నున్ = అఖండస్వరూపుండనైన నన్ను, నే నటంచుఁ దెలియు నిపుణులు = నేనే యని యెఱిఁగెడి బ్రహ్మవేత్తలు, మత్స్వరూపాత్ము లగుచున్ — మత్ = నాయొక్క, స్వరూప = సత్యజ్ఞానానందస్వరూపమే, ఆత్ము లగుచున్ = స్వస్వరూపముగా గలవారై, ముక్తు లగుదురు = జీవన్ముక్తు లగుదురు.

తా. పాపరహితుఁడ వైన యాంజనేయా! నేను అఖండసత్యజ్ఞానానందస్వరూపుఁడనై ప్రకాశించుచుండుటను దెలిసికొని అఖండస్వరూపుఁ డగు నన్ను తా మని దెలిసికొనెడు బ్రహ్మవేత్తలు నాయొక్క సత్యజ్ఞానానందస్వరూపము గలవారై జీవన్ముక్తు లగుదు రని తాత్పర్యము.

సీ. అని యిట్లు బోధించి యానందమయుఁ డగు, శ్రీరాముఁడు నిజశ్రీపదార
విందంబులకు భక్తి వందనంబులు సేయు, హనుమంతుఁ గనుఁగొని యప్పు డతని
శిరసును పూర్వాద్రిశిఖరంబుపై స్వకరార్కమండలము డాయంగఁ జేర్చి
తనరు నిహస్తమస్తకయోగ మిప్పుడే, తెలివి యెఱుంగు నా తెలివి నీవు

తే. తెలివి నీవని దెలుపఁగాఁ దెలియు నెద్ది, యదియె నీవను వెలుఁగుచే ననిలసుతుని
ధీగతానాద్యవిద్యాంధతిమిర మెల్లఁ, బాపి కేవలతత్త్వరూపంబుఁ జూపె. ౧౨౩

టీక. అని = జీవన్ముక్తు లగుదు రని, ఇట్లు = ఈతీరున, బోధించి = ఉపదేశించి, ఆనందమయుఁడు = బ్రహ్మానందస్వరూపి, అగు శ్రీరాఘవుఁడు = ఐన శ్రీరామమూర్తి, నిజశ్రీపదారవిందంబులకుఁ — నిజ = స్వీయములైన, శ్రీ = పురుషార్థప్రదము లయిన, పదారవిందంబులకుఁ = పాదకమలములకు, భక్తిఁ = ప్రేమచేత, వందనంబులు = ప్రణామములు, చేయు హనుమంతుఁ = ఒనర్చుచున్న యాంజనేయుని, కనుఁగొని = చూచి, అప్పుడు = ఆ సమయమందు, అతని = ఆ యాంజనేయునియొక్క, శిరము = శిరస్సనెడు, పూర్వాద్రి = ఉదయాచలముయొక్క, శిఖరంబుపైఁ = శృంగముమీఁద, స్వకరార్కమండలముఁ — స్వ = తనయొక్క, కర = అభయహస్త మనెడు అపరోక్షజ్ఞానకిరణములతోఁ గూడిన, అర్కమండలముఁ = సూర్యమండలమును, డాయంగఁ జేర్చి = పొందించి, తనరు నీహస్తమస్తకయోగము — తనరు = ఒప్పినదైన, ఈహస్తమస్తకయోగము = ఈయొక్క శిరస్సు గల చేరికను, ఏ తెలివి యెఱుంగుఁ = సూక్ష్మశరీరాది పిండబ్రహ్మాండాంతజగత్సృష్టికిఁ గారణమైన విక్షేపశక్తి యను ప్రధానాంతఃకరణవృత్తితోఁ గూడిన యేప్రజ్ఞాన మెఱుఁగుచున్నదో, ఆ తెలివి నీవు = ఆ ప్రజ్ఞానమే నీవు, తెలివి నీవని = ప్రజ్ఞానమే నీవని, తెలుపఁగాఁ = నేనుపదేశింపంగా, తెలియు నెద్ది = ఏప్రజ్ఞాన మెఱుఁగుచున్నదో, అదియె నీవను వెలుఁగుచేఁ = ఆ ప్రజ్ఞానమె నీవనెడు స్వయంప్రకాశముచేత, అనిలసుతుని = హనుమంతుని యొక్క, ధీ = బుద్ధియందు, గత = పొందియున్న, అనాది = జగత్సృష్టికిఁ బూర్వమం దున్న, అవిద్య = అజ్ఞాన మనెడు, అంధతిమిర మెల్ల = కటికచీఁకటి యంతయు, పాపి = తొలఁగించి, కేవలతత్త్వరూపంబుఁ — కేవల = ముఖ్యమైన, తత్త్వ = యథార్థమైన, రూపంబుఁ = బ్రహ్మస్వరూపమును, చూపెఁ = కనఁబఱచెను

తా. ఇట్లు జీవన్ముక్తు లగుదు రని బోధించి బ్రహ్మానందస్వరూపి యగు శ్రీరామమూర్తి పురుషార్థప్రదములగు తనపాదారవిందములకు భక్తితో నమస్కరించుచున్న యాంజనేయుని గాంచి ఆసమయమునందు శిరస్సనెడు నుదయాచలశృంగముమీఁద తనయొక్క అభయహస్త మనెడు నపరోక్షజ్ఞానకిరణములతోఁ గూడిన సూర్యమండలమును పొందించి (అనఁగా అతనిశిరస్సునందు అభయహస్త ముంచి) యీహస్తమస్తకములయొక్క చేరికను సూక్ష్మశరీరాదిపిండబ్రహ్మాండాంతజగత్సృష్టికి కారణమైన విక్షేపశక్తి యను ప్రధానాంతఃకరణవృత్తితోఁ గూడిన యేప్రజ్ఞానము (తెలివి) తెలిసికొనుచున్నదో అట్టి తెలివి నీవు, ఆ ప్రజ్ఞానమే నీవని నేనుపదేశింపఁగా నేప్రజ్ఞాన మెఱుఁగుచున్నదో ఆ ప్రజ్ఞానమే నీవనెడు స్వయంప్రకాశముచేత హనుమంతునిఁ బొందియున్నదియును, జగత్సృష్టికిఁ బూర్వమం దున్నదియు నగు యజ్ఞాన మనెడు చీఁకటినంతయుఁ దొలఁగించి ముఖ్యమైనట్టిదియును యథార్థమైనట్టిదియును నగు బ్రహ్మస్వరూపమును కనఁబఱచె నని తాత్పర్యము

వ. ఆ సమయంబునను. ౧౨౪

టీక. ఆ సమయంబునను = ఆ కనఁబఱచిన కాలమందును

చ. అటఁ బొడఁగాంచె మారుతి హృదంబురుహాంతరబింబితస్ఫుర
చ్చటులపునఃపునశ్చలదసద్విషయస్ఫురదింద్రియాన్వితో
త్కటపటుధీప్రవృత్తినిహితజ్ఞకళాగ్రనివేశముఁ విశం
కటనిజభాప్రకాశితజగద్విజకోశము స్వప్రకాశమున్. ౧౨౫

టీక. అరుక్ = పిమ్మట, మారుతి = అంజనేయుఁడు, హృత్ = హృదయ మనెడు, అంబురుహ = పద్మముయొక్క, అంతర = మధ్యప్రదేశమందు - అనఁగా అంతరహృదయాకాశమందు, బింబిత = కనఁబడుచున్న, స్ఫురత్ = శోభిల్లు చున్న, చటుల = మనోహర మగుచున్న, పునఃపునః = మాటిమాటికి, చలత్ = కదలు చున్న, అసత్ = అనృతము లయిన, విషయ = శబ్దస్పర్శాదివిషయములను, స్పృశత్ = సోఁకు చున్న, ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములతో, అన్విత = కూడిన, ఉత్కట = అతిశయ మైన, పటు = సమర్థ మైన, ధీప్రవృత్తి = అంతఃకరణవృత్తియందు, నిహిత = ఉంచఁబడిన - అనఁగా ప్రతిఫలించు చున్న, జ్ఞకళా = చిత్కళయొక్క, అగ్ర = తుదయే, నివేశమున్ = నివాసముగాఁ గలదియును, విశంకట = మిక్కుట మైన, నిజ = తనయొక్క, భా = తేజస్సుచేత, ప్రకాశిత = వెలిఁగింపఁజేయఁబడు చున్న, జగత్ = చతుర్దశభువనములయొక్క, వ్రజ = సముదాయమునకు, కోశమున్ = స్థాన మైన ॥ని॥ 'కోశో స్త్రీ కుట్మలే ఖడ్గాఘే గుహ్యాంగ శాస్త్రదివ్యయోః । గృహే దేహే పుస్తకాఘే వేశ్యా మసి విధానకే' అని రత్నమాల స్వప్రకాశమున్ = స్వయంజ్యోతిని, పొడఁగాంచెన్ = చూచెను

తా. అనంతర మాంజనేయుఁడు హృత్కమలముయొక్క మధ్యప్రదేశమందు (హృదాకాశమందు) కనఁబడు చున్నదియును, ప్రకాశించు చున్నదియును, మనోహర మగు చున్నదియును, మాటిమాటికిని కదలు చున్నదియును, అనృతము లయినవియును నగు శబ్దస్పర్శాదివిషయము లనఁబడు చున్న జ్ఞానేంద్రియకర్మేంద్రియములతోఁ గూడినదియును, సమర్థ మైనదియును నగు నంతఃకరణవృత్తియందు ప్రతిఫలించు చున్న చిత్కళయొక్క తుదయే నివాసముగాఁ గలదియును, తనగొప్పతేజస్సుచేత వెలిఁగింపఁజేయఁబడు చున్న పదునాలుగులోకములయొక్క సమూహమునకు స్థాన మయినదియు నగు స్వయంజ్యోతిని జూచె నని తాత్పర్యము

ఆ. అట్టి తన్నుఁ గాంచి యానందమూర్తి యై, చిత్రరూప మట్లు చేష్ట లుడిగి
తనువు మఱచి కొంతదడవు వూరకుండెనా, యాంజనేయుఁడో హిమాద్రితనయ.

టీక. ఓహిమాద్రితనయ = ఓపార్వతీ, ఆంజనేయుఁడు = అంజనాపుత్త్రుఁడు, అట్టితన్నుఁగాంచి = అట్టి స్వయంజ్యోతిస్స్వరూపుఁ డైన తన్నుఁ జూచి, ఆనందమూర్తి యై = నిత్య నిరుపాధిక నిరతిశయ సుఖస్వరూపుఁ డై, చిత్రరూపమట్లు = చిత్తరువుబొమ్మవలె, చేష్టలుడిగి = ఇంద్రియవ్యాపారములు లేనివాఁ డై, తనువుమఱచి = శరీరమును మఱచి, కొంతదడవు = కొంతసేపు, ఊరకుండెన్ = మిన్నకుండెను - అనఁగా నిర్వికల్పబ్రహ్మానందసముద్రమందు మగ్నుఁ డై యుండె నని భావము

తా. ఓపార్వతీ! ఆంజనేయుఁ డట్టి స్వయంజ్యోతిస్స్వరూపుఁ డైన తన్నుఁ జూచి నిత్యనిరుపాధికనిరతిశయసుఖస్వరూపుఁ డై చిత్తరువుబొమ్మవలె చేష్టలు లేనివాఁ డై శరీరము మఱచి కొంతసే పూరక యుండె నని తాత్పర్యము

తే. లిప్తమాత్రం బవిద్యావిలిప్తమాత్ర, మైన ఘను లెన్న లేరు బ్రహ్మాదు లనఁగ
క్షణము సర్వజగద్విలక్షణముఁ బొందు, వాని నుతియింపఁదరమె యేవారి కైన.

టీక. లిప్తమాత్రంబు = విగడియలో నాలవపా లగు లిప్తకాలము ॥ని॥ 'నిమేషో మాత్ర లిప్తా స్యాత్' అని విశ్వప్రకాశము. అవిద్యా = అజ్ఞానముచేత, అవిలిప్తమాత్ర మైన = ఆవరింపఁబడనట్టి, ఘనున్ = మహానుభావుని, బ్రహ్మాదులు = బ్రహ్మ మొదలగువారు, ఎన్నలేరు = నుతింపఁజాలరు, అనఁగన్ = అ

నపుడు, క్షణము = ముప్పదికళల కాలము, సర్వజగత్ = మూఁడులోకములను, విలక్షణముక్ = వ్యతిరిక్త మయిన పరబ్రహ్మమును, పొందువానిక్ = కూడెడుపురుషుని, ఏవారికైనక్ = ఏమహామహులకైనను, నుతియింపక్ = స్తోత్రము చేయుటకు, తరమె=శక్యమా - అనఁగా శక్యము గాదని తాత్పర్యము

తా॥ క్షిప్తమాత్రకాలము (విగడియలో నాలవపాలగు కాలము) అజ్ఞానముచేత నావరింపఁబడనట్టి మహానుభావుని బ్రహ్మ మొదలగువారు స్తోత్రము జేయఁజాల రనునపుడు క్షణకాలము మూఁడులోకములకు వ్యతిరిక్తమైన పరబ్రహ్మమును బొందువానిని యెట్టి మహామహులకైన స్తోత్రము చేయుటకు శక్యమా (అనఁగా శక్యము గాదు) అని తాత్పర్యము.

తే॥ అట్టి విజ్ఞానయోగసమాధి నొంది, యనుపమానందమూర్తియై యాంజనేయుఁ
డెట్టకేలకు మేల్కని యెదుర నున్న, రామచంద్రునిఁ జూచి సంభ్రమముతోడ

టీక. ఆంజనేయుఁడు = పావని, అట్టి = సర్వజగద్విలక్షణ మైనట్టి, విజ్ఞాన = బ్రహ్మజ్ఞానముతోఁ గూడిన, యోగ = జీవేశ్వరైక్యరూప మైన, సమాధిక్ = నిష్ఠను, ఒంది = పొంది, అనుపమ = అసదృశ మైన, ఆనందమూర్తియై = పరబ్రహ్మస్వరూపుఁడై, ఎట్టకేలకుక్ = కొంత సేపునకు, మేల్కని = జాగ్రదవస్థను పొంది - అనఁగా ప్రపంచవ్యక్తి గలవాఁడై, ఎదుర నున్న రామచంద్రునిఁ జూచి = తన యగ్రభాగవర్తియైన శ్రీరామునివీక్షించి, సంభ్రమముతోడక్ = తొట్రుపాటుతోడను

తా॥ ఆంజనేయుఁడట్టి సర్వజగద్విలక్షణ మయిన బ్రహ్మజ్ఞానముతోఁ గూడిన జీవేశ్వరులయొక్క యైక్యరూప మగు సమాధిని పొంది సాటిలేని పరబ్రహ్మస్వరూపుఁడై కొంత సేపునకు జాగ్రదవస్థను బొంది (అనఁగా ప్రపంచవ్యక్తి గలవాఁడై) యెదుర నున్న రామమూర్తినిఁ జూచి తొట్రుపాటుతో నని తా

క. మూఢత్వ ముడిగి యోగారూఢుండై భక్తి పొదల ప్రొక్కిన నపుడా
ప్రౌఢమతిఁ జూచి రాముఁడు, గాఢాలింగనము చేసె గారవ మలరన్. ౧౭౯

టీక మూఢత్వ ముడిగి = అజ్ఞానసందేహవిపరీతాత్మక మయిన బుద్ధివృత్తిని విడిచి, యోగారూఢుండై = విద్వరిష్ఠపదమును పొందినవాఁడై, భక్తి = పూజ్యానురాగము, పొదలక = అభివృద్ధి నొందుటకు, ప్రొక్కినక్ = నమస్కరింపఁగా, "శ్లో॥ భావాద్వైతం క్రియాద్వైతం ద్రవ్యాద్వైతం తథైవచ। అద్వైతం త్రివిధం ప్రాహు ర్నాద్వైతం గురుసన్నిధౌ" అనెడు న్యాయముచేత ఆంజనేయుఁడు యోగారూఢుఁడైనను గురుసాన్నిధ్యమందు భక్తి అభివృద్ధియగుటకు నమస్కరించె ననుట, అపుడు = ఆ నమస్కరించినసమయమందు, రాముఁడు = శ్రీరామమూర్తి, ఆ ప్రౌఢమతిఁ జూచి = బ్రహ్మజ్ఞానము గల ఆంజనేయుని వీక్షించి, గారవ మలరక్ = ప్రేమ అతిశయిల్లఁగా, గాఢాలింగనము చేసెక్ =గట్టిగాఁ గౌఁగిలించికొనెను

## భావాద్వైత క్రియాద్వైత ద్రవ్యాద్వైతముల వివరణము.

పటలతంతున్యాయముచేత కార్యకారణములయొంగు వస్తు వొక్కటిగా నుండు నని యొకటిగ యేకత్వాలోచనము చేసి వికల్పము లేదని తలంచుట భావాద్వైతము, మనోవాక్కాయ కృత్యము లగు సర్వకర్మములను ఫలభేదము చేయక పరబ్రహ్మార్పణము చేయుట క్రియాద్వైతము, పుత్రమిత్రకళత్రాది సర్వజీవులకును దనకును శరీరమునకును పంచభూతాత్మకత్వముచేత భోక్త యొక్కఁడే యనెడు పరమార్థముచేత అర్థకామములయందు నైక్యదృష్టి చేయుట ద్రవ్యాద్వైతము.

తా. అజ్ఞానసందేహవిపరీతాత్మక మైన బుద్ధియొక్క వ్యాపారమును వదలి నిద్వారిష్టపదమును (యోగమును) పొందినవాఁడై భక్త్యతిశయించునటుల నమస్కరింపఁగా ఆ నమస్కరించినసమయమందు శ్రీ రామమూర్తి ఆ బ్రహ్మజ్ఞానముగల యాంజనేయునిఁ జూచి విశేషప్రేమతోఁ గౌఁగిలించుకొనె నని తా.

వ. ఇట్లు గారవంబుఁ జేసిన నయ్యాంజనేయుం డప్పరమేశ్వరున కనేకవిధపూజానమస్కారస్తోత్రంబులుం గావించె ననిన విని పార్వతీదేవి యటమీఁద శ్రీరామస్వామి యేమియుపదేశించె నని శ్రీమహాదేవు నడుగుటయును. ౧౮౦

టీక ఇట్లు గారవంబు చేసినన్ = ఈప్రకార మాలింగనముచేత గౌరవింపఁగా, అయ్యాంజనేయుంగుడు = ఆ హనుమంతుఁడు అప్పరమేశ్వరునకున్ = ఆ రామచంద్రునకు, అనేకవిధ = బహువిధము లయిన, పూజా = అర్చనలను, నమస్కార = వందనములను, స్తోత్రంబులు = స్తుతులను, కావించెన్ = ఒనర్చెను, అనినన్ = అని శివుఁడు పలుకఁగా, విని = ఆలకించి, పార్వతీదేవి = గిరిజ, అటుమీఁదన్ = తరువాత, శ్రీరామస్వామి = శ్రీరామమూర్తి, ఏమి యుపదేశించె ననె = ఏమి బోధించె నని, శ్రీమహాదేవున్ = శ్రీసాంబమూర్తిని, అడుగుటయున్ = ప్రశ్న చేయఁగా.

తా ఈప్రకార మాలింగనముచేత గౌరవింపఁగా హాంజనేయుఁడు ఆ రామమూర్తికి పూజలను నమస్కారములను స్తుతులను జేసె నని శివుఁడు పలుకఁగా విని పార్వతీదేవి తరువాత శ్రీరామమూర్తి యేమి బోధించె నని శ్రీసాంబమూర్తిని యడుగఁగా నని తాత్పర్యము

చ. కలుషవిదూర నిర్గతవికార సురాంబుజసూర సూరిహృ
జ్జలజవిహార చారుసుఖసాగర విశ్వశరీర భూరిని
ర్మలగుణవార వారిధిసమానగభీర సుమేరుధీర స
న్నలినభవాభవాచ్యుతమనఃకలితాత్మవిచారకారణా ౧౮౧

టీ. కలుష = పాపములకు, విదూర=దూర మయినవాఁడా! నిర్గతవికార='అస్తి జాయతే వర్ధతే విపరిణమతే అపక్షీయతే నశ్యతి' యనెడు వికారములు లేనివాఁడా! సుర = దేవత లనెడు, అంబుజ = తామరలకు, సూర = సూర్యుఁడా! సూరిహృజ్జలజవిహార—సూరి = బ్రహ్మవేత్తలయొక్క, హృజ్జలజ = మనఃపద్మములయందు, విహార = సంచరించువాఁడా! చారు = మనోహరము లయిన, సుఖ = ఆనంద మనెడు, సాగర = సముద్రము గలవాఁడా! విశ్వశరీర = ప్రపంచమే శరీరముగాఁ గలవాఁడా! భూరి = అనేకము లైన, నిర్మల = మాలిన్యశూన్యము లైన, గుణ = అనంతకల్యాణగుణములయొక్క, వార = సమూహము గలవాఁడా! వారిధిసమానగభీర=సముద్రతుల్య మైన గాంభీర్యము గలవాఁడా! సుమేరుధీర= మేరుగిరిసమానధైర్యము గలవాఁడా! సత్ = ప్రసిద్ధుఁ డైన, నలినభవ = బ్రహ్మయొక్క, అభవ=శివుని యొక్క, అచ్యుత = విష్ణువుయొక్క, మనఃకలిత = మానసమునందుఁ గూడుకొనిన, ఆత్మవిచార = బ్రహ్మవిచారణకు, కారణా=హేతు వయినవాఁడా! అనఁగా బ్రహ్మ విష్ణు రుద్రులకు జ్ఞానప్రదుఁ డని భావము

తా. పాపములు లేనివాఁడా! 'అస్తి జాయతే వర్ధతే విపరిణమతే అపక్షీయతే నశ్యతి' యనెడు వికారములు లేనివాఁడా! దేవత లనెడు తామరలకు సూర్యుఁడా! బ్రహ్మవేత్తలయొక్క మనఃకమలముల యందు సంచరించువాఁడా! మనోహర మయిన యానంద మనెడు సముద్రము గలవాఁడా! ప్రపంచమే శరీరముగాఁ గలవాఁడా! అనేకము లైనవియు మాలిన్యము లేనివియు నగు అనంతకల్యాణగుణముల

యొక్క-సమూహములు గలవాఁడా! సముద్రముతో సమాన మగు గాంభీర్యము గలవాఁడా! మేరుపర్వతముతో సమాన మగు ధైర్యము గలవాఁడా! బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు జ్ఞానప్రదుఁడా అని తాత్ప.

క. సర్వేశ్వర సర్వోత్తమ, సర్వవ్యాపారసాక్షి ॥ సర్వాధారా
సర్వజ్ఞ సర్వతోముఖ, సర్వాధిష్ఠానభూత ॥ సర్వాకారా. ౧౮౨

టీక సర్వేశ్వర = సర్వప్రపంచమునకు ప్రభు వైనవాఁడా! సర్వోత్తమ—సర్వ=సమస్తప్రాణులకంటె, ఉత్తమ = శ్రేష్ఠుఁడా! సర్వవ్యాపారసాక్షి = సకలక్రియలకు ద్రష్ట యైనవాఁడా! సర్వాధారా = సమస్తమునకు రక్షక మైనవాఁడా! సర్వజ్ఞ = అన్నియు నెఱింగినవాఁడా! సర్వతోముఖ = అంతటు వ్యాపించి యున్నవాఁడా! సర్వాధిష్ఠానభూత = ఎల్లలోకములకు నెల వైనవాఁడా! సర్వాకారా = ప్రణవరూపప్రపంచస్వరూపుఁడా.

తా ప్రపంచమునకు ప్రభు వైనవాఁడా! సమస్తప్రాణులకంటె శ్రేష్ఠుఁడా! సమస్తవ్యాపారములకు సాక్షి యగువాఁడా! సమస్తమును రక్షించువాఁడా! సర్వము నెఱింగినవాఁడా! అంతటు వ్యాపించి యున్నవాఁడా! సమస్తలోకములకు ప్రభు వయినవాఁడా! ప్రణవరూపప్రపంచస్వరూపుఁడా! అని తా.

మాలినీ. ప్రణమితమునిజాలా ॥ భాసురానంతలీలా
ప్రణుతనిఖిలదేవా ॥ భవ్యదివ్యప్రభావా
ప్రణవజపనిధానా ॥ బ్రహ్మవిద్యానిధానా
గుణనిధి జగదీశా ॥ కోటిసూర్యప్రకాశా. ౧౮౩

టీక ప్రణమితమునిజాలా—ప్రణమిత = నమస్కరించు చున్న, మునిజాలా = ఋషిసంఘము గలవాఁడా! భాసురానంతలీలా—భాసుర = ప్రకాశించు చున్న, అనంత = అపరిమితము లయిన, లీలా = విలాసములు గలవాఁడా! ప్రణుతనిఖిలదేవా—ప్రణుత = కొనియాడఁబడు చున్న, నిఖిలదేవా = సర్వగీర్వాణులు గలవాఁడా! భవ్యదివ్యప్రభావా—భవ్య = శుభ మయిన, దివ్య = అప్రాకృత మయిన, ప్రభావా = మహాత్త్వము గలవాఁడా! ప్రణవజపనిధానా—ప్రణవజప = ఓంకారముయొక్క-జపమునకు, నిధానా = నిక్షేపప్రాయ మయినవాఁడా! బ్రహ్మవిద్యానిధానా = ఆత్మజ్ఞానమునకు ఆదికారణ మయినవాఁడా! గుణనిధి = శాంతశమదమాది సద్గుణములకు నిధి యైనవాఁడా! జగదీశా = సతుర్దశభువనములకు ప్రభు వయినవాఁడా! కోటిసూర్యప్రకాశా = వెక్క-సూర్యులవలె ప్రకాశించువాఁడా.

తా నమస్కరించు చున్న ఋషులసమూహము గలవాఁడా! ప్రకాశించెడి యపరిమితవిలాసము గలవాఁడా! సమస్తదేవతలచేఁ గొనియాడఁబడువాఁడా! శుభకర మైనట్టిదియు అప్రాకృత మైనట్టిదియు నగు మహాత్త్వము గలవాఁడా! ఓంకారముయొక్క-జపమునకు నిక్షేపప్రాయ మైనవాఁడా! ఆత్మజ్ఞానమునకు ఆదికారణ మైనవాఁడా! శాంతశమదమాదిగుణములకు నిధి యైనవాఁడా! సతుర్దశభువనములకు ప్రభు వయినవాఁడా! వెక్క-సూర్యులవలెఁ బ్రకాశించువాఁడా! అని తాత్పర్యము.

గద్య ఇది శ్రీమన్నారాయణ మహాదేవ గురుకరుణాకటాక్ష వీక్షణ విమలీకృత నిజ హృదయకమలకర్ణికాంత సందర్శితాఖండ సచ్చిదానందర సైకస్ఫూర్తి మత్సీతారామమూర్తి పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి ప్రణీతం బైన శ్రీ సీతారామాంజనేయ సంవాదం బను యోగశాస్త్రంబునందు సాంఖ్యయోగాభ్యాసవిచారం బనునది ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

యనెడు పంచమహాభూతములయందును, నానావిధ = పెక్కు తెఱఁగు లయిన, అశేష = సమస్తము లైన, భూతంబులంగుఁ = భౌతికము లగు ప్రాణులయందును, అంటటఁ = సర్వత్ర, నిర్వ్యాప్తుండ వయి యుండి = చేరి యుండియును, కర్తృత్వ = చేయుట, భోక్తృత్వ = అనుభవించుట, మంతృత్వ = తెలియుట, భర్తృత్వ = రక్షించుట, హర్తృత్వములు = చంపుటలును, నామ = శివ రామ గోవింద నారాయణ మహాదేవాదినామములును, రూప = రక్తశ్వేతపీతాదిరూపములును, క్రియ = చలన ధావన కంపనాది క్రియలును, ఉపాధి = స్థూలసూక్ష్మకారణాద్యుపాధులును, వర్ణ = బ్రాహ్మణాదివర్ణములును, ఆశ్రమంబులు = బ్రహ్మచర్యాద్యాశ్రమములును, గుణంబులు = రజస్సత్త్వాదిగుణములును, వివేకావివేకంబులుఁ = ఎఱుకమఱపులును, శోకమోహంబులుఁ = దుఃఖమును భ్రమయును, లేక = కలుగక, ఈ స్థూలసూక్ష్మాదులఁ = ఈ స్థూలసూక్ష్మకారణాదిశరీరములను, జాగ్రత్స్వప్నసుషుప్త్యాదులఁ = మేలుకొనుట కలఁగనుట నిద్రించుట మొదలగు అవస్థలను, పంచభూతంబులఁ = భూజలాగ్నివాయుగగనములను, పంచకోశంబులఁ = అన్నమయాది పంచకోశములను, చూచుచుఁ = ఈక్షించుచు, నిర్వికారుండ వై = షడ్భావవికారరహితుఁడ వయి, నిర్వికల్పుండ వై = వికల్పములు లేనివాఁడ వయి, నిర్విచేష్టుండ వై = మాటాడుట వినుట లోనగు చతుర్దశేంద్రియప్రవర్తనలు లేనివాఁడ వయి, నిష్ప్రపంచుండ వై = 'ప్రకర్షేణ పంచ భూ జ లాగ్ని వా య్వా కాశరూపేణ విభజ్యతే ఇతి ప్రపంచః, తన్నభవతీతి నిష్ప్రపంచః' తా ప్రసిద్ధముగ పంచమహాభూతరూపముగ భాగింపఁబడునది ప్రపంచము, అట్లు భాగింపఁబడనిది నిష్ప్రపంచము - అనఁగా అఖండము, అట్టివాఁడ వయి) నిర్విశేషుండ వై = వేఱొకవిశేషము లేనివాఁడ వై, నిర్గుణబ్రహ్మమాత్రుండ వై = త్రిగుణరహిత మయిన పరబ్రహ్మస్వరూపుఁడ వై, ఒప్పు నీదివ్యతత్త్వంబుఁ — ఒప్పు = వెలుఁగుచున్న, నీ = నీయొక్క, దివ్య= అప్రాకృత మైన, తత్త్వంబుఁ = యథార్థస్వరూపమును, నీ = నీదైన, సత్ = శ్రేష్ఠ మైన, కృపా=కరుణచేత, సంభృత= నిండింపఁబడినదై, అంచత్ = ఒప్పిద మగుచున్న, కటాక్షంబుచేతఁ = కడగంటి చూపుచేత, కనుంగొంటిఁ = అవలోకించితిని, దేవా = ఓస్వామీ, తే = నీకు, నమః = నమస్కారము, నమస్తే నమస్తే నమః నమస్కారము నమస్కారము అగుఁగాక

తా. బ్రహ్మవిద్యాస్వరూపిణి యైన సీతాలక్ష్మితోఁ గ్రీడించుచున్న శ్రీరామా! విషయేంద్రియాదిదేవతారూపము లగు భూర్భువస్సువను త్రిలోకములయందు అత్యంతముగ క్రీడించువాఁడా! పరాప్రకృతికి పర మైనట్టియు లేక పరావారమునకు పర మైనట్టియు నివాసము గలవాఁడా! కోరికలు లేనివాఁడా! బ్రహ్మవేత్తలహృదయములలో నుండి ప్రకాశించువాఁడా! బ్రహ్మవేత్తలయొక్క అంతఃకరణము లనెడు సముద్రమునకు చంద్రుఁడా! ఒప్పిద మైనట్టియు, శ్రేష్ఠ మైనట్టియు పేరు గలవాఁడా! ప్రకాశించుచున్న శాంతశమదమాద్యనంతకల్యాణగుణములయొక్క సమూహము గలవాఁడా! నీ తేజోరూపము యిట్టి దట్టి దని దలఁపరానిది, దేశకాలవస్తుకృతపరిచ్ఛేదశూన్య మైనది, ఆకాశమువలె వస్త్వంతరసంబంధము లేనిది, విభాగింపఁగూడనిది, కాలత్రయమునంగు బాధ్యబాధకములు లేనిది, ఇట్టి దని తెలుపఁగూడనిది, లోఁబఱచుకొనరానిది, ప్రత్యక్షాదిప్రమాణములచేత భేదింపరానిది, శాస్త్రాదులచేత భేదింపఁదగనిది, జననమరణములు లేనిది, త్రిమూర్త్యాత్మక మైనది, (బ్రహ్మ విష్ణు రుద్రుఁడు వీరు త్రిమూర్తులు) పరిమాణము లేనిది, ఎఱుఁగరానిది, ధ్యానము చేయుట కశక్య మైనది, సుఖదుఃఖాదిద్వంద్వశూన్య మైనది, ఎఱుకకు మీఱినది, మనస్సు మొదలుగాఁ గల యింద్రియములచేత గ్రహింపఁగూడనిది, శరీరము నధిష్ఠించి యుండునది, సజాతీయ విజాతీయ స్వగత భేదములు లేనిది, అమూర్త మైనది, రూపము లేనిది, పేరు లేనిది, రక్తాదివర్ణయుక్తము గానిది,

స్థూలసూక్ష్మదీర్ఘంబులు లేనిది, బాహ్యాంతరములు లేనిది, క్షీణత్వమును నాశమును బొందనిది, కర్మేంద్రియ జ్ఞానేంద్రియములకుఁ గనఁబడనిది, ప్రతిపాదించుటకు వీలులేనిది, నిర్ధరింపఁదగనిది, ప్రపంచమున కాది కారణమైనది, ప్రత్యక్షము కానిది, కదలని అతివ్యాప్త్యవ్యాప్త్యసంభవము లను దోషములచేత లక్షింపఁగూడనిది (అనఁగా బ్రహ్మలక్షణము లైన సచ్చిదానంద నిత్యనిర్మలపరిపూర్ణంబులచే నెఱుఁగఁదగనిది), ప్రకృతిచేత నావరింపఁబడనిది, నిశ్శబ్దమైన చిదాకాశస్వరూప మైనది, పంచభూతములకంటె వేఱైనది, మఱియు నీ తేజోరూపంబు అంతట నిండియున్నదియును, శాశ్వత మైనదియును, యథార్థ మైనదియును, నిర్మల మైనదియును, జ్ఞానస్వరూప మైనదియును, ప్రకృతివలన విడువఁబడినదియును, శుద్ధసత్త్వస్వరూప

## అంగ ప్రత్యంగ సాంగోపాంగముల వివరణము.

మైనదియును, ముఖ్య మైనదియును, అంగప్రత్యంగసాంగోపాంగవిశిష్టశరీరము లేనిదియును [అనఁగా అంగచతుష్టయసహితశరీరము లేనిది, అంగచతుష్టయ మనఁగా.—(౧) అంగము, (౨) ప్రత్యంగము, (౩) సాంగము, (౪) ఉపాంగము, (౧) శిరము, ఉదరము, భుజద్వయము అంగ మనఁబడును, (౨) లలాటము, నాసిక, కర్ణములు, అధరము ప్రత్యంగ మనఁబడును, (౩) మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము సాంగ మనఁబడును, (౪) వస్త్రాభరణలేపనాదులు ఉపాంగ మనఁబడును ] యథార్థ మయినదియును, జడము గానిదియును, దుఃఖము లేనిదియును నగు స్వరూపమే తనరూపముగ గలదియును నై సమస్తప్రాణులయొక్క స్థూలశరీరములయందలి జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పంచప్రాణములు బుద్ధి మనస్సు గర్వము చిత్తము మొదలుగాఁ గల ప్రపంచసమూహమును సూర్యుఁడు లోక మంతటిని ప్రకాశింపఁ జేసినట్లు ప్రకాశింపఁ జేయఁగా సాక్షి వయి ఆకాశము సమస్తము లైన కడవలయం దంతటను లోపలను వెలుపలను నిండియున్నట్లు పంచభూతములయందును నానావిధప్రాణులయందును అంతట చేరి యుండియు కర్తృత్వ భోక్తృత్వ జ్ఞాతృత్వ భర్తృత్వ హర్తృత్వ (చేయుట అనుభవించుట తెలియుట రక్షించుట చంపుట) ములును, శివరామగోవింద నారాయణ మహాదేవాదినామములును, ఎఱుపు నలుపు తెలుపు మొదలగు రూపములును, కదలుట పరుగెత్తుట వణఁకుట మొదలగు క్రియలును, స్థూలసూక్ష్మ కారణాద్యుపాధులును, బ్రాహ్మణాదివర్ణములును, బ్రహ్మచర్యాద్యాశ్రమములును, రజస్సత్త్వాదిగుణములును, ఏకముఖపులును, శోకమోహములును (దుఃఖము భ్రమ), లేక యీ స్థూలసూక్ష్మకారణశరీరములును, మేలుకొనుట కలగనుట నిద్రించుట మొదలగు అవస్థలును, పృథివ్యాదిపంచభూతములును, అన్నమయాది పంచకోశములును వీక్షించుచు షడ్భావవికారరహితుఁడును,(షడ్భావము లనఁగా ద్రవ్యగుణకర్మసామాన్యవిశేషసమవాయములు.—(౧) పృథివి అప్పు తేజస్సు వాయువు ఆకాశము కాలము దిక్కు ఆత్మ అను నీ తొమ్మిదియు పదార్థములు; (౨) రూపము రసము గంధము స్పర్శ సంఖ్యాపరిమాణము పృథక్త్వము సంయోగము విభాగము పరత్వము అపరత్వము గురుత్వము ద్రవత్వము స్నేహము శబ్దము బుద్ధి సుఖము దుఃఖము యిచ్ఛాద్వేషము ప్రయత్నము ధర్మము అధర్మము సంస్కారము అగు గుణములు యిరువదినాలుగు, (౩) ఉత్క్షేపణాపక్షేపణాకుంచన ప్రసారణ గమనము లని అయిదువిధములు, (౪) పరము అపరము అని సామాన్యము రెండువిధములు, (౫) నిత్యద్రవ్యవృత్తు లగుటచే విశేషము లనంతములు, పృథివ్యాది చతుష్టయపరమాణువులు ఆకాశాదిపంచకము నిత్యద్రవ్యము లనఁబడును, (౬) సమవాయ మనఁగా సంబంధము గుణమునకును గుణము గలిగినదానికిని క్రియకును క్రియ గలిగినదానికిని యుండుసంబంధము) వికల్పములు లేనివాఁడును, చూచుట వినుట లోనగు చతుర్దశేంద్రియప్రవర్తనములు లేనివాఁడును, అఖండ మయినవాఁడును, దేశకాలవిశేషములు లేనివాఁడును, త్రిగుణరహిత మయిన పరబ్రహ్మస్వరూపుఁడును నై ప్రకాశించు చున్న

నీయొక్క అప్రాకృత మగుచున యథార్థస్వరూపమును నీదగు కరుణచేత నిండింపఁబడినదియును యొప్పిద మగునదియును నగు కడగంటిచూపుచేత చూచితిని, నీకు నమస్కారము నమస్కారము నమస్కార మని తాత్పర్యము.

దండకలక్షణము॥ విద్వాంసు లెల్లన్ మకారంబుకానీ నకారంబుకానీ సకారంబుకానీ రచింపం దగు న్నందుగా నిందుఁ గాదేని యాదిం దకారంబు గల్పించి యామీఁద నెల్లం దకారంబులే మెండుగా నిచ్చలు న్వచ్చునందాఁక నిర్మించి గుర్వంతమౌం జేసినం దండకం బంద్రు వేత్తల్.

వ. అని మఱియు ని ట్లనియె. ౪

టీక. అని = ఇట్లు పలికి, మఱియున్ = వెండియు, ఇట్లనియెన్ = ఈలాగునఁ బలుకఁదొడఁగెను.

తా. ఇట్లు పలికి మఱల చెప్పఁ బ్రారంభించె నని తాత్పర్యము.

ఇంద్రవజ్రము. విశ్వాంతరావాసక ! విశ్వమూర్తి, విశ్వజ్ఞ విశ్వోదర ! విశ్వవంద్యా
విశ్వాక్ష విశ్వాతిగ ! విశ్వసాక్షి, విశ్వాది విశ్వేశ్వర ! విశ్వరూపా.

టీక విశ్వాంతరావాసక—విశ్వ = ప్రణవముయొక్క, అంతర = లోపల నుండెడి పదియాఱవ భాగ మైన తుర్యకళాస్వరూపమే, ఆవాసక = నివాసముగాఁ గలవాఁడా - లేక ప్రణవాంతర్భూత మగుచున అకారార్థమందు నివసించువాఁడా—లేక జగములో నివసించువాఁడా! (ఇట్లు విశ్వశబ్దమున కంతట నర్థద్వయము) విశ్వమూర్తి = ప్రణవస్వరూపుఁడా—లేక జగత్స్వరూపుఁడా! విశ్వజ్ఞ=ప్రణవార్థము నెఱిఁగినవాఁడా—లేక సర్వజ్ఞుఁడా! విశ్వోదర—విశ్వ = ప్రణవముయొక్క, ఉదర = గర్భమం దుండువాఁడా—లేక ప్రణవమే గర్భమందుఁ గలవాఁడా—లేక ప్రపంచమందు నీవును నీయందు ప్రపంచమును గలవాఁడా! విశ్వవంద్యా = ప్రణవార్థముచేత శ్లాఘింపఁదగినవాఁడా— లేక ప్రపంచముచేఁ గొనియాడఁదగినవాఁడా! విశ్వాక్ష = ప్రణవార్థదృష్టి గలవాఁడా—లేక ప్రపంచమునకు నేత్రమువంటివాఁడా! విశ్వాతిగ = ప్రణవాతీతుఁడా - లేక ప్రపంచాతీతుఁడా! విశ్వసాక్షి = ప్రణవాధిష్ఠాన మైనవాఁడా - లేక ప్రపంచాధిష్ఠాన మైనవాఁడా! విశ్వాది = ప్రణవోత్పత్తికారణుఁడా—లేక జగత్కారణుఁడా! విశ్వేశ్వర = ప్రణవనాయకుఁడా—లేక ప్రపంచనాయకుఁడా! విశ్వరూపా = ప్రణవమే యాకృతిగాఁ గలవాఁడా—లేక ప్రపంచాకృతి గలవాఁడా

ఇంద్రవజ్రావృత్తలక్షణము॥ ఇంతు ల్వదా వాడుదు రింద్రవజ్రన్ । స్వాంతంబున న్మోమము సంధిలంగన్ । దంతావళక్రాంతి నిదాఘకార । ప్రాంతంబునన్ గద్వయ మందమందన్. తా॥ ఇంద్రవజ్రావృత్తమునకు త త జ గగములును, ఎనిమిదవయక్షరమున యతియును వుండవలయు ననుట.

తా. ప్రణవముయొక్క లోపల నుండు పదియాఱవభాగ మయిన తుర్యకళాస్వరూపమే నివాసముగాఁ గలవాఁడా, లేక ప్రణవాంతర్భూత మైన అకారార్థమందు నివసించువాఁడా, లేక ప్రపంచములో నివసించువాఁడా! ప్రణవస్వరూపుఁడా, లేక జగత్స్వరూపుఁడా! ప్రణవార్థము నెఱిఁగినవాఁడా, లేక సర్వజ్ఞుఁడా! ప్రణవముయొక్క గర్భమం దుండువాఁడా, లేక ప్రణవమే గర్భమందుఁ గలవాఁడా, లేక ప్రపంచమందు నీవును నీయందు ప్రపంచమును గలవాఁడా! ప్రణవార్థముచేత శ్లాఘింపఁదగినవాఁడా, లేక ప్రపంచముచేఁ గొనియాడఁదగినవాఁడా! ప్రణవార్థదృష్టి గలవాఁడా, లేక ప్రపంచమునకు నేత్రమువంటివాఁడా! ప్రణవాతీతుఁడా, లేక ప్రపంచాతీతుఁడా! ప్రణవమునకు స్థానభూతుఁడా, లేక ప్రపంచమునకు స్థానభూతుఁడా! ప్రణవోత్పత్తికి కారణుఁడా, లేక జగత్కారణుఁడా! ప్రణవమునకు నాయ

కుఁడా, లేక ప్రపంచనాయకుఁడా! ప్రణవమే యాకృతిగాఁ గలవాఁడా, లేక ప్రపంచమే యాకృతిగాఁ గలవాఁడా.

ఉపేంద్రవజ్రము. నిరీశ నిష్కారణ నిర్వికల్పా, నిరీహ నిర్వాణద నిర్వికారా
నిరామయా నిర్గుణ నిర్విశేషా, నిరంతరానందవినిశ్చితాత్మా. ౬

టీక నిరీశ = స్వేతరప్రభువు లేనివాఁడా-లేక సమష్టిస్వరూపుఁడైన యీశ్వరుని మీఱినవాఁడా! నిష్కారణ = మాతాపితృలు లేనివాఁడా! నిర్వికల్పా = మనఃకార్యమైన ప్రపంచకల్పనము లేనివాఁడా! నిరీహా = కోర్కులు లేనివాఁడా! నిర్వాణద = మోక్షప్రదుఁడా! నిర్వికారా = షడ్భావవికారములు లేనివాఁడా! నిరామయా = వ్యాధులు లేనివాఁడా! నిర్గుణ = త్రిగుణరహితుఁడా! నిర్విశేషా = క్షరాక్షరాతీతుఁడా! (శేష మనఁగా నేతి యను వాక్యముచేత త్రోయఁగా మిగిలినది అక్షరము, విశేష మనఁగాఁ బ్రపంచము-అనఁగా క్షరము గావున క్షరాక్షరాతీతుఁ డనుట) నిరంతరానందవినిశ్చితాత్మా- నిరంతర = అఖండ మయిన, ఆనంద = సుఖముచేత, వినిశ్చిత = నిశ్చయింపఁబడిన, ఆత్మా = స్వరూపము గలవాఁడా

ఉపేంద్రవజ్రావృత్తలక్షణము.॥ క్షపాచరాగు ల్జజ ల్గగంబుల్ । గ్రహాగ్రమై దంతి విరామ మొప్పన్ । ద్విపాధిప త్రోతను త్రింప జేసె । యుపేంద్రవజ్ర ల్వెలయం ధరిత్రిన్ ॥ ౯ ॥ జ త జ గగ ములును యెనిమిదింట యతియును నుపేంద్రవజ్రావృత్తము గరు నుండదగలగుం ననుట

తా. తనకంటె నితర మగు ప్రభువు లేనివాఁడా, లేక సమష్టిస్వరూప మయిన యీశ్వరుని మీఱిన వాఁడా! తల్లిదండ్రులు లేనివాఁడా! మనస్సుకు కార్యము గల్గు ప్రపంచజ్ఞానము లేనివాఁడా! కోరికలు లేనివాఁడా! మోక్షము నిచ్చువాఁడా! షడ్భావవికారములు లేనివాఁడా! వ్యాధులు లేనివాఁడా! త్రిగుణరహితుఁడా! రజస్సత్త్వతమోగుణములు లేనివాఁడా! క్షరాక్షరాతీతుఁడా! అఖండానందము చేతఁ నిశ్చయింపఁబడిన స్వరూపము గలవాఁడా! అని తాత్పర్యము.

పృథ్వీవృత్తము. చరాచరకృతప్రపంచమయసర్వసంసారభృ
త్క్షరాక్షరవిలక్షణా గతవికారచిల్లక్షణా
పరాపరసనాతనా పరమపావనోద్ద్యోతనా
పురాణపురుషోత్తమా పురుషపూర్ణవిద్వత్తమా. ౭

టీక చర = తిరుగుచుండెడు మనుష్య పశ్వాదులు - లేక యింద్రియములు, అచర = స్థావరము లైన పర్వతాదులు - లేక విషయాదులు, (వీనిచేత) కృత = నిర్మింపఁబడిన, ప్రపంచమయ= జగత్స్వరూప మైన, సర్వసంసార = సకలసంసృతి, భృత్ = ధరించిన, క్షర = దేవునకు, అక్షర = కూటస్థునకు, విలక్షణా = వ్యత్యస్త మైనవాఁడా! గతవికారచిల్లక్షణా-గత = తిరస్కరింపఁబడిన, వికార = షోడశ వికారములు గల, చిత్ = చిద్రూప మనెడు, లక్షణా = చిహ్నము గలవాఁడా! అనఁగా పరబ్రహ్మము సచ్చిదానందనిత్యపరిపూర్ణము లనెడు పంచలక్షణములు గలది, వానిలో చిల్లక్షణము ముఖ్య మయినది గనుక గతవికారచిల్లక్షణా యని యిచ్చటఁ జెప్పఁబడినది) పరాపరసనాతనా - పరా = పరాప్రకృతి కంటె, అపర = అపరాప్రకృతికంటె, సనాతనా = పురాతన మైనవాఁడా! పరమపావనోద్ద్యోతనా - పరమ = మిక్కిలి, పావన = పవిత్రు లైన బ్రహ్మవేత్తలకు, ఉద్ద్యోతనా = గోచరించువాఁడా - లేక మిగుల నిర్మల మైన ప్రకాశము గలవాఁడా! ॥ని॥ 'ఆలోకో దర్శనోద్ద్యోతౌ' అని అమరము. పురాణ

పురుషోత్తమా—పురాణపురుష = ప్రాచీను లైన బ్రహ్మ విష్ణు రుద్రులకంటె, ఉత్తమా = శ్రేష్ఠుఁడా! పురుషపూర్ణవిదుత్తమా—పురుష = ప్రత్యగాత్మను, పూర్ణ = పరమాత్మను, విత్ = తెలిసిన బ్రహ్మవేత్తలలో, ఉత్తమా = శ్రేష్ఠుఁడా

తా. తిరుగుచుండెడు మనుష్యపశ్వాదులు లేక (ఇంద్రియములు స్థావరములు) లేక (పర్వతాదులు లేక విషయాదులు) వీనిచే నిర్మింపఁబడిన సమస్తసంసారమును ధరించిన జీవునకంటెను కూటస్థునకంటెను వ్యత్యస్త మయినవాఁడా! తిరస్కరింపఁబడిన షోడశవికారములు గల చిద్రూప మనెడు గురుతు గలవాఁడా! (పరబ్రహ్మము సత్ చిత్ ఆనందము నిత్యము పరిపూర్ణము లనెడు పంచలక్షణములలో చిత్ లక్షణము ముఖ్య మయినది గనుక గతవికారచిల్లక్షణా యని చెప్పఁబడెను) పరాపరప్రకృతులకంటె పురాతన మైనవాఁడా! మిక్కిలి పవిత్రు లయిన బ్రహ్మవేత్తలకు గోచరించువాఁడా! (మిగుల నిర్మల మయిన ప్రకాశము గలవాఁడా) ప్రాచీను లైన బ్రహ్మ విష్ణు రుద్రులకంటె శ్రేష్ఠుఁడా! ప్రత్యగాత్మను పరమాత్మను తెలిసిన బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుఁడా

పృథ్వీవృత్తలక్షణము॥ జసజ్జసయవంబు లష్టకరసంఖ్యవిశ్రాంతులుం । బొసంగి శవిపుంగవుల్పలుక భూమిలోఁ బృథ్వినా।న సంకీయ మగుం గళిందతనయామనోవల్లభా । ప్రసన్నవదనాంబుజా ధృతపరశ్వధా మాధవా. తా॥ జ స జ స య వ గణములును, పండ్రెండింట యతియును పృథ్వీవృత్తమునకు నుండవలయు ననుట.

భుజంగప్రయాతము. పరంధామ దివ్యప్రభావాభిరామా
పరాకాశ సంపూర్ణభవ్యప్రకాశా
పరానంద దేవాధిపా విశ్వతుందా
పరానందసచ్చిత్స్వభావాత్మరూపా. ౮

టీక. పరంధామ—(ధామశబ్దమున కర్థము తేజస్సును గృహమును గనుక) పరం = సూర్యచంద్రానలకాంతులకంటె పర మైన, ధామ = కాంతి గలవాఁడా— లేక గృహము గలవాఁడా! 'శ్లో॥ నతద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః । యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ' అని భగవద్గీత దివ్యప్రభావాభిరామా—దివ్య = అప్రాకృత మైన, ప్రభావ = సర్వజ్ఞత్వాది మాహాత్మ్యములచేత, అభిరామ = మనోహర మయినవాఁడా! పరాకాశ = చిదాకాశస్వరూపుఁడా! 'శ్లో॥ చిత్తాకాశం చిదాకాశ మాకాశంచ తృతీయకమ్ । ద్వాభ్యాం శూన్యతరం విద్ధి చిదాకాశ మ్మహామునే' సంపూర్ణభవ్యప్రకాశా - సంపూర్ణ = అఖండ మయిన, భవ్య = మనోహర మయిన, ప్రకాశా = తేజస్సు గలవాఁడా! పరానంద = నిత్యనిరతిశయానందము గలవాఁడా! దేవాధిపా = బ్రహ్మాదిదేవతలకు ప్రభువా! విశ్వతుందా—విశ్వ = ప్రణవరూపప్రపంచము, తుందా = గర్భమందుఁ గలవాఁడా—లేక ప్రణవరూపప్రపంచ మందుండువాఁడా! పరానందసచ్చిత్స్వభావాత్మరూపా = పరోత్కృష్టము లగు సచ్చిదానందములే స్వరూపముగాఁ గల పరమాత్మయే స్వస్వరూపముగాఁ గలవాఁడా

తా. సూర్యుఁడు చంద్రుఁడు అగ్ని వీరలయొక్క తేజస్సుకంటె శ్రేష్ఠ మయిన తేజస్సు గలవాఁడా! (గృహము గలవాఁడా) అప్రాకృత మయిన సర్వజ్ఞత్వాది మాహాత్మ్యములచేత మనోహరుఁ డైనవాఁడా! చిదాకాశస్వరూపుఁడా! అఖండ మైనట్టియు మనోహర మైనట్టియు తేజస్సు గలవాఁడా! నిత్యనిరతిశయానందము గలవాఁడా! బ్రహ్మాదిదేవతలకుఁ బ్రభు వగువాఁడా! ప్రణవరూప మగు ప్రపం

చమే గర్భమునందు గలవాఁడా! ప్రణవరూపప్రపంచమం దుండువాఁడా! పరోక్షత్వశూన్యము అగు సచ్చిదానందములే స్వరూపముగాఁ గల పరమాత్మయే స్వస్వరూపముగాఁ గలవాఁడా

భుజంగప్రయాతలక్షణము॥ జగద్గీతకీర్తి భుజంగప్రయాతం । బగుణ రేచనా యద్వ్యయద్వంద్వ హైనకా తా॥ భుజంగప్రయాతమునకు నాలుగుయగణములును, ఎనిమిదింట యతియును వుండవలయు ననుట.

క. మాయాప్రతిబింబేశ్వర, మాయామయదివ్యదేహ మాయాతీతా
మాయావి మాయమాయా, మాయారహితాత్మతత్త్వమయ జయరామా. ౯

టీక మాయాప్రతిబింబేశ్వర — మాయాప్రతిబింబ = సత్త్వగుణమందు ప్రతిఫలించిన విరాట్ఛరీరమునకు, ఈశ్వర = ప్రభువా—అనఁగా మాయయందు ప్రతిఫలించిన యీశ్వరునిస్వరూపము లైన విరాట్ హిరణ్యగర్భావ్యాకృతప్రకృతులకు నియంత లైనవాఁడా యనుట, మాయామయదివ్యదేహా — మాయామయ = సత్త్వగుణస్వరూప మైన మాయ యనెడు, దివ్యదేహ=అప్రాకృతశరీరము గలవాఁడా! మాయాతీతా = మాయకంటె వ్యతిరిక్త మైనవాఁడా! మాయావి = జగత్సృష్టిస్థితిలయముల నొనర్చెడు మాయాశక్తి గలవాఁడా! మాయమాయా — మాయ = ప్రకృతిని, మాయా = నశింపఁజేయువాఁడా! మాయా= జీవునికంటె, రహిత = వేఱైన, ఆత్మతత్త్వమయ = పరబ్రహ్మస్వరూపుఁ డైన, జయరామా = శ్రీరాముఁడా

తా సత్త్వగుణమందుఁ బ్రతిఫలించిన (మాయయందుఁ బ్రతిఫలించిన) ఈశ్వరునిస్వరూపము లైన హిరణ్యగర్భావ్యాకృతప్రకృతులకుఁ బ్రభు వగువాఁడా! సత్త్వగుణస్వరూప మయిన మాయ యనెడు అప్రాకృతశరీరము గలవాఁడా! మాయకంటె వ్యతిరిక్త మయినవాఁడా! జగత్సృష్టిస్థితిలయముల నొనర్చెడు మాయాశక్తి గలవాఁడా! ప్రకృతిని నశింపఁజేయువాఁడా! జీవునకంటె వేఱైన పరబ్రహ్మమే స్వరూపముగాఁ గల శ్రీరామా

క. భూతకర భూతభావన, భూతభరణ భూతహరణ భూతావాసా
భూతేశ్వర భూతాశ్రయ, భూతాత్మక భూతసాక్షి భూతాత్మహరీ. ౧౦

టీక. భూతకర=ప్రాణికోట్లను పుట్టించువాఁడా! ॥ని॥ 'భూతం స్యాద్యో సమే ప్రాప్తే యథార్థా త్రతయోరపి । క్లీబే త్వయం పిశాచాదౌ భూమ్యాదౌ జంతు సత్యయోః' అని రత్నమాల; పంచభూతముల సృష్టించినవాఁ డని యర్థాంతరము భూతభావన = జీవసంఘములచేత ధ్యానింప నర్హ మయినవాఁడా! భూతభరణ = ప్రాణిసంఘాతములను రక్షించువాఁడా! భూతహరణ = జీవసమూహములను సంహరించువాఁడా! భూతావాసా = ప్రాణికోట్లహృదయకమలకర్ణికలయందు నివసించువాఁడా! పంచభూతాం

టీక. వేద = చతుర్వేదములకు, ఆగమ = కామికాదివాతూలాంతాద్యష్టావింశత్యాగమములకు, అవిషయ = గోచరింపని, విగ్రహ = స్వరూపము గలవాఁడా! వేద = వేదములచేత, వేద్యా = ఎఱుంగఁదగినవాఁడా! వేదాంగ = శిక్షాదిషడంగస్వరూపుఁడా! వేదనుత = వేదములచేత శ్లాఘింపఁదగినవాఁడా! వేద = శ్రుతులను, వివేక = ఎఱుంగుటయే, శీల = స్వభావముగాఁ గలవాఁడా! వేదాది = వేదములకాదియైనవాఁడా, వేదమయ = వేదస్వరూపుఁడా! వేద = ఆమ్నాయములయందు, గ = సంచరించువాఁడా! వేద = ప్రాఁజదువులే, జిహ్వ = మాటలుగాఁ గలవాఁడా! ॥ని॥ 'జిహ్వా వాగ్రసనా జ్వాలా' అని రత్నమాల. వేదాంత = ఉపనిషత్తులయందలి, తత్త్వ = యథార్థమునందు, సువిచక్షణ = మంచివిచారణ గలవారిచేత, వేదితవ్యా = ఎఱుంగఁదగినవాఁడా.

తా. వేదములచేతను ఆగమములచేతను తెలియఁబడని స్వరూపము గలవాఁడా! (ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము అని వేదములు నాలుగు, కామికాదివాతూలాంతాద్యష్టావింశత్యాగమములు) వేదములచేత నెఱుఁగఁదగినవాఁడా! శిక్షాదిషడంగస్వరూపుఁడా! వేదములచేత శ్లాఘింపఁదగినవాఁడా! శ్రుతులను తెలిసికొనుటయే స్వభావముగాఁ గలవాఁడా! వేదములకు ఆదియైనవాఁడా! వేదస్వరూపుఁడా! వేదములయందు సంచరించువాఁడా! వేదములే మాటలుగాఁ గలవాఁడా! ఉపనిషత్తులయందలి యథార్థమును తెలిసికొనినవారిచేఁ దెలిసికొనఁదగినవాఁడా! అని తాత్పర్యము.

వసంతతిలకావృత్తలక్షణము॥ శ్రీమేదినీరమణ సింధుశిరంగరంగ। గ్రామాహితల్ప విభ తాసుకవాహ రాధా। కామా వసంతతిలకందభజాగగంబుల్ । సామప్రభూత యతి సాగి నగంబులంగూఁ డా॥ వసంతతిలకావృత్తమునకు త భ జ జ గగములును, ఎనిమిదింటయతియును వుండవలయును అనుట. దీని సింహోన్నతము, ఉద్ధర్షిణి, శోభావతి, మధుమాధవి యనియును చెప్పఁగును.

క. శాస్త్రాగమపరికల్పక, శాస్త్రాచార్యోపదేశసారార్థజ్ఞ
శాస్త్రాగమార్థతత్పర, శాస్త్రార్థవిచారగమ్య శాస్త్రప్రవరా. ౧౩

టీక. శాస్త్ర = షట్ఛాస్త్రములను, ఆగమ = షణ్మతయాగమములను, పరికల్పక = నిర్మించినవాఁడా! శాస్త్ర = వేదాంతశాస్త్రజ్ఞానము గల, ఆచార్య = దేశికులయొక్క, ఉపదేశ = బోధవలనఁ గలిగిన, సార = స్థిరమైన, అర్థ = తాత్పర్యమును, జ్ఞ = తెలిసినవాఁడా! శాస్త్ర = షట్ఛాస్త్రములయొక్కయు, ఆగమ = చింత్యాద్యాగమములయొక్కయు అర్థతాత్పర్యములయందు, తత్పర = ఆసక్తి గలవాఁడా! శాస్త్ర = వేదాంతశాస్త్రమందలి, అర్థ = తాత్పర్యముయొక్కయు, విచార = ఆలోచనచేత, గమ్య = పొందఁదగినవాఁడా! శాస్త్ర = శాస్త్రములయందు, ప్రవరా = శ్రేష్ఠుఁడా.

తా. ఆఱుశాస్త్రములను, షణ్మతయాగమములను నిర్మించినవాఁడా! వేదాంతశాస్త్రజ్ఞానము గల దేశికులయొక్క బోధవలనఁ గలిగిన సారమైన తాత్పర్యమును దెలిసినవాఁడా! శాస్త్రములయందును ఆగమములయందును ఆసక్తి గలవాఁడా! వేదాంతశాస్త్రమందలి తాత్పర్యముయొక్క ఆలోచనచేత పొందఁదగినవాఁడా! శాస్త్రములయందు శ్రేష్ఠుఁడా! అని తాత్పర్యము.

క. విద్యానిధి విద్యాప్రద, విద్యావిద్యాతిరిక్త విద్యావేద్యా
విద్యాపతి విద్యామయ, విద్యాసందానితాత్మ విద్యాసారా. ౧౪

టీక. విద్యా = వేదాదిచతుర్దశవిద్యలకు - లేక అపరోక్షజ్ఞానమునకు, నిధి = నిక్షేపస్థానమైనవాఁడా! విద్యా = బ్రహ్మజ్ఞానమును, ప్రద = ఇచ్చువాఁడా! విద్యా = జ్ఞానమునకంటె, అవిద్యా = అజ్ఞానమునకంటె, అతిరిక్త = వేఱైనవాఁడా, విద్యావేద్యా — విద్యా = విద్యాజ్ఞానముచేత-లేక అనఁగ బ్రహ్మ,

## చతుర్దశమంత్రవిద్యానామముల వివరణము.

చంద్రవిద్య ఇంద్రవిద్య లోపాముద్రవిద్య సౌభాగ్యవిద్య షోడశవిద్య మహావిద్య శ్రీవిద్య ఆత్మవిద్య అగస్త్యవిద్య హాదివిద్య కాదివిద్య సాదివిద్య శుద్ధవిద్య అనెడు చతుర్దశమంత్రవిద్యలచేత, వేద్యా = ఎఱుఁగఁదగినవాఁడా! విద్యాపతి = చతుష్షష్టివిద్యలకు ప్రభువా! విద్యామయ = సర్వవిద్యాస్వరూపుఁడా - లేక జ్ఞానస్వరూపుఁడా! విద్యాసందానితాత్మ—విద్యా = అపరోక్షజ్ఞానముచేత, సందానిత = కట్టఁబడిన - అనఁగా నిర్ణయింపఁబడిన, ఆత్మ = స్వరూపము గలవాఁడా! విద్యాసారా—విద్యా = సకలవిద్యలయొక్క, సారా = స్థిరాంశ మయినవాఁడా.

తా. వేదము మొదలగు పదునాలుగువిద్యలకును, అపరోక్షజ్ఞానమునకును నిక్షేప మైనవాఁడా! బ్రహ్మజ్ఞానము నిచ్చువాఁడా! జ్ఞానాజ్ఞానములకంటె వేఱైనవాఁడా! జ్ఞానముచేత నెఱుఁగఁదగినవాఁడా! (అనంగవిద్య చంద్రవిద్య ఇంద్రవిద్య లోపాముద్రవిద్య సౌభాగ్యవిద్య షోడశవిద్య మహావిద్య శ్రీవిద్య ఆత్మవిద్య అగస్త్యవిద్య హాదివిద్య కాదివిద్య సాదివిద్య శుద్ధవిద్య అనెడు చతుర్దశమంత్రవిద్యలచేత నెఱుఁగఁదగినవాఁడా,) అఱువదినాలుగువిద్యలకు ప్రభువా! (సర్వవిద్యాస్వరూపుఁడా! (జ్ఞానస్వరూపుఁడా) అపరోక్షజ్ఞానముచేత నిర్ణయింపఁబడిన స్వరూపము గలవాఁడా! సమస్తవిద్యలయొక్క స్థిరాంశ మైనవాఁడా! అని తాత్పర్యము.

మాలిని. యజ్ఞవిధాయక యజ్ఞనియామక । యజ్ఞఫలాశ్రయ యజ్ఞకరా
యజ్ఞఫలావన యజ్ఞఫలాశన । యజ్ఞఫలప్రద యజ్ఞధరా
యజ్ఞవిధిప్రియ యజ్ఞసమర్చిత । యజ్ఞసుసాధన యజ్ఞపతీ
యజ్ఞశరీరక యజ్ఞరహస్యక । యజ్ఞపరాయణ యజ్ఞమయా. ౧౫

టీక. యజ్ఞవిధాయక = యజ్ఞకర్మములను విధించువాఁడా! (వ్యు యజదేవపూజాకరణసంగతి దానేషు) యజ్ఞనియామక = యజ్ఞకర్మములను నియమించువాఁడా! యజ్ఞఫలాశ్రయ = యజ్ఞఫలమున కాధార మైనవాఁడా! యజ్ఞకరా = యజ్ఞములను జేయువాఁడా - అనఁగా యజమానస్వరూపుఁడా! యజ్ఞఫలావన = యజ్ఞఫలమును రక్షించువాఁడా! యజ్ఞఫలాశన = యజ్ఞఫలము ననుభవించువాఁడా! యజ్ఞఫలప్రద = యజ్ఞఫలము నిచ్చువాఁడా! యజ్ఞధరా = యజ్ఞమును నిర్విఘ్నముగ రక్షించువాఁడా! యజ్ఞవిధిప్రియ = యజ్ఞవిధానమం దాసక్తి గలవాఁడా! యజ్ఞసమర్చిత=యజ్ఞమం దర్చింపఁబడువాఁడా! యజ్ఞసుసాధన = యజ్ఞమందలి చర్వాజ్య కపాల పురోడాశ స్రుక్స్రువాది సమస్తవస్తుస్వరూపుఁడా! యజ్ఞపతీ = యాగమునకు ప్రభువా! యజ్ఞశరీరక = యజ్ఞమే శరీరముగాఁ గలవాఁడా! (యజ్ఞో వై విష్ణుః అని శ్రుతి) యజ్ఞరహస్యక = యజ్ఞసంబంధము లగు మంత్రములను పొందినవాఁడా! యజ్ఞపరాయణ— యజ్ఞ = అధ్వరమే, పర = శ్రేష్ఠ మైన, అయన = స్థానముగాఁ గలవాఁడా! యజ్ఞమయా = యజ్ఞస్వరూపుఁడా.

తా. యజ్ఞకర్మములను విధించువాఁడా! యజ్ఞకర్మములను నియమించువాఁడా! యజ్ఞఫలమున కాధార మయినవాఁడా! యజ్ఞములకు యజమానస్వరూపుఁడా! యజ్ఞములను రక్షించువాఁడా! యజ్ఞఫలము ననుభవించువాఁడా! యజ్ఞఫలము నిచ్చువాఁడా! యజ్ఞమును నిర్విఘ్నముగ రక్షించువాఁడా! యజ్ఞవిధానమం దాసక్తి గలవాఁడా! యజ్ఞమం దర్చింపఁబడువాఁడా! యజ్ఞమందలి చరు ఆజ్యము (నెయ్యి) కపాలము పురోడాశము స్రుక్ స్రువము మొదలగు సమస్తవస్తుస్వరూపుఁడా! యజ్ఞమునకు

ప్రభువా! యజ్ఞమే శరీరముగాఁ గలవాఁడా! యజ్ఞసంబంధము లగు మంత్రములను పొందినవాఁడా! యజ్ఞమే శ్రేష్ఠ మయిన స్థానముగాఁ గలవాఁడా! యజ్ఞస్వరూపుఁడా యని తాత్పర్యము.

మానినీవృత్తలక్షణము॥ రాజిలు సప్తభము ల్గము విశ్వవిరామము మానినియంగుఁ దగున్. తా॥ ఏడు భగణములును, ఒక్క గురువును, పదుమూఁడింట యతియును వుండవలయును.

క. మంత్రప్రభావదర్శక, మంత్రప్రియ సకలమంత్రమంత్రార్థజ్ఞ
మంత్రార్థగమ్య మంత్రీ, మంత్రాధిష్ఠానదేవమయ మంత్రాత్మా. ౧౬

టీక మంత్రప్రభావదర్శక — మంత్ర = గాయత్ర్యాది సప్తకోటిమహామంత్రములయొక్క, ప్రభావ = మహాత్వమును, దర్శక = చూపించువాఁడా! ॥ని॥ 'వేదభేదే గుప్తవాగే మంత్రో దేవాది సాధన' ఇతి శేషః మంత్రప్రియ = మంత్రములయందుఁ బ్రేమ గలవాఁడా! సకలమంత్రమంత్రార్థజ్ఞ = ఎల్ల మంత్రములను మంత్రతాత్పర్యములను యెఱిఁగినవాఁడా! మంత్రార్థగమ్య = మంత్రప్రయోజనములను పొందినవాఁడా! మంత్రీ = మంత్రములు గలవాఁడా! మంత్రాధిష్ఠానదేవమయ = మంత్రముల కాధారభూత మయిన దేవతాస్వరూపుఁడా! మంత్రాత్మా = మంత్రస్వరూపుఁడా.

తా. గాయత్ర్యాది సప్తకోటిమహామంత్రములయొక్క మహాత్వమును చూపించువాఁడా! మంత్రములయందు ప్రేమ గలవాఁడా! సమస్తమంత్రములను మంత్రములయొక్క తాత్పర్యములను యెఱిఁగిన వాఁడా! మంత్రప్రయోజనములను పొందినవాఁడా! మంత్రములు గలవాఁడా! మంత్రముల కాధారభూత మయిన దేవతాస్వరూపుఁడా! మంత్రస్వరూపుఁడా! అని తాత్పర్యము.

క జపకల్పక జపతల్పక, జపకోట్యారాధనీయ జపతత్త్వజ్ఞ
జపజప్యజాపకాత్మక, జపయజ్ఞఫలస్వరూప జపలక్ష్యాత్మా. ౧౭

టీక. జపకల్పక — జప = ప్రణవమంత్రావృత్తిని, కల్పక = పుట్టించినవాఁడా! జపతల్పక = జపమే పాన్పుగాఁ గలవాఁడా! జపకోట్యారాధనీయ — జపకోటి = జపసమూహము చేత, ఆరాధనీయ = సేవింపఁ దగినవాఁడా! జపతత్త్వజ్ఞ = జపమునందలి యథార్థము నెఱిఁగినవాఁడా! జపజప్యజాపకాత్మక — జప = జపముయొక్క, జప్య = జపింపఁదగిన మంత్రముయొక్క, జాపక = జపించువానియొక్క, ఆత్మక = స్వరూపుఁడా! జపయజ్ఞఫలస్వరూప — జపయజ్ఞ = జప మనెడు పూజయొక్క, ఫలస్వరూప = ఫలమే స్వరూపముగాఁ గలవాఁడా! జపలక్ష్యాత్మా — జప = మననముచేత, లక్ష్య = చూడఁదగిన, ఆత్మా = స్వరూపము గలవాఁడా! (జపదేవతాస్వరూపుఁడా) యనుట.

తా ప్రణవమంత్రావృత్తిని పుట్టించినవాఁడా! (మంత్రావృత్తి-జపము) జపమే పాన్పుగాఁ గలవాఁడా! జపసమూహములచేత సేవింపఁదగినవాఁడా! జపమునందలి యథార్థము నెఱిఁగినవాఁడా! జపముయొక్కయు జపింపఁదగిన మంత్రముయొక్కయు జపించువానియొక్కయు స్వరూపము గలవాఁడా! జప మనెడు పూజయొక్క ఫలమే స్వరూపముగాఁ గలవాఁడా! మననముచేతఁ జూడఁదగిన స్వరూపము గలవాఁడా! అని తాత్పర్యము.

క. ధ్యానప్రియ సంతతహృద్ధ్యానధ్యేయాత్మరూపతత్త్వ ధ్యాతృ
ధ్యానధ్యేయాధ్యాత్మ, ధ్యానపరాయణ సమస్తతత్త్వాతీతా. ౧౮

టీక. ధ్యానప్రియ = ధ్యానయోగమందు ప్రేమ గలవాఁడా! సంతతహృద్ధ్యానధ్యేయాత్మరూపతత్త్వ — సంతత = ఎల్లప్పుడు, హృత్ = మనస్సునందు, ధ్యాన = ధ్యానము చేయుటచేత, ధ్యేయ =

తెలియఁదగిన, ఆత్మరూపతత్త్వ = సత్యమైన పరబ్రహ్మస్వరూపుఁడా! ధ్యాతృధ్యానధ్యేయాధ్యాత్మ—ధ్యాతృ = ధ్యానము చేయువాఁడును, ధ్యాన = ధ్యానమును, ధ్యేయ = ధ్యానింపఁదగిన వస్తువును, అధ్యాత్మ = అధిష్ఠానస్వరూపముగాఁ గలవాఁడా! ధ్యానపరాయణ—ధ్యానపర=ధ్యానమం దాసక్తి గల వారలకు, అయన = స్థానమైనవాఁడా.— లేక ధ్యానపరులకే మే లయిన స్థానముగాఁ గలవాఁడా! సమస్త తత్త్వాతీతా—సమస్తతత్త్వ = ఎల్లతత్త్వములకు—అనఁగా షట్త్రింశత్తత్త్వములకు, అతీతా = వ్యతిరిక్త మయినవాఁడా.

తా. ధ్యానయోగమందు ప్రేమ గలవాఁడా! ఎల్లప్పుడును మనస్సునందు ధ్యానము చేయుటచేత దెలియఁదగిన సత్య మయిన పరబ్రహ్మస్వరూపుఁడా! ధ్యానము చేయువాఁడును, ధ్యానింపఁదగిన వస్తువును అధిష్ఠానస్వరూపముగాఁ గలవాఁడా! ధ్యానమం దాసక్తిగలవారలకు స్థాన మయినవాఁడా! (ధ్యానపరులకే మే లయినస్థానము గలవాఁడా) ముప్పదియాఱుతత్త్వములకంటె వ్యతిరిక్త మయిన వాఁడా! అని తాత్పర్యము.

క. పూజావిధానదర్శక, పూజాతద్వస్తుపూజ్యపూజకరూపా
పూజాఫలప్రదాయక, పూజాప్రియ పూజనీయ పూజావిషయా. ౧౯

టీక. పూజావిధానదర్శక—పూజావిధాన = అర్చనావిధిని, దర్శక = గురురూపముగాఁ దెలియఁ బఱచువాఁడా! పూజా = అర్చనయు, తద్వస్తు = ఆ యర్చన కుపకరణము లగు పుష్పపత్రఫలజలాదు లును, పూజ్య = అర్చింపఁదగిన దేవతయును, పూజక = అర్చించువాఁడును, రూపా=ఇవియే స్వరూప ముగాఁ గలవాఁడా! పూజాఫలప్రదాయక—పూజాఫల = అర్చనాఫలమును, ప్రదాయక= ఇచ్చువాఁడా! పూజాప్రియ = అర్చించుటయందు ప్రేమ గలవాఁడా! పూజనీయ=అర్చించుట కర్హ మైనవాఁడా! పూజా విషయా— పూజా = అర్చనకు, విషయా = కనఁబడనివాఁడా.

తా. పూజావిధానమును గురురూపముగాఁ దెలియఁబఱచువాఁడా! పూజకు నుపకరణము లగు వస్తువులు, (పుష్పము, పత్రము, ఫలము, ఉదకము మొదలగునవి పూజాద్రవ్యములు) పూజింపఁదగిన దేవత, పూజించువాఁడు ఇవియే స్వరూపముగాఁ గలవాఁడా! పూజాఫలము నిచ్చువాఁడా! పూజించుట యందు ప్రేమ గలవాఁడా! పూజించుట కర్హుఁడయినవాఁడా! పూజకు కనఁబడనివాఁడా! అని తాత్ప.

క. నామప్రియ నారాయణనామక విశ్వాద్యనంతనామార్థజ్ఞ
నామప్రభావదర్శక, నామాదివికారరహిత నతవిబుధహితా. ౨౦

టీక. నామప్రియ = విధినిషిద్ధనామములయందు ప్రేమ గలవాఁడా! నారాయణనామక=నారా యణుఁ డను పేరు గలవాఁడా! (అనఁగా 'నారం విజ్ఞానం తదయనమాశ్రయో యస్య సః నారాయణః' నార మనఁగా విజ్ఞానము, ఆ విజ్ఞానమున కాశ్రయ మయినవాఁడు నారాయణుఁడు, 'శ్లో॥ నరా జ్జాతాని తత్త్వాని నారాణీతి విదుర్బుధాః' అని భారతము— అనఁగా నరునివలన జనించిన తత్త్వములు నారము లనుట, నరుఁ డనఁగా 'రిష్యతే క్షీయత ఇతి రః - రిష్ క్షయే ధాతుః' అనఁగా నశింపఁబడునది, 'రః సంభవతీతి నరః - అవినాశ్యాత్మా' నాశము లేనివస్తువు నరుఁడు - పరబ్రహ్మ మనుట, నారాయణశబ్దార్థ మయిన పరబ్రహ్మస్వరూపుఁడా యని భావము) విశ్వాద్యనంతనామార్థజ్ఞ = విశ్వనామము మొదలైన అపరిమితనామములయొక్క తాత్పర్యము నెఱిఁగినవాఁడా! నామప్రభావదర్శక = విశ్వాదినామమాహా త్మ్యములఁ దెలిపెడువాఁడా! నామాదివికారరహిత = విశ్వనామము మొదలయిన వికారములు లేని వాఁడా! నతవిబుధహితా— నత = విధేయు లయిన, బుధ = పండితులకు, హిత = ఇష్టుఁడా.

తా॥ విధినిషేధశాస్త్రములయందు ప్రేమ గలవాఁడా! సారాయణుఁ డను పేరు గలవాఁడా! (సార మనఁగా విజ్ఞానము, అట్టి విజ్ఞానమునకు ఆశ్రయ మయినవాఁడా! నరునివలనఁ బుట్టినతత్త్వములు నారము లని పెద్దలు చెప్పుదురు, నరుఁ డనఁగా నాశార్థక మగు రిష్ ధాతువుగలన రః అనునది యగు చున్నది, రః అనఁగా నశింపఁబడునది యని యర్థము, నరః అనఁగా నశింపఁబడనిది, అట్టి వస్తువు పర బ్రహ్మము గనుక పరబ్రహ్మస్వరూపుఁడా యని తాత్పర్యము) విశ్వము మొదలగు అనంతనామముల యొక్క తాత్పర్యము నెఱిఁగినవాఁడా! విశ్వాదినామములయొక్క మాహాత్మ్యములను దెలిపెడువాఁడా! విశ్వాదినామములు మొదలయిన వికారములు లేనివాఁడా! విధేయు లయిన పండితుల కిష్టుఁడా యని తా.

క. గురుశిష్యభావకల్పక, గురుశిష్యాచారధర్మగుణపరిపాలా
గురుశిష్యరూపధారీ, గురుశిష్యైక్యావబోధగుణగురుమూర్తీ. ౨౧

టీక. గురుశిష్యభావకల్పక—గురుశిష్య = గురు వనెడు శిష్యుఁ డనెడు, భావ = వ్యాపారములను, కల్పక = కల్పించువాఁడా! పరమాత్మ జీవాత్మ లనెడు భావకల్పకుఁడా యని గూఢార్థము; గురు శిష్యాచారధర్మగుణపరిపాలా—గురుశిష్య = గురుశిష్యులయొక్క, ఆచార = ప్రవర్తనములను, ధర్మ = న్యాయములను, గుణ = సర్వజ్ఞత్వకించిద్జ్ఞత్వాదిగుణములను, పరిపాలా = రక్షించువాఁడా! గురు శిష్యరూపధారీ = గురుశిష్యరూపములను ధరించినవాఁడా! గురుశిష్య = గురుశిష్యులయొక్క, ఐక్యావబోధ = ఐక్యజ్ఞానమే, గుణ = స్వభావధర్మముగాఁ గల, గురుమూర్తీ = గురుస్వరూపుఁడా! అనఁగా గురువునందలి సర్వజ్ఞత్వాదిగుణములకును, శిష్యునియందలి కించిజ్జ్ఞత్వాదిగుణములకును విల క్షణ మయిన సత్యజ్ఞానానందస్వరూపు లగు బ్రహ్మప్రత్యగాత్మలు ఒక్కటియే యగు నెడు జ్ఞానము స్వభా వముగాఁ గలవాఁడా యనుట

తా॥ గురు వనునట్టియు శిష్యుఁ డనునట్టియు వ్యాపారములను కల్పించువాఁడా! గురుశిష్యుల యొక్క ప్రవర్తనములను న్యాయములను సర్వజ్ఞత్వకించిద్జ్ఞత్వాదిగుణములను పరిపాలించువాఁడా! గురుశిష్యరూపములను ధరించువాఁడా! గురుశిష్యులయొక్క ఐక్యజ్ఞానమే స్వభావధర్మముగాఁ గల గురు స్వరూపుఁడా! (అనఁగా గురువునందలి గుణములకంటెను శిష్యునియందలి గుణములకంటెను వేఱైన బ్రహ్మప్రత్యగాత్మలు ఒక్కటి యనెడు జ్ఞానము గలవాఁడా).

విద్యున్మాలావృత్తము. ధర్మారాధ్యా ధర్మాధ్యక్షా, ధర్మీ ధర్మాత్మా ధర్మజ్ఞా
ధర్మాధారా ధర్మాకారా, ధర్మాధర్మాత్యంతాభావా. ౨౨

టీక. ధర్మారాధ్యా—ధర్మ = వర్ణాశ్రమాచారములచేత, ఆరాధ్యా = ఆరాధింపఁబడువాఁడా ॥ని॥ 'ధర్మః పుణ్యే యమే న్యాయే స్వభావాచారయోః క్రతౌ । ఉపమాయా మహింసాయాం కార్యేచ నిగద్యతే' ఇట్లని విశ్వప్రకాశము. ధర్మాధ్యక్షా—ధర్మ = సుకృతములకు, అధ్యక్షా = ప్రభుడా! ధర్మీ = ధర్మము కలవాఁడా! ధర్మాత్మా = ధర్మమునందు బుద్ధి గలవాఁడా! ధర్మజ్ఞా = పుణ్యముల నెఱిఁగి నవాఁడా! ధర్మాధారా = ధర్మముల కాశ్రయ మయినవాఁడా! ధర్మాకారా = ధర్మస్వరూపుఁడా ధర్మాధర్మాత్యంతాభావా—ధర్మ = పుణ్యమును, అధర్మ = పాపమును, అత్యంతాభావా = లేనివాఁడా

తా. వర్ణాశ్రమాచారములచేత నారాధింపఁబడువాఁడా! సుకృతములకుఁ బ్రభు వయినవాఁడా ధర్మము కలవాఁడా! ధర్మమునందు బుద్ధి గలవాఁడా! పుణ్యముల నెఱిఁగినవాఁడా! ధర్మములకు నాధార మయినవాఁడా! ధర్మస్వరూపుఁడా! పుణ్యపాపములు లేనివాఁడా! అని తాత్పర్యము.

విద్యున్మాలావృత్తలక్షణము॥ శ్రీజేపీఠ్యాత్రి ప్రాసోకా । యాదిత్యశ్యేష్ఠాది మ్ముత్యా । వేదో ద్ధ్రా విద్యున్మాలం । బాధై మాగా ప్రాప్తిం బోల్పుకా తా॥ రెండు మగణములును, రెండు గురువులును, ఐదవయక్షరమున యతియును విద్యున్మాలావృత్తమునకు వుండవలయు ననుట.

సుకాంతివృత్తము. ధనార్జనా, ధనప్రియా । ధనాధిపా, ధనంజయా. ౧౩

టీక. ధనార్జనా = విజ్ఞాన యశో విద్యా తపః పుత్త్రాదిధనముల నార్జించువాఁడా! ధనప్రియా= ధనమందు ప్రేమ గలవాఁడా! ధనాధిపా=ధనమునకు ప్రభువా! కుబేరుఁడా యని యర్థాంతరము, ధనంజయా=ధనమును గెలుచువాఁడా! అగ్నిహోత్రుఁడా యని యర్థాంతరము, ॥ని॥ 'ధనంజయోర్జునే శక్రే దహనే దేహమారుతే' అని రత్నమాల. 'దినోతి ప్రీణయతీతి ధనం - ధివితిప్రీణనే' సంతోషపెట్టునది

తా. విజ్ఞానము యశస్సు విద్యా తపస్సు పుత్త్రులు యివియే మొదలుగాఁగల ధనములను ఆర్జించువాఁడా! ధనమునకుఁ బ్రభువైనవాఁడా! (కుబేరుఁడా) ధనమును గెల్చువాఁడా! (అగ్నిహోత్రుఁడా).

సుకాంతివృత్తలక్షణము॥ జకారముక్ । గకారముక్ । సుకాంతికిక్ । శుకస్తుతా॥

ఉపజాతివృత్తము. కామాది కామాదివికారశూన్యా
సమస్తకామప్రద ! సత్యకామా
కామఘ్న కామప్రియ ! కామకామీ
క్షమారమా కాముక ! కామరూపీ. ౧౪

టీక కామాది— కామ = అభిలాషోత్పత్తికి, ఆది = కారణ మయినవాఁడా! అనఁగా సంకల్పాతీతుఁడని భావము ॥ని॥ 'స్మరాభిలాషయోః కామానుజ్ఞాయాం కామ మవ్యయమ్' అని రత్నమాల. కామాదివికారశూన్యా = కామక్రోధలోభమోహమత్సరాది వికారములు లేనివాఁడా! సమస్తకామప్రద= అన్ని కోరికల నిచ్చువాఁడా! సత్యకామా = సత్యసంకల్పుఁడా-లేక 'కామ్యతే యోగిభిః కామ సత్య శ్చాసౌ కామశ్చ సత్యకామః' అని వ్యు. తా॥ సత్యులైన యోగులచేత కోరఁబడువాఁడా! కామఘ్న = కామమును నశింపఁజేయువాఁడా! అనఁగా నిస్సంకల్పుఁడని భావము, కామప్రియ = కామమునందు ప్రేమ గలవాఁడా! శివునకు ప్రియుఁడా అని యర్థాంతరము. కామ = సంకల్పస్వరూపుఁడా! విజ్ఞానులైన యోగీంద్రులచేతఁ గోరఁబడువాఁడా యని యర్థాంతరము. కామీ = కామము గలవాఁడా! క్షమారమా కాముక — క్షమా = భూదేవియందును, రమా = లక్ష్మీదేవియందును, కాముక = కోరిక గలవాఁడా! ఓర్పు నెడు సంపదయందు కోరిక గలవాఁడా అని యర్థాంతరము; కల్యాణగుణపరిపూర్ణుఁడని భావము. కామరూపీ = కోరినరూపములను ధరించువాఁడా! సర్వరూపధారి యనుట

తా. అభిలాషయొక్క పుట్టుటకు కారణ మయినవాఁడా! (సంకల్పాతీతుఁడా) కామక్రోధాది వికారములు లేనివాఁడా! సమస్తకోరికల నిచ్చువాఁడా! సత్యసంకల్పుఁడా! (సత్యవంతులైన యోగులచేత కోరఁబడువాఁడా) కామమును నశింపఁజేయువాఁడా! కామమునందు ప్రేమ గలవాఁడా! (శివునకు ప్రియుఁడా) సంకల్పస్వరూపుఁడా (విజ్ఞానులైన యోగీంద్రులచేత కోరఁబడువాఁడా! కామము గలవాఁడా! భూదేవియందును లక్ష్మీదేవియందును కోరిక గలవాఁడా! (ఓర్పు అనెడు సంపదయందు కోరిక గలవాఁడా) కోరినరూపములను ధరించువాఁడా! అని తాత్పర్యము.

ఉపజాతివృత్తలక్షణము॥ తా ఇంద్రవజ్ర మొకపాదమును, ఉపేంద్రవజ్ర మొకపాదమును చేర్చగా నుపజాతివృత్త మగును

విభూతివృత్తము. మోక్షలక్షణేక్షణా, మోక్షధర్మరక్షణా
మోక్షసౌఖ్యదాయకా, మోక్షరాజ్యనాయకా. ౨౫

టీక. మోక్షలక్షణేక్షణా—మోక్ష = ముక్తికి, లక్షణ = చిహ్న మయిన విజ్ఞానమే, ఈక్షణా = దృష్టిగాఁ గలవాఁడా—అనఁగా అంతరబాహ్యదృశ్యములు నేను గా నని వదలుట మోక్షము, అట్లు వదలుటకు సాధన మయిన అపరోక్షజ్ఞానమే దృష్టిగాఁ గలవాఁ డనుట, మోక్షధర్మరక్షణా—మోక్ష = ముక్తి యొక్క, ధర్మ = స్వభావము లైన వైరాగ్యబోధోపరతులను, రక్షణా = కాపాడినవాఁడా! మోక్ష సౌఖ్యదాయకా = అపవర్గానందము నిచ్చువాఁడా! మోక్షరాజ్యనాయకా = నిర్వాణ మనెడు దేశ మునకు ప్రభు వైనవాఁడా!

తా ముక్తిచిహ్న మయిన విజ్ఞానమే దృష్టిగాఁ గలవాఁడా! (అంతరబాహ్యదృశ్యములు నేను గా నని వదలుట మోక్షము, అట్లు వదలుటకు సాధన మయిన యపరోక్షజ్ఞాన మనెడి దృష్టి గలవాఁడా) ముక్తియొక్క స్వభావము లైన వైరాగ్యబోధోపరతులను కాపాడినవాఁడా! అపవర్గానందము నిచ్చువాఁడా! మోక్ష మనెడు దేశమునకు ప్రభు వైనవాఁడా! అని తాత్పర్యము.

విభూతివృత్తలక్షణము॥ ఇష్యతే ప్రజాంబులం । తవుఢ్య వంగ శారముజ । గ్రమిజ్ఞ గురుం డునట్టి వృత్తమ్ముగా విభూతియౌ. తా॥ ర జ గ గణములు విభూతివృత్తమునకు సంభవించును ననుట.

క. లక్ష్మీకర లక్ష్మీధర, లక్ష్మీముఖకుముదచంద్ర ! లక్ష్మీనాథా
లక్ష్మీనివాస విద్యాలక్ష్మీప్రదసత్కటాక్షలవలక్ష్మీశా. ౨౬

టీక. లక్ష్మీకర—లక్ష్మీ = సంపదను, కర = కలిగించువాఁడా! లక్ష్మీదేవిని పుట్టించినవాఁడా యని యర్థాం. లక్ష్మీధర= లక్ష్మీదేవిని వక్షఃస్థలమందు ధరించినవాఁడా! లక్ష్మీముఖకుముద చంద్ర—లక్ష్మీ ముఖ = లక్ష్మీదేవిముఖ మనెడు, కుముద = కలువపువ్వునకు, చంద్ర = చంద్రునివంటివాఁడా! లక్ష్మీ నాథా = లక్ష్మీదేవికి భర్తా! లక్ష్మీనివాస=లక్ష్మీదేవికి స్థాన మయినవాఁడా! విద్యాలక్ష్మీప్రదసత్కటాక్ష లవలక్ష్మీశా—విద్యా = బ్రహ్మజ్ఞాన మనెడు, లక్ష్మీ = సంపదను, ప్రద = ఇచ్చునట్టి, సత్ = శ్రేష్ఠ మయిన, కటాక్ష = కడగంటిచూపులయొక్క, లవ = లేశములయొక్క, లక్ష్మీ = సమృద్ధికి, ఈశా = ప్రభువా! ॥ని॥ 'లవో రామ సుతే లేశే విలాసే ఛేదనేపి చ । లవం హీంపదం లాముచ్చ స్యాత్' అని రత్నమాల

తా సంపదను కలిగించువాఁడా! (లక్ష్మీదేవిని పుట్టించినవాఁడా) లక్ష్మీదేవిని వక్షఃస్థలమునందు ధరించినవాఁడా! లక్ష్మీదేవియొక్క ముఖ మనెడు కలువపువ్వునకు చంద్రునివంటివాఁడా! లక్ష్మీదేవికి భర్తా! లక్ష్మీదేవికి స్థాన మయినవాఁడా! బ్రహ్మజ్ఞాన మనెడు సంపదను నిచ్చునట్టి శ్రేష్ఠ మయిన కటాక్షములయొక్క సమృద్ధికి ప్రభువా! అని తాత్పర్యము

మందాక్రాంతవృత్తము. సర్వాధారా సగుణవిగుణా ! సర్వభూతాధివాసా
సర్వాధ్యక్షా సకలవరదా ! సర్వవాగీశ్వరేశా

సర్వవ్యాపీ సదయహృదయా ॥ సర్వసర్వాంతరాత్మా
సర్వాతీతా సమరసమయా ॥ సచ్చిదానందరూపా. ౨౮

టీక. సర్వాధారా—సర్వ = ప్రణవరూపప్రపంచమునకు, ఆధారా = అధిష్ఠాన మయినవాఁడా! సగుణవిగుణా = సగుణనిర్గుణస్వరూపుఁడా! సర్వభూతాధివాసా—సర్వభూత = సమస్తప్రాణులకు, అధివాసా = నివాస మయినవాఁడా! సర్వప్రాణులయందును పంచభూతములయందును నివసించువాఁడని యర్థాంతరము. సర్వాధ్యక్షా = సర్వప్రపంచమునకు ప్రభువా! సకలవరదా = సకలాభీష్టముల నిచ్చువాఁడా! సర్వవాగీశ్వరేశా — సర్వవాక్ = ప్రణవశబ్దమందలి, ఈశ్వర = ప్రభువు లయిన బ్రహ్మవిష్ణురుద్రేశ్వరసదాశివులకు, ఈశా = ప్రభువా - లేక పరాపశ్యంతిమధ్యమావైఖరీవాక్కులకు ప్రభువైన అగ్నికి ప్రభువా! సర్వవ్యాపీ = అంతట నిండియుండువాఁడా! సదయహృదయా—సదయ = కృపాసహిత మయిన, హృదయా = అంతరంగము గలవాఁడా! సర్వసర్వాంతరాత్మా—సర్వ = సకలనామరూపములు గల, సర్వ = ప్రపంచమందు, అంతరాత్మా = అంతర్యామి యైనవాఁడా! సర్వాతీతా = సర్వప్రపంచాతీత మయినవాఁడా! సమరసమయా = అఖండరసైకస్వరూపుఁడా! సచ్చిదానందరూపా—సత్ = త్రికాలాబాధ్యత్వమును, చిత్ = విజ్ఞానమును, ఆనంద = దుఃఖనివృత్తిపూర్వకానందమును, రూపా = స్వరూపముగాఁ గలవాఁడా.

పరాపశ్యంతిమధ్యమావైఖరీవాక్కులవిభాగము.—శ్లో॥ పరావ్యక్తేషు సంజాతా పశ్యంతి భుజగేషు చ। మధ్యమా వై పశుష్వేవ వైఖరీ వర్ణరూపిణీ॥ తా॥ ఆకులు, పూవులు, కాయలు, పిందెలు, చిగుళ్ళు మొదలగువాని యుత్పాదనశక్తికి తాను హేతు వయి యుండియు దానిని వృక్షము తెలియని లాగున బ్రహ్మకారితవృత్తిరూపిణి యై సర్వజగత్కారణ మై యుండియు దానిని దెలియ నట్టి బ్రహ్మప్రణవమందలి అర్థమాత్రతురీయపాదాత్మకప్రవృత్తియే పరావాక్కనఁబడును; సర్పములకు వినుటకును, మాటలకును నేత్రమే కారణ మయినట్లు సకలపదార్థగ్రాహకయోగ్యమయి మహత్తత్త్వసంజ్ఞ గల బ్రహ్మప్రణవమందలి మకారాధ్యానందపాదాత్మకప్రథమస్ఫురణయే పశ్యంతివాక్కనఁబడును, పురుషప్రకృత్యాత్మక మగు అకారమకారములతోఁ గూడిన అమ్మా యనెడి శబ్దమును, పశువులు పలుకుచును ఆశబ్దార్థము తా మెఱుఁగనట్లు బ్రహ్మప్రణవమందలి ఉకారవిద్యాపాదాత్మకమహాదహంకారరూపవృత్తియే మధ్యమవాక్కనఁబడును; మాటలు వినఁబడినను వానియభిప్రాయ మెఱుఁగఁబడక యుండు దశకు మధ్యమవాక్కని ముఖ్యాభిప్రాయము, బ్రహ్మప్రణవమందలి అకారావిద్యాపాదరూప మయి పంచాశద్వర్ణరూపము గాఁ దాఁ బలికెడు సర్వశబ్దములును, వాని యర్థములును దెలియునట్లు సంపూర్ణముగా బహిర్ముఖ మగు వృత్తియే వైఖరీవాక్కనంబడును.

తా. ప్రణవరూపప్రపంచమునకు నాధార మయినవాఁడా! సగుణనిర్గుణస్వరూపుఁడా! సమస్తప్రాణులకును నివాస మైనవాఁడా! (సర్వప్రాణులయందును పంచభూతములయందును నివసించువాఁడా) సర్వప్రపంచమునకు ప్రభు వయినవాఁడా! సమస్త మైన అభిలాషలను నిచ్చువాఁడా! ప్రణవశబ్దమునకు ప్రభువు లైన బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వర సదాశివులకుఁ బ్రభు వైనవాఁడా! (పరాపశ్యంతి మధ్యమావైఖరీవాక్కులకు ప్రభు వయిన అగ్నికి ప్రభు వయినవాఁడా) అంతట నిండియుండువాఁడా! దయతోఁ గూడిన హృదయము గలవాఁడా! సకలనామరూపములు గల ప్రపంచమందు అంతర్యామి యైనవాఁడా! సమస్తప్రపంచమునకు అతీత మైనవాఁడా! అఖండరసైకస్వరూపుఁడా! త్రికాలములచేత అబాధ్యత్వమును విజ్ఞానమును దుఃఖనివృత్తిపూర్వకయానందమును స్వరూపముగాఁ గలవాఁడా! అని తా.

మందాక్రాంతవృత్తలక్షణము॥ మందాక్రాంత న్గిరిశవిగతు ల్మభ్నతా గాగణంబుల్। పొంద న్సాందీపునివలన సంపూర్ణవిద్యాచయంబుగ్। గ్రంథిం చందాగుణగణమునం గ్రందసాళ వ్యాసుంజే। యందెంజేరెం దశగురులకు నందాత్మజుం డెంచు జెప్పన్. తా॥ మ భ న త త గ గ గణములును, పది నొకండవయక్షరమున యతియును వుండవలయు ననుట

వ॰ అని వెండియు నిట్లనియె. ౨౮

టీక అని = అనిచెప్పి, వెండియుఙ్ = మగల, ఇట్లనియెఙ్ = ఇట్లు పలికెను

సీసదశకము —

ప్రకటపరాపర । ప్రకృతిమంతుండవు, మఱియు వశీకృత । మాయుఁడవును
సర్వజ్ఞుఁడవు సర్వ । శక్తియుక్తుండవు, సర్వకర్తవు సర్వ । జనకుఁడవును
సర్వరక్షకుఁడవు । సర్వసంహర్తవు, సర్వేశ్వరుండవు । సర్వగుఁడవు
సర్వగురుండవు । సర్వతోముఖుఁడవు, సర్వసాక్షివి సర్వ । సముఁడ వగుచు
తే. నిర్వికల్ప నిరంజన । నిర్వికార, నిర్గుణ బ్రహ్మ మైయున్న । నిను భజింతు
సంతతం బాత్మమయుత సాక్షాత్కరింపు, రామ రాఘవ శ్రీరామ । రామ రామ.

టీక ప్రకటపరాపరప్రకృతిమంతుండవు — ప్రకట = ప్రసిద్ధమయిన, పరా = పర యనెడు, అపర = అపర యనెడు, ప్రకృతిమంతుండవు = మూలప్రకృతి గలవాఁడవును, మఱియుఙ్ = వెండియు, వశీకృతమాయుఁడవును—వశీకృత = స్వాధీనము గాఁ జేయఁబడిన, మాయుఁడవును = సత్త్వగుణస్వరూప మయిన మాయ గలవాఁడవును, సర్వజ్ఞుఁడవు = సకలము నెఱిఁగినవాఁడవును, సర్వశక్తియుక్తుండవు = అనంతశక్తులు గలవాఁడవును, సర్వకర్తవు = సర్వాధికారము గలవాఁడవును, సర్వజనకుఁడవును = సకల ప్రాణికోట్లకు తండ్రివంటివాఁడవును - అనఁగా బ్రహ్మ వనుట, సర్వరక్షకుఁడవు = అఖిలజీవుల రక్షించు వాఁడవును-అనఁగా విష్ణుస్వరూపుఁడ వనుట, సర్వసంహర్తవు—సర్వప్రపంచమును నాశము చేయువాఁడవును- అనఁగా రుద్రమూర్తి వనుట, సర్వేశ్వరుండవు=అణిమాద్యష్టమహాసిద్ధులు గలవాఁడవును – ఈశ్వరస్వరూ పుఁడ వనుట, సర్వగుఁడవు = సర్వవ్యాపకుఁడవు – అనఁగా సదాశివమూర్తి వనుట సర్వగురుండవు = సర్వప్రపంచమునకు జ్ఞానోపదేష్టవును, సర్వతోముఖుఁడవు= ఎల్లయెడల నుండువాఁడవును, సర్వసాక్షివి= సర్వద్రష్టవును, సర్వసముఁడ వగుచుఙ్ = సమస్తప్రాణులయందు శత్రుమిత్రత్వములు లేనివాఁడవు నై, నిర్వికల్ప = మనోరహితుఁడవు గావున వికల్పములు లేనివాఁడవై, నిరంజన = సాధనాంతరగోచరుఁ డవై, నిర్వికార = అశరీరివి గనుక షడ్భావవికారశూన్యుఁడవై, నిర్గుణ = ప్రకృతిరహితుఁడవు గనుక త్రిగుణాతీతుఁడవై, బ్రహ్మమై = సచ్చిదానందస్వరూపుఁడవై, ఒప్పు నినుఙ్ = ప్రకాశించు నిన్ను, భజింతుఙ్ = సేవించుచున్నాను, సంతతంబు = ఎల్లప్పుడు, ఆత్మమయుతఙ్ = ప్రత్యగాత్మస్వరూపము చేత, సాక్షాత్కరింపుము = దర్శన మిమ్ము, రామ = సర్వశరీరులు నీయందును సర్వశరీరుల యందు నీవును క్రీడించువాఁడా! 'శ్లో॥ రమంతే యోగినో నంతే సత్యానందే చిదాత్మని। ఇతి రామ పదే నాసౌ పరబ్రహ్మాభిధీయతే' ఇట్లని శ్రీరామపూర్వతాపనీయోపనిషత్తునందు, లేక ప్రపంచసృష్టిస్థితి లయములే క్రీడలుగాఁ గలవాఁడా! రాఘవ = 'అఘం పాపం రాతి నాశయతీతి రాఘవః, గౌరవం తత్త్వ స్యం వహాతీతి రాఘవః, తస్య సంబుద్ధి రాఘవ' తా॥ అఘ మనఁగా పాపము, రాతి యనఁగా పాపమును నశింపఁజేయునది, దానిని వహించువాఁడు రాఘవుఁడు, అట్టిస్వరూపుఁడా! శ్రీరామ—శ్రీశబ్దవాచ్య మయిన

బ్రహ్మవిద్యతోఁ గూడి క్రీడించువాఁడా! రామ = ధీవృత్తికి సాక్షి యైన ప్రత్యగాత్మస్వరూపుఁడా! రామ = ప్రకృతి ప్రతిబింబము తత్సాక్షిత్వ మనెడు వృత్తిరహితుఁడా! అనఁగా ద్వైతవృత్తి, సాక్షివృత్తి, అఖండాకారవృత్తి అనెడు వృత్తులు లేనివాఁడా.

తా॥ ప్రసిద్ధ మయిన పర అనునట్టియు, అపర అనునట్టియు మూలప్రకృతి గలవాఁడవును, మఱియు స్వాధీనముగాఁ జేయఁబడిన త్రిగుణస్వరూప మయిన మాయ గలవాఁడవును, సర్వాధికారము గలవాఁడవును, సమస్తమును నతిక్రమించినవాఁడవును, అనంతశక్తులు గలవాఁడవును, సకలప్రాణికోట్లకు తండ్రివంటివాఁడవును, (బ్రహ్మ వనుట) ఆ జీవులను రక్షించువాఁడవును, (విష్ణుస్వరూపుఁడ వనుట) సర్వప్రపంచలయము చేయువాఁడవును, (రుద్రుఁడ వనుట) అణిమాద్యష్టమహాసిద్ధులు గలవాఁడవును, (ఈశ్వరస్వరూపుఁడ వనుట) సర్వవ్యాపకుఁడవును, (సదాశివమూర్తి వనుట) సర్వప్రపంచమునకు జ్ఞానోపదేష్టవును, సమస్తప్రదేశములయందుఁ గూడియుండువాఁడవును, సర్వమునకు సాక్షియును, సర్వప్రాణులయందు శత్రుత్వ మిత్రత్వములు లేనివాఁడవును, వికల్పములు లేనివాఁడవును, ఇతర సాధనములు కోరనివాఁడవును, శరీరము లేనందున షడ్భావవికారములు లేనివాఁడవును, ప్రకృతి లేనివాఁడవు గనుక త్రిగుణాతీతుఁడవును, సచ్చిదానందస్వరూపుఁడవును నై ప్రకాశించుచున్న నిన్ను సేవించుచున్నాను రామశబ్దముచేతను, రాఘవశబ్దముచేతను శ్రీరామశబ్దముచేతను, రామ రామ యనెడు రామశబ్దద్వయముచేతను వాచ్యుఁడ వైన యోరామమూర్తీ! ఎల్లప్పుడు నాదు ప్రత్యగాత్మస్వరూపముచేత దర్శన మిమ్మని తాత్పర్యము (రామ - సమస్తయోగులు నిరతియుంగును, ఇతరు సమస్తయోగులయందును క్రీడించుటం జేసి రాముఁ డనఁబడెను, ప్రపంచసృష్టిస్థితిలయములే క్రీడలుగాఁ గలిగినవాఁ డనుటచేతను రాముఁ డనఁబడెను, రాఘవ-అఘ మనఁగా పాపము, రాతి యనఁగా పాపము నశింపఁజేయుచున్నది, అట్టి కృత్యమును వహించువాఁడు గనుక యితనిని రాఘవుఁ డందురు, శ్రీరామ - శ్రీశబ్దవాచ్య మయిన బ్రహ్మవిద్యతోఁ గూడి క్రీడించుటంజేసి శ్రీరాముఁ డనఁబడెను, రామ - ధీవృత్తికి సాక్షి యైన ప్రత్యగాత్మస్వరూపుఁడు, రామ - ప్రకృతి ప్రతిబింబత్వము తత్సాక్షిత్వము అనెడు వృత్తులు లేనివాఁడు. (అనఁగా ద్వైతవృత్తి, సాక్షివృత్తి, అఖండాకారవృత్తి అనెడు వృత్తులు లేనివాఁడు)

సీ. విశ్వంబునం దేను వెలుఁగుచు నుండుదు, విశ్వంబు నాయందు వెలయు ననుచు
నరసి యుల్లాటయు వ్యతిరేకముగఁ జూచు, యుక్తి యే భవదీయయోగమాయ
యీ యోగదృష్టిచే నప్పుడు నిను నీవ, కనుఁగొంచు నంతతాఖండసచ్చి
దానందమయుఁడ వై యలరారు నీయుస్కిఁ, గంటి భవత్కటాక్షంబుచేత

తే. నైన నీకఁ నాక వర మిపు డగుగవలసె, గరిమ నీస్థితి నాస్థితి గా భజించు
నలలితాభేదదృష్టి నొసంగు మయ్య, రామ రాఘవ శ్రీరామ రామ రామ.

టీక. ఏను = పరబ్రహ్మ మయిన నేను, విశ్వంబునందుక్ = ప్రణవరూపప్రపంచమందు, వెలుఁగుచు నుండుదుక్ = ప్రకాశించుచుండుదును, విశ్వంబు = ఓంకారరూపప్రపంచము, నాయందుక్ = అస్మదర్థమందు, వెలయు ననుచుక్ = ప్రకాశించు నని, యుల్లాటయుక్ = తాను జగమందు జగము తనయందు వెలుఁగుచుండుటను, అరసి = యోచించి, వ్యతిరేకముగక్ = భిన్నముగా - అనఁగా తన్ను ప్రపంచమందును ప్రపంచము తనయందును లేనట్లుగా, చూచుయుక్తియే = వీక్షించునుపాయమే, భవదీయయోగమాయ - భవదీయ = నీసంబంధ మయిన, యోగమాయ = విద్యావిద్యాత్మకమూలప్రకృతి - అనఁగా విశ్వము స్వేతరము

గాదని భావము, ఈ దృగ్దృష్టిచేత = ఈ యభేదలక్ష్యముచేత, ఎప్పుడు = అవస్థాత్రయమందు, నినుక = పరబ్రహ్మ మయిన నిన్ను, నీవ = నీవే, కనుఁగొంచుఁ = దగ్గఱగఁ జూచుచు, సంతతాఖండసచ్చిదానందమయుఁడవై — సంతత = ఎడతెగని, అఖండ = విభాగింపఁబడని, సత్ - త్రికాలాబాధ్యమును, చిత్ = విజ్ఞానమును, ఆనంద = సంసారదుఃఖనివృత్తిపూర్వక మగు నానందమును, మయుఁడవై = స్వరూపముగాఁ గలవాఁడవై, అలరారునీయున్కి — అలరారు = ప్రకాశించుచున్న, నీ యున్కి = నీయద్వయస్థితిని, భవత్కటాక్షంబుచేతన్ = నీకృపాకటాక్షముచేత, కంటిన్ = తెలిసికొంటిని, వినన్ = అటుల దెలిసికొన్నను, ఇఁక = ఇఁకమీఁద, ఒకవరము = ఒక కోర్కెను, అడుగఁదలఁచితిన్ = ఇప్పు డడుగవలయును, గరిమన్ = గురుత్వముతోడి, నీస్థితిన్ = నీ యునికిని, నాస్థితి గాన్ = నా యునికిఁగాను, భజించు = ఉపాసింపఁదగిన, సలలిత = మనోజ్ఞ మయిన, అభేద=అభిన్న మయిన, దృష్టిన్ = లక్ష్యమును, ఒసంగుమయ్య = కటాక్షింపుమయ్యా, రామ రాఘవ శ్రీరామ రామ రామ.

తా. పరబ్రహ్మ మయిన నేను ప్రణవరూపప్రపంచముగఁ బ్రకాశింతును, ఓంకారరూపప్రపంచము నాయందుఁ బ్రకాశించును, ఇట్లు తాను జగమంతయు జగము తనయందును వెలుఁగుచుండుటను బోధించి తాను ప్రపంచమందును ప్రపంచము తనయందును లేనట్లు చూచుచుండుటయే నీసంబంధ మయిన యోగముద్రా యొక్క, (ప్రపంచము తనకంటె నితరము గాదనుట) ఇట్టి యభేదలక్ష్యముచేత అవస్థాత్రయమందును పరబ్రహ్మ మయిన నిన్ను నీవే చూచుచు నెడతెగనట్టిగ యుండి విభాగింపఁగూడనిదియు కాలత్రయముచేత బాధింపఁబడనిదియు నగు విజ్ఞానమును సంసారదుఃఖనివృత్తిపూర్వక మయిన యానందమును స్వరూపముగాఁ గలవాఁడవై ప్రకాశించు నీయద్వయస్థితిని నీకటాక్షముచేత దెలిసికొంటిని, అట్లు తెలిసికొన్నను యిఁకమీఁద నిపు డొకవర మడుగవలసియున్నది అది యెట్టి దనిన, గురుత్వముతోడి నీయునికిని నా యునికిఁగా నుపాసింపఁదగినదియును, మనోజ్ఞ మయినదియును, అభిన్న మయినదియు నగు లక్ష్యమును (దృష్టిని) కోరుచుంటిని, అట్టి వరమును కటాక్షింపుమయ్యా రామ రాఘవా యని తాత్పర్యము.

సీ. నారాయణియును వైష్ణవియును దేవియుఁ, ద్రిగుణాత్మికయుఁ బ్రకృతియు ననంగ
నలరు భవచ్ఛక్తి యపరాప్రకృతిపరా, ప్రకృతినా ద్వివిధ మైపరఁగు నందుఁ
దతచతుర్వింశతితత్త్వరూపిణి యైన, యపర యే దైవియు నాసురియును
నన రెండుదెఱఁగుల నమరు నాదైవియె, విద్యయు మాయ యవిద్య గాన

తే. నాసురి యవిద్య యా రెంటి నంటి యీవ, యీశ జీవాత్మసంజ్ఞల నెసఁగు దంత
గలిగి యవికారుఁడవు నీవి గాంచుకతన, రామ రాఘవ శ్రీరామ రామ రామ.

టీక. నారాయణియును = నారాయణి యనియును, వైష్ణవియును=వైష్ణవి యనియును, దేవియున్ = దేవి యనియును, త్రిగుణాత్మికయున్ = త్రిగుణాత్మిక యనియును, ప్రకృతియు ననంగన్=ప్రకృతి యనియును, అలరు = ఒప్పుచుండెడు, భవత్ = నీయొక్క, శక్తి = ప్రభావము, అపరాప్రకృతిపరాప్రకృతినాన్ = అపరాప్రకృతి పరాప్రకృతి యనునట్లు, ద్వివిధమై=రెండువిధములు గలదై, పరఁగున్=ఒప్పును, అందున్ = ఆ పరాపరప్రకృతిద్వయమందు, తతచతుర్వింశతితత్త్వరూపిణి—తత=విస్తారము గలిగిన, చతుర్వింశతితత్త్వ= పంచమహాభూతములు అహంకారము బుద్ధి అవ్యక్తము ఏకాదశేంద్రియములు, పంచతన్మాత్రలు నిడి యిరువదినాలుగుతత్త్వములే, స్వరూపిణి = ఆకృతిగాఁ గలది, ఐన యపరయే = ఐన యపరాప్రకృతియే, దైవియున్ = దైవియును, ఆసురియును = ఆసురియును, అనన్ = అనునట్లు, రెండుదెఱఁగులన్ =

రెండువిధములుగా, అమరుక = ఒప్పును, ఆదైవియు = పైఁ జెప్పఁబడిన వుభయప్రకృతులలో దైవీనామక ప్రకృతియే, విమలగానక = శుద్ధసత్త్వప్రధాన మయినది గనుక, విద్యయుక్ = విద్య యనెడు, మాయయుక్ = మాయ యనెడు పేర్లు గలది, ఔక్ = అగును-అనఁగా చతుర్వింశతితత్త్వస్వరూపిణి యైన అపరాప్రకృతి దైవి ఆసురి అనెడు పేర్లు గలది యగును, ఆరెంటిలో దైవి అనునది శుద్ధసత్త్వప్రధాన మయినది గనుక విద్య మాయ అనెడు నామము గల దనుటం, ఆసురి = మలినసత్త్వప్రధాన మయిన ఆసురీనామకప్రకృతి, అవిద్యా = అజ్ఞానమే రూపముగాఁ గలది, ఆ రెంటిక్ = ఆ విద్యామాయలను, అంటి పొంది, ఈవ = నీవే, ఈశజీవాత్మసంజ్ఞలక్ — ఈశ = మాయాసంబంధముచేత నీశ్వరుండనెడు, జీవాత్మ = అవిద్యాసంసర్గముచేత జీవుఁ డనెడు, సంజ్ఞలక్ = పేర్లచేత, ఎసఁగుదువు = ఒప్పుదువు, అంత గలిగి = సమస్తమును గలవాఁడవై-అనఁగా విద్యావిద్యారూపకప్రకృతిసంబంధముచేత నీశ్వర జీవసంజ్ఞలను, సమష్టి వ్యష్టి జాగ్రత్స్వప్న సుషుప్తులను, సర్వజ్ఞత్వ కించిజ్జ్ఞత్వాదులను గలవాఁడవై, వీనిక్ = ఈ ప్రకృతులను యీజీవేశ్వరులను, కాంచుకతనక్ = సాక్షివై చూచుచుండుటవలన, అవికారుఁడవు = షడ్భావవికారములు లేనివాఁడవు, రామ రాఘవ శ్రీరామ రామ రామ

తా. నారాయణి యనియును, వైష్ణవి యనియును, దేవి యనియును, త్రిగుణాత్మిక యనియును, ప్రకృతి యనియును చెప్పఁబడు నీయొక్క ప్రభావము అపరాప్రకృతి యనియు, పరాప్రకృతి యనియు రెండువిధములు గలదై ప్రకాశించుచుండును, ఆ పరాపరప్రకృతిద్వయమందు చతుర్వింశతితత్త్వస్వరూపిణి యైన అపరాప్రకృతి దైవి యనియును, ఆసురి యనియును చెప్పఁబడును; ఆరెంటిలో దైవి యనునది శుద్ధసత్త్వప్రధానమైనది గనుక విద్య యనియును, మాయ యనియును చెప్పఁబడుచున్నది, మలినసత్త్వప్రధానమైన ఆసురి అను ప్రకృతి అజ్ఞానమే రూపముగాఁ గలది, ఆ విద్యామాయలను పొంది నీవే మాయాసంబంధముచే నీశ్వరుఁ డనునట్టియు, అవిద్యాసంసర్గముచేత జీవుఁడనునట్టియు పేర్లచేత నొప్పుదువు, విద్యావిద్యారూపము గల ప్రకృతిసంబంధముచేత నీశ్వరజీవసంజ్ఞలను, సమష్టివ్యష్టిజాగ్రత్స్వప్నసుషుప్తులను, సర్వజ్ఞత్వకించిజ్జ్ఞత్వాదులను గలవాఁడవై ఈ ప్రకృతులను యీ జీవేశ్వరులను సాక్షివై చూచుచుండుటవలన షడ్భావవికారములు లేని వాఁడవయ్యా రామ రాఘవా యని తాత్పర్యము.

సీ. అపరాప్రకృత్యవిద్యాక్షరక్షేత్రప, దాదిశబ్దైకవాచ్యాత్మశక్తి
సన్నిధానజపరస్పరపరచ్ఛాయాప్ర, సక్తిచే మిథ్యాభియుక్తిచేత
నది పరాప్రకృతివిద్యాక్షరక్షేత్రజ్ఞ, సత్పురుషాదికసంజ్ఞ నొప్పు
నేన తద్ద్వయమున నీశ్వరాకారాసంగ, సాక్షివై విలసిల్లుచుంద మెఱఁగి
తే. రమణ ద్రష్టృత్వనిర్వికారత్వసాక్షి, తాదివిద్యోక్తధర్మజాతమును దొంటి
పగిదిఁ గడఁగాంచి నిజరూపము భజింతు, రామ రాఘవ శ్రీరామ రామ రామ.

టీక. అపరాప్రకృతి = అపరాప్రకృతి యనెడు, అవిద్యా = అవిద్య యనెడు, క్షర = క్షర మనెడు, క్షేత్ర = క్షేత్ర మనెడు, పద = పద మనెడు, ఆది = మొదలైన, శబ్ద = శబ్దములచేత, ఏక = ముఖ్యముగా, వాచ్య = పలుకఁదగిన, ఆత్మశక్తి = ప్రకృతియొక్క, సన్నిధాన = సమీపమున నుండుటవలన, జ = పుట్టిన, పరస్పర = ఒకటొకటియొక్క - అనఁగా బ్రహ్మప్రకృతులయొక్క, పర = శ్రేష్ఠములైన, ఛాయా = ప్రతిబింబములయొక్క, ప్రసక్తిచేత = కూడుటచేతనైన, మిథ్యాభియుక్తిచేతక్ = మిథ్యాతాదాత్మ్యముచేత, అది = ఆ ప్రకృతియే, పరాప్రకృతి = పరాప్రకృతి యనెడు, విద్యా = విద్య యనెడు,

త్తైశ్వర్యమును, అనంతవీర్యము = మహోత్కృష్టత్వ మహాభోక్తృత్వ మహాత్యాగిత్వా ద్యపరిమితప్రభావమును, అమితయశంబు = మితములేని కీర్తియును, సమగ్రలక్ష్మియుక్ = సంపూర్ణ మయిన మోక్షసంపదయును, కలిగి = గూడి, సంపూర్ణ కారుణ్యశమదమములు—సంపూర్ణ = సమగ్ర మయిన, కారుణ్య = కృపయును, శమ = అంతరింద్రియనిగ్రహమును, దమములు = బాహ్యేంద్రియనిగ్రహమును, మహనీయ తేజంబు— మహనీయ = గొప్పది యయిన, తేజంబు = సూర్యచంద్రాగ్ని కాంతులను మీఱిన తేజస్సును, మహిత = గణనీయ మయిన, తపః = త్రివిధతపస్సును, సత్య=బ్రహ్మము సత్య మనుట యును, శౌచ=అంతర బాహ్యపరిశుద్ధియును, స్థైర్య = ధీరత్వమును, క్షమా = ద్వంద్వసహనమును, ఆర్జవ = ఋజుభావమును, గుణంబులు = ఇవి మొదలగుగుణములు, స్ఫురత్ = తేజరిల్లు చుండఁగా, నిజ = తనయొక్క, దివ్య= అప్రాకృత మయిన, గుణాగ = శివజీవైక్య కారణ మయిన, మాయా = కారణోపాధి యైన, మహాశక్తి = చిచ్ఛక్తి, సర్వప్రపంచంబుల్ = చతుర్వింశతితత్త్వరూప మయిన జగత్తును, తీర్పక్ = పాలింపఁగా, సత్ = సల్లక్షణము, చిత్ = చిల్లక్షణము, ఆనందలక్షణ= ఆనందలక్షణము, (వినిచేత) సగుణ= త్రిగుణాత్మకప్రకృతితోఁ గూడిన, నిర్గుణ = ప్రకృతితో గూడని, ఆత్మక= స్వరూపము గల, బ్రహ్మ మైన = పరమాత్మ వైన, నీవు = నీవు, సంగతము = ఎల్లప్పుడు, ఆత్మమయతక్ = ప్రత్యగాత్మస్వరూపముచేత, అతి స్ఫుటముగక్ = లెస్సగా, సాక్షాత్క రింపుము = దర్శన మిమ్ము – అనఁగా అపరోక్షానుభూతి గలుగఁ జేయుము, రామ రాఘవ శ్రీరామ రామ రామ

తా. బ్రహ్మజ్ఞానము విమలముగాఁ గలిగిన విరక్తిని, ప్రకాశించు చున్న బ్రహ్మజ్ఞానమును, సాటిలేని సద్రూప చిద్రూప ఆనంద నిత్యపరిపూర్ణములగు నైదు చిహ్నములచేఁ గూడఁదగిన ఐశ్వర్యమును, మహోత్కృష్టత్వ మహాభోక్తృత్వ మహాత్యాగిత్వా ద్యపరిమితప్రభావమును, అమిత మయిన కీర్తిని, సంపూర్ణ మయిన మోక్షసంపదను గలిగి సమగ్ర మయిన కృప, అంతర్బాహ్యేంద్రియములనిగ్రహము, సూర్యచంద్రాగ్ని కాంతులను మీఱిన గొప్పతేజస్సు, మనోజ్ఞ మగు మూఁడువిధముల తపస్సు, బ్రహ్మము సత్య మనుట, అంతర్బాహ్యపరిశుద్ధి, స్థైర్యము, ద్వంద్వసహనము, ఋజుభావము అను నవియే మొదలుగాఁ గల గుణములచేఁ బ్రకాశించు చుండఁగాను, శివజీవైక్యమునకు కారణ మైనట్టియు, కారణోపాధి యైనట్టియు, చతుర్వింశతితత్త్వరూప మైన ప్రపంచమును పాలింపగాను, సచ్చిదానంద లక్షణములు గలిగినట్టియు త్రిగుణాత్మకప్రకృతితోఁ గూడినట్టియు ప్రకృతితోఁ గూడనట్టియు స్వరూపము గల పరమాత్మ వైన నీవు యెల్లప్పుడు ప్రత్యగాత్మస్వరూపముచేత బాగుగా దర్శన మిమ్ము రామ రాఘవా యని తాత్పర్యము

సీ. ఘనమఠాకాశ మహాకాశాంశ మగుచు నాకాశంబునకు వేఱు గానివగిది
క్షరముఁ గూడి యక్షరుఁడన్న విలసిల్లు, నేను నీయంశంబు నిశ్చయంబ
యైన యనాద్యవిద్యాశక్తి గుణరాశి, నాయందు నారోపణముగఁ జేసి
జీవుఁడ నంచు సంసృతిఁ జెంది యుంటిని, నిందాఁక నది యిపు డెఱిఁగికొంటిఁ

తే. గాన వివరింప భేద మింతైనఁ గలుగ, దిట్టి విజ్ఞానసంపద నెల్లప్రొద్దు
చిత్తమునను బ్రకాశింపఁజేయు మయ్య, రామ రాఘవ శ్రీరామ రామ రామ.

టీక. ఘనమఠాకాశమ—ఘన = మేఘమండలి, మఠ = కుండయందలి, ఆకాశము = గగనము, ఆకాశాంశమ—మహాకాశ = మహాకాశముయొక్క, అంశము = భాగము, అగుచుక్ = ఐనదై, ఆకాశంబు

తలంచు నజ్ఞానమంతయున్ = ఎంచెడి అవివేకమంతయు, నీదయామయదృష్టిన్ = నీకృపతోఁ గూడిన చూపుచేత, పోయెడిన్ = నశించెను, ఆనందమయుండ నైతిన్ = బ్రహ్మానందస్వరూపుఁడ నైతిని, సంశయము లేదు గాని = అనుమానము లేదు గాని, ఈ సర్వరూప = ఈ జగత్తును, సమరస = అభిన్నమయిన, జ్ఞాన = వివేకముచేత, భావనా = బ్రహ్మేతరము గా దని తలంచుట, సంతతంబు = ఎల్లప్పుడు, కలుగన్ = లభించునట్లు, వరము = మెప్పును, ప్రసాదింపవలయున్ = అనుగ్రహింపవలయును, రామ రాఘవ

తా॥ స్వామీ! నిన్ను వినా యితరమును నే నెన్నఁడును తెలిసికొనను, అది యెట్లంటేని నేఁ బొందిన సుఖమును గనుము, అనేకవిధము లయిన యింద్రియములకు ప్రపంచవిషయము (అనఁగా దృశ్యము) నీవు ఆ యింద్రియములకన్య మయిన త్రివిధపరిచ్ఛేదరహితస్వరూపుఁడ వగుటవలన నిన్నుఁ బరిశీలింపం బనిలేదు గనుక నీవు ప్రపంచరూపముగ నాకు ప్రసన్నమయితివి, ఈ ప్రపంచమంతయు నీకంటె నన్యమని తలంచు నవివేకమంతయు నీ కృపాదృష్టిచేత నశించె, అట్లగుటచేత బ్రహ్మానందస్వరూపుఁడ నయితిని, ఇందుకు సంశయమును గాని అనుమానమును గాని లేదు ఈ సర్వప్రపంచము బ్రహ్మేతరము గా దని యెల్లప్పుడు తలంచు వివేకము నాకు లభించునట్లు ప్రసాదింపవయ్యా రామ రాఘవా యని తాత్పర్యము

సీ. తతచతుర్వింశతితత్త్వనాయకుఁడవు, పంచవింశకుఁడవు ప్రకృతికంటెఁ
బరుఁడవు గురుఁడవు పరమేశ్వరుండవు, పురుషోత్తముండవు నెప్పుడుఁ బ్రధాన
పురుషేశ్వరుండవు పూర్ణుండ వనుచు ని, న్నెఱిఁగితి గాని యీయెఱుక దృఢము
గా నిల్వ దజ్ఞానకార్యదేహాదికా, త్మధ్యానసంతతాభ్యాసవశత
తే. నట్లు గావునఁ గేవలాత్మాత్మయోగదృష్టి మనమున నెప్పుడుఁ దేజరిల్లఁ
భూరికృపచే ననుగ్రహింపుము పొసంగ, రామ రాఘవ శ్రీరామ రామ రామ.

టీక. తత = గొప్ప దైన, చతుర్వింశతితత్త్వ = ఇరువదినాలుగుతత్త్వములకు, నాయకుఁడవు = ప్రభుఁడవును, పంచవింశకుఁడవు = ఇరువదియైదవవాఁడ వైన జ్ఞాతవును, ప్రకృతికంటెన్ = పరాపరనామక ప్రకృతికంటె, పరుఁడవు = అతీతుఁడవును, 'శ్రు॥ పరాత్పరం పరిముచ్యంతి సర్వే' అని శ్రుతి గురుఁడవు = బ్రహ్మవును, పరమ = నిరతిశయ మయిన, ఈశ్వరుండవు = అణిమాది సకలైశ్వర్యములు గలవాఁడవును- అనఁగా శివుఁడ వనుట, పురుషోత్తముండవును- పురుష = జీవులలో, ఉత్తముఁడవు = శ్రేష్ఠుఁడవును- అనఁగా విష్ణుఁడ వనుట, ఎప్పుడు = త్రికాలములయందు, ప్రధాన = ప్రకృతికిని, పురుష = జీవునకును, ఈశ్వరుండవు = నియామకుఁడవును - అనఁగా పరబ్రహ్మ వనుట; పూర్ణుండవు = అఖండసచ్చిదానంద స్వరూపుఁడవును, అనుచున్ = అని, నిన్నెఱిఁగితిఁ గాని = నిన్ను నేఁ దెలిసికొంటిని గాని, ఈ యెఱుక = ఈ తెలివి, అజ్ఞాన = అవివేకముయొక్క, కార్య = కృత్యము లయిన, దేహాదిక = శరీరేంద్రియాదులు, ఆత్మ = నే నని, ధ్యాన = చింతనయందు, సంతత = ఎడతెగని, అభ్యాసవశతన్ = అలవాటుచేత, దృఢముగా = నిశ్చలముగా, నిల్వదు = ఉండదు, అట్లు గావునన్ = నిశ్చలముగ నిల్చియుండదు గనుక, కేవలాత్మాత్మయోగదృష్టి- కేవలాత్మ = పరబ్రహ్మముయొక్క, ఆత్మ = ప్రత్యగాత్మయొక్క, యోగ దృష్టి = ఐక్యజ్ఞానము, మనమునన్ = అంతరంగమందు, ఎప్పుడును = సార్వకాలమును, తేజరిల్లన్ = మిక్కిలి ప్రకాశించునట్లు, భూరికృపచేన్ = మిక్కుటమగు కరుణచేత, పొసంగన్ = లభ్యమగునట్లు, అనుగ్రహింపుము = ఉపదేశించుము, రామ రాఘవ శ్రీరామ రామ రామ.

తా॥ గొప్ప లగు నిరువదినాలుగుతత్త్వములకు ప్రభుఁడవును, ఇరువదియైదవవాఁడ వయిన జ్ఞాతవును, పరాపర మను పేరు గల ప్రకృతికంటె నితరుఁడవును, పరమేశ్వరుండవును, అణిమాద్యష్టసిద్ధులు గల

వాఁడవును, జీవులలో శ్రేష్ఠుఁడవును, త్రికాలములయందు ప్రకృతికిని సాక్షియును నియామకుఁడవును, పరిపూర్ణసచ్చిదానందస్వరూపుఁడవును అని నిన్నుఁ దెలిసికొంటిని గాని యీ జ్ఞానము అవివేకమునయొక్క కార్యము లయిన శరీరేంద్రియాదులు నేనని యెడఁగని అభ్యాసవశముచేత దృఢముగా నిల్వదు, కాఁబట్టి పరబ్రహ్మముయొక్కయు ప్రత్యగాత్మయొక్కయు ఐక్యజ్ఞానము మనస్సునందు సర్వకాలము ప్రకాశించునట్లు కృపతో ననుగ్రహింపుమయ్యా రామ రఘువర శ్రీరామ యని తెల్పెను

సీ. అజుఁడ వవ్యయుఁడవు నీ వాదినారాయణ, స్వామివి సాక్షివి సర్వమయుఁడ
వై యొప్పు నిన్ను మాయామానుషశరీర, ధరుఁడు కించిజ్జ్ఞుఁడు నరుఁ డటంచు
నజ్ఞానవశతమోహంబుచేఁ దలఁచితి, నిందాఁక నది క్షమియింపుము గొఱదు
సర్వజ్ఞ సర్వేశ సర్వభూతావాస, సర్వభూతాత్మక సర్వమూర్తి

తే. సర్వకర్మఫలాధ్యక్ష సర్వరూప, యని నుతించుచు మ్రొక్కెద ననవరతము
నెఱయ నామది నీయందు నిల్పఁ జేయుము, రామ రాఘవ శ్రీరామ రామ రామ.

టీక. ఈవు = నీవు, అజుఁడవు = పుట్టుక లేనివాఁడవు, అవ్యయుఁడవు = నాశనము లేనివాఁడవు, ఆదినారాయణస్వామివి — ఆది = ప్రకృతికి పూర్వము నుండెడు, నారాయణస్వామివి = పరబ్రహ్మవు, సాక్షివి = మధ్యస్థుఁడవు, సర్వమయుఁడవై = విశ్వరూపుఁడవై, ఒప్పు నిన్నున్ = ప్రకాశించు నిన్ను, మాయా = మాయచేతఁ గల్పిత మయిన, మానుషశరీర = మనుష్యదేహముయొక్క, ధరుఁడును = ధరించిన వాఁడును, కించిజ్జ్ఞుఁడును = అల్పజ్ఞానము గలవాఁడును, నరుఁడును = మనుష్యుఁడును, అటంచున్ = అని, అజ్ఞానవశతన్ = అవివేకమువలన, మోహంబుచేన్ = భ్రాంతిచేత, ఇందాఁకన్ = ఈ యపరోక్షజ్ఞానము గలిగెడువఱకు, తలఁచితిన్ = ఎంచితిని, అది = ఆ తలంపును, క్షమియింపుము గొఱదు = క్షమియించుము గొఱదు, సర్వజ్ఞ = సమస్తము నెఱిఁగినవాఁడా! సర్వేశ = సమస్తమునకు ప్రభువా! సర్వభూతావాస — సర్వభూత = చరస్థిరరూపములు గల సకలజీవులకు నీవును ఆ జీవులు నీకును, ఆవాస = స్థానముగాఁ గలవాఁడా! సర్వభూతాత్మక = ఆకాశాది సమస్తభూతస్వరూపుఁడా! సర్వమూర్తి = బ్రహ్మవిష్ణురుద్రాది స్వరూపుఁడా! సర్వకర్మఫలాధ్యక్ష — సర్వ = సకల మయిన, కర్మ = అగ్నిష్టోమము లోనగు నిత్యనైమిత్తిక కామ్య ప్రాయశ్చిత్తాది కర్మములయొక్క, ఫల = అనుభవమునకు, అధ్యక్ష = ప్రభువా! సర్వరూప = ప్రణవస్వరూపుఁడా! అని = ఇట్లని, అనవరతము = ఎల్లప్పుడు, నుతించుచున్ = కొనియాడుచు, మ్రొక్కెదన్ = నమస్కరించెదను, నెఱయన్ = సంపూర్ణముగా, నామది = నామనస్సు, నీయందున్ = నీలోపల, నిల్పఁ జేయుము = నిల్చునట్లుచేయుము, రామ రాఘవ శ్రీరామ రామ రామ

తా. పుట్టుక లేనివాఁడవును, నాశము లేనివాఁడవును, ఆదిప్రకృతికి పూర్వము నుండెడు నారాయణుఁడవును, సాక్షియును, విశ్వరూపుఁడవును నై ప్రకాశించుచున్న మాయచేత కల్పితమయిన మనుష్యశరీరము గలవాఁడును, అజ్ఞానము గలవాఁడును, మనుష్యుఁడును నై యున్నావని అవివేకమువలనఁ గలిగిన భ్రాంతిచేత నీ యపరోక్షజ్ఞానము గలిగెడువఱకు నెంచితిని, ఇట్లు తలఁచుట క్షమియించుము గొఱదు సమస్తము నెఱిఁగినవాఁడా! సమస్తమునకు ప్రభువా! నీవు సకలజీవులను సకలజీవులకు నీవును స్థానముగాఁ గలవాఁడా! ఆకాశాది సమస్తభూతస్వరూపుఁడా! బ్రహ్మవిష్ణురుద్రాది స్వరూపుఁడా! సర్వకర్మలయొక్క ఫలములకు ప్రభు వయినవాఁడా! ప్రణవస్వరూపుఁడా! యని కొనియాడుచు నమస్కరించెదను, సంపూర్ణముగా నామనస్సు నీయందు నిల్చునట్లు చేయుమయ్యా రామ రాఘవ శ్రీరామ యని తా.

సీ. అతతచతుర్వింశతితత్త్వాత్మకం బగు, నురవు నేఁ గాను నిక్కముగ నరయఁ
దత్కృతంబులు మత్కృతంబులుగావు కావున సర్వధర్మములు త్యజించి
యక్షరపురుషుండనైన క్షరాక్షరతత్త్వములమీఱి పురుషోత్తముండు నాత్మఁ
డన నొప్పు నీకని నిన్నాశ్రయించెద శరణముగ నే నొగి ననన్యత్వ మలర

తే. నట్లగుట నింక నేసంశయములు నన్నుఁ, బొరయకుండంగఁ జేసి యీపూర్ణబోధ
మతిదృఢంబుగ వర మిమ్ము సతతమాత్మ, రామ రాఘవ శ్రీరామ రామ రామ

టీక. అతత = అతిశయము నగుచున్న, చతుర్వింశతితత్త్వ = ఇరువదినాలుగుతత్త్వములే, ఆత్మకంబు = స్వరూపముగాఁ గలిగి, అగు ఉరవు = అగు శరీరము, నిక్కముగన్ = సత్యముగా, నేఁ గాను = నేను గాను, అరయన్ = విచారింపఁగా, తత్కృతంబులు = ఆ దేహవ్యాపారములు, మత్కృతంబులు గావు = నాచేతఁ జేయఁబడినవి కావు, కావున = కనుక, సర్వధర్మములు = చతుర్దశేంద్రియవ్యాపారములు, త్యజించి = వదలి, అక్షరపురుషుండనైన = జ్ఞాతనైన, క్షరాక్షరతత్త్వములన్ = దేహమును దేహిని, మీఱి = అతిక్రమించి, పురుషోత్తముండును = బ్రహ్మస్వరూపుఁడును, ఆత్ముఁడు = ప్రత్యగాత్ముఁడు, అనన్ = అనునట్లు, ఒప్పు నీకని నిన్నున్ = విలసిల్లు నద్వితీయుండవైన నిన్ను, నేన్ = నేను, ఒగిన్ = లెస్సగా, శరణముగన్ = గతియంచుఁ దలఁచి, ఆశ్రయించెదన్ = సేవించెదను, అట్లగుటన్ = అట్లాశ్రయించుచున్నాను గనుక, అనన్యత్వము = వేఱుపాటు లేమి, అలరన్ = ఒప్పునట్లును - అనఁగా భేదభావము తోఁచక యుండునట్లును, ఇంకన్ = ఇఁకమీఁద, ఏ సంశయములు = ఏ యనుమానములు, నన్నుఁ బొరయకుండంగఁ జేసి = నన్ను స్పృశింపక యుండఁ జేసి, సంతతమున్ = ఎల్లప్పుడు, ఆత్మన్ = మనస్సునందు, ఈ పూర్ణబోధము = ఈ అఖండజ్ఞానము, అతిదృఢంబుగన్ = అత్యంతనిశ్చలముగా నిల్చునట్లుగా, వర మిమ్ము = మీ రొసంగుము, రామ రాఘవ శ్రీరామ రామ రామ

తా. ఆలోచింపఁగా వాస్తవముగా నిరువదినాలుగుతత్త్వములే స్వరూపముగాఁ గల శరీరము నేను గాను, మఱియు నా దేహవ్యాపారములు నావ్యాపారములును గావు, అట్లగుటవలనఁ జతుర్దశేంద్రియవ్యాపారములను వదలి జ్ఞాతనైన దేహమును దేహిని అతిక్రమించి బ్రహ్మస్వరూపుఁడు ప్రత్యగాత్ముఁడు అను పేళ్లచేఁ బ్రకాశించు నద్వితీయుండవైన నిన్ను నాయొక్కసంరక్షణార్థంబు ప్రార్థించుచున్నాను, అట్లు నిన్నాశ్రయించుటవలన భేదభావము తోఁచక యుండునట్లును ఏలాటిసంశయములు నన్నంటక యుండునట్లును చేసి సర్వదా యీ యఖండజ్ఞానము మనస్సునందు నిశ్చలముగా నుండునట్లు వర మొసంగుము, రామ రాఘవ శ్రీరామ రామ రామ యని తాత్పర్యము.

వ. అని యిట్లఖండపాండిత్యంబుచేతఁ బెక్కుభంగుల వినుతించు హనుమంతుని సాద రంబుగాఁ గరుణాకటాక్షవీక్షణంబుచేతఁ గనుంగొని భూరిప్రేమధాముండుఁ బరంధాముండు నైన యాత్మారాముం డిట్లనియె 38

టీక. అని యిట్లు = అని యీ చొప్పున, అఖండపాండిత్యంబుచేతన్—అఖండ = కొఱఁతలేని, పాండిత్యంబుచేతన్ = విద్యాప్రౌఢిమచేత, పెక్కుభంగులన్ = అనేకవిధములుగా, వినుతించు హనుమంతునిన్ = పొగడుచున్న యాంజనేయుని, సాదరంబుగాన్ = ఆదరణతోడ, కరుణాకటాక్షవీక్షణంబుచేతన్ = దయతోఁ గూడిన కడగంటిచూపుచేత, కనుంగొని = చూచి, భూరిప్రేమధాముండును—

తా. క్రమ శేక సప్తసముద్రములను యీ గట్టునుండి యా గట్టునకు ఆ గట్టునుండి యీ గట్టునకు సులభముగ నీదవచ్చును, సప్తకులపర్వతములను అచ్చనగాయలుగా చేత పట్టుకొని యాడవచ్చును, (పర్వతములను గుండ్లుగ గిరగ త్రిప్పవచ్చును) ఆకాశమును మ్రింగవచ్చును గాని యాలోచించి చూడఁగా యెవరికైనను యీ యమనస్కయోగము తెలిసికొనరాదని (అనఁగా బహుకష్టతర మని) తాత్పర్యము

భూతిలకవృత్తము. కావున నయ్యమనస్కయోగము గాఢదుర్లభ మారయన్
కేవలతత్త్వవిచారము బరికింప నేరనివారికిన్
భావమునంగున నాత్మనాత్మని బాగుగా విభజించు మే
ధావికి నిత్యసుఖంబుగా విశదంబుగా సులభం బగున్. ౮౨

టీక. కావునన్ = గ్రహించుటకు కష్టతర మయినది కనుక, అయ్యమనస్కయోగము = ఆ మనోన్మనీయోగము, ఆరయన్ = విచారింపఁగా, కేవలతత్త్వవిచారమున్ — కేవల = ముఖ్య మయిన, తత్త్వవిచారమున్ = బ్రహ్మవిచారమును, పరికింప నేరనివారికిన్ = పరిశీలింపఁ దెలియనివారికి, గాఢదుర్లభము = మిక్కిలి శ్రమచేతనైనను పొందరానిది, భావమునంగున్ = తలంపునందు, అనాత్మన్ = ప్రకృతిని, ఆత్మనిన్ = పరబ్రహ్మమును, బాగుగాన్ = లస్సగా, విభజించుమేధావికిన్ — విభజించు = వేఱుపఱచెడి, మేధావికిన్ = జ్ఞానము గలవానికి, నిత్యసుఖంబుగాన్ — నిత్య = శాశ్వత మయిన, సుఖంబుగాన్ = సౌఖ్యప్రదముగా, విశదంబుగాన్ = విస్పష్టముగా, సులభం బగున్ = పొందఁదగినది యగును

తా. బ్రహ్మవేత్తలకే గ్రహించుటకు కష్ట మయిన యీ యమనస్కయోగము బ్రహ్మవిచారము లేనివారి కెట్లు లభ్య మగును, (అనఁగా లభింపదనుట) భావమునందు ప్రకృతిని పరమాత్మను చక్కఁగా దెలిసికొను జ్ఞానవంతునకు శాశ్వతసౌఖ్యప్రద మయిన యీ యమనస్కరాజయోగము సులభముగా బొందఁదగును, అని తాత్పర్యము

భూతిలకవృత్తలక్షణము॥ భానసాగర గణంబులం బొలుపొంద భాను విరామమై । స్ఫారరతి భూతిలకంబు పొందనపుత్కృదితంబు ప్రతిమిం । సాగరధరిత్రికిఁ దెచ్చిపెట్టి మహాత్ములయంచుఁ గవీశ్వరుల్ । చారుపదంబులు గూర్చి చెప్పిన భూతిలకమ్మగు వినువారికిన్ తా॥ భ భ ర స జ జ గ గణములును, పండ్రెండింట యతియును వుండవలయు ననుట

తోదకవృత్తము. చెలువుగఁ బువ్వులఁ జీటుటకంటెన్
బోలుపుగఁ గన్నవ మూయుటకంటెన్
నలువగు నీయమనస్కపదంబే
సులభము సౌఖ్యము సూక్ష్మము వత్సా. ౮౩

టీక. వత్సా = వానుఱుంటుఁడా! చెలువుగన్ = బాగుగా, పువ్వులు చీటుటకంటెన్ = పుష్పములు గోయుటకంటెను, బోలుపుగన్ = చక్కఁగా, కన్నవన్ = కన్నులజంటను, మూయుటకంటెన్ = మొగుడ్చుటకంటెను, నలువగు = మనోజ్ఞ మయిన, ఈ యమనస్కపదంబే = ఈ రాజయోగమార్గమే, సులభము = అనాయాసముగాఁ బొందఁదగినది, సౌఖ్యము = సుఖమును గలుగఁజేయునది, సూక్ష్మము = లఘుతర మయినది— అనఁగా నాత్మానాత్మవివేకము గలవారల కమనస్కయోగ మత్యంతసులభ మయినదని భావము

వదియును, ముఖ్య మయినట్టిదియును, నిశ్చల మయినట్టిదియును, బ్రహ్మనిష్ఠ మైనదియును నై యున్న దని తాత్పర్యము.

తరలలక్షణము॥ ప్రవరరుద్ర విరామయుక్తి నభంబులు గ్రసజాగముల్ । గని శాస్త్రము పొందియందము గా మహీస్థలం బగుకాఁ. తా॥ న భ ర స జ గ గ గణములు ఎని మిదింటికి యతియుండవలయు ననుట

క్రౌంచపదవృత్తము —

సారపదార్థం బారయుచుం డా సకలనిగమములు చదివిన నైనన్
జారువిశిష్టాచారఘనుండై జపములు తపములు సలిపిన నైనన్
స్ఫారసమస్తోదారసుతీర్థాచరణము లనిశము జరిపిన నైనన్
గారవముం జేకూఱఁగ నీయోగజపరమసుఖము గలుగదు వత్సా. ౪౮

టీక. వత్సా = కుమారా! సారపదార్థంబు—సార=స్థిరాంశ మయిన, పద=వాక్యములందలి, అర్థంబు = అభిప్రాయమును, అరయుచున్ = విచారించుచు, తాన్ = తాను, సకలనిగమములు = అన్ని వేదములు, చదివిన నైనన్ = పఠించినప్పటికిని, చారు = ఒప్పిదము లైన, విశిష్ట=శ్రేష్ఠము లైన, ఆచార=నియమములచేత, ఘనుండై = ప్రసిద్ధుఁడై, జపములు = అజపాగాయత్ర్యాది మంత్రజపములను, తపములు=కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సులను, సలిపిన నైనన్ = చేసినను, స్ఫార = ప్రసిద్ధము లైన, సమస్త = సకలము లైన, ఉదార = గంభీరము లైన, సుతీర్థాచరణములు = పుణ్యతీర్థయాత్రలను, అనిశము = ఎల్లప్పుడు, జరిపిన నైనన్ = చేసినను, గారవమున్ = గౌరవము, చేకూఱఁగన్ = లభించునట్లుగా, ఈ యోగజపరమ సుఖము—ఈయోగజ = ఈ యమనస్కయోగమువలన పుట్టిన, పరమ = నిరతిశయ మయిన, సుఖము = బ్రహ్మానందము, కలుగదు = లభింపదు.

క్రౌంచపదవృత్తలక్షణము॥ పంచమకేశం డిచ్చినభాస్వద్గమునసునమున నియతము గూరన్ । దంతనతో బాణాసురుహస్త్రవజములు దరిగను నడి వారి యంగుడ । క్రౌంగిరిగీలసుతసుతనందిప్రకటితవిగతులు భమసభనాన్యల్ । క్రౌంచపదివృత్తమ్మగు నెన్నఁగఁగఁ గలుగు విరతిగ నిదుగు నెల్లన్. తా॥ భ మ స భ న న న య గణములును, ప్రతిపాదంబున పదునొకండింటను అవల ఇరువదింటను యతులు నుండవలయు ననుట.

తా వత్సా! ఆంజనేయా! స్థిరాంశ మైన వాక్యములయందలి యభిప్రాయమును విచారించుచు సమస్తవేదములు పఠించినను యొప్పిదము లైనట్టియు శ్రేష్ఠము లైనట్టియు నియమములచేత అజపాగాయత్ర్యాదిజపములను చేసినను మఱియు కృచ్ఛ్రచాంద్రాయణాది తపములను చేసినను సమస్తగంభీరము లైన పుణ్యతీర్థయాత్రల నెల్లప్పుడు చేసినను గౌరవము గలుగునట్లుగా నీ యమనస్కయోగమువలనఁ బుట్టిన నిరతిశయ మయిన బ్రహ్మానందము కలుగనేరదని తాత్పర్యము.

తే. అట్లు గావునఁ బరమరహస్య మైన, విలసదమనస్కయోగంబు వివరించి
నీ కెఱింగింతు విమలవివేకయుక్త, సూక్ష్మదృష్టిని గను మహీసురవరుఁగను. ౪౯

టీక అట్లు గావునన్=అటుల బ్రహ్మానందము లభింపదు గనుక, పరమరహస్య మయిన=అతిగోప్య మయిన, విలసత్ = వెలుఁగుచున్న, అమనస్కయోగంబు = రాజయోగమును, వివరించి = వివరించి, నీకున్ = నీకును, ఎఱింగింతున్ = తెలియఁబఱచెదను, విమల = పావన మైన, వివేకయుక్త =

యజ్ఞానంబు మాయయు ననం దనరు నట్టి మానసంబు లేమియ యమనస్కం బ ట్లగుటం జేసి. ౫౩

టీక. వెండియును = వెండియును, అస్వాంతంబు = ఆమనస్సు, కార్యాకారంబై = ప్రపంచరూపమై, సంకల్పంబు = సంకల్పమని, సంసారంబు = సంసారమని, సర్వవాసనామయంబు = సకలవాసనారూప మయిన దని, బంధమోక్షంబును = బంధమోక్షస్వరూప మయిన దని, అనన్ = అనునట్లు, ఒప్పున్ = రాణించును, నానాకారంగం గై = సమష్టిరూపమై, అవిద్యయున్ = అవిద్య, ప్రకృతియున్ = ప్రకృతి, అజ్ఞానంబును = అజ్ఞానము, మాయయున్ = మాయ, అనం దనరున్ = అనెడు పేర్లచేత నొప్పును, అట్టి మానసంబు = కార్యకారణరూప మయిన యామనస్సు, లేమియ = లేకపోవుటయే, అమనస్కంబు = అమనస్కయోగము, అట్లగుటం జేసి = అట్లమనస్కయోగ మయినందున

తా. ఆ మనస్సు ప్రపంచరూపమై సంకల్ప మనియును, సంసార మనియును, సకలవాసనారూప మయిన దనియును, బంధమోక్షస్వరూప మైన దనియును చెప్పఁబడును, మఱియును సమష్టిరూప మై ప్రకృతి యనియును, అజ్ఞాన మనియును, అవిద్య యనియును, మాయ యనియును జెప్పఁబడును, అట్టి కార్యకారణరూప మయిన మనస్సు లేకపోవుటయే అమనస్కయోగ మనఁబడును, అట్లమనస్కయోగ మయినందున నని తాత్పర్యము (సీసపద్యముతో నన్వయము)

సీ. ఆరోపితభుజంగ మమరఁ గన్పట్టునే, స్ఫురదధిష్ఠానరజ్జువును గనిన
నారోపితమనుష్యుఁ డలరఁ జూపట్టునే, భువి నధిష్ఠానదారువును గనిన
నారోపితోదకం బరయంగఁ దోఁచునే, కనదధిష్ఠానార్కకరముఁ గనిన
నారోపితాచ్ఛరౌప్యము లక్ష్య మగునె యధిష్ఠాన మైన శుక్తికను గనినఁ
తే. దలఁప నారోపితాసితత్త్వంబు మరలఁ
గాన నగునె యధిష్ఠానఖంబు గనినఁ
దెలియ నారోపితమనంబు దృశ్య మగునె
తగ నధిష్ఠానపూర్ణతత్త్వమును గనిన. ౫౪

టీక. స్ఫురదధిష్ఠానరజ్జువున్ — స్ఫురత్ = తేజరిల్లుచున్న, అధిష్ఠాన = నివాస మైన, రజ్జువున్ = త్రాఁటిని, కనినన్ = చూచినను, ఆరోపితభుజంగము — ఆరోపిత = కల్పిత మైన, భుజంగము = సర్పము, అమరన్ = ఒప్పుగా, కన్పట్టునే = అగపడునా? భువిన్ = భూమియందు, అధిష్ఠానదారువున్ — అధిష్ఠాన = ప్రధాన మైన, దారువున్ = స్థాణువును, కనినన్ = చూచిన, ఆరోపితమనుష్యుఁడు — ఆరోపిత = తలఁపఁబడిన, మనుష్యుఁడు = పురుషుఁడు, అలరన్ = బాగుగా, చూపట్టునే = కనుపించునా? కనదధిష్ఠానార్కకరమున్ — కనత్ = ప్రకాశించుచున్న, అధిష్ఠాన = ఆధార మైన, అర్కకరమున్ = సూర్యకిరణమును, కనినన్ = చూచినను, ఆరోపితోదకంబు = కల్పిత మైనజలము — అనఁగా ఎండమావులు, అరయఁగన్ = విచారింపఁగా, తోఁచునె = కనుపించునా? అధిష్ఠాన మైన శుక్తికన్ = ముఖ్య మగు ముత్తెపుచిప్పను, కనినన్ = ఆలోకించినను, ఆరోపితాచ్ఛరౌప్యము — ఆరోపిత = కల్పిత మైన, అచ్ఛ = స్వచ్ఛ మైన, రౌప్యము = వెండి, లక్ష్యమగునె = చూడఁబడునా? అధిష్ఠానఖంబుఁ గనినన్ = ముఖ్య మైన యాకాశమును జూచినను, తలంపన్ = ఊహింపఁగా, ఆరోపితాసితత్త్వంబు — ఆరోపిత = అధ్యసిత మైన, అసితత్త్వంబు =

నీలవర్ణమును, మరలన్ = తిరుగా, కానవగునె = చూడఁగలుగునా? తిరిగి = లెస్సగా, అధిష్ఠానతత్త్వమున్ - అధిష్ఠాన = సర్వాశ్రయమైన, పూర్ణ = అఖండమైన, తత్త్వము = పరబ్రహ్మమును, తెలియన్ = ఎఱుఁగఁబడునట్లు, కనినన్ = అవలోకించెనేని, ఆరోపితమనంబు = తోఁచియున్న మనస్సు, దృశ్యమగునే = కానఁబడునా

తా. చీఁకటియందు సర్పమనెడు భ్రాంతి గలుగుటకు హేతువగు రజ్జువును జూచి త్రాడని తెలిసిన పిదప సర్పము గనఁబడనట్లును, దొంగ యనెడి భ్రమ తోఁచుటకు కారణమైన మోటును జూచి యిది మ్రానిబోదె యని యెఱిఁగినవెనుక దొంగ కనఁబడనట్లును, ఎండమావులు జలములనెడు తలంపు గలుగుటకు సూర్యకిరణములే నిమిత్తమని తెలిసినవెనుక కల్పితజలములు కనఁబడనట్లును, ముత్యపుఁజిప్పను జూచి మఱపుచేత వెండి యని భ్రమసి అనంతరము ముత్యపుఁజిప్పయని తెలిసిన ఆరోపితమగు వెండి గనఁబడనట్లును, గగనమందు భూసంబంధముచేత నలుపు మొదలగు రంగులు తోఁచఁగా ఆకాశము నిర్మలమయినదని యెఱిఁగినపిమ్మట నీలత్వాదులు తోఁచనట్లును, అఖండపరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మసందర్శనము కల్గెనేని కల్పితమగు మనస్సు తోఁచక లయించి పరబ్రహ్మమే కనఁబడును అని తాత్పర్యము

వ. అదియెట్లనిన వినుము సాధనచతుష్టయసంపత్తిపూర్వకంబుగా బూర్ణాధికారివై యున్న సమయంబున స్వాధిష్ఠాన చిదాభాసుండవైన నీకు నావరణంబులైన చతుర్వింశతితత్త్వాత్మకపంచకోశంబుల వేర్వేఱ విభజించి నేతి నేతి యను మహావాక్యంబు చెప్పినవిధంబున నేను గానని నిషేధించి కేవలకూటస్థచైతన్యమాత్రుండనైతి నని తెలిసి యంతట నీప్రకారంబున దేవతిర్యఙ్మనుష్యాదిసర్వభూతంబులఁ బంచకోశంబులఁ బంచమహాభూతంబుల నొక్కపెట్ట నిరాకరించి యచ్చటఁ బరబ్రహ్మచైతన్యంబుండ భావించి యామీఁదటఁ ద్వంపదార్థలక్ష్యపరప్రత్యగాత్మ పదలక్ష్యార్థభూతప్రత్యగాత్ముండనైన నేన తత్పదబ్రహ్మపదలక్ష్యార్థభూతపరమాత్ముండ ననియుఁ దత్సత్యజ్ఞానానందస్వరూప పరమాత్ముండే సచ్చిదానందలక్షణప్రత్యగాత్ముండనైన నేననియు నిట్లనొక్కయఖండపరమైక్యంబనుభవించి నిరావరణాధిష్ఠాన పరిపూర్ణ ద్వితీయ శుద్ధచైతన్యప్రకాశమాత్రుండవై ప్రకాశించు నీకుఁ బ్రచండమార్తాండునకంధకారంబు గనుపట్టని తెఱంగున సర్వకారణకార్యాత్మకంబైన మనంబు గలుగదు రజ్జ్వారోపితసర్పంబు గని యిది సర్పంబు గాదని తన్నిరసనంబు గావించి మఱి యిది రజ్జువని విధించి యయ్యధిష్ఠానంబు నెఱింగినపిమ్మటఁ గల్పితభుజంగంబభావంబుగ రజ్జుమాత్రంబు శేషించు తెఱంగున శరీరత్రయంబాత్మ కాదని కడఁద్రోచి యాత్మమాత్రుండవైన నీకు మనంబు లేదు మఱియును. ౧౧

టీక. అది = ఆ మనస్సు కనఁబడకయుండుట, ఎట్లనినన్ = ఎట్లనఁగా, వినుము = ఆకర్ణింపుము, సాధనచతుష్టయ = నిత్యానిత్యవస్తువివేకము ఇహాముత్రార్థఫలభోగవిరాగము శమాదిషట్క సంపత్తి ముముక్షుత్వ మను నాలుగువిధములైన సాధనములయొక్క, సంపత్తిపూర్వకంబుగాన్ = సంపదతోడ- అనఁగా సాధనచతుష్టయసంపద గలవాఁడవై, (దీనివివరము ప్రథమాశ్వాసమున వ్రాయఁబడినది) పూర్ణాధి

కారివి — పూర్ణ = జ్ఞానోపదేశమునకుఁ దగిన అన్నిలక్షణములచేతను కొఱఁతపడని, అధికారివి=అధికారము గలవాఁడవు, ఐయున్న సమయంబునన్ = అయియుండినకాలమందు, స్వాధిష్ఠాన = తనకు తానె యాధార మయిన, చిత్ = బ్రహ్మజ్ఞానముయొక్క, ఆభాసుండవు = ప్రతిబింబమాత్రుండ వైన జీవుఁడవు, ఐన నీవున్ = అగు నీవు, ఆవరణంబు లైన = క్రమ్ముకొని యుండునవి యైన, చతుర్వింశతితత్త్వాత్మక = ఇరువదినాలుగుతత్త్వములే రూపముగాఁ గల—అనఁగా ప్రాణభూత జ్ఞానకర్మేంద్రియ పంచకాంతఃకరణచతుష్టయ మనస్సహితచతుర్వింశతితత్త్వములే యాకృతిగాఁ గల, పంచకోశంబులన్ = అన్నమయాది పంచకోశములను, వేర్వేఱన్ = ప్రత్యేకముగా, విభజించి = భాగించి, నేతినేతి యను మహావాక్యంబు = చతుర్వింశతితత్త్వాత్మక పంచకోశములును నీవు కావు కా దనెడు వేదాంతమహావాక్యము, చెప్పినవిధంబునన్ = పలికినట్లు, ఏను గా నని = పంచకోశాదికము నేను గా నని, నిషేధించి = విడిచి, కేవల = ముఖ్య మయిన, కూటస్థ = ప్రత్యగాత్మయొక్క, చైతన్యమాత్రుండన్ = చేతనస్వరూపుఁడను, ఐతి నని తెలిసి = నే నైతి నని యెఱిఁగి, అంతటన్ = వెనుక, ఈప్రకారంబునన్ = ఇట్లు, దేవ = వేల్పులు, తిర్యక్ = పశుపక్ష్యాదిజంతువులు, మనుష్య = నరులు, ఆది = మొదలైన, సర్వభూతంబులన్ = సకలజీవులను, పంచకోశంబులన్ = అన్నమయాదికోశము లైనను, పంచమహాభూతంబులన్ = పృథివ్యాది మహాభూతము లైనను, ఒక్కపెట్టన్ = ఒక్కసారిగా, నిరాకరించి = త్రోసి, అచ్చటన్ = ఆ నవల దిశలయందు, పరబ్రహ్మచైతన్యంబు = పరమాత్మస్వరూపము, ఉండఁగ = ఉండునట్లు, భావించి = ఎంచి, అమ్మీఁదటన్ = పిమ్మట, త్వంపద = నీవను శబ్దము, అహంపద = నేనను శబ్దము, ఆత్మపద = నా నను శబ్దము, ప్రజ్ఞానపద = చిచ్ఛబ్దము, (వీనికి) లక్ష్యార్థభూత = వాచ్యార్థపరిత్యాగపూర్వకలక్ష్యార్థస్వరూప మయినట్టి, ప్రత్యగాత్ముఁడ వైన నేన=కూటస్థుఁడ వైన నేనే, తత్పదబ్రహ్మపదలక్ష్యార్థభూతపరమాత్ముఁడన్ = తత్పదమునకు బ్రహ్మపదమునకు ముఖ్యార్థ మయిన పరబ్రహ్మమును, అనియున్ = అనియును, సత్యజ్ఞానానందస్వరూపపరమాత్ముండ — తత్ = అట్టి, సత్య = సద్రూపము, జ్ఞాన = చిద్రూపము, ఆనందస్వరూప = సుఖస్వరూపము గల, పరమాత్ముండ = పరబ్రహ్మమే, సచ్చిదానందలక్షణప్రత్యగాత్ముండన్ — సత్ = సద్రూపము, చిత్ = చిద్రూపము, ఆనంద = సుఖస్వరూపము, (ఇవియే) లక్షణ = గుణములుగాఁ గల, ప్రత్యగాత్ముండన్ = కూటస్థుఁడను, ఐన నే ననియున్ = అగు నే నని, ఇట్లు = ఇవ్విధముగా, అన్యోన్యాఖండసమరసైక్యంబు — అన్యోన్య = ఉభయచైతన్యములు అనులోమవిలోమములుగా, అఖండ = సమగ్ర మైన, సమరస = భేదము లేని, ఐక్యంబు = చేరికను, అనుభవించి = భోగించి, నిరావరణ = మున్ను చెప్పఁబడిన యావరణములు లేని, అధిష్ఠాన = సర్వాధార మైన, పరిపూర్ణ = అంతట నిండిన, అద్వితీయ = తనకంటె రెండవది లేని, శుద్ధ = నిర్మల మయిన, చైతన్యప్రకాశమాత్రుండవై = ప్రజ్ఞానరూప పరమాత్మవై, ప్రకాశించు నీవున్ = వెలిఁగెడు నీవు, ప్రచండమార్తాండునకున్ = మిగుల వేడిమి గల సూర్యునకు, అంధకారంబు = చీఁకటి, కనుపట్టని తెఱంగునన్ = లేనియట్లు, సర్వకారణకార్యాత్మకం బైన — సర్వ = సమస్త మయిన, కారణ = జ్ఞానకర్మేంద్రియములును, కార్య = ఆయా యింద్రియవ్యాపారములును, ఆత్మకం బైన = స్వరూపముగాఁ గల, మనంబు = మనస్సు, కలుగదు = ఉండదు, రజ్జ్వారోపితసర్పంబున్ — రజ్జు = త్రాటియందు, ఆరోపిత = తోఁచిన, సర్పంబున్ = పామును, కని = చూచి, ఇది సర్పంబు గా దని = ఇది పాము గా దని, తన్నిరసనంబు — తత్ = అది సర్ప మను తలఁపును, నిరసనంబు = తొలఁగించుటను, కావించి = చేసి, మఱి = పిమ్మట, ఇది రజ్జు వని విధించి = ఇది త్రా డని నిశ్చయించి, అయ్యధిష్ఠానంబున్ = ముఖ్య మయిన యా త్రాటిని, ఎఱింగినపిమ్మటన్ = తెలిసినవెనుక, కల్పితభుజంగంబు = ఆరోప మైన సర్పము, అభావంబై = కనఁబడ

ప్రతిబింబరహితకూటస్థుఁడవు, బినన్ = బిరితేని, దృశ్యమంతయున్ = బాహ్యాంతరప్రపంచమెల్లను, అడఁగున్ = నశించును

తా. ఆశింపఁబడిన ప్రత్యగాత్మకంటె వేఱు గాని పరమాత్మకు ఆశ్రయమయిన జ్ఞానముయొక్క ప్రతిబింబ మైతిలేని (అనఁగా లేశభాగము గలవాఁడ వైతివేని) నీకు ప్రపంచమంతయును వేఱుగాఁ గనఁబడును, ప్రకాశింపుచున్న ముఖ్యుఁడవును, ప్రతిబింబరహితకూటస్థుఁడవును నయితివేని బాహ్యాంతర ప్రపంచమంతయు నశించు నని తాత్పర్యము

క. కనుమూసినఁ గనుదెఱచిన, ఘనసచ్చిత్సుఖమయాత్మున్ గనుఁగొన కున్నం
గనుమూసినఁ గనుదెఱచినఁ, గనఁబడు వెలిలో మనోవికారమె వత్సా. ౫౨

టీక వత్సా = బాలకా! కనున్ = నేత్రమును, మూసినన్ = నిమీలించినను - అనఁగా సుషుప్త్యవస్థయందును, కనుదెఱచినన్ = నేత్రమును దెఱచినను - అనఁగా జాగ్రదవస్థయందును, ఘనసచ్చిత్సుఖమయాత్మున్ = శ్రేష్ఠ మగు సచ్చిదానందస్వరూపపరబ్రహ్మమును, కనుఁగొనకున్నన్ = చూడకున్నను, కనుమూసినన్ = నేత్రములను మూసినను, కనుదెఱచినన్ = నేత్రములను విప్పినను, వెలిన్ = బాహ్యమందును, లోన్ = అంతరమందును, మనోవికారమే = మనస్సుయొక్క వికల్పమే, కనఁబడున్ = కానఁబడును

తా బాలకా యోగాంబనేయా! సుషుప్త్యవస్థయందును జాగ్రదవస్థయందును శ్రేష్ఠ మగు సచ్చిదానందస్వరూపపరబ్రహ్మమును జూడకున్నను కనుమూసినను కనుదెఱచినను అంతర్బాహ్యములయందు మనస్సుయొక్క వికల్పమే కానఁబడు నని తాత్పర్యము.

మ. ఘనతం దారకసాంఖ్యయోగములచేఁ గష్టింపఁగా నేల నె
మ్మనముం బట్టఁగ నేల యింద్రియములన్ మర్దింపఁగా నేల చ
క్కనగా ముందటఁ గానుపించుఘటముం గన్నట్లు బ్రహ్మంబు గాఁ
దనుఁ దాఁ గాంచినయంతలో నిఖిలముం దానై వెలుంగుం దగన్. ౫౩

టీక. ఘనతన్ = మిక్కుటముగా, తారకసాంఖ్యయోగములచేతన్ = తారకసాంఖ్యనిష్ఠలచేత, కష్టింపఁగా నేల = శ్రమపడుట యెందుకు? నెమ్మనమున్ = మనస్సును, పట్టఁగ నేల = నిలుప నేల? ఇంద్రియములన్ = జ్ఞానకర్మేంద్రియములను, మర్దింపఁగా నేల = స్వాధీనము చేసికొన నేల? చక్కనఁగాన్ = తిన్నగా, ముందటన్ = ఎదుటను, కానుపించుఘటమున్ = కనఁబడెడు కడవను, కన్నట్లు = చూచినట్లు, తనున్ = తన్ను, బ్రహ్మంబుగాన్ = పరమాత్మనుగా, తాఁగాంచినయంతలోన్ = తాను జూచినమాత్రముననే, నిఖిలమున్ = సర్వమును - అనఁగా నామరూపక్రియాత్మక మగు ప్రపంచమంతయును, తగన్ = లెస్సగా, తానై వెలుంగున్ = తానైన పరబ్రహ్మమై ప్రకాశించును

తా అతిశయము లైన తారకసాంఖ్యనిష్ఠలచేత నెందుకు శ్రమపడవలయును, మనస్సును నిలుప నేల, జ్ఞానేంద్రియకర్మేంద్రియములను స్వాధీనపఱచుకొను టెందుకు, (బహుశ్రమతో తారకసాంఖ్యనిష్ఠయును మనోనిశ్చయంబును ఇంద్రియనిగ్రహంబును వీటి నన్నిటిని పొందుటకంటెను) బాగుగా నెదుటఁ గనఁబడు చున్న ఘటమును జూచినట్లు తన్ను పరమాత్మగా తాను గాంచినంతటనే నామరూపాత్మక మగు ప్రపంచ మంతయు తా నైన పరబ్రహ్మ మై ప్రకాశించు నని తాత్పర్యము.

క. తనుఁ దాఁ గానని మనుజుని, మనము నిరోధింపఁబడక మసలుచుఁ దిరుగున్
దనుఁ దాఁ గను సత్పురుషుని, మన మానందాబ్ధియందు మగ్నత నొందున్.

టీక తనన్ = కూటస్థుఁ డైన తన్ను, తాన్ = తాను, కానని మనుజుని మనము—కానని=చూడని, మనుజుని= నరునియొక్క, మనము = మనస్సు, నిరోధింపఁబడక = అడ్డగింపఁబడక అనఁగా లోఁబడక, మసలుచున్ = లోలత్వము గల దగుచు, తిరుగున్ = చరించును, తనున్ = ప్రత్యగాత్మ యైన తన్ను, తాన్= తాను, కను సత్పురుషునిమనము—కను = అపరోక్షదృష్టిచేతఁజూచెడు, సత్పురుషుని = బ్రహ్మవేత్తయొక్క, మనము = మనస్సు, ఆనందాబ్ధియందున్=బ్రహ్మానందసముద్రమందు, మగ్నత నొందున్= మునుఁగును.

తా. కూటస్థుఁ డైన తన్ను తాను తెలిసికోనని మనుష్యునియొక్క మనస్సు లోఁబడక లోలత్వము గల దగుచు సంచరించును, ప్రత్యగాత్మ యైన తన్ను తాను గను సత్పురుషుని మనస్సు బ్రహ్మానంద సముద్రమునందు మునిఁగి యుండు నని తాత్పర్యము

మ. వనితానందనచందనాదివిషయవ్రాతంబులం బొంది చ
య్యన నంతంతకుఁ జొక్కి నెమ్మనము బ్రహ్మానందవారాశివా
సన యొక్కించుక సోఁకనేనిఁ బ్రవినాశం బొందు నానాద్రుపు
ష్పసటద్భృంగము చంపకప్రసవసంస్పర్శాప్తిఁ జూలుం గతిన్. ౬౦

టీక. వనితా = స్త్రీలు, నందన = బిడ్డలు, చందన = గంధము- అనఁగా పరిమళద్రవ్యములు, ఆది = మొదలగు, విషయ = ఇంద్రియార్థములయొక్క, వ్రాతంబులన్ = సమూహములను, పొంది = కూడి, చయ్యనన్ = అప్పుడే, అంతంతకున్ = మిక్కుటముగా, చొక్కి నెమ్మనము = పారవశ్యము నొందిన చిత్తము, బ్రహ్మానందవారాశివాసన—బ్రహ్మానంద = ఆత్మసుఖ మనెడు, వారాశి = సముద్రమునియొక్క, వాసన = స్ఫురణ, ఒక్కించుక = కొంచెమయినను, సోఁకనేనిన్ = తగిలినేని, నానా = అనేకము లైన, ద్రు = వృక్షములయొక్క, పుష్ప = పువ్వులయందు, సటత్ = తిరుగుచు మున్న, భృంగము = తుమ్మెద, చంపకప్రసవ = సంపెంగపువ్వుయొక్క, సంస్పర్శాప్తిన్ = స్పర్శ గలుగుటచేత, చూలుం గతిన్ = చచ్చునట్లు, ప్రవినాశంబొందున్ = మనస్సు బ్రహ్మానందమందు లయించును.

తా. స్త్రీలు బిడ్డలు పరిమళద్రవ్యములు మొదలగు యింద్రియార్థవిషయములయొక్క సమూహములను గూడి అంతకంతకు పారవశ్యత నొందు చిత్తము బ్రహ్మానంద మనెడు సముద్రముయొక్క వాసన కొంచె మయినను సోఁకనేని అనేకవృక్షములయొక్క పువ్వులయందుఁ దిరుగు మున్న తుమ్మెదలు సంపెంగపువ్వులయొక్క స్పర్శ తగులుటచేత చచ్చునట్లు బ్రహ్మానందమునందే లయించు నని తాత్పర్యము.

క. చక్కెరయును లవణంబును, గ్రక్కన నుదకములయందుఁ గరఁగినరీతిన్
మిక్కిలి తనుఁ గను ఘను మది, చొక్కుచు నానందజలధి సుడిసి లయించున్.

టీక. చక్కెరయున్ = పంచదారయును, లవణంబును = ఉప్పును, గ్రక్కనన్ = వేగముగా, ఉదకములయందున్ = నీళ్ళయందు, కరఁగినరీతిన్ = కరఁగినట్లు-అనఁగాఁ గలసినట్లు, మిక్కిలి=మిగుల, తనన్= బ్రహ్మస్వరూప మైన తన్ను, కను ఘనుమది = చూచెడు బ్రహ్మవేత్తమనస్సు, ఆనందజలధిన్= బ్రహ్మానందసాగరమందు, సుడిసి = గుండ్రముగా దిరిగి, చొక్కుచున్ = పరవశమగుచు, లయించున్ = లయించును.

తా॥ సర్వనదులును ఉప్పునను వేగముగా నీళ్లయందు కరఁగినట్లు మిగుల బ్రహ్మస్వరూపమైన తన్నుఁ గానని బ్రహ్మవేత్తమనస్సు బ్రహ్మానందసాగరమందు గుంద్రముగా దిరిగి పరవశమగుచు నశించు నని తాత్పర్యము

తే. ఇతరసంకల్పములు లేక యెపుడు దాను, సచ్చిదాత్ముఁడ నని సుప్రసన్నవృత్తిఁ
దన్నుఁగను వానిచిత్తంబు దనరుఁదాన, పొలియుఁ దనయందె యింధనానలముపగిది.

టీక. తాన్ = శుద్ధసత్త్వస్వరూపమైన తాను, ఇతరసంకల్పములు లేక = వేఱుతలంపులు లేక- అనఁగా సత్త్వరజస్తమోగుణవికారములవలనఁ గలుగు నేతలంపులు లేనివాఁడై, సుప్రసన్నవృత్తిన్ = నిర్మలవృత్తిచేత, ఎపుడు=ఎల్లప్పుడు, సచ్చిదాత్ముఁడ నని=పరబ్రహ్మము నని, తన్నుఁగనువానిచిత్తంబు= పరబ్రహ్మమగు తన్నుఁ జూచువానిమనస్సు, తనరుఁదాన = తనకుఁదానే, ఇంధనానలముపగిదిన్ — ఇంధన = కట్టెలయందలి, అనలముపగిదిన్ = నిప్పువలె-అనఁగా కట్టెలలోనినిప్పు కట్టెను గాల్చి తానును చల్లారినట్లు, తనయందె = తనలోపలనే, పొలియున్ = నశించును

తా॥ శుద్ధసత్త్వస్వరూపుఁడైన తాను వేఱుతలంపు లేక (సత్త్వరజస్తమోగుణవికారములవలనఁ గలుగు తలంపులు లేనివాఁడై) నిర్మలవృత్తిచేత నెల్లప్పుడు పరబ్రహ్మము నని పరబ్రహ్మమగు తన్నుఁ జూచువాని మనస్సు తనకుఁదానే కట్టెలలోనినిప్పు కట్టెలను గాల్చి తానును చల్లారినట్లు తనలోపలనే నశించు నని తాత్పర్యము.

క. ఇనుఁ డస్తమింపుతఱిఁ దత్కిరణములు నతనితోడఁ దగఁ జనురీతిం
బెనుమానసంబు పొలిసిన, మును కొని తద్గతవికారములు పొలియుఁ గడున్. ౭౩

టీక. ఇనుఁడు = సూర్యుఁడు, అస్తమింపుతఱిన్ = క్రుంకెడువేళ, అతనికిరణములు= ఆ సూర్యుని కిరణములు, అతనితోడన్ = ఆ సూర్యునివెంటనే, తగన్ = బాగుగా, చనురీతిన్ = పోవునట్లు, పెను మానసంబు = గొప్పదైన మనస్సు, పొలిసినన్ = లయింపఁగానే, మునుకొని = ముందుగా, తద్గతవికారములు = ఆ మనస్సులోని సత్త్వరజస్తమోగుణవికారములు, కడున్= మిక్కిలి, పొలియున్=నశించును.

తా॥ సూర్యుఁడు క్రుంకెడువేళ నతనికిరణములు అతనివెంటనే పోవునట్లు గొప్పదైన మనస్సు లయింపఁగానే ముందుగా ఆ మానసమునందలి సత్త్వరజస్తమోగుణవికారములు నశించు నని తాత్పర్యము.

శా. నానాకర్మజవాసనాన్వితమనోనాశంబు గాకున్న బ్ర
హ్మానందానుభవంబు గల్గునె యనాయాసంబుగా నిప్పుడీ
యాత్మానందాంబుధి నోలలాడక యబాహ్యాభ్యంతరార్థానుసం
ధానోద్భూతనితాంతదుఃఖమయసంతాపంబు చల్లాఱునే. ౭౪

టీక. నానా = నానాప్రకారములైన, కర్మజ = ఆగామిసంచితప్రారబ్ధకర్మములవలనఁబుట్టిన, వాసనా = అనుభవముతోడ, అన్విత = కూడిన, మనోనాశంబు = మనోలయము, కాకున్నన్ = కాని యెడల, బ్రహ్మానందానుభవంబు = ఆత్మసుఖానుభూతి, కల్గునె = లభించునా? ఇప్పుడు=యీమనుష్యశరీర ధారణగల యీ వర్తమానకాలమందు, అనాయాసంబుగాన్ = సులభముగా, ఇయ్యాత్మానందాంబుధిన్ = మనోలయపూర్వకమైన యీ బ్రహ్మానందసముద్రమందు, ఓలలాడక యె = ఈదులాడకయే, బాహ్య = వెలుపల, అభ్యంతర = లోపల, అర్థ = ఇంద్రియార్థములతోడ - అనఁగా బాహ్యాంతరదృశ్యములతోడ, అనుసంధాన = చేరుటవలన, ఉద్భూత = పుట్టిన, నితాంత= విరామము లేని, దుఃఖమయ = దుఃఖరూప

మైన, సంతాపంబు = ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతిక రూపతాపము, చల్లారంగ = శమించునట్లు - అనఁగా బ్రహ్మానందసముద్రమందు నీఁదులాడక చతుర్దశేంద్రియములతోడ తిరుగుటవలన గలిగిన సంతాపము చల్లారదనుట.

## ఆగామి సంచిత ప్రారబ్ధకర్మముల వివరణము.

ఒక కాపువాఁడు పొలములు పది గలవాఁడు, ఆ పొలములు పదియును గాని పైరు పెట్టును, ప్రతిసంవత్సరము పొలమొక్కటికి వేయికలముల లెక్కను పదివేలకలముల ధాన్యము పండును, వానిలో వేయికలములు గ్రాసమునకు పట్టును, ఏనూఱుకలములు విత్తనములు కట్టును, మఱి యేనూఱుకలములు ధర్మవ్యయము చేయును, వేయికలములు వ్యవసాయపుపనులనిమిత్తము సెలవు చేయును, వేయికలములు గవాణపుపన్నుకై విక్రయించును, ఇట్లు సెలవైనవి పోఁగా సంవత్సరమున నాలుగువేలకలాలధాన్యము మిగులును, ఆ మిగిలిన ధాన్యమును దాఁచిపెట్టును, ఇట్లు ప్రతిసంవత్సరము మిగిలెడు ధాన్యమును చేర్చి గొప్పవెల గలిగినప్పుడు విక్రయింతమని యుండును. (ఆ ధాన్యము సంచిత మనఁబడును గ్రాసముకోసము నిల్పిన వేయికలాలధాన్యము ప్రారబ్ధ మనఁబడును పెద్దపైరు, ములకపైరు, ఎన్నదీసినపైరు, పండినపంట ఇవి ఆగామి యనఁబడును) ఇట్లుండఁగా నొకప్పుడు రాజులలోఁ గలహములు కలిగి దండులు వచ్చి వారి యూరిలో దూరి సంచితధాన్యమంతయుఁ గొనిపోయిరి, రాఁబోవుపంటను గొల్లగొట్టిరి, పైరులు గుఱ్ఱములు మొదలగునవి మేసెను, అంతట ఆ సంసారి విచారపడి యింటనుండు వస్తువులను గాపటికము చేసి భక్షించుచుండెను, ఇట్లుండఁగా బంధువులందరు గ్రాసమునకు మోసము వచ్చెనని, యింక నేమి చేసెద వని యడుగఁగా సంచితము విస్తరించి యుండెను, దానిని పరరాష్ట్రములవా రపహరించిరి, రాఁబోవుపంట కొల్లపోయెను, పైరంతయుఁ గుఱ్ఱము లేనుఁగులు లొట్టెగులు మొదలగునవి మేసినవి, ఇంటపదిలపఱచి యున్న ధాన్యము భక్షించినదే పరవలె ననెను, ఇట్లనుటచేత ఆగామిసంచితములకు నాశమును, ప్రారబ్ధ మవశ్య మనుభవించినఁగాని తీఱదనియు నని చెప్పఁగలుగును; ఇట్లు దృష్టాంతమందు సంచితప్రారబ్ధాగాములు చెప్పఁబడెను ఇట్లే దార్ష్టాంతికమందు జీవులకు సంచితప్రారబ్ధాగాములు స్పష్టంబుగా నిరూపింపఁబడుచున్నవి ఎట్లనఁగా, లోకమందనాదిగనున్న జీవుఁడు పుణ్యపాపకర్మంబులను జేయుచు వచ్చును, ఇట్లు చేయుచు రాఁగా బహుదినములుగ చేసిన పుణ్యపాపకర్మములే పెక్కుజన్మములకు కారణమై యుండును, ఇట్లు బ్రతికి యుండునంతవఱకు చేయఁబడు పుణ్యపాపకర్మము లన్నియును ప్రోగగును, దీనికే సంచిత మని పేరు. పిమ్మట వచ్చు మరల జన్మమునకు నిమిత్తమై ఆ సంచితములో కొంత భాగించుకొనును, ఆ భాగించుకొనినకర్మము భావిశరీరమునకు తగినదైన పంచీకృత పంచమహాభూతరూపముగా పరిణమింపఁజేసి ఆ శరీరముచేత కొన్నికర్మములఁ గావించి ఆ కర్మములవలన కొన్ని సుఖదుఃఖము లనుభవించును, దీనికే ప్రారబ్ధ మని పేరు ఇది యిచ్ఛాప్రారబ్ధ మని, అనిచ్ఛాప్రారబ్ధ మని, పరేచ్ఛాప్రారబ్ధ మని మూఁడువిధములై యుండును; ఈ ప్రారబ్ధములు వివేకులకును, అవివేకులకును సమమై యుండినను వివేకియొక్కయు అవివేకియొక్కయు ప్రారబ్ధములకు భేదము గలుగు, ఎట్లనఁగా, అవివేకియొక్క ప్రారబ్ధము ఆశ్వయుజమాసమందలి మబ్బువలె స్వల్పముగా నుండును, ఆ మబ్బంతట చుట్టుకొని కడవలతో ముంచి వంచినట్లు వర్షించి పైరులను మునుఁగఁజేసి యిండ్లను గోడలను చెట్లను గూల్చి పక్షులు మృగములు మనుష్యులు మొదలగు జంతుజాతములకు దొసఁగులఁ బొసఁగించునట్లు మూఢునకును స్వల్పముగా నిచ్ఛ పుట్టి ఆ యిచ్ఛ ఆ మబ్బువలె గొబ్బున హృదయాకాశమున వ్యాపించి పరులను పెక్కులిడుమల గుడిపించి వానికిని నొవ్వు పుట్టించి యిహపరలోకసుఖములకు దవ్వుగాఁజేసి నరకలోక

వానిగాఁ జేయును, వివేకియొక్క యిచ్ఛ కర్మవశమున గలిగి మిగుల ప్రబలినట్లు తోఁచినను మకరమాస మందలి మేఘము అంతట వ్యాప్తమైనది యుండినను కొద్దిగా వాన కురిసి పైరులు మొదలగు వానికి చెఱుపు చేయుటను ప్రాణులకు హాని పుట్టింపకను తానే విరిసినటువలె పూర్ణవివేకమువలన పరులకు హాని గలిగింపక తనపరలోకసుఖమునకు హానిని సంపాదింపక దేహధారణమాత్రమందే వచ్చును, ఇదే వివేక అవివేకుల ప్రారబ్ధమునకు భేదము. మఱియు లోకమందు అవివేకులు బొంకులు బొంకి హానిఁ జెందిన వారిని, దొంగిలి తలగొట్టఁబడినవారిని, రాజస్త్రీల జెఱఁబట్టి వాడిసెలచేతఁ జెక్కలెగయ చెక్కఁబడిన వారిని జూచి తన మీఁదనుల గీడుగాగు, చేసితిమేని కీడు మూఁడునని తెలిసియు వారు సమర్థులు గారు కనుక సాహసముల నొందిరి, సమర్థుల మగు మన కేల అట్టి యాపదలు వచ్చునని తలంచి ఆలాటి చెడ్డపనులఁ జేసి తలగొట్టఁబడు చున్నారు, ఇదే యవివేకియొక్క యిచ్ఛాప్రారబ్ధము వివేకులగువారు ప్రకృతి కర్మము లన్నియును అనర్థమూలము లని అర్థాసక్తు లగు సంసారులు ధనములు గడించుటయందును, వానిని కాపాడుటయందును, ఆ ధనము సెలవు చేయుటయందును వారు పడెడు నిడుమలఁ జూచి అర్థము లనర్థ హేతువులు అని యెంచి దానికై యుండరాదు, యెంచితిమేని వారియట్ల మనకును దుఃఖము సంభవిల్లునని యెంచి సర్వసంగపరిత్యాగులై యదృచ్ఛాలాభసంతుష్టులై యుందురు, అవివేకులకు శరీరధారణమాత్ర మైన క్రియలయందును భోగాదిక్రియలయందును యిచ్ఛ పుట్టునుగాని పరలోకవిషయమం దిచ్ఛ పుట్టదు, ఇదే వివేకులయొక్క యిచ్ఛాప్రారబ్ధము అనిచ్ఛాప్రారబ్ధ మనఁగా కోరకనే సంప్రాప్త మగునట్టిది అగి వివేకులకును అవివేకులకును సమానమై యుండును. ఎట్లనఁగా, తల కాలు చెయ్యి మొదలగునవి తాఁకుట, కన్నులు నొచ్చుట, జ్వరరోగవ్యాధులచేత బాధింపఁబడుట, వానచేతఁ దడియుట, ఎండచేతఁ గొట్టఁ బడుట, పిడుగులు గుడి గోపుర ప్రాకార మంటపాగులు పైనఁబడుట యివి మొదలగువానిచేత సంభ వించిన దుఃఖములును, ఎండ వాన నిప్పు మొదలగువానివలన గలిగిన సుఖములును, వివేకులకును అవివేకుల కును సమానమై యుండును, వీని యనుభవములే అనిచ్ఛాప్రారబ్ధ మనఁబడును పరేచ్ఛాప్రారబ్ధము వివే కులకును అవివేకులకును సమముగానే యుండును ఎట్లనఁగా, ఒకపురుషుఁడు మౌనియై కూర్చుండి యుండఁగా మఱియొకఁడు వచ్చి వానికి నమస్కరించి నీ వీ కార్యము చేయుమని మిగుల వేడుకొనఁగా దాక్షిణ్యముచేత మంచి దని ఆ కార్యము చేసి దానివలన వచ్చిన సుఖదుఃఖముల ననుభవించుట, ఇదే పరేచ్ఛాప్రారబ్ధము ఈ ప్రారబ్ధము ననుభవింపుమ మరణపర్యంతము చేసిన పుణ్యపాపములకు ఆగామి యని పేరు. ఇది ఆ సంచితముతోఁ గూడును. ఇట్లు జీవుఁడనాదిగా కర్మములను జేయుచు రాఁగా సంచి తము పెరుగుచు వచ్చును కనుక యీ జీవులజన్మములకు కొఱ లేదు. ఇట్లు కర్మములను సల్పుచు రాఁగా రాఁగా బహుజన్మకృతసుకృతజన్మపరిపాకముచేత సంసారబంధనాశకరం బగు తెలివి గలుగును, వెనుక కామ్యకర్మములను జేయుటవలన చిత్తశుద్ధియు సంసారబంధచ్ఛేదనమును గల్గనేర దని యెంచి విహిత కర్మముల నీశ్వరార్పణంబుగా జేయవలయు నను తలంపు గలుగును, అందున భక్తి గల్గును, భక్తివలన చిత్తశుద్ధియు, చిత్తశుద్ధివలన సద్గురులాభమును గలుగును, పిదప సద్గురువులకు చతుర్విధశుశ్రూషలను జేయుచు శ్రవణ మనన నిదిధ్యాసనములఁ జేయుటచేత విజ్ఞానము గలవాఁ డగును ఆ విజ్ఞానాగ్నిచేత అజ్ఞాన మెప్పుడు నశించునో అప్పు డజ్ఞానకార్యము లైన సంచితకర్మము లన్నియు కాలిపోవును, తర్వాత చేయఁబడిన పుణ్యపాపములు అకర్తయైన వీని నంటలేవు. మఱి యాతనిపుణ్యపాపములకు గతియేమి యనిన, ఈ జ్ఞానిని భూషించువాఁడు పుణ్యమును, దూషించువాఁడు పాపమును కొనిపోవురు, ప్రారబ్ధ మనుభవించియే తీరవలెను. ఈ యర్థసమ్మతివచనము, 'శ్లో॥ ప్రారబ్ధం భోగతో నశ్యే త్తత్త్వజ్ఞానేన సంచితమ్ । ఆగామి ద్వివిధం కర్మ తద్ద్వేషిప్రియవాదినోః' ఈరీతున సంచితప్రారబ్ధాగామములను తుద

మట్టు విచారించి యీసంచితప్రారబ్ధాగామములు అహంకారమునకే గాని ఆ యహంకారసాక్షి యైన నాకు లేవని యెఱిఁగినవాఁడే ముక్తుఁ డని వేదాంతసిద్ధాంతము ఇట్లు సంచితప్రారబ్ధాగామములును, వానికి నాశనమును దృష్టాంత దార్ష్టాంతపూర్వకముగాఁ జెప్పఁబడెను.

తా. అనేకవిధములగు ఆగామిసంచితప్రారబ్ధకర్మములవలనఁ బుట్టిన దుఃఖానుభవములతోఁ గూడిన మనోనాశము గాకున్నయెడల బ్రహ్మానందానుభవం బెట్లు లభించును, (లభింపనేరదు) ఇట్టి సులభముగా మనోలయపూర్వకమైన బ్రహ్మానందసముద్రమంగు యీఁగులాడక నే బాహ్యాభ్యంతరదృశ్యములతోఁ జేరుటవలనఁ బుట్టినట్టి యెడతెగనిదుఃఖమయమైన తాపత్రయము శమించునా (శమింపదనుట) అని తాత్పర్యము.

వ. అని మఱియు నిట్లనియెఁ బరమభాగవతోత్తమా నీవు దేహవ్యతిరిక్తుండ వగుటం జేసి జన్మాస్తిత్వవృద్ధిపరిణామాపక్షయవినాశంబులును, బాల్యకౌమారయౌవనజరావస్థలును, వర్ణాశ్రమకులగోత్రనామరూపదేశకాలాదికంబులును, స్థూలత్వకృశత్వదీర్ఘత్వహ్రస్వత్వనీలత్వరక్తత్వాదికంబులును, నిరింద్రియుండ వగుటం జేసి వచనాదానగమనవిసర్గానందకర్మంబులును శబ్దస్పర్శరూపరసగంధవిషయసంగంబులును, అప్రాణుండ వగుటం జేసి చలనధావనకంపనాకుంచనప్రసారణాదికంబులును క్షుత్పిపాసాదికంబులును, అమనస్కుండ వగుటం జేసి సంకల్పవికల్పంబులును రాగద్వేషకామక్రోధలోభమోహమదమాత్సర్యేర్ష్యాసూయాదంభదర్పాహంకారేచ్ఛాతృష్ణావిచికిత్సాలజ్జాదయాభయశోకహర్షధ్యానధైర్యస్థైర్యాదికంబులును, నిత్యానిత్యవస్తువివేకవైరాగ్యశమదమోపరతితితిక్షాశ్రద్ధాసమాధానముముక్షుత్వశ్రవణ మనన నిదిధ్యాసన జ్ఞానాదికంబులును, ధీవిలక్షణుండవు నిరహంకారుండ వగుటం జేసి వక్తృత్వదాతృత్వగంతృత్వవిసర్జయితృత్వానందయితృత్వంబులును, శ్రోతృత్వస్ప్రష్టృత్వద్రష్టృత్వరసయితృత్వఘ్రాతృత్వంబులును, కర్తృత్వభోక్తృత్వస్మర్తృత్వజ్ఞాతృత్వమంతృత్వహంతృత్వప్రమాతృత్వధ్యాతృత్వాదికంబులును నీకు లేవు నీవు కేవలశుద్ధచిద్రూపప్రత్యగభిన్నబ్రహ్మచైతన్యప్రకాశమాత్రుండవు గావున నేను శరీరేంద్రియప్రాణమనోబుద్ధిచిత్తాహంకారంబులు గాను, స్వయంప్రకాశ సచ్చిదానంద స్వరూపమాత్రుండ నని నిన్ను నీవు విలోకించు సమాధిసమయంబున సకలవికారసముత్పత్తిరహితుండవు గావే, భూతభవిష్యద్వర్తమానకాలంబుల నివ్విధంబునఁ బ్రకాశించుట వలన నిరతంబును నిర్వికల్పుండవై యేకరూపుండవై యుండుట గాదె సర్వవికారశూన్య సహజామనస్కరాజయోగసమాధి యని తెలిపినం దెలిసి హనుమంతుండు సీతాకాంతున కిట్లనియె. ౬౫

టీక. అని = ఇట్లు పలికి, మఱియును = వెండియును, ఇట్లనియెను = ఈప్రకారము చెప్పెను, పరమ = అధికులైన, భాగవత = ప్రహ్లాదాది భగవద్భక్తులలో, ఉత్తమా = శ్రేష్ఠుఁడవైన ఆంజనేయా!

నీవు = నీవు, దేహాద్వ్యతిరిక్తుండవు — దేహ = శరీరత్రయముకంటె, వ్యతిరిక్తుండవు = వేఱైనవాఁడవు, అగుటం జేసి = కనుకనే, జన్మ = పుట్టుట, అస్తిత్వ = ఉండుట, వృద్ధి = పెరుఁగుట, పరిణామ = ముదిమి, అపక్షయ = నశియించుట, వినాశంబులును = చావు ననెడు షడ్భావవికారములును, బాల్యకౌమారయౌవన జరావస్థలును = బాల్యము కుమారత్వము యౌవనము వార్ధక్యము ననెడు నవస్థలును, 'శ్లో॥ పంచసంవత్సరో బాలః కుమారో ద్వాదశాబ్దకః । యువాబ్దాః పంచవింశత్యాః వృద్ధస్స్యాత్తతివార్ధికః' అని సారదీయము వర్ణ = బ్రాహ్మణాదివర్ణములు, ఆశ్రమ = బ్రహ్మచర్యాద్యాశ్రమములు, కుల = జాతులు, గోత్ర = కాశ్యపాదిగోత్రములు, నామ = గోవిందనారాయణాది నామములు, రూప = శ్వేతరక్తశ్యామ కృష్ణరూపములు, 'శ్లో॥ కృతే శ్వేతం హరిం వింద్యాత్త్రేతాయాం రక్తవర్ణకమ్ । ద్వాపరే శ్యామవర్ణంతు కలౌ కృష్ణ ఇతి స్మృతః' అని త్రిపురసారసింధువు. దేశ = ఆంధ్రద్రవిడాది దేశములు, కాల = భూతభవిష్యద్వర్తమాన కాలములు, ఆదికంబులును = మొదలైనవియును, స్థూలత్వ = బలియుట, కృశత్వ = చిక్కుట, దీర్ఘత్వ = నిడుపగుట, హ్రస్వత్వ = కుఱుచయగుట, నీలత్వ = నల్లఁదనము, రక్తత్వ = ఎఱ్ఱఁదనము, ఆదికంబులును = మొదలగునవియును, నిరింద్రియుండవగుటం జేసి = కర్మేంద్రియ జ్ఞానేంద్రియములు లేనివాఁడవగుటచేత, వచన = పలుకుట, ఆదాన = ఇచ్చుట, గమన = నడుచుట, విసర్గ = మలమూత్రములను విడుచుట, ఆనంద = సంభోగాగులచే హర్షించుట, (ఇవి యనెడు) కర్మంబులును = కర్మేంద్రియ వ్యాపారములును, శబ్ద = వర్ణాత్మకధ్వన్యాత్మకశబ్దములు, స్పర్శ = మృదుకఠినశీతోష్ణాదిస్పర్శములు, రూప = నీలపీతహ్రస్వదీర్ఘాదికవిధరూపములు, రస = లవణామ్లమధురాదిరసములు, గంధ = సుగంధదుర్గంధ మిశ్రగంధములు, విషయ = (ఇవి యనెడు) జ్ఞానేంద్రియవ్యాపారములతోడ, సంగంబులును = కూడుటలయును, అప్రాణుండవగుటం జేసి = ప్రాణములు లేనివాఁడవగుటచేత, చలన = కదలుట, ధావన = పరుగెత్తుట, కంపన = వడఁకుట, ఆకుంచన = ముడుచుట, ప్రసారణ = చాఁచుట, ఆదికంబులును = మొదలగునవియును, క్షుత్పిపాసాదికంబులును — క్షుత్ = ఆఁకలి, పిపాస = దప్పి, ఆదికంబులును = మొదలైనవియును, అమనస్కుండవగుటంజేసి = సంశయాత్మక మగు మనస్సు లేనివాఁడవైనందున, సంకల్పవికల్పంబులును = ఇచ్ఛించుటయు ఇచ్ఛింపమియు, రాగ = స్త్రీవిషయకమైన ప్రేమయు, ద్వేష = ఒకఁడపకృతి చేసిన దానికి మాఱు చేయవలెనని తోఁచుటయు, కామ = గృహారామక్షేత్రధనధాన్యాదుల సంపాదింపవలయు నని తోఁచుటయు, క్రోధ = తనకడ్డమగు విఘ్నము చేయువానియందుఁ గ్రౌర్యముగా గలిగెడు వృత్తియు, లోభ = ఆర్జించినధనాదుల నెలవు చేయఁగూడదని తోఁచుటయు, మోహ = ఐశ్వర్యగర్వంబున కృత్యాకృత్యముల నెఱుఁగక పోవుటయు, మద = సంపదలు గల నేఁ జేసిన పనులెల్ల చెల్లుఁబడి యగు నని తోఁచుటయు, మత్సర = తనకంటె నొక్కఁ డెక్కుడై యుండెనేని వానియుత్కర్ష నోర్వఁజాలక యుండుటయు, ఈర్ష్య = దుఃఖము పరునికి రాక తనకు రావచ్చునా యని తోఁచుటయు, అసూయ = నావలె పరులు సౌఖ్యముగా నుండవచ్చునా యని తోఁచుటయు, డంభ = తాఁ జేసిన ధర్మమంద కొంటెఁగి యిచ్చలో మెచ్చవలయు నని తోఁచుటయు, దర్ప = నేను శ్రేష్ఠుఁడను నాతో నెవరీడు గారని తోఁచుటయు, అహంకార = తాను సర్వశక్తుఁడనని యెంచుటయు, ఇచ్ఛ = అనివార్యములైన అంతరబహిశ్శౌచాదిక్రియలఁ జేయవలెనని తోఁచుటయు, తృష్ణ = పరదారధనాదుల నపహరింపవలెనని తోఁచుటయు, విచికిత్సా = 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' యని యుండఁగా నేను బ్రహ్మమును గాదనెడు సందేహమును, లజ్జా = సిగ్గును, దయా = జీవకారుణ్యమును, భయ = భీతియు, శోక = క్లేశము, ధైర్య = తెగువయు, అధైర్య = పిఱికితనము, దైన్య = దీనత్వము, ఆదికంబులును = లోనైనవియును, నిత్య = పరబ్రహ్మమనెడు, అనిత్య = లోకమనెడు, వస్తు = ఈ రెండువస్తువులయొక్క, వివేక = ఎఱుఁగుటయు,

వైరాగ్య = ఇహ పర లోక భోగములయందు నిరాశయు, శమ = అంతరింద్రియనిగ్రహమును, దమ = బాహ్యేంద్రియ నిగ్రహమును, ఉపరతి = విహితకర్మముల విధ్యుక్తముగా విడుచుటయు, తితిక్షా = శీతోష్ణాది ద్వంద్వసహనమును, శ్రద్ధా = గురువులయందును వారిచే నుపదేశింపఁబడిన వేదాంతమహా వాక్యార్థములయందును దేవునియందును గల విశ్వాసమును, సమాధాన=సర్వేంద్రియములను విషయముల నుండి త్రిప్పి వేదాంతవిచారణయందు నిలుపుట, ముముక్షుత్వ = మోక్షేచ్ఛయు, శ్రవణ = మహావాక్యార్థముల గురూపదేశపూర్వకముగా వినుటయు, మనన = గురువులవలన విన్నదానిని యుక్తులచేత నేక వాక్యము చేసి చింతించుట, నిదిధ్యాసన=విజాతీయము లగు కామాదుల విడిచి సజాతీయము లగు సచ్చిదానంద నిత్యపరిపూర్ణ పరబ్రహ్మమే నే ననెడు స్వానుభూతి గలిగి యుండుట యును, జ్ఞాన = అపరోక్షజ్ఞానములును, ఆదికంబులును = మొదలైనవియును, ధీవిలక్షణుండవు—ధీ=నిశ్చయాత్మక మైన బుద్ధికి, విలక్షణుండవు = వ్యతిరిక్తుఁడవు, నిరహంకారుండవు = అహంభావము లేనివాఁడవు, అగుటంజేసి = అవుట వలన, వక్తృత్వ = మాటలాడు నేర్పు, దాతృత్వ = ఈవి, గంతృత్వ = నడుచుపోవుట, విసర్గయితృత్వ= మలమూత్రాదుల విడుచుట, ఆనందయితృత్వంబులును = సురతాదులచే నానందించుటలును, శ్రోతృత్వ= వినుట, స్పృష్టృత్వ = సోఁకుట, ద్రష్టృత్వ = చూచుట, రసయితృత్వ = రసముల గ్రోలుట, ఘ్రాతృత్వంబులును = మూర్కొనుటలును, కర్తృత్వ = అభిమానించుట, భోక్తృత్వ = అనుభవించుట, స్మర్తృత్వ = తలఁచుట - అనఁగా సంకల్పించుట, జ్ఞాతృత్వ = ఎఱుఁగుట, మంతృత్వ = ఆలోచించుట, హంతృత్వ = చంపుట, ప్రమాతృత్వ = కొలఁదియిడుట, ధ్యాతృత్వ = ధ్యానించుట, ఆదికంబులును= లోనైనవియును, నీకు లేవు = నీకుఁ గలుగవు, నీవు = ఈవు, కేవల = ఏకమైన, శుద్ధ = నిర్మల మైన, చిద్రూప = జ్ఞానస్వరూప మైన, ప్రత్యక్ = కూటస్థబ్రహ్మకంటెను, అభిన్న = వేఱు గాని, బ్రహ్మచైతన్య= హీనాధిక సమానములు లేని పరబ్రహ్మముయొక్క, ప్రకాశమాత్రుండవు = తేజస్స్వరూపుఁడవు, కావునన్ = కనుక, నేను = కూటస్థుఁడ నైన నేను, శరీర = దేహమును, ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములును, ప్రాణ = పంచప్రాణములును, మనః = సంశయరూపకమానసమును, బుద్ధి = నిశ్చయాత్మక బుద్ధియును, చిత్త = చంచలాత్మక చిత్తమును, అహంకారంబులును = కర్తృస్వరూపక అహంకారమును, కాను= కానేగాను, స్వయంప్రకాశ = తనంతటనే వెలుఁగుచున్న, సత్ = కాలత్రయమందుండునదియు, చిత్ = అపరోక్షజ్ఞానమును, ఆనంద = దుఃఖము లేమియు, స్వరూపమాత్రుండ నని = ఇట్టి యాకృతిగాఁ గల వాఁడ నని, నిన్నున్ = స్వప్రకాశుఁడ వైన నిన్ను, నీవు = ఈవు, విలోకింపుము = చూడుము, సమాధిసమయంబునన్ = నిష్ఠాకాలమందు, సకల=సమస్త మైన, వికార=త్రిగుణవికారములతోడ, సమన్విత=కూడిన, మనోరహితుండవు = మనస్సు లేనివాఁడవు, కావే = కావా - అనఁగా అగుచున్నావనుట, భూత= కడచిన, భవిష్యత్ = రాఁగల, వర్తమాన = జరుగుచున్న, కాలంబులన్ = కాలములయందు, ఇవ్విధంబునన్ = ఈప్రకారము, ప్రకాశించుటవలనన్ = వెలుఁగుచుండుటవలన, నిరంతరంబును = ఎల్లప్పుడును, నిర్వికల్పుండవై = వికల్పము లేనివాఁడవై, ఏకరూపుండవై =ఒకరీతిగా నుండువాఁడవై, ఉండుట కాదే= ఉండుటలేదా, సర్వవికారశూన్య = సజాతీయవిజాతీయస్వగతభేదాదివికారములు లేని, సహజ = తనంతటఁ బుట్టిన, అమనస్క= మనోరహిత మైన, రాజయోగ = జ్ఞానయోగముయొక్క, సమాధి యనిన=నిష్ఠ యని, తెలిపినన్ = బోధింపఁగా, దెలిసి = ఎఱిఁగి, హనుమంతుండు = ఆంజనేయుఁడు, సీతాకాంతునకున్= శ్రీరామునకు, ఇట్లనియెన్ = ముందుఁ జెప్పఁబోవునట్లు పలికెను

తా. ఇట్లు పలికి మఱియుఁ జెప్పుచున్నాఁడు. అధికు లయిన ప్రహ్లాదాది భగవద్భక్తులలో శ్రేష్ఠుఁడ వైన యాంజనేయా! నీవు శరీరమునకంటె వేఱైనవాఁ డగుటవలన నీకు పుట్టుట, ఉండుట, పెరుఁగుట

ముదిమి, నరయుట, నశించుట అనెడు షడ్భావవికారములును, బాల్యము, కుమారత్వము, యౌవనము, వార్ధక్యము లనెడు అవస్థలును, బ్రాహ్మణాది వర్ణములును; బ్రహ్మచర్యాద్యాశ్రమములును, కులములును, కశ్యపాదిగోత్రములును, గోవింద నారాయణాది నామములును, శ్వేతరక్తాదివర్ణములును, దేశము (ఆంధ్రాది దేశము) కాలము, (భూతభవిష్యద్వర్తమానములు) మొదలయినవియును, బలియుట, కృశించుట, నిడుపగుట, కురుచగుట, నల్లదనము, యెఱ్ఱదనము మొదలయినవియును లేవు, నీవు కర్మేంద్రియజ్ఞానేంద్రియములు లేనివాఁడవగుటచే నీకు (పలుకుట యిచ్చుట నడుచుట మలమూత్రములవిడుచుట సంభోగాదులచే సంతోషించుట అను) కర్మేంద్రియవ్యాపారములును, వర్ణాత్మకధ్వన్యాత్మకశబ్దములును, మృదుకఠినశీతోష్ణాదిస్పర్శములును, నీలపీతహ్రస్వదీర్ఘాదిరూపములును, తీపు వగరు కారము మొదలగు రసములును, సుగంధ దుర్గంధ మిశ్రగంధములును (అను) జ్ఞానేంద్రియ వ్యాపారములును లేవు. నీవు ప్రాణములు లేనివాఁడవగుట వలన నీకు కదలుట పనిగట్టుట ముడుచుకొనుట వణఁకుట చాఁచుట మొదలయినవియును, ఆఁకలి దప్పి మొదలయినవియును లేవు, నీవు అమనస్కుఁడ వగుటచేత (నీకు సంకల్పాత్మక మగు మనస్సు లేనందున) నీకు కోరుట కోరకయుండుట స్త్రీవిషయక మగు ప్రేమ ద్వేషము (ఒకఁడపకృతి జేసెనేని మఱల గాని మాఱుచేయవలె నని యుండుట) ఇండ్లు తోఁటలు ధనము ధాన్యము మొదలగువానిని సంపాదింపవలయు నని తోఁచుట, తనప్రయత్నమునకు విఘ్నము చేయువానియందు క్రమముగాఁ గలిగెడు వృత్తి అణఁచినవారి బాగుల నిలువు చేయఁగూడ దని తోఁచుట (అనునవి) లేవు, మఱియు నందుచేతనే (అమనస్కుఁడ వగుటచేతనే) ఐశ్వర్యగర్వంబున నిది చేయఁదగిన దనియును ఇది చేయఁతగనిదనియును తెలియకపోవుటయు, ఐశ్వర్యయుక్తుఁడ వగు నేఁ జేయుపను లెల్ల చెల్లు నని తోఁచుటయు, తనకంటె నొకఁడెక్కువై యుండెనేని వాని యుత్కర్షము నోర్వఁజాల కుండుటయు, దుఃఖము పరునికి రాక తనకు రావచ్చునా యని తోఁచుటయు, నావలె పరులు సౌఖ్యముగా నుండవచ్చునా యని తోఁచుటయు, తాఁ జేసినధర్మము నందరు గణించి మెచ్చవలె నని తోఁచుటయు, నే శ్రేష్ఠుఁడను నాతో నెవరీడు గారని తోఁచుటయు, నేను సర్వజ్ఞుఁడ నని తోఁచుటయు, (అనునవి యన్నియును) లేవు. మఱియు నందుచేతనే (అమనస్కుఁడ వగుటచేతనే) నీకుఁ జెప్ప వలవిగాని అంతర్బహిశ్శబ్దాదిక్రియలఁ జేయవలయు నని తోఁచుటయు, పరగుణదోషముల నపహరింపవలె నని తోఁచుటయు, సత్యజ్ఞానమనంతం బ్రహ్మ యని యుండ నేను బ్రహ్మమగునో కానో యనెడు సందేహమును నిగ్రహమును జీవకారుణ్యమును (దయయును భీతియును దుఃఖమును నెగుడయు పిరికితనము దీనత్వము మొదలయినవియును, పరబ్రహ్మము లోకము అను నీ రెండువస్తువులయొక్క తెలిసికొనుటయును) ఇహపరలోకములయందు నిరాశయును, అంతరింద్రియనిగ్రహమును, బాహ్యేంద్రియనిగ్రహమును, విహితకర్మముల విముక్తముగ విడుచుటయును, శీతోష్ణాది ద్వంద్వసహనమును, గురువులయందును వారుపదేశించు వేదాంతమహావాక్యములయందును దేవునియందును గల విశ్వాసమును, సర్వేంద్రియములను విషయములనుండి త్రిప్పి వేదాంతవిచారణయందు నిలుపుట, మోక్షమునందలి కోరిక, మహావాక్యార్థముల వినుట, గురువుల వలన విన్నదానిని యుక్తులచేత నేకవాక్యము చేసి చింతించుట, విజాతీయము లగు కామాదుల విడిచి సజాతీయము లగు సచ్చిదానందనిత్యనిర్మలపరిపూర్ణపరబ్రహ్మమే నే ననెడు స్వానుభూతి గలిగి యుండుట, అపరోక్షము మొదలగునవియును లేదు. మఱియు నీవు నిశ్చయాత్మక మయిన బుద్ధికిని లక్ష్యముండవును, అహంభావము లేనివాఁడవును అగుటచేత మాటలాడు నేర్పు, ఈవి, సదుమనోపిక, మలమూత్రాదుల విడుచుటయును, సురతాదులచే నానందించుటయును, వినుటయును, సోఁకుటయును, చూచుటయును, రసముల నాస్వాదించుటయును, ఘ్రాణించుటయును, అభిమానించుటయును, అనుభవిం

చూచుటయును, తలంచుటయును, ఎఱుంగుటయును, ఆలోచించుటయును, చంపుటయును, కొలందియిడుటయును, ధ్యానించుటయును లోనుగాఁ గల యివి యన్నియును నీవు లేవు, ఏక మైనట్టిదియును, నిర్మల మైనట్టిదియును, జ్ఞానస్వరూప మైనట్టిదియును, కూటస్థబ్రహ్మమునకంటె వేఱు గానిదియును నగు హీనాధిక సమానములు లేని పరబ్రహ్మముయొక్క తేజస్స్వరూపుఁడవు గనుక కూటస్థుఁడ వైన నీవు దేహమును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములును, పంచప్రాణములును, సంశయరూపమగు మానసమును, నిశ్చయాత్మకబుద్ధియును, చంచలాత్మకచిత్తమును, కర్తృత్వరూపకాహంకారమును గాను, ఆనంతట ప్రకాశించునట్టిదియును, కాలత్రయమందుండునట్టిదియును నగు అపరోక్షజ్ఞానానందముతో ఆకారముగాఁ గలవాఁడ వని నీవు నిన్ను చూచెడు సమాధిసమయమందు త్రిగుణవికారములతోఁ గూడిన మనస్సు లేనివాఁడ వగుచున్నావు, ఇట్లు భూతభవిష్యద్వర్తమానములయందుఁ బ్రకాశించుచుండుటవలన వికల్పములు లేనివాఁడవును, ఏక రీతిగా నుండువాఁడవును నై యుండుటయే లయవిక్షేపకషాయరసాస్వాదములు లేనట్టిదియును, ఆనంతటఁ బుట్టినదియును అగు అమనస్క రాజయోగముయొక్క సమాధి యని చెలువుగాఁ దెలిసికొని ఆంజనేయుండు సీతారామున కిట్లు చెప్పుచున్నాఁడు

సమాధియందు మనస్సు కలదా లేదా యని ప్రశ్నించుట.

క. ఇది యిది యనాత్మ నేఁ గా, నిది బ్రహ్మము నే నటంచు నెఱుఁగునపుడు న
న్నది కలదో లేదో యిది, విదితంబుగఁ దెలియఁ జెప్పవే శ్రీరామా. ౬౬

టీక. శ్రీరామా-శ్రీ = బ్రహ్మవిద్యతోడ, రామా = క్రీడించుచున్న యో శ్రీరాముఁడా! ఇది = ఈ కనఁబడుచున్న బాహ్యప్రపంచమును, ఇది = ఈ కనఁబడుచున్న అంతరప్రపంచమును, అనాత్మ = జడము, నేఁగాను = ఇది నేను గాను, ఇది = ఈ కనఁబడుచున్నది, బ్రహ్మము = ప్రపంచాతీత మైన పరమాత్మ, (ఈ పరమాత్మ) నే నటంచున్ = నేనని, ఎఱుఁగునపుడు = తెలిసికొనునపుడు, నన్నది = అనృతజడదుఃఖాత్మక మైన మనస్సు, కలదో లేదో = ఉన్నదా లేదా, ఇది = ఈ సంశయము, విదితంబుగన్ = విశదముగా, తెలియన్ = తెలియునట్లు, చెప్పవే = వచింపవయ్యా.

తా. బ్రహ్మవిద్యతోడఁ గ్రీడించుచున్న రామా! జడ మగు నీ కనఁబడుచున్నట్టి అంతరబాహ్యప్రపంచమంతయును ప్రపంచాతీత మయిన పరమాత్మ యగు నేఁ గా నని తెలిసికొనినపుడు అనృతజడదుఃఖాత్మక మయిన మనస్సు గలదో లేదో యను సంశయము గలిగి యున్నది గనుక అట్టి సంశయము తెలియునట్లు చెప్పవయ్యా యని తాత్పర్యము.

వ. సమాధియందు మనంబు గల దంటేని. ౬౭

టీక. సమాధియందున్ = బ్రహ్మనిష్ఠయందు, మనంబు = మనస్సు, కలదంటేని = ఉన్నదంటివా.

తా. బ్రహ్మనిష్ఠయందు మనస్సున్న దన్నయెడల.

సీ. మనసు గల్గిన బుద్ధియును దశేంద్రియములు, ప్రాణాదులును జగత్పతి వసించు
నవియు స్థూలదేహంబును విడిచియుండవు గాన నదియు నంగీడంగ వలసె
ఘనకారణము లేని కార్యంబు లిల లేవు, గావున దానినిక్కడయు నొప్పు
మూఁడు వేనలనంటి కొదలును దాఁది లేని, సంసారమంత యుత్పన్నముగనుండు

తే. నట్టు లుండిన నో సహజామనస్క, రాజయోగసమాధి నిరంతరంబు
నెవ్విధంబున సిద్ధించు నెంచి చూడ, జానకీరామ దేవతాసార్వభౌమ. ౬౮

టీక. దేవతాసార్వభౌమ = దేవతాచక్రవర్తియైన, జానకీరామ = సీతారాముఁడా! మనసు = (అనృతజడదుఃఖరూపమైన) మనస్సు, కల్గినన్ = సమాధియం దుండనేని, బుద్ధియున్ = నిశ్చయాత్మక బుద్ధియును, దశేంద్రియములు = జ్ఞానేంద్రియకర్మేంద్రియములును, ప్రాణాదులును = ప్రాణాదివాయువులును, కలిపడివసింపున్ = వేరై యుండును-అనఁగా మనస్సు గల్గిన బుద్ధి లోనగునవి యన్నియు గలుగు ననుట, (ఈ మానసాదులు పదునేడును గూడి సూక్ష్మశరీర మనుట, సూక్ష్మశరీరమునకు తత్త్వములు కొందఱి మతమందు పందొమ్మిదగు, అప్పు డంతఃకరణచతుష్టయముఁ జేర్పవలయును. కొందఱిమతమందుఁ బదునేడు, అప్పుడు మనస్సును చిత్తము నొక్కటి, బుద్ధియు అహంకారము నొక్కటి యగు, కొందఱి మతమందు పదియారు, అప్పు డంతఃకరణ మొక్కటి యగును గాన నెటులఁ జెప్పినను నిర్బాధకము, అవియున్ = ఆ మనస్సు మొదలగునవి, ఈ స్థూలదేహంబున్ = ఈ స్థూలశరీరమును, విడిచియుండవు గానన్ = వదలియుండవు గనుక, అదియున్ = ఆ స్థూలశరీరమును, ఉండంగవలసెన్ = ఉండవలసియున్నది, ఇలన్ = భూమియందు, ఘనకారణము లేని — ఘన = అమోఘమైన, కారణము లేని = నిమిత్తమగు దండచక్రాదికము లేని, కార్యంబులు = కృత్యము లగు ఘటాదులు, లేవు గావునన్ = ఉండవు గనుక, దానినిల్కడయున్ — దాని = ఆ కారణశరీరము యొక్క, నిల్కడయున్ = ఉనికియు, ఒప్పున్ = తగును - అనఁగా లోకమందు నిమిత్తకారణము లైన దండచక్రాదులు లేక నే కార్యము లైన కుండలు మొదలయినవి యుండవు గనుక యిచ్చట కార్యము లగు స్థూలసూక్ష్మశరీరము లుండుటబట్టి వీనికి కారణ మగు కారణశరీరమును గల దనుట, మూఁడు మేనులన్ = శరీరత్రయమును, అంటి = పొంది, మొదలును తుది లేని = ఆద్యంతములు లేని, సంసారమంత = అహంకారవ్యాపార మంతయు, అచ్చముగ నుండున్ = స్పష్టముగా నుండును, అట్టు లుండినచోన్ = అప్రకార మహంకారవ్యాపార మున్నయెడల, సహజామనస్కరాజయోగసమాధి—సహజ = నైజమైన, అమనస్క = మనశ్శూన్యమైన, రాజ = శ్రేష్ఠమైన, యోగ = ప్రత్యక్పరబ్రహ్మస్వరూపమైన, సమాధి = నిష్ఠ, ఎంచిచూడన్ = పరిశీలింపఁగా, నిరంతరంబును = సర్వదా, ఎవ్విధంబునన్ = ఎట్లు, సిద్ధించున్ = లభించును - అనఁగా లభింప దనుట.

తా. దేవతాసార్వభౌముఁడ వగు ఓ సీతారాముఁడా! అనృతజడదుఃఖరూపమగు మనస్సు సమాధియం దుండనేని నిశ్చయాత్మక మగు బుద్ధియును, జ్ఞానేంద్రియకర్మేంద్రియములును, ప్రాణాదివాయువులును వేరై యుండును, (మనస్సు గల్గెనేని బుద్ధి లోనగునవి యన్నియును గల్గు ననుట) ఆ మనస్సు మొదలగునవియును ఈ స్థూలదేహమును వదలి యుండవు గనుక ఆ స్థూలశరీరమును వుండవలసియే యున్నది; ప్రపంచమునందు నిమిత్తకారణము లైన దండచక్రాదులు లేక ఘటాదు లుండవు గనుక యిచ్చట కార్యము లగు సూక్ష్మశరీరము లుండుటవలన వీనికి కారణ మగు కారణశరీరమును గలదు, అట్టి శరీరత్రయమును పొంది ఆద్యంతములు లేని యహంకారవ్యాపారమంతయు స్పష్టముగా నుండును, ఆలోచింపఁగా ఆ ప్రకారము అహంకారవ్యాపార మున్నయెడల సహజ మైనట్టియు, మనశ్శూన్య మైనట్టియు, శ్రేష్ఠ మైనట్టియు, ప్రత్యక్పరబ్రహ్మస్వరూప మైనట్టియు సమాధి సర్వదా లభింపనేర దని తా.

వ. అట్లగుటంజేసి మనంబు లే దంటేని. ౬౯

టీక. అట్లగుటంజేసి = అటుల రాజయోగనిష్ఠ సిద్ధింపక పోవుటచేత, మనంబు లేదంటేని = సమాధికాలమందు మనస్సు లేదంటివా.

తా. అట్లు రాజయోగనిష్ఠ సిద్ధింపకపోవుటచేత మనస్సు లేదంటివా

మ. తనర న్నెమ్మది యంతయుం బొలియఁగాఁ దత్త్వాత్ముఁడై యుండినం
బునరుత్థానము గల్గ దాతనికి నీపోం దోఁపినన్ ధాత్రిపైఁ
గనఁ డాత్మానుభవంబు గాంచి యమనస్కం బెంచి బోధింపు స
జ్జను లాచార్యులు గల్గ రంచు మదిలోఁ గంకింతు సీతాపతీ. ౧౦

టీ. సీతాపతీ = రామచంద్రా! తనరన్ = బాగుగా, నెమ్మది యంతయున్ = చిత్తమంతయు, పొలియఁగాన్ = నశింపఁగా, తత్త్వాత్ముఁడై యుండినన్ = పరబ్రహ్మస్వరూపుఁడై యున్నను, ఆతనికిన్ = ఆ బ్రహ్మనిష్ఠునకు, పునరుత్థానము = సమాధినుండి మరల లేచుట, కల్గదు = సంభవింపదు, ఈపోం దోఁపినన్ = మరల లేవక యుండుట సంభవించెనేని, ధాత్రిపైన్ = భూమియందు, ఆత్మానుభవంబున్ = బ్రహ్మనిష్ఠను, కనఁడు = ఎవ్వఁడును పొందఁడు, కాంచి = బ్రహ్మనిష్ఠను పొంది, అమనస్కంబు = అమనస్కయోగసమాధిని, ఎంచి = విమర్శించి, బోధింపుసజ్జనులు—బోధింపు = శిష్యుల కుపదేశించెడు, సజ్జనులు = బ్రహ్మవిదులైన, ఆచార్యులు = ఒజ్జలును, కల్గరంచున్ = ఉండరని, మదిలోన్ = చిత్తమునందు, శంకింతున్ = సందేహించుచున్నాను.

తా. రామచంద్రా! బాగుగా చిత్తమంతయు నశింపఁగా పరబ్రహ్మస్వరూపుఁడై యున్నట్టి బ్రహ్మనిష్ఠునకు సమాధినుండి మరల లేచుట సంభవింపదు (కలుగదు), ఒకవేళ మరల లేవకుండుట సంభవించెనేని భూమియందు బ్రహ్మనిష్ఠను యెవ్వండును బొందఁగాలఁడు, అట్లు బ్రహ్మనిష్ఠను పొంది అమనస్క రాజయోగి సమాధిని విమర్శించి శిష్యుల కుపదేశించు బ్రహ్మవేత్తలయిన ఆచార్యు లుండరని మనస్సులో సందేహించుచున్నానని తాత్పర్యము

క. బోధాచార్యులు లేరని, సాధించిన రాజయోగిసంతతికిని త
ద్బోధంబునకుఁ దదీయసమాధికి బాధకము వచ్చు మది కదు లేమిన్. ౧౧

టీ. బోధాచార్యులు = బ్రహ్మజ్ఞానోపదేష్టలైన గురువులు, లేరని సాధించినన్—లేరని = ఉండరని, సాధించినన్ = నిశ్చయించినయెడల, రాజయోగిసంతతికిన్—రాజ = శ్రేష్ఠులైన, యోగి = యోగీశ్వరులయొక్క, సంతతికిన్ = పరంపరకు, తద్బోధంబునకున్ = ఆ యోగులు బోధించిన బోధకును, తదీయసమాధికిన్ = ఆ బోధింపఁబడినవారి బ్రహ్మనిష్ఠకును, మది = సమాధియందు మనస్సు, కదు లేమిన్ = కొంచెమేని లేకుండుటచేత, బాధకము వచ్చున్ = నిర్బంధము కలుగును

తా. బ్రహ్మజ్ఞానము నుపదేశించుగురువులు లేరని చెప్పినయెడల శ్రేష్ఠులైన యోగీశ్వరులయొక్క పరంపరకును ఆ యోగులు బోధించిన బోధకును ఆ బోధింపఁబడినవారి బ్రహ్మనిష్ఠకును సమాధియందు మనస్సు కొంచెమేని లేకుండుటచేత బాధకము వచ్చునని తాత్పర్యము.

వ. ఇవ్విధంబు గాక జ్ఞానవిజ్ఞానసంపన్నులైన మహానుభావులు సమాధియందుఁ గొంతతడవు మనోరహితులై యుండి కొండొకసేపునకు మేల్కని మెలంగుదురనిన బరమపదంబు నొందినవారికిఁ బునరావృత్తి ప్రాప్తింపదు గావున నామోక్షంబునకు నిత్యత్వంబు వచ్చు నిట్లు బహువికల్పసమన్వితంబైన యీసంశయంబు నిశ్శేషంబుగా నివర్తించునట్లు పరమరహస్యార్థం బుపదేశించి నిరతిశయకరుణాకటాక్షవీక్షణంబు చేత ననుగ్రహింపవే యని ప్రార్థించిన నయ్యాంజనేయుని కుశలతీవ్రసూక్ష్మప్రజ్ఞా

టీక. ఇది = ఈ కనఁబడెడి జగము, అనాత్మ = ప్రకృతి, ఇగి = ఈ యనాత్మ, నేఁగాను = నేను గాను, ఇది = ఈ కనఁబడెడిది, బ్రహ్మము = పరమాత్మ, నే నటంచును = నే నని, జడమై = అచేతనమై, కదలనిమది = చలింపని మనస్సు, ఎఱుఁగునె = తెలియఁజాలునా యెట్లన్నట్లు, ఆ మదిన్ = జడమైన యామనస్సును, కదిసి = పొంది, తెలియునతఁడె = బ్రహ్మము నెఱుఁగు పురుషుండే, స్వప్రకాశాత్ముఁడగున్ = స్వయంప్రకాశపరమాత్మస్వరూపుఁ డగును

తా. ఈ కనఁబడుప్రపంచము ప్రకృతి యనియును, అట్టి ప్రకృతి నేను గా ననియును, తాను పరబ్రహ్మ మనియును యీ జడ మగు మనస్సు తెలిసికొనఁజాలదు, అట్టి జడ మగు మనస్సును బొంది బ్రహ్మము నెఱుఁగువాఁడే స్వయంప్రకాశపరమాత్మస్వరూపుఁ డగు నని తాత్పర్యము.

చ. మనసు జడంబు దృశ్య మణుమాత్ర మనన్నియతావితర్క్యమున్
జననవినాశయుక్తమును సంశయరూపము దీనియున్కి చే
తను సుఖచిత్ప్రకాశమయుతం దగు నీకుఁ గళంక మేమి చ
క్కనిశశిశృంగదోషములు గల్గునె సూర్యుని కెన్నఁడేని యున్. ౨౪

టీక. మనసు = మనస్సు, జడంబు = ఏమియుఁ దెలియనిదియు, దృశ్యము = విషయరూపముగాఁ గనఁబడునదియు, అణుమాత్రము = అతిస్వల్పరూపము గలిగినదియు, అనత్ = అనిత్యము లైన దేహేంద్రియాదులను, నియతి = నిత్యము లని, అవితర్క్యమున్ = ప్రతిపాదించునదియును, జననవినాశయుక్తమును = ఉత్పత్తిలయములు గలదియును, సంశయరూపము = సందేహమే ఆకృతిగాఁ గలిగినది, దీనియున్కిచేతన్ = ఇట్టి మనస్సు గలిగి యుండుటచేత, సుఖచిత్ప్రకాశమయతన్ — సుఖ = ఆనందమునకుయొక్క, చిత్ = జ్ఞానముయొక్క, ప్రకాశమయతన్ = ప్రకాశమే స్వరూపముగాఁ గలవాఁడ వగుటచేత, తగునీకున్ = ఒప్పుచుండెడి నీకు, కళంక మేమి = కళంక మేమి? ఎన్నఁడేని యున్ = ఏకాలమందైనను, సూర్యునికిన్ = ప్రొద్దునకు, చక్కనిశశిశృంగదోషములు — చక్కని = సొగసైన, శశి = చంద్రునియొక్క, శృంగ = ప్రధానములగు కళలయొక్క దోషములు = వృద్ధిక్షీణాదిదోషములు, గల్గునె = సంభవించునా.

తా. మనస్సు ఏమియుఁ దెలియనిదియును, విషయరూపముగాఁ గనఁబడునదియును, అతిస్వల్పరూపము గలదియును, అనిత్యము లగు దేహేంద్రియాదులను నిత్యము లని ప్రతిపాదించునదియును, ఉత్పత్తినాశములు గలదియును, సందేహమే యాకృతిగాఁ గలదియు నై యున్నను, ఇట్టి మనస్సు గలిగి యుండుటచేత సుఖముయొక్కయు ఆనందముయొక్కయు ప్రకాశమే స్వరూపముగాఁ గల నీకు చంద్రునికిఁ గల వృద్ధిక్షీణాదిదోషములు సూర్యునికి సంభవింపనియట్లు మానసిక సంశయంబులు గలుగ నేర వని తాత్పర్యము

తే. శశవిషాణంబునకు నాకసంబునకును
గలుగునె పొసంగ సంగంబు దలఁచిచూడ
మనమునకు సచ్చిదానందమయుఁడ వైన
నీకుఁ బొందిక యెన్నఁడేనియును గలదె ౨౫

టీక. తలఁచిచూడఁగా = ఎంచిచూడఁగా, శశవిషాణంబునకున్ = కుందేటికొమ్మునకును, ఆకసంబునకున్ = ఆకసమునకును, సంగంబు = చేరిక, పొసంగన్ = అమరఁగ, కలుగునె = ప్రాప్తించునా?

మనమునకున్ = జడ మైన మనస్సునకును, సచ్చిదానందమయుండ వైన నీకున్ = సత్యజ్ఞానానంద స్వరూపుండ వైన నీకును, పొందిక = సంబంధము, ఎన్నఁడేనియును గలదె = ఎప్పు డైనఁ గలదా—అనఁగా లే దనుట.

తా. ఎంచిచూడఁగా గుంటకొయ్యకును, ఆకాశమునకును సంబంధము సంభవింపనట్లు జడ మైన మనస్సునకును సత్యజ్ఞానానందస్వరూపుండ వైన నీకు సంబంధ మెన్నఁడేనియును గలుగనేర దని తాత్పర్యము.

తే. స్వప్రకాశుండ వగు నిన్నుఁ సన్మనోవి, కారములు పొందునే స్ఫటికంపుఁగొండ
నెన్నఁడేనియుఁ గలలోనఁ గన్నయట్టి, సంజకెంజాయలంటునే యాంజనేయా.

టీక ఆంజనేయా = హనుమంతుఁడా! స్వప్రకాశుండ వగు నిన్నున్ = నీ యంతట ప్రకాశించెడి నిన్ను, సన్మనోవికారములు—సత్ = ప్రశస్తము లైన, మనః = మానససంబంధము లైన, వికారములు = సంకల్పవికల్పాదులు, పొందునే = అంటునా? ఎన్నఁడేనియున్ = ఏసమయమం దైనను, స్ఫటికంపు కొండన్ = స్ఫటికపర్వతమును, కలలోనన్ = స్వప్నమందు, కన్నయట్టి సంజకెంజాయలు—కన్నయట్టి = చూచిన, సంజ = సంధ్యాకాలమునఁగల, కెంజాయలు = ఎఱ్ఱనికాంతులు – అనఁగా సంధ్యారాగములు, అంటునే = స్పృశించునా – అనఁగా స్పృశింప వనుట.

తా. ఓ యాంజనేయా! సంధ్యాకాలమునందలి యెఱ్ఱని కాంతులు (సంధ్యారాగములు) స్ఫటిక పర్వతమును అంటనియట్లు స్వప్నమందుఁ జూచిన మానససంబంధము లగు సంకల్పవికల్పాదులు స్వయంప్రకాశుఁడ వగు నిన్నంటనేర వని తాత్పర్యము

వ. కపీంద్రా! జడఘటపటాదియుక్తంబు లైన ఛిద్రత్వాచ్ఛిద్రత్వశ్లక్ష్ణత్వాశ్లక్ష్ణత్వ స్పృష్టిమత్వాస్పృష్టిమత్వాదివికారంబులు విశ్వప్రకాశకుం డైన యాదిత్యునిం బొరయ నేరని తెఱంగున నహంకారధీమానసేంద్రియశరీరాదివిమగుణదోషంబులు స్వయంప్రకాశాత్మకుండ వైన నిన్ను బొందవు, వాయుతేజోజలభూములును దత్కార్యంబులును దనయందుఁ గలిగియు దా నన్నింటియందు వ్యాపించియు నేమిటినంటని మింటితెఱఁగునఁ జిత్తాదిసర్వకారణకార్యంబులును ని న్నాశ్రయించి నీయందు నిలిచియుండ సర్వవ్యాపకుండ వయ్యు నసంగుండ వైన నీ వేమిటిం జెంద వ ట్లగుటం జేసి. 22

టీక కపీంద్రా = ఆంజనేయా! జడ = అచేతనము లయిన, ఘట = కడవలు, పట = వస్త్రములు, ఆది = మొదలైనవానియందు, యుక్తంబులు = కూడినవి, ఐన = అగు, ఛిద్రత్వ = చిల్లిపోవుట, అచ్ఛిద్రత్వ = చిల్లులు లేక యుండుట, శ్లక్ష్ణత్వ = సన్నముగా నుండుట, అశ్లక్ష్ణత్వ = ముదుగుగా నుండుట, స్పృష్టిమత్వ = చేరియుండుట, అస్పృష్టిమత్వ = చేరకయుండుట, ఆది = మొదలైన, వికారంబులు = వికృతులు, విశ్వప్రకాశకుం డైన = జగమును వెలుఁగఁజేయుచున్న, ఆదిత్యునిన్ = సూర్యుని, పొరయ నేరని తెఱంగునన్ = పొందఁజాలనియట్లు, అహంకార = అహంభావము, ధీ = నిశ్చయాత్మకబుద్ధియు, మానస = సంశయరూపక మైన మనస్సు, ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములు, శరీర = దేహత్రయమును, ఆది = మొదలయినవానియొక్క, విమ = విరుద్ధము లైన, గుణ = గుణములవలని, దోషంబులు = కుటిలమార్గములు, స్వయంప్రకాశాత్మకుండ వైన = తానే వెలిఁగెడు స్వభావము గల, నిన్నుఁ

విచారించంగా వృత్తిజ్ఞానమున నెల్లప్పుడు సాక్షియును, కూటస్థుండును అగు నాయునికిని గనిపించునట్లు ప్రసిద్ధ మయినదియును, రెండవదియును నగు రామనామము ప్రత్యగాత్మ నైన నుపాసించు దక్షులకు యునికిప ట్టయి ప్రణవస్వరూపమై ప్రకాశించు నని తాత్పర్యము

తత ప్రత్యగాత్ముండ నై నైన నేను, బ్రహ్మరూపుండ నని నాస్వభావ మరసి
తెలియుటకున్ మూడవయౌ రామనామము క్షరాక్షరవిలక్షణమునగుచు.

టీక. అతత ప్రత్యగాత్ముండన్—అతత = అంతట నిండియున్న, ప్రత్యగాత్ముండన్ = కూటస్థుండను, నేను = అయినట్టి నేను, బ్రహ్మస్వరూపుండ నని = సత్యజ్ఞానానందస్వరూపుండని, నాస్వభావ మరసి—నా = నాయొక్క, స్వభావము = యునికిని, అరసి = శోధించి, తెలియుటకున్ = ఎఱుంగుటకు, మతి = నిండియుండు, అత్యంతము మూడవ రామనామము = ఆ మూడవ రామనామము, క్షర = నశించెడు భూతభౌతికముల కంటె, అక్షర = ఆ భూతభౌతికములయందుండు వ్యాపక మయిన కూటస్థచైతన్యమునకంటె, విలక్షణంబు నగుచున్ = వ్యతిరిక్త మయిన అనిపదమై, ఒప్పున్ = వెలుంగును

తా. అంతట వ్యాపించి యుండు కూటస్థుండ నైన నేను సత్యజ్ఞానానందస్వరూపుండ నని నాయునికిని శోధించి తెలిసికొనుటకు ఆ మూడవ రామనామము నశించెడు భూతభౌతికములకంటెను నాశము నొందని భూతభౌతికములయందుండు వ్యాపక మయిన కూటస్థచైతన్యముకంటెను వ్యతిరిక్త మగు అనిపద మగుచు ప్రకాశించు నని తాత్పర్యము.

తే. ప్రేమచే నిట్లు శ్రీరామ రామ రామ, యనుచు నన్ను భజించు మహాత్ములకును
మిగుల నిత్యానపాయిని యగుచు యోగ,సిద్ధిఁ గావించుచుండు నీశ్రీవధూటి.

టీక. ప్రేమచేన్ = అతిప్రీతిచేత, ఇట్లు = పైఁ జెప్పినవిధముగా, శ్రీరామ రామ రామ యనుచున్ = శ్రీరామ రామ రామ యని, నన్ను భజించు మహాత్ములకున్ = కేవలాత్ముండ నైన నన్ను సేవించెడు మహానుభావులకు, ఈ శ్రీవధూటి = బ్రహ్మవిద్యాస్వరూపిణి యైన యీ సీతాదేవి, మిగులన్ = మిక్కిలి, నిత్యానపాయిని యగుచున్ = ఎల్లప్పుడును వారిని విడువనిదై, యోగసిద్ధిన్ = ఐక్యసిద్ధిని, కావించుచుండున్ = చేయుచుండును

తా. బ్రహ్మవిద్యాస్వరూపిణి యగు సీతాదేవి అత్యంతప్రీతిచేత పైఁ జెప్పినట్లు శ్రీరామ రామ రామ యని కేవలాత్ముండ నైన నన్ను సేవించు మహానుభావుల నెల్లప్పుడు విడువనిదియై వారలకు ఐక్యసిద్ధిని చేయుచుండు నని తాత్పర్యము ౫౮

వ. అట్లు గావున

టీక. అట్లు గావునన్ = అవ్విధముగా నైక్యసిద్ధిని గావించును గనుక

మ. తలఁపం బూర్ణము నిర్వికార మగు తత్త్వం బిట్లు భాసిల్లఁగా
దెలియన్నేరక మూఢు లైన నరు లీ దేహేంద్రియప్రాణబు
ద్ధుల నెల్లప్పుడు నిగ్రహించుటకు నెంతో రక్తులై యాత్మునిం
దెలియం జాలరు వారికెం గలుగునే యీ ధీసాక్షి నీక్షింపఁగన్. ౫౯

టీక. తలఁపన్ = యోచింపఁగా, పూర్ణము = నిండినదియు, నిర్వికారము = షడ్భావవికారములు లేనిదియు, అగు తత్త్వంబు = ఏన బ్రహ్మతత్త్వము, ఇట్లు = ఈ త్రివిధరామనామరూపముచేత, భాసిల్లఁగాన్ = వెలుఁగుచుండఁగా, మూఢు లైన నరులు = అవివేకు లయిన మనుజులు, తెలియనేరక =

కాంచు = చూచునట్టి, విహితజ్ఞానరుచ్ = తెలివి గలవానికి, పరికింపఁగ = పరిశీలింపఁగ ఏమఁగు, కల్గునే = ఉండునా, అట్లు = పైని చెప్పినరీతున, సర్వ మనువానికిన్ = ఇగి గు ప్రపంచము సత్యమను దృష్టి గలవానికి, బ్రహ్మము గానుపింపగు= ఆత్మ కనఁబడదు, అట్లుండ మనెడు దృష్టి గలవానివలెనే, ఊరక = విరామము లేక, బ్రహ్మమంగుచ్ = అంతయు పర యని, కనుయోగికిన్ = కనుఁగొనెడు బ్రహ్మవిదుండు, సర్వాబు = నామరూపాత్మకప్రపంచము, తోఁచునే = ఉండి కనఁబడునా.

తా. దారు వేమఁ గని భ్రమయువానికి దారువు దోఁపనినిషాగా గన్పడునదియంతయుఁ బ్రపం. మను తలఁపు గలవానికి పరబ్రహ్మము తోఁపదు, దారు గని నిశ్చయించువానికి [illegible] పైనట్లు బ్రహ్మస్వరూపముగా నెంచువానికి సర్వప్రపంచమును బ్రహ్మస్వరూపమే యగు తోఁచు నని తాత్పర్యము.



సీత. శ్రీరాములు ఆంజనేయులు.

వ. అనిన విని హనుమంతుండు సీతారామున కిట్లనియె. ౧౦౪

టీక. అనినన్ = అని పలుకఁగా, విని = ఆకర్ణించి, హనుమంతుండు = ఆంజనేయుండు, సీతారామునకున్ = చిచ్ఛక్తితోఁ గూడిన పరబ్రహ్మస్వరూపుఁడైన రామచంద్రునకు, ఇట్లనియెన్ = ఈ పైఁ జెప్పఁబోవునట్లు చెప్పెను.

తా. అని పలుకఁగా విని యాంజనేయుండు చిచ్ఛక్తితోఁ గూడినవాఁడును, పరబ్రహ్మస్వరూపుఁడును అగు రామచంద్రున కిట్లు చెప్ప నారంభించె నని తాత్పర్యము

సర్వము బ్రహ్మ మనెడి జ్ఞానివర్తన మెట్లుండు ననుట.

క. మీరలు నుడివిన వడువున, నారసి సర్వంబు బ్రహ్మ మని కను ఘనుఁ డే
ప్రారబ్ధవ్యవహారం, బేరీతిం జేయు దీని నెఱిఁగింపుఁ డనన్. ౧౦౫

టీక. మీరలు = మీరు, నుడివినవడువున = బోధించినయట్లు, అరసి = శోధించి, సర్వంబు = సకలము, బ్రహ్మ మని = పరమాత్మయే యని, కనుఘనుండను = చూచు మహనీయుండగు, ఏప్రారబ్ధవ్యవహారంబున్ — ప్రారబ్ధ = సంచితసంభూత మగు ప్రారబ్ధముయొక్క, ఏవ్యవహారంబున్ = ఏలాటి వ్యాపారమును, ఏరీతిం జేయుదున్ = ఏప్రకారముగ జరుపుదును, గినిన్ = ఈ యర్థమును, ఎఱింగింపుండు = తెలుపుండు, అనన్ = అనంగా

తా. మీరు బోధించినట్లు శోధించి సర్వము పరబ్రహ్మ మని జూచునట్టి మహనీయుండగు ప్రారబ్ధవ్యవహారము లెట్లు జరుపునో తెలియజేయుండు మని ప్రార్థింపంగా నని తాత్పర్యము

వ. అనిన శ్రీరామచంద్రుం డవ్వానరేంద్రున కిట్లనియె. ౧౦౭

టీక. అనినన్ = ఇట్లడుగంగా, శ్రీరామచంద్రుండు = శ్రీరామమూర్తి, అవ్వానరేంద్రునకున్ = ఆ యాంజనేయునకు, ఇట్లనియెన్ = ఇట్లు చెప్పంబూనెను.

తా. ఇట్లు ప్రార్థింపంగా నవ్వానరేంద్రునకు శ్రీరామచంద్రుం డిట్లు చెప్పంబూనెను

చ. ఘటకటకోర్మికాపటనికాయముల న్సువివేకదృష్టిచేఁ
దటుకున మృత్సువర్ణజలతంతువు లంచు నెఱింగినంతఁ ద
త్స్ఫుటతరనామరూపములు పోవమి నన్నియుఁ గార్యకోటికి నె
ప్పటివలె వచ్చు వచ్చినను బాధక మున్నదె హేతుదృష్టికిన్. ౧౦౮

టీక. ఘట = కలశములు, కటక = కడియములు, ఊర్మిక = అలలు, పట = వస్త్రములు, (వీనియొక్క) నికాయములన్ = సంఘములను, సువివేకదృష్టిచేన్ = వస్తుతత్త్వజ్ఞానదృష్టిచేత, తటుకునన్ = అప్పుడే, మృత్సువర్ణజలతంతువులంచున్ — మృత్ = మన్ను, సువర్ణ = బంగారు, జల = నీరు, తంతువులు = నూలు, (ఇచ్చట క్రమాలంకారము) ఎఱింగినంతన్ = తెలిసికొన్నమాత్రముననే, తత్ = ఆఘటకటకాదులయొక్క, స్ఫుటతర = చక్కఁగాఁ దోఁచుచున్న, నామరూపములు = వానివాని పేళ్లును ఆకృతులును, పోవమిన్ = చెడకయుండుటవలన, అన్నియున్ = ఆ నామరూపము లెల్లను, కార్యకోటికిన్ = పాకాదికార్యసముదాయమునకు, ఎప్పటివలె వచ్చున్ = పూర్వమువలె వాడుకొనుట కుపయోగించు చుండును, వచ్చినన్ = అట్లు వాడుకొనుట కుపయోగించుచు వచ్చినను, హేతుదృష్టికిన్ = ఘటకటకాదులు మృత్సువర్ణాదులని తెలిసిన కారణదృష్టికి, బాధక మున్నదె = విరోధము గలదా - అనఁగా విరోధము లేదనుట

తా. ఓ యాంజనేయా! వస్తుతత్త్వజ్ఞానదృష్టిచేత కడవలు, కడియములు, అలలు, వస్త్రములు వీనియొక్క సమూహములను తత్క్షణమే మన్ను, బంగారు, జలము, నూలు అని తెలిసికొన్నమాత్రముననే యా ఘటపటకటకోర్మికలయొక్క చక్కఁగాఁ దోఁచు చున్న వానివాని పేళ్ళును వానివానియాకారములును చెడ కుండుటవలన ఆ నామరూపము లెల్లను పాకాదికార్యసముదాయమునకు పూర్వమువలె వాడుకొనుట కుపయోగించు చుండును, అట్లు వాడుకొనుట కుపయోగించుచు వచ్చినను ఆ ఘటకటకాదులు మృత్సువర్ణాదులని తెలిసిన కారణదృష్టికి విరోధము లేదని తాత్పర్యము

శా. ఆరీతిన్ సకలంబు తత్త్వ మని దివ్యాధ్యాత్మయోగంబుచే
నారూఢిం గను యోగి కెయ్యెడఁ దదీయాంగేంద్రియాత్మాళికిం

ప్రారబ్ధానుభవంబు గల్గు నటులు లోఁజూచెనింకఁ దా ద్రష్టయై
సారోదారవిచారదృష్టి నరయున్ సర్వంబు బ్రహ్మంబుగాన్. ౧౦౮

టీక. ఆరీతిన్ = అట్లు, సకలంబు = నామరూపాత్మకప్రపంచమంతయును, బ్రహ్మ మని = బ్రహ్మమని, దివ్య = అప్రాకృతమైన, అధ్యాత్మయోగంబుచేన్ = జీవేశ్వరైక్యజ్ఞానముచేత, ఆరూఢిన్ = నిశ్చయముగా, కనుగొనఁగన్ = చూచెడు బ్రహ్మవేత్తకు, ఎయ్యెడన్ = ఏస్థలమందైనను, తదీయ = ఆ బ్రహ్మజ్ఞానియొక్క, అంగ = శరీరముయొక్క, ఇంద్రియ = దశేంద్రియములయొక్క, ఆత్మ = బుద్ధియొక్క, ఆళికిన్ = గుంపునకు, ప్రారబ్ధానుభవంబు – ప్రారబ్ధ = తొల్లి చేయఁబడిన ప్రారబ్ధముయొక్క, అనుభవంబు = అనుభోగము, కల్గున్ = ఘటించును, అటులు = కల్గునట్లు, లోఁజూచెన్ = తోఁచెనని, తాన్ = ఆ బ్రహ్మజ్ఞాని, ద్రష్టయై – సాక్షియై, సారోదారవిచారదృష్టిన్ – సార = శ్రేష్ఠమైన, ఉదార = గంభీరమైన, విచారదృష్టిచేన్ = ఆత్మానాత్మవిచారజ్ఞానముచేత, సర్వంబున్ = అంతయును, బ్రహ్మంబుగాన్ = పరమాత్మగానే, అరయున్ = ఎంచును.

తా. ఆప్రకారము నామరూపాత్మకప్రపంచమంతయును బ్రహ్మమని అప్రాకృతమైనట్టి జీవేశ్వరైక్యజ్ఞానముచేత నిశ్చయముగాఁ జూచెడు బ్రహ్మజ్ఞానికి ఏస్థలమందైనను ఆ బ్రహ్మవేత్తకు శరీరము, కర్మేంద్రియ జ్ఞానేంద్రియములు, బుద్ధి వీనియొక్క సమూహమునకు తొల్లిచేయఁబడిన ప్రారబ్ధముయొక్క అనుభవము గల్గును, అట్లు తోఁచెనని యా బ్రహ్మవేత్త సాక్షియై శ్రేష్ఠమైనట్టియు గంభీరమైనట్టియు ఆత్మానాత్మవిచారజ్ఞానముచేత అంతయును పరమాత్మగానే కనుఁగొను నని తాత్పర్యము.

శా. గానంబు న్నటనంబుఁ దాళగతులం గావించుచు న్నారువి
ద్యానైపుణ్యముఁ జూపుమేల్ శిరముమీఁదం గల్గు పెన్గొంగగం
బూనం జైకొను నాట్యశీలునిగతిన్ బుంఖానుపుంఖోజ్జ్వల
న్నానార్థానుభవస్థుఁ డయ్యు బుధుఁ డానందాత్ముఁ గాంచున్ మదిన్. ౧౦౯

టీక. గానంబున్ = సంగీతమును, నటనంబున్ = నృత్యమును, తాళగతులన్ — తాళ = ధ్రువాది తాళములయొక్క – తాళ మనఁగా హస్తద్వయసంయోగవియోగంబులను గలిగి కాల మార్గ క్రియా అంగ గ్రహ జాతి కళ లయ యతి ప్రస్తారము లనెడు దశవిధప్రాణములతోఁ గూడినది తాళ మనఁబడును, అది ధ్రువ మఠ్య రూపక ఝంపె త్రిపుట అటతాళ ఏకతాళము లని ౭ విధములు, ఇవి చతురశ్ర త్రిశ్ర మిశ్ర ఖండ సంకీర్ణము లనెడు జాతు లైదింటిచేత ప్రస్తరింపఁగా ముప్పదియైదు భేదంబు లగు తాళములయొక్క గతులను ౧, ౨, ౪, ౮, ౧౨, ౧౬ అక్షరకాలములు గలుగఁగల అనుద్రుత ద్రుత లఘు గురు ప్లుత కాకపదము లను సంగములమార్గములను, కావించుచున్ = చేయుచు, చారువిద్యానైపుణ్యమున్ – చారు = మనోజ్ఞమైన, విద్యా = జారు నొక్కు ఢాలు మొదలైన దశవిధగమకభేదములతోఁ గూడిన సంగీతవిద్యయందలి, నైపుణ్యమున్ = నేర్పును, చూపుచున్ = అగపఱచుచు, శిరముమీఁదన్ = తలమీఁదను, కల్గుపెన్గొంగన్ – కల్గు = ఉండెడు, పెన్ = గొప్పదయిన, గొంగన్ = కలశపంక్తిని, పూనన్ = ధరించుటకు, చైకొను నాట్యశీలునిగతిన్ = చేకొనెడు నాట్యవిద్యానైపుణ్యము కలవానివలె, పుంఖానుపుంఖ = తండోపతండము లయి, ఉజ్జ్వలత్ = ప్రకాశించుచున్న, నానా = అనేకములైన, అర్థ = ఇంద్రియార్థములయందు, అనుభవస్థుఁ డయ్యున్ = సుఖానుభవము గలవాఁ డైనను, బుధుఁడు =

త్రిగుణములు లేని, ఆనంద = బ్రహ్మానందమంగు, మరుండు = ఆశ గల బ్రహ్మవేత్త, తనరు = ప్రకాశించుచుండెడి, సాత్త్వికరాజసతామసములన్ = ప్రకృతిరూపము లైన సత్త్వరజస్తమోగుణవికారములను, పొంది పొందండు = అంటియు అంటక యుండును

తా. రాగాదిపాపగుణములు లేని గౌరాయాంగనేయా! వృత్తిని తెలిసియు తెలియకయు ఒంటరిగాం దిరిగెడు ఈశ్వరపురుషుని త్రిగుణరహిత మగు బ్రహ్మానందమున గాఢ ఆశ గల బ్రహ్మవేత్త ప్రకృతిరూపము లైన సత్త్వరజస్తమోగుణవికారములను అంటియు అంటక యుండును అని తాత్పర్యము.

చ. పరపురుషానురక్తి గల యే భామిని యెల్లపనుల్ గృహంబునం
బోరిఁబోరిఁ జేయుచుం బ్రియునిఁ బొందు సుఖంబుగఁ గాంచురీతి భా
స్వరపరతత్త్వవేది నిజవర్ణనిజాశ్రమయోగ్యధర్మముల్
నిరతము సల్పుచుం బరమనిర్మలసౌఖ్యము గాంచు నెమ్మదిన్. ౧౧౭

టీక పర = ఇతరుఁ డైన, పురుష = మగవానియందు, అనురక్తి గల = వలపు గలిగిన, భామిని = స్త్రీ - అనఁగా జారస్త్రీ, గృహంబునన్ = ఇంటను, ఎల్లపనులు = అన్ని కార్యములను, పోరి బోరిన్ = క్రమక్రమముగా, చేయుచున్ = ఒనర్చుచును, ప్రియునిపొందున్ = జారపురుష సాంగత్యమును, సుఖముగన్ = సౌఖ్యముగా, ఎంచురీతిన్ = తలంచినట్లు, భాస్వరపరతత్త్వవేది - భాస్వర = ప్రకాశితమైన, పరతత్త్వ = పరబ్రహ్మమును, వేది = ఎఱిఁగిన బ్రహ్మవేత్త, నిజవర్ణ = బ్రాహ్మణాదివర్ణములలోఁ దన దైన వర్ణమునకును, నిజాశ్రమ = బ్రహ్మచర్యగార్హస్థ్యాశ్రమములలోఁ దన దైన యాశ్రమమునకును, యోగ్య = తగిన, ధర్మములు = పుణ్యకృత్యములను, నిరతము = ఎల్లప్పుడు, సల్పుచున్ = ఒనర్చుచు, నెమ్మదిన్ = స్వస్థచిత్తతచేత, పరమ = నిరవధిక మయిన, నిర్మల = ఆణవ కార్మిక మాయామలములు లేనట్టి, సౌఖ్యమున్ = బ్రహ్మానందమును, కాంచున్ = పొందును

తా. పరపురుషునియందు అనురాగము గల వనిత తన యింటి యన్ని కార్యములను క్రమక్రమముగాఁ జేయుచు జారపురుషునిసాంగత్యము సుఖముగాఁ దలఁచినట్లు, ప్రకాశించు పరబ్రహ్మమును దెలిసిన బ్రహ్మవేత్త బ్రాహ్మణాదివర్ణములలోనిది యగు తనవర్ణమునకును, బ్రహ్మచర్యగార్హస్థ్యాశ్రమములలో దన దయిన యాశ్రమమునకును తగిన పుణ్యకృత్యముల నెల్లప్పుడొనర్చుచు స్వస్థచిత్తుఁడై నిర్మల మగుచున్నదియును, త్రిమలరహిత మయినట్టిదియును నగు బ్రహ్మానందమును పొందు నని తాత్పర్యము

వ. అట్టి మహానుభావుండు ప్రారబ్ధవశంబుచే స్వవర్ణాశ్రమోచితధర్మంబులయందుఁ
బ్రవర్తించుసమయంబున. ౧౧౮

టీక అట్టి మహానుభావుండు = అట్టి బ్రహ్మజ్ఞాని, ప్రారబ్ధవశంబుచేన్ - ప్రారబ్ధ = పురాకృతసంచితకర్మశేషముయొక్క, వశంబుచేన్ = అధీనతచేత, స్వవర్ణ = తనజాతికిని, ఆశ్రమ = గృహస్థాద్యాశ్రమములో దన దైన యాశ్రమమునకును, ఉచిత = అర్హమగుచున్న, ధర్మంబులయందున్ = నడవడులయందు, ప్రవర్తించు సమయంబునన్ = సంచరించు సమయమునందు

తా. అట్టి మహాబ్రహ్మజ్ఞాని పురాకృతసంచితకర్మవిశేషవశముచేఁ దనజాతికిని గృహస్థాద్యాశ్రమములలోఁ దన దైన యాశ్రమమునకును యుక్త మయిన నడవడులయందుఁ బ్రవర్తించుసమయమున నని తా.

ద్విరదగతిరగడ. మొదలు సరిగాఁగఁ గను యే వాదమును భేదమును, వదలుకొని
యుండుఁ బరయే వాదమును భేదమును । గలఁడె కాంచి సల్పఁడు వికర్మమును గర్మ

మును, దలఁపఁ బోకయుంచుక యధర్మమును ధర్మమును। మరులుకొని చేయఁ డభిమానమును మానమును, మఱచియును మానఁ డతిమానమును జ్ఞానమును। క్రందుకొని పొందఁడు సుకాంతలను వింతలను, జెందఁ డతిదుర్విషయ చింతలను వంతలను। సోలయక జయించు నతిసుప్తియు నసుప్తియును, దెలిసి కను నాత్మసుఖసత్ప్రాప్తియును జ్ఞప్తియును। లౌల్య మతిదాల్పఁ డభిలాషమును వేషమును, గుల్యముగఁ గాంచు ఘనతోషమును రోషమును। జెలులపై నుంచఁ డిల స్నేహమును మోహమును, దెలియఁ డిది సత్యమని దేహమును గేహమును। విరసముగ నెంచు నల విత్తముల మొత్తముల, సరసముగ నెంచు మది సత్త్వముల జిత్తముల। భ్రమ గొని భజింపఁ డిలఁ బౌత్త్రిలను బుత్త్రిలను, సమముగ దలంచు నరిశత్త్రులను మిత్త్రులను। గర మభిలషింపఁ డొకకల్మియును బల్మియును, సిరి యనుకొనఁడు బుధుల చెల్మియును దాల్మియును। సడలఁ బోకయుంతయును శాంతియును దాంతియును, గడ కరుగనీఁడు ముఖకాంతియును శాంతియును। ప్రాపనుచుఁ జూచు గురుభక్తియు విరక్తియును, నోపిక నెఱుంగు శ్రుతియుక్తియును ముక్తియును. ౧౧౯

టీక. భోగములన్ = అభీష్టవస్తువు లభించుటవలనఁ గలిగెడు ఆనందమును, ఖేదములన్ = అభీష్టవస్తువు లభింపమివలనఁ గలిగెడు దుఃఖమును, మొదలు సరిగాఁగన్ = సుఖదుఃఖాది ద్వంద్వములకుఁ గారణమయిన మనస్సుతోఁ దుల్యముగా, కనున్ = వీక్షించును, పరవాదములన్ = ఇతరములైన ద్వైతాదిమతజనవాదమును, భేదములన్ = బ్రహ్మవ్యతిరిక్తము కలదనెడు భేదబుద్ధిని, వదలుకొనియుండున్ = విడిచియుండును, వికర్మమున్ = వేదశాస్త్రనిషిద్ధకర్మమును, కర్మమున్ = వేదశాస్త్రవిహితకర్మమును, కలఁకపడి = మనోవిలనమును పొంది, సల్పఁడు = చేయఁడు, (లేక, వికర్మమున్ = కర్మపరిత్యాగమును, కర్మమున్ = కర్మాచరణమును, కలఁకపడి = కర్మపరిత్యాగమువలన దుర్గతియును కర్మాచరణమువలన సద్గతియును కలుగు నేమో యనెడు కలఁత గలిగి, సల్పఁడు = కర్మపరిత్యాగకర్మాచరణములను జేయఁడు- అనఁగా స్వభావముగా రెంటిని జేయుచుండు నని భావము) అధర్మమున్ = కీడును, ధర్మమున్ = మేలును, ఒకయించుక = కొంచె మయినను, తలంపఁడు = స్మరింపఁడు; అభిమానమున్ = గృహక్షేత్రపుత్త్రకళత్రమిత్త్రాదులు తనవి యనెడు బుద్ధివృత్తిని, మానమున్ = పంచకోశమయశరీరము నేననెడు అంతఃకరణవృత్తిని, మరులుకొని = ప్రీతి కలవాఁడై, చేయఁడు = ఒనర్పఁడు - అనఁగా జ్ఞప్తి యుంచ డనుట, అతిమానమున్ = నిర్వ్యాజసావధానమును - అనఁగా బ్రహ్మధ్యానమును, జ్ఞానమున్ = ఆత్మజ్ఞానమును, మఱచియున్ = ఏమఱుపాటుననేని, మానఁడు = విడువఁడు, సుకాంతలన్ = అజ్ఞులకు మనోహరముగాఁ దోఁచెడు శబ్దాదీంద్రియము లనెడు స్త్రీలను, వింతలన్ = ఆ యింద్రియము లనెడు స్త్రీల నానావిచిత్రము లగు విషయములను, క్రందుకొని = ప్రకృతివికృతులసందడిని బడి, పొందఁడు = చెందఁడు, అతిదుర్విషయచింతలన్ = మిక్కిలి దుష్టములైన కామక్రోధాదిసంకల్పములను, వంతలన్ = కామక్రోధాది దుష్టసంకల్పములవలనఁ గలిగెడు దుఃఖములను, చెందఁడు = అంటఁడు, అతిసుప్తియున్ = ఆవరణజన్య మయిన గాఢనిద్రావస్థను, అసుప్తియున్ = విక్షేపశక్తివలనఁ బుట్టిన జాగ్రదవస్థను, సోల

విచిత్రము లగు విషయములను ప్రకృతివికృతులసందడిని బడి చెందఁడు, అతిదుష్టము లగు కామక్రోధాది సంకల్పములను ఆ సంకల్పములవలనఁ గలిగెడు దుఃఖములను చెందఁడు, ఆవరణజన్య మగు గాఢనిద్రావస్థను విక్షేపశక్తివలనఁ బుట్టిన జాగ్రదవస్థను స్థిరబుద్ధితో నిగ్రహించును, ప్రత్యగాత్మసంబంధ మయిన ఆనందానుభవముఁ యొక్క సంతుష్టిని ఆత్మజ్ఞానమును తెలిసికొని పొందును, చపలబుద్ధిచేత కోరికను శృంగారాది వేషమును ధరించఁడు, అధికానందమును కోపమును సమముగాఁ జూచును, భూమియందు మిత్రులపై స్నేహమును మోహమును నుంచఁడు, పంచకోశాత్మక దేహమును గృహమును నిశ్చయ మని తెలిసికొనఁడు, ప్రసిద్ధము లగు ధనరాసులను బాంధవాదిసమూహములను విరోధముగాఁ దలఁచును, ప్రజ్ఞయందు పరబ్రహ్మనిగ్రహలను సాక్ష్యానుసంధాననిగ్రహలను అఖండైకరసస్థితిచేత నొక్కటే యని తలఁచును, మనుములు కొడుకులు నీరీయఁగగల బాహువుచేత వీరితోఁ జేరఁడు, అత్యంతవిరోధులను స్నేహితులను సమముగాఁ జూచును, అష్టైశ్వర్యములలో నేది స్థిరమైన నొక భాగ్యమును శక్తిని మిక్కిలి యభిలషింపఁడు బ్రహ్మవేత్తల యొక్క స్నేహమును సహవాసమును ఐశ్వర్య మని తలఁచుచుండును, శుద్ధ మగు సత్త్వవృత్తిని చతుర్దశేంద్రియ నిగ్రహమును గాంచి సుయినవు వదలఁడు, ఆత్మస్ఫురణను ఓర్పును తొలఁగనీయఁడు, అపరోక్షజ్ఞానము నుపదేశించిన సద్గురువుఁగల విశ్వాసమును త్రిగుణాత్మక ప్రకృతినిరాకరణమును తన కండ యని యెంచుచుండును, తత్త్వమస్యాది వేదాంతమహావాక్యములయందలి జీవబ్రహ్మైక్యయోగమును జీవన్ముక్తిని విదేహముక్తులనెడు ముక్తులను నేర్పుతో తెలిసికొనుచుండు నని తాత్పర్యము

వ. అని మఱియు నిది శాస్త్రోక్తప్రకారం బింక ననుభవంబు వినుము. ౧౨౦

టీ. అని = ఇట్లు పలికి, మఱియున్ = మరల, ఇది = ఇప్పుడు చెప్పినది, శాస్త్రోక్తప్రకారంబు = ఉత్తరమీమాంసాశాస్త్రమునంగుఁ జెప్పినమార్గము, ఇంకన్ = ఇఁకమీఁద, అనుభవంబు = అనుభవమార్గము, వినుము = ఆలకింపుము

తా. ఈ ప్రకారము చెప్పి యిప్పుడు చెప్పినది యుత్తరమీమాంసాశాస్త్రమందుఁ జెప్పఁబడిన మార్గము, ఇఁకఁ జెప్పఁబోవునట్టి యనుభవమార్గ మాలకింపు మని తాత్పర్యము.

మ. తలఁపన్ గాఢవిరక్తియున్ స్ఫుటతరాద్వైతాత్మవిజ్ఞానము
జ్జ్వలసర్వేంద్రియమానసోపరతియున్ సంపూర్ణమై నిత్యమున్
వెలయంగాఁ దనుఁ గాంచు కేవలునకున్ విశ్వంబు చూపట్టునే
కలలోఁ గన్నగజంబు మేలుకొనినం గన్పట్టునే మారుతీ. ౧౨౧

టీ. మారుతీ = అంజనేయా! తలఁపన్ = విచారింపఁగా, గాఢవిరక్తియున్ — గాఢ = దృఢమైన, విరక్తియున్ = అవ్యక్తమహదహంకారాది తత్త్వములయందు తిరస్కారబుద్ధియు, స్ఫుటతర = వికసించిన, అద్వైత = రెండవది లేని, ఆత్మ = పరబ్రహ్మమును, విజ్ఞానమున్ = లెస్సగా తెలుఁగఁదగిన యెఱుకయు, ఉజ్జ్వల = మిగుల వెలుఁగుచున్న, సర్వ = సమస్తము లైన, ఇంద్రియ = దశేంద్రియముల యొక్క, మానస = సంశయరూప మయిన మనస్సుయొక్క, ఉపరతియున్ = బ్రహ్మమందు చేరుటయు, నిత్యమున్ = ఎల్లప్పుడును, సంపూర్ణమై = సమగ్రముగాఁ గలిగి, వెలయంగాన్ = ప్రకాశింపఁగా, తనున్ = తన్ను, కాంచు కేవలునకున్ = వీక్షించు బ్రహ్మవిద్వరిష్ఠునకు, విశ్వంబు = ప్రకృతిమయప్రపంచము, చూపట్టునే = కనఁబడునా, కలలోన్ = స్వప్నమందు, కన్నగజంబు = చూచినయేనుఁగు, మేలుకొనినన్ = జాగ్రత్త నొందఁగా, కన్పట్టునే = అగపడునా.

తా॥ ఆంజనేయా! విచారింపఁగా నవ్యక్త మహదహంకారాది తత్త్వములకుంగూడ తిరస్కరణబుద్ధియును వికసించినట్టిదియును రెండవది లేనట్టిదియును నగు పరబ్రహ్మమును బాగుగా నెఱుంగఁదగిన యెఱుకయును ప్రకాశించుచున్న దశేంద్రియములయొక్కయు మానసముయొక్కయుం గూడ బ్రహ్మముంగూడఁ జేరుటయును సర్వకాలములయందు సమగ్రముగా గలిగి ప్రకాశింపఁగా తన్నుఁ దాను బ్రహ్మవేత్తకు స్వప్నమందుఁ జూచిన యేనుఁగు జాగ్రత్త నొందఁగా గనఁబడనట్లు ప్రపంచము గనఁబడదని తాత్పర్యము.

బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠుల లక్షణము.

వ॥ ఇంక నొక్క విశేషతాత్పర్యంబు వివరించెద నాకర్ణింపుము, బ్రహ్మవిదుండు బ్రహ్మవిద్వరుండు బ్రహ్మవిద్వరీయుండు బ్రహ్మవిద్వరిష్ఠుండను మహాత్ములు నలువురు గలరందు దేహేంద్రియాదికర్తృత్వంబును గర్మఫలాకాంక్షయు లేక నిత్యనైమిత్తికంబులైన యజ్ఞదానతపఃప్రముఖంబులైన కర్మంబుల యథావిధిగా నాచరించుచుఁ గామ్యకర్మంబుల విడిచి శాస్త్రనిషిద్ధంబులు గాని లౌకికకర్మంబుల యథోచితంబుగా నొనర్చుచుఁ బుత్రమిత్రకళత్రాదిస్నేహరాగంబులయందు వైరాగ్యంబు గలిగి యదృచ్ఛాలాభసంతుష్టుండై రాగద్వేషభయక్రోధలోభమోహమదమత్సరాది నానావిధచిత్తవికారరహితుండగు నగణితగుణుండై శుద్ధాంతఃకరణుండు నిరహంకారుండు నిత్యప్రసన్నచిత్తుండై పరమశాంతుండు జ్ఞానవిజ్ఞానసంపన్నుండు నంతస్సుఖుండు నంతరారాముండు నంతఃప్రకాశుండు నాత్మరతుండు నాత్మతృప్తుండు నాత్మసంతుష్టుండై సంచరించు నతండు బ్రహ్మవిదుండు, మఱియు సకలవైదికలౌకికకర్మంబుల విధిపూర్వకంబుగా సన్న్యసించి పూర్వోక్తలక్షణంబుల విలసిల్లి సంప్రాప్తదుఃఖంబుల ద్వేషింపక నివృత్తసుఖంబులఁ గోరక ప్రకాశప్రవృత్తిమోహంబుల నుదాసీనునిచందంబునఁ జూచుచు సుఖదుఃఖమోహాదికార్యాకార్యగుణంబులయందుఁ దేహేంద్రియాది వికారకారణగుణంబులు ప్రవర్తించుచుండ వానిచేఁ జలింపఁజేయఁబడక నిశ్చలుండు సమదుఃఖసుఖుండు స్వస్థుండు సమలోష్టాశ్మకాంచనుండుఁ దుల్యప్రియాప్రియుండుఁ దుల్యనిందాస్తోత్రుండుఁ దుల్యమానావమానుండుఁ దుల్యశత్రుమిత్రపక్షుండు సంపరిత్యక్తసర్వారంభుండు నగు గుణాతీతుండై బ్రహ్మవిద్వరుం డనంబడు, మున్ను వివరించిన గుణంబు లన్నియుఁ బ్రకాశించుచుండ సంతతసహజామనస్కరాజయోగనిష్ఠాగరిష్ఠుండై యెడనెడఁ బరులవలన మేలుకొలుపఁబడి కించిదాహారంబుగొనుచు సుప్తుండైనవాని చెలంగున విశ్వంబు మఱచి యుండు నతండు బ్రహ్మవిద్వరీయుండు, దనవలన నొరులవలనఁ బునరుత్థానంబు లేక బాహ్యాభ్యంతరంబులు మఱచి నిరంతరనిర్వికల్పసమాధినిష్ఠుండై పరిపూర్ణప్రత్యగభిన్నపర

యగుచు, నిర్గుణుఁడై = గుణరహితుఁడై, పరిపూర్ణ = అఖండ మయిన, ప్రత్యగభిన్న = కూటస్థాభేద మయిన, పర = సర్వోత్కృష్ట మైన, బ్రహ్మణివరస్య = చిద్రూపపరమాత్మయొక్క, ప్రకాశమాత్రుండై = తేజస్స్వరూపుఁడై, వెలుంగునతండు = ప్రకాశించుచున్నట్టివాఁడు, బ్రహ్మవిద్వరిష్ఠుం డగుక్ = బ్రహ్మవిద్వరిష్ఠుఁ డనఁబడును, అంగుక్ = ఆ బ్రహ్మవిద్వరవిద్వరీయవిద్వరిష్ఠులయందు, మొదలింయిరువురకుక్ = మొదటి యిద్దఱకును - అనఁగా బ్రహ్మవిద్బ్రహ్మవిద్వరులకు, ప్రారబ్ధంబు = సంచితసంభవానుభవము, తోఁచియుక్ = లభ్య మయ్యును, మిథ్యాభూతంబై యుండుక్ = అసత్యరూపమై యుండును, వరీయునందుక్ = బ్రహ్మవిద్వరీయునియందు, కలిగియుఁ లేకుండుక్ = ప్రారబ్ధము లభ్య మయ్యును లేక యుండును- అనఁగా దృశ్యాదృశ్య మగుచు, వరిష్ఠునకుక్ = బ్రహ్మవిద్వరిష్ఠునకు, ఏమాత్రంబు = ప్రారబ్ధము కొంచె మయినను, లేదు = ఉండదు, కావునక్ = కనుక, ఇమ్మహానుభావుల = మహాప్రభావము గల యీబ్రహ్మవిదాదుల యొక్క, అనుభవంబులు = అనుభోగములు, నీ వడిగినప్పటినుండి = నీవు ప్రశ్న చేసినది మొదలుకొని, ఏర్పఱచి = పరిశీలించి, చెప్పితిఁ గాదే = బోధించితిని గదా - తెలిసికొమ్మని యర్థము, అని = ఇట్లు పలికి, వెండియుక్ = మగుల, ఇట్లనియెక్ = ఇట్లు చెప్పెను.

తా॥ మునీశ్వరుండు శ్లోకమునకు విశేషతాత్పర్యము జెప్పెద వినుము, నా స్వరూపముయొక్క యథార్థము దెలిసినవారు బ్రహ్మవిదు లనియును, బ్రహ్మవిద్వరు లనియును, బ్రహ్మవిద్వరీయు లనియును, బ్రహ్మవిద్వరిష్ఠు లనియును నలువురు గలరు, ఆ నల్వురియందు శరీరేంద్రియాదులయందలి అభిమానమును వేదశాస్త్ర విహితములైన కర్మములయందు ఫలము గావలయు ననెడి కోరికయును లేక నిత్యనైమిత్తికము లగు (దినదినం బాచరించు స్నానసంధ్యాది సత్కర్మములు నిత్యము లనఁబడును, పంచపర్వములు ప్రతిప దిష్టి స్థాలీపాక జయంతి మన్వాది [illegible] మహాశివరాత్రి మొదలగు విశేషదినంబులయం దాచరించుకర్మ నైమిత్తిక మనఁగఁబడును) భూత దేవ పితృ మనుష్య బ్రహ్మయజ్ఞములును, గోదానము హిరణ్యదానము మహిషీదానము రత్నదానము పుస్తకదానము నువ్వులదానము కన్యాదానము గజదానము అశ్వదానము శయ్యాదానము వస్త్రదానము భూదానము ధాన్యదానము వేశ్యాదానము ఛత్రదానము గృహదానము తగుపకరణములు అను షోడశమహాదానములును, కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులు మొదలగు వేరొక్క సత్కర్మములను, వేదశాస్త్రములయందుఁ జెప్పఁబడుతీరున నాచరించుచు ఫలాపేక్షతోఁ గూడిన క్రియలను ఇతర శాస్త్రములయందు విధింపఁబడిన లౌకికకర్మములను వేదశాస్త్రోక్తక్రమముగాఁ జేయుచు పుత్త్రమిత్త్రకళత్రాదులయందును, గృహారామక్షేత్రాదులయందును విరక్తి గలిగి ప్రయత్నము చేయకయే లభించెడు వస్తువులచే సంతోషించువాఁడును, కోరిక ప్రీతి అప్రియము భయము లోభము వలపు గర్వము [illegible] క్రోధము మొదలయిన బహువిధము లగు మనోవికారములు లేనివాఁడును, సర్వకాలములయందు శరీరత్రయమును దశేంద్రియములను ప్రాణపంచకమును అంతఃకరణచతుష్టయమును నిగ్రహించినవాఁడును, గర్వము లేనివాఁడును, ఎల్లప్పుడు నిర్మల మగు మనస్సు గలవాఁడును, ఆత్మజ్ఞానానుభవజన్యజ్ఞానమును గలవాఁడును, ప్రత్యగాత్మ యగు తనయందే యానందించువాఁడును, తనయందే క్రీడించువాఁడును, తనయందు తానై వెలుఁగువాఁడును, పరమాత్మస్వరూపి యైన తనయందే ప్రీతి గలవాఁడును, తనవలన తానే తృప్తిఁ బొందువాఁడును, తనచేత తానే సంతుష్టిఁ బొందువాఁడును నై ప్రవర్తించుపురుషుఁడు బ్రహ్మవిదుఁ డనఁబడును, మఱియు సమస్తవేదవిహితకర్మలను లోకసంబంధము లయిన కర్మలను శాస్త్రక్రమముగా వదలి ముందుఁ జెప్పఁబడిన యదృచ్ఛాలాభసంతుష్టాది బ్రహ్మవిదుని చిహ్నములచేత ప్రకాశించి లభించిన వ్యసనములను విరోధముగా నెంచక విడుపఁ

తా. అంజనేయా! పైఁ జెప్పఁబడిన బ్రహ్మవిద బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠులను నలువురకును ఇహపరలోకభోగవిరాగము బ్రహ్మజ్ఞానము తన్మయత్వస్థితి యని నీమూఁడును యెక్కువతక్కువలచే నున్నవి, వారి కానందము లించుమించుగాఁ బ్రకాశించినను ముక్తి యొక్కటే యని తాత్పర్యము.

తే. అతులవైరాగ్యబోధోపరతులు యతుల
మతుల నెడఁబాయ వన్యోన్యగతుల నెనసి
సూటి దప్పి యొకానొకచోట నొండు
రెండు ప్రతిబంధవశమున నుండు ననఘ. ౧౨౪

టీక. అనఘ = పాపరహితుఁడవైన యాంజనేయా! అతుల = అసదృశము లైన, వైరాగ్య = పాశవిరక్తియును, బోధ = ఆత్మజ్ఞానమును, ఉపరతులు = మనోవిలయమును, అన్యోన్యగతులన్ = పరస్పరానుసరణములచేత, ఎనసి = కూడికొని, యతులమతులన్ — యతుల = జితేంద్రియులయొక్క, మతులన్ = ప్రజ్ఞలయందు, ఎడఁబాయవు = తొలఁగవు, ప్రతిబంధవశమునన్ = కర్మవశమున నేదియైన నొక యడ్డగింపుచేత, సూటిదప్పి = గుఱిదప్పి, ఒకానొకచోటన్ = ఏదేని యొకస్థలమునందు, ఒండు = వైరాగ్యబోధోపరతులలో నేదియయిన నొకటియును, రెండు = ఆ మూఁటిలో నేది యయిన రెండును, ఉండున్ = ఉండును.

తా. పాపరహితుఁడవైన యాంజనేయా! సాటిలేనివి యగు పాశవిరక్తియును ఆత్మజ్ఞానమును మనోవిలయమును పరస్పరానుసరణములచేతఁ జేరి జితేంద్రియులయొక్క ప్రజ్ఞల నెడఁబాయవు, కర్మవశమున నేర్పడిన నొక యడ్డగింపుచేత గుఱిదప్పి యేదేని యొక్కస్థలమందు వైరాగ్యబోధోపరతులలో నేదియయిన నొకటియును లేక నా మూఁటిలో రెండైన నుండు నని తాత్పర్యము.

తే. వీనిలో బోధ మెక్కుడౌ జ్ఞానమునకు
కడమ రెండును దగ సహకారు లరయ
వరుస నీమూఁడు గలిగినవారలకును
గరతలామలకంబు మోక్షంబు వత్స. ౧౨౫

టీక. వత్స = బాలుఁడా! వీనిలోన్ = వైరాగ్యబోధోపరతులలో, బోధము = అపరోక్షజ్ఞానము, ఎక్కుడు = శ్రేష్ఠమయినది, ఆ జ్ఞానమునకున్ = ఆ బ్రహ్మజ్ఞానమునకును, కడమరెండును = మిగిలిన వైరాగ్యోపరతులు రెండును, తగన్ = అర్హమైనట్లు, అరయన్ = విచారింపఁగా, సహకారులు = సహచరము లయినవి, వరుసన్ = క్రమముగా, ఈమూఁడు గలిగినవారలకున్ = ఈ వైరాగ్యబోధోపరతులుగల ధన్యులకు, మోక్షంబు = ముక్తి, కరతలామలకంబు — కరతల = అఱచేతియందలి, అమల = నిర్మలమయిన, కంబు = జలమువంటిది — లేక అఱచేతిలోని యామలక మనియుఁ జెప్పవచ్చును.

తా. అంజనేయా! వైరాగ్యబోధోపరతులలోపల అపరోక్షజ్ఞాన మెక్కుడు, ఆ బ్రహ్మజ్ఞానమునకు మిగిలిన వైరాగ్యోపరతులు రెండును సహకారులు, అట్లగుటవలన నీమూఁటిని గలిగిన మహనీయులకు ముక్తి యఱచేతియందలి నిర్మలమయిన యుదకమువంటి దని తాత్పర్యము.

క. అతిరతత్త్వజ్ఞానము, సాక్షాన్మోక్షప్రదంబు సంసారికదుః
ఖక్షయకర మగుఁ దక్కిన, లక్షణములు సుఖకరములు లలితాత్ములకున్. ౧౨౬

అనఁగా సంకల్పవృత్తియొక్క, ధీ=బుద్ధియొక్క = అనఁగా నిశ్చలవృత్తియొక్క, నిగ్రహాలయమును = వ్యవహారక్షయములు విద్యావిద్యలయొక్క సర్వవ్యాపారనాశనములును, తలంపక = యోచింపఁగా, ఉపరత్యాది స్వరూపార్థములు= ఉపరతి = చిత్తలయముయొక్క, ఆది = కారణమును, స్వరూప = రూపమును, అర్థములు = కార్యమును, ఔర = అవును. (ఇచ్చట క్రమాలంకారము)

ఈ వైరాగ్యబోధోపరతులు వివేకులయం దొకటి కొకటి సహాయమై శ్రవణాదులచేత ప్రాణులను గూడి యుండును, కర్మవశమున నొక్కొక్కటి యొక్కొకసమయమున నొకని యందు లేక యుండును, వీనికి హేతుస్వరూపకార్యము లెవ్వి యని ముముక్షువులచేత చక్కఁగా విమర్శించి తెలియవలయును వీనిలో వైరాగ్యమునకు హేతుస్వరూపకార్యము లెవ్వి యనఁగా సర్వవిషయములయందు వాంత్యశనమందువలె వాంఛ లేక యుండుటయే కారణము, సకలవిషయములయందు మరల తలఁపు పుట్టక యుండుటయే స్వరూపము, ఎల్లవిషయసుఖముల ననుభవింపక యేల వదలితి మని మగుల వానియం దాసక్తి కలుగక యుండుటయే కార్యము, బోధకు హేతుస్వరూపకార్యము లేవి యనఁగా, శ్రవణ మనన నిదిధ్యాసములు హేతువులు, ఆ శ్రవణాదులచేత నిత్యానిత్యవస్తువుల విచారించి అద్వితీయాత్మస్వరూపమే నేను అనిత్యములైన యీ దేహేంద్రియాదులు నేను గాను అని దృఢనిశ్చయము గల్గి యుండుటయే బోధకు స్వరూపము, ఈ యాత్మస్వరూపమునకు దేహేంద్రియాదికము నేనని యనుకొనకుండుట కార్యము, ఉపరతికి హేతుస్వరూపకార్యము లెవ్వి యనిన, యమనియమ ప్రాణాయామాదులు హేతువులు, చిత్తనిరోధంబు స్వరూపము, సర్వవ్యవహారలయము కార్యము, ఇట్లు వైరాగ్యబోధోపరతుల కారణస్వరూపకార్యములు పరస్పరము సహాకారములై యని యిట్లు చెప్పఁబడెను, ఈ వైరాగ్యబోధోపరతులు మూఁడును ముక్తికి ప్రధానంబులో, లేక యొకటి రెండు ప్రధానములో యనిన సాధనాంతరాపేక్ష లేక ప్రత్యక్షముగా మోక్షము నిచ్చు బోధయొక్కటే ముఖ్యము, వైరాగ్యోపరతులు రెండును బోధకు సహాయకారులు, ఇవి మూఁడును క్రమముగా లభించినవానికి మోక్షము కరతలామలకము. ఒక పురుషునియం దీమూటిలో నొక్కటికి కర్మవశముచేత ప్రతిబంధము వచ్చినను వచ్చును; ఒకనికి వైరాగ్యోపరతులు సంపూర్ణంబులై యుండి జ్ఞానము లేకున్నచో వానికి ముక్తి లేదు, అప్పుడు వైరాగ్యోపరతులు వృథ యయ్యెఁగదా యనిన, వైరాగ్యోపరతులు తపస్సువలె ముఖ్యసాధనములు గాఁబట్టి వానివలన పుణ్యలోకప్రాప్తి గలుగును, ఒకనికి సంపూర్ణజ్ఞానము గల్గి యుండి వైరాగ్యోపరతులు లేకున్నను వానికి ముక్తి సిద్ధింపదు, అప్పుడు వైరాగ్యోపరతులకు ప్రయోజన మేమి యనఁగా అవి లేకున్న ప్రత్యక్షదుఃఖము తొలఁగదు గాన నవి నిష్ప్రయోజనంబులు గావు, వీని కవధియెప్పు డనిన, బ్రహ్మలోకతృణీకారము గల్గుకాలము వైరాగ్యమున కవధి, అజ్ఞానదశయం దీశరీరేంద్రియాదులు నేనను నిశ్చయము వచ్చినట్లు విజ్ఞానదశయం దవి తోఁచక ఆత్మస్వరూపము నేనను దృఢనిశ్చయము కల్గుకాలము బోధ కవధి, ముముక్షువు నిద్రయందువలె మెలఁకువయందును సకలవిషయములను మఱచుటయెప్పుడు గల్గునో యది ఉపరతి కవధి, ఇట్లు వైరాగ్యబోధోపరతుల కారణరూపకార్యముల తారతమ్యములును, అవధులును చెప్పఁబడెను, ప్రారబ్ధము నానావిధములు గనుక వివేకులు జీవన్ముక్తులప్రవర్తనముఁ జూచి శాస్త్ర మెట్లున్నది వీ రట్లున్నారా యని భ్రమింపఁగూడదు, వారివారికర్మముచేత వారు బహువిధవ్యాపారములతోఁ గూడి యున్నను జ్ఞానము, జ్ఞానఫలమైన ముక్తియు సమానమే యని తాత్పర్యము

శా. వైరాగ్యంబు దృఢంబుఁ జేసి పరతత్త్వజ్ఞాన మార్జించి స
ర్వారంభోపరమంబుఁ గైకొని తురీయం బంది యోగీశ్వరా

గారూఢుం డగువానికిం గలుగునే యీయాగామియు స్సంచిత
ప్రారబ్ధంబులు సంతతంబును పరబ్రహ్మాత్ముఁడై యుండఁగాన్. ౧౨౯

టీక వైరాగ్యంబుఁ = విరక్తిని, దృఢంబుజేసి = నిశ్చయము చేసి, పరతత్త్వజ్ఞానము—పర = పరబ్రహ్మముయొక్క, తత్త్వ = యథార్థమైన, జ్ఞానము = ఎఱుకను - అనఁగా బ్రహ్మమును తెస్సుగా దెలియఁదగిన తెలివిని, ఆర్జించి = సంపాదించి, సర్వారంభోపరమంబుఁ—సర్వ = సమస్త కార్యములయొక్క, ఆరంభ = ఉపక్రమములయొక్క, ఉపరమంబుఁ = నిలుపుటను, కైకొని = అవలంబించి, తురీయం బంది = అవస్థాత్రయాతీత సాక్షిభావము నొంగి - అనఁగా వైరాగ్యబోధోపరతులచేత త్రిశరీరాభిమానములు వీడి సాక్షియై, ఈరీతిఁ = యిట్లు జెప్పినట్లు, యోగారూఢుం డగువానికిఁ—యోగ = శివజీవైక్యమందు, ఆరూఢుం డగువానికిఁ = నిశ్చయము గల పురుషునకు, ఆగామియుంబు = భవిష్యజ్జన్మములయం దనుభవించుటకై వర్తమానజన్మమం దొనర్చగు కర్మములను, సంచిత = భూతకాలజన్మపరంపరలయందు వర్తమానజన్మమం దనుభవించుటకై చేయఁబడిన క్రియలను, ప్రారబ్ధంబులు = సంచితసంభవమయి యాగామికి గారణమయి తత్కాలమం దనుభవింపఁబడు చున్న ప్రారబ్ధకర్మమును, కలుగునే = ప్రాప్తించునా? (ఏల ప్రాప్తించు దనఁగా) సంతతంబును—సర్వకాలమును, పరబ్రహ్మాత్ముఁడై యుండఁగాఁ = ప్రకృతికి పరమైన పరమాత్మస్వరూపుఁడై యుండుటచేత - అనఁగా జీవన్ముక్తునకు నాగామిసంచితప్రారబ్ధకర్మఫలములు గలుగ వని భావము

తా విరక్తిని దృఢము చేసినవాఁడును, బ్రహ్మమును చక్కఁగాఁ దెలియఁదగిన తెలివిని సంపాదించినవాఁడును, కార్యోపరతి గలవాఁడును, వైరాగ్యబోధోపరతులచేత త్రిశరీరాభిమానములు వదలి సాక్షియైనవాఁడును, శివజీవైక్యమందు నిశ్చయము గలవాఁడును నగు పురుషునకు భవిష్యజ్జన్మమం దనుభవించుటకై వర్తమానజన్మమం దొనర్చెడి కర్మములను, భూతకాలజన్మపరంపరలయందు వర్తమానజన్మమం దనుభవించుటకుగాను చేయఁబడిన క్రియలను, భూతకాలజన్మాంతరంబులచే సంభవించినవియును, ఆగామిజన్మమునకు గారణము లయినవియును, ప్రస్తుత మనుభవింపఁబడుచున్న కర్మమును పొందనేరదు, (సర్వకాలములయందు పరబ్రహ్మస్వరూపుఁడై యుండుటచే ఆగామి సంచిత ప్రారబ్ధ కర్మములు గలుగవు) అని తాత్పర్యము

## వై రా గ్య శ బ్దా ర్థ వి మ ర్శ న ము

క వైరాగ్యం బింతటికిని, గారణ మానందకరము గావున నది చే
కూఱిన సమస్తమును సమకూరుం దనుదాన పరమగుహ్య మిది సుతా. ౧౩౦

టీక సుతా = కుమారా! ఇంతటికిని = ఈ చెప్పఁబడిన సకలమునకును, వైరాగ్యంబు = విరక్తి, కారణము = హేతు వైనదియును, ఆనందకరము=బ్రహ్మానందము గలుగఁజేయునట్టిదియును, కావునఁ = కనుక, అది చేకూఱినఁ = ఆ వైరాగ్యము లభించెనేని, తనుదాన = తనంతట తానే-అనఁగా ప్రయత్నము లేకనే, సమస్తమును = బోధోపరతులతోఁ గూడిన సకలమును, సమకూరుఁ = లభించును, ఇది=ఈ వాక్యము, పరమగుహ్యము = అతిగోప్యము

తా కుమారా! ఈ చెప్పఁబడిన సమస్తమునకును విరక్తి హేతు వైనదియును, బ్రహ్మానందమును గలుగఁజేయునదియును నై యున్నది గనుక ఆ వైరాగ్యము లభించెనేని బోధోపరతులతోఁ గూడిన సమస్తము తనంతట తానే ప్రయత్నము లేక సమకూరును, ఇదియే పరమరహస్య మని తా.

వ. అది యెట్లనిన వినుము, మూలప్రకృతి యాలవాలంబు సుఖదుఃఖంబులు ఫలంబులు త్రిగుణంబులు మూలంబులు ధర్మార్థకామమోక్షంబులు రసంబులు పంచేంద్రియంబు లగాడలు షడూర్ములు స్వభావంబులు సప్తధాతువులు పొరలు అష్టప్రకృతులు విటపంబులు నవరంధ్రంబులు కోటరంబులు దశవిధప్రాణంబులు పత్రంబులు శబ్దాదివిషయంబులు పల్లవంబులు రాగద్వేషాదు లుపశాఖలు నానావిధకర్మంబులు పుష్పంబులు జీవేశ్వరులు పక్షులుగాఁ గలిగి మందిరారామ క్షేత్ర పుత్రమిత్రకళత్రబంధుమధ్యస్థద్వేష్యజన తీక్ష్ణకుష్కంటకతరుగుల్మలతాసంకీర్ణంబుఁ గామాదిఘోరదుస్సంచారంబు రోగవ్యాఘ్రభయంకరంబు దుఃఖదావానలసమావృతంబు మృత్యుసింహాభయగ్రస్తంబు జరాపిశాచసమన్వితంబు దైన్యపర్వతసంకటంబు దురితరాక్షసఘోరంబుఁ దృష్ణాభీకరకాకోదరసమాకులంబు హాహామర్షఝంఝానిల దూషితంబు స్వర్గ నరక దుర్మార్గతిరోహితాపవర్గసన్మార్గంబు నైన మహాదుఃఖారణ్యంబునం గాడుపడి పుణ్యాపాపవిధేయుండై తీవ్రం బంతటం దిరిగి తిరిగి చీకాకుపడి యెచ్చోట విశ్రాంతిఁ గానక విసివి ముందరఁ గాంచి యనంతం బని వెనుకఁ జూచిన ననాది యని గలయం గనుంగొని యసాధ్యం బని తెలిసి యగాధదుఃఖ భయ శోక వ్యాకులిత చిత్తుండుఁ దాపత్రయాదిత్యప్రదీప్తాతపసంతప్తుండు నై యంతట నిరంతర నిగమాగమశాస్త్రముల నాశ్రయించి స్రక్చందనవనితాధనధాన్యపశుసంతానశయ్యాసికేతనోద్యానప్రముఖ విషయసంపాదనసాధనంబు లైన కృషి వాణిజ్య సేవాయాచ్ఞాదిలౌకికకర్మంబులఁ బరిహరించి స్వర్గాదినశ్వరాంతపరలోకవిషయసుఖసాధనంబు లైన నిత్యనైమిత్తికాదికర్మంబులు ఫలకాంక్షచేతఁ జేయక పరమేశ్వరార్పణంబుగా నాచరించి యప్పరమేశ్వరానుగ్రహంబువలనఁ బరిశుద్ధహృదయుండై యమానిత్వ మదంభిత్వ మహింస యార్జవంబు క్షాంతి యాచార్యోపాసనంబు శౌచంబు స్థైర్యం బాత్మవినిగ్రహం బింద్రియార్థంబుల వైరాగ్యం బనహంకారంబు జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనంబుఁ బుత్రదారగృహాద్యనాసక్తి యనభిష్వంగంబు నిత్యేష్టానిష్టోపపత్తిసమచిత్తత్వంబు మదనన్యయోగనిశ్చలభక్తి వివిక్తదేశసేవిత్వంబు జనసంగాసక్తివివర్జనం బధ్యాత్మజ్ఞాననిత్యత్వంబుఁ దత్త్వజ్ఞానార్థదర్శనం బను వింశతిగుణంబు లెప్పుడు సంగ్రహించు నప్పుడు శాస్త్రబ్రహ్మైక్యసాక్షాత్కారవిచారాధికారి యగు నింతవట్టుం గూడి వైరాగ్యశబ్దంబునకుఁ దాత్పర్యార్థం బెఱిఁగి బోధస్వరూపం బెఱింగించెద నాకర్ణింపు మని యుట్లనియె. ౧౩౧

జూచి, అనధ్యాగని = కొదవయుంగ లేకుండ సౌఖ్య మనియును, తెలిసి = ఎఱిఁగి, మహాగాఢ = మిగుల నతిశయమైన, దుఃఖ = బాధచేత, ఘను = దిగులుచేత, శోక = వ్యసనముచేత, వ్యాకులిత = చలింపఁజేయఁబడిన, చిత్తంబుగల = మనస్సుగలవాఁడగుచు, తాపత్రయ = ఆధ్యాత్మికాది త్రివిధతాపము లనెడు, ఆదిత్య = సూర్యునియొక్క, ప్రాగ్… = మండు మన్న, ఆతప = ఎండచేత, సంతప్తుండగుచునై = కాల్పఁబడినవాఁడునై, … = …, నిరంతర = ఎడతెగని, నితాంత = అధికవికాసము గల, ఆగమ = కామికాద్యాగమము లనెడు …యొక్క, …లన్ = నీడలను, ఆశ్రయించి = పొంది, స్రక్ = పూఁదండలు, గంధ = గంధము, వనితా = స్త్రీలు, ధన = విత్తము, ధాన్య = వడ్లు మొదలగునవి, పశు = గోవులు మొదలగునవి, సంతాన = కొడుకులు కూఁతుండ్రు, శయ్యా = పఱపులు, నికేతన = ఇండ్లు, ఉద్యాన = క్రీడోద్యానములు, ప్రముఖ = మొదలయిన, విషయ = వస్తువులయొక్క, సంపాదన = గడించుటకు, సాధనంబు లైన = ఉపాయము లైన, కృషి = దున్నుట, వాణిజ్య = వర్తకము, సేవా = కొలువు, … = [illegible], ఆది = మొదలయిన, లౌకికకర్మంబులు = లోకవ్యవహారకృత్యములను, పరిహరించి = విడిచి, స్వర్గాది = స్వర్గలోకము మొదలు, సత్యాంత = సత్యలోకముతుదగాఁ గల, పరలోక = ఆముష్మికసంబంధము లయిన, విషయసుఖ = వస్తువులయందలి భోగములకు, సాధనంబు లైన = హేతువులైన, నిత్యనైమిత్తికాగ్నికర్మంబులు = స్నానసంధ్యాద్యనుష్ఠానములను, ఫలకాంక్షచేతఁ జేయక = ప్రయోజనాసక్తిచేత …, ఈశ్వరార్పణంబుగాన్ = బ్రహ్మార్పణముగా, ఆచరించి = చేసి, అప్పరమేశ్వరానుగ్రహంబువలనన్ = ఆ యీశ్వరకృపచేత, పరిశుద్ధహృదయుండై = నిర్మలచిత్తుఁడై, అమానిత్వంబు = తన్నుఁ గానే పొగడుకొనకుండుటయు, అదంభిత్వంబు = తాఁ జేసిన ధర్మము లోనగు వానిని ప్రకటన చేయకుండుటయును, అహింస = ప్రాణిబాధ చేయకుండుటయు, ఆర్జవంబు = తిన్నఁదనమును, క్షాంతి = ఓర్పును, ఆచార్యోపాసనంబు = గురుసేవ చేయుటయును, శౌచంబు = బాహ్యాభ్యంతరపరిశుద్ధత్వమును, స్థైర్యంబు = స్థిరభావమును, ఆత్మవినిగ్రహంబు = మనోదమనమును, ఇంద్రియార్థంబుల వైరాగ్యంబు = శబ్దస్పర్శాది చతుర్దశేంద్రియవిషయములయందు విరక్తియు, అనహంకారంబు = గర్వము లేకుండుటయు, జన్మ = పుట్టువు, మృత్యు = మరణము, జరా = ముదిమి, వ్యాధి = తెగులు, దుఃఖ = క్లేశము, (వీనియందు) దోష = నిందలను, అనుదర్శనంబును = పలుమాఱు చూచుటయు, పుత్త్ర = కొడుకులు, దార = భార్యలు, గృహ = ఇండ్లు, ఆది = మొదలయినవానియందు, అసక్తి = ఆశ లేకుండుటయు, అనభిష్వంగంబు = అనన్యాత్మభావనాలక్షణ మయిన యాసక్తివిశేషము లేకుండుటయు, నిత్య = ఎల్లప్పుడు, ఇష్టానిష్ట = ప్రియాప్రియములయొక్క, ఉపపత్తి = లభ్యములయందు, సమచిత్తత్వంబు = సమబుద్ధియు, మదనన్యయోగనిశ్చలభక్తియును — మత్ = నాకంటె, అనన్య = ఇతరము లేదనెడు, యోగ = ధ్యానమందు, నిశ్చలభక్తి = స్థిరభక్తియు, వివిక్తదేశసేవిత్వంబు = జనులు లేని చోట నుండుటయు, జన = జనులయొక్క, సంగి = సంసర్గమందు, అసక్తి = అభిలాషను, వివర్జనంబు = విడుచుటయు, అధ్యాత్మజ్ఞాన = బ్రహ్మజ్ఞానమందు, నిత్యత్వంబు = నిరంతరభావనయు, తత్త్వజ్ఞాన = మోక్షజ్ఞానమందు, అర్థదర్శనంబు = ప్రయోజనదృష్టియు, అను వింశతిగుణంబులు = అనెడు నిరువది లక్షణములు, ఎప్పుడు సంగ్రహించునో = ఎప్పుడు సంపాదించునో, (కలవాఁ డగునో) అప్పుడు = తత్క్షణమే, ఆత్మ = ప్రత్యగాత్మయొక్క, బ్రహ్మ = పరబ్రహ్మముయొక్క, ఐక్య = చేరికను, సాక్షాత్ = ప్రత్యక్షముగా, … = చేయఁదగిన, విచార = నిర్ణయమందు, అధికారి = కర్త, అగున్ = ఔను, ఇంతవట్టుంగూడి = ఇది యంతయుఁ జేరి, వైరాగ్యశబ్దంబునకున్ = వైరాగ్య మనెడు శబ్దమునకు, తాత్ప

ర్యంబు=అభిప్రాయము, ఇంకన్ = ఇంకమీఁద, బోధస్వరూపంబున్ = బోధకస్వరూపమును, ఎఱింగించెదన్ = తెలిపెదను, ఆకర్ణింపు మని = విను మని, ఇట్లనియెన్ = ఇట్లు పలుకఁ దొడంగెను.

తా॥ ఆ రహస్య మెట్టి దనిన యాంజనేయా చెప్పెద వినుము. సంసార మను వృక్షము అవ్యక్తనామక మగు పాదు గలదియును, సుఖదుఃఖములు ఫలములుగాఁ గలదియును, సత్త్వరజస్తమోగుణములు వేళ్లుగాఁ గలదియును, విహితకర్మానుష్ఠానము కులోచితద్రవ్యాభిలాష భోగాసక్తి ముక్తి యను చతుర్వర్గమే మధురాది రసములుగాఁ గలదియును, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములే గూడలుగాఁ గలదియును, అశన పిపాస శోక మోహ జరా మరణములే నైసర్గికములుగాఁ గలదియును, త్వఙ్మాంసరుధిరమేదోమజ్జాస్థిస్నాయువులే పట్టలుగాఁ గలదియును, భూ జ లాగ్ని వాయు గగన మాన సాహంకార బుద్ధులే కొమ్మలుగాఁ గలదియును, శ్రోత్రాది నవద్వారములే తొఱ్ఱలుగాఁ గలదియును, దశవిధప్రాణములే ఆకులుగాఁ గలదియును, చతుర్దశేంద్రియవిషయములే చిగురాకులుగాఁ గలదియును, ప్రియము ద్వేషము మొదలగు చతుర్దశేంద్రియవృత్తులే యుపశాఖలుగాఁ గలదియును, నానావిధకర్మలు పుష్పములుగాఁ గలదియును, జీవేశ్వరులు పక్షులుగాఁ గలదియును నై యున్నది, అట్టి సంసారమును బొందిన జీవుఁడు తోఁటలు భూములు ఇండ్లు కొడుకులు స్నేహితులు భార్యలు చుట్టములు శత్రుత్వమిత్రత్వములు లేనివారు విరోధులు అనెడు వాడిముండ్లు గల వృక్షములచేతను పొదలచేతను తీఁగలచేతను పెనఁగొన్నదియును, భోగాసక్తియే మొదలుగాఁ గల దుర్గుణము లనెడి దొంగలయొక్క చెఱునడక గలిగియును, ఆధివ్యాధు లనెడు పులులచేత భయంకర మయినదియును, దుఃఖ మనెడు కార్చిచ్చుచేత నావరింపఁబడినదియును, చావనెడు సింహమువలని భయంకరముచే గ్రమింగఁబడినదియును, ముదిమి యనెడు భూతముతోఁ గూడినదియును, పేదరిక మనెడు కొండచేత యిరుకైనదియును, పాపము లనెడు గాతుసులచేత భయంకర మయినదియును, ఆశ యనెడు భీతి గలిగించెడు కాకోదరసర్పములచేత కలఁత పెట్టఁబడినదియును, సంతోషకోపము లనెడు ఓరుగాలిచేత నిండింపఁబడినదియును, స్వర్గ నరకము లనెడు తప్పుత్రోవలచేత నిఱుకైన ముక్తియొక్క మంచిత్రోవ గలదియును నైన ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికము లనెడు చింతలు గల యడవియందు దారిదప్పి సుకృతములకును దుష్కృతములకును లోఁబడినవాఁడై నలుప్రక్కలఁ దిరిగి తిరిగి వ్యాకులపడి యెక్కడను పోయిలేక గోసి తిరుగుటఁ జూచి తుద లేని దనియు, నిదివర కెన్ని జన్మము లెత్తితినో యని వెనుకఁ జూచి మొదలు లేని దనియు, ఇఁక యెన్ని జన్మము లెత్తవలయునో యని విశదముగాఁ జూచి తుదమొదలు లేయిఁగ నశక్య మని తలఁచి మిగుల వతికయ మయినట్టియు, దిగులుచేతను వ్యసనముచేతను చలింపఁజేయఁబడ్డ మనస్సు గలవాఁడును, ఆధ్యాత్మికాది తాపత్రయ మనెడు సూర్యునియొక్క యెండచేతఁ గాల్పఁబడ్డవాఁడును నై అనంతర మెడతెగని అధికవికాసము గల కామికాద్యాగమములను చెట్లయొక్క నీడల నాశ్రయించి పూదండలు చందనము స్త్రీలు గంధము ధనము విత్తము ధాన్యము గోవులు కొడుకులు కూతుండ్రు పశువులు ఇండ్లు ఉద్యానములు మొదలగు వస్తువులయొక్క ఆర్జనయందు సాధనములై గున్నట్టి వర్తకము కొలువు యాచ్న మొదలగు లోకవ్యవహారకృత్యములను వదలి స్వర్గము మొదలుకొని సత్యలోకపర్యంతము గల పరలోక సంబంధము లయిన వస్తువులయందలి భోగములకు సాధనము లయిన నిత్యనైమిత్తికాదికర్మలను ఫలకాంక్షచేత నొనర్చక బ్రహ్మార్పణముగాఁ జేసి ఆ యీశ్వరానుగ్రహంబున నిర్మలచిత్తుఁడై తన్ను తా నీ పొగడుకొన కుండుట, తాఁ జేసిన ధర్మములఁ బ్రకటింప కుండుట, ప్రాణిబాధ నొనర్ప కుండుట, తిన్నఁదనము ఓర్పు గురుసేవ బాహ్యాభ్యంతరపరిశుద్ధత్వము స్థిరభావము మనోజయము శబ్దస్పర్శాది చతు

ద్దశేంద్రియములయందు నిగ్రహము గర్వము లేకుండుట, పుట్టుక మరణము ముదిమి వ్యాధి దుఃఖము వీని యందు దోషములఁ గనుట, పుత్త్రులు భార్యలు ఇండ్లు మొదలగు వానియం దిష్టము లేకుండుట, అనన్యాత్మ భావనాలక్షణ మైన యాసక్తి లేశమును లేకుండుట, సర్వదా యిష్టముగా నైనను అనిష్టముగా నయినను లభించువానియందు సమబుద్ధియు, నాయందె నిరతము లేదను ధ్యానమందు స్థిరభక్తియు, జనులు లేనిచోట నుండుట, జనసంగమునం దిష్టము లేకుండుట, అభిలాషను వదలుట, బ్రహ్మజ్ఞానమందు నిరంతరభావన మోక్షజ్ఞానమందు బ్రహ్మాత్మైకదృష్టి అను నీ యిరువదిలక్షణముల నెప్పుడు పొందునో ఆ కాలమునందు తత్క్షణమే పరబ్రహ్మము యొక్క సాక్షాత్కారమును విమర్శను చేయఁదగిన విచారమునం దధికారి యగును, ఇదంతయును వైరాగ్యశాస్త్రోక్తక్రమము, ఇఁక మీఁద బోధశాస్త్రార్థము నెఱింగించెద వినుమని చెప్ప నారంభించె నని తాత్పర్యము

## బోధశాస్త్రార్థ వివరణము.

తే. అట్టి సుగుణాభిరాముఁ డత్యార్తిలేక, శాంతచిత్తుండుఁ గారుణ్యసాగరుండు
జ్ఞానవిజ్ఞానసంపన్నుఁ డైనగురుని, వినయభయభక్తు లమర సేవించు మనఘ.

టీక. అనఘ = అంజనేయా! అట్టి = పైనఁ జెప్పఁబడినటువంటి, సుగుణ = సద్గుణములచేత, అభిరాముండు = మనోహరుఁ డైన పురుషుఁడు, అత్యార్తిలేక = మిగుల పరితాపముతో, శాంతచిత్తుండు = సత్త్వస్థితిఁ గూడిన మనస్సు గలవాఁడును, కారుణ్యసాగరుండు = దయాసముద్రుఁడు, జ్ఞానవిజ్ఞానసంపన్నుఁడును — జ్ఞాన = తత్పదత్వంపదార్థ పరిజ్ఞానముతోడ, విజ్ఞాన = బ్రహ్మజ్ఞానముతోడ, సంపన్నుఁడును = కూడినవాఁడును, ఐన = అయినట్టి, గురునిన్ = ఆచార్యుని, వినయభయభక్తులు — వినయ = అడఁకువయును, భయ = వెఱపును, భక్తులు = విశ్వాసమును, అమరన్ = ఒప్పఁగా, సేవించుమ్ = ఉపాసించుము

తా. అంజనేయా! పైనఁ జెప్పఁబడిన సద్గుణములచేత మనోహరుఁడగు పురుషుఁడు మిగుల పరితాపముతో సత్త్వస్థితిఁ గూడిన మనస్సు గలవాఁడును, దయాసముద్రుఁడున, తత్పదత్వంపదార్థ పరిజ్ఞానముతోడను బ్రహ్మజ్ఞానముతోడను గూడినవాఁడును నగు సద్గురుని వినయభయభక్తులతో నుపాసించు మని తాత్పర్యము

## గురువే పరబ్రహ్మ మని బోధించుట.

క. గురుఁ డజుఁడు గురుఁడు విష్ణుఁడు, గురుఁడు మహాదేవుఁ డఖిలగురుఁడు గురుఁడు స
ద్గురుఁడే పరబ్రహ్మం బని, గురుని నుపాసించు నతఁడు గురుతరభక్తిన్. ౧౩౩

టీక. అతఁడు = అమానిత్వాది సద్గుణములు గల యా పురుషుఁడు, గురుఁడు = గు-అనఁగా చీఁకటి, అజ్ఞాన మని పారిభాషికము, రు-అనఁగా నాశనము, చీఁకటిరూప మైన యజ్ఞానమును నశింపఁజేయువాఁడు గురుఁ డనఁబడును, అట్టి గురుఁడు, అజుఁడు = బ్రహ్మ, గురుఁడు = దేశికుఁడే, విష్ణుఁడు = విష్ణుదేవుఁడు, గురుఁడు = [illegible], మహాదేవుఁడు = శివుఁడు, గురుఁడు = ఆచార్యుఁడే, అఖిల = సమస్తప్రపంచమునకు, గురుఁడు = తండ్రి-అనఁగా జగత్కారణుఁ డనుట, సద్గురుఁడే = శ్రేష్ఠుఁ డయిన యాచార్యుఁడే, పరబ్రహ్మం బని = ప్రకృతికిఁ బర మైన పరమాత్మయని, గురుతరభక్తిన్ = అతిశ్రద్ధచేత, గురునిన్ = ఆచార్యుని, ఉపాసించున్ = ఆరాధించును.

తా. ఆ గురుఁడు బ్రహ్మ, ఆ దేశికుఁడు విష్ణుదేవుఁడు, ఆ ఒజ్జ శివుఁడు, ఆ యోగాచార్యుఁడు సమస్తప్రపంచమునకు తండ్రి (జగత్కారణుఁడు) అట్లగుటవలన శ్రేష్ఠుఁడగు యోగాచార్యుఁడే ప్రకృతికిఁ బరమైన పరమాత్మ యని యుపాసింపవలయు నని తాత్పర్యము

గురుశుశ్రూష ముఖ్యంబని చెప్పుట.

సీ. గురుపదాంభోజముల్ గొలువక కల్గునే, ప్రవిమలవైరాగ్యభాగ్యమహిమ
గురుపాదతీర్థంబుఁ గ్రోలక కల్గునే, జ్ఞానవిజ్ఞానయోగానుభవము
గురుసుప్రసాదంబుఁ గొనకున్నఁ గల్గునే, ప్రతిలేని చిత్తోపరతిసుఖంబు
గురుతత్త్వ మాత్మఁ గన్గొనకున్నఁ గల్గునే, నిరతిశయంబైన పరమపదము
తే. అట్లు గావున విద్యార్థియైన యోగి
వినయభయభక్తు లెదలోనఁ బెనఁగొనంగ
నలచతుర్విధశుశ్రూష లాచరించి
కొనుచు ననిశంబు గురువులఁ గొలుము ననఘ. ౧౩౮

అవతారిక ఈ పద్యమందు గురుపరబ్రహ్మముల కభేదాధ్యవసాయము చేసి గురుశుశ్రూషయును గలుగఁ జెప్పినాఁడు.—

టీక అనఘ = అంజనేయా! గురుపదాంభోజములు = గురుచరణారవిందములను - పరబ్రహ్మము యొక్క తత్త్వంపదము లని యర్థాంతరము, కొలువక = సేవింపక - విచారింపక యని యర్థాం, ప్రవిమల = అతినిర్మలమైన, వైరాగ్య = విరాగము నిడు, భాగ్యమహిమ = సంపత్సమృద్ధి, కల్గునే = లభించునా? లభింప దనుట, అర్థ ముభయత్ర సమము, గురుపాదతీర్థంబుఁ = ఆచార్యపాదప్రక్షాళనోదకమును, గురు = పరబ్రహ్మము యొక్క, పాద = తత్త్వంపదవివరణకారణము లగు మహావాక్యార్థములయొక్క, తీర్థంబు = స్వారస్యమును, క్రోలక = పానము చేయక - చెవులతో గ్రోలక యని యర్థాం, జ్ఞాన = సదసద్వివేకజ్ఞానము యొక్క, విజ్ఞాన = అపరోక్షజ్ఞానముయొక్క, యోగ = చిత్తస్థైర్యముయొక్క, అనుభవము = సుఖము, కల్గునే = ఘటించునా? అర్థము సమము, గురుసుప్రసాదంబుఁ = గురుభుక్తశేషమును - పరమాత్మయొక్క మహాదనుగ్రహము నని యర్థాం, కొనకున్నఁ = భుజింపకపోయి నని - పొందకపోయి నని యని యర్థాం, ప్రతిలేని చిత్తోపరతిసుఖంబు — ప్రతిలేని = ఈడులేని, చిత్తోపరతిసుఖంబు = చిత్తవిశ్రాంతివలనఁ గలిగిన యానందము, కల్గునే = అబ్బునా? ఉభయత్ర సమము, గురుతత్త్వము = తత్పదలక్ష్యార్థమైన గురుస్వరూపమును - పరబ్రహ్మస్వరూపము నని యర్థాం, ఆత్మన్ = త్వంపదలక్ష్యార్థప్రత్యగాత్మయైన తనయందు, కన్గొనకున్నన్ = ఐక్యార్థము దర్శింపకపోయితేని, నిరతిశయంబు = సర్వోత్కృష్టము, ఐన పరమపదము = ఐనట్టి మోక్షస్థానము, కల్గునే = దొరకునా? అట్లు గావునన్ = పైనఁ జెప్పినట్లు లభించునది గనుక, విద్యార్థి యైన యోగి — విద్యార్థియైన = బ్రహ్మజ్ఞానాసక్తుఁడైన, యోగి = జితేంద్రియుఁడు, వినయభయభక్తులు — వినయ = గురువునందును రాజునందునువలె నడఁకువయును, భయ = సర్పమునందువలె వెఱపును, భక్తులు = పుత్రునియందువలె విశ్వాసమును, ఎదలోనన్ = హృదయమందు, పెనఁగొనంగన్ = పెనుచు కొనఁగా, అల = ప్రసిద్ధములైన, చతుర్విధ = స్థానాంగభావాత్మ లని నాలుగువిధములైన, శుశ్రూషలు = ఊడిగములను, [పరబ్రహ్మపరమందు ప్రణవమందలి అకార ఉకార మకారములకు లక్ష్యార్థ మగు దష్టృస్థానమును [illegible] లేని యయునికతో విచారణ చేయుటే స్థానశుశ్రూష, సూర్య చంద్ర బ్రహ్మ

లక్ష్యార్థము = అతద్వ్యావృత్తి తటస్థస్వరూపలక్షణములచేత ద్రష్ట్రరూప మైన పరబ్రహ్మమును తెలిసికొనఁదగినది, వేదశాస్త్రగరహస్యంబు— వేద = చతుర్వేదములయంతలి, శాస్త్రగ = షట్ఛాస్త్రములయందలి, గహ్యంబు = గోప్యము, ఇంత = ఇదియె, నిక్కం బగుణ్ = సత్య మగును

తా॰ ఆ వాచ్యార్థలక్ష్యార్థములు క్రమముగా ఆద్యంతము లైన అకారహకారములయందు గోప్యముగా నుండునట్టి సమస్తవర్ణములును, ఆ వర్ణములతోఁ గూడిన శబ్దములును, ఆ శబ్దములతోఁ గూడిన వాక్యములును, అట్టి వాక్యములతోఁ గూడిన శ్రుతిస్మృతిపురాణేతిహాసాదులును వీటినన్నిటిని గల్గి ప్రకాశించు సంపుటమైన అహా మ్మను శబ్దమునకు స్థాణువువలె గనఁబడు చుండెడు స్థూలశరీరము, దశేంద్రియములు, ప్రాణపంచకము, చంచలాత్మక మగు చిత్తము, సంశయాత్మక మగు మనస్సు, కర్తవ్యాత్మకాభిమానము, నిశ్చయాత్మక మగు బుద్ధి వీనియొక్క స్వరూప మైన అజ్ఞానవృత్తులయొక్క సమూహమంతయు వాచ్యార్థము, (మాటమాత్ర మైనది) ప్రధాన మైనదియును, సత్యజ్ఞానానందస్వరూపమై యొప్పు చున్నదియును, నిర్మల మైనదియును, విలక్షణ మైనదియును నగు కూటస్థచైతన్యమే లక్ష్యార్థము, (అతద్వ్యావృత్తి తటస్థస్వరూపలక్షణములచేత ద్రష్ట్రరూప మైన పరబ్రహ్మమును తెలిసికొనఁదగినది) వేదశాస్త్రములయందలి గహ్య మైనది సత్యము గానిదియే యని తాత్పర్యము

క. సర్వము వాచ్యార్థము తత్సర్వాధిష్ఠానశుద్ధచైతన్యము చి
త్పూర్వకలక్ష్యార్థంబు సుపర్వవినుత వినుము బ్రహ్మశబ్దము నరయన్. ౧౩౪

టీ॰ సుపర్వవినుత— సుపర్వ = దేవతలచేత, వినుత = పొగడఁబడిన యాంజనేయా! వినుము = ఆకర్ణింపుము, బ్రహ్మపదమునరయన్ = బ్రహ్మశబ్దమునరయ, అరయన్ = యోచింపఁగా, సర్వము = పిండాండబ్రహ్మవిష్ణురుద్రేశ్వరసదాశివమాయాండపర్యంత మైన సకలమును, వాచ్యార్థము = మాటమాత్ర మైనది, తత్సర్వాధిష్ఠానశుద్ధచైతన్యము— తత్ = ఆ పిండాండాది మాయాండపర్యంత మైన, సర్వ = సమస్తమునకు, అధిష్ఠాన = ఆధార మైన, శుద్ధ = ప్రకృత్యతీత మైన, చైతన్యము = జ్ఞానస్వరూపపరబ్రహ్మమే, చిత్పూర్వలక్ష్యార్థము = సచ్చిదానందాది లక్షణపంచకముచేతఁ బొందఁదగినవస్తువు.

తా॰ దేవతలచే స్తుతింపఁదగిన యో యాంజనేయా వినుము, యోచింపఁగా బ్రహ్మశబ్దమునకు పిండాండము మొదలుగాఁగల బ్రహ్మ విష్ణు రుద్రేశ్వర సదాశివ మాయాండమువరకుఁ గల సకలమును వాచ్యార్థము, ఆ పిండాండాది మాయాండపర్యంత ముండెడి సకలమునకు నాధార మైనదియును, శుద్ధప్రకృత్యతీత మైనదియును, జ్ఞానస్వరూపపరబ్రహ్మమే సచ్చిదానందములే మొదలుగాఁ గల ఐదులక్షణములచేఁ బొందఁదగిన వస్తువు యని తాత్పర్యము

తే. ఉభయవాచ్యార్థములతోడ నొప్పు చున్న
యుభయలక్ష్యార్థముల కైక్య మొదవ దట్లు
గాన వాచ్యార్థముల రెంటఁ గడకుఁ ద్రోచి
యెనయు లక్ష్యార్థ మొకటిగా నెఱుఁగవలయు. ౧౩౫

టీ॰ ఉభయవాచ్యార్థములతోడన్ — ఉభయ = రెండైన (అహంపద బ్రహ్మపదములయొక్క) వాచ్యార్థములతోడన్ = అహంపదవాచ్యార్థ మైన శరీరేంద్రియాంతఃకరణాది భేదములతోడను బ్రహ్మపదవాచ్యార్థ మైన పిండాండాది మాయాండపర్యంతము లైన భేదములతోడను, ఒప్పుచున్న = శోభిల్లుచున్న, ఉభయలక్ష్యార్థములకున్ — ఉభయ = రెండైన, లక్ష్యార్థములకున్ = సచ్చిత్సుఖరూపుఁ

తా. శివకార్యార్థముచేత నిచ్చుటయును జలధారాపూర్వకముగా నిచ్చుటయును తా ననుభవించుటయును నుపయోగింపని యొక మానవుని కలిమియును, సత్ప్రవర్తనములేని బ్రాహ్మణునియొక్క వేదాధ్యయనమును, మనస్సునందు విపుల మైన తాలిమిని పూసనివాని నియమతపంబులును, దశేంద్రియములకు ప్రధాన మైన మనస్సు మొదలగు తత్త్వములయొక్క నిలుపుటవలనఁ గలిగిన యానందాతిశయము నెఱుంగని ప్రత్యగాత్మానుసంధానపరునియొక్క (యోగియొక్క) ఆత్మజ్ఞానమును విచారింపఁగా వ్యర్థములని తాత్పర్యము

సీ. వేదశాస్త్రంబులు వివరించి బుధులచేఁ, జదివింపవచ్చుఁ దాఁ జదువవచ్చు
యజ్ఞదానతపంబు లధికారిజనముచేఁ, జేయింపవచ్చుఁ దాఁ జేయవచ్చు
నిలలోనఁ గలతీర్థములకేగ నన్యుల, బోధింపవచ్చుఁ దాఁ బోవవచ్చు
నష్టాంగయోగవిద్యల నార్యులకు నుప, దేశింపవచ్చు సాధింపవచ్చు
తే. గాని యెవ్వారి కైన విజ్ఞానయోగ, గతిని దేహేంద్రియములరికట్టి మనము
నాఁగి యంతర్ముఖముఁ జేసి యనవరతము, నిశ్చలసమాధినిష్ఠచే నిలుపరాదు.

టీ. బుధులచేతన్ = విద్వాంసులచేత, వేదశాస్త్రంబులు — వేద = ఋగ్యజుస్సామాథర్వణములను, శాస్త్రంబులు = శిక్షాది షట్ఛాస్త్రములను, వివరించి = ప్రతిపదార్థమును విభజించి, తాన్ = తాను, చదివింపవచ్చున్ = పుత్త్రాదులచే పఠింపింపవచ్చును, చదువవచ్చున్ = తాను పఠింపవచ్చును, అధికారిజనముచేతన్ = 'అర్థీ సమర్థో విద్వాన్ జాతపుత్త్రః కృష్ణకేశః' ఇత్యాది లక్షణములు గల అధికారపురుషులచేత, యజ్ఞదానతపంబులు — యజ్ఞ = పౌండరీకాది క్రతువులను, దాన = షోడశ మహాదానములను, తపంబులు = శారీర వాచిక మానసిక తపస్సులను, చేయింపవచ్చున్ = ఆచరింపఁ జేయవచ్చును, తాఁ జేయవచ్చున్ = తా నాచరింపవచ్చును, అన్యులన్ = ఇతరులను, ఇలలోనన్ = భూమియందు, కలతీర్థములకున్ — కల = కలిగిన, తీర్థములకున్ = గంగా నర్మదాది పుణ్యతీర్థములకు, ఏగన్ = పోవునట్లు, బోధింపవచ్చున్ = ఉపదేశింపవచ్చును, తాఁ బోవవచ్చున్ = తానును బోవచ్చును, ఆర్యులకున్ = పండితులకు, అష్టాంగయోగవిద్యలన్ — అష్ట = ఎనిమిదివిధము లైన, అంగ = యమనియమాసనాద్యంగములు గల, యోగ = మంత్రలయహఠరాజయోగము లనెడు, విద్యలన్ = విద్యలను, ఉపదేశింపవచ్చున్ = తెలుపవచ్చును, సాధింపవచ్చున్ = తానును తెలిసికొనవచ్చును, కాని = ఇట్లు చేయవచ్చును గాని, ఎవ్వారికైనన్ = ఎంతటి మహాప్రాజ్ఞుల కైనను, విజ్ఞానయోగగతిని — విజ్ఞాన = ప్రజ్ఞానముచేత నైన, యోగ = జీవేశ్వరైక్యముయొక్క, గతిన్ = మార్గమునందు, దేహేంద్రియములు, దేహ = స్థూలసూక్ష్మకారణ శరీరములను, ఇంద్రియములు = జ్ఞానకర్మేంద్రియములను, అరికట్టి = నిరోధించి, మనమున్ = సంకల్పాత్మక మైన మనస్సును, ఆఁగి = నిలిపి, అంతర్ముఖము చేసి = తనవైపు మరలించుకొని, (అంతఃకరణము బహిర్ముఖ మైనప్పుడు మనస్సనియు, అంతర్ముఖ మైనప్పుడు బుద్ధి యనియు ననఁబడును, చిత్తాహంకారములు మనోబుద్ధులకు సహాయము లై యుండును గనుక చిత్తసహాయము గల మనస్సును జ్ఞానస్వరూపముగాఁ జేసి తనలో నడంచికొని) అనవరతము = ఎల్లప్పుడు, నిశ్చలసమాధినిష్ఠచేతన్ — నిశ్చలసమాధి = నిర్వికల్పసమాధిరూప మైన, నిష్ఠచేతన్ = తపస్సుచేత, నిలుపరాదు = నిలువరింపఁ గూడదు

తా. పండితులచే ఋగ్యజుస్సామాథర్వణవేదములను శిక్షాది షట్ఛాస్త్రములను పుత్త్రాదులచే చదివింపవచ్చును, తానును జదువవచ్చును, అధికారిజనముచేత పౌండరీకాదిక్రతువులను షోడశమహా

తే. జ్ఞానవిజ్ఞానయుతుఁ డయ్యు సంతతంబు
నాత్మభావన లేకున్న యతనియింద్రి
యంబులును మనంబును తమకు వశంబు సేసి
విషయసుఖములు చవిఁ జూపి వెతలఁ బెట్టు. ౧౪౭

టీక. జ్ఞాన = తత్త్వంపదార్థవిచారణజ్ఞానముతోడ, విజ్ఞాన = అనుభవజ్ఞానముతోడ, యుతుఁ డయ్యున్ = కూడినవాఁడైనను, సంతతంబున్ = ఎల్లప్పుడు, ఆత్మభావన = బ్రహ్మాభిన్నప్రత్యగాత్మ నేననెడు స్మరణ, లేకున్న యతని యింద్రియంబులును = లేని యాపురుషుని దశేంద్రియములును, మనంబును = జ్ఞప్తియును, తమకు వశంబు సేసి = తమకు లోఁబఱచుకొని, విషయసుఖములు చవిన్ — విషయసుఖ = విషయానందముల యొక్క, చవిన్ = రుచిని, చూపి = కనఁబఱచి, వెతలఁబెట్టున్ = తాపత్రయదుఃఖములలోఁ దగిలించును

తా. తత్త్వంపదార్థవిచారణజ్ఞానముతోడను, అనుభవజ్ఞానముతోడను గూడినవాఁడైనను యెల్లప్పుడు బ్రహ్మముకంటె వేఱుగాని ప్రత్యగాత్మ నేనను స్మరణ లేని మానవునియొక్క మనస్సును, ఇంద్రియములును తమకు లోఁబఱచుకొని విషయానందముల నొసఁగించుచు తాపత్రయదుఃఖములలోఁ దగిలించు నని తాత్పర్యము

సుస్థితప్రజ్ఞసి లక్షణము.

సీ. అవ్యగ్రగతి నింద్రియమనంబుల నజస్ర, మాత్మభావనచేత నాఁగఁబట్టి
యంతర్ముఖములుగా నలరించి యామీఁదఁ, గామాదిశత్రువర్గము నడంచి
విమలబోధాకారవృత్తిచేఁ గేవల, పరిపూర్ణతత్త్వరూపంబుఁ గాంచి
యానందమూర్తియై యఖిలంబుఁ దనయందు, సమయించి చిత్తవిశ్రాంతి నొంది
తే. యొకఁడు మఱపుఁ గోరయని యొక్కఁడైన
యగమపురుషుండు సుస్థితప్రజ్ఞుఁ డనఁగ
గాత్రయాతీతుఁ డన సమస్తరాజ
యోగనిగ్రహ మనుఁడై యుండు ననఘ. ౧౪౮

టీక. అనఘ = అంగ నేయా! అవ్యగ్రగతిన్ = అవ్యథముగా దుఃఖములకు లోఁబడమియు గనుక, ఇంద్రియమనంబులన్ — ఇంద్రియ = దశేంద్రియములను, మనంబులన్ = కారణరూపమైన పరామనస్సును, అజస్రము = ఎల్లప్పుడు, ఆత్మభావనచేతన్ = బ్రహ్మము నేనను తెలివిచేత, ఆఁగఁబట్టి = అడ్డగించి, అంతర్ముఖములుగాన్ = బ్రహ్మమైన తన కభిముఖముగా, అలరించి = చేసి, ఆమీఁదన్ = అనంతరము, కామాది శత్రువర్గమున్ — కామాది = కామ క్రోధ లోభ మోహ మద మత్సరము లనెడు, శత్రు = అంతశ్శత్రువుల యొక్క, వర్గమున్ = గుంపును, అడంచి = క్షీణింపఁజేసి, విమలబోధాకారవృత్తిచేన్ — విమల = నిర్మలమయిన, బోధాకార = బ్రహ్మాకారమయిన, వృత్తిచేన్ = ప్రవర్తనముచేత, కేవలపరిపూర్ణతత్త్వరూపంబున్ — కేవల = ముఖ్యమయిన, పరిపూర్ణ = అఖండమయిన, తత్త్వ = యధార్థమయిన, రూపంబున్ = బ్రహ్మస్వరూపమును, కాంచి = దర్శించి, ఆనందమూర్తియై = నిత్యనిరుపాధిక సుఖస్వరూపుఁడై, అఖిలంబున్ = మహదాది సర్వప్రపంచమును, తనయందున్ = తనలోపలను, సమయించి = లయము చేసి,

చిత్తవిశ్రాంతి నొంది = చిత్తలయము గలవాఁడై, ఎఱుక మఱపులన్ = జ్ఞానాజ్ఞానములను—తురీయము అని యర్థాంతరము, పోరయని = అంటని, ఎఱుక యైన పరమపురుషుండు = జ్ఞానస్వరూపుఁడైన పురుషోత్తముఁడు, సుస్థితప్రజ్ఞుఁడనఁగన్—సుస్థిత = చలనము లేకయుండెడి, ప్రజ్ఞుఁడనఁగన్ = జ్ఞానము గలవాఁడనునట్లు 'బ్రహ్మైవాహమస్మి' యను నిశ్చలజ్ఞానము గలవాఁడనుట, గుణత్రయాతీతుఁడగన్ = సూక్ష్మప్రకృతి మహదహంకారము లను త్రిగుణముల నంటనివాఁడనునట్లు, అమనస్క = మనస్సు లేని, గ = ప్రకాశ మయిన, యోగనిద్రా = నిర్నిద్రయందు, సమేతుఁడై = కూడినవాఁడై, ఉండున్ = నివసించును.

తా. ఆంజనేయా! అట్లు దుఃఖములకు లోఁబడకుండు నటుల నశేంద్రియముల, నాగణరూప మయిన మనస్సును సర్వదా బ్రహ్మము నాకంటె భిన్నము గాదను నెఱుక చేత నాగింగి బ్రహ్మమయిన తన కభిముఖముగాఁ జేయవలయు, అట్లొనర్చిన యనంతరము కామక్రోధలోభమోహాది దుష్టగుణముల నెడు అంతశ్శత్రుసమూహమును నశింపఁజేసి నిర్మల మయినట్టియు, బ్రహ్మాకారము నొందినట్టి ప్రశస్తమైన ముఖ్య మయినదియును, అఖండ మయినదియును, యథార్థ మయినదియును నగు బ్రహ్మానందముచే నొంది నిత్యనిరుపాధికసుఖస్వరూపుఁడై మహదాది సర్వప్రపంచమును తనలో లయము చేసిన చిత్తలయము గలవాఁడగును, అట్లు చిత్తలయము గలవాఁడై జ్ఞానాజ్ఞానములను (తురీయమును) అంటని జ్ఞానస్వరూపుఁడగు పురుషోత్తముఁడు బ్రహ్మమే నేనను చలింపని నిజజ్ఞానము గలవాఁడగునట్లు, సూక్ష్మప్రకృతి మహదహంకారము లను గుణత్రయము నంటనివాఁడనునట్లు మనస్సు లేనిదియును, ప్రకాశ మయినదియును నగు యోగనిద్రతోఁ గూడినవాఁడై యుండు నని తాత్పర్యము.

తే. ధర్మవిధి నెవ్వఁడు మనోగతంబు లైన
సర్వకామంబులను గడునన్న్యసించి
యంచితాత్మాత్మసంతుష్టుఁడగుచు నుండు
నాతఁడాత్మస్థితప్రజ్ఞుఁడగుఁ గుమార. ౧౪౯

టీక కుమార = ఆంజనేయ! ఎవ్వఁడు = ఏపురుషుఁడు, ధర్మవిధిన్—ధర్మ = పుణ్యమందలి, విధిన్ = కర్మభక్తిజ్ఞానములతోఁ గూడిన నియతిచేత, మనోగతంబు లైన = మానసము నంటియుండెడి, సర్వకామంబులను = అన్ని కోరికలను, కడున్ = మిక్కిలి, సన్న్యసించి = క్రమక్రమముగా విడిచి, అంచితాత్మాత్మసంతుష్టుఁడగుచున్—అంచిత = పూజ్య మయిన, ఆత్మ = పరమాత్మయందు, ఆత్మసంతుష్టుఁడగుచున్ = మనస్సంతుష్టి గలవాఁడై, ఉండు నాతఁడు = ఉండెడుపురుషుఁడు, ఆత్మస్థితప్రజ్ఞుఁడగున్—ఆత్మ = తనయందే, స్థిత = ఉంచఁబడిన, ప్రజ్ఞుఁడగున్ = జ్ఞానము గలవాఁడగును.

తా. ఆంజనేయా! ఏమానవుఁడు పుణ్యమందలి కర్మభక్తిజ్ఞానములతోఁ గూడిన నియమముచే మనస్సును బొంది యున్న సమస్తకోరికలను క్రమక్రమముగా వదలి పూజింపఁదగిన పరమాత్మయందే మనస్సంతుష్టి గలవాఁడై యుండునో ఆ పురుషుఁడు జ్ఞానము తనయందు గలవాఁడు నై యుండు నని తాత్పర్యము.

తే. ప్రాప్తదుఃఖములకు భయపడక యొప్పి
కొనరి యప్రాప్తసుఖములఁ గోరికొనక
వీతరాగభయక్రోధుఁడై తనర్చు
నాతఁడాత్మస్థితప్రజ్ఞుఁడగుఁ గపీంద్ర. ౧౫౦

యోగివరుండు పరబ్రహ్మ మగు తనయందు నుంచఁబడిన బుద్ధి గలవాఁ డగును, (అహం బ్రహ్మాస్మి యను బుద్ధిగలవాఁ డగును) అని తాత్పర్యము

తే. విను మొకరహస్య మెఱిఁగింతు వేయు నేల
యేమహాప్రాజ్ఞునకు మానసేంద్రియములు
పంచిన ట్లాజ్ఞలో నిల్చి పనులు సేయు
నాతఁ డాత్మస్థితప్రజ్ఞుఁ డగు బుధేంద్ర. ౧౪౩

టీక. బుధేంద్ర = ఆంజనేయా! ఒకరహస్యము = ఒక గోప్యాంశవాక్యమును, ఎఱిఁగింతున్ = తెలుపుదును, వినుము = ఆకర్ణింపుము, వేయునేల = పెక్కుమాట లేఁటికి, ఏమహాప్రాజ్ఞునకున్ = బ్రహ్మవిదుఁ డగు నెవనికి, మానసేంద్రియములు = మనస్సును ఇంద్రియదశకమును, ఆజ్ఞలోన్ = ఆజ్ఞయందు, నిల్చి = ఉండి, పంచినట్లు = ఆజ్ఞాపించినట్లు, పనులు = సంకల్పాది కార్యములను, సేయున్ = ఒనర్చునో, అతఁడు = ఆ బ్రహ్మవిదుఁడు, ఆత్మస్థితప్రజ్ఞుఁడు—ఆత్మ = పరబ్రహ్మమైన తనయందు, స్థిత = ఉంచఁబడిన, ప్రజ్ఞుఁడు = బుద్ధిగలవాఁడు, అగున్ = అవును

తా. ఆంజనేయా! ఇట్టి ప్రలాపంబులు చేయ నేటికి? రహస్యం బొకటి చెప్పెద నాకర్ణింపుము, బ్రహ్మవేత్త యగు నెవనికి మానసేంద్రియములు తనయాజ్ఞయందుండి యాజ్ఞానుసారముగా సంకల్పాదికార్యముల నొనర్చునో అట్టి బ్రహ్మవేత్త 'అహం బ్రహ్మాస్మి' యను నిశ్చలబుద్ధి గలవాఁ డగు నని తాత్పర్యము

ఆ. ఎల్లభూతములకు నెద్ది శర్వరి దానియందు మేలుకని మహాత్ముఁ డలరు
నఖిలజనము దేనియందు మేల్కొనియుండు, నదియె నిశి జితేంద్రియాత్మునకును.

టీక. ఎల్లభూతములకున్ = వివేకశూన్యమైన సకలప్రాణులకును, ఎద్ది = ఏ యాత్మవిషయ మైన ప్రజ్ఞ - అనఁగా బ్రహ్మాకారాకారితవృత్తి, శర్వరి = గోచరము గాకుండుటచే - అనఁగా రాత్రివలె ప్రకాశింపకుండుటవలన, దానియందున్ = ఆ యాత్మవిషయ మయిన ప్రజ్ఞానమందు, మహాత్ముఁడు = ఆత్మావలోకనపరుఁ డైన పురుషుఁడు, మేలుకని = హెచ్చరిక నొంది, అలరున్ = ఆనందించును - అనఁగా బ్రహ్మనిష్ఠ గలవాఁడై యుండు ననుట, జితేంద్రియాత్మునకును = ఇంద్రియనిగ్రహము గల పురుషునకును, అఖిలజనము = సకలప్రాణిసమూహము, దేనియందున్ = ఏశబ్దాదివిషయ మైన బుద్ధియందు - అనఁగా చతుర్దశేంద్రియవిషయాకారవృత్తియందు, మేల్కొనియుండున్ = జాగ్రత్త నొంది యున్నదో, అదియు = ఆ శబ్దాదివిషయబుద్ధియే, నిశి = అవిద్యాస్వరూప మగుటవలన రాత్రివలె ప్రకాశము లేక పోవుచున్నది

తా. వివేకము లేని సమస్తప్రాణులకు నేపరమాత్మవిషయ మయిన జ్ఞానము (సర్వము బ్రహ్మాకారాకారముగా జేయఁబడిన వృత్తి) కనఁబడక యుండుటచే రాత్రివలె ప్రకాశము లేక యుండునో అట్టి జ్ఞానమందు ఆత్మావలోకనము చేయఁగల పురుషుఁడు మేల్కొని యానందించునో అట్టి బ్రహ్మనిష్ఠ గలవాఁడును, జితేంద్రియుఁడును నగు పురుషునకు సమస్తప్రాణిసమూహము యేచతుర్దశేంద్రియవిషయాకారవృత్తియందు జాగ్రత్త నొంది యున్నదో ఆ శబ్దాదివిషయబుద్ధియే అవిద్యాస్వరూప మగుటవలన రాత్రివలె ప్రకాశము లేక పోవుచున్న దని తాత్పర్యము

వ. అట్లు గావున నింద్రియమనంబుల ననాత్మనిషేధపూర్వ కాత్మావలోకనంబుచేత
జయించి వశీకృతమానసేంద్రియుఁ డైన పుణ్యపురుషుఁడు సర్వభూతాద్వేష్టయు

సకలలోకమిత్రుండును పరమకారుణికుండును నిర్మముండు సమదుఃఖసుఖుండు నిరహంకారుండు క్షమావంతుండు నిత్యసంతుష్టుండు యోగారూఢుండు నియతాత్ముండు దృఢాత్మనిశ్చయుండు నిఖిలజనాభయప్రదుం డఖిలలోకభయరహితుండు ముక్తహర్షామర్షభయోద్వేగుండు నిరపేక్షుండు శుచియు దక్షుం డుదాసీనుండు గతవ్యథుండు పరిత్యక్తసర్వారంభుం డిష్టానిష్టప్రాప్తి హర్షద్వేషవిహీనుండు సంప్రాప్తేష్టవియోగదుఃఖవిరహితుం డప్రాప్తార్థకామనాశూన్యుండు యదృచ్ఛాలాభసంతుష్టుండు శుభాశుభపరిత్యాగియు సమశత్రుమిత్రుండు సమలోష్టాశ్మకాంచనుండు సమశీతోష్ణసుఖదుఃఖుండు తుల్యప్రియాప్రియుండు తుల్యనిందాస్తుతియుండు మానావమానతుల్యుండు మౌనశీలుం డనికేతనుండు సుస్థిరప్రజ్ఞుండు గుణాతీతుండు మద్భక్తుండు మదర్పితమనోబుద్ధియు మత్పరాయణుండు నై ప్రకాశించు యోగీంద్రుండు సంతతసహజామనస్కరాజయోగసమాధియందు సూర్యుండు సముద్రరసంబులం బీల్చిన తెఱంగున బడబానలంబు జలరాశిం బానంబు చేసిన క్రైవడి మహాదవానలం బరణ్యంబునం గల తృణాదిసర్వపదార్థంబులం గబళించిన తెఱంగున నావిద్యకంబు లైన యనంతగుణంబుల నశేషంబుగా మ్రింగి కేవలపరిపూర్ణశుద్ధచిన్మాత్రస్వరూపకుం డై యుండు సర్వశావిశేషం బుపరతి యన నొప్పు నయ్యుపరతిప్రాప్తికి యమనియమత్యాగమౌనదేశకాలాసనమూలబంధదేహసామ్యదృక్స్థితి ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధు లను పంచదశయోగాంగంబులు సాధనంబులు గావున వాని వేర్వేఱ విభజించెద నాకర్ణింపుము. ౧౫౫

టీ॥ అట్లు గావునన్ = బ్రహ్మజ్ఞానులకు జాగ్రత్త అవివేకులకు నిద్రయు అవివేకులకు జాగ్రత్త జ్ఞానులకు నిద్రయు నగుటవలన, ఇంద్రియమనంబులన్ — ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములను, మనంబులన్ = మనస్సును, అశాగ్మ = శరీరమును, నిషేధపూర్వక = పరిత్యజించుటయే మున్నుగాఁ గల్గినట్లు, ఆత్మ = పరమాత్మయొక్క, అలోకనంబుచేతన్ = దర్శనముచేత, జయించి = నిగ్రహించి, వశీకృత మానసేంద్రియుండు — వశీకృత = లోఁబరచబడిన, మానస = సంకల్పాత్మక మయిన మనస్సును, ఇంద్రియుండు = దశేంద్రియములు గలవాఁడును, ఐన పుణ్యపురుషుండు = అయిన సుకృతవంతుఁడు, సర్వభూతాద్వేష్టయుండున్ — సర్వభూత = సకలప్రాణులకు, అద్వేష్టయుండున్ = ద్వేషి గానివాఁడును, సకలలోకమిత్రుండును = సమస్తజనులకు స్నేహితుఁడును, పరమకారుణికుండు = అతిదయాళువును, నిర్మముండు = నాది యను మమకారము లేనివాఁడును, సమదుఃఖసుఖుండు = సుఖదుఃఖములయందు సమబుద్ధి గలవాఁడును, నిరహంకారుండు = నేనను అభిమానశూన్యుఁడును, క్షమావంతుండు = ఓర్పు గలవాఁడును, నిత్యసంతుష్టుండు = ఎల్లప్పుడానందము గలవాఁడును, యోగారూఢుండు = ప్రత్యగ్బ్రహ్మైక్యజ్ఞానము నతిక్రమించినవాఁడును – అనఁగా విపరీతము అనుమానము ప్రత్యక్ష మని సంశయము త్రివిధము, అందు దేహేంద్రియములు నే ననుట విపరీతము, నేను దేహేంద్రియములా ఆత్మనా అనుట అనుమానము, నేను దేహేంద్రియములు గాను ఆత్మ ననుట ప్రత్యక్షము, అదియును విడుచుట జ్ఞానము, అట్లు

లైన, అనంతగుణంబులకా—అనంత = మితిలేని, గుణంబులకా = రజస్సత్త్వతమోగుణాదులను, అశేషంబుగాకా = మిగుల కుండునట్లు, మ్రింగి = కబళించి, కేవల = ఏక మయిన, పరిపూర్ణ=అంతట నిండియున్న, శుద్ధ = నిర్మల మయిన, చిన్మాత్రస్వరూపసం డై = స్వయంప్రకాశ బ్రహ్మజ్ఞానస్వరూపుఁడై, ఉండుకా = వసించును, అద్దశావిశేషంబు = ఆ యవస్థాభేదము, ఉపరతి యను నొప్పుకా = ఉపరతి యని చెప్పఁబడును, అనన్యోపరతిప్రాప్తికికా = ఆ సర్వోపరతి లభించుటకు, యమ నియమ త్యాగ మౌన దేశ కాలాసన మూలబంధ దేహసామ్య దృక్స్థితి ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధు లను పంచదశయోగాంగంబులు = యమము నియమము త్యాగము మౌనము దేశము కాలము ఆసనము మూలబంధము దేహసామ్యము దృక్స్థితి ప్రాణాయామము ప్రత్యాహారము ధ్యానము ధారణము సమాధి అను పంచదశయోగాంగంబులు అనెడు పేర్లు గల పదునైదుయోగాంగములు, సాధనంబులు గావునకా = సహాయములు గనుక, వానికా = ఆ పదునేనింటిని, వేర్వేఱకా = ప్రత్యేకప్రత్యేకముగా, విభజించెదకా = విశదపఱచెదను, ఆకర్ణింపుము = వినుము.

తా. ఆ స్థితుఁడు బ్రహ్మజ్ఞానులకు జాగ్రత్తయు అజ్ఞానులకు నిద్రయు, అజ్ఞానులకు జాగ్రత్తయు బ్రహ్మవేత్తలకు నిద్రయు నగుచుండుటవలన జగమును పరిత్యజించుటయే ప్రధానముగాఁ గల ఆత్మావలోకనముచే నిద్రవలె నున్న మనస్సుగలవాఁడయి, సమస్తేంద్రియములు లోఁబఱచుకొన్న పుణ్యపురుషుఁడును, సమస్త ప్రాణులకు హితుఁడును, అతిదయాళువును, మమకారము లేనివాఁడును, (ఇది నాది యిది నాది యనుట మమకార మనఁబడును) సుఖదుఃఖములను సమానముగా భావించువాఁడును, నేనను నెడి యభిమానము లేనివాఁడును, ఓర్పు గలవాఁడును, నిత్యానందమయుఁడును, ప్రత్యగ్బ్రహ్మైక్యజ్ఞానము నతిక్రమించిన వాఁడును, నియమింపఁబడిన దేహేంద్రియాదులు గలవాఁడును, తానే పరమాత్మ యను దృఢనిశ్చయము గలవాఁడును, సమస్తజనులకు నభయ మిచ్చువాఁడును, చతుర్దశేంద్రియములతోఁ గూడిన దశ పదునాలుగులోకముల కుండుండెడి విష్ణ్వింద్రాది దేవతలవలన భయము లేనివాఁడును, సంతోషము కోపము అను వీని నెఱుఁగనివాఁడును, తుచ్ఛము లగు విషయసుఖముల నపేక్షింపనివాఁడును, పరిశుద్ధుఁడును, సమర్థుఁడును, సుఖదుఃఖములు లేనివాఁడును, ఆధ్యాత్మికాది దుఃఖములు లేనివాఁడును, ప్రయత్నము లేనివాఁడును, ఇష్టవస్తువులయొక్క ప్రాప్తియందు సంతోషమును అప్రాప్తియందు దుఃఖమును లేనివాఁడును, లభించినవస్తువులయొక్క పోకడయందు దుఃఖము లేనివాఁడును, లభింపనివస్తువులయందు దాశ లేనివాఁడును, దైవయోగమున గలిగిన లాభముచే తృప్తి నొందువాఁడును, శుభాశుభములను వదలినవాఁడును, శత్రుమిత్రులయందు సమభావము గలవాఁడును, బంగారువరహాలను మంటిపెళ్లలతో సమానముగాఁ జూచువాఁడును, శీతోష్ణములను సమముగా భావించువాఁడును, ఇష్టానిష్టములను తుల్యముగా నెంచువాఁడును, మానావమానములను సమానముగా భావించువాఁడును, గౌరవలాఘవములయందు సమదృష్టి గలవాఁడును, మునివృత్తియే స్వభావముగాఁ గలవాఁడును, ఇల్లు లేనివాఁడును, తలఁచినచోట నుండువాఁడును, చలింపనిబుద్ధి గలవాఁడును, గుణత్రయము నతిక్రమించినవాఁడును, సాధుసత్తముఁడును, నాయందు లీనమయిన మనస్సును బుద్ధియును గలవాఁడును, నాయందు విశ్వాసము గలవాఁడును లేక నేనే యింద్రియప్రవృత్తిస్థానముగాఁ గలవాఁడును నై ప్రకాశించుచున్న బ్రహ్మవిద్వరిష్ఠుఁడు యెల్లప్పుడు విరామము లేక స్వభావసిద్ధమై ప్రకాశించు జీవేశ్వరైక్యసమాధియందు సూర్యుఁడు సమస్త మయిన గుంటలు చెఱువులు బావులు నదులు నదములు మొదలగువానియందలి జలము నాకర్షించినట్లును, బడబాగ్ని సముద్రమును పానము చేసినట్లును, గొప్పకార్చిచ్చు అరణ్యమందలి కసవు మొదలగు సమస్తవస్తువులను మ్రింగినట్లును, అవిద్యతోఁ గూడిన సత్త్వరజస్తమోగుణాదుల నన్నిటిని మిగుల కుండునట్లు కబళించి

తనకంటె నితరము లేనివాఁడును, పరిపూర్ణుఁడును, నిర్మలుఁడును నగు స్వయంప్రకాశ బ్రహ్మజ్ఞానస్వరూపుఁడై యుండును, అట్టి యవస్థాభేదమే యుపరతి యనఁబడును, అయ్యుపరతి లభింపుటకు యమము నియమము త్యాగము మౌనము దేశము కాలము ఆసనము మూలబంధము దేహసామ్యము దృక్స్థితి ప్రాణాయామము ప్రత్యాహారము ధ్యానము ధారణము సమాధి అను పదునైదుయోగాంగంబులు సాధనంబులు గనుక వాని నన్నిటిని ప్రత్యేకముగా వివరించెద నాకర్ణింపు మని తాత్పర్యము.

### పంచదశయోగాంగములవిభాగము.

మ. సమతన్ క్ష్మాజలవహ్నివాయుఖతనూకర్మేంద్రియప్రాణచి
త్తమనోహంకృతిబుద్ధిరూపబహిరంతర్దృశ్యముల్ దృక్స్వరూ
పముగాఁ జూచుచుఁ దద్దృగాత్మకపరబ్రహ్మంబు దానంచు ని
త్యము భావించిన నా యమం బది యచింత్యం బంజనానందనా. ౧౧౭

టీ. అంజనానందనా = ఆంజనేయా! సమతన్ = అభేదస్థితితోడ, క్ష్మా = భూమి, జల = ఉదకము, వహ్ని = అగ్ని, వాయు = గాలి, ఖ = ఆకాశము, తనూ = దేహము, కర్మేంద్రియ = జ్ఞానకర్మేంద్రియములు, ప్రాణ = దశవిధప్రాణములు, చిత్త = చంచలాత్మక మగు చిత్తము, మనః = సంశయాత్మక మయిన మనస్సు, అహంకృతి = కర్తృత్వాకార మైన యహంకారము, బుద్ధి = నిశ్చయాత్మక మయిన బుద్ధి, (వీనియొక్క) రూప = స్వరూప మైన, బహిరంతర్దృశ్యముల్ — బహిః = వెలుపలి, అంతః = లోపలి, దృశ్యముల్ = విషయములను - ఇందు భూజలాదులు బహిర్దృశ్యములు, ప్రాణాదులు అంతర్దృశ్యము లనఁగా, దృక్స్వరూపముగాన్ = సర్వసాక్షిస్వరూపమే యని, చూచుచున్ = కాంచుచు, తద్దృగాత్మకపరబ్రహ్మంబు = దృక్స్వరూప మయిన యాపరమాత్మ, తాన్ అంచున్ = తానే యని, నిత్యము = ఎల్లప్పుడు, భావించినన్ = తలంచినేని, యమంబు = యమ మను యోగము, అది = అగును, అచింత్యంబు = వాఙ్మనోగోచరము గానిది - అనఁగా కష్టతర మయిన దని భావము.

తా. ఆంజనేయా! సమభావనతో భూమి జలము అగ్ని వాయువు ఆకాశము దేహము జ్ఞానేంద్రియకర్మేంద్రియములు వీనియొక్క స్వరూప మగు వెలుపలి విషయములను, దశవిధప్రాణములు చంచలాత్మక మగు చిత్తము సంశయాత్మక మగు మనస్సు కర్తృత్వాత్మక మగు నహంకారము వీనియొక్క స్వరూప మగు లోపలి విషయములను సర్వసాక్షిస్వరూపమే యని చూచుచు సాక్షియు దృక్స్వరూప మగు యా పరమాత్మ తానే యని తలఁచినేని యది యమ మను యోగ మగును, ఈ యమ మను యోగము వాఙ్మనోగోచరము గాని దని తాత్పర్యము.

సీ. వినుచు ముట్టుచుఁ గనుఁగొనుచు నాకుచు మూరు
కొనుచుఁ బల్కుచుఁ బవల్ గొనుచు జనుచు
వర్ణాశ్రమోచితవ్యాపారముల నిచ్చ
నలుపుచుఁ దలఁచుచు నెలఁగు నిడుల
నీయింద్రియంబు లీయింద్రియార్థంబులఁ
బూని వర్తించునే వీని కెల్ల
సాక్షిని కేవలసచ్చిదానందస్వ
రూపుఁడ గుణజాతిదూరుఁడనౌట

తే. రహితుఁడ నటంచుఁ దెలిసి నిరంతరంబు
దన్నుఁ దాఁ జూచుకొనుచు సత్యముగ నీయ
ఖండనియమంబు వదలక యుండు టరయ
నియమయోగం బనం దగు నిర్మలాత్మ. ౧౫౭

టీక. నిర్మలాత్మ = పరిశుద్ధస్వాంతము గల యోఁజనేయా! వినుచున్ = శ్రోత్రేంద్రియముచేత వర్ణాత్మక ధ్వన్యాత్మకము లయిన సర్వశబ్దముల నాలకించుచు, ముట్టుచున్ = తాఁకుచు - అనఁగా త్వగింద్రియముచేత మృదుకఠినాదిస్పర్శలను గ్రహించుచు, కనుఁగొనుచున్ = నేత్రేంద్రియముచేత దశవిధ రూపములను జూచుచు, తినుచున్ = రసనేంద్రియముచేత షడ్రసములను గ్రోలుచు, మూరుకొనుచున్ = ఘ్రాణేంద్రియముచేత సుగంధ దుర్గంధ మిశ్రగంధముల నాఘ్రాణించుచు, పల్కుచున్ = వాగింద్రియముచేత శబ్దాపశబ్దములను బలుకుచు, మసల్గొనుచున్ = హస్తేంద్రియముచేత దానప్రతిగ్రహాది సకల కార్యములఁ జేయుచు, నగుచున్ = నగుచుచు, వర్ణాశ్రమోచితవ్యాపారములన్—వర్ణ = బ్రాహ్మణాది చతుర్వర్ణములకు, ఆశ్రమ = బ్రహ్మచర్యాది చతురాశ్రమములకు, ఉచిత = తగిన, వ్యాపారములన్ = పనులను, నిశ్చలుండు గుచున్ = నిరంతరము జేయుచు, తలఁచుచున్ = మనస్సున నిహపరవిషయముల నూహించుచు, మెలఁగు నెడలన్ = తిరుగుచుండుసమయముల యందు, ఈ యింద్రియములు = నేత్రశ్రోత్రాది సకలేంద్రియములు, ఈ యింద్రియార్థంబులన్ = శబ్దాదీంద్రియవిషయములయందు, ప్రవర్తించున్ = అంటినవగుచున్నను, ఏన్ = నేను, వీనికెల్లన్ = ఇంద్రియయింద్రియార్థముల కన్నిటికిని, సాక్షిన్ = ద్రష్టను, కేవలసచ్చిదానందస్వరూపుఁడన్—కేవల = ముఖ్యమైన, సత్ = త్రికాలాబాధ్యమును, చిత్ = జ్ఞానమును, ఆనంద = సంతోషమును, స్వరూపుఁడన్ = ఆకృతిగాఁ గలవాఁడను, గుణ = త్రిగుణములను, జాతి = బ్రాహ్మణాదిజాతులను, రూప = దీర్ఘహ్రస్వస్థూలసూక్ష్మాదిరూపములను, నామ = దేవదత్తాదినామములు, రహితుఁడన్ = లేనివాఁడను, అటంచున్ = అని, తెలిసి = ఎఱిఁగి, నిరంతరంబున్ = ఎల్లప్పుడును, తన్నున్ = తనను, తాన్ = ప్రత్యగాత్మ యైన తాను, చూచుకొనుచున్ = ఐక్యభావముచేత వీక్షించుచు, సత్యముగన్ = నిక్కముగా, ఇయ్యఖండనియమంబున్ = సంపూర్ణ మయిన యీ నేమమును, వదలక యుండుట = విడువక యుండుటే, అరయన్ = విచారింపఁగా, నియమయోగం బనం దగున్ = నియమయోగ మని చెప్పఁదగును.

తా. పరిశుద్ధస్వాంతము గల యోఁజనేయా! శ్రోత్రేంద్రియముచేత ధ్వన్యాత్మక వర్ణాత్మకము లగు సమస్తశబ్దముల నాలకించుచు (భేరీభాంకారాదులు ధ్వన్యాత్మకములు, సంస్కృతభాషాది రూపములు వర్ణాత్మకములు) త్వగింద్రియముచేత మృదుకఠినాదిస్పర్శల గ్రహించుచును, నేత్రేంద్రియముచేత దశవిధరూపములఁ జూచుచును, రసనేంద్రియముచేత తిక్తమధురాదిషడ్రసములఁ గ్రోలుచును, ఘ్రాణేంద్రియముచేత సుగంధ దుర్గంధ మిశ్రగంధాదుల నాఘ్రాణించుచును, వాగింద్రియముచేత సుశబ్దాపశబ్దంబుల బలుకుచును, హస్తేంద్రియముచేత దానప్రతిగ్రహాది సకలకార్యముల నొనర్చుచును నడుచుచును, బ్రాహ్మణాది నాలుగువర్ణములకును బ్రహ్మచర్యాద్యాశ్రమములకును దగిన పనుల నొనర్చుచును, మనస్సున నిహపరవిషయముల నాలోచించుచును, సంచరించుకాలములయందు సమస్తయింద్రియములును యింద్రియార్థములగు శబ్దాదుల నంటి ప్రవర్తించు ననియును, నేను యీ యింద్రియార్థముల కన్నిటికిని సాక్షి ననియును, ముఖ్యమైనవియును, కాలత్రయముచే బాధింపఁబడనిదియును నగు జ్ఞానానందముతో స్వరూపముగాఁ గలవాఁడ ననియును, మఱియు తాను గుణత్రయరహితుఁడ ననియును, బ్రాహ్మణాది

మాటలాడక యుండువాఁడును, మాటలాడినను తాను మాటలాడితి నని తలఁపక యుండువాఁడును, సంకల్పములు లేనివాఁడును నై యుల్లపు బ్రహ్మానంద మనెడు యమృతసారము ననుభవించుటయే పరిశుద్ధ మగు మౌనయోగ మగును, ఈ యోగమును మానక సేవింపవలయు నని తాత్పర్యము

సీ. ధీరులచేత నే దేశ మాచార్యోప, దేశంబుచే నర్థి దెలియఁబడియె
బరమపవిత్రమై భాసిల్లు నే దేశ, మే దేశ మన్నింటి కెక్కుడయ్యె
నే దేశ మురుమానసేంద్రియప్రాణాది, సంచారశూన్యమై సమత నొప్పు
నే దేశమున సాధ్వసేచ్ఛామదక్రోధ, దుఃఖగంధలవంబు దోఁప కుండు
తే. గరము నిరుపద్రవంబు నిష్కంటకంబు
నిరతిశయమును నిత్యంబు నిర్మలంబు
దివ్య మానంద మగుచు నే దేశ మలరు
నదియె యేకాంతదేశ మాంజనేయ. ౧౬౦

టీక. అంజనేయా = హనుమంతుఁడా! ఏదేశము = ఏబ్రహ్మస్థానము, ధీరులచేతన్ = పండితుల చేత, ఆచార్యోపదేశంబుచేతన్ = గురుబోధచేత, అర్థిన్ = ప్రీతితో, తెలియఁబడియెన్ = ఎఱుఁగఁబడెనో, ఏదేశము = ఏచిదంబర మను స్థలము, పరమపవిత్రమై భాసిల్లున్ = మిక్కిలి పరిశుద్ధమై ప్రకాశించునో, ఏదేశము = ఏపరబ్రహ్మపదము, అన్నింటికిన్ = సర్వభూతముల కంటె నుత్తమము లయిన జ్ఞానభూము లేడింటికంటె, ఎక్కుడయ్యెన్ = మీఁదైన దాయెనో, ఏదేశము = ఏచిదాకాశము, ఉరు = గొప్పలైన, మానస = కార్యకారణాత్మక మైన మనస్సు, ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములు, ప్రాణ = దశవిధప్రాణములు, ఆది = మొదలైన అవ్యక్త మహదహంకార బుద్ధి చిత్తములయొక్క, సంచారశూన్యమై = ప్రవర్తనము లేనిదై, సమతన్ = అభేదస్థితితోడ, ఒప్పున్ = ప్రకాశించునో - అనఁగా గుణసామ్యావస్థ యనుట, ఏదేశమునన్ = ఏతురీయాతీతప్రదేశమునందు, సాధ్వస = భయము, ఇచ్ఛా = అభిలాషము, మద = క్రొవ్వు, క్రోధ = కోపము, దుఃఖ = శోకము, (వీనియొక్క) గంధ = వాసనలయొక్క, లవంబు = లేశమును, తోఁపకుండున్ = కనఁబడక యుండునో, ఏదేశము = ఏయానందాస్పదము, కరము = మిక్కిలి, నిరుపద్రవంబు = ఆధ్యాత్మికాది తాపత్రయబాధ లేనిదియు, నిష్కంటకంబు = కామాదిక్షుద్రశత్రువులు లేనిదియు, నిరతిశయమును = తనకంటె గొప్పది లేనిదియు, నిత్యంబు = కాలత్రయస్థాయియు, నిర్మలంబు = అజ్ఞానాదిమలినములు లేనిదియు, దివ్యము = అప్రాకృత మయినదియు, ఆనందము = నిరుపాధిక సుఖస్వరూప మయినదియు, అగుచున్ = ఐనదై, అలరున్ = వెలుఁగునో, అదియె = ఆ జ్ఞానాకాశమే, ఏకాంతదేశమౌన్ = ముఖ్యప్రదేశ మగును.

తా. అంజనేయుఁడా! ఏ బ్రహ్మస్థానము పండితులచేతను సద్గురుని యుపదేశముచేతను తెలియఁబడెనో, పరిశుద్ధ మయి ప్రకాశించు చిదంబర మను స్థల మెద్దియో, ఏ పరబ్రహ్మపదము సర్వభూతముల యందు నుత్తమము లైన జ్ఞానభూము లేడింటికంటె నెక్కుడైనదై కార్యకారణాత్మకమనస్సు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు దశవిధప్రాణములు మొదలైన అవ్యక్తమహదహంకారబుద్ధిచిత్తముల ప్రవర్తన లేనిదై యభేదస్థితితో నొప్పు చిదాకాశ మెద్దియో, ఏ తురీయాతీతప్రదేశమందు భయము అభిలాష కోరిక క్రొవ్వు క్రోధము దుఃఖము వీనివాసనలయొక్క లేశ మయినను కనఁబడ కుండునో, ఏ యానందాస్పదము తాపత్రయబాధ లేనిదియును కామాది క్షుద్రశత్రువులు లేనిదియును తనకంటె నధిక మయిన

యయును నగు [బ్రహ్మమే ప్రళయానంతరము] ఆ కాలము ఉత్పత్తి లేనిదియును, నాశము లేనిదియును నై యున్న దని తాత్పర్యము.

సీ. అట్టి యాద్యంతరహిత కాలాత్మకాత్ముండై నిమేషాది యై ప్రళయాంత మైన
కాలమును దూలగ నఖండముగ వ్యాపించి బ్రమింగి యోగి భాసిల్లు ననఘ

టీక. అనఘ = అంజనేయా! యోగి = బ్రహ్మవిదుండు, అట్టి యాద్యంతరహిత కాలాత్మ కాత్ముండై — అట్టి = పైనం జెప్పంబడినట్టి, ఆద్యంతరహిత = ఉత్పత్తిలయములు లేని, కాలాత్మక = కాలస్వరూప మైన, ఆత్ముండై = పరమాత్మస్వరూపుండై, నిమేషాదియై = అప్పపాట్లు మొదలుగాం గలదై, ప్రళయాంత మైన కాలమును = బ్రహ్మ విష్ణు రుద్ర ప్రళయములవఱ కైన కాలమును, దూలగ నఖండముగ = ప్రత్తితునుకవలె, అఖండముగా వ్యాపించిన కార్చిచ్చువలె, బ్రమింగి = కబళించి, భాసిల్లున్ = ప్రకాశించును — కాలపరిచ్ఛేదరహితుం డగు ననుట.

తా. అంజనేయా! బ్రహ్మవేత్త పైం జెప్పంబడిన యుత్పత్తిలయములు లేని కాలరూప మగు పరమాత్మస్వరూపుండై అప్పపాట్లు మొదలుగాం గలదియును నగు బ్రహ్మవిష్ణురుద్రప్రళయములవఱ కుండునదియును నగు కాలమును, ప్రత్తితునుకను అంతట వ్యాపించిన కార్చిచ్చురీతిం గబళించి ప్రకాశించుచుండు నని తాత్పర్యము.

క. చలనము కాయక్లేశము, నలసతయును జాడ్యనిద్ర లాయాసం బి
వ్వలె నట్టి యోగికి చలనను, గలుగ వది సుఖాసనం బకల్పిత మనఘా. ౧౬౮

టీక. అనఘా = అంజనేయా! చలనము = సూక్ష్మశరీరాశ్రయప్రాణవాయుధర్మ మగు కదలికయు, కాయక్లేశము = స్థూలశరీరధర్మ మగు శరీరపీడయు, అలసతయును = కారణశరీరధర్మ మైన బడలికయును, జాడ్యనిద్రలు = మందస్వభావమును నిద్రయును, ఆయాసంబు = శ్రమయును, ఇవ్వలెన్ = తెప్పగా, ఎట్టి యోగికి చలనను = పరబ్రహ్మస్వరూపముగా నుండుటచేత, కలుగవు = పుట్టవో, అది = ఆ యోగికిని, సుఖాసనంబు = సుఖాసనము, అకల్పితంబు = అది వేఱొకనిచేతం గల్పింపంగూడనిది.

తా. సాధుపరిపూర్ణుండ వగు నో యాంజనేయా! సూక్ష్మశరీరము నాశ్రయించి యుండు ప్రాణవాయువుధర్మ మగు చలనమును, (కదలుట) స్థూలశరీరధర్మ మగు శరీరపీడయును, కారణశరీరధర్మ మగు బడలికయును మందస్వభావమును నిద్రయును పరబ్రహ్మస్వరూపముగా నుండుటచేం గలుగవో ఆ యోగికిని సుఖాసనంబు, ఆ సుఖాసనంబు వేఱొకనిచేం గల్పింపంగూడని దని తాత్పర్యము.

ఆ. ఎద్ది సిద్ధ మగుచు నెప్రొద్దు విలసిల్లు, నరసి చూచి యెద్ది యైన యపుడె
సర్వసిద్ధు లొక్కట సమకూడు నదియె సిద్ధాసనంబు కేవలాత్మరూప ౧౬౯

టీక. కేవలాత్మరూప — కేవల = ఏక మయిన పరబ్రహ్మమే, ఆత్మరూప = స్వస్వరూపముగాం గల యాంజనేయా! ఎద్ది = పరబ్రహ్మము, సిద్ధ మగుచున్ = స్థిరముగా నున్నదై, ఎప్రొద్దు = సార్వకాలము, విలసిల్లున్ = ప్రకాశించునో, అరసి చూచి = అపరోక్షజ్ఞానదృష్టిచేత శోధించి చూచి, ఎద్ది యైన యపుడె = పరబ్రహ్మము తా నైనప్పుడే, సర్వసిద్ధులు = సకలలాభములు, ఒక్కటన్ = ఒక్కసారిగా నే, సమకూడున్ = లభించునో, అదియె = ఆ పరమాత్మయే, సిద్ధాసనంబు = సిద్ధాసనము.

తా. ఏక మయిన పరబ్రహ్మమే స్వస్వరూపముగాం గల యో యాంజనేయా! ఏ పరమాత్మ సర్వకాలము లందును స్థిరముగా నున్నదై ప్రకాశించునో, యతండు అపరోక్షజ్ఞానముచేత శోధించి యే పరబ్రహ్మము తా నైనప్పుడు సర్వలాభము లేక కాలమునం గల్గునో ఆ పరమాత్మయే సిద్ధాసన మనంబడు నని తా.

ఆ. బంధములకు మూలబంధంబు ప్రకృతి త, ద్బంధ మెద్ది గనినఁ దా సాయునపుడె
యఖిలతత్త్వములకు నాదిమూలం బెద్ది, యదియె మూలబంధ మాంజనేయ.

టీక. ఆంజనేయ = హనుమంతుఁడా! బంధములకున్ = అష్టపాశబంధములకు, మూలబంధంబు = ప్రధాన మయిన బంధనము, ప్రకృతి = ఆణవ కార్మిక మాయామలసహిత మగు మూలప్రకృతియే, తద్బంధము = ఆ ప్రకృతిబంధనము, ఎద్ది గనిన నపుడె = ఏయాత్మచైతన్యము తా నని గ్రహించినప్పుడె, సాయుఁగా = వీడునో, అఖిలతత్త్వములకున్ = షట్త్రింశత్తత్త్వములకు, ఆదిమూలంబు = ప్రధానకారణము, ఎద్ది = ఏపరబ్రహ్మమో, అదియె = ఆ పరమాత్మయే, మూలబంధము = మూలబంధ మనఁ దగును.

తా. ఆంజనేయా! ఆణవ కార్మిక మాయామలసహిత మైన మూలప్రకృతియే అష్టపాశబంధములలో ప్రధాన మైనబంధము, ఏయాత్మచైతన్యము తా నని వీక్షించునప్పుడు ఆబంధము వీడునో, ముప్పదియాఱు తత్త్వములకు ప్రధానకారణ మెద్దియో ఆ పరమాత్మయే మూలబంధ మనఁ దగు నని తా.

క. వారినిధియందుఁ జెందిన, యేఱులగతిఁ జిత్సుఖమున నింద్రియవృత్తుల్
చేరి సమభావ మొందుట, యారయఁగా దేహసామ్య మగు వాయుసుతా.

టీక. వాయుసుతా = ఆంజనేయా! వారినిధియందున్ = సముద్రమందు, చెందిన యేఱులగతిన్ = కలిసిన నదులవలె, చిత్సుఖమునన్ = బ్రహ్మానందమందు, ఇంద్రియవృత్తుల్ = ఇంద్రియములయొక్క రాగద్వేషాదివృత్తులు, చేరి = ఏకీభవించి, సమభావ మొందుట = సమరసము గలిగి యుండుటయే, ఆరయఁగాన్ = ఆలోచింపఁగా, దేహసామ్యము = దేహసామ్య మనఁ దగును, అగున్ = అగును.

తా. ఆంజనేయా! సముద్రమందుఁ గలయు నదులవలె బ్రహ్మానందమునం దింద్రియవృత్తు లగు రాగద్వేషాదు లేకీభవించి సమరసము గల్గి యుండుటయే దేహసామ్య మనఁ దగు నని తాత్పర్యము

సీ. ఏచూపు సకలబాహ్యేంద్రియార్థంబులఁ, గనునది వెలిచూపు కపికులేంద్ర
యేచూపు వివిధాంతరేంద్రియవృత్తులఁ, గనునది లోచూపు కపివరేణ్య
యేచూపు బాహ్యాంతరేంద్రియార్థంబులఁ, గనునది మధ్యలక్ష్యము కుమార
యేచూపు దగ మానసేంద్రియమత్యంబుఁ, గనునది మిన్నుఖ దనుజవైరి

తే. చూచు నేచూడ్కి యీనాల్గు చూపులను స
జస్ర మది శాంభవీదృష్టి సంగరహిత
యిదియె యన్నిటిలో నెక్కు డిట్టు లగుటఁ
బరమగుహ్యతమం బగుఁ బవనతనయ.

టీక. కపికులేంద్ర = ఆంజనేయా! ఏచూపు = (బాహ్యలక్ష్యప్రత్యయమును నిర్గుణసవికల్పనిష్ఠల) యేలక్ష్యము, సకల = సమస్తము లైన, బాహ్యేంద్రియ = దశేంద్రియములయొక్క, అర్థంబులన్ = శబ్దస్పర్శాది విషయములను, కనున్ = చూచునో, అది = అదృష్టి, వెలిచూపు = బాహ్యలక్ష్యము, అగున్ = అవును, కపివరేణ్య = వానరేంద్రా! ఏచూపు (అంతర్లక్ష్యప్రత్యయమును నిర్గుణసవికల్పసమాధిగల) యేలక్ష్యము, వివిధాంతరింద్రియవృత్తులన్ — వివిధ = నానావిధము లైన, అంతరింద్రియ = మనోబుద్ధిచిత్తాహంకారములయొక్క, వృత్తులన్ = సంశయ నిశ్చయ [illegible] గర్వ వృత్తులను, కనున్ = చూచునో, అది = ఆచూపు, లోచూపు = అంతర్లక్ష్యము, అగున్ = అవును, కుమార = ఆంజనేయా!

ఏమూపు = బాహ్యాంతర సవికల్పక సమాధి గల యేలక్ష్యము, బాహ్యాంతరేంద్రియార్థంబులన్ = వెలుపలి లోపలి యింద్రియవిషయములను, కనన్ = కాంచునో, అది = ఆమూపు, మధ్యలక్ష్యము = అంతరబాహ్యమధ్యదృష్టి, అగున్ = ఔను, దనుజవైరి = ఆంజనేయా! ఏమూపు = ఏలక్ష్యము, తగన్ = ఒప్పునట్లు, మానసేంద్రియవత్కంబులన్ = మనశ్శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములను, కనున్ = కనుఁగొనునో, అది = అలక్ష్యము, షణ్ముఖి = షణ్ముఖీముద్ర, అగున్ = అవును, సంగరహిత = రాగద్వేషాది సంబంధరహితుండైన యాంజనేయా! ఏమూడ్కి = ఏలక్ష్యము, ఈ నాల్గుమూపులన్ = అంతరబాహ్యమధ్యషణ్ముఖు లనెడు నీ నాల్గులక్ష్యములను, అజస్రము = ఎల్లప్పుడును, చూచున్ = కనుఁగొనునో, అది = ఆదృష్టి, శాంభవీదృష్టి = శాంభవీముద్రయగును, అనఁగా ఉన్మన్యవస్థయనుట, పవనతనయ = ఆంజనేయా! ఇది = ఈ శాంభవీలక్ష్యమే, అన్నిటిలో నెక్కుడు = సకలలక్ష్యములలో నుత్తము మైనది, ఎట్టు లగుటన్ = ఇట్లుత్కృష్ట మైన దగుటవలన, పరమ = నిరతిశయ మైన, గుహ్యతమం బగున్ = రహస్యతర మయిన దగును

తా॥ ఆంజనేయా! బాహ్యశబ్దదృశ్యములతోఁ గూడినదియును, వికల్పముతోఁ గూడిన నిష్ఠ గలదియునగు లక్ష్య మెయ్యదో దశేంద్రియవిషయము లగు శబ్దస్పర్శాదులఁ జూచునో అదియె బాహ్యలక్ష్య మనఁబడును, అంతరశబ్దదృశ్యములతోఁ గూడినదియును, వికల్పముతోఁ గూడిన సమాధి గలదియును నగు నేలక్ష్యము నానావిధము లగు మనోబుద్ధిచిత్తాహంకారములయొక్క సంశయ నిశ్చయములవలన కర్తవ్యవృత్తులను చూచునో అదియే యంతర్లక్ష్య మనఁబడును, బాహ్యాంతరసవికల్పకసమాధి గల యేలక్ష్యము వెలుపలి లోపలి యింద్రియములను గాంచునో ఆ లక్ష్యమే అంతరబాహ్యమధ్యదృష్టి యనఁబడును, ఏలక్ష్యము మనశ్శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములను చూచునో అదియే షణ్ముఖీముద్ర యనఁబడును, ఏలక్ష్యము అంతరబాహ్యమధ్యషణ్ముఖము లను నీనాల్గులక్ష్యముల నెల్లప్పుడు చూచునో అదియే శాంభవీదృష్టి యనఁబడును ఈ శాంభవీముద్రయే యున్మన్యవస్థ యని చెప్పుదురు, ఇది యన్నిటిలో నెక్కుడైనది, ఇట్లుత్కృష్ట మైన దగుటవలన నిరతిశయ మైనదియును, కేవలరహస్య మైనదియును నై యున్నదని తాత్పర్యము.

మానినీవృత్తము.—

దృశ్యము నాకము దృశ్యమె వాయువు దృశ్యమె భూజలతేజములున్
దృశ్యమె దేశము దృశ్యము కాలము దృశ్యమె దేహము నింద్రియముల్
దృశ్యము ప్రాణము దృశ్యమె చిత్తము దృశ్య మహంకృతి ధీమనముల్
దృశ్యము విద్యయు దృశ్య మవిద్యయు దృశ్యము గానిది దృక్కరయున్. ౧౬౯

టీక. అరయన్ = శోధింపఁగా, నాకము = ఆకాశము, దృశ్యమె = చూడఁదగినదే, వాయువు = గాడ్పు, దృశ్యమె = కనఁబడుచున్నదే, భూజలతేజములున్ = భూమియును, ఉదకమును అగ్నియును, దృశ్యమె = కనఁదగినదే, దేశము = పూర్వదక్షిణాద్యుపాధిభేదములచేతఁ గనఁబడు రాజ్యము, దృశ్యమె = గోచరమె, కాలము = నిమేషాదిప్రళయాంత మయిన కాలమును, దృశ్యమె = గ్రాహ్యమె, దేహమును = శరీరమును, దృశ్యమే = కాంచఁదగినదే, ఇంద్రియముల్ = జ్ఞానకర్మేంద్రియములును, దృశ్యమె = కనుఁగొనఁదగినదే, ప్రాణము = ప్రాణవాయువు, దృశ్యమె = వీక్షింపఁదగినదే, చిత్తము = చంచలాత్మకమైన చిత్తము, దృశ్యము = కనఁబడుచున్నదియు, అహంకృతిధీమనముల్ — అహంకృతి = కర్తవ్యాత్మక

శాంతశమదమాద్యనంతకల్యాణగుణములను - కామ క్రోధ లోభ మోహాది దుర్గుణములను, ప్రత్యగ్బోధ స్వరూప = స్వాత్మజ్ఞానస్వరూప మయిన, పరమాత్మునిఁగాక = పరబ్రహ్మముగా, నిత్యమున్ = ఎల్లప్పుడును, అవలోకించుట = చూచుటయే, ప్రత్యాహారం బనంగఁ బరంగున్ = ప్రత్యాహారయోగ మని చెప్పఁబడును.

తా. ఆంజనేయా! సత్య మయిన పరబ్రహ్మముయొక్క గుణము లగు సచ్చిదానందనిత్యనిర్మల శాంతశమదమాదులను, అసత్య మయిన ప్రకృతియొక్క గుణము లగు కామక్రోధలోభ మోహాదులను స్వాత్మజ్ఞానస్వరూప మయిన పరమాత్మగా సదా చూచుటయే ప్రత్యాహారయోగ మనఁబడు నని తాత్పర్యము.

తే. మహిత దేహేంద్రియప్రాణమానసాది
దృశ్యములు గాను నే వీనిఁ దెలియుచుండు
దృక్స్వరూపుఁడ ననుచుఁ జింతించుటరయ
ధ్యానయోగంబు బ్రహ్మవిద్యానిధాన. ౧౭౮

టీక. బ్రహ్మవిద్యానిధాన = అపరోక్షజ్ఞాననిధి యైన యాంజనేయా! మహిత = గొప్పవగు నైన, దేహ = శరీరత్రయమును, ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములును, ప్రాణ = దశప్రాణములును, మానసాది = మనస్సు మొదలైన, దృశ్యములు = గోచరపదార్థములు, కాను = నేను గాను, నే = జీవాత్మ నైన నేను, వీనిన్ = ఈ దృశ్యములను, తెలియుచున్ = ఎఱుఁగుచు, ఉండు దృక్స్వరూపుఁడన్ = ఉండెడు సాక్షిస్వరూపుఁడను, అనుచున్ = అని, చింతించుట = ఎంచుట, అరయన్ = యోచింపఁగా, ధ్యానయోగంబు = ధ్యానయోగ మగును.

తా. అపరోక్షజ్ఞాననిధి యైన యో యాంజనేయా! శరీరత్రయము జ్ఞానేంద్రియకర్మేంద్రియములు దశవిధప్రాణములు మనస్సు మొదలైన దృశ్యము లగు పదార్థము లెల్ల నేను గా ననియును, జీవాత్మ యగు తాను యీదృశ్యముల నెఱుఁగు సాక్షిస్వరూపుఁ డనియును తెలిసికొనుచుండుటయే ధ్యానయోగ మనఁబడు నని తాత్పర్యము.

క. మది యెద్ది దలఁచు మది యెయ్యది గనుఁగొను నదియె బ్రహ్మ మను నగ్గుఱి నా
హృదయంబున నిలుపుట దీనదయాపర పరమధారణాయోగ మగున్. ౧౭౯

టీక. దీనదయాపర = పేదలయందుఁ గృపగల యాంజనేయా! మది = సంకల్పవికల్పాత్మక మైన మనస్సు, ఎద్ది దలఁచున్ = దేనిని సంకల్పించునో, మది = మనస్సు, ఎయ్యది గనుఁగొనున్ = దేనిని జూచునో, అదియె = ఆ తలఁచినది చూచినదియు, బ్రహ్మము = పరమాత్మ, అను, అగ్గుఱిన్ = అనెడు నా లక్ష్యమును, ఆ హృదయంబున నిలుపుట = ఆ మనస్సునందే స్థిరపఱచుట, పరమధారణాయోగము = అతిశయ మగు ధారణాయోగము, అగున్ = అవును—అనఁగా బ్రహ్మవిదుఁడు సమస్తేంద్రియవ్యాపారములు బ్రహ్మేతరములు గా వని యోప్రజ్ఞచేతఁ దెలిసికొనెనో ఆ తెలివియందు దానిన్ నిశ్చలము చేయుటయే ధారణాయోగ మగు ననుట, 'శ్లో॥ యద్య త్పశ్యతి చక్షుర్భ్యాం తత్త దాత్మేతి భావయేత్। యద్య త్స్పృశతి హస్తాభ్యాం తత్త దాత్మేతి భావయేత్। యద్య చ్ఛృణోతి కర్ణాభ్యాం తత్త దాత్మేతి భావయేత్' ఇట్లని కైవల్యోపనిషత్తునందు, 'శ్లో॥ మనసా వచసా దృష్ట్యా గృహ్యతే నైవ చేంద్రియైః। అహ మేవ న మత్తోఽన్య దితి బుద్ధ్యధ్వ మంజసా' అని భాగవతమందు

తా. పేదలయం దనుగ్రహము గల యో యాంజనేయా! సంకల్పవికల్పాత్మక మగు మనస్సుచేత సంకల్పింపఁబడునదియును, ఆ మనస్సుచేఁ జూడఁబడునదియును నై యొప్పునది పరబ్రహ్మము,

ఇట్టి గుణిగిని మనస్సునందు నిల్పుట ధారణాయోగ మనఁబడును, (బ్రహ్మవేత్త చతుర్దశేంద్రియముల యొక్క వ్యాపారములు బ్రహ్మముకంటె వేఱుగావని యేమనస్సుచేతఁ దెలిసికొనునో ఆ తెలివియందాసక్తియును గల్గి యుండుటయే ధారణాయోగ మనఁబడును) అని తాత్పర్యము

క. సర్వావస్థలయందును, సర్వంబును బ్రహ్మ మనుచు సతతము గనినన్
సర్వవికృతిరహితసహజ,నిర్వాణసమాధి యగు విమలనిర్మలరూపా. ౧౭౬

టీ॥ విమలనిర్మలరూపా = సత్త్వరజస్తమోగుణమాలిన్యశూన్యస్వరూపము గల యాంజనేయా! సర్వావస్థలయందును - సర్వ = సకల మయిన, అవస్థలయందున్ = జాగ్రత్స్వప్నసుషుప్తితుర్యావస్థలయందును, సర్వంబును = ఆయాయవస్థలయందుఁ దోఁచిన సమస్తభోగ్యభోగసాధనశూన్యసాక్షాత్కారములనెడి సకలమును, బ్రహ్మ మనుచున్ = పరమాత్మ యని, సతతము గనినన్ = ఎల్లప్పుడు దర్శించెనేని, సర్వ = అశేషము లైన, వికృతి = భోగ్యాదిచతుర్విధకారణములును, రహిత=లేనట్టి, సహజ=స్వభావసిద్ధ మయిన, నిర్వాణసమాధి = కైవల్యనిష్ఠ, అగున్ = అవును

తా. సత్త్వరజస్తమోగుణములచే మాలిన్యము నొందని రామా యాంజనేయా! జాగ్రత్స్వప్నసుషుప్తితుర్యావస్థలయందును ఆయాయవస్థలయందుఁ దోఁచిన సమస్తభోగ్యభోగములకు సాధనములు గాని సాక్షాత్కారములనెడి సమస్తమును పరమాత్మ యని జూచెనేని యదియే సమస్తభోగ్యాదిచతుర్విధకారణరహిత మయినదియును, స్వభావసిద్ధ మయినదియును నగు కైవల్యనిష్ఠ యనఁబడు నని తాత్పర్యము

క. ఈ పదియేనంగంబుల, దీపితవిజ్ఞానసూక్ష్మదృష్టి ననిశమున్
జేపట్టి యభ్యసించు మహాపురుషునకబ్బుఁ బరమ మగు నుపరమమున్. ౧౭౭

టీ॥ ఈ పదియేనంగంబులన్ — ఈ పదియేను = ఇపుడు జెప్పిన యమాదిపంచదశవిధము లైన, అంగంబులన్ = నిర్గుణోపాసనాంగములను, దీపిత = వెలుఁగుచున్న, విజ్ఞాన = బ్రహ్మజ్ఞానలభ్య మయిన, సూక్ష్మదృష్టిన్ = సూక్ష్మలక్ష్యముచేత, అనిశమున్ = సర్వకాలమును, చేపట్టి=పరిగ్రహించి, అభ్యసించు మహాపురుషునకు = అభ్యాసము చేయు బ్రహ్మవిద్వరిష్ఠునకు, పరమము = నిరతిశయము, అగు నుపరమమున్ — అగు = ఐన, ఉపరమమున్ = చిత్తవిశ్రాంతి, అబ్బున్ = లభించును

తా. ఆంజనేయా! బ్రహ్మజ్ఞానముచే నీ పదియేను నిర్గుణోపాసనాంగములను సూక్ష్మదృష్టిచే గ్రహించి యభ్యాసము చేయు బ్రహ్మవిద్వరిష్ఠునకు నిరతిశయ మగు చిత్తవిశ్రాంతి లభించు నని తా

చిత్తలయముగల పురుషుని లక్షణము.

క. చిత్తోపరమము గల పురుషోత్తముఁడు జగంబు మఱచి యుండున్ బాలో
న్మత్తపిశాచసభుండై, యెత్తఱి సుప్తునికరణి నిరింద్రియుఁ డగుచున్. ౧౭౮

టీ॥ చిత్తోపరమము గల పురుషోత్తముఁడు = చిత్తలయము గల పురుషశ్రేష్ఠుఁడు, నిరింద్రియుఁ డగుచున్ = ఇంద్రియములను గెలిచినవాఁడై, బాల = శిశువుతో, ఉన్మత్త = వెఱ్ఱివానితో, పిశాచ = భూతముతో, సభుండై = సమానుఁడై, ఎత్తఱిన్ = ఏసమయమునందును, సుప్తునికరణిన్ = నిద్రించువానివలె, జగంబున్ = లోకమును, మఱచియుండున్ = విస్మృతిఁ జెంది యుండును

తా. చిత్తవిశ్రాంతి గల బ్రహ్మవిద్వరిష్ఠుఁ డింద్రియములు నిర్జించి బాలునితో సమానుఁడును, వెఱ్ఱివానితో సమానుఁడును, పిశాచముతో సమానుఁడును నై సర్వకాలములయందును నిద్రించువానివలె లోకమును మఱచి యుండు నని తాత్పర్యము.

ఆ వస్త్రమును గూడనట్లు నిర్ముక్తుండైన తాను ప్రకాశించు బ్రహ్మనిష్ఠాస్వరూప మగు యవస్థయందు లభించిన యానందరసమును త్రాగుటచే నైన తృప్తితో మైమఱచినవాఁడై శరీరము స్వస్థతతో గూర్చుండినను లేచినను నడచినను ఆ శరీరము నే నని గౌరవింపఁ డని తాత్పర్యము

మ. తరుణీ నందన బంధు సాధు రిపు మిత్రవ్రాతములు తన్నుఁ బ
ల్మఱు నిందించిన సన్నుతించిన మహామానావమానాదులన్
నెఱిఁ బొందించిన నిర్వికారుఁ డగుచున్ నిశ్చేష్టుఁడై యుండు భా
స్వరతత్త్వానుభవజ్ఞుఁ డెయ్యెడల జీవత్యక్తదేహస్థితిన్ ౧౮౧

టీక. భాస్వరతత్త్వానుభవజ్ఞుఁడు — భాస్వర = ప్రకాశమాన మయిన, తత్త్వానుభవజ్ఞుఁడు = బ్రహ్మస్వరూపానుభవజ్ఞానము గలవాఁడు, ఎయ్యెడలన్ = ఎచ్చోటనైనను, తన్నున్ = జీవన్ముక్తుఁడైన తన్ను, పల్మఱున్ = పలుమాఱును, తరుణీ = భార్యలు, నందన = పుత్త్రులు, బంధు = చుట్టములు, సాధు = సత్పురుషులు, రిపు = వైరులు, మిత్ర = చెలికాండ్రును, (వీరియొక్క) వ్రాతములు = గుంపులు, నిందించినన్ = దూషించినను, సన్నుతించినన్ = భూషించినను, మహామానావమానాదులన్ = అధికము లైన గౌరవలాఘవములు మొదలగువానిని, నెఱిన్ = క్రమముచేత, పొందించినన్ = పొందించినను, నిర్వికారుఁ డగుచున్ = ఖేద మోదములు లేనివాఁడై, నిశ్చేష్టుఁడై = చతుర్దశేంద్రియవ్యాపారములు లేనివాఁడై, జీవత్యక్తదేహస్థితిన్ = ప్రాణము లేని బొందివలె, ఉండున్ = నివసించును.

తా. ప్రకాశించు బ్రహ్మస్వరూపానుభవము గలవాఁ డెచ్చోటనైనను తన్ను పలుమాఱు భార్యలు పుత్త్రులు చుట్టములు సత్పురుషులు వైరులు స్నేహితులు వీరల సమూహములు దూషించినను భూషించినను మానావమానములను క్రమముగ పొందించినను (వ్యాజస్తుతిచే మన్నించినను అవమానించినను) దుఃఖసంతోషములు లేనివాఁడుగను చతుర్దశేంద్రియవ్యాపారములు లేనివాఁడును నై ప్రాణము లేని బొందివలె నుండు నని తాత్పర్యము

ఆ. బహుళసంకటములు ప్రాప్తంబు లైనచోఁ, దల్లడింపఁ డాత్మతత్త్వవిదుఁడు
వాయుశీతవహ్నివర్షాతపంబుల, కించు కైన గిరి చలించనట్లు. ౧౮౨

టీక. గిరి = కొండ, వాయు = గాలికిని, శీత = మంచునకును, వహ్ని = దావాగ్నికిని, వర్ష = వానకును, ఆతపంబులకు = ఎండకు, ఇంచు కైనన్ = కొంచెమైనను, చలించనట్లు = కదలనట్లు, ఆత్మతత్త్వవిదుఁడు = బ్రహ్మవేత్త, బహుళ = అనేకము లైన, సంకటములు = ఇక్కట్లు, ప్రాప్తంబు లైనచోన్ = సంభవించినప్పుడు, తల్లడింపఁడు = వ్యాకులపడఁడు.

తా. పర్వతము వాయువునకును గాలికిని మంచునకును దావాగ్నికిని వానకును యెండకును కొంచెమైనను చలించనట్లు బ్రహ్మవేత్త తనకు ననేకవిధము లైన సంకటములు సంప్రాప్తము లైనను వ్యాకులతఁ బొందక యథాగత ముండు నని తాత్పర్యము.

వైరాగ్యబోధోపరతులు గల యోగిలక్షణము.

వ. ఇట్టి వైరాగ్యబోధోపరతియుక్తుం డైన జీవన్ముక్తుండు ప్రత్యగభిన్నబ్రహ్మతత్త్వ
సాక్షాత్కారప్రచండమార్తాండప్రకాశనిరస్తానాద్యనిర్వచనీయాజ్ఞానాంధకార
పటలుండు పరిత్యక్తవర్ణాశ్రమాచారకోలాహలుండు నిరంతరచిత్తవిశ్రాంతిపరా

యణుండు విషయాసక్తివివర్జితుండు ప్రబలప్రారబ్ధాధీనశరీరస్థుం డంతస్సుఖుం డంతరారాముం డంతఃప్రకాశుం డాత్మగతుం డాత్మతృప్తుం డాత్మసంతుష్టుండు దూరీకృతదురితక్రియుండు ప్రశాంతమానసుండు విజితేంద్రియుండు కృతకృత్యుండు ప్రాప్తాప్రాప్తవిహీనుండు సర్వవ్యవహారాతీతుం డశరీరుండు సర్వశరీరస్థుండు నిరింద్రియుండు సర్వేంద్రియద్రష్టయు నప్రాణుండు సర్వప్రాణిప్రేరకుండు సర్వేంద్రియోపశాంతిసుఖాసకుండు వివేకవ్యాప్తాంగుండు నిత్యాసంగుండు ప్రజ్ఞాప్రాభవశీసహాయుం డసహాయుండు దృఢోపగతాత్మనిశ్చయసంపన్నుండు వర్ణాశ్రమసదాచారదురాచారకామక్రోధలోభమోహదంభదర్పకూహకక్రౌర్యశౌర్యజాడ్యమాత్సర్యద్వేషకార్పణ్యనిందాస్తుతిమానావమానేర్ష్యాసూయాదయానైష్ఠుర్యపారుష్యాది నానావిధచిత్తవికారరహితుండు స్త్రీవాసనార్థవాసనాప్రతిష్ఠావాసనాశాస్త్రవాసనాదేహవాసనాలోకవాసనాకర్తృత్వభోక్తృత్వాదివాసనావివర్జితుండు విగతబ్రహ్మవేత్తృత్వాభిమానవాసనుండు నిత్యనిర్మలుండు నిత్యశాంతుండు నిత్యోదాసీనుండు నిష్ప్రపంచుం డవ్యక్తమహదహంకారపంచతన్మాత్రాకాశాది సర్వప్రపంచ మాయాగంధర్వనగరాశ్రయుండు నిరాశ్రయుండు సర్వావభాసకేవలచిదాకాశమాత్రుండు పరమసూక్ష్మస్వరూపుండు దూరీకృతసంసారుండు దేహేంద్రియగుణాతిరిక్తుండు దేవతాస్పృహణీయశీలుండు నానాపాశవినిర్ముక్తుండు రాజసతామసవస్తుసేవాదూరుండు సాత్త్వికవస్తుసేవావిజితనిద్రుం డక్రియాత్మపూజాపరుండు మానసజపపరాయణుం డచింత్యధ్యాననిష్ఠుం డనిచ్ఛాసుఖతత్పరుండు విశ్వవంద్యుండు యదృచ్ఛాసంసారశీలుండు ధీరుండు దాంతుండు నిత్యప్రబుద్ధచిత్తుండు స్వాత్మసమాధినిష్ఠుండు జగదింద్రజాలద్రష్టయు విశేషప్రాప్తాశేషపురుషార్థుండు త్యక్తాశేషవిశేషగుణుం డధిగతపరమస్వాస్థ్యుండు సంగృహీతచిత్తుండు మితవాక్యుండు పరమకారుణికుండు సర్వభూతమిత్రుండు పేశలాచారమధురుండు పాణిపాత్రనిపతితమాత్రాశనుండు యోగారూఢుండు తితిక్షుండు పరమైకాంతికుండు నిష్కళంకుండు నిస్పృహుండు ప్రారబ్ధవశప్రాప్తదేహేంద్రియాదివ్యాపారరూపపుణ్యపాపక్రియాకర్తృత్వాభిమానపూర్వకముఖవికాసదైన్యశూన్యుండు సదాప్రసన్నచిత్తుండు వికసితముఖుండు దుష్టశిష్టజనసంగదూరుండు సాధువిద్వజ్జనసంగుండు సర్వపదార్థోపేక్షాబుద్ధియుక్తుండు కుశలాకుశలక్రియాదూరుండు వేదాంతశాస్త్రవిచారఘోరదావానలభస్మీకృతసర్వవేదశాస్త్రాగమపురాణగుర్వీశ్వరవిధిప్రతిషేధాదివాసనారణ్యుం డవ్యక్తలింగుం డవ్యక్తాచారుం డేకచారియు ననికేతనుండు గిరిగుహావిహారుండు మృత్యుభయవివర్జితుండు పరలోకభయవిరహితుం డనిర్వాచ్యశాంతాత్ముండు

బంధమోక్షనిరాకాంక్షుండు సర్వాతీతసర్వపరిపూర్ణాప్రతిద్వంద్వబ్రహ్మచైతన్య
ప్రకాశస్వరూపమాత్రుండునై ప్రకాశించు మతియును. ౧౮౩

టీక. ఇట్టి = ఈమొంగుఁ జెప్పఁబడినట్టి, వైరాగ్య = విరాగభావముతోడను, బోధ = బ్రహ్మజ్ఞానముతోడను, ఉపరతి = చిత్తవిశ్రాంతితోడను, యుక్తుండైన = కూడిన, జీవన్ముక్తుండు = బ్రహ్మవిద్వరిష్ఠుఁడు, ప్రత్యక్ = ఆత్మస్వరూపమైన తనకంటెను, అభిన్న = వేఱు గాని, బ్రహ్మతత్త్వ = పరబ్రహ్మముయొక్క, సాక్షాత్కార = అపరోక్షజ్ఞానమును, ప్రచండ = మిగులవేడిమి గల, మార్తాండప్రకాశ = సూర్యప్రభచేత, నిరస్త = నశింపఁజేయఁబడిన, అనాది = ఉత్పత్తిలేని, అనిర్వచనీయ = ఉచ్చరింపఁగూడని, అజ్ఞాన = ప్రకృతి యనెడు, అంధకార = చీఁకటియొక్క, పటలుండు = గుంపు గలవాఁడును, పరిత్యక్త = విడువఁబడిన, వర్ణ = బ్రాహ్మణాదివర్ణములయొక్క, ఆశ్రమ = బ్రహ్మచర్యాద్యాశ్రమములయొక్కయు, ఆచార = నియమములయొక్కయు, శాస్త్ర = ధర్మాదిశాస్త్రములయొక్కయు, కోలాహలుండు = కలకలధ్వని గలవాఁడును, నిరంతర = ఎడతెగని, చిత్తవిశ్రాంతి = చిత్తోపరతి యనెడు, పర = శ్రేష్ఠమగు, ఆసనుండు = స్థానము గలవాఁడును — ఎడతెగని చిత్తవిశ్రాంతియందాసక్తి గలవాఁడనుట, విషయ = ఇంద్రియసుఖములయందు, ఆసక్తి = ఆశను, విసర్జితుండు = విడిచినవాఁడును, ప్రబల = బలిష్ఠమైన, ప్రారబ్ధ = సంచితకర్మజమయిన ప్రారబ్ధమునకు, అధీన = వశమైన, శరీర చేష్టుండు = శరీరపు కదలిక గలవాఁడును, నిశ్చేష్టుండు = తానొకపనియు జేయనివాఁడును, అంతస్సుఖుండు = ప్రత్యగాత్మస్వరూపుఁడైన తనయందే యానందించువాఁడును, అంతరారాముండు = పరమాత్మయైన తనయందే క్రీడించువాఁడును, అంతఃప్రకాశుండు = తనయందే వెలుఁగుచున్నవాఁడును — అనఁగా తన బ్రహ్మభావమును ప్రకటన చేయుఁడనుట, ఆత్మరతుండు = తనయందే ప్రీతి గలవాఁడును, ఆత్మతృప్తుండు = తనవలననే తనివిఁ జెందువాఁడును, ఆత్మసంతుష్టుండు = తనవలననే యానందించువాఁడును, నిరాకృత = విడువఁబడిన, దురితక్రియుండు = పాపకృత్యములు గలవాఁడును, ప్రశాంతమానసుండగు — ప్రశాంత = శుద్ధసత్త్వవృత్తితోఁ గూడిన, మానసుండు = మనస్సు గలవాఁడును — అనఁగా సత్త్వరజస్తమోగుణకృత్తులగు శాంతఘోరమూఢత్వములు వీడినవాఁడనుట, విజితేంద్రియుండు = ఇంద్రియజయము గలవాఁడును, కృతకృత్యుండు = ధన్యుఁడును, ప్రాప్తాప్రాప్తవిహీనుండు = సిద్ధ్యసిద్ధులయందు గణింపు లేనివాఁడును, సర్వవ్యవహారాతీతుండు = దేహేంద్రియవ్యాపారములకు విలక్షణమైనవాఁడును, అశరీరుండు = జరామరణములు లేనందున శరీరము లేనివాఁడును, సర్వశరీరస్థుండు = సకలశరీరములయం దుండువాఁడును, నిరింద్రియుండు = శబ్దాది విషయములు లేనివాఁడును, సర్వేంద్రియద్రష్టయుండు = దుర్గమేంద్రియవిషయములఁ జూచువాఁడును, అప్రాణుండు = ఆకలి దప్పి మొదలగునవి లేనివాఁడు గాన ప్రాణములు లేనివాఁడును, సర్వప్రాణిప్రేరకుండు = సకలజంతువులను తమ తమధర్మములయందు జరించునట్లు ప్రేరేపించువాఁడును, సర్వేంద్రియ = చతుర్దశేంద్రియములయొక్క, ఉపశాంతి = బాహ్యసంచారము వదలి తనయందు రమించుటవలనఁ గలిగిన, సుఖరసికుండు = సౌఖ్యానుభవము గలవాఁడును, వివేకహృత్సంగుండు — వివేక = జ్ఞానముతోఁ గూడిన, హృత్ = అంతఃకరణముతోడ, సంగుండు = కూడినవాఁడును, నిస్సంగుండు = రజస్తమోవికారమై నిరంతరసంచారము గల అవివేకవృత్తితో నెప్పుడు గూడనివాఁడును, ప్రజ్ఞా = వివేక మనెడు, ప్రౌఢసఖీ = ప్రగల్భనాయకి యొక్క, సహాయుండు = తోడ్పాటు గలవాఁడును, అసహాయుండు = అన్యసహాయము గోరనివాఁడును, దృఢ = సంశయరహితమైన, అపరోక్ష = సాక్షాత్కారమైన, ఆత్మ = కూటస్థచైతన్య

మందు, నిశ్చయసంపన్నుండు = నిశ్చయముతోఁ గూడినవాఁడును, వర్ణ=బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర కులములయొక్కయు, ఆశ్రమ = బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ యత్యాశ్రమములయొక్కయు, సదాచార = సత్ప్రవర్తనములు, దురాచార = అసత్ప్రవర్తనములు, కామ = అభిలాష, క్రోధ = కోపము, లోభ = లుబ్ధత్వము, మోహ = కలఁపు, దంభ = కపటము, దర్ప = గర్వము, కుహన = వంచన, క్రౌర్య = క్రూరబుద్ధి, శౌర్య = పరాక్రమము, జాడ్య = మూర్ఖత్వము, మాత్సర్య = [illegible], ద్వేష = పగ, కార్పణ్య = కృపణత్వము, నింద = దూషణ, స్తుతి=భూషణ, మాన = కీర్తి, అవమాన = అపకీర్తి, ఈర్ష్య = దీర్ఘక్రోధము, అసూయ = ఓర్వలేనితనము, అదయా = నిర్దయ, నైష్ఠుర్య=కఠినత్వము, వాక్పారుష్య = కఠినపుమాటలాడుట, ఆది = మొదలగు, నానావిధ = పలువిధములగు [illegible], వికార=మనోవికారములు, రహితుండు = లేనివాఁడును, బ్రాహ్మణాది వర్ణధర్మనిష్ఠయను — "శ్లో॥ శమో దమ స్తపః శౌచం క్షాంతి రార్జవ మేవ చ। జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్" తా॥ అంతరింద్రియబహిరింద్రియ నిగ్రహమును తపస్సును పరిశుద్ధతయు ఓర్పును ఋజుత్వమును జ్ఞానమును అనుభవజ్ఞానమును కదలనినమ్మకయును ఇవి బ్రాహ్మణులకుచిత మయిన ధర్మములు, "శ్లో॥ శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్। దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్" తా॥ శూరత్వమును ప్రాగల్భ్యమును ధైర్యమును సామర్థ్యమును యుద్ధమునందు పారిపోకుండుటయు త్యాగమును ప్రజాపరిపాలనమును ఇవి క్షత్రియులకుచితధర్మములు; "శ్లో॥ కృషి గోరక్ష్య వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్। పరిచర్యాత్మకం కర్మ శూద్ర స్యాపి స్వభావజమ్" తా॥ వ్యవసాయము గోసంరక్షణము వర్తకమును ఇవి వైశ్యులకుచితధర్మములు, పరిచర్య శూద్రులకుచితధర్మము, స్త్రీవాసనా = స్త్రీలయందనురాగము గలిగి యుండుట, అర్థవాసనా = ధనములయందు ఆశ గలిగి యుండుట, ప్రతిష్ఠావాసనా = కీర్తియందనురక్తి గలిగి యుండుట, శాస్త్రవాసనా = శాస్త్రపఠనమందభిరుచి గలిగి యుండుట, దేహవాసనా = పుణ్యతీర్థస్నానోపవాసాదులచేత శరీరము పవిత్రము చేయుటయందు వాంఛ గలిగి యుండుట, లోకవాసనా = జగత్ప్రసిద్ధికొఱకు పితృపితామహులవలె అగ్నిష్టోమవాజపేయాది యజ్ఞములు చేసి అన్నదానాదుల సంపాదింపవలయు ననెడు నిష్ఠ గలిగి యుండుట, కర్తృత్వ = నే నిల్లపనుల నడుపుచున్నా ననుకర్తృత్వమును, భోక్తృత్వ = నే నాగామిసంచితప్రారబ్ధకర్మానుభవ మనెడు భోక్తృత్వమును, ఆది = మొదలైన, వాసనా = అభిలాషలచేత, వినిర్ముక్తుండు = విడువఁబడిన వాఁడును, విగత = వీడిన, బ్రహ్మవేత్తృత్వ= బ్రహ్మము నెఱుంగుదు ననెడు, అభిమాన=గర్వముగల, వాసనుండు= అభిలాష గలవాఁడును, నిత్యనిర్మలుండు = ఎల్లప్పుడు పరిశుద్ధుఁడును, నిత్యశాంతుండు=ఎప్పుడు సత్త్వగుణవృత్తిగలవాఁడును, నిత్యోదాసీనుండు=శత్రుమిత్రాదులవలని పగ చెలిమి [illegible] లేనివాఁడును, నిష్ప్రపంచుండు=ప్రపంచవిలక్షణుఁడును, అవ్యక్త = అవ్యక్తనామకప్రకృతియు, మహాన్ = మహత్తత్త్వము, అహంకార=సాత్త్విక రాజస తామసము లనెడి త్రివిధాహంకారము, తన్మాత్ర=శబ్దస్పర్శాది పంచతన్మాత్రలు, ఆకాశాది = ఆకాశాది పంచభూతములు, (వీనితోఁ గూడిన) సర్వప్రపంచ=ఇంద్రియ ఇంద్రియార్థ ఇంద్రియాధిష్ఠానదేవతాప్రపంచ మనెడి, మాయా = అసత్య మయిన, గంధర్వనగర=గంధర్వపట్టణమునకు, ఆశ్రయుండు=ఆధారభూతుఁడును-అనఁగా ప్రపంచోత్పత్తి కాధారుఁడనుట, "శ్లో॥ మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్। మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాద్వయ మస్మ్యహమ్" అని, నిరాశ్రయుండు = తనకు మఱియొక ఆధారము లేనివాఁడును, సర్వ= సకలమును, అవభాస = వెలిఁగించుచున్న, కేవల = ఏక మయిన, చిత్ = జ్ఞాన మనెడు, ఆకాశమాత్రుండు = ఆకాశస్వరూపుఁడును-అనఁగా సకలమునకు నాకాశ మాధారము, అట్టి ఆకాశమున కాధార మయిన చిదాకాశమే స్వరూపముగాఁ

సమస్తము లైన, విశేష = శ్రేష్ఠము లైన, పురుషార్థుండు = ధర్మార్థకామమోక్షములు గలవాఁడును, త్యక్తాశేషవిశేషదుఃఖుండు— త్యక్త = విడువఁబడిన, అశేష = సమస్తము లైన, విశేష = మహత్తరము లైన, దుఃఖుండు = క్లేశములు గలవాఁడును, అధిగతపరమస్వార్థుండు—అధిగత = లబ్ధ మయిన, పరమ = శ్రేష్ఠ మయిన, స్వార్థుండు = హాయి గలవాఁడును, సంగృహీతచిత్తుండు = స్వాధీన మయిన చిత్తము గలవాఁడును, మితవాక్యుండు = మితముగా మాటలాడువాఁడును, పరమకారుణికుండు = మిగుల దయ గలవాఁడును, సర్వభూతమిత్రుండు = సకలప్రాణులకు స్నేహితుఁడును, పేశల = మృదువైన, ఆహార = వడవడిచేత, మధురుండు = మనోహర మయినవాఁడును, పాణి = హస్త మనెడి, పాత్ర = పళ్లెరమందు, నిపతితమాత్ర = పడినంతమాత్ర మయిన, అశనుండు = అన్నము గలవాఁడును - అనఁగా మితాహారి యనుట, యోగారూఢుండు — యోగ = శివజీవైక్యమందు, ఆరూఢుండు = గడిగేఱినవాఁడును, తితిక్షుండు = శీతోష్ణాదిద్వంద్వములయందు సహనము గలవాఁడును, పరమైకాంతికుండు = విజనస్థలవాసము గలవాఁడును, నిష్కళంకుండు = కపటరహితుఁడును, నిస్స్పృహుఁడు = ఆశ లేనివాఁడును, ప్రారబ్ధవశ = సంచితసంభవ మయిన ప్రారబ్ధానుభవమువలన, ప్రాప్త = లభ్య మయిన, దేహ = స్థూలసూక్ష్మకారణాది శరీరములు, ఇంద్రియ = చక్షుర్ఘ్రాణేంద్రియములు, ఆది = మొదలైనవానియొక్క, వ్యాపార = జాగ్రత్స్వప్నసుషుప్తి శబ్దాదివృత్తులయొక్క, రూప = స్వరూపము లెల్ల, పుణ్యపాపసామగ్రీకము = సుకృతదుష్కృతక్రియలును, కర్తృత్వాద్యభిమానభావాత్మక = అహంకర్త భోక్త యను నెడి గర్వముతోఁ గూడిన, ముఖవికాస = ముఖకాంతియును, దైన్య = దీనత్వమును, శూన్యుండు = లేనివాఁడును, సదా ప్రసన్నచిత్తుండు = ఎల్లప్పుడు నిర్మల మైన బుద్ధి గలవాఁడును, వికసితముఖుండు = నవ్వుమొగము గలవాఁడును, దుష్టశిష్టజనసంగదూరుండు = దుష్పురుషసత్పురుషుల చేరికలకు దూర మయినవాఁడును, సాధువిద్వజ్జనసంగుండు = సత్పురుషు లగు పండితులగోష్ఠి గలవాఁడును, సర్వపదార్థవిరసబుద్ధియుక్తుండు = సమస్తవస్తువులయందు నీరసబుద్ధి గలవాఁడును, కుశలాకుశలక్రియాదూరుండు = మేలు కీడు లనువానికి దూర మైనవాఁడును, వేదాంతశాస్త్రవిచార = మీమాంసాశాస్త్రవిమర్శన మనెడి ఘోరదావానల = భయంకర మగు కార్చిచ్చుచేత, భస్మీకృత = నీరు గావింపఁబడిన, సర్వ = సకల మయిన, వేద = నాలుగు వేదములును, శాస్త్ర = షట్ఛాస్త్రములును, ఆగమ = కామికాది వాతూలాంతమును గల యిరువదియెనిమిది యాగమములును, పురాణ = అష్టాదశపురాణములును, గురు = వేదశాస్త్రపురాణేతిహాసముల నుపదేశించుగురువులును, ఈశ్వర = గురూపదేశముచేఁ దెలియఁబడిన యీశ్వరుఁడును, విధి = విహితకర్మములును, ప్రతిషేధ = వేదనిషిద్ధకర్మములును, ఆది = మొదలైనవానియొక్క, వాసనా = సంస్కారము లనెడి - వాసన యనఁగా మును ననుభవించినదానిస్మరణ, అరణ్యుండు = అడవి గలవాఁడును, అవ్యక్తలింగుండు— అవ్యక్త = తెలియఁబడని, లింగుండు = వేషాదిచిహ్నములు గలవాఁడును, అవ్యక్తాచారుండు = తెలియఁబడని నడవడి గలవాఁడును, ఏకచారియుండు = ఒంటరిగాఁ దిరుగువాఁడును - ఏక మయిన పరబ్రహ్మమందు దిరుగువాఁ డని యర్థాంతరము, ||ని|| 'ఏకే వమ బ్రహ్మణ్యచరతి' అని యమరము, అనఁగా బ్రహ్మనిష్ఠ గలవాఁ డనుట, అనికేతనుండు = ఇల్లు లేనివాఁడును, గిరిగుహావిహారుండు = కొండలయందును కోనలయందును దిరుగువాఁడును, మృత్యుభయవివర్జితుండు = మరణభయము లేనివాఁడును, పరలోకభయవిరహితుండు = స్వర్గవైకుంఠకైలాసము లనెడి దేవలోకములవలని జడుపు లేనివాఁడును, నిర్వ్యాజశాంతాత్ముండు— నిర్వ్యాజ = కపటము లేని, శాంతి = శుద్ధసత్త్వవృత్తితోఁ గూడిన, ఆత్ముండు = బుద్ధి గలవాఁడును, బంధమోక్షనిరాకాంక్షుండు— బంధ = ఆరోపమందును, మోక్ష = అపవాదమందును, నిరాకాంక్షుండు = ఆశ లేనివాఁడు - అనఁగా త్రాడును జూచి పా మనుట ఆరోపము, పాము గాదు త్రా

డనుట అనువాదము, అట్లనే గహేంద్రియాదులు నే ననుట ఆరోపము, అవి నేగా దనుట అపవాదము గనుక ఈ రెండును లేనివాఁ డనుట, సర్వాతీత = ప్రమాణాతీత మైన - ప్రపంచవిలక్షణ మైన యని యర్థము, సర్వపరిపూర్ణ = అంతట నిండియున్న, అప్రతిద్వంద్వ = సాటిలేని, బ్రహ్మచైతన్య = పరమాత్మ యొక్క, ప్రకాశస్వరూపమాత్రుండు నై = తేజమే రూపముగాఁ గలవాఁడునై, ప్రకాశించుచున్ = వెలుఁగుచు, వసియించున్ = వెండియుండును.

తా నీరీతిగా నెప్పుడు నిశ్చలమైన వైరాగ్యముతోఁ గూడినవాఁడును, బ్రహ్మాత్మజ్ఞానము గలవాఁడును, చిత్తవిశ్రాంతి నొందినవాఁడును నై యుండు బ్రహ్మవిద్వరిష్ఠుఁడు కూటస్థచైతన్యస్వరూప మగు పరబ్రహ్మము యొక్క అపరోక్షజ్ఞాన మను నత్యంతతీక్ష్ణ మైన సూర్యకాంతిచేత నశింపఁ జేయఁబడినదియును, పుట్టుక లేనిదియును, చెప్ప నలవి గానిదియును నగు అజ్ఞానాంధకారపరంపరలు గలవాఁడును, బ్రాహ్మణాది వర్ణములను బ్రహ్మచర్యగార్హస్థ్యాశ్రమములను ఆచారములను వేదశాస్త్రవిహితము లగు సర్వకర్మలను వదలినవాఁడును, సర్వదా చిత్తవిశ్రాంతియం దాసక్తి గలవాఁడును, ఇంద్రియసుఖములయం దాశ లేనివాఁడును, ప్రారబ్ధానుసార మైన శరీరచేష్టలు గలవాఁడును, తా నొకపనియు జేయనివాఁడును, ప్రత్యగాత్మస్వరూపుఁ డైన తనయందె తా నానందించువాఁడును, పరమాత్మ యగు తనయందుఁ గ్రీడించువాఁడును, తనప్రభావమును ప్రకటింపక తనయందె ప్రకాశించువాఁడును, తనయందే ప్రీతి గలవాఁడును, తనకు గల తృప్తికి తానే కారణభూతుఁడును, తనకుఁ గల్గు నానందమునకు తానే కారణభూతుఁడును, పాపకృత్యములను వదలినవాఁడును, సత్త్వరజస్తమోగుణవృత్తు లగు శాంతఘోరమూఢవృత్తులు లేనివాఁడును, ఇంద్రియములను నిగ్రహించినవాఁడును, ధన్యుఁడును, కలిగినదానియందును గలుగఁబోవుదానియందును యిచ్ఛ లేనివాఁడును, శరీరేంద్రియవ్యాపారములకు విలక్షణుఁ డయినవాఁడును, జరామరణము లేనందున శరీరము లేనివాఁడును, సుఖస్వరూపుఁడుగా నుండువాఁడును, శబ్దాదివిషయములు లేనివాఁడును, చతుర్దశేంద్రియములను జూచువాఁడును, ఆఁకలిదప్పులు లేనందున ప్రాణములు లేనివాఁడును, సమస్తజంతువులను తమతమ ధర్మములయందు ప్రవర్తింపఁజేయువాఁడును, చతుర్దశేంద్రియములు వెలుపలిసంచారము వదలి తనయందు రమించుటచే జనించిన సుఖానుభవము గలవాఁడును, జ్ఞానయుక్త మగు నంతఃకరణముతోఁ గూడినవాఁడును, గత ప్రమాదకర మైనదియును నిరంతరసంచారము గలదియు నగు నజ్ఞానమును వదలినవాఁడును, వివేక మను బ్రహ్మజ్ఞానాయుధసహాయము గలవాఁడును, ఇతరులసహాయము నపేక్షింపనివాఁడును, సందియము లేనిదియును సాక్షాత్కార మయినదియు నగు కూటస్థచైతన్యమునందు నిశ్చయము గలవాఁడును, తను పొందియుండు బ్రాహ్మణాదివర్ణములకుఁ దగిన (తాను బ్రాహ్మణుఁడుగా నున్న యెడల తనకు విహితము లైన అంతర్బాహ్యేంద్రియములయొక్క నిగ్రహము తపస్సు పరిశుద్ధత ఓర్పు ఋజుత్వము జ్ఞానము అనుగ్రహజ్ఞానము పరమాత్మయందు దృఢ మైన నమ్మిక అనునట్టి ధర్మానుష్ఠానములయందును, తాను క్షత్రియుఁ డయ్యెనేని తద్వర్ణవిహితము లగు శూరత్వము ప్రాగల్భ్యము ధైర్యము సామర్థ్యము యుద్ధమందు పారిపోకుండుట ప్రజాపాలనము అను ధర్మములు నాచరించుట యందును, తాను వైశ్యుఁ డయ్యెనేని తద్వర్ణవిహితము లగు గున్నాటు గోవులఁ గాపాడుట వర్తకము అను ధర్మములయందును, తాను శూద్రుఁ డయ్యెనేని తద్వర్ణవిహిత మగు పరిచర్యయందును) సత్ప్రవర్తన గాని అసత్ప్రవర్తన గాని కలిగియుండుటచేత నైన మనోవికారము లేనివాఁడును, బ్రహ్మచర్యాద్యాశ్రమములయొక్క సదాచార దురాచారములచేత నైన మనోవికారము లేనివాఁడును, అభిలాష కోపము లుబ్ధత్వము వలపు కపటము గర్వము వంచన క్రూరబుద్ధి పరాక్రమము మానసత్వము

కర మైన దుర్గతిగాను, దారుణక్రోధమును = భయానక మైన కోపమును, గండధరుని గాఁగన్ = యముని గాను, చూచు నాతండు = కనుఁగొను మనుజుఁడు, నిర్వాణసుఖము నొందుఁగాక = మోక్షానందమును పొందును.

తా॥ ఏమనుజుఁడు అత్యంతాశను భయము నిచ్చు వైతరణీనదిని గాను, విషయాభిలాషలను ఘోరతరం బగు నరకంబుగాను, భయానక మైన కోపమును యముని గాను చూచునో అతఁడు మోక్షానందమును బొందు నని తాత్పర్యము.

సీ॥ తతవియన్నీలవితానభూషిత మగ్ని,రవిచంద్రదీపవిరాజితంబు
నతులభూచక్రసింహాసనాలంకృతం, బనిలవ్యజనమరుద్వ్యాపితంబు
ధనికసేవకసేవితం బై తనర్చు జ,గత్పురంబున వివేకప్రకాశ
మానేంద్రియతురంగమానసప్రగ్రహ, బుద్ధిసారథియుక్త పురుశరీర
తే॥ మంజులరథాధిరూఢుఁ డై మహిమతోడ
నమరు ప్రజ్ఞాంగనాయుక్తుఁ డగుచు నిత్య
విభవుఁ డై సర్వజనము సేవించుచుండ
రాజయోగీశ్వరుం డలరారు ననఘ ౧౪౬

టీక. అనఘ = ఓ యాంజనేయా! తతవియన్నీలవితానభూషితము—తత = విశాల మగునట్టి, వియత్ = ఆకాశ మనెడి, నీలవితాన = నల్లని మేలుకట్టుచేత, భూషితము = అలంకృత మగునదియును, అగ్నిరవిచంద్రదీపవిరాజితంబు— అగ్ని = నిప్పు, రవి = సూర్యుఁడు, చంద్ర = చందమామయు ననెడు, దీప = దివ్వెలచేత, విరాజితంబు = ప్రకాశించునదియు, అతుల = సాటిలేని, భూచక్ర = భూమండల మనెడు, సింహాసన = గద్దియచేత, అలంకృతంబు = శృంగారింపఁబడినదియు, అనిల = గాలి యనెడు, వ్యజన మరుత్ = విసనకఱ్ఱవలనఁ బుట్టిన వాయువుచేత, వ్యాపితంబు = నిండియుండునదియును, ధనికసేవకసేవితంబై—ధనిక = ధనవంతు లనెడు, సేవక = బంట్లచేత, సేవితంబై = కొలువఁబడుచున్నదై, తనర్చు జగత్పురంబునన్—తనర్చు = ఒప్పుచుండెడు, జగత్ = లోకము ననెడు, పురంబునన్ = పట్టణమందు, రాజయోగీశ్వరుండు = జీవబ్రహ్మైక్యజ్ఞానము గల యాత్మవిదుఁడు, వివేక = ప్రజ్ఞానముచేత, ప్రకాశమాన = వెలుఁగుచున్న, ఇంద్రియ = దశేంద్రియము లనెడు, తురంగ = గుఱ్ఱములతోడ, మానసప్రగ్రహ = మనస్సనెడు పగ్గముతోడ, బుద్ధిసారథియుక్త = ప్రజ్ఞ యనెడు రథచోదకునితోఁ గూడిన, పురుశరీర = స్థూలశరీర మనెడు, మంజులరథాధిరూఢుం డై = చక్కని తేరెక్కినవాఁడై, మహిమతోడన్ = ప్రభావముతోడ, అమరు ప్రజ్ఞాంగనాయుక్తుఁ డగుచున్ — అమరు = ఒప్పుచున్న, ప్రజ్ఞ = అపరోక్షజ్ఞాన మనెడు, అంగనా = స్త్రీతోడ, యుక్తుఁ డగుచున్ = కూడినవాఁడై, నిత్యవిభవుఁ డై = శాశ్వత మనెడు తరుగని సంపద గలవాఁడై, సర్వజనము సేవించుచుండన్ = ఎల్లజనులు తన్నుఁ గొలుచుచుండఁగా, అలరారున్ = ప్రకాశించుచుండును.

తా॥ పాపరహితుఁడ వగు నో యాంజనేయా! విశాల మగు నాకాశ మను నల్లని మేలుకట్టుచేత నలంకృత మయినదియును, సూర్యచంద్రాగ్ను లను దివ్వెలచేఁ బ్రకాశించునదియును, సాటిలేని భూమండల మను గద్దియచేత శృంగారింపఁబడినదియును, గాలి యను విసనకఱ్ఱచే జనించిన వాయువుచేత సంతతము నిండినదియును, ధనవంతు లను బంట్లచే సేవింపఁబడునదియు నై యొప్పు లోక మనెడు పట్టణమునందు జీవ

బ్రహ్మాత్మైకజ్ఞానము గల బ్రహ్మజ్ఞ ప్రజ్ఞానముచేఁ బ్రకాశించు చక్షు రింద్రియము లను గుఱ్ఱములతోను మనస్సను పగ్గముతోను ద్రష్ట యను సారథితోను గూడిన స్థూలశరీర మను చక్కని తేరెక్కినవాఁడును, మహిమతో నొప్పు నపరోక్షజ్ఞాన మను నాతని స్త్రీతోఁ గూడినవాఁడును, బ్రహ్మ మనెడు యెడతెగని సంపద గలవాఁడును నై ప్రకాశించు చుండు నని తాత్పర్యము

జీవన్ముక్తుని లక్షణము

మ. అనపేక్షుం డసమానుఁడై ధనికదీనాలాపముల్ వీనులన్
వినకే కర్మఠదేహచేష్టల నొగిన్ వీక్షింపకే నిత్యముం
దనుఁ దాఁ జూచుచుఁ బావనాత్మకసుతీర్థశ్రేణి నత్యంతపా
వనముం గా నొనరించుచుం జెలఁగు జీవన్ముక్తుఁ డానందుఁడై. ౧౮౭

టీక. [1]ముక్తుఁడు = బ్రహ్మవిద్వరిష్ఠుఁడు, ఆనందుఁడై = నిత్యానందము గలవాఁడై, అనపేక్షుండు = ఇహపరసుఖములం దిచ్ఛ లేనివాఁడై, అసమానుఁడై = సాటి లేనివాఁడై, ధనికదీనాలాపములు — ధనిక = ధనవంతులయొక్కయు, దీన = దీనవాండ్రయొక్కయు, ఆలాపములు = పలుకులను, వీనులన్ = శ్రోత్రములతో, వినకే = ఆలకింపకనే, కర్మఠదేహచేష్టలన్ — కర్మఠ = కర్మలయందు ఆశ గలవారలయొక్క, దేహచేష్టలన్ = శరీరవ్యాపారములను — అనఁగా బాహ్యాభ్యంతరశౌచస్నానసంధ్యానుష్ఠానజపతపవైశ్వదేవస్వాధ్యాయయజ్ఞాదులను చేసెడు సోమయాగాది నానా పౌండరీకయాగాదులను చేయుటలు అనెడు వానిని, ఒగిన్ = క్రమముగా, వీక్షింపకే = చూడకనే, నిత్యమున్ = సర్వకాలమును, తనుఁ దాఁ జూచుచున్ = తానైన బ్రహ్మాభిన్నప్రత్యగ్వస్తువును తానని చూచుచు, పావనాత్మకసుతీర్థశ్రేణిన్ — పావనాత్మక = నిర్మలత్వమే స్వభావముగాఁ గల యిడాపింగళాసుషుమ్నాది నాడీమయపుణ్యనదు లనెడు, సుతీర్థశ్రేణిన్ = గంగానర్మదాది పుణ్యతీర్థపంక్తిని, అత్యంతపావనముగాన్ = మిగుల పవిత్రము లైనవానినిగా, ఒనరించుచున్ = చేయుచు, చెలఁగున్ = వెలుఁగును.

తా. బ్రహ్మవిద్వరిష్ఠుఁడు నిత్యానందము గలవాఁడును, ఇహలోకమందును పరలోకమందును గలుగు సుఖములయం దిచ్ఛ లేనివాఁడును, సాటి లేనివాఁడును, ధనవంతులయొక్కయు దీనవాండ్రయొక్కయు పలుకుల నాలకింపకయును, యజ్ఞాదుల నొనర్చువారిని వీక్షింపకయును, సర్వకాలములయందు ప్రత్యగాత్మయైన తన్ను తాను వీక్షించుచు నాడు నిర్మలము లగు నిడాపింగళాసుషుమ్నాది నాడీమయము లగు గంగానర్మదాది పుణ్యతీర్థములను మిగులపవిత్రము లయినవిగాఁ జేయుచు ప్రకాశించు నని తాత్పర్యము

సీ. ఒకవేళ తనయందు ✱ సకలప్రపంచంబు, కల్పితం బని యెంచి ✱ కాంచి నవ్వు
నొకవేళ సర్వభూతోపాధులయందుఁ, దనుఁ జూచి మిగుల సంతసముఁ జెందు
నొకవేళ దేహాదు ✱ లొప్పుగా విహరింప, సర్వసాక్షి నటంచు ✱ సంభ్రమించు
నొకవేళ నన్య మింక ✱ లే దొకండ నే, నని నిర్వికల్పసమాధి నొందు

తే. నతులవైరాగ్యబోధోపరతుల గలుగు
నతనిమహిమలు గణియించి ✱ యభినుతింప
హరిహరహిరణ్యగర్భులకైనఁ దరమె
యపరిమితసద్గుణనికాయ ✱ యాంజనేయా. ౧౮౮

టీక. ఇదియె = ఇప్పుడు నీ కుపదేశించిన యభిప్రాయమే, వేదశాస్త్రసారము — వేద = చతుర్వేదములయొక్క, శాస్త్ర = షట్ఛాస్త్రములయొక్క, సారము = సారాంశము, ఇగి = ఇదియు, అనంత సౌఖ్యదంబు — అనంత = క్షీణము లేని, సౌఖ్యదంబు = సుఖము నిచ్చునట్టిది - అనఁగా బ్రహ్మానందము నొసఁగెడునది యనుట, ఇదియె = ఇదే, రాజయోగశాస్త్రము = వేదాంతశాస్త్రము, ఇదియు = ఇదే, బ్రహ్మవిద్య = ఆత్మజ్ఞానము, ఇదియె = ఇదే, మద్హృదయము = నాతాత్పర్యము, దీనిన్ = ఈ సీతారామాంజనేయసంవాద మనెడు యోగశాస్త్రమును, నిరతము = ఎల్లప్పుడు, ఎవ్వఁడేనిన్ = ఏపురుషుఁడైనను, భక్తితోన్ = అనురాగముతో, సదమలాత్ముఁడగుచున్ — సత్ = ప్రశస్తమగును, అమల = రాగాదిమాలిన్యము లేని, ఆత్ముఁడగుచున్ = అంతఃకరణము గలవాఁడై, మిగులన్ = లెస్సగా, చదువన్ = పఠించినను, వినిన్ = విన్నను, వ్రాసినన్ = లిఖించినను. (ముందు పద్యముతో నన్వయము)

తా. ఈ ప్రకారము ముపదేశించి చెప్పుచున్నాఁడు. ఓ యాంజనేయా! ఇప్పుడు నీ కుపదేశించినదే వేదశాస్త్రముల సారాంశము, ఇదియే నాశరహిత మగు బ్రహ్మానందము నిచ్చునది, ఇదియే వేదాంత శాస్త్రము, ఇదియే బ్రహ్మవిద్య యనఁబడును, ఇదియే నాతాత్పర్యము, ఈ సీతారామాంజనేయసంవాదమును యేపురుషుఁడైన నతిభక్తితోడను, రాగాదిమాలిన్యము లేని నిర్మల మగు నంతఃకరణముతోడను పఠించినను విన్నను వ్రాసినను అని తాత్పర్యము

ఉత్సాహవృత్తలక్షణము॥ సూర్యగణము లేడు నిలుపు సూర్యకాంతి సొంపుగా … ఉత్సాహవృత్తమునకుఁ జెల్లు జలజదళవిలోచనా తా॥ ఏడుసూర్యగణములును, నాలుగుగణములపొందు యతియు నుండవలయు ననుట.

సుందరీవృత్తము. యుక్తియు నస్మద్భక్తియు జీవ
న్ముక్తియు సాక్షాన్ముక్తియుఁ గలుగును ౧౯౮

టీక. యుక్తియున్ = బ్రహ్మము నెఱుఁగఁదగిన యుపాయమును, అస్మద్భక్తియున్ = నాయందు ప్రేమయును, జీవన్ముక్తియున్ = జీవుఁడను భ్రాంతి తొలఁగుటయును, సాక్షాన్ముక్తియున్ = విదేహకైవల్యమును, కలుగున్ = లభించును

తా. బ్రహ్మమును దెలిసికొనఁదగిన యుపాయమును నాయందు ప్రేమయును విదేహముక్తియును గలుగు నని తాత్పర్యము.

సుందరీవృత్తలక్షణము॥ సూరిజనప్రకరంబు సుందరి నన్నఁగా। భాగసురంబులు గన్న భాసిత విక్రమా। ధారముగా ధనరారు ధాత్రీశతురంగమా। శౌరి ముకుంద మునీంద్రసన్నుత శేషశా. తా॥ భభరసవ గణములును, తొమ్మిదవయక్షరమున యతియు నుండవలయు ననుట.

వ. అట్లు గావునఁ బరమేశ్వరుండైన నా నస్మనంబునఁ బరమసిద్ధాంతంబుగాఁ బ్రకాశించు సర్వోపనిషత్సారభూతంబైన యీదివ్యజ్ఞానంబును మద్భక్తుండవు మత్పాపరుండవు మదర్పితమనోబుద్ధివి మత్పరాయణుండవు నగుటం జేసి నీ కుపదేశించితి నింతకంటె నతిరహస్యంబైన యర్థంబు నాడెందంబున లేదట్లగుట నిప్పరమార్థతాత్పర్యంబు దెలిసి తమఃపూర్ణంబు రజోమయంబు క్రోధనక్రంబు గామశైవా

టీ॥ శ్రీరామహృదయమున్ = శ్రీరామహృదయ మనెడు మంత్రరాజమును, పల్మారున్ = మాటి మాటికి, వీక్షించు బుధసమాజంబునకున్ — వీక్షించు = పఠనము చేసెడు, బుధ = పండితులయొక్క, సమాజంబునకున్ = సంఘమునకు, శ్రీరామతత్త్వసాక్షాత్కారంబు—శ్రీరామతత్త్వ = శ్రీరామమంత్ర మునయొక్క యాథార్థ్యస్వరూపము, సాక్షాత్కారంబు = ప్రత్యక్షము, అగున్ = కాను, పరమకైవల్యంబున్ = విదేహకైవల్యమును, గలుగున్ = కలుగును

తా॥ శ్రీరామహృదయ మనెడు మంత్రరాజమును పఠించిన పండితశ్రేణికి శ్రీరామమంత్రము యొక్క యాథార్థ్యస్వరూపము గోచరించును, మఱియు విదేహకైవల్యమును గలుగు నని తాత్పర్యము

క. అతతముగ నెఱిఁగించితి, సీతారామాంజనేయసంవాదం
బీతత్త్వామృతమాని ని,రాతంకసుఖాబ్ధి నోలలాడుము గిరిజా. ౨౦౩

టీ॥ గిరిజా = ఓపార్వతీ! అతతముగన్ = మిగుల విశదముగా, సీతారామాంజనేయసంవాదంబున్ — సీత = చిచ్ఛక్తియైన సీతకు, రామ = పరబ్రహ్మ మయిన శ్రీరామునకు, ఆంజనేయ = ప్రత్యగాత్మయైన యాంజనేయునకు నైన, సంవాదంబున్ = ఐక్యజ్ఞానరూపప్రసంగమును, ఎఱిఁగించితిన్ = తెలిపితిని, ఈతత్త్వామృతమున్ = ఈ బ్రహ్మానందామృతమును, ఆని = త్రాగి, నిరాతంకసుఖాబ్ధిన్ — నిరాతంక = నిర్విఘ్నమయిన, సుఖాబ్ధిన్ = ఆనందసముద్రమునందు, ఓలలాడుము = విహరింపుము

తా॥ ఓ పార్వతీ! చిచ్ఛక్తియగు సీతకును, పరబ్రహ్మమగు శ్రీరామునకును, ప్రత్యగాత్మయైన యాంజనేయునకును జరిగిన ఐక్యజ్ఞానరూపప్రసంగము నెఱిఁగించితిని, ఈ బ్రహ్మానందామృతమును త్రాగి నిరాతంక మయిన యానందసముద్రమునందు విహరింపు మని తాత్పర్యము.

వ. అని పలికి యయ్యనాదిదంపతులు రామబ్రహ్మానందామృతరసపానమదపరవశులై
యన్యోన్యాలింగనంబులు గావించి పరమసుఖైకస్వరూపులై నిజచరణకమల
సేవాసక్తులైన భక్తుల రక్షించుచుఁ బ్రకాశించుచుండి రంత. ౨౦౪

టీ॥ అని పలికి = అని చెప్పి, అయ్యనాదిదంపతులు = పురాతనులయిన యా గౌరీశివులు, రామబ్రహ్మ = రాముఁ డనెడు పరబ్రహ్మముయొక్క, ఆనంద = సంతోష మనెడు, అమృతరస = సుధారసముయొక్క, పాన = త్రాగుటవలన నయిన, మద = మత్తతచేత, పరవశులై = మైమఱచినవారై, అన్యోన్యాలింగనంబులు — అన్యోన్య = పరస్పరము, ఆలింగనంబులు = ఉపగూహనములు, కావించి = చేసి, పరమసుఖైకస్వరూపులై = బ్రహ్మానందస్వరూపమాత్రులై, నిజ = తమయొక్క, చరణకమల = పాదపద్మములయొక్క, సేవ = భజనయందు, ఆసక్తులైన = ప్రేమ గల, భక్తులన్ = భక్తజనులను, రక్షించుచున్ = కాపాడుచు, ప్రకాశించు చుండిరి = భాసిల్లు చుండిరి, అంత = తర్వాత.

తా॥ ఇట్లు చెప్పి అనాదిదంపతు లగు నా యుమామహేశ్వరులు రాముఁ డను పరబ్రహ్మము యొక్క ఆనందామృతమును గ్రోలి అట్లు త్రాగుటచే నైన మత్తతచేత పరవశులై పరస్పరాలింగనము లొనర్చుచు బ్రహ్మానందస్వరూపమాత్రులై తమపాదపద్మములను సేవించుచు భక్తులను గాపాడుచుఁ బ్రకాశించు చుండి రని తాత్పర్యము

మత్తకోకిల. నీవు నాహృదయాంబుజంబున నిల్చి భానునికైవడిం
గేవలాత్మవివేకమున్ వెలిఁగించుచుం బరికింపఁగాఁ

పావనం బగు రాజయోగము పల్కితిం దగ శ్రీమహా
దేవ సద్గురురాయ కావుము దీని నీయిల గంగిలన్ ౧౦౫

టీక. శ్రీమహాదేవసద్గురురాయ — శ్రీ = మోక్షలక్ష్మియుక్తుండైన, మహాదేవ = మహాగణనాథుని గల, సద్గురురాయ = గురుసత్తమా! నీవు = నీవు, నాహృదయాంబుజంబునన్ = నామనఃపద్మమందు, నిల్చి = ఉండి, భానునికైవడిన్ = సూర్యునివలె, సకలాత్మవివేకమున్ — సకల = అఖండ మయిన, ఆత్మవివేకమున్ = బ్రహ్మజ్ఞానమును, వెలిఁగించుచున్ = ప్రకాశింపఁజేయుచు, పరికింపఁగాన్ = విచారింపఁగా - అనఁగా బ్రహ్మజ్ఞానము మఱుఁగుపడకుండ గణించుచుండఁగా, పావనంబు = నిర్మలము, అగు రాజయోగము = ఐన జీవబ్రహ్మైక్యజ్ఞానమును, తగన్ = ఒప్పిద మగునట్లు, పల్కితిన్ = చెప్పితిని, దీనిన్ = ఈ జ్ఞానశాస్త్రమును, ఈయిలన్ = ఈ భూమియందు, గంగిలన్ = వ్యాపక మగునట్లు, కావుము = రక్షించుము

తా. మోక్షలక్ష్మియుక్తుండైనట్టియు మహాగణనాథుని గలిగినట్టియు ఓ గురువర్యా! నీవు నామనఃపద్మమం దుండి సూర్యునివలె నఖండమైన బ్రహ్మజ్ఞానమును ప్రకాశింపఁజేయుచు విచారింపఁగా నిర్మల మగు జీవబ్రహ్మైక్యజ్ఞానమును జెప్పితిని గనుక యీ శాస్త్రమును యీభూమియందు వ్యాపక మగునట్లు రక్షింపు మని తాత్పర్యము.

శా. దత్తాత్రేయగురుస్వరూప నిజభక్తాంత స్తమోదీప స
చ్చిత్తానందకరానులాప ఖమరుచ్చిత్రాంశువార్భూప ధీ
వృత్తిత్యాగకలాప నిత్యసుఖసంవిద్వ్యాప శుద్ధాత్మశ
శ్వత్తేజోభిహతాదిపాప సుజనేష్టప్రాపకా వ్యాపకా. ౧౦౬

టీక. దత్తాత్రేయగురుస్వరూప — దత్తాత్రేయగురు = అత్రిమహాముని పుత్త్రుండైన దత్తాత్రేయ గురువుయొక్క, స్వరూప = ఆకృతి గలవాఁడా! నిజభక్తాంత స్తమోదీప — నిజ = స్వీయులైన, భక్త = భక్తజనులయొక్క, అంతః = అంతరంగములయందలి, తమః = అజ్ఞాన మను చీఁకటికి, దీప = జ్ఞాన మనెడు దీపమువంటివాఁడా! సచ్చిత్తానందకరానులాప — సత్ = పరబ్రహ్మమును ప్రతిపాదించునట్టి, చిత్ = జ్ఞానప్రదములైన, ఆనందకర = హర్షదాయకములైన, అనులాప = సంభాషణములు గలవాఁడా! ఖమరుచ్చిత్రాంశువార్భూప — ఖ = ఆకాశమును, మరుత్ = గాలిని, చిత్రాంశు = అగ్నిని, వార్ = నీటిని, భూ = భూమిని, ప = రక్షించువాఁడా! ధీవృత్తిత్యాగకలాప — ధీ = బుద్ధియొక్క, వృత్తి = నడువడులైన, రాగేచ్ఛా = సుఖదుఃఖతృష్ణాదులను, త్యాగ = వదలుటయను, కలాప = భూషణములుగాఁ గలవాఁడా! నిత్యసుఖసంవిద్వ్యాప — నిత్య = శాశ్వతమైన, సుఖ = బ్రహ్మానందమందు, సంవిత్ = జ్ఞానముచేత, వ్యాప = వ్యాపించువాఁడా! శుద్ధాత్మశశ్వత్తేజోభిహతాదిపాప — శుద్ధాత్మ = ప్రత్యగాత్మయొక్క, శశ్వత్ = వెలుఁగుచున్న, తేజః = జ్ఞానముచేత, అభిహత = కొట్టఁబడిన, ఆది = పుట్టుకయనెడు, పాప = కిల్బిషము గలవాఁడా! సుజనేష్టప్రాపకా — సుజన = సత్పురుషులయొక్క, ఇష్ట = కోర్కులను, ప్రాపక = ఒనఁగూర్చువాఁడా! వ్యాపకా = అంతట నిండియుండువాఁడా

తా. అత్రిమహామునిపుత్త్రుఁడవైన దత్తాత్రేయునియొక్క యాకారము గలవాఁడా! భక్తజనులయొక్క యంతరంగములయందలి యజ్ఞాన మను చీఁకటికి జ్ఞాన మనెడు దీపమువంటివాఁడా! జ్ఞానము నిచ్చునట్టివియును ఆనందమును గలుఁగఁజేయునవియును నగు సంభాషణములు గలవాఁడా! పంచభూతము -

చేతఁ బొగడఁదగిన త్యాగభోగాదిగుణములే పరివారముగాఁ గలవాఁడా! సర్వశాస్త్రములయందు కర్తృత్వము గలవాఁడా! ముక్తికాంతయే భార్యగాఁ గలవాఁడా! అని తాత్పర్యము.

## గద్యము

ఇది శ్రీమన్నారాయణమహాదేవగురుకరుణాకటాక్షవీక్షణవిమలీకృత నిజహృదయ
కమలకర్ణికాంతస్సందర్శితాఖండసచ్చిదానందరసైకస్ఫూర్తి షట్చక్ర
సీతారామమూర్తి పరశురామపంతులలింగమూర్తి గురుమూర్తి
ప్రణీతం బైన శ్రీ సీతారామాంజనేయసంవాదం బను
యోగశాస్త్రంబునం దమనస్కయోగానుభవ
విచారం బనునది తృతీయాశ్వాసము.

ఈగ్రంథము పరశురామపంతు లనెడు గృహనామము గల లింగమూర్తి గురుమూర్తిపంతులచే
రచింపఁబడిన శ్రీసీతారామాంజనేయసంవాద మను వేదాంతశాస్త్రమునందు
అమనస్కయోగానుభవముయొక్క పరిశీలన మనునది
తృతీయాశ్వాసము ముగిసెను.

సర్వము సమాప్తము.

